





# మాసపత్రికలు

## శ్రీ రామకృష్ణ ప్రభ

## 1963





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

What's New | Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

- Swami Vivekananda

Donate | Serve with us | Contact Us

**Universal Temple**

- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

**Activities**

- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

**Ramakrishna Prabha Magazine Archives**

Submit

2012

శ్రీ రామకృష్ణ ప్రభ

2011

శ్రీ రామకృష్ణ ప్రభ — Click to read

శ్రీ రామకృష్ణ ప్రభ — Click to read

శ్రీ రామకృష్ణ ప్రభ — Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ ౧౯౬౩, జాన్యువరి; శుభకృత్తు - పుష్యము సంచిక ౭

## విషయసూచిక



'అఖిలవిభు శరణొందుము, యీ తీఱంబ యాతనిక్రృప నీకు ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.



సంపుటము ౧౯ } ౧౯౬౩ - జాన్యువరి :: శుభకృత్తు - పుష్యము { సంచిక ౭

రామకృష్ణమఠ మిషనుల సర్వాధ్యక్ష

# శ్రీ మన్మాధవానందస్వాముల సందేశము

ప్రాచ్యప్రతీచీ దేశీయులైన నా సోదర సోదరీమణులారా,

శ్రీ వివేకానందస్వాముల ప్రథమశతతమజయంతి మహోత్సవ మనెడి యీ విశిష్టసమయమున నా హృదయపూర్వకాభినందనములను మంగళాశంసలను మీ కందఱకును అందజేయుచున్నాను. అనుమతింతురు గాక! భువిపై స్వామిజి జీవించియుండిన దత్యల్పకాలమే ఐనను ఆ జీవితము నిండుగ ఆధ్యాత్మికసాక్షాత్కారములును ప్రాచీప్రతీచీఖండములలో వాని అఖండ ప్రచారనిర్వహణమును కలవు. ఈయుగమునే రూపొందించు సాక్షాత్కారాలు అవి.

ఆయన యువదశ దక్షిణేశ్వరమున గురుదేవుడగు శ్రీరామకృష్ణుని చరణచ్ఛాయలో గడచెను. శ్రీరామకృష్ణుడు సర్వకాలముల మానవులయు సర్వదేశముల మానవులయు, పరమోదాత్తలక్ష్యముల సిద్ధిక్షేత్రము. ఆయనను సేవించి, మానవునందలి దివ్యత్వమును సాక్షాత్కరించుకొనుటద్వారా "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను అధ్యవసాయము స్వామికి అలవడెను. కావున భారతదేశ మాయనకు జన్మభూమి ఐనప్పటికిని, ఆయన జగమంతటికిని ఉమ్మడిసొమ్ము. ఆయనమీద భారతదేశమునకు ప్రత్యేకపుహక్కు ఏమియు లేదు. ప్రాచ్యమునందేమి పాశ్చాత్యమునందేమి ఆయన నిర్వర్తింప నెంచిన పని ఇది—మానవునందలి దివ్యత్వ

మనుగూర్చిన జ్ఞానముకు సర్వమానవైక్యజ్ఞానమును మగవారియందును మహిళలందును మేలు కొల్పుట. ద్వేషకలహావిదీర్ణమైన యీ ప్రపంచమునకు శాంతిని కూర్పగలిగినది ఆజ్ఞాన మొక్కటే — స్వామిజి పలుకు లివి — ''భారతదేశము నాకు ప్రియ మనుట నిస్సంశయము. కాని నానాటికి నాచూపు మఱింత ప్రసన్న మగుచున్నది. మనకు భారతదేశ మెంత? ఆంగ్ల దేశ మేపాటి? అమెరికా ఎంత? మనము దేవుని దాసులము. ఆ దేవునే జ్ఞానహీనులు జీవుడని పేర్కొందురు''.

''సాంఘికక్షేమమునకును రాజకీయ సుస్థితికిని పారమార్థికశ్రేయస్సునకును ఉన్న ఆధారము ఒక్కటే. ఏదనగా 'నేనును నాసోదరుడును అభిన్నులము' అను నెఱుకయే. ఏదేశమునగాని ఏప్రజలోగాని, నిజ మిదే''.

స్వామిజిసందేశము గంభీరమైనది. అందు శాస్త్రమును మతమును, యుక్తియు విశ్వాస మును, ఐహికమును పారమార్థికమును, నవీనమును ప్రాచీనమును, ప్రాచ్యమును పాశ్చాత్య మును ఏకీభవించిపోయినవి. వాని ఏకీభావము ఆయనలోనే మూర్తీభవించినది. మానవుని నాగరకతాచరిత్రమున నొక నూతనశకమును అంకురింపజేయుటకు వలసిన ఉరవడి నొసంగినది స్వామిజీవితమును స్వామిసందేశమునే.

తన దేశీయులకు ఆయన హెచ్చరిక — ''లెండు, పాటుపడుడు, నిర్విరామముగ కృషి సల్పుడు, ఏలయనగ భారతదేశభవిష్యము మీకృషిపైనే ఆధారపడియున్నది'' ''సంకుచి తాసూయలను దులిపివేసికొండి. 'అనేకములు'గ నుండు వాని మఱుగున 'ఏకము' ఉన్నది. అనాది కాలమునుండి మీకు సంక్రమించిన గొప్పలక్ష్యము అదే. ఆలక్ష్యము నాశ్రయింపుడు'' ''ఆసూ త్రానుసారము విభిన్నజాతులును విభిన్నభాషలును, విభిన్నాచారములును గల భారతదేశము నుండి ఐక్యసంపన్నమహిమప్రజానీకమును రూపొందింపుడు. అందుకు కాలము పట్టినను అందుల ఫలితములు శాశ్వతములుగ నుండును. ఫలితముల 'వెలితళుకుల' కనియు అవి త్వరగ కలుగుట కనియు బలాత్కారమును వినియోగింపకుడు. బలాత్కృత ఫలితములు క్షణభంగురములగును. విభేదములను అభేదమున నిమిడ్చివేయుడు, ఇముడ్చునప్పుడు దేనికిగాని చేగి కల్గరాదు. ఏది నష్టమైపోయినను, దానివలకు దేశమునకు పేదఱికమే, సత్తువలో తఱుగుదలయే. భారతదేశము ప్రాచీనకాలమున సాధించిన సిద్ధులను గుర్తించి గర్వింపుడు. మీ మాతృదేశమునకు గొప్ప భవిష్య మున్న దని నమ్ముడు. ఈ భువిని పుట్టిన అతిగర్వితులలో నే నొకడను, నాగర్వము నకు కారణము నా గొప్పతనము కాదు, నా పూర్వుల గొప్పతనము. అది నాకు బల మొసం గినది....భూరజమునుండి న న్నుద్ధరించినది....నావలె మీరును అందుకు గర్వింతురు గాక.''

భారతదేశభవిష్యత్తునుగూర్చి స్వామి ఈలాగన్నారు. ''అదిగో నా దేశమాత తనకు దైవవిహితమైన మహోజ్జ్వలవిధిని నిర్వహించుటకై గంభీరముగ అడుగులిడుచు ముందుకు నడచుచున్నది. భువినిగల యేశక్తియు నిక ఆమెను ఆపుటకు సమర్థము కాదు. లెండి, లెండి. సుదీర్ఘమైన నిశాకాలము గడచిపోవుచున్నది. పగటివేళ సమీపించుచున్నది కెరటము లేచినది, దాని పోటు నణంప గల దేదియు లేదు. ఇక నామె నిద్రింపబోదు, బాహ్యశక్తు లేవియు ఆమె పురోగమనము నిక నిరోధింపజాలవు. బ్రహ్మాండమైన భూతము లేచి నిలబడుచున్నది.'' స్వదేశీయుల కింకను ఆయన కావించిన బోధ:—''విశ్వాసము మీ యందు మీ కుండవలె. సోమరితనమును దులిపివేసికోవలె. మిమ్ము మీరు నమ్మవలె. నమ్మకున్న విమోచనము లేదు. విశ్వాసము బలము—ఇవే మనకు కావలసినవి......నిదురలోనున్న ఆత్మను తట్టుము, చూడుడది ఎట్లు మేల్కొనునో! శక్తి కల్గును, కీర్తి కల్గును, అన్ని మేలుములును కల్గును. త్యాగము లేనిదే ఏ ఘనకార్యమును నెఱవేఱదు, భోగములను విడువుము, వినోదముల నుజ్జగింపుము, మీ పేరును మీ ప్రతిష్ఠను మీ పదవిని — చేయేల, మీ ప్రాణములను సైతము మర్పింపుము — ఇనుపకండరములు ఉక్కునరములు, ప్రయోజనము నేమాపమునైన - మరణము నెదుర్కొనియైన - నెఱవేర్చు రాక్షస సంకల్పము—ఇవే ప్రస్తుతము మన దేశమునకు కావలసినవి...... ఓ ధీరుడా,......సగర్వముగ చాట వోయి 'నేను భారతీయుడ' నని; 'ప్రతిభారతీయుడును నా సోదరు' డని; 'భారతభూమి నా మహోన్నతస్వర్గ' మని; 'భారతశ్రేయమే నా శ్రేయ'మని. రాత్రింబగళ్లు 'ఓ గౌరీశా, ఓ లోకమాతా, నాకు మగటిమి ననుగ్రహింపుము......నన్ను ధీరు నొనర్పు' డని అవృత్తిసేయుచు ప్రార్థింపుము''.

నేటి క్లిష్ట పరిస్థితులలో ఈ బల - విశ్వాస - శక్తి - సమైక్యసందేశమునకు, ప్రత్యేకావశ్యకత కలదు.

ఈశతవార్షికోత్సవ సంవత్సరములో స్వామిజీ భావాల ప్రతిధ్వనులు ప్రమోగును. అవి అవిచ్ఛిన్నముగ మానవునకు సృజనాత్మక పారమార్థికవిద్య నొసగుచుండును, సఖ్యమును సామరస్యమును ఐక్యమును గల్గించు వినిశ్చయమును మానవులకును దేశములకును గల్గించును.

భారతదేశమును మేలుకొల్పి ప్రాక్పశ్చిమముల కైక్య మొనగూర్చిన ఆత్మస్వరూపియగు ఆ మహాస్వామి ''ఆత్మనో మోక్షార్థమ్ జగద్ధితాయ చ'' ''తనమోక్షమునకును లోకహితమునకును'' అను జీవనప్రదసూక్త్యనుసారము పాటుపడు ఉత్సాహమును, జీవించు ఉత్సాహమును మనకందఱకును ప్రసాదించును గాక.

బేలూరు మఠము,
జాన్యువరి 17, 1963.

(సం) స్వామి మాధవానంద,
రామకృష్ణమఠ మిషనుల సర్వాధ్యక్షులు.

# శ్రీ వివేకానందాష్టోత్తరశతనామస్తోత్రము*

ఓం శ్రీరామకృష్ణప్రియాయనమః
,, శ్రీరామకృష్ణభక్తాగ్రగణ్యాయనమః
,, శ్రీరామకృష్ణశక్త్యావేశపూర్ణాయనమః
,, [illegible]ంధ[illegible]ణ
రాయనమః
,, శ్రీరామకృష్ణమఠప్రతిష్ఠాత్రేనమ
,, శ్రీరామకృష్ణసేవాశ్రమస్థాపకాయనమః
,, శ్రీరామకృష్ణసుహృదేనమః
,, భువనేశ్వరీనందనాయనమః
,, విశ్వనాథదత్తాత్మజాయనమః
,, వీరేశ్వరాంశజన్మనేనమః
,, అఖండధారణాశక్తిమతేనమః
,, అఖండధ్యానసిద్ధాయనమః
,, కాళికాశక్త్యావేశపూర్ణాయనమః
,, సరస్వతీప్రసన్నాయనమః
,, సంకీర్తనప్రియాయనమః
,, సురూపాయనమః
,, సుందరవిగ్రహాయనమః
,, రాజీవలోచనాయనమః
,, భయద వృషభాశ్వ విజృమ్భణ నివారణ
దక్షాయనమః
,, నిర్భయాయనమః
,, అభయప్రదాయనమః
,, ఖేత్రీమహారాజపుత్రవరదాయనమః
,, నిరీహాయనమః
,, ఉపన్యాసకసార్వభౌమాయనమః
,, వేదాంతకేసరిణేనమః
,, గానానందితరామకృష్ణాయనమః

ఓం మధురస్వరాయనమః
,, దేశాటనకుశలాయనమః
,, కామినీకాంచనవిముఖాయనమః
,, అనేకసంస్థానాధీశపూజితచరణాయనమః
,, యోగినేనమః
,, ఛాయావద్దేహధారిణేనమః
,, యతిరాజాయనమః
,, వివేకానందసూరయేనమః
,, సచ్చిదానందస్వరూపాయనమః
,, స్వామినేనమః
,, దీనజనానురక్తాయనమః
,, జ్ఞానస్వరూపాయనమః
,, దయార్ద్రహృదయాయనమః
,, అపరశంకరాయనమః
,, బుద్ధావతారవిశేషజ్ఞాయనమః
,, జ్ఞానసిద్ధాయనమః
,, నరావతారాయనమః
,, సప్తర్షిమండలవాసినేనమః
,, నిరాడంబరాయనమః
,, బ్రహ్మానందభ్రాత్రేనమః
,, శారదానందభ్రాత్రేనమః
,, యోగానందభ్రాత్రేనమః
,, నిరంజనానందభ్రాత్రేనమః
,, అద్వైతానందభ్రాత్రేనమః
,, రామకృష్ణానందభ్రాత్రేనమః
,, త్రిగుణాతీతానందభ్రాత్రేనమః
,, ప్రేమానందభ్రాత్రేనమః
,, అద్భుతానందభ్రాత్రేనమః

* కాకినాడ - రామరావుపేట - ఉపనిషదాశ్రమ శ్రీరామకృష్ణసేవాసంఘమువారు సంకలించినది.

ఓం తురీయానందభ్రాత్రేనమః
,, సుబోధానందభ్రాత్రేనమః
,, శివానందభ్రాత్రేనమః
,, అఖండానందభ్రాత్రేనమః
,, విజ్ఞానానందభ్రాత్రేనమః
,, అభేదానందభ్రాత్రేనమః
,, నాగమహాశయప్రియాయనమః
,, గౌరీశచంద్రప్రియాయనమః
,, మహేంద్రగుప్తప్రియాయనమః
,, కవయేనమః
,, నిత్యసిద్ధాయనమః
,, రామనామసంకీర్తనప్రియాయనమః
,, విరజానందగురవేనమః
,, ప్రకాశానందగురవేనమః
,, నిర్భయానందగురవేనమః
,, నిత్యానందగురవేనమః
,, శుద్ధానందగురవేనమః
,, నిర్మలానందగురవేనమః
,, సదానందగురవేనమః
,, బోధానందగురవేనమః
,, ఆత్మానందగురవేనమః
,, విమలానందగురవేనమః
,, స్వరూపానందగురవేనమః
,, సురేశ్వరానందగురవేనమః
,, అచలానందగురవేనమః
,, సచ్చిదానందగురవేనమః
,, ధీరానందగురవేనమః
,, కళ్యాణానందగురవేనమః
,, సోమానందగురవేనమః

ఓం సత్యకామానందగురవేనమః
,, పరమానందగురవేనమః
,, నిశ్చయానందగురవేనమః
,, అళ్గియసింగగురవేనమః
,, వేంకటరంగరాయగురవేనమః
,, నంజుండరాయగురవేనమః
,, మానసపుత్రికాభూతనివేదితాయనమః
,, జోగినమాతృప్రియాయనమః
,, గోపాలమాతృప్రభావజ్ఞాయనమః
,, వివేకవైరాగ్యవిశుద్ధచిత్తాయనమః
,, రామకృష్ణభక్తానురక్తాయనమః
,, ప్రాక్పశ్చిమనరనారీశిష్యసేవితాయనమః
,, వివేకదానైకవినోదశీలాయనమః
,, ఆనందమూర్తయేనమః
,, స్వచ్ఛందతస్తనుత్యాగినేనమః
,, దేశికేంద్రాయనమః
,, పరమాయనమః
,, ఆజన్మబ్రహ్మచారిణేనమః
,, పవిత్రాయనమః
,, విశ్వక్షేమవిధాత్రేనమః
,, స్త్రీజనాభివృద్ధిప్రేరకాయనమః
,, దేశభక్తిప్రపూరితాయనమః
,, పరార్థనిష్ఠితాయనమః
,, సర్వలోకసమ్మతాయనమః
,, సర్వలోకపూజితాయనమః
,, కీర్తివాంఛారహితాయనమః
,, శ్రీవివేకానందాయనమః
,, శ్రీమహ్మాదానందగురవేనమః.

# వీరయోగి

## భార్గవ విద్యాదేవ కులపతి *

మనజాతిమతధర్మమానాభిమానముల్ మనశక్తిసంస్కారమహనీయగానముల్
ఘన ఘోర పాశ్చాత్య కబళితమ్మగు వేళ జనియించె జగదేక జయవివేకజ్యోతి.

ఆ వివేకజ్యోతి ఆనందమహితమై జీవనానంతసంజీవనీసహితమై
పావనాఖండసంభావనావిహితమై కావించె భరతభూఖండకళ్యాణమ్ము.

ఒక మానవాకారయోగసామ్రాజ్యమ్ము ఒక జాతిపౌరుషాయుశ్శ్రీవిలాసమ్ము
ఒక వినిద్రితధర్మయోధశంఖారవము ఒక వివేకానందసోల్లాసవిహరణము.

ఆ మహాత్ముని వాక్కులందుకొని అద్భుత ప్రామాణ్యదీధితికి పారవశ్యము చెంది
సీమదొరలందఱును చేయెత్తి మ్రొక్కిరట వేమాఱు మనసు లర్పించి పూజించిరట.

శ్రీరామకృష్ణసంచితతపస్సారమ్ము భారతావనిపుణ్యఫలమహాకారమ్ము
కారుణ్యనిలయమ్ము కాంతిసంవలయమ్ము వీరయోగి వివేక విమల దేవాలయము.

తనవాక్కు జాతికంతటికి జీవమొసంగె, తనదృక్కు లోకమంతటికి వెల్గునొసంగె,
తనమాట వేదములు తరచిచూచిన బాట, తనచూపు తాపసుల తలపులెత్తినచూపు.

తాను నవయుగమందు ధర్మసంస్థాపకుఁడు, తాను వేదాకాశదర్శనగ్లౌరేఖ,
దీనపీడితజాతిదిగులు దీర్చుటకొఱకు మానవాకృతిదాల్చి మసలె నే దేవతయొ!

శోధించె శాస్త్రీయశుభరహోభాగములు, సాధించె వరతపస్సంపదామోదములు,
బోధించె జగతి కద్భుతమపూర్వముగాగ, వేధయై విలసిల్లె వివిదిషానందుండు.

కలుషపంకములోన గాఢాంధకారాన విలయవేళలలోన వెతఁజెందు ధర్మమ్ము
కలికాల కల్లోల గళబంధనమునుండి తొలగించె నతఁడు విద్యుత్పుంజమూర్తియై.

ధన్యుఁడై యోగి మూర్ధన్యుఁడై వేదాంత మాన్యమార్గము చూపె, మహనీయభావనా
విన్యాస సుశ్రీవివేకవిస్ఫూర్తి నా సన్న్యాసిసమ్రాట్టుచరణపీఠికి జయము.



* ఆశుకవికేసరి, శతావధానికులాగ్రణీత్యాదిబిరుదభూషణులు శ్రీ పి. వి. ఎల్. వి. ప్రసాదరావుగారు.

# శ్రీ వివేకానందస్తుతి

విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు, ఎం. ఏ.

శ్రీరామకృష్ణశిష్యులలో రత్నము తత్త్వవిదులలో రత్నమునై
భారతగౌరవ మెవ్వఁడు నేరిమి భువి నిలిపె, నతని నే స్తుతియింతున్. ౧

అతఁడె నరేంద్రుఁడు, నిజముగ నతఁడే నిజనామసార్థకాగ్రేసరుఁడై,
క్షితిని బరివ్రాజకుఁ డయి, యతియై, పేరందె వివేకానందుఁ డనన్. ౨

నవయౌవన మగువయసున నవయక శృంగారకేళి, నవనీతహృదిన్
భవహార మగుజ్ఞానముఁ గని, చవిచూపెను దానిసత్యసారము జగతిన్. ౩

ఏఁడి వివేకానందుని కీడగు విజ్ఞాని త్యాగి? యిఁక నెందుండున్
పోఁడిమి నాతని కీడగు వాఁడును జ్ఞానంబు నందు వక్తృత్వమునన్? ౪

భారతతత్త్వజ్ఞాన మపారం బని, పరమసుఖము పండించెడి ది
వ్యారామం బని—చాటెను ధీరాగ్రణి యగుచు వివిధదేశములందున్. ౫

ఒక్క వివేకానందుఁడె నిక్కపువైరాగ్య మూని నిఖిలావనిలో
మిక్కుట మగుపేరందెను చక్కగ బోధించి నాఁటిజగతిని ధృతితో. ౬

భారతజాతికి నీతఁడె కీరితి కొనితెచ్చె, నితనికే ఋణపడియు
న్నారము మన మందఱమును, తీరుప యత్నింత మతనిదివ్యస్మృతిచే. ౭

వందనము లివె వివేకానందా, నందముగఁ గైకొనందగు భక్తి
స్యందననిష్యందము లానందాత్మక, నీకు నిత్తు నమ్రుఁడ నగుచున్. ౮



# శ్రీ వివేకానందమరందబిందువులు (౧)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

### తత్త్వసారము

ప్రతి జీవియందును దేవత్వము గర్భితముగా నున్నది.

బాహ్యాంతర ప్రకృతి నంతయు నిరోధించి, యంతర్గతమగు నీ దేవత్వమును వ్యక్తము చేయుటయే జీవితపరమావధి.

ఇందులకై కర్మ భక్తి యోగ జ్ఞాన మార్గములలో నొక్కటిగాని, కొన్నిటినిగాని, యన్నిటినిగాని యవలంబించి—ముక్తుఁడవగుము.

ఇదియే మతసారము, తత్త్వసారము. వాదములు, సిద్ధాంతములు, గ్రంథములు, కర్మకలాపములు, దేవాలయములు, విధులు—నివన్నియుఁ గేవల మప్రధాన వివరములు.



# శ్రీ వివేకానందస్వామి స్మృతి

శ్రీ పమిడికాల్వ చెంచు నరసింహశర్మగారు

''కన్నులు వాచిపోయినవిగా నినుఁజూడక చిట్టిబాబు, నీ
వెన్నుఁడు వచ్చి నా మదికి నింపుగఁ దీయని పాటఁ బాడుచున్
దిన్నఁగ హర్షవార్ధి ననుఁ దేల్చెదవో యను నాసతోడ నా
యున్న తెఱం గెఱంగి యెటనుండితి వోయి, నరేంద్ర'', యంచుఁ బ్రీ
తి న్ననుఁ జేరఁ బిల్చు గురుదేవుని సత్కరుణన్ వివేకసం
పన్నత నొంది దుర్మతవివాదవిఖండనవాక్ప్రసారణా
భ్యున్నతి విశ్వమున్ గెలువ నోపితి; వీ వొక దైవమూర్తి నా
నెన్నుచు నిన్నుఁ గొల్చి తరియించిరి కాదె విదేశవాసులున్ ?॥ ౧

విశ్వనాథునివరమున విశ్వనాథ
సుతుఁడవై విశ్వజనహితమతి సతంబు
విశ్వసంచారివైన వీరేశ్వరుఁడవు
కాని మానవమాత్రుఁడవే నరేంద్ర ?॥ ౨

విగ్రహార్చన మొదలుగ విశ్వరూప
దర్శనంబంత్యలక్ష్యమా దైవభక్తి
కనుచు వివిధప్రయోగసమన్వితముగఁ
దెల్పితివి మూఢులకు మంచి తెల్వి రాఁగ ॥ ౩

భారతదేశకీర్తియు నపారసనాతనధర్మవృత్తివి
ద్యారసికత్వసంపదల నారడివుచ్చిరి శ్వేతజాతు లం
చీరస మెత్తి తన్మతవిహీనగుణంబుల నెల్ల దుమ్ముతూ
ర్పారను బోసి హైందవుల భావప్రశస్తి వెలుంగఁ జేయవే ?॥ ౪

నాడు 'చికా'గ్పురంబున సనాతనధర్మమతప్రవక్తవై
యాడిన సూక్తులన్ విని మహాద్భుతహర్షపరీతచిత్తులై
వేడుక మీఱఁ బట్టణపు వీథుల నీ ప్రతిబింబచిత్రముల్
గోడల వ్రాసి యెల్లరును గొల్వరె 'భారతయోగి'నా నినున్ ?॥ ౫

బీరముఁ దక్కి నీ యెదుట భీరువులై మతబోధకాగ్రణుల్
నోరు మెదల్పలేక మదులున్ జెడ మ్రాన్పడి నిల్చియుండ న
వ్వారల వారి నెయ్యెర నపారసనాతనధర్మవాక్సుధా
ధారలఁ దేర్చి వేగ సమతన్ వెలయింపవె సత్కృపామతిన్ ? ॥ ౬

త్యాగంబె యుత్తమ యోగంబుగా నెంచి
సన్న్యసించిన శుద్ధసాత్త్వికుండు
ధీరత్వమే నరు దివ్య నొనర్చు నన్
సూక్తి రూపించిన సూరివరుఁడు
స్వేచ్ఛయే మానవజీవితాశ్రయ మని
యుపదేశ మిడిన గురూత్తముండు
సమతయే శాశ్వతసౌఖ్యప్రదం బని
సభల ఘోషించిన సచ్చరితుఁడు

పరమతత్త్వార్థవిజ్ఞానపారగుండు
ఎవ్వఁ డన 'వివేకానందుఁడే' యటంచు
నిన్నుఁ బేర్కొని జగ మెల్ల సన్నుతించు
భవ్య గుణదీప, అపరశివస్వరూప ॥ ౭

శ్రుతిహితధర్మవర్తనలు చొప్పడె నీవలనన్ జగంబునన్,
మతి చెడి పల్కు నాస్తికుల మాటలు గాటికిఁ బోయె, సర్వది
క్తతుల వెలింగె హైందవమతస్థిర తేజము, భూనభంబులన్
బ్రతిరవముల్ ఘటించె బ్రతిపక్షభయంకరసింహగర్జనల్ ॥ ౮

తనకుఁ గడుఁగూర్చు పుత్రరత్నంబ వైన
నీ పలుకు దిగ్విదిక్కుల నెగడినపుడు
వలపు రూపొందినటు లయి భారతాంబ
ఎంత సంతస మందెనో యెవరి కెఱుక ॥ ౯



# భారతపునర్నిర్మాణ విధాత - శ్రీ వివేకానందస్వామి

[సంపాదకీయము]

ఎనిమిదేండ్లకుపూర్వము మనము మాతృశ్రీ శతవార్షికోత్సవమును జరిపితిమి. ఒక మహా కార్యక్రమమును పూనుకొనుటకును నిర్వహించుటకును స్వామిజిని సమర్థునిగ జేసినది శ్రీ శారదా శ్రీరామకృష్ణులపరమానుగ్రహము. తనకును శ్రీశారదకును ఎట్టిభేదమును లే దని శ్రీరామకృష్ణుడు చెప్పుచుండెడివాడు. ఆయన తన శిష్యబృందము నిట వదలి యేగెను. ఆయననిర్యాణానంతరము శిష్యులు మిక్కిలి ఖిన్నులై యుండిరి. వారిని కలిపి నిలుపుటకు శ్రీశారదామణియే లేకుండిన, వారు ఎవరి దారిని వారు చీలిపోయి యుందురు. భువిని 'శ్రీరామకృష్ణమిషను' ఉండెడిది కాదు. వీరి నందఱిని కలిపి నిలిపినామె మాతృశ్రీ. శ్రీరామకృష్ణమిషను అవతరించుటకు కారణ మామెయనుగ్రహమే. శ్రీవివేకానందస్వామి భారతదేశమునను అమెరికాఖండమునను ఘన కార్యములను సత్కార్యములను చేయగలుగుటకు నిదాన మామె కృపయే.

చికాగోనగరమున రమ్యమగు మిచిగన్సరస్తీరమును అచటి బలకరవాతావరణమును గాంచితిమేని మద్రాసునగరము స్మరణకు వచ్చును. స్వామజి అమెరికాకు పోయి విశ్వమతమహాసభలోనికి ప్రవేశమొందినది మదరాసునుండి బయలుదేఱియే. అచట ఆకూటమును చూచినవారికి స్వామిజియుపన్యాసగర్జనము మనస్సుకు వచ్చును. ఆ ఉపన్యాసము కదా మహోజ్జ్వలాంశముగ చరిత్రలో స్థిరపడినది! స్వామిజి విశ్వమతమహాసభలో తన ప్రారంభోపన్యాసమును చేయుటకు పూర్వము పాశ్చాత్యుల కుండిన అభిప్రాయ మిది — భారతదేశము మోటుప్రజలకు నివాసము. హిందుమతము పాతరకపు మతము, హిందువులు విద్యావిజ్ఞానములు లేనివారు, అంధవిశ్వాసాలకుదాసులు. స్వామిజి లేచి 'అమెరికాసోదరసోదరీమణులారా' అని సంబోధించిన తత్క్షణమే పైనిచెప్పిన అపోహాయు దురభిప్రాయమును పటాపంచలై పోయెను. వారికి తెలిసినంతవఱకు వేఱు ఏ యుపన్యాసకుని నోటను ఈ సౌభ్రాత్రస్ఫురణము లేదు. ఇది వారిని సుదీర్ఘకాలము మంత్రముగ్ధులనుగా నొనర్చినది. స్వామిజీతోడి తమ సమాగమములను స్మరించి బాష్పపూర్ణులగు వృద్ధ మహాజనులు అమెరికాలో ఈనాటికిని కల రని అటకు పోయివచ్చువారివలన తెలియుచున్నది. అట్టివారు అచటి రామకృష్ణవేదాంత కేంద్రముల కరుగుదెంచి ఆ కేంద్రముల కార్యక్రమములలో ఆసక్తితో పాల్గొనుచు స్వామిజి అమెరికాలో ఉండిన కాలపుస్మృతుల ననుభవించుచుందురు. శ్రీమాతృదేవి ఆశీర్వచనమే స్వామిజి పాశ్చాత్యదేశవిజయయాత్రను ఘటింపచేసిన దని పూర్వమే చెప్పితిమి. క్షత్రియమాతవలె

శారదామాత వేదాంతఖడ్గము నభిమంత్రించి ఈయగా, దానిని గొని స్వామిజి అమెరికాకు వెడలెను. ఆయన అచటి కేగినది, అమెరికనులకు విద్యకఱపుటకు కాదు, వేదాంతమును పాశ్చాత్యదేశమున ప్రచారము చేయుటకును కాదు. విశ్వప్రజలదృష్టిని భారతీయులవంకకు మరల్చుటకు, ప్రపంచపటమున భారతదేశమున కర్హస్థానమేర్పఱచుటకాయన అచటి కేగెను. భారతదేశము వేయేండ్లు విదేశీయుల త్రొక్కిళ్లకు లోనై బానిసదశయందుండినది. క్రుంగిపోయి యుండెను, కృశించి యుండెను, శక్తిహీనమై యుండెను. ఈ దౌర్బల్యమును భారతీయులు కొందఱు ఆధ్యాత్మిక శక్తి అని భ్రమించిరి. విశ్వప్రజలహృదయములలో భారతదేశమును గూర్చిన యొక సదభిప్రాయమును లేపుటకే స్వామిజి అమెరికా కేగినది. భారతదేశ మొక్కటే చిరంజీవముగ నుండవలె ననుట కాదు ఆయన ఆశయము. భారతదేశమునకు సమున్నతి కల్గకున్న విశ్వమునకు భవిష్యత్తే లేదనుట ఆయన గట్టి నమ్మకము. ఒక నూతనజగము నావిర్భవింప జేయుటకై, భారతపతాక నెత్తిపట్టుటకై స్వామి విశ్వమత మహాసభ కేగెను.

నేటి మనస్వాతంత్ర్యమునకు, మనదేశ స్వాతంత్ర్యమునకు పునాదులువైచినది శ్రీస్వామిజియే. ఈవింతను పరికింపుడు — మనస్వామిజి ప్రచారముచేయబూనినది ఆధ్యాత్మికసందేశమును, కాని ఆంగ్లప్రభుత్వము వారి కీయన విషయమై శంకలు కలిగినవి. ఈయన విప్లవకారుడనియు, మహాసమర్థుడనియు భావించి, ఈయన చనిన చోట్లనెల్ల ప్రభుత్వమువారు ఈయనను కనుపెట్టుచునే యుండిరి. ఈయన విప్లవకారుడనుట నిజమే, అఘటితఘటనాసమర్థుడనుటయు నిజమే, కాని ఆయనది మామూలు రకము కాదు. ఈసనాతనభారతభూమిలో ఆయన వెలిగించిన జ్యోతి దేశదాస్యశృంఖలల భస్మ మొనర్చినది. కావున దేశస్వాతంత్ర్యమును సాధించిన నాయకుల కాయన అగ్రచరుడని మనకు స్పష్టమగుచున్నది. గాంధిమహాత్ముడు రాజకీయరంగములో పారమార్థికపరతను జొన్పినాడనుటయు రాజకీయ జీవితమునకుకూడ నీతిబద్ధతను ఒనగూర్చినాడనుటయు నిర్వివాదాంశములు కదా. మఱి తనకు ఆదారులను స్ఫురింపజేసినవారు పరమహంస శ్రీరామకృష్ణుడును శ్రీవివేకానందస్వామియునే అని ఆయనయే తెల్పియున్నాడు. స్వామిజి గొప్ప దేశభక్తుడే కాని ఆయన దేశభక్తి ప్రగాఢాధ్యాత్మికాసక్తినుండి ఉప్పతిల్లినదే.

ఆయన సంకల్పించిన ఆధ్యాత్మికకార్యప్రణాళిక ఏమి? —దానిస్వరూపమును సంక్షేపించి తెల్పెదము. పాశ్చాత్త్యుల కాయన బోధ "వివేకమార్గము ననుసరింపు" డని. ప్రాచ్యదేశీయుల కాయన ఉపదేశము: "మీరు అనుష్ఠింపవలసినది కర్మయోగము" అని. మనమెంతయు ఆధ్యాత్మికపరుల మని తలంచుకొనుచుంటిమి. మనసోదరులపట్ల మన బాధ్యతలను మన విధులను మనము మఱచితిమి. దేశప్రజలను లక్ష్యింపక, వ్యష్ట్యభివృద్ధినే మన మభిలషించుచుంటిమి. అందుచే మనలో విభేదాలు పొటెక్కినవి. ఉమ్మడిప్రయోజనము కొఱకైనను సరే మన మైకమత్యము నలవఱచుకోలేకున్నాము. దేశైక్యభావము మనలో బొత్తిగా లేకుండినది. సామాన్యమానవుని దుఃస్థితిపట్ల మనకు సానుభూతి లేదాయె. మతాచారాల పేరట మనము చీలికలనే విభేదాలనే పాటించుచున్నాము. మన

సోదరులపట్ల మన మహిళలపట్ల మన నడవడి చాలఘోరముగ నున్నది. ఇదంతయు స్వామిజి కించుకేని సహ్యము కాదు. మన దేశములో మతాచారాలపేరట ఆధ్యాత్మికపరత పేరట మానవులపట్ల మానవులు ప్రవర్తించుచున్న ఘాతుకరీతులను తలంచుకొన్నప్పుడు స్వామిజి విలపించెను. మన సంఘజీవితమును చక్కబఱుపవలె ననుట స్వామిజి మొదటికోరిక. నిస్స్వార్థసేవ చేసి, శ్రమించి ఉన్నతి నందవలె నని స్వామి భారతీయులకు బోధించెను. ఉన్నతి, యావద్భారతదేశమునకును కలుగవలెను, లేకున్న పతనమే. స్వామిజి ఉపదేశించిన మంత్ర మిది : నీయభ్యున్నతిని తలపెట్టకముందే, భారతదేశమునకు సేవ చేయుము. ఆధ్యాత్మికముగ చూచినను భారతదేశమునకు ప్రశస్తి కలుగనిదే, నీవు నీకేమియు చేసికోలేవు. ప్రజలు ఒరులత్రొక్కిళ్లకు నలిగిపోవుచున్నంతకాలము, అవమానింపబడుచున్నంతకాలము, లెక్కకు మిక్కిలియైన వ్యాధులచే పీడింపబడుచున్నంతకాలము, భారతదేశమున కభ్యున్నతి ఎక్కడిది? కావున దేశనిర్మాణకార్యక్రమము జరూరై యుండెను. ఇదే స్వామిజి నేర్పిన పాఠము. భగవద్గీత తృతీయాధ్యాయప్రారంభమున అర్జునుడు శ్రీకృష్ణుని ఇట్లడిగెను : ''ఓ కేశవా, జ్ఞానమే కర్మమునకన్న మిన్న యనుట నీ తలంపగుచో ఘోరకర్మ మాచరింపు మని న న్నేల నియోగించుచున్నావు?'' అందులకు శ్రీకృష్ణుడు చెప్పిన జవాబు :— ''అనఘా, కర్మయోగమునకన్న జ్ఞానయోగము మిన్న యనుటకు సంశయము లేదు కాని, నీవు కర్మయోగమునకు మాత్రమే అర్హుడవు. కర్మయోగముద్వారానే నీవు దానికంటె పైమెట్టగు జ్ఞానయోగమున కధికారము గడింతువు'' అప్పటి అర్జును డే దశలో నుండెనో స్వామిజి అవతరించినప్పుడు భారతదేశ మా అవస్థలోనే యుండెను. దొంగసన్న్యాసులు కొల్లగనుండిరి. సోమరితనమునే భక్తి యని భ్రమించుచుండిరి. కావున స్వామి దేశీయులను మేలుకొల్పి ''బలశక్తిసంపన్నమగు దేశమును నిర్మింపు'' డని బోధించెను. ఆ బలము చేకూరిన పిమ్మటనే భారతదేశము ప్రపంచమునకు ఆధ్యాత్మికనాయకపీఠము నధిష్ఠింప వీ లగును.

అమెరికా మున్నగు పాశ్చాత్యదేశాలలో ప్రజలకు ఐహికసంపదలు సమృద్ధిగ నుండినవి. వారికి స్వామి ఇట్లనెను :— 'జీవితమునకు మఱొక వైపుకూడ ఉన్నది సుడీ. తిండి నిద్ర పెండ్లి బిడ్డలు వినోదాలు – అను ఇవి ఉన్నంతమాత్రముచేత మీకు జీవితపరిపూర్తి లేదు. దీనిచే మీ జీవితమునకు సమగ్రత కలుగదు. పారమార్థికజీవితము నభిలషింతురేని భారతదేశమువంకకు మరలుడు. పారమార్థికపరత అచ్చట ఉన్నది. పారమార్థికపరత అనగా గుడులలోని కేవల బాహ్యారాధన కాదు, ఎప్పుడో తోచినప్పుడు దేవుని నామములను పాడుట కాదు. మ ఱేమన, చూపును అంతర్ముఖము గావించుకొని ఆత్మతేజమును సాక్షాత్కరించుకొనుట. కావున పాశ్చాత్యులకు స్వామి ప్రసాదించినమంత్రము జ్ఞానయోగము. భారతీయుల కాయన ప్రసాదించిన మంత్రము కర్మయోగము. మన మీ రెంటిని గొని, ప్రక్క ప్రక్కనిడి, వాని పరస్పరసంబంధమును పరికించిననే గాని స్వామిజిని అర్థము చేసికోలేము, ఆయన కార్యక్రమము మన కర్థము కాదు. దేశపునర్నిర్మాణకార్యమున స్వామిజి బోధించిన వేదాంతసూత్రముల అమలుపఱ

చుట మన కర్తవ్యము. దేశస్వాతంత్ర్యము సిద్ధించిన తర్వాత మనప్రభుత్వమువారు ఈ నిర్మాణకార్యక్రమమునే సాగించుచున్నారనుట ముదావహము. పరరాజ్యముల విషయమున మనదేశప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ అనుసరించుచున్న నీతిలో వేదాంత హృదయము స్ఫురించుచున్నది. ఆధ్యాత్మిక రంగమున భారతదేశము అన్యదేశాల కేమి చేయవలెనో తెల్పినవాడు శ్రీస్వామిజియే. ఆమార్గము ననుసరించి మనము మనదేశ ప్రతిష్ఠను వైభవమును కాపాడగల్గితిమేని మనకు మహోజ్జ్వలభవిష్యత్తు తప్పక కలదు. అనాదికాలమునుండి శ్రీరామకృష్ణ శ్రీవివేకానందులవఱకు అవిచ్ఛిన్నముగ వచ్చుచున్న మన ఋషులయు ద్రష్టలయు సంప్రదాయ ధనము సార్థక మగును. ఏ మహాశయములను మనకు బోధించుటకై స్వామిజి అవతరించెనో వానినిగాని, మనము నిర్వహింపవలసినదిగా ఆయన నిర్మించిన ప్రణాళికనుగాని—మనము మఱవరాదు. భారతదేశమునకై అట్టి గొప్ప ప్రణాళిక శ్రీస్వామిజి దివ్యచిత్తమున స్ఫురించినది ఈ మదరాసులోనే. మనము గుర్తించినను గుర్తింపకున్నను, సాగుచున్నది ఆక్రమమే. ఆ ప్రణాళికను అర్థముచేసికొని తెలిసి ఆచరణలో దానిని యథార్థాతురముగ నొనర్తుమేని అది మేలు. నిత్యాత్మరూపమున స్వామిజి సదా మనతోకూడియే యుండును. ఆయన కృపచే మనము ప్రజాసేవాదక్షులము కావలెనని కాంక్షింతము గాక, మన సనాతనధర్మమే శ్రీవివేకానందస్వామిలో మూర్తీభవించినది; "రామో విగ్రహవాన్ ధర్మః" అనియు "కృష్ణం ధర్మం సనాతనమ్" అనియు కలదు గదా. ఆరాముడును ఆకృష్ణుడునే శ్రీరామకృష్ణునిలో నొక్కటై ఆయననుండి మరల శ్రీవివేకానందస్వామిలోని కవతరించి రన వచ్చు, సమరసజీవనులముగను ఆధ్యాత్మికపరులముగను మన ముంటిమేని, అదే శ్రీస్వామిజికి మన కావించు యథార్థారాధన మగును.

# ఇహలోకమున జ్ఞానుల జీవిత వైఖరి - శ్రీ వివేకానందస్వామి

## శ్రీ యతీశ్వరానందస్వామి

శ్రీరామకృష్ణుని శిష్యశ్రేణిలో అగ్రగణ్యుడైన శ్రీవివేకానందస్వామి తనఉపదేశముచేతను అనుష్ఠానముచేతను కఱపిన లక్ష్యమిది — 'మానవునిలో ఉన్న దేవుని ఆరాధించుట'. ఈ లక్ష్యమును మానవుల చిత్తములందు నెలకొల్పుటే స్వామిజి తనజీవితకర్తవ్యముగ పూనెను. "మొదట మనము దివ్యులము కావలెను, తర్వాతనే ఒరులకును దివ్యులగుటకు మనము తోడ్పడవలెను"—ఇదే స్వామిజి సందేశము, స్వామిజిసిద్ధాంతము. దౌర్జన్యపు త్రొక్కిళ్లకు గుఱియై నలిగిపోవుచున్న వారి దుఃస్థితిని గని తఱుగుకొనిపోవు గుండెతో స్వామిజి ఇట్లనెను—విశ్వమండలి సకలాత్మల సమవాయమే నేను విశ్వసించు దైవము. ఏజాతివారైనను సరే దుర్జనులును రుగ్ణులును దరిద్రులును సైతము నాకు ఉపాస్యదైవములే. వారి నారాధించు నవకాశము నాకున్న జాలును, అందుకై ఎన్నిజన్మములైన నాకు కలుగును గాక, వేలకొలది దుఃఖాలు నాకు సంభవించు గాక." వరిష్ఠ జ్ఞానులలో తానొకడైన

శ్రీవివేకానందస్వామి జ్ఞానినిగూర్చి ఇట్లనెను— "జ్ఞాని పాటుపడునదెల్ల లోకహితముకొఱకే. అతనివాక్కు లోకమంగళమునే పల్కును, అతనిచేతులు లోకులకు మేలునే చేయును, మంగళభావములు మాత్రమే అతని మనస్సులోనికి వచ్చును. ఎచటి కేగినను అతనిసాన్నిధ్యము శుభప్రదము. అతడే విశ్వశ్రేయస్స్వరూపి. ఎంతటి దుర్జనుడైనను సరే, అట్టి జ్ఞానిసన్నిధానమునకు వచ్చునేని, యోగిగా మార్పొందును. ఆ జ్ఞాని మాటాడ నక్కఱ లేదు. అతనిసాన్నిధ్యము చాలును, మానవాశ్రేయము లొసంగ".

అట్టిజ్ఞానులు సకలమానవాళికిని సొంతము. జాతిమతివర్ణసీమలు వారికి లేవు. వారు భగవంతుని ప్రాపించినవారు. తామే భగవంతుడుగ నైన వారు. కావున ఎల్లర ఆత్మలతోను వారి కైక్యము గల్గియుండును. నైతికాధ్యాత్మికకల్లోలములు గల్గినప్పుడు, సంశయాజ్ఞానములు కమ్ముకొన్నప్పుడు, మనము అట్టిజ్ఞానుల స్మరింతము గాక, శ్రోత్రశక్తియు ఆసపాటును వెలుగును లభించును. వారు మనల నందఱ ఆశీర్వదింతురు గాక. వారిమార్గమునే అనుసరించి మనమును మనకు తగినంతగ సహచరులకు శుభంకరుల మగుదము గాక!

# శ్రీ వివేకానందజీవితచరిత్రాధ్యేతలకు తొలినుడి

శ్రీ చిరంతనానందస్వామి

వివేకానందజీవితము వ్రాయుటకు మఱియొక వివేకానందుఁడు కావలయును. ఏలన, "వివేకానందుఁ డేమి యొనర్చెనో మఱియొక వివేకానందుఁ డుండిన గ్రహించియుండెడివాఁడు..."అని మహాసమాధి నొందుటకు ముందు స్వామియే తనలోఁ దా ననుకొనుచుండఁ బ్రేమానందుఁ డను సోదరశిష్యుఁడు వినియుండెను. తన సందేశమునుగూర్చి స్వామి యీరీతినే మఱియొకప్పుడు, "ఈశరీర మేమైననేమి? జనులకుఁ బదునైదువందల సంవత్సరముల పర్యంత మాచరించుటకు వలయు సందేశము నొసఁగియున్నాను" అని వచించెను.

భారతదేశభక్తులలో వివేకానందస్వామినిఁ గూర్చి యెఱుఁగని వా రుండరు. భారతదేశభక్తులకే కాక, భారతవర్ష పునర్నిర్మాణకర్తల కెల్లరకును స్వామి మార్గదర్శకుఁడు. "నాదేశమున నొక కుక్కయైనను బస్తుపడియున్నంతవఱకు దాని కాహారమిడి రక్షించుటయే నా పరమధర్మము, ఇదియే నామతము; తద్భిన్నమంతయు నధర్మము, కృత్రిమధర్మము." "...సమస్తజీవస్వరూపుని, అద్వితీయుని,... విశేషము...నా యార్తనారాయణుని, నా దీననారాయణుని, సమస్తదేశీయుల కెల్లఁ బేదయగు నా భారతనారాయణుని,— నా యిష్టదేవత నర్చించుటకై యెన్నిజన్మములైన నెత్తెదనుగాక, ఎన్ని వేలబాధలనైన ననుభవింతునుగాక" యని ప్రకటించి, యన్నదాన విద్యాదాన జ్ఞానదానములచే నేఁ డఖండదేశసేవనే కాక, ప్రపంచసేవను సల్పుచున్న శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములను స్థాపించిన దేశభక్తాగ్రగణ్యుఁడు, విశ్వమానవప్రేమపూరితుఁడు, వివేకానందస్వామి.

# నవభారతనిర్మాణంలో వివేకానందునిపాత్ర

శ్రీ పున్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

ఒకనిని మహాపురుషు డని భజించడంగాని, ఏవో దోషా లారోపించి విమర్శించడంగాని ఈ రోజులలో కష్టమైన పని కాదు. రాజకీయాల ప్రభావంవల్ల నేడీపని సర్వసాధారణ మైంది. ఒకనియం దేదో కొంత విశేషం చూచి అతడు దేవుని అవతార మని పూజించడమో, ఒకానొక వైపరీత్యాన్ని గమనించి తృణీకరించడమో జనబాహుళ్యానికి పరిపాటి. పూజించే వారిని అనుసరించడానికి ప్రయత్నించనయినా ప్రయత్నించరు. పూజించడమే అనుసరించడ మనుకుంటారు. తృణీకరించేవారిని కరుణించరు. దురభిమానపూర్వకమైన భజనవల్లగాని, ద్వేషంతోకూడిన ఆక్షేపణవల్లగాని సద్యప్రయోజన మేమి కలిగినా, నిదానంమీద కలిగేది కీడే.

వివేకానందుడు మహాత్ము డని సర్టిఫికేటివ్వడం నా అభిప్రాయం కాదు. నవభారత నిర్మాణంలో అతడు నిర్వహించినపాత్ర నేను గ్రహించినది సవినయంగా మనవిచేయడమే నాపని.

ఆర్యావర్తచరిత్రలో క్రీస్తుశకం 19వ శతాబ్దం ఉజ్జీవనయుగం. 1772వ సంవత్సరంలో ప్రభవించిన రాజారామమోహన్ రాయ్ సర్వజనీనధర్మాన్ని, సమన్వయజీవిత దృక్పథాన్ని ప్రబోధిస్తూ, పైస్థాయిలో, క్రొత్త స్వరంలో చేసిన ఉపనిషద్గానంతో భారతజాతి కుండలినీశక్తి మేల్కొన్నది. భారతాత్మ చిరకాల తమోనిద్రనుంచి ప్రబుద్ధమై స్వస్వరూప సాక్షాత్కారం పొందసాగింది. జాతియందు నవజీవన మావిర్భవించి అంతరంగాన్ని, బాహ్యరంగాన్ని ఉన్మిషితం చేసింది. ధార్మిక, సారస్వత, కళారంగాలు క్రొత్తవెలుగుతో ప్రదీప్తమైనవి.

గడచిననూరేళ్లలో భారతావనియం దుద్భవించినంతమంది మహాత్ములు మరే ఒక్క శతాబ్దిలోను అవతరించినట్టు తోచదు. వారిలో కొందఱు ప్రాచీనార్యసంస్కృతిని పునరుద్ధరించడానికి పూనుకొన్నారు. మఱికొందఱు అసత్యంమీద, వంచనమీద ప్రతిష్ఠితములయిన ఆచారాలపైన, ప్రచారాలపైన, సంస్థలపైన, వ్యవస్థలపైన దాడిచేసి, సమాజాన్ని ఏకాత్మభావనపై స్థాపించడానికి సాహసించారు. వేఱు కొందఱు అన్యమతాలతో, ఆధునికవిజ్ఞానంతో, ఐహికజీవితంతో పరమార్థచింతకు సామరస్యాన్ని సాధించడానికి సమకట్టారు. వివేకానందుని జననకాలంనాటికి విద్యాధికవర్గజీవితం ఈవిధమైన ఆశయాలతో, ప్రబోధాలతో, కార్యకలాపాలతో ఉత్తేజితమై చకచకలాడుతున్నది.

## యుగధర్మప్రభావం

వివేకానందుడే నూతనప్రభావానికి ప్రత్యక్షంగా వశుడయినాడు. ఈ సందర్భంలో అతడన్న మాట లివి: ''వేదాంతము (ఉపనిషన్మతము) నం దతని (రామమోహనుని) శ్రద్ధ, అతనిమాతృదేశభక్తి, హిందువులతో సమానంగా ముసల్మానులను ఆలింగనం చేసుకొనే అతని ప్రేమాతిశయం న న్నాకర్షించినవి. ఈ విషయాలలో అతడు ప్రారంభించినపని నేను కొనసాగిస్తున్నట్టు భావిస్తున్నాను''. వివేకానందుడు నవయుగధర్మాన్ని స్పష్టంగా గుర్తించాడు. నాటిఉద్యమనాయకులతో అతడు సన్నిహితసంబంధం పెట్టుకున్నాడు. అయితే, నవయుగధర్మస్రవంతి ఉత్తుంగతరంగితమై, గట్లను

కోసుకుంటూ, చెట్లను, ఇళ్లను కూలద్రోసుకుంటూ శరవేగంతో ప్రవహిస్తున్నట్టు అతడు భావించాడు. ప్రవాహవేగాన్ని కొంత నిరోధించక పోతే, మేలుకంటె కీడే ఎక్కువగా కలుగగల దని అభిప్రాయపడ్డాడు. గండ్లుపడకుండా గట్లను గట్టిపఱచడం, ఎత్తుచేయడం ముఖ్యమని నిశ్చయించుకున్నాడు. ఈవిధంగా నాటి ప్రముఖులతో భేదించినందుకు అతడు యుగధర్మానికి అడ్డుతగులుతున్నట్టు కొందఱు సమకాలికు లభిప్రాయపడ్డారు. యుగధర్మాన్ని పెనుభూతంగా భ్రమించిన సంకుచితస్వభావులు వివేకానందుడు కాలదోషంపట్టి కూలిపోతున్న తమఆచారాలకు, బూజుపట్టి దుర్గంధంకొడుతున్న తమ ప్రాతభావాలకు సంజీవని పోయడాని కవతరించిన మహానుభావు డని ఆశించారు.

నేటికీ వివేకానందుని భక్తులలో పలువురు పరంపరాగతమైన హిందూసంఘువ్యవస్థలో మార్పులుకూడదనే వారే; మార్పు లనివార్యమయితే, వెనుకచూపుతో వేదకాలానికి వెళ్లవలసిందే గాని, ముందుచూపుతో ఒక్క అడుగయినా వెయ్యరా దనే వారే; నిత్యజీవితంతో ప్రత్యక్షసంబంధం లేని తత్త్వవిచారమే మతమని భావించేవారే; జగత్తును మిథ్యగా నిరూపిస్తూ వర్ణవ్యవస్థను మాత్రం గట్టి సత్యంగా మన్నించే వారే; జీవితాన్ని పారమార్థికమని, వ్యావహారిక మని, తలనుమొండెంనుంచి వేఱుచేసినట్టు, రెండు తునకలుచేసి, వాటికి పరస్పర సంబంధం లే దనే వారే; ఏకంసత్ విప్రా బహుధా వదంతి అని ఉదాహరిస్తూ హిందూమత మొక్కటే భగవన్మత మని ఘోషించే వారే; కర్మకాండ మోక్షసాధనం కా దని చెబుతూ, తురీయాశ్రమంలోకూడా దానిని నిష్ఠగా అనుష్ఠించాలని పలికే వారే. గ్రుడ్డినమ్మకాలను, చాదస్తాలను పామరులకోసం పండితులుకూడా మన్నించా లనే వారే.

## అపచారం, ఆత్మవంచన

ఈ భావాలకు, నమ్మకాలకు వివేకానందస్వామి ప్రాణప్రతిష్ఠ చేశాడనడం ఆమహనీయుని అపసవ్యంగా అర్థంచేసుకోనడమే; అతనికి అపచారం చెయ్యడమే; అంతకంటె ఎక్కువగా ఆత్మవంచన చేసుకోనడమే. ఈ అభిప్రాయాల నతడు పరిహసించినవాడే. "హిందువులు ఆఱుకోట్ల దేవుళ్లను పూజిస్తారు. చివరకు కుక్కచావు చస్తారు" అన్నా డతడు. "ఎక్కడ ఉన్నా రీ దేవుళ్లు?" అని ప్రశ్నించాడు. మతకర్మకాండను "కిండర్‌గార్టెన్ రెలిజిన్", "పసిపాపలమతం" అని పరిహసించాడు. మహిమాన్వితమైన హిందూసంఘంలో ఈ పసితనం తొలగి, ప్రాజ్ఞత కలిగినవారు మచ్చు కయినా కనబడ రేమి? ఎక్కడయినా కనబడితే వారికి జరిగే సత్కారం బహిష్కారమే. "అంధవిశ్వాసం మానవునికి శత్రువు. పరమతఅసహనంతో కూడిన స్వమతదురభిమానం అంతకంటె ఘోరం" అని అతడు మందలించాడు. దురదృష్టవశాన సంస్కర్తగా వివేకానందుడు పలికిన ప్రవచనాలు అతని గ్రంథాలలో కనబడేవే గాని మఱెక్కడా వినబడేవి కావు. ప్రాచీనభారతీయవైభవాన్ని స్మరించుకొని ఉత్తేజంతో అతడు చెప్పిన మాటలను ప్రస్తుతదుర్దశ కన్వయించి ప్రచారం చెయ్యడమే కనబడుతున్నది. ఈ వైపరీత్యానికి కారకు లెవరో, ప్రోత్సాహకు లెవరో, దీని నివారణకు బాధ్యత ఎవరిదో, బాధ్యులయినవా రెంతవఱకు నివారిస్తున్నారో ఆ సర్వసాక్షికే ఎఱుక!

# అమెరికాలో శ్రీవివేకానందస్వామి

శ్రీ వివేకానందస్వామి అమెరికాకు బయలుదేఱినప్పుడు పసిఫిక్కు మార్గాన పర్యటించి దారిలో హాంగ్‌కాంగును కన్టనును జపానును చూచారు. మదరాసుభక్తులకు స్వామిజి వ్రాసిన లేఖవలన జపానుపురోగతి ఎంతగా ఆయన మెప్పొందినదో మన కించుక తెలియనగును.

ఉత్తరపసిఫిక్కుమార్గాన ఆయన వాన్కొవరునొద్ద ఓడ గన్నారు — “అమెరికావారికి ధనం అంటె నీళ్లతో సమానం. అంతగా ఖర్చు చేస్తారు వారు. భూమండలంలో ఏ దేశంవారికిన్నీ అందుబాటు కానంత హెచ్చుస్థాయిలో ఉండేటట్లుగా ఇక్కడ చట్టాలు ధరలను నిర్ణయిస్తాయి. మామూలుకూలివాడు దినానికి తొమ్మిది పదిరూపాయలు సంపాదిస్తాడు. అంతా ఖర్చు చేసి వేస్తాడు. బయలుదేఱ



శ్రీ వివేకానందస్వామి విశ్వమతమహాసభలో ఉండినతీరు—సెప్టెంబరు 1893

డిగారు. అళగసింగపెరుమాళను భక్తునకు ఆయన “ఇచ్చట చలి చాల దుస్సహము. కప్పడాలు చాలక నేను చాల శ్రమపడినా” నని వ్రాసినారు. కానడాగుండ ఆయన చికాగోకు పోయారు. అచట ధనము ఖర్చుపడే రీతి వెఱగుగొలుపుతుంది. దానినిగూర్చి వ్రాస్తూ స్వామిజి ఈలా డానికి ముందుండిన “దూరపుకొండలనునుపు”లాంటి అభిప్రాయాలు మాసిపోయినవి. అసాధ్యాలను ఎదురుకొని పోరాడవలసిన పరిస్థితులలో ఉంటున్నాను. ఈ దేశంనుండి బయటపడుదాం, వెనుదిరిగి మాతృదేశం చేరిపోదా మన్న తలంపు. నా కొక నూఱు పర్యాయములు కలిగినది. కాని,



విశ్వమత మహాసభ, చికాగో—1893

నా నిశ్చయాన్ని దృఢపఱచుకొన్నాను. అంతయు భగవదాజ్ఞ, దారి నాకగపడటం లేదు. భగవంతుడికి కనబడుతుంది. చచ్చినా, బ్రతికినా నేను ముందడుగు వేసితీఱవలసినదే."

తనఖర్చులు తగ్గించుకునేందుకై ఆయన బసను బోస్టనుకు మార్చుకొన్నారు. వెనుకడుగు వేయరాదనెడి తన సంకల్పానికి దైవం ఏవిధంగా తోడ్పడిందీన్నీ ఆయన ఆ జాబులోనే తెలిపారు. "బోస్టను సమీపంలో ఒకగ్రామమున ఒకవృద్ధాంగనఇంట అతిథినిగా ప్రస్తుతం ఉంటున్నాను. ఆమె పరిచయం నాకు రైలుబండిలో యాదృచ్ఛికంగా కలిగింది. వచ్చి తనతో ఉండవలసిందని ఆమె నన్ను ఆహ్వానించింది. ఆమెతో ఉన్నందువల్ల నా కొక లాభం, ఆమె కొక లాభం. దినాని కొక పౌను ప్రకారం అయ్యే ఖర్చు మిగలడం నాకు లాభం. ఇంటికి వచ్చిన వారి కొక వింతభారతీయుణ్ణి ప్రదర్శించగలగడం ఆమెకు లాభం. ఇక్కడ నాకు తప్పని బాధలు—పస్తులు, చలి, నా వింత దుస్తులు చూచి వీధివారుపట్టించే గేలి. కాని, అబ్బాయి, ఎంతో శ్రమపడనిదే ఘనకార్యా లేవీ నెఱవేఱవు."

స్వామి, ఆమెగృహమున ఉంటుండినప్పుడే ఆయనకు హార్వర్డువిశ్వవిద్యాలయప్రొఫెస్సరు జె. హెచ్. రైటుగారి పరిచయము కలిగినది. విశ్వమతమహాసభలోనికి స్వామిజికి ప్రవేశం సంపాదించిపెట్టేందుకు ఆ ప్రొఫెస్సరు సాధనభూతు డయ్యాడు.

## థౌసన్డైలెండ్పార్కు వద్ద శ్రీవివేకానందస్వామి

ఆ పర్యాయం స్వామి అమెరికాలో దాదాపు మూడేండ్ల కాలం ఉండినారు. హిందూమతవిషయికములైన ఉపన్యాసాలు చేస్తూ పర్యటిస్తూ ఉండినారు. 1895 వ సంవత్సరపు వేసవిని ప్రగాఢసాధనలకొఱకున్నూ పఠనములకొఱకున్నూ కొందఱు శిష్యులు సెయింట్లారెన్సునది యొడ్డున ఉన్న థౌసన్డైలెండ్పార్కు (సహస్రద్వీపారామం) అనే ఏకాంతప్రదేశాన చేరుకొన్నారు. ఇన్స్పైర్డుటాక్స్ (దివ్యవాణి) అను పేర ఇప్పుడు ప్రశస్తినొంది ఉన్న పాఠాలను స్వామిజి చెప్పింది ఇక్కడే.

## అమెరికాకు స్వామిజి మఱిప్రయాణం

తే 20-6-1899 ది నాడు స్వామిజి రెండోసారి అమెరికాకు పోవడానికి బయలుదేఱారు. ఈసారి ఏడెన్-సూయజ్-లండన్లమీదుగా పొయ్యారు. ఆయనకు తోడుగా శ్రీ తురీయానందస్వాములున్నూ ఉండినారు. ఇద్దఱున్నూ న్యూయార్కుకు చేరి లెగెట్టుదంపతుల గ్రామానికి పోయి "దివ్యానుమతి"ని నిరీక్షిస్తుండినారు. ఆ దంపతులు వీరికి భక్తులు. 1899 నొవెంబరులో స్వామి కాలిఫోర్నియాలో లోసేంజెలీసులోను పసదెనలోనుఉండినారు. లోసేంజెలీసుకున్నూ పసదెనకున్నూ నడిమి దూరము పదిమైళ్లు. ఇక్కడుండిన దినాలలో ప్రజలసప్రశ్రయప్రార్థనచే దినానికి ఒక ఉపన్యాసం చేయవలసిన ఆవశ్యకత ఆయనకుండేది.



థౌసండైలెండ్పార్కులో శ్రీ వివేకానందస్వామి బసచేసిన భవనం. [ఎడమగా పైతట్టు కనిపించే కిటికీ స్వామిజి గదిది. పైని వసారలో తనగదికి చేరుపైన కొనలో కూర్చుండి స్వామి పాఠాలు చెప్పేవారు. ఇప్పు డిది విడిదిగా న్యూయార్కు రామకృష్ణ వివేకానందకేంద్రమువారి ఉపయోగంలో ఉంది].





పసడెనలో ఉంటున్న శ్రీ వివేకానందస్వామి—1900

పూర్వాచారపరాయణత్వం ఆధునికయుగ ధర్మం కానేరదు. పరంపరాగతమైన వ్యవస్థను సమర్థించడం నవభారతనిర్మాణం కాజాలదు. అంధప్రాయమైన అనుకరణ ఆధ్యాత్మికత ఎంత మాత్రమూ కాదు. యంత్రప్రాయమైన మత కర్మానుష్ఠానం మతం కానే కాదు. మాధ్యం సత్యం కాదు. గ్రుడ్డి నమ్మకాలు ధర్మాలు కావు. మార్పునకు విముఖత్వం అభ్యుదయ మెలా కాగలదు? ఆస్తికుడు మార్పులకు భయ పడవలసిన అవసర మేమిటి? వివేకానందుడు అభ్యుదయశక్తులకు ప్రాతినిధ్యం వహించినవాడే గాని, పసలేక కృశించి, నశించి పోతున్న వ్యవస్థలకు ప్రతినిధి కాలేదు. వివేకానందుని ప్రవచనాలలో స్థూలదృష్టికి పరస్పరవిరుద్ధంగా కనబడేవి కొన్ని ఉన్న మాట నిజమే. వాటికి కారణం నాడు ప్రాతక్రొత్తల సంఘర్షణఫలి తంగా ఏర్పడిన ఒడుదుడుకు పరిస్థితుల ప్రభా వమే. అప్పుడు తన ఉద్యమాని కవసరంగా అతడు ప్రదర్శించిన వాదతీవ్రతే అది. పాశ్చా త్యదేశాలలో అతడు చేసిన ఉపన్యాసాలలో ప్రగతి, హేతువిమర్శ, వైజ్ఞానికపరిశీలన ప్రబ లంగా ఉన్నవి; మాతృదేశంలో చేసిన ప్రసం గాలలో ఉత్తేజం, అభిమానం, ఆవేశం బలీ యంగా ఉన్నవి. పాశ్చాత్యదేశాలలో అతడు చేసినది బోధ. మనదేశంలో అతడు చేసినది ఉద్బోధ. "విప్లవాత్మకమైన సంస్కరణలను ప్రస్తుతానికి కట్టిపెట్టు" అనే భావం ఆత్మీయుల కతడు వ్రాసిన లేఖలలో మనకు స్పష్టంగా కన బడుతుంది. సమకాలికసంస్కర్తలను ఉద్దే శించి, "స్వార్థరహితులు, ఉదారచరితులు, దేశభక్తిపరాయణులు. కాని, వారి దేశభక్తి పెడమార్గముపట్టింది. సంస్కరణరహస్యాన్ని వారు గుర్తించలేదు" అన్నాడతడు. "నీవు చేస్తున్నపని చెడ్డది. వెంటనే దానిని మాని వేయి అని చెప్పకు. నీవుచేస్తున్నపని మంచిదే. కాని, యింకా చాలా గొప్పపనులు చేయాలి అని చెబుతుండు. ఈ రెండు పద్ధతులకు గల భేదం దోమకు ఏనుగుకు ఉన్నంత" అని స్వామీజీ హితవచనం.

వివేకానందుడు అతివాదులలో మితవాది; మితవాదులలో అతివాది. అతడు మానవమన స్తత్త్వాన్ని తుణ్ణంగా గ్రహించాడు. ఎంతటి స్వచ్ఛమైన సత్యమయినా, ఎంతటి ఉత్కృష్ట ధర్మమయినా జనబాహుళ్యం గ్రహించి, ఆప్యాయతతో ఆదరించి, ఆచరించడంవల్లనే వాటికి సంఘంలో స్థానం లభించగలదు. సామాన్యప్రజల ఆచరణవీధిలోకి రాలేని ధర్మా లను తీవ్రరూపంలో ప్రచారం చేస్తూ, ప్రస్తుత విధానాలను ఖండించడంవల్ల కలిగే ఫలితం జనబాహుళ్యానికి దూరమైపోవడమే. అవి సంఘజీవితంలో పాదుకొనలేక గాలిలో తేలి పోవలసినవే. వేషభాషలలో సంస్కారం, నాజూకు ఎంతగానో కనబడుతుండనూ వచ్చు. హృదయసంకుచితత్వాన్ని, స్వమతదురభిమా నాన్ని, ప్రాచీనతయందలి మమత్వాన్ని విడనా డకపోనూ వచ్చు. బాహ్యజీవితం నాగరకమై నంత సులభంగా అంతరంగం నాగరకం కాజా లదు. కనుక తత్కాలవ్యవస్థను తీవ్రరూపంలో ఖండించే పక్షంలో అమృతసత్యాలయినా సరే, జనులకు గుటకపడవు. ఈ విషయంలో నిరక్ష రాస్యులకు, విద్యాధికులకు పెద్ద తేడా లేదు. వయఃపరిమితి అసలే లేదు. శారీరకంగా షష్టి పూర్తి దాటినవారిలో మతవిషయాలలో మానసికంగా మైనారిటీ దాటిన వారెందరో లేరు. మతజీవితంలో శైశవ, బాల్య, యౌవన, కౌమార, వార్ధకదశలు గలవారెక్కడో చెదు

రుగా గాని లేరు. పుట్టినప్పటి దశకు చనిపోయే నాటిదశకు భేదం తెలుచు కనబడదు. కనుక ఉన్నస్థితిలోనుంచి ఉన్నతస్థితికి ప్రోత్సాహపూర్వకంగా, క్రమక్రమంగా గొని పోవా లనడమే వివేకానందస్వామి విధానం.

జాతీయప్రబోధంలో రెండు దశలు

వివేకానందుని ఉద్యమపద్ధతి ప్రగతిశీలమైన సంస్కరణోద్యమానికి పూరకమే గాని మారకం కాదు. నవభారతనిర్మాణంలో రెండుదశలున్నవి : ఒకదశలో ఒకవిధమైన కృషి, మఱొకదశలో మఱొకవిధమైన కృషి ప్రాధాన్యం వహించవలసి ఉంది. స్వాతిశయంతో కూడిన కూపస్థమండూకవైఖరిని విడనాడడం, ఇతరదేశాలతో పోల్చి మనదేశపరిస్థితిని పరిశీలించడం, కాలగతిని గమనించడం, మనదోషాలను, వాటికారణాలను నివారించుకొనడం, ఇతరులలోని గుణవిశేషాలను గ్రహించడం, ఐహికాముష్మికాలలో దేనికీ కొరకాకుండా జాతిని నిర్వీర్యంచేస్తున్న జీవితవిధానాలకు స్వస్తి చెప్పడం — తొలిదశలో ప్రాబల్యంవహించవలసిఉన్నపని. జాతికి ఆత్మవిశ్వాసాన్ని పూరించడం, ఆత్మగౌరవాన్ని తెలియజేయడం, అంతర్నిహితమైన ఆత్మశక్తిని జాగరిత మొనర్చడం, మనవిశిష్టతను లోకానికి నిరూపించడం, స్వధర్మానుగుణంగా, స్వశక్తి ననుసరించి పురోగమించడం మలిదశలో ప్రాధాన్యం వహించవలసిన కృషి. ఈ ఉభయమార్గాల గమ్య మొకటే. వీటిలో మొదటిదానియందు రెండవది, రెండవదానియందు మొదటిది యిమిడియే ఉంది. ఈ రెండూ, పాళ్ల మార్పులతో ఎప్పుడూ అవసరమే. మొదటిదశలోని కృషి కొంతవఱకయినా జరిగితేనే కాని రెండవదశలోని కృషి సాధ్యం కాదు.

వివేకానందస్వామికి పూర్వం సుమారు అర్ధశతాబ్దికాలం పూర్వరంగంలో కృషి జరిగినది. వ్యక్తికిగాని, జాతికిగాని దోషాలనే పదేపదే చూపుతుండడంచేత నే నెందుకూ కొరగా ననే నిస్పృహ కలుగుతుంది. సుగుణా లన్నీ పరులదగ్గఱనుంచి గ్రహించవలసిందే అన్న అభిప్రాయం బలపడితే పరాధీనతాభావం కలుగుతుంది. వ్యక్తివలె జాతికూడా ఇతరులనుంచి గ్రహించవలసిన దెంత ఉన్నా, తా నితరుల కివ్వవలసిందికూడా ఏదో ఉంటుంది. పరస్పరాశ్రయసూత్రం జగత్ప్రణాళికయందే విహితమై ఉన్నది. పరులనుంచి గ్రహించవలసినదికూడా అంతశ్శక్తి కొంత ఉన్నప్పుడే సాధ్యం. తన స్వభావవైశిష్ట్యాని కనుగుణంగానే అన్యప్రభావాలను గ్రహించాలి. అప్పుడే అవి పుష్టిదాయకాలు కాగలవు. స్వశక్తిని పూర్తిగ కోల్పోయినవానికి పరులసహాయం ఏ మేరకు, ఎంతకాలం ఉపకరించగలదు? భారతజాతి అంతశ్శక్తిని మేల్కొల్పడంలో, ఆత్మవిశ్వాసం కలిగించడంలో, భారతజాతిఘనతను లోకానికి నిరూపించడంలో, మనజాతికి సభ్యజాతులమధ్య అగ్రస్థానం లభింపజేయడంలో వివేకానందస్వామి సాగించిన కృషి, సాధించిన విజయం అద్వితీయం. వివేకానందుడు చేసిన జాతీయప్రబోధం పరోక్షంగా రాజకీయచైతన్యాన్ని ప్రేరేపించి, అవ్యక్తంగా వందేమాతరం ఉద్యమానికి నాందిఅయిన దనడం క్లిష్టమైన అన్వయం కాదు.

ఉద్యమానికి ప్రాతిపదిక

ఒకవంక దేవునిపేరుతో, మతవేషంతో మూఢ్యం, భయం, అనైక్యం, అమానుషత్వం, అత్యాచారం, భావాలలో బానిసతనం అన్నిసంప్రదాయాలలోను,అన్ని దేశాలలోను దృఢంగా

నెలకొని ఉన్నవి. మఱొకవంక 18వ శతాబ్దపు వైజ్ఞానికపరిశోధనలఫలితంగా నాస్తిక, అజ్ఞేయ వాదాలు ప్రభంజనంవలె వీస్తూ ఆస్తిక్యాన్ని ఉజ్జూతలూగించినవి. మతమాఢ్యం ఈ వాదాలకు పుష్టికలిగిస్తున్నది. ఈ రెండు అపాయాల నుంచి ఒకేసారి మానవకోటిని రక్షింపగల ఉపాయ మొక్కటే. పాశ్చాత్యవిజ్ఞానపరంగా, ఆధునిక తార్కికవిమర్శకు నిలబడగలవిధంగా మతాన్ని, మతావశ్యకతను, మతసత్యాలను, ఆత్మవస్తువును నిరూపించడం. ఈ నిరూపణ వివేకానందస్వామి ఉద్యమానికి ప్రాతిపదిక. ఈ నిరూపణలో అతడు ప్రదర్శించిన ప్రతిభ అనితరసాధ్యం. తరువాత తరువాత పలువురు అతని అడుగుజాడలలో నడవ యత్నించారు. వారిలో కొందఱి ప్రయత్నాలు వెఱ్ఱితలలు వేసి, హాస్యాస్పదమై లక్ష్యానికే హాని చేసినవి. హిందువుల ఆచారాలు, నమ్మకాలు అన్నీ వైజ్ఞానికసత్యప్రతిష్ఠితము లని చూపడానికి కొందఱు ప్రయత్నించారు. శిఖయందు విద్యుచ్ఛక్తి కల దని, కనుక దానిని బహిర్గతం కానివ్వకుండా ముడివేయా లని, యజ్ఞోపవీతం దేహంలోని విద్యుచ్ఛక్తిని భద్రపఱుస్తుం దని, పంచములలో మలినతేజస్సు ఉంటుం దని, అందుచేత వారిని సమీపింపనివ్వకూడ దని బహిరంగంగా సభలలో ఘోషించడానికి కొందఱు తెగించారు.

## సందేశ సారాంశం

వివేకానందస్వామిచేసిన మతస్వరూపనిరూపణలో యథార్థమైనమత మేదో, ఏది కాదో తెలిసికోదలచినవారికి తేటతెల్ల మయినది. అతనిసందేశంలో తఱచు సంస్మరించుకొనదగిన కొన్ని ముఖ్య సూక్తు లివి :

"దివ్యత్వం ప్రతిజీవునియందు గర్భితమై ఉంది. దానిని సువ్యక్తంచేయడమే జీవిత గమ్యం. దీనిని కర్మచేతగాని, భక్తిచేతగాని, చిత్తవృత్తినిరోధంచేతగాని, వివేకంచేతగాని— ఏ ఉపాయంచేతనయినా, ఎన్ని ఉపాయాలచేత నయినా సాధించు. ఇదే మతం. సిద్ధాంతరాద్ధాంతాలు, నమ్మకాలు, నియమనిబంధనలు, ఆలయాలు, గ్రంథాలు, సంకేతాలు అప్రధాన ములు."

"మతసంప్రదాయంలో జన్మించడం మంచిదే గాని ఏనాటికీ సంప్రదాయాన్ని అతిక్రమించ లేకపోవడం, సంప్రదాయబద్ధుడుగానే చనిపోవడం దౌర్భాగ్యమే."

"వేదాలు, బైబిల్, ఖొరాన్, తదితరమత గ్రంథాలు అనంతదివ్యగ్రంథంలోని పుటలు. ఇట్టి పుట లింకా ఎన్నో లిఖింపబడవలసి ఉన్నవి."

స్వామీజీ "కర్మయోగము", "భక్తియోగము", "రాజయోగము' "జ్ఞానయోగము"—ఒకలక్ష్యాన్ని పెక్కుమార్గాల సాధించవచ్చు నన్న సూక్తికి భాష్యం. బైబిలులోని కొన్ని మహావాక్యాల కతడు చేసిన మనోహరమైన వ్యాఖ్య, ఏసునాథునిగుఱించిన అతని పలుకులు—"నాదేసత్యము" అనుకొనేవారికి కనువిప్పు కలిగించి, "నాదిమాత్రమే కాదు సత్యము" అనే జిజ్ఞాసను పురికొల్పగలవు; సత్య మెక్కరి సొత్తు కా దని నిరూపింపగలవు. ప్రతిజాతి, ప్రతివ్యక్తి తనఅంతఃప్రకృతి కనుగుణంగా సత్యాన్ని గ్రహిస్తూ, జీవితవిధానాన్ని సరిదిద్దుకొంటూ, నిత్యవికాసంపొందుతూ పరులకు ఉపయోగపడుతుండా లని వివేకానంద స్వామి హితవచనం.

# స్వామి వివేకానందులు

## శ్రీ పాటీలు తిమ్మారెడ్డిగారు, ఎం. ఏ.

"Swami Vivekananda, together with his brother disciples, founded the non-sectarian Ramakrishna Mission of Service. Rooted in the past and full of pride in India's prestige, Vivekananda was yet modern in his approach to life's problems and was a kind of bridge between the past of India and her present. He was a powerful orater and a graceful writer. He was a fine figure of a man, imposing, full of poise and dignity, sure of himself and his mission, and at the same time full of a dynamic and fiery energy and a passion to push India forward.

So Vivekananda thundered from Cape Comorine on the southern tip of India to the Himalayas, and he wore himself out in the process, dying in 1902 when he was thirty-nine years of age".—

—Jawaharlal's "The Discovery of India" *(Indian Edition, pp. 338-341)*

"స్వామి వివేకానందులు పాశ్చాత్యులకొఱ కవతరించిన సాక్షాచ్ఛంకరభగవత్పాదులు".

—కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణ

(చిరంతనానందస్వాములవారికి వ్రాసిన లేఖలో)

"అదేమి చిత్రమో కాని సర్వసంగపరిత్యాగియైనను స్వామి భారతదేశముపై తనకుగల గాఢాభిమానమును పరిత్యజింపలేకపోయెను. సమకాలీనభారతీయదుస్థితిని గాంచిన స్వామి హృదయసాగరమును మంథరసహస్రము లొక్కపెట్టున మథించెను. ఆ కరుణాళువు నా దేశమున జన్మించిన కుక్కయేగాని, దానికికూడ వలయునంతటి యాహారము లభించుదాక నాకు విశ్రాంతి లేదని యుద్ఘోషించెను".

—ఆర్ష విద్యాభూషణ జటావల్లభుల పురుషోత్తము

(విజయవాడకళాశాలలో ఒసగిన యొకయుపన్యాసమునుండి)

"నేడును భక్తి శాస్త్రవేత్తలు భక్తి శాస్త్రప్రచారకులు పెక్కు రున్నారు. కాని భక్తి శాస్త్రకారులుమాత్రము మరల నిద్దఱే. ఒకరు, మన మత మనాగరకులమతమని పాశ్చాత్యులు భావించుకాలముననే ఆపాశ్చాత్యు లేర్పఱచినసభలోనే తక్కినమతములకంటె హిందూమత మెట్లు గొప్పదో నిరూపించి యావత్ప్రపంచమునకు దిగ్భ్రమ గల్పించిన మహనీయులు వివేకానందులు. రెండవవారు, తమయాకస్మికమరణముచే శ్రీవివేకానందులు భారతజాతిభుజస్కంధములపై నిలిపి పోయిన భారమును తాము వహింతు మని నడుముకట్టి యకుంఠితదీక్షతో నవిరళకృషి సాగించిన ధీరోదాత్తులు శ్రీరామతీర్థులు. ఒకరు పాశ్చాత్యసభ్యప్రపంచము నుద్బోధింప నవతరించిక శంకర భగవానులు కాగా రెండవవారు రామానుజదేశికులు..."

—పాటీలు తిమ్మారెడ్డి

(శ్రీరామతీర్థస్వాములవారి "భక్తియోగము"ను సమీక్షించుచు '57 లో వ్యాసకర్త వ్రాసిన వాక్యములు)

"ఇచటికి వచ్చు ముముక్షువులలో నరేంద్రునకు నరేంద్రుడే సాటి. వీరిలో నొకడు అష్టదళపద్మము, మఱియొకడు షోడశదళపద్మము నైనచో నరేంద్రుడు సహస్రదళపద్మము".

—శ్రీ రామకృష్ణపరమహంస

(సోదరశిష్యులతో పరమహంసలు వివేకానందునిగూర్చి చేసిన ప్రశంస).

క్రీ॥ శ॥ 1875 సంవత్సరమున మధ్య ప్రాంతము. రవి యస్తమింపని బ్రిటిషు మహా సామ్రాజ్యమున రెండవమహానగరమగు కలకత్తా యది. యాతాయాతజనసంకీర్ణమగు నొకరాచబాట ప్రక్క చేరి యొక క్రైస్తవ ప్రచారకుడు తనమతధర్మముల నుపన్యసించుచున్నాడు. సకలజనులు చెవులు దోరబెట్టుకొని వినుచున్నారు. ఇంతలో నాపాదిరీ జన మధ్యమున నొక శతఘ్ని ప్రేల్చెను. "మీరు మూర్ఖులు. కొయ్యబొమ్మను దేవు డనువాడు మూర్ఖుడు గాక మఱేమి? మీ విగ్రహము దేవుడైనచో నాచేతి కఱ్ఱతో పూజింతును. నన్నేమి చేయునో చేయు మనుడు" అని యాతడు దిశలుపరికించెను. శ్రోతలు వెలవెల పోయిరి. ఒండొరుల మొగములు చూచుకొనిరి. ఎవ్వరికిని ఏమి చెప్పుటకును నోరాడలేదు. అంతలో పంద్రెండేండ్ల యీడు గల బాలు డొకడు ముందునకు వచ్చి "అయినచో నీకు దేవుడు లేడా?" యని యడిగెను. "లేకేమి? కాని యతడు మీ దేవునివలె విగ్రహము కాడు" అని సగర్వముగ ప్రచారకుడు పలికెను. "అయినచో నే నాతని తిట్ట వచ్చును గదా? అపుడు మీ దేవు డేమి చేయును?" అని బాలకుడు ప్రశ్నించెను. ఇట్టి ప్రశ్న కెదురుచూడని పాదిరీ తికమకపడి మండిపడి చిందులు త్రొక్కుచు "నీవు చావగనే నిన్ను నరకాగ్నిలో త్రోయు" నని యఱచెను. మందహాససుందర వదనారవిందముతో తొణకక ఆ బాలకుడు "ఆమాత్రముపని మావిగ్రహము చేయ జాలదని నీకు రుజు వేమి కలదు?" అని క్రమకంఠమున పలికెను. పాదిరీయొడలు కంపరమెత్తెను, చిఱుచెమటలు గ్రమ్మెను. తన విన్నబోయిన ముఖము గన్గొని ప్రజ లెల్ల చప్పటలు చరచి హసింప తలవాంచి యాపాదిరీ యెందో పోయెను.

ఆ బాలకుని పేరు నరేంద్రుడు. నరేన్ అనుట ముద్దుపేరు. పెద్దయై ద్యావాపృథువులునిండి బోరుకొనగ నద్వైతవేదాంతపాంచజన్యమును పూరించి విశ్వమును పులకింపజేసిన తేజోమూర్తి, ఈశ్వరప్రేరితమహావక్త, స్వామివివేకానందులే ఆ బాలమూర్తి. "ఐరోపాదేశీయులతో వ్యవహరించునపుడు మనము ముఖ్యముగా గమనింపవలసిన దాత్మగౌరవము. వ్యక్తుల ననుసరించి మనము వ్యవహరింపకుండుటచే మనలను వారు లోకువచేయుచుందురు. పరుల యెదుట మన పరువుమర్యాదలను కాపాడుకొనవలయును. లేనియెడల నవమానము పాలుకావలసివచ్చును". (వివేకానందచరిత్ర. పుట 179) అని యాయన యుద్బోధించెను. మన మంచితనము నశక్తతగా నపార్థము చేసికొనువారి నెదిరింపనిదే వారి యాట కట్టదు. వారల్లే మఱింత విజృంభించుటకు మనమై తోడు పడినవార మగుదు మని స్వామి యూహ. "కేవలవేదాంతశ్లోకములు వల్లించుచు పరుల యాగడములకు తలయొగ్గకుము. సజ్జనులకడ పరమసజ్జనుడవై దుష్టులకడ వారికంటె వందరెట్లెక్కువ దుష్టుడవై మసలినగాని నేటికృతఘ్ను

లోకము నీ మనుగడ నంగీకరింప'' దను సత్యమును గ్రహించినవారు స్వామివివేకానందులు.
(విశ్వనాథ సత్యనారాయణగారి యుపన్యాసభాగము)

దుందుభినామసంవత్సర పుష్య బహుళసప్తమీ సోమవారము (1863 జనవరి 12) ఉదయము హస్తానక్షత్రయుక్త ధనుర్లగ్నమున నించుమించుగా 6 గం॥ 34 ని॥లకు (సూర్యోదయాత్పూర్వ మాఱు నిముసములకు) భువనేశ్వరీవిశ్వనాథుల పున్నెముల పంటగా స్వామి కలకత్తానగరమున జనన మందెను. తన ముప్పదితొమ్మిదవయేట శుభకృన్నామ సంవత్సర జ్యేష్ఠబహుళచతుర్దశీ శుక్రవారము (1-7-1902) నాడు, తానరుదెంచి నిర్వహింపవలసిన కార్యముల నెల్ల నిర్వహించి కృతకృత్యుడై స్వామి పరమేశ్వరునియం దైక్యమయ్యెను.

ప్రాచ్యపాశ్చాత్యాధ్యాత్మికవిజ్ఞానప్రవాహములకు స్వామి సంగమస్థానము. సమకాలీన భారతదేశమున సమస్తప్రజలు ముఖ్యముగా నిరుతెగలు. ఒకరు, మతశబ్దమునకు దురర్థము సంఘటించి మతమును కేవలాచారములకు బానిసను జేసిన సనాతనధర్మపరాయణులు. రెండవవారు, పాశ్చాత్యనాగరకతాశంపాచ్ఛటాప్రభావమున కనులు మిఱుమిట్లుగొని భారతీయసహజౌన్నత్యము నెఱుగ జాలక అంధానుకరణముగ పాశ్చాత్యులవెంట పఱచువారు. వీరే భారతజాతిపతనమునకు ముఖ్యకారణము. ఈ యిరుతెగలవారిని వివేకానందు డేవగించుకొనెను. దోషభూయిష్ఠములగు రెండుమార్గములను సంస్కరించి సమన్వయపథమున జాతిని నడిపించుటకు స్వామి మిక్కిలి పాటుపడెను. ''నాకు కావలసినది సజీవమతము. వంటయింటిమతము కా''దని స్వామి 'వక్కాణించెను.

''శాకాహారులుకూడ కొంచెము నీరుల్లి వెల్లుల్లులను తిన నిచ్ఛగింతురు. కాని హిందూశాస్త్రములు వానిని నిషేధించినవి. బ్రాహ్మణులకు వెల్లుల్లి తినుట పాపము. అవి తినువారు కులభ్రష్టు లగుదురు. కావున సదాచారనిష్ఠగల హిందువులు నీరుల్లి వెల్లుల్లులను విసర్జించి వానికిబదులు ఆరెంటికన్న గాఢమగు దుర్వాసన గల పరమచండాలపు ఇంగువను వాడుకొననారంభించిరి. అం దేమి దోషము గలదు? శాస్త్రములు వాని పే రెత్త లేదు గదా?'' (ప్రాచ్యము, పాశ్చాత్యము పుటలు. 89, 90) ఆచారములపేరిట జరుగు దురాచారములను స్వామి నిర్దాక్షిణ్యముగ ఖండించి యున్నాడు.

పాశ్చాత్యజాతుల వెంటపడి పరుగుతీయువారి నుద్దేశించి యి ట్లనుచున్నాడు. ''భౌతిక విజ్ఞానమున పాశ్చాత్యు లెట్టి ఘనత వహించినను పారమార్థికవిషయములలో వారి కింకను నక్షరాభ్యాసమే కాలేదు. భౌతికవిజ్ఞానము క్షణికసంపత్తిహేతువు. పరవిద్య శాశ్వత బ్రహ్మానందదాయకము. అమృతత్వ మనునది లే దనుకొన్నను ఆదర్శములుగా గ్రహింపబడిన ఆధ్యాత్మికాశయములచే కలుగు ననుభవము బహుసూక్ష్మము విశేషానందదాయకమునై యొప్పును. లౌకికచింతామాధ్యమో, అర్పరాని తృష్ణను స్పర్థను పుట్టించి తుదకు వ్యక్తిని సంఘమునుగూడ నశింపజేయును.'' (వివేకానందలేఖావళి. 2-వ భా. పు 129) ''హిందువులయం దెన్నియో లోపములు కలవు.... ఆబాధ్యత హిందూమతముది కానే కాదు. క్రైస్తవులు మాంత్రికురాండ్రను చంపి తగులబెట్టినబాధ్యత క్రైస్తవమతముదా?'' (హిందూమతము పుట 26) ఓభారతీయులారా ఈమహా

ప్రమాదమును గుర్తింపుడు. పాశ్చాత్యాను కరణపిశాచము మిమ్మావహించియున్నది. మంచిసెబ్బరలు వివేకముచే విచక్షణచే మీ రీరికనెంత మాత్రము నిర్ణయించుకొనుటలేదు. పాశ్చాత్యులు - శ్వేతముఖులు కొనియాడిన భావము లెల్ల, ఆమోదించిన యాచారము లెల్ల మంచివి. ఇక వారికి రుచింపని వెల్ల వారు దూషించిన వెల్ల చెడ్డవి. మౌఢ్యమున కింతకంటె ప్రత్యక్షనిదర్శన మే ముండును ? మనయాచారము లన్నియు రమణీయము లనుట లేదు. కాని అవి మూలబడవలయు ననుటకు పాశ్చాత్యుల నిరసనమే ప్రమాణ మన్నచో కాదనుట మన కర్తవ్యము.... ప్రస్తుతలేఖకునకు (స్వామికి) పాశ్చాత్యసమాజమునుగూర్చి కొంచెము ప్రత్యక్షజ్ఞానము కలదు. తన్మూలమున నాతనికి గలిగిన నిశ్చితాభిప్రాయ మే మన—ప్రధానగమనవిషయమునను గమ్యవిషయమునను ప్రాచ్యపాశ్చాత్య సమాజములనడుమ అపారమగు భేద ముండుటచే పాశ్చాత్యానుకరణమై యే సంప్రదాయము బయల్వెడలినను అది విఫలమైపోవును.'' (వివేకసూర్యోదయము, పుటలు 125, 126)

అల్పబుద్ధియగు నొక యువకుడు శ్రీరామకృష్ణుని సమక్షమున నెప్పుడును శాస్త్రములను నిందించువాడు. ఒకనా డాతడు గీతను విశేషముగా ప్రశంసించెను. అంతట శ్రీరామకృష్ణు డిట్లు వచించెను : ''చూచితిరా! ఎవరో ఐరోపా పండితుడు గీతను ప్రశంసించె ననుకొందును. కావున నీతడును ప్రశంసించినాడు'' అని.

భారతీయుల ఈ భావదాస్యమునకు కారణము వారికి సక్రమమగు విద్య లేకపోవుటయే. ''అన్యభాషలో అన్యులభావములను బట్టీపట్టి -వానిని మెదడునిండ దట్టించుకొని యే విశ్వవిద్యాలయబిరుదమో సంపాదించి విద్యావంతుల మనుకొనుచున్నారు. ఇదియా విద్య ? మీ విద్యాగమ్య మేమి ? గుమాస్తాగిరియో, లాయరుపదవియో, ఉత్తమపక్షము-మేజస్ట్రీటో? ఇంతే కదా ? దానివలన మీకుగాని మీ దేశమునకుగాని యేమి పురుషార్థము ? ... మన మెందులకును కొరగానివార మని వట్టియనామ తరువుల మని నేర్చుకొనియున్నాము. మనదేశమున మహనీయు లుద్భవించియుండి రని మన చదువు మనకెన్నడును బోధించిన పాపమున బోలేదు. సార్థకవిషయములు మన కెన్నడు బోధింపబడలేదు. ... ఐరోపాధీసంజాతమైన యే నాలుగుముక్కలో ముక్కున కంటించుకొని వాని నేకరువుపెట్టుచు యావదాత్మను ముప్పది రూకల గుమాస్తాపదవి కమ్ముకొని ... మీ రిపుడు చేయుచున్న దేమి ? మిమ్ములను మీ పుస్తకములను మీ గౌనులను మీ విశ్వవిద్యాలయబిరుదములను సమస్తమును ముంచివేయ జాలినంత నీరు సముద్రమున లేదా ?'' (వి.సూ. పుటలు 80, 83, 135)

ఎన్నడును స్వామి సకలజనులు తనమాట తుచ తప్పకుండ అనుసరింపవలయునని కోరడు. ఆయన చేసినది సత్యాన్వేషణము సత్యప్రచారమే కాని సనాతనధర్మప్రచారముకాదు. ''ప్రతివానిని మనభావమునకే కట్టుపఱచియుంపవలె నని నియమము మనకు లేదు. ప్రతివానిని మనపద్ధతులనే అనుసరించి జీవింపు మని మన వ్యాఖ్యానమునే అంగీకరింపు మని బలాత్కరించుట పాపకృత్యము'' (హిం. మ. పుట 67) అని ఆయన పేర్కొన్నాడు.

అంధానుకరణ మువజ్ఞకు కుఠారాఘాతము ఏ విషయమునైనను పూర్వాపరసందర్భములు,

ఔచితి పరిశీలింపక గ్రుడ్డిగా అనుసరింపరాదు. దేశకాలపాత్రముల ననుసరించి యొకచో గ్రాహ్యమగునది మఱొకచో పరిత్యాజ్యము కావచ్చును. దానికి వివేచన యావశ్యకము. "గురువును పూజింపుము, సాక్షాద్భగవంతునిగా నారాధింపుము. కాని అంధప్రాయముగా వానిమాటల ననుసరింపకుము. పూర్ణ గురుభక్తుడ వయ్యును నీయాలోచన వీడకుము" (వి. సూ. పు. 97) అని స్వామి ఉద్ఘోషించియున్నాడు. ఎవ్వరిని కాని పరీక్షింపక విశ్వసింపరాదు. శ్రీరామకృష్ణవివేకానందులే పరస్పరము పరీక్షించుకొనిరి!!! 'వర్తకులు నాణెమును పరీక్షించునట్లు నన్ను పరీక్షింపుము. పూర్తిగా పరీక్షించిననే కాని నా మాటలు పూర్తిగ అంగీకరింపవలదు' అని రామకృష్ణుడొకప్పుడు వివేకానందునకు తెలిపెను. (శ్రీరామకృష్ణునిజీవితచరిత్ర, పుట 312)

తన దేశమన్న స్వామి కెంత యభిమానమో దరిద్రనారాయణు లన్న నంత యభిమానము. 'నాదేశమున నొక కుక్క పస్తున్నను నేను స్వర్గమునుకూడ పరిత్యజించెదను. జనసామాన్యమును మన మలక్ష్యము చేసితిమి. వారిని త్రోసిపుచ్చితిమి. దానితో జాతిపతన మారంభమైనది. ప్రస్తుతము రాజకీయవ్యవస్థ కంటె సామాన్యజనమునకు కూడు, గుడ్డ, విద్య ఇచ్చి ఉద్ధరింపనిచో మనజాతి వికాసమునకు వేఱొండు మార్గము లేదు' అని స్వామి పేర్కొన్నాడు. (శ్రీరామకృష్ణప్రభ. 19 సంపు. పు. 174) అభ్యుదయము నొందవలయు ననిన మీ కర్మకలాపమును గంగలో గలిపి సజీవదైవమును మానవదైవమును ప్రతిమానవ రూపుని విశ్వమునందే కాక ప్రతివ్యక్తియందును వెలయు భగవంతుని ఆరాధింపుడు. ... కాశీయందును, బృందావనమందును గణగణ గంటలు మ్రోగుటకు లక్షలు వ్యయింపబడినవి. సజీవప్రత్యక్షదైవము తిండి లేక మలమలమాడుచున్నపు డేమి చేసితిరి? తోడిమానవులకు ప్రాణముమీదికి వచ్చినపుడు వా రేమియు చేయరు కాని బొంబాయిలోని బనియాలు (వైశ్యులు) నల్లులయోగక్షేమార్థము ఆసుపత్రులను కట్టించుచున్నారు. వెండిబంగారపు ప్రమాణములను (గోల్డ్ అండ్ సిల్వర్ స్టాండర్డ్సు) గూర్చిన చిక్కు లన్నియు నాకు తెలియవు. ఆమాటకు వచ్చిన నెవ్వరికిని తెలిసినట్లు కనబడదు. కాని సువర్ణప్రమాణము పేదలను మఱింత పేదలుగను ధనికులను మఱింత ధనికులుగను చేయుచుండుటమాత్రము స్పష్టము. సామ్యవాదమున లోపములు లేవని కాదు కాని, లేనిబావకంటె గ్రుడ్డిబావ మేలు కాబట్టి నేను సామ్యవాదిని (I am a socialist) ...మఱెందుకు గాకున్నను కేవల నవీన మని యైనను ఈమార్గ మవలంబించి చూతము గాక' అని స్వామి ఘోషించెను. (లేఖావళి, 2-వ భా. పు. 64-65, 107-108)

స్వామి గొప్పసంఘసంస్కర్త. "మనసంఘమందలి మహాలోప మిది. దీనిని మనము తొలగించుకోవలయును. జాతీయభావముగల సంఘము నిర్మింపబడవలయు నన్నచో విద్య గఱపి జనసామాన్యమును లేవనెత్తవలెను. పుం డెచట నున్నదో మనసంఘసంస్కర్తలు చూడరు. విధవావివాహములమూలమున వారు మనసంఘము నుద్ధరింప దలతురు. సంఘసముద్ధరణము విధవలకు లభింపగల భర్తలసంఖ్యపై ఆధారపడియుండు ననియా మీయభిప్రాయము? దోసము మనసనాతనధర్మమున కంటగట్టి

దగదు....ఉన్న లోప మంతయు నిది - కుటీర మున నివసించు నిజమైన సమాజము, తన మానవత్వమును వ్యక్తిత్వమును గోల్పోయి నది... పేదలు కోల్పోయిన వ్యక్తిత్వమును తిరిగి వారి కొసగవలయును. విగ్రహములు నిలుచునా నిలువవా, విధవలకు వలసినంతమంది భర్తలు దొరకుదురా లేదా, వర్ణవ్యవస్థ మంచిదా చెడ్డదా, ఇట్లు లేనిపోని సమస్యలతో తాపత్రయపడుట సంఘసంస్కరణమా ? (వి. సూ. పుటలు 133-134) "హిందూదేశములోనున్న కొల్లదిమంది బ్రాహ్మణులకుమాత్రమే ధర్మాధికారమట. ఆచారములలో గల తత్త్వార్థము సంగ్రహముగా నిది - నేను పరిశుద్ధుడను, లోకమంతయు నశుద్ధ మనుట. ఘోరరాక్షసమతమిది.... చేతులను శుద్ధిచేసికొనుటకు గాను పండ్రెండుసార్లు మట్టిపెచ్చి తోముకొనని యెడల పితరులు పదునాలుగు తరములవారా, అధోగతి పాలగువారు, ఇరువది నాలుగుతరములవారా?" జనాభాలో నాల్గవవంతు తిండిలేక పస్తుండగా నీవిధమైన ధర్మసూక్ష్మములను రెండువేలయేండ్లనుండి చర్చించుచున్నారు.... బ్రాహ్మణునికంటె విద్య విశేషముగా చండాలునికే యావశ్యకము. బ్రాహ్మణపుత్రున కొక గురువు కావలసియున్నచో చండాలపుత్రునకు పదుగురు కావలసియున్నారు. కమ్మరవీథిలో సూది లమ్మ నేల?" (లేఖావళి 2-వ భా. పు. 67-69) ఇక భారతదేశ ముద్ధరింపబడవలయు నన్నచో సామాన్యజనులే దిక్కు. అగ్రవర్ణములు నేడు కేవలమృతప్రాయులు (The discovery of India, p. 340) అని స్వామి చాటెను. అట్లని స్వామికి బ్రాహ్మణవిద్వేషమని కొందఱు ప్రచారము చేసిరి. వారికి స్వామి యెట్టివాడో తెలియదు. 'తత్త్వబోధనలకు ముందన్నపానములు సమకూర్చి జనసామాన్యస్థితిని బాగు చేయవలయును. ఇందులకై జనులలో విద్యావ్యాప్తి చేయుట త్యావశ్యకము. అట్లుచేయక బ్రాహ్మణులను పండితులను నిందింపరాదు. ఏలన భారతీయవిజ్ఞానఖనులగు వేదశాస్త్రములను నిలువబెట్టినవారు బ్రాహ్మణులే. వారు లేనిచో భారతసంస్కృతి ఈపాటి కంతరించియుండెడిది (వి. సూ. పు. 145)" అని స్వామి హెచ్చరించియున్నాడు. సమాజమునం దొకస్వార్థపరుడు స్వలాభాపేక్షతో గావించిన తప్పిదమునకై సమస్తసమాజమును నిందించుట బుద్ధిహీనత గాదా ?

భారతోద్ధరణకు భారతస్వాతంత్ర్య మత్యావశ్యక మని స్వామి పదేపదే చెప్పినను సమకాలీనరాజకీయములను రాజకీయవేత్తలను తిరస్కరించెను (The discovery of India p. 339) 'రాజకీయమార్గ్యములో నాకెట్టి సంబంధమును లేదు. రాజకీయమున నాకు లేశమును విశ్వాసము లేదు. ప్రపంచములో భగవంతుడు పరమార్థము - ఇవియే నా రాజకీయములు. మిగిలిన దంతయు చెత్త' అని స్వామి యొకలేఖయందు పేర్కొన్నాడు. (పుట 62) 'ధనికులకును కార్మికులకును నడుమ కక్షలను కార్పణ్యములను మాత్రము నీవు వెలువడజేయరాదు. ఈవిషయమున నీవు జాగరూకతతో మెలగవలయును. సంపన్నజాతులను దూషింపబోకుము' (పుట 192) అని స్వామి రాజకీయవేత్తలకుపదేశించుచున్నాడు. వర్గకలహమును ప్రోత్సహించుట జాతినిపతనావస్థకు మఱింత చేరువగా కొనిపోవుట యని స్వామి విశ్వాసము. జాత్యుద్ధరణమునకు వల

యునది సామరస్యము. జాతియందు పాదుకొని యున్న యనైక్యబాహుళ్యమునకు మఱొకటి జోడించుట స్వామికి ఎన్నటికిని ఇష్టము లేదు.

'చెన్నపురి కొకరిని బొంబాయి కొకరిని వెళ్లనిండు. లోకము అల్లల్లాడిపోవలయును. ఆహా! నావంటిరాక్షసు లిద్దఱుముగ్గురు దొరకినయెడల ప్రపంచము నఱ్ఱాతలూగించి వైచి యుందును. కాని నేను ప్రస్తుతము నెమ్మదిగా నడువవలసియున్నది' (లేఖావళి, పుట 87) అని స్వామి యా వేదనపడినాడు. శ్రీరామకృష్ణ సేవాసంఘముస్థాపించి స్వామి యెందఱు మహనీయులను తయారుచేసెను! 'హిందూ వేదాంత కంఠీరవమూర్తి శ్రీ వివేకానందస్వామివారు తనపశ్చిమఖండ దిగ్విజయ యాత్రానంతరము భారత దేశసంచారంలో లాహోరు వచ్చి ఒక వారం ధర్మోపన్యాసాలు చేశారు. సనాతన ధర్మసభాపక్షంలో రాముడు (రామతీర్థ గోస్వామి) స్వామివారి ఉపన్యాసాలు కొన్ని ఏర్పాటుచేశాడు. శివకేశవులకువలె వారిరువురికి సమాగమం జరిగింది. వివేకానందస్వామివారి తోడి సమాగమం రామునిలోని వైరాగ్య దావానలానికి ఒకఝంఝామారుతమై యుండ వచ్చు. (రామతీర్థ జీవితోపదేశములు పుటలు, 88–89) తన ఆకస్మిక సాయుజ్యపదప్రాప్తిచే స్వామి భారతీయులపై వైచిపోయిన భారమును వహించి దీక్షతో పనిచేయ రామతీర్థస్వామి నడుముకట్టెను. కాని హిందూమత మేమి పాపము చేసికొన్నదోగాని దానిని నిస్సహాయ స్థితిలో వదలి మఱినాలుగేండ్లకే రామతీర్థ స్వామియు వివేకానందు ననుగమించెను.

క్రేళ్లుఱుకుచు వచ్చు గాంగఝరీతుల్యమగు మహోదాత్తవక్తృత్వవైభవము స్వామి కా జన్మసిద్ధము. విశ్వమతమహాసభయం దతి కష్టముపై స్వామికి మాటాడుట కైదు నిముసములు వ్యవధి యిచ్చిరి. కాని స్వామి సహజ గంభీరవచోధోరణికి ముగ్ధులై కాలజ్ఞానము మఱచి గంటలతరబడి కూర్చుండి పోయిరి. అచట స్వామి కాంచిన ప్రశంసలు నిర్వహించిన ఉద్యమము జగద్విదితము. స్వామి యుపన్యాసానంతరము సభనుండి యీవలకువచ్చుచు నొక క్రైస్తవుడు "ఆమహానీయుని దేశీయులవద్ద కా మన క్రైస్తవమతబోధకులనుబంపుట! వారే మనయొద్దకు పంపు టుచిత"మ్మని పేర్కొనెనని బీసెంటువనితామణి వ్రాక్రుచ్చెను. సరిగా నిట్లే స్వమతాభిమానపూరితమగు న్యూయార్క్ హెరాల్డు పత్రికకూడ వ్రాసెను. (వివేకానంద జీవితచరిత్ర, పుటలు 195–196).

విశ్వమతమహాసభవలన స్వామి యొక్క వాఙ్నేతృత్వము, నాల్గు ప్రసిద్ధయోగములను గూర్చిన స్వామిపుస్తకములవలన నాతని శాస్త్రవైపశ్చిత్యము, ప్రాచ్యము – పాశ్చాత్యము, కులము – సంస్కృతి – సామ్యవాదము, వివేక సూర్యోదయము మొదలగు గ్రంథములచే స్వామిసమన్వయమార్గము సకలజను లెఱుగుదురు. కాని స్వామిభావుకుడగు మహాకవి యని లోకమున కొందతే యెఱుగుదురు. Let Syama Dance, The Song of Sanyasin వంటి యమరకృతులు స్వామిలేఖినినుండి వెలువడు నదృష్టమునకు నోచుకొన్నవి.

"భారతవర్షము నశించెనా ప్రపంచమందలి పారమార్థికత యంతయు నశించును; నైతిక పరిపూర్ణతయంతయు నశించును; దివ్యానంద సంధాయకమగు మతసానుభూతియంతయు నశిం

చును; ఆదర్శజీవనమంతయు నశించును. ... వత్సలారా, ధీరోదారులారా, సహృదయులారా, ఉజ్జ్వలదీప్తోదక్షులు కండు. ... ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత—లెండు మేల్కొనుడు. పరమపదప్రాప్తి పర్యంతము నాగవల దని వేదము లుద్ఘోషించుచున్నవి. లెండు, లెండు. దీర్ఘనిశీథము పటాపంచ లగుచున్నది. ఉత్సాహతరంగము బయల్వెడలినది. ... ఘనకార్యములు జరుగవలసియున్నవి. భావిభాగ్యోదయముతో పోల్చిచూచినచో నీ యల్పవిజయ మే పాటిది? నమ్ముడు, నామాట. భారతదేశ ముద్ధరింపబడి తీరును. ... ఆనందింపుడు, ఆధ్యాత్మికవాహిని బయల్వెడలినది. అపారము అప్రతిహతము సర్వాప్లావమునై యీ దివ్యవాహిని భారతభూమిపై ప్రవహించుట నాకు ప్రత్యక్షమై కాన్పించుచున్నది. ... వత్సలారా, ముందంజవేయుడు. లోకమున కంతకును వికాస మత్యావశ్యకమై యున్నది. దానికై లోకము వేచియున్నది. భారతదేశమన నే ఆ వికాసము జ్ఞానతేజము కలదు. ... అలసత గతించుచున్నది. మనభారతాంబ తన దీర్ఘనిద్రనుండి మేల్కాంచుచున్నది. అంధులు కన జాలకుందురు గాక. కుత్సితమతులు కన నొల్లకుందురుగాక! ఆమె నెవ్వరు నిక ప్రతిఘటింపజాలరు. మనభారతమాత మరల నిద్రపోబోదు. ఏ బాహ్యశక్తియు నామె నిక నిరోధింపజాలదు. అఖండభారతశక్తి విజృంభించుచున్నది. ... ఓ వీరభారతపుత్రా, ధైర్యము వీడకుము. నేను భారతీయుడ నని గర్వింపుము. ... కటిమాత్రవస్త్రధారివగు నీవును ఇట్లు ఘోషింపుము—'భారతీయుడు నా సోదరుడు, భారతీయుడు నా ప్రాణము. భారతీయ దేవతలే నా దేవతలు. భారతీయసంఘము నా బాల్యడోలిక, యౌవననందనవనము, వార్ధకవారణాసి.' సోదరా, ఇట్లు చాటుము — 'భారతభూమి నామహోన్నతస్వర్గము. భారతశ్రేయమే నా శ్రేయము.' అహర్నిశ మిట్లు ప్రార్థింపుము— ఓ మహేశ్వరా, ఓ లోకేశ్వరీ, నాకు మానవత్వమును ప్రసాదింపుడు. నా దౌర్బల్యము తొలగింపుడు. నన్ను ధీరు నొనర్పుడు.'' (వి. సూ. పుటలు 142-145, 140) ఓహో! ఎంతటి యుద్వేగకరములు, ఎంతటివిశ్వాసపూరితములు, ఎంతటిప్రగాఢజాతీయాభిమానబంధురములు. భారతీయసంబంధిశబ్దము తనహృదయఫలకముపై కాలూదినంతమాత్రమున స్వామి లేఖిని మహోగ్రతాండవము సేయును.

నలువదికోట్లమంది భారతీయులు నలువది శతాబ్దములలో చేయజాలని మహత్తరకార్యమును ఒక్కస్వామి నలువదిశరత్తులైనచూడక మునుపే నిర్వహించి లోకము నాశ్చర్యచకితము గావించియున్నాడు. గమ్యముచేరుటకు మన మిపుడు క్రొత్తగా డొంకదారులు వెదికి కొనన వసరము లేదు. స్వామి నిర్మించిన మహత్తర ఘంటాపథము నాశ్రయించినచో నది మానవ జీవనపరమగమ్యమును చేర్చి తీరు ననుట నిస్సంశయము.

ఆహా! స్వామి యెంత దర్శనీయుడు. ఉన్నత ఫాలము, ఆకర్ణాంతాయతనేత్రయుగళి, కొట్టవచ్చిన ట్లున్న నాసిక, వదనమండలము నావరించిన గాంభీర్యము, లోకాలోకములయందలి సర్వవిషయముల నలవోకగా నాకళించుకొనగల దృష్టితైక్ష్ణ్యము, ఆజానుబాహుత, ఉత్తుంగ

భుజత, వ్యూఢోరస్కత — దర్శనమాత్రము ననే ఎట్టినాస్తికునికరములనైనను లలాటతలమున జేర్పక మానవు.

ఇట్టిసుపుత్రుని గన్న భారతమాత యేమి పున్నెములు నోచుకొన్నదో! పురాణమహర్షులుద్భవించిన భారతదేశమున, వివేకానందుని వంటి మహనీయమహోమూర్త్యావిర్భావము జరిగిన భరతఖండమున జన్మింపనోచుకొనిన మన యదృష్ట మెంత దొడ్డదో!



# వార్తలు, విశేషాలు

## సెయింట్ లూయీ వేదాంతసొసైటివారి కార్యక్రమ నివేదిక
## ఏప్రిలు 1961 నుండి మార్చి 1962 వఱకు

ఈసొసైటి కార్యనిర్వాహకులు (శ్రీసత్ప్రకాశానందస్వాములు. జరిగిన భానువారపూజలు మొత్తము నలభైఐదు. ఎండ ఋతువులో ఆఱువారాలపాటు మామూలు పూజలు ఆపి పెట్టబడినవి. కాని వేదాంతవిద్యార్థులు ధ్యాన ప్రార్థనల కొఱకున్నూ స్వామి ఉపన్యాసాలను వినుటకున్నూ నియతవేళలలో సమావేశమౌతుండినారు. మంగళవారాల సాయంవేళలలో స్వామి ధ్యానము జరిపి, శ్రీమద్భాగవతమున పదునొకండవ అధ్యాయము వివరించి చెప్తూఉండినారు. క్రొత్తసంవత్సరప్రారంభాన స్వామి భగవద్గీతను ప్రారంభించారు. జరిగిన మంగళవారాల సమావేశాలు మొత్తము నలభైఆఱు. సొసైటిమండపంలో స్వామి రెండు ప్రత్యేకసమావేశాలు జరిపారు. మత చర్చలకై వచ్చిన ప్రెస్బిటేరియను చర్చిల యువకులకుగానున్నూ పెద్దలకుగానున్నూ జరిగిన మొదటి సమావేశంలో, వారడిగిన ఇరవైనాలుగు లిఖితప్రశ్నలకు స్వామి సమాధానం చెప్పారు. రెండవసమావేశము జెన్నింగ్సుహైస్కూలు 12-వ గ్రేడు విద్యార్థులకుగాను. రికార్డుచేయబడ్డ స్వామి ప్రసంగాన్ని విని వారడిగిన ప్రశ్నలకు స్వామి సమాధానాలు చెప్పారు. ఈ సంవత్సరంలో ఇక్కడికి శ్రీ ప్రభవానందస్వాములున్నూ, శ్రీ శాంతస్వరూపానందస్వాములున్నూ, శ్రీ శ్రద్ధానందస్వాములున్నూ చెఱి ఒకసారి విచ్చేశారు. ఒక్కొక్కరు విచ్చేసినప్పుడున్నూ ప్రత్యేకమైనవిందు, ఒక ప్రత్యేక సభయున్నూ జరుపబడింది. విచ్చేసిన స్వామి, ఉపన్యసించి, శ్రోత లడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పారు. శ్రీకృష్ణ – బుద్ధ – శంకర – శ్రీరామకృష్ణ – మాతృదేవి – వివేకానంద – బ్రహ్మానంద ప్రముఖుల జయంతులప్పుడున్నూ, క్రిస్త్మసు ఈస్టరు సందర్భాలలోను ప్రత్యేకపూజారాధనలు జరుపబడినవి. శ్రీరామకృష్ణుని జయంతి

నాడు మాత్రము భక్తులకు భారతదేశీయమైన విందు పెట్టబడింది.

శ్రీ సత్ప్రకాశానందస్వాములు న్యూయార్కు బోస్టనుకు ప్రావిడెన్సుకు పోయి అచట వేదాంత కేంద్రాలలో ఉపన్యాసాలు చేసి, శ్రీ అశోకానందస్వామివారి ఆధ్వర్యాన శాన్ ఫ్రాన్సిస్కోలో వేదాంతకాన్వెంటులో జరిగిన ఉత్సవంలో అచటి ప్రసంగాలలో పాల్గొన్నారు.

ఈ సంవత్సరకాలంలో యునైటెడ్ స్టేట్సులో పలుతావులనుండిన్ని వేఱుచోట్లనుండిన్ని దాదాపు నలభై మంది అతిథులు సొసైటికివచ్చి, స్వామివారిని దర్శించి, పూజాకలాపాలలో పాల్గొన్నారు.

సొసైటిసభ్యులు సొసైటిగ్రంథాలయంలోని గ్రంథాలను చక్కగా వినియోగించుకొన్నారు.

## శ్రీవివేకానందస్వాముల శతతమ జయంతి మహోత్సవం

ఈ మహోత్సవనిర్వహణకై ఒక కమిటి ఏర్పఱుపబడింది. శ్రీ వివేకానందస్వాముల జీవితసంక్షేపం చేర్చి శ్రీనిఖిలానందస్వాములు సంకలించిన దాదాపు రెండువందల గ్రంథాలు స్వామిజివి విశ్వవిద్యాలయాలకు కళాశాలలకు గ్రంథాలయాలకు అందజేయడం మహోత్సవ ప్రణాళికలో ఒకపనిగా చేర్పబడింది. స్వామిజీ విషయికంగా కళాశాలవిద్యార్థులకు వ్యాస రచనలో పోటీ జరిపి వరిష్ఠవ్యాసానికి నూఱు డాలర్ల బహుమతి ఇచ్చేటట్లు తీర్మానింపబడింది.

## శ్రీరామకృష్ణమఠము, మద్రాసు - 4
## క్రైస్తు జయంతి

తే 24-12-1962 ది నాడు సాయంకాలం 7 గంటలప్పుడు మఠమండపంలో చక్కగా అలంకరింపబడ్డ క్రైస్తుచిత్రపటం ఎదుట, దీపాలంకరణలున్నూ బహువిధోపహారాలున్నూ అమర్చి సమాశిష్టులైన భక్తులసదస్సులో మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలుఛేర్మెను డాక్టరు పి. వి. చెరియనుగారు జీససుక్రైస్తుజీవితసందేశాలను గుఱించి ఉపన్యసించి నైరృతిభారతమున అతి ప్రాచీనకాలంనుండి అవిచ్ఛిన్నంగా సాగుతూవస్తూన్న తమసంప్రదాయాల విశేషాలను ప్రస్తుతించారు.



## ఆంధ్రలో వివేకానంద శతజయంత్యుత్సవ సన్నాహాలు

### వివిధ జిల్లాలలో సమితుల ఏర్పాట్లు

### విశాఖపట్టణం జిల్లా

స్వామి వివేకానంద శతజయంతి మహోత్సవ సమితి' పేరుక్రింద విశాఖజిల్లాలో శ్రీ తెన్నేటి విశ్వనాథం, ఎమ్. ఎ; బి. యల్; యమ్. ఎల్. ఎ. గారి అధ్యక్షతన జిల్లాసమితి ఏర్పాటయింది. జిల్లాలోని వివిధ నగరాలకు, గ్రామాలకు చెందిన దాదాపు 90 మంది ప్రముఖులు డిసెంబరు 30 వ తేదీన విశాఖపట్నంలో డాక్టర్ బెండపూడి పేరిరాజుగారి గృహంలో సమావేశమై, 17-1-63 నుంచి 31-1-63 వరకు, వివేకానంద జయంత్యుత్సవములు జరిపి, కన్యాకుమారిలోని వివేకానంద శైలముపై

శ్రీ స్వామివారి కాంశ్య విగ్రహ ప్రతిష్ఠ నిమిత్తమై నిధులు సేకరించుటకు, ఈ క్రింది కార్య వర్గమును ఎన్నుకొన్నారు.

అధ్యక్షులు : శ్రీ తెన్నేటి విశ్వనాథం, యమ్ ఎల్.ఎ., ఉపాధ్యక్షులు : శ్రీ కె. యస్. దత్తు, శ్రీ స్వామి అవిముక్తానంద, శ్రీ ఆర్. సి. రౌత్ (విశ ాఖపట్నం), శ్రీ వి. వి. రమణ, శ్రీ బి. హెచ్. విశ్వనాథం (అనకాపల్లి), శ్రీ యమ్. రామమోహనరావు (విజయ నగరం); కార్యదర్శి : శ్రీ డి. శివప్రసాద్, బి. ఎ. (విశాఖపట్టణము); సహకార్యదర్శులు : శ్రీ డి. బంగార్రాజు, బికామ్., ఎమ్.బి.ఎ., శ్రీ సి. హెచ్. శ్రీరామమూర్తి, శ్రీ కె. కె. బెనర్జీ, శ్రీ బి. కుమారస్వామి, బి. ఎ., శ్రీ పి. పాపారావు, బి. ఎ. బి. యిడి; కోశాధికారి : శ్రీ బి. పేర్రాజు, యం.బి.బి.యస్; సభ్యులు : శ్రీ జి. వెంకటపతిరాజు, ఎమ్. ఎ. (ఆనర్సు), శ్రీ జి. ఈశ్వరవర్మ, ఎల్.ఎమ్.ఇ., శ్రీ ఎ. రామమూర్తి, ఎమ్. ఎ., డాక్టర్ స. సర్కార్, శ్రీ కె. యస్. ఎ. ఎన్. రాజు, ఎమ్. ఎ., శ్రీ కె. శ్రీనివాసరావు, అడ్వొకేట్, (విశాఖపట్నం), శ్రీ ఆర్. ఆదినారాయణ (అనకాపల్లి).

## కర్నూలు జిల్లా

కర్నూలు జిల్లాలో ఈ క్రింది ప్రముఖులతో శ్రీ వివేకానంద శతజయంతి మహోత్సవసమితి ఏర్పడింది.

అధ్యక్షులు : శ్రీ కె. అనంతరామ్‌సింగ్; ఉపాధ్యక్షులు : శ్రీ యిల్లూరు ఎల్లయ్య సెట్టి, శ్రీ కె. అచ్చయ్యసెట్టి; కార్యదర్శి : శ్రీ ఎమ్. డి. వై. రామమూర్తి; సహకార్యదర్శులు : శ్రీ కె. రామమూర్తి, శ్రీ వి. రామకృష్ణ; కోశాధికారి : శ్రీ ఐ. రామదాస్ భట్; సభ్యులు : శ్రీ సి. వెంకటకృష్ణ శర్మ, శ్రీ డబ్ల్యు. విశ్వేశ్వరయ్య, శ్రీ పి. వేణుగోపాల్, శ్రీ టి. బాలిరెడ్డి, శ్రీ జె. యస్. నాగప్ప, శ్రీ జి. రాధాకృష్ణ, శ్రీ బి. బి. యల్లయ్య, శ్రీ కె. పెదతిమ్మయ్య సెట్టి, శ్రీ పి. బాబ్జీ, శ్రీ జి. విశ్వనాథంసెట్టి, శ్రీ పి. సుబ్రహ్మణ్యం (నంద్యాల), శ్రీ యస్. కొండయ్య (గిద్దలూరు), శ్రీ ఆర్. పాండురంగయ్య (మార్కాపురం), శ్రీ బాదం రాములు (కంభం), శ్రీ సదాశివయ్య (త్రిపురాంతకం).

## శ్రీకా ం జిల్లా

30-12-62 న పార్వతీపురంలో శ్రీకాకుళము జిల్లాలోని పలువురు ప్రముఖులు సమావేశమై శ్రీ వివేకానంద శతజయంతి మహోత్సవ సమితికి ఈ క్రిందివారిని జిల్లా సభ్యులుగా ఎన్నుకొన్నారు. అధ్యక్షులు : శ్రీ ద్వివేదుల సత్యనారాయణ, అడ్వొకేట్ (పార్వతీపురం); ఉపాధ్యక్షులు : శ్రీ ఎల్. ఎస్. సన్యాసిరాజు, ఎమ్. ఎల్. ఎ. (సాలూరు), శ్రీ పుల్లెల సీతారామయ్య, అడ్వొకేట్ (శ్రీకాకుళం); కార్యదర్శి : శ్రీ కె. వి. రమణరావు, అడ్వొకేట్ (పార్వతీపురం); కోశాధికారి : శ్రీ ఎమ్. సుబ్బారావు, అడ్వొకేట్ (పార్వతీపురం); సభ్యులు : శ్రీ ఎఱ్ఱమిల్లి రాజశేఖరరావు, అడ్వొకేట్ (శ్రీకాకుళం), శ్రీ పుల్లి కామరాజు, మునిసిపల్ కౌన్సిలర్ (సాలూరు), శ్రీ కె. సత్యనారాయణ, అడ్వొకేట్ (పాల కొండ), శ్రీ బి. బి. పుండరీకం (వీలానగరం),

వోలేటి సీతారామమూర్తి, అడ్వొకేట్

(పార్వతీపురం), శ్రీ యన్. పతంజలిశాస్త్రి, అడ్వొకేట్ (పార్వతీపురం), శ్రీ కె. సూర్య నారాయణ (పార్వతీపురం), శ్రీ యమ్. జానకి రామయ్య (పార్వతీపురం), శ్రీ వి. వి. సంగ మేశ్వరరావు, బి. ఎ. బి. యిడి. (బొబ్బిలి).

విజయవాడ నగర సమితి

శ్రీ వివేకానంద శతజయంతి మహోత్సవ ములు ఈ నగరంలో నిర్వహించుటకు నగరం లోని ప్రముఖులు, గాంధీనగరంలో, శ్రీ గల్లి రామమోహనరావుగారి గృహంలో సమావే శమై ఈ క్రింది నగర కార్యవర్గాన్ని ఎన్ను కొన్నారు.

అధ్యక్షులు : శ్రీ చెఱుకుపల్లి పట్టాభి రామయ్య, అడ్వొకేట్; ఉపాధ్యక్షులు : డాక్టర్ బి. వి రంగారావు, యం.బి.బి.యస్; కార్యదర్శి : శ్రీ పి. యస్. ఎ. నరసింహరాజు, (ప్రొప్రయిటర్, మినర్వా వాచ్ కంపెనీ); సహకార్యదర్శి : శ్రీ యస్. వి. సుబ్బరాజు; కోశాధికారి : శ్రీ యమ్. విశ్వనాథగుప్త (సిటీ ఫార్మా); వీరితోపాటుగా శ్రీ కె. వి. నారా యణరావు, శ్రీ కె. గౌరీశంకరరావు, డాక్టర్ టి. వెంకటేశ్వరరావు, శ్రీ కె. జయరామ దాసు, శ్రీ వి పురుషోత్తం, టి. లక్ష్మీనారా యణ, డాక్టర్ పి. నాగభూషణం, శ్రీ కె. వి. సుబ్బారావుగార్లతో ఒక కార్యాచరణ సమితి ఏర్పాటుచేయబడింది.

వివిధ గ్రంథముల ప్రచురణ

శ్రీ వివేకానంద శతజయంతి మహోత్సవ సందర్భంలో కలకత్తానుంచి శ్రీరామకృష్ణ ఆశ్రమానికి చెందిన శ్రీ రంగనాథానందజీ. స్వామి వివేకానందుల వివిధ గ్రంథాలనుంచి సేకరించి 'Universal Ethics and Morality' అనే ఆంగ్ల గ్రంథాన్ని ప్రచురిస్తున్నారు. అట్లాగే కలకత్తాలోని స్వస్తిక్ పబ్లికేషన్సు వారు, శ్రీ ఏక్‌నాథరానడేగారు స్వామి వివేకా నంద సంపూర్ణ గ్రంథావళినుంచి సేకరించిన "Vivekananda's Rousing Call to Hindu Nation" అనే పుస్తకాన్ని ప్రచురిస్తున్నారు.

మన ప్రాంతంలో కూడా జాగృతి ప్రచుర ణల తరఫున 'వివేకవాణి' అను పేరుతో స్వామి వివేకానందుల గ్రంథావళినుంచి విషయాన్ని సేకరించి, ప్రచురించటం జరుగుతోంది.

(జాన్యువరి తే 4 ది జాగృతిపత్రికనుండి)

పరమేశమూర్తి, జాజ్వల్యమానార్కు, నాయిష్టదేవుని, నర-దేవ-వంద్యు,
ఆమ్నాయములరూపమైయొప్పువాని, కామినీకాంచనగంధవిరహితు,
నరలోకసింహు, భాస్కరకోటితుల్యు, కటితటభాస్వరకౌపీనవంతు,
మాటి కభీ యంచుఁ బరగు హుంకృతుల దెసల నిండించి యుద్ధృతిని నర్తించు
కరుణాకటాక్షవీక్షణముచేఁ బాపపుంజము విదళించి భుక్తిముక్తులను
జగతిజనాళి కొసఁగు మహిమాఢ్యు, శశికళాధరు, లోకశంకరు, హరుని,
శారదవిధు*నమస్కార్యార్హు, గురుని, మా వివేకానందహాని ప్రమొక్కెదను.

* శారదవిధు = శరచ్చంద్రచక్రవర్తి.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

### కేనోపనిషత్తు సంస్కృతమూలము, యతిగీతము ఆంగ్లమూలము, రెంటికి గీతపద్యానువాదము

చిన్నసైజు, పుటలు 60, మూల్యము ఆత్మజిజ్ఞాస, 35 నయాపైసల పోస్టు బిళ్లలు పంపి బుక్పోస్టుద్వారా పొందవచ్చు. అనువాదకులు విద్వత్కవి పండిత శ్రీనారు నాగనార్యులు, చిత్తూరుజిల్లా - కాళహస్తి - కైలాసాశ్రమ - ఉపనిషద్విహారనిలయులైన శ్రీ నిత్యానందగిరి స్వాములు ప్రచురించినది. ఈ యనువాదమందలి ప్రసాదగుణము ప్రశంసార్హము. జిజ్ఞాసువులకు ఈ చిఱుతపుస్తకం అవశ్య పఠనీయం.

### శ్రీ సద్గురు స్తవము

శ్రీసద్గురు మలయాళయతీంద్రస్మృతిమందిర ప్రారంభోత్సవసందర్భమున విద్వత్కవి పండిత శ్రీనారు నాగనార్యులు వ్రాసి ప్రచురించిన ముప్పైఖపద్యాలు - ఇది ప్రతీతిసుభగమైన సరళవాణి.

### ధార్మికవాణి

దేశకాలమానములు జాతిమత విభేదములు లేని మహాత్ముల ప్రవచనాలను నూటయిరవైయెనిమిదింటిని సొంత తేటతెలుగులో ధార్మికవాణి అను పేరట క్రోడీకరించి శ్రీ నేడిది విశ్వనాథంగారు విఖ్యాత హరిదాసులైన బ్ర. శ్రీ గోవిందరామదాసులవారికి అంకితమిచ్చారు. ఈ సూక్తులు జ్ఞానసిద్ధుల అనుభవప్రభవములైనందుచేత పఠితలకు మేలుకొలుపులుగా ఉపయోగపడతాయి అనడం అతిశయోక్తి కాదు. మచ్చుకు కొన్ని సూక్తులు: (69) తన మనస్సును గెల్చినవాడే జగత్తును గెల్చును, (116) ప్రియులను అప్రియులను ఏర్పఱచుకోవద్దు. ప్రియులు కనబడకపోతే దుఃఖం; అప్రియులు కనబడితే దుఃఖం, (117) కోపంతో ఉన్నవాణ్ణి ప్రేమతోనూ, దుర్గుణుణ్ణి మంచితనంతోనూ, లోభిని దానంతోనూ, అసత్యవాదిని సత్యంతోను జయించాలి, (123) పాలాలను కలుపు పాడుచేస్తుంది, ప్రజలను కోరిక పాడుచేస్తుంది. ఈ గ్రంథపు ప్రతులకు ప్రాప్తిస్థానం శ్రీ పాండురంగరావు, బాలభక్తసమాజము, శ్రీ రామమందిరం, సదాశివపేట, మెదక్ జిల్లా.

—ప్రభాకర్





# మన కృతనిశ్చయం

"ఏలాంటి కష్టాలను ఎదుర్కొనవలసి వచ్చినా; ఈ సమరము ఎన్నాళ్ళు సాగినా పవిత్రమైన మన భారతభూమి నుండి దురాక్రమణదారులను తరిమివేసి తీరుతామనే మన ప్రజల దృఢనిశ్చయాన్ని ఈ సభవారు హృదయపూర్వకముగా ధృవపరచుతూన్నారు."

—పార్లమెంటుచే అంగీకరింపబడిన ప్రతిపాదన (నవంబరు *1962*)

# జైహింద్



సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్సు ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# వదంతులను వినవద్దు

# వదంతులను వ్యాప్తిచేయవద్దు


PATENT NO. 62354. OF. 57

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ ౧౯౬౩, ఫిబ్రవరి; శుభకృత్తు - మాఘము సంచిక ౭

## విషయసూచిక



'అఖిలవిభు కరుణోంగుము. యీ క్షణంబ యతనిక్రపై నీకు ననుభావ్య మగును వల్కు'

—శ్రీ శారదాదేవి


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౩ – ఫిబ్రవరి :: శుభకృత్తు .. మాఘము { సంచి. ౧


శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

అమూ తే వక్షోజా వమృతరస మాణిక్యకలశౌ
న సన్దేహస్పన్దో నగపతిపతాకే మనసి నః
పిబన్తౌ తౌ యస్మా దవిదిత వధూసఙ్గరసికౌ
కుమారా వద్యాపి ద్విరదవదన క్రౌఞ్చదళనౌ ॥ ౭౩

| | | | |
|---|---|---|---|
| హే నగపతిపతాకే | ఓ పర్వతరాజపై జయంతీ | యస్మాత్ | ఏలయన |
| అమూ | ఈ | తౌ | ఆ స్తనములను |
| తే | నీ | పిబన్తౌ | త్రాగుచున్నవారై |
| వక్షోజౌ | కుచములు | ద్విరదవదన | గజాననుడును |
| అమృతరస | సుధారసమునిండిన | క్రౌఞ్చదళనౌ | కుమారస్వామియు |
| మాణిక్య | మాణిక్యపు | అవిదిత | ఎఱుగబడని |
| కలశౌ | గిండ్లు | వధూసఙ్గ | స్త్రీసంభోగ |
| నః | మాకు | రసికౌ | స్వారస్యముగలవారై |
| మనసి | మనస్సులో | అద్యాపి | ఇప్పటికిని |
| సన్దేహస్పన్దః | సందేహలేశమును | కుమారౌ | శిశువులుగనే |
| న | లేదు | (భవతః) | (ఉన్నారు.) |

తా॥ నీ స్తన్యమును త్రాగిన వినాయకుడును కుమారస్వామియు ఇప్పటికిని శిశువులుగనే ఉన్నారు, స్త్రీసంభోగస్వారస్యము ఎఱుగకున్నారు. కావున వారు త్రాగినది పాలు కాదు, అమృతరసమే. అట్టి అమృతరసముసిండిన మాణిక్యపుగిండ్లే నీపాలిండ్లు. ఈవిషయమున, ఓపర్వతరాజపుత్రి జయంతీ, మా కిసుమంతయు సందియము లేదు.

వహ త్యమ్బ స్తమ్బేరమదనుజకుమ్భప్రకృతిభిస్
సమారబ్ధాం ముక్తామణిభి రమలాం హారలతికామ్
కుచాభోగో బిమ్బాధరరుచిభి రన్తశ్శబలితాం
ప్రతాపవ్యామిశ్రాం పురదమయితుః కీర్తి మివ తే ॥ ౭౪

| | | | |
|---|---|---|---|
| హే అమ్బ | ఓ అమ్మా | బిమ్బ+ | దొండపండునుబోలిన |
| తే | నీ | అధరరుచిభిః | మోవికాంతులతో |
| కుచ+ | స్తనముల | అన్తః | లోపల |
| ఆభోగః | విరివి | శబలితామ్ | కలిసిపోయినదియు అయిన |
| స్తమ్బేరమ | గజ | హారలతికామ్ | ముక్తావళిని |
| దనుజ | రాక్షసుని | ప్రతాప | తేజస్సుతో |
| కుమ్భ | కుంభములే | వ్యామిశ్రామ్ | కూడినదగు |
| ప్రకృతిభిః | ఉత్పత్తిస్థానములుగ గలిగిన | పురదమయితుః | త్రిపురాంతకుని |
| ముక్తామణిభిః | ముత్తెములతో | కీర్తిమివ | కీర్తినిబోలె |
| సమారబ్ధాం | గ్రుచ్చబడినదియు | వహతి | తాల్చియున్నది. |
| అమలామ్ | నిర్మలమైనదియు | | |

తా॥ అమ్మా, నీ పీనస్తనయుగము మీఁద స్వచ్ఛమగు ముత్యాలమాలను దాల్చియున్నావు. అది గజాసురుని కుంభములనుండి ఉత్పత్తిల్లిన ముత్యములతో గ్రుచ్చబడినది. ఆముక్తావళి తెలుపుతో నీ మోవికెంజాయ కలిసిపోయియున్నది. తెల్లని ముత్యాలమాల పరమశివుని కీర్తియే యనియు, అందు కలిసిపోయిన కెంజాయ పరమశివుని ప్రతాపమే అనియు చెప్ప దగియున్నది. కీర్తి తెలుపనియు ప్రతాప మెఱుపనియు కవిసమయము.

తవ స్తన్యం మన్యే ధరణిధరకన్యే హృదయతః
పయఃపారావారః పరివహతి సారస్వత మివ
దయావత్యా దత్తం ద్రవిడశిశు రాస్వాద్య తవ యత్
కవీనాం ప్రౌఢానా మజని కమనీయః కవయితా ॥ ౭౫

| | | | |
|---|---|---|---|
| హే ధరణిధరకన్యే | ఓ గిరిరాజసుతా | ఉత్థితః | ఉత్పత్తిల్లినదై |
| తవ | నీ | సారస్వతమ్ ఇవ | సరస్వతీమయమునుగా |
| హృదయతః | హృదయమునుండి | పరివహతి | ప్రవహించుచున్నది |
| పయఃపారావారః | పాలసముద్రము | ఇతి | అని |

| | | | |
|---|---|---|---|
| మన్యే | ఎఱుగుదును | ఆస్వాద్య | గ్రోలి |
| దయావత్యా | కృపావతివగు | ప్రౌఢానామ్ | ప్రౌఢులగు |
| త్వయా | నీచేత | కవీనామ్ మధ్యే | కవులలో |
| దత్తం | ఈయబడిన | కమనీయః | అతిరమణీయ(ముగ) |
| యత్తే తవ స్తన్యమ్ | ఏ నీ చనుబాలను | కవయితా | కవనము చెప్పువాడుగ |
| ద్రవిడశిశుః | తమిళ బాలకుడు | అజని | అయ్యెను. |

తా॥ అమ్మా పార్వతీ, దయతో నిచ్చిన చనుబాలను గ్రోలిన తమిళ బాలకుడు ప్రౌఢకవు లందఱికంటె అధికరమణీయముగ కవనము చెప్పువాడుగ నయ్యెను. కావున నీ వక్షమునుండి ఉప్పతిల్లు క్షీరము సారస్వతిమయ మని తెలియుచున్నది.

ఇట ఈ ఐతిహ్యము చెప్పుదురు. శంకరాచార్యులవారి తండ్రి పరమేశ్వరీ భక్తుడు, ఊరివెలుపల నున్న అంబికాయతనమున కేగి అంబికకు క్షీరాభిషేకము చేసి క్షీరోపహార మర్పించి, శేషించిన పాలను బాలశంకరునకు త్రాగ నిచ్చుచుండెను. అమ్మవారు త్రాగగా మిగిలిన పాలను తండ్రి తనకు ప్రతిదిన మిచ్చుచున్నా డని బాలశంకరు డనుకొనుచుండెను. ఒకప్పుడు తండ్రి గ్రామాంతరమునకు బోవుచు పూజాదికమును చూచుకొమ్మని ఇల్లాలి కాజ్ఞాపించి పోయెను. ఆమెయు తక్కినపనులను చూచుకొనుచు, ఇంట వే రెవరును లేనందున అమ్మవారికి క్షీరమును బాలశంకరునిచే నంపెను. బాలుడు పాలను దేవి ఎదుట బెట్టి 'త్రాగు' మని కోరెను. ఆమె జాగు సేయగా నిత డేడ్వ నారంభించెను. అంత నామె గిన్నెలోని పాలను పూర్తిగా త్రాగివేసెను. 'అయ్యో నా కేమియును మిగుల్పవైతివే' అని బాలుడు మరల నేడ్వగా, ఆమె సదయహృదయయై అతనికి తన చనుబాలను త్రాగ నిచ్చెను, త్రాగిన తత్క్షణమే కావ్యనాటకాది వాఙ్మయవిశేషము లన్నియు సకలశాస్త్రములును ఆ బాలునిలో భాసించినవి.

కాంచీపురప్రాంతీయులు చెప్పు మఱొక వక్కాణము — భగవదంశసంజాతుడగు శంకరాచార్యుడు ఆఱునెలల శిశువుగ నుండ నొకనాడు, తండ్రి భిక్షార్థ మేగెను, తల్లి నీళ్లు తేర నది కేగెను. శిశువు ఆకలి కేడ్చుచుండ యాదృచ్ఛికముగ పార్వతీపరమశివులు ఆకాశ మార్గమున అటు వచ్చిరి. ఏడ్చుచున్న బాలశంకరుని జూచి, పార్వతి కనికరించి, దిగి, అతని నోదార్చి తనచనుబాలను త్రాగించి చనెను. తత్క్షణమే నిర్దోషకావ్యసహస్రములును సకల శాస్త్రములు నా శిశువునందు భాసించినవి.

హరక్రోధజ్వాలావలిభి రవలీఢేన వపుషా
గభీరే తే నాభీసరసి కృతసఙ్గో మనసిజః
సముత్తస్థౌ తస్మా దచలతనయే ధూమలతికా
జన స్తాం జానీతే తవ జనని రోమావళి రితి ॥ ౭౬

| | | | |
|---|---|---|---|
| జనని | అమ్మా | | మునిగినాడు |
| అచలతనయే | గిరిజా | తస్మాత్ | ఆ తటాకమునుండి |
| మనసిజః | మన్మథుడు | ధూమలతికా | పొగచాలు |
| హర | శివుని | సముత్తస్థౌ | ఎగసెను |
| క్రోధ | కినుక (నిప్పు) | తాం | దానిని |
| జ్వాలావళిభిః | మంటలచేత | జనః | లోకులు |
| అవలీఢేన | క్రమ్ముకొనబడిన | తవ | నీ |
| వపుషా | మేనితో | రోమావళిః | రోమరాజి |
| గభీరే | లోతైన | | అని |
| తే | నీ | | భావించుచున్నారు |
| నాభీసరసి | పొక్కిటితటాకమున | | వర్ణించుచున్నారు. |

తా॥ అమ్మా, గిరిజా, హరుని క్రోధానలజ్వాలలచే మండుచున్న మేనితో మన్మథుడు చలువకై లోతైన నీ పొక్కిటిమడుగున దిగినాడు. అప్పుడందుండి యెగసిన పొగచాలునే లోకులు నీ నూగారు అనుచున్నారు.

య దేత త్కాళిన్దీతనుతరఙ్గాకృతి శివే
కృశే మధ్యే కిఞ్చి జ్జనని తవ యద్భాతి సుధియామ్
విమర్దా దన్యోన్యమ్ కుచకలశయో రన్తరగతం
తనూభూతం వ్యోమ ప్రవిశ దివ నాభిం కుహరిణీమ్ ॥ ౭౭

| | | | |
|---|---|---|---|
| జనని | అమ్మా | కుచకలశయోః | స్తనకుంభముల |
| శివే | శివా | అన్తరగతం | నడిమిదియు |
| తవ | నీ | తనూభూతమ్ | సూక్ష్మమైనదియు |
| కృశే | సన్నని | అన్యోన్యమ్ | (చన్నుల) ఒండొంటితోడి |
| మధ్యే | నడుమునందు | విమర్దాద్ ఏవ | రాపిడిచేతనే |
| కాళిన్దీ | యమునానదియొక్క | | గుంటగల (లోతైన) |
| తనుతరఙ్గ+ | అతిసూక్ష్మతరంగమువంటి | నాభిమ్ | పొక్కిటిని |
| | ఆకారముగలదై | ప్రవిశద్ | ప్రవేశించుచున్నదియు అగు |
| కిఞ్చిత్ | (నూగారు అను) ఏ ఒకా | వ్యోమ ఇవ | ఆకాశమువలె |
| | నొకటి | సుధియామ్ | విద్వాంసులకు |
| భాతి | కనబడుచున్నదో | (భాతి) | (తోచుచున్నది). |
| యత్ | (ఏ) ఆ ఇది | | |

తా॥ అమ్మా, శర్వాణీ, నీ సన్నని నడుమున యమునాప్రవాహపు చిట్టికెరటమువంటి దొకానొకటి (=నూగారు) కనబడుచున్నది. అది నీ కుచకలశముల నడిమి ఆకాశమైనట్లును, ఆ కుచము లొండొంటితో రాచుకొనుచున్నందున వానినడిమి ఆకాశము త్రోపుడువడి పొక్కిటి పల్లములోనికి దిగుచున్నట్లును విచక్షణులకు తోచును. ఆకాశము నలుపు, నూగారు నలుపు. ఆ నలుపు సామాన్యధర్మము.

# శ్రీవివేకానందమకరందబిందువులు (౨)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

నా మతసారము బలము (శారీర మానసి కాధ్యాత్మిక బలము.)

గీతోపనిషద్భాగవత ధర్మములలో నేదియై ననుగానిండు మనఃస్థైర్యము, నాత్మతేజమును గల్గింపని ధర్మమును నేను ధర్మముగాఁ బరిగణింపను. ధర్మమనఁగా బలము, శక్తి: బలమును మించినదేదియు లేదు.

బలమనది పురుషకారమని గ్రహింపుఁడు. పురుషకార విహీనునకుఁ బరమేశ్వరానుగ్రహము లభించుట కల్ల. మహావీరుఁడగు నర్జునుఁడు తన పౌరుషమును గోల్పోవనున్న సమయమున శ్రీకృష్ణుఁ డాతనికి, నిస్సంగ బుద్ధితో స్వధర్మము ననుష్ఠింపుమని యాదేశించి, నిష్కామ కర్మాచరణమువలనఁ జిత్తశుద్ధియుఁ గర్మపరిత్యాగ ఫలమును భగవదేకార్పిత బుద్ధియు సిద్ధించునని యుపదేశించెను. కావున యువకులారా, ధీరులై బలము నార్జింపుఁడు. దుర్జనుఁడైనను బలోపేతుఁడు నాకు మాన్యుఁడు. ఏలన వాఁడును దన బలముచే దౌర్జన్యమును స్వార్థపరతను విడనాడి తత్త్వసందర్శనము చేయు దినము వచ్చితీరును.

నానాఁటికి విస్పష్టముగా నాకు గోచరించుచున్న విషయమిది: సమస్తము ధైర్యసాహసములతోఁ గూడుకొని యున్నది. ఇదియే నా నూతన సందేశము. దుష్కార్యములనైనను సరియే ధీరుఁడవై యొనర్పుము! దుర్మార్గుఁడ వగుటే విధియైనచో, నపరిమిత దుర్మార్గుఁడవు కమ్ము.

మీ దేశమునకు వీరులు కావలసియున్నారు; కావున వీరులు కండు. పర్వతములవలె సుస్థిరులై నిల్వుఁడు. సదా సత్యమే జయించునది. జాతీయరక్తనాళములలో నూతనశక్తిని బురికొల్పు నూతన విద్యుత్తేజము—మహోత్సాహము—ఇదియే భారతదేశమునకు వలయునది. ధీరులు కండు, ధీరులు కండు; మనుజుఁ డొక్కసారియే మృతినొందును. నా వత్సలు పిఱికిపందలు కారాదు. పిఱికితనమనిన నాకుఁ బరమాసహ్యము. ఏమి సంభవించినను గలవరపడకుఁడు; తుచ్ఛులు మిమ్ముఁ గూర్చి యేమనుచున్నను లెక్కసేయకుఁడు, క్రేగంటనైనను వారిని జూడకుఁడు. ఔదాసీన్యము! ఔదాసీన్యము! ఔదాసీన్యము! కన్నులు రెండు, చెవులు రెండు; కాని నోరొక్కటియే — ఈ సంగతి సదా జ్ఞప్తి నుంచుకొనుఁడు. మహాకష్టములను — మహాబంకములను — దాఁటనిదే మహాకార్యము లెన్నఁడును గొనసాగియుండలేదు. మీ పౌరుషమును బ్రకటింపుఁడు. కామకాంచనదాసులగు నిర్భాగ్యులుపేక్షింపఁదగినవారు.

* * *

కిన్నామ రోదిషి సఖే త్వయి సర్వశక్తిః
ఆమన్త్రయస్వ భగవన్ భగదం స్వరూపమ్,
త్రైలోక్యమేతదఖిలం తవ పాదమూలే
ఆత్మైవ హి ప్రభవతే న జడః కదాచిత్.

—సఖుఁడా, నీ వేందులకు విచారించెదవు? సమస్తశక్తియు నీయందే కలదు. ఓ భగవా

నుఁడా, నీ భగవత్స్వభావము నామతింపుము. ఈ ముజ్జగములును నీకుఁ బాదాక్రాంతమగును. ప్రభావోపేతమై వెలయున దాత్మయే, జడ ప్రకృతి యెన్నఁటికిని కాదు.

తమ దేహముతోఁ దాదాత్మ్యము నొంది, "మే మల్పులము, దుర్బలుల" మని దీనముగా విలపించువారు మూఢులు. ధైర్యము, వైజ్ఞానిక ప్రతిభయు దేశమున కిపుడు కావలసియున్నవి. మనకు మహాధీరత్వము—అఖండశక్తిసామర్థ్యములును మహోత్సాహమును — గావలసియున్నవి; సంగనాచితనమెంతమాత్రమును బనికిరాదు. కార్యశూరుని—పురుషసింహుని—విజయలక్ష్మి వరించును. వెనుకకుఁ జూచుట వలన లాభములేదు. అగ్రసరులు కండు! అఖండశక్తి, అఖండదీక్ష, అఖండధైర్యము, అఖండసహనము—ఇవియే మనకు వలయునవి. వీనిమూలముననే మహాకార్యములను సాధింపఁగలము.

వేదాంతము పాపము నెన్నఁడును ప్రతిపాదింపదు, కాని ప్రమాదము నంగీకరించును; నేను దుర్బలుఁడనని, పాపినని, నిర్భాగ్యుఁడనని, శక్తిహీనుఁడనని తలఁచుటయే మహాదోషమని వేదాంతము వక్కాణించును.

భగవద్విశ్వాసహీనుఁడు నాస్తికుఁడని ప్రాచీనమతములు పలికినవి. ఆత్మవిశ్వాసహీనుఁడే (తన్ను దాను నమ్మనివాఁడే) నాస్తికుఁడని నవీనమతము వక్కాణించుచున్నది.

బలమే జీవనము, దౌర్బల్యమే మరణము. బలమే సౌఖ్యము, శాశ్వతజీవనము, అమరత్వము; దౌర్బల్యము నిరంతరప్రయాస, దుఃఖము. దౌర్బల్యమే మరణము. బాల్యమునుండియు, శైశవమునుండియు, బలకరములు, ఆస్తికములు, సాహాయ్యకరములునగు భావములను మీ బుద్ధులందుఁ బ్రవేశింపనిండు.

దౌర్బల్యమే బాధకుఁ గారణము. దుర్బలుల మగుటచేతనే దుఃఖితుల మగుచుందుము. దౌర్బల్యముచేతనే అసత్యమాడుదుము, దొంగిలింతుము. హత్యచేయుదుము, ఇతరమగు నేరములను జేయుదుము. దౌర్బల్యముచేతనే బాధపడుచుందుము. దౌర్బల్యముచేతనే మరణించుచుందుము. ఎచట మనలను దుర్బలులను జేయున దేమియు నుండదో, యచట మరణముగాని, బాధగాని యుండనే యుండదు.

బలమే యావశ్యకమగునది. బలమే భవరోగమున కౌషధము. దరిద్రులు ధనికులచే హింసింపఁబడునప్పుడు వారికి వలయు దివ్యౌషధము బలమే. పామరులు పండితులచే నణఁగఁ ద్రొక్కఁబడునప్పుడు వారికి వలయు నౌషధము బలమే. పాపు లితర పాపులచేఁ బీడింపఁబడునపుడునునదియే వారి కావశ్యకమగునౌషధము.

స్వశక్తిపై నిల్వుము, ధీరుఁడవై యుండుము. బలాఢ్యుఁడవై యుండుము. సమస్తబాధ్యతను నీ భుజములమీఁదనే వహింపుము, నీ విధికి నీవే కర్తవని గ్రహింపుము. నీకు వలయు బలసంరక్షణలు నీయందే కలవు. కావున నీ భవిష్యత్తును నీవే నిర్మించుకొనుము.

మనము రోగపీడితుల మని సదా తలంచుచుండుటవలన రోగనివారణ కానేరదు; వలయున దౌషధము. దౌర్బల్యమును స్మరించుచుండుటవలన నంతగా లాభములేదు. బలమును గ్రహింపుము, సదా దౌర్బల్యమును గూర్చి చింతించుచుండుటవలన బలము కలుగనేరదు. బలచింతనమే కాని దౌర్బల్యచింతనము దౌర్బల్య నివారణోపాయము కానేరదు.

# శ్రీ వివేకానందస్వాముల 'నిత్యవాణి' 'విశ్వవాణి'

## శ్రీ మోరార్జిదేశాయిగారు

మన దేశమునకు నూత్నయౌవనము నిచ్చి, మనలను లేపి, ముందున్న కర్తవ్యమును చూపి అందుకు మనలను సంసిద్ధులను చేసినవారిలో శ్రీ వివేకానందస్వామి ఒకరు. నేను పసివాడనుగా విద్యార్థిదశలో ఉన్నప్పుడు శ్రీ వివేకానందుని గురుదేవుడగు పరమహంస శ్రీరామకృష్ణుని బోధనలు మొట్టమొదట నామదికెక్కి, నాకుత్సాహము కూర్చినవి. మన మత వేదాంతాలలో చరిత్రలో నా మనసు కిప్పుడు మిక్కిలి ప్రీతికరములుగ నున్న వెల్ల నేను ఆ బోధనలనుండి తెలిసికొన్నవే. భగవంతుడనెడి పరమార్థమును సాక్షాత్కరించుకొన్నవాడు శ్రీరామకృష్ణుడని నా నమ్మకము, దృఢవిశ్వాసము. కావున ఆయన నోట వెలువడిన ప్రతిమాటయు నిరాఘాటముగ ప్రజల డెందముల కెక్కెడిది. ఆ మాటల నిజమును నమ్మించుటకు ఎట్టివాదమును అక్కఱ లేదు. అన్ని మతములును ఒక్క పరమార్థమునే తెల్పుచున్న వనియు అన్నిమతములలోని పరమార్థమొక్కటే అనియు మన దేశీయులకును, మన గుండ విశ్వమంతటికిని ఆయన తెలియజేసినాడు. మనఋషులలో ఎందఱో బోధించిన విషయమే అది. కాని పరమహంస ఆ మతముల సాధన చేసి అన్నింటి పరమార్థమొక్కటే అనుటను ఋజువుచేసినాడు. మన దేశమునకును ప్రపంచమునకును ఆయన ప్రత్యేకముగ ప్రసాదించిన జ్ఞాన మిది: దీనిని భారతదేశమందును విశ్వమందును ప్రచారము చేయుటకు తన ప్రధానసాధనముగ ఆయన శ్రీ స్వామిజిని వరించెను.

విద్యార్థిగనుండిన కాలమున స్వామిజి వివిధ మతాలవారి సాంగత్యఫలముగ అజ్ఞేయవాదిగ తయారయ్యెను. దేవునిగూర్చి విశ్వాసము కల్గించు సమాధానములను ఆ మతాలవారిలో ఎవరు గాని చెప్పలేకైరి. స్వామిజికి శ్రీరామకృష్ణునితోడి సమాగమము గలిగినది. 'నీకై ఎన్నాళ్లుగనో కాచుకొనియున్నానోయి' అన్నాడు పరమహంస అతనితో. కాని ఆయనయెడ స్వామిజి తత్క్షణమే ఆసక్తుడు కాలేదు. కొంత అనుభవము కావలసియుండెను. మతప్రవక్తల నెందఱినో తా నడుగుచు వచ్చిన "దేవుని నాకు చూపగలరా" అను ప్రశ్నను స్వామి శ్రీరామకృష్ణునికూడ అడిగెను. 'చూపగల' నని భగవాన్ రామకృష్ణుడు చెప్పెను. అప్పటినుండి శిష్యుడు గురువునొద్దకు తఱచు రాసాగెను. శ్రీరామకృష్ణదర్శితమార్గమున స్వామిజికి పరమతత్త్వసాక్షాత్కారము కలిగెను. స్వామిజి తన్ను కేవల మొక ఉపకరణముగ శ్రీరామకృష్ణభగవంతున కర్పించుకొనెను.

* 20-1-1963 తేదీనాడు మద్రాసు మైలాపూరు పి. ఎస్. హైస్కూలు మైదానమున శ్రీవివేకానంద స్వాముల శతతమజయంతి మహోత్సవమును ప్రారంభించుచు కావించిన ఉపన్యాసము.

స్వామిజి మహాద్భుతపురుషుడనుట స్పష్టము — 1893, భారతదేశమునకు ప్రపంచమున ఎట్టి విఖ్యాతియు లేదు; పేదదేశమని, వెనుకబడిన దేశమని, పిడికెడుమందియైన ఆంగ్లేయులపాలనకు లోనై యున్న బానిస దేశమని — భారతదేశము అంతటిచేతను అలక్ష్యపఱుపబడుచుండిన కాలమది. ఆ కాలమున అజ్ఞాతపురుషుడుగ నున్న ఆయన ఇక్కడినుండి షికాగోకు పోయినాడు! అక్కడ ఆయన తన ఆశయాలశక్తిచేత, తన వ్యక్తిమహిమచేత, హిందువేదాంతసత్యాలను, అరటిపండు ఒలిచి చేతబెట్టినంత సుఖాస్వాద్యములుగ అందజేయుటచేత—తన్ను కలిసికొన్న యెల్లవారి హృదయాలను వశపఱచుకొనెను. నా మనస్సున కిది అతిమానుషమహాద్భుతమనిపించుచున్నది. ప్రపంచపటమున భారతదేశమునకు ఇదంప్రథమముగ స్థానము కలిగించినాడు. ఈ దేశమున ఎంత బలము ఎంత ప్రాణశక్తి ఉన్నవో చూపినాడు. మద్రాసులోని ఈ శతతమజయంతి మహోత్సవాలలో నాకొక వంతు లభించినందుకు ప్రత్యేకముగ నేనుసంతోషించుచున్నాను. ఏలయన అమెరికాకు పోవుటకు ముందు స్వామిజి ఈ నగరమున ఉండినాడు. ఆయన అమెరికాకు పోవుటకు తోడ్పడినవారు ఈ నగరమహాజనులు. అమెరికానుండి మరలి వచ్చిన తర్వాతకూడ స్వామిజి ఈ నగరములో ఉండినారు, మొదటి మఠమును ఈ నగరమున నెలకొల్పినారు.

వెలుపలినుండి తాకిళ్లు ఎంతగ నున్నను, దేశాచారమును దేశసంస్కృతిని సదా నిలబెట్టుచుండినవారు దక్షిణభారతీయులే. శ్రీవివేకానందస్వామి దక్షిణమునుండి రాలేదు లెండి. ఆయన దక్షిణేతరదిశనుండియే వచ్చినారు కాని ఆయనను ఇచ్చటివారు ఆదరించినారు, ఆదరించుటే కాదు, ఆయన వాగమృతము శ్రద్ధాభక్తులతో గ్రోలినారు. ఆయనకు మొట్టమొదటి శిష్యు లేర్పడినది ఈ నగరముననే. చాల పసివాడను కావున స్వామిజిని గూర్చి నేను ఆ దినాలలో విన్నది లేదు, కన్నది లేదు.

స్వామిజి తన 39వ యేటనే మరణించెను. కాని ఆ ముప్పదితొమ్మిదేండ్లలో ఆయన నూతేండ్లపనికంటె ఎక్కువ పనియే సాధించినాడు. అంతతీవ్రముగా ఆయన పాటుపడినాడు. అంతతీవ్రమైన పారమార్థికతృష్ణ ఆయన తన ఉపదేశాలలో ఇమిడ్చియున్నాడు. ఆయన సామాన్యమతాచార్యుడు కాడు.

తన్ను తాను తెలిసికొనుటకును మానవుడనిపించుకొనుటకును మానవుని సమర్థునిగ జేయునది 'మతమే'. కావున మన ఆశయాలలోనేమి మన ఆచరణలలోనేమి మతము కేంద్రస్థానమున అమరి యుండవలెను. మతము అనగా, మతబాహ్యరూపాలు కాదు, సత్యమును మానవసేవను విశ్వసేవను మనకు కఱపు 'మతసారమే' నేను చెప్పనెంచినది. ఈ సేవాసక్తి మానవసమాజావధులను సైతము అతిక్రమించును. తన సమాజావధులనుసైతము దాటి వెలికేగి ఎల్లరకును ఉపయోగపడవలె ననిన, మానవుడు మొదట ఎవరితో కలసికొనవలసి వచ్చునో వారికి సేవ చేయు అర్హతను గడింపవలె.

...' అను పదము మనదేశమున అజ్ఞాతముగ నున్న కాలమున స్వామిజి మనకు దేశభక్తిని కలిగించినాడు. ఆత్మగౌరవమును

ధైర్యమును మనకు బొత్తిగా లేకుండిన కాలమున స్వామిజి మనకు వానిని కలిగించినాడు. మన అకృత్యముల ఫలితముగనే భంగము లొందినది 'ఇక మన గతి యింతే' అను దురభిప్రాయగర్తమున పడియుండిన మనలను ఆయన ఉద్ధరించినాడు. ఏ విధమున గాని మన భంగములకు ఒరులు కారకు లని నేననుకొనను. మన అకృత్యముల ఫలితముగనే మన పైతృక సంపదను మనము కోల్పోయితిమి. లేచి, నష్ట సంపదను మరల గడింప యత్నించు సామర్థ్యమును స్వామిజి మనకు ప్రసాదించినాడు. కావున మనస్వాతంత్ర్యము ఎన్నాళ్లు నిలిచి యున్న, మన పైతృకసంపద ఎన్నాళ్లు నిలిచి యున్న, స్వామిజి చేసిన దేశసేవయు అంత కాలము నిత్యస్మరణార్హముగ నుండును. మన దేశమునుండి లోక మేమేమి నేర్చుకోవచ్చునో, లోకమున కాయన తెలిపెను. అందుకు మన మెంతేని గర్వించుచున్నాము. గర్వించుట వేఱు, అర్హత కల్గియుండుట వేఱు; అనర్హులమై యుండి గర్వించుట తప్పక వినాశమొందించును. అర్హులమై యుండ గోరుదుమేని, స్వామిజి బోధనలను, ఒరులచే అనుసరింపింప గోరుటకు ముందు మనమే అనుసరింపవలెను.

ఈ నాడు ఐహికతృష్ణలు అన్ని దేశముల కంటె మన దేశమున హెచ్చుగ నున్నవి. కావున అన్యదేశీయులకంటె మన మెంతో పారమార్థికపరుల మని చెప్పుకొనుట వ్యర్థము. మన దేశీయులకు ఆధ్యాత్మికపు పునాదులు ఉన్న వనుట నిజము. అది దేవుడు మనకిచ్చిన గొప్పశక్తి. అది సదా మన జ్ఞప్తిలో ఉండవలెను. యోగులు ప్రతిదేశమునను ప్రతిఖండమందును ప్రతిసంఘమందును అవతరించి యున్నారు. యోగి అవతరింపని సంఘము లేనే లేదు. కాని లోకములో తక్కిన అన్ని దేశాలలో అవతరించిన యోగులు అందఱును కలిసిన ఎంత అగుదురో, అందఱు ఈ ఒక్క దేశములోనే అవతరించియున్నారు. అదే భేదము. ఈ దేశమున యోగి జన్మింపని తరమే లేదు. ఆ యోగి జ్ఞాతుడు కాని, అజ్ఞాతుడు కాని! ప్రజోపకారకులగు వారు విఖ్యాత యోగులు మాత్రమే కాదు సకలయోగులును ప్రజలకు శ్రేయస్కరులే. వాని ప్రభావము స్పష్టముగనుండనీ, వినిగూఢముగనుండనీ, ఎన్ని అకృత్యములు చేసియున్నను భారతదేశము సజీవముగ ఉండుట కదే కారణము. మనము గర్వించి ఊరకుండక, అర్హత గల్గియుండ గోరుదుమేని మనము ఈ సర్వమును తెలిసికొనవలయును. గర్వించుట అనగా నే చెప్ప నెంచినది మనయొద్ద విలువగలిగిన దొకటి కల దని లోకమునకు చాటుకొనుట కాదు, వినయమున్ననే గర్వింప వచ్చు నని. ఈ దేశమునను ఈ దేశముగుండ విదేశములందును కఱపబడిన సత్యములను అలవఱచుకొనుట వినయమున్ననే మనకు శక్య మగును.

ఈ నాడు ఈ సత్యములు పరులకు మనము చేయు ఉపదేశాలలో ఉన్నవే కాని, మన ఆచరణలో లేవు. అత్యధికదౌర్బల్యమున కదే కారణము. శక్తిసంపన్నమైన భాషలో స్వామిజి మనకు బోధించిన విషయ మిదే. 'మాటాడుటతో ఆగకుడీ, ఆచరింపుడీ' 'ఆలోచనలతో ఆగకుడీ, ఆచరించుచుండుడీ' అని ఆయన మనల కోరినాడు. స్వామిజి నెలకొల్పిన ఈ గొప్ప శ్రీరామకృష్ణసంస్థలో (దీనికి పునాదులు శ్రీరామకృష్ణునికాలముననే పడిన వని,

ఆయనే దీనిని నెలకొల్పె నని చెప్పవచ్చును) ఆయన వేసిన పునాదులును ఏర్పఱచిన ఆచారములును ఎట్టి వనగా, ఈ దేశమున నున్న సన్న్యాససంప్రదాయములలో నిష్కళంకమైన ది దొక్కటే. తక్కిన సేవలన్నియు విస్మృతములైనప్పటికిని, ఈ సంప్రదాయస్థాపనమున కన్న మిన్న యయిన సేవ వే ఱొం డుండదు.

మనదేశము కీర్తిప్రతిష్ఠల శిఖరము నందుకొన్న కాలమునసైతము అన్యదేశములను జయింప నెప్పుడును పూనుకోలేదు. కాని ఈ దేశము పరిష్ఠులను శ్రేష్ఠులను అన్యదేశముల కంపినది. వా రాదేశముల జీవితపరమసత్యముల వెదజల్లిరి. మనదేశము విశ్వమానవ సేవ కావించు మార్గ మది. స్వామిజి చేసినదియు అదే. కలహములు అడుసులో పడ వేయును కావున, ఎట్టి కలహములలోను కాలు పెట్టక ఈ సంస్థ నిరాడంబరముగ లోక సేవ చేయుచు వచ్చుచున్నది. దీని నిష్కళంకతకును అదే కారణము. ఈ ఆచారమును ఏర్పఱచి నది స్వామిజియే.

అట్టి మన దేశమాతృపుత్రరత్నమునకు శతతమజయంతి మహోత్సవము చేయుటచే మనము గౌరవించుకొనుచున్నది మనలనే కాని ఆయనను కాదు. ఆయనమార్గము ననుసరించుటకై కొంత బలము కొంత ఉత్సాహమును పడయుటకై, మనము ఆయనను పూజించుచున్నాము, ఆయన కీర్తిని ఆయన మహోపదేశములను ఆరాధించుచున్నాము. భారతీయుల మనిపించుకొను అర్హత గడించుటకై, ఏదో కొంత మాతృదేశసేవను మాతృదేశసేవగుండ విశ్వమానవసేవను చేయు సామర్థ్యమును పొందుటకై స్వామిజి ఉపదేశాలను, మన మతవేదాంతోపదేశాలను మన మనుసరింప వలసియున్నది.

ఆయన ఉపదేశాలను మరల స్మరింపజేయు దేశకాలపరిస్థితులలో మనము నే డున్నాము. ఆయన ఉపదేశాలు సర్వదేశాలకు సర్వకాలాలకు ఉపయోగపడునవి. కాని 'లెండి మేలుకొండి' అనెడి ఆయన శంఖారావమును మనము మరల వినవలసినకాలముగా నున్నది. ఏల యన స్వాతంత్ర్యము సిద్ధించి పదునైదేండ్లైనవి. మనము శాంత్యహింసలను నమ్మికొని ఆ విశ్వాసములో నుండగా మన పొరుగువారు ద్రోహవంచనామార్గమున మనమీదికి దండెత్తినారు. దేశ మిప్పుడు మేలుకొన్నది, మేలుకొన్నది మేలుకొనియే యుండవలెను, కొన్ని సరిహద్దులలో అలజడి లేకున్నంతమాత్రము చేత మనము మరల నిద్రలోనికి దిగ కూడదు. లెం డని సదా మెలకువతో ఉండు డని స్వామిజి చెప్పినారు. అదే ఆయన ఆదేశము, అదే నేడు మన కర్తవ్యము.

ప్రతిభారతీయుడును ప్రతిభారతీయుని, అతడెవ డైనను ఎక్కడివా డైనను, సోదరునిగా భావింపవలె ననుట స్వామిజి ఆదేశము. అంతకంటె మిన్నయైన 'సామ్యవాదము' (సోషలిసము)ను ఎవరు ప్రతిపాదించి యుండ గలరు? ఇవి మనసంఘపు పునాదులు కావున మన ప్రాచీనమహర్షులు బోధించిన సత్యములను అనుసరించుచున్నామన్న నిబ్బరము గల్గి మన ముండ వచ్చు. వాని ననుసరించినచో భంగము నకుకాని ఆశాభంగమునకుకాని అవకాశ ముండదు.

మన మనుకొన్న స్థాయికి అందుకొనలేని వార లెవ రైన మనకు కనిపించిన, వారితో

మనము కలహింపకూడదు. వారు ఆ స్థాయి కందుకొనునట్లుగ వారి కుపకరింప వలెను. మనవిధులలో మనమే తప్పిపోవు చున్నాము. ఇదే కారణము ఇతరులు తమ విధులందు వారు తప్పిపోవుటకు. వారితప్పులను మనము ఆ దృష్టితో చూడ వలెను. అదే స్వామిజి మనకు నేర్పిన పాఠము. ఎవరిమీద కాని ఆయన నేర మారోపింపనే లేదు. ఎవరి విశ్వాసము లెట్టివైన కాని, స్వామిజి సత్య మును లోకులకంటియెదుట పెట్టి ఉపకరించి నాడు. ఇట్టివారి శతతమజయంతి మహోత్స వాలను జరుపునప్పుడు మన కీవిషయాల జ్ఞప్తి ఉండ వలెను. వారు కొన్నితరాలవారికి మాత్రమేకాదు కొన్ని నాగరకతలవారికి ఉత్సాహప్రదాతలు.

26 సంవత్సరాలకు పూర్వము పరమహంస శ్రీరామకృష్ణుని శతతమజయంతిమహోత్సవము జరిగినది. తర్వాత కొన్నియేండ్లకు మాతృశ్రీ శతతమజయంతిమహోత్సవాలు జరిగినవి. ఆ రెంటికిని తర్వాత నేటి యీ యుత్సవము తన సమర్థస్థానము నందుకొన్నది. ఒకసంవత్సర కాలము సాగబోవు ఉత్సవాలు ఇవి. ఇవి మనకు కావలసినంత ఉత్సాహమును ధైర్య మును బలము ఇయ్యక తప్పదు. ఆ ధైర్యబలో త్సాహాలతో మనము అనైకమత్యమువలని దౌర్బల్యమును, సోమరితనమును, అన్యద్వేష మును, అపకారపరాయణతను, మనవను లెట్టి వై యున్నను సంతుష్టులై యుండుటను, ఒరుల యొద్ద ఏమున్నను అందుకు కడుపుమంటపడు టను — దులిపివేసికొనవలెను. మనము దులిపి వేసికోవలసిన వివి. స్వామిజివలనను, ఇప్పుడు మనము తరింపవలసియున్న మహాపదలవలనను, ఉత్సాహముపొంది మనము వానిని దులిపివేసి కొందము గాక.

ఎవ రేమన్నను, మనము ముందుకే పోవు చున్నా మనుటకు నాకు సందేహము లేదు. నడుమనడుమ దారిలో ఉన్న గర్తములలో మనము పడ వచ్చు గాక, గమ్యమేమో నిశ్చి తమే. మిట్టపల్లాలు బొత్తిగాలేని దారియే లేదు. చదునైన దారికే వాడుకపడినవాడు మొత్తబాఱిపోవును, వినష్టు డగును. కావున కష్టములు కల్గినప్పుడు జీవితము దుర్భరమైన ప్పుడు, అవి దేవుని కృపాకార్యములే అని, పరీక్ష లని, భావింపవలెను. పరీక్షలో మనము తగ్గిపోకూడ దనెడి నిశ్చయము మన కుండ వలె. మన దేశమాతకు చిక్కులు కల్గి యున్న ఈ సమయములో వాని నెదుర్కొను సామర్థ్య మున మనము, స్వామిజి సంస్మరణముచే, కొఱ వడనివారముగ ఉందము గాక.

కోపంబు నడఁచిన గురుతరాధ్వరఫల, మింద్రియజయము మహేంద్రపదవి,
చలము వారించుట సామ్రాజ్యవిభవంబు, చాంచల్య ముడుగుట సకలసిద్ధి,
వెస నహంకారంబు విడుచుట భాగ్యంబు, దైన్యవర్జనమె యుత్తమగుణంబు,
నిందఁ బాసిన యున్కి నిరుపమలాభంబు, ఋణవిముక్తిం డౌట హృదయసౌఖ్య,
మింతకం టెను మేలు లే దెంచి చూడ మహితనీతిజ్ఞులైనట్టి మానవులకు,
కలితలక్ష్మీశ, సర్వజగన్నివేశ, విమలరవికోటిసంకాశ, వేంకటేశ ॥

శ్రీతాళ్ళపాక పెదతిరుమలార్య

# శ్రీ ప్రేమానందస్వామి

[సంపాదకీయము]

శ్రీరామకృష్ణుడు తనశిష్యులలో నొక ఆఱుగురిని ఈశ్వరకోటులు (దివ్యులు నిత్యముక్తులు) అని పేర్కొనెడివాడు. ఈ వరిష్ఠ వర్గమునకు జెందినవాడు శ్రీ ప్రేమానంద స్వామి. సాధారణముగా ప్రజ్ఞయు మహిమయు వెన్న తేలినట్లు పైకి తేలవు. సాగరాగాధములలో రత్నములు మఱుగుపడియున్నట్లు అవి తఱచు మఱుగుపడియుండును. శ్రీ ప్రేమానంద యోగి దివ్యసుందరుడు, మాధుర్యాంచితుడు. అతని పరిమళము భక్తులయు మిత్రులయు సంఘమును దాటి వ్యాపింపకున్నను శ్రీరామ కృష్ణునిసంతతిలో అతనిది అతి ప్రముఖస్థానము.

బెంగాలు హుగ్లీ జిల్లాలో ఆంతూపురు అను సుందరసంపన్న గ్రామమున 1861 డిసంబరు ఏడవ తేదీనాడు శ్రీ ప్రేమానందస్వామి జనించెను. అతని తల్లిదండ్రులు ఆగ్రామమందు మిక్కిలి సంపన్నములును వ్యవస్థితములును అగు కాయస్థకుటుంబములకు జెందినవారు. అతని తండ్రి తారాప్రసన్నఘోషు భక్తిగలవాడు. ఇలువేల్పగు శ్రీ లక్ష్మీనారాయణుని నిత్యారాధనను జరుపుటకును కుటుంబమునకుండు అక్కఱలను సునాయాసముగ తీర్చుకొనుటకును వలసినంత సంపద అతనికి పిత్ర్యముగ సంక్రమించినది. తారాప్రసన్నఘోషు అభయచంద్రమిత్రుని పుత్రికయగు మాతంగినీ దాసిని వివాహమాడెను. భగవత్ప్రవణతలో ఆమె భర్తకు మిక్కిలి అనురూపురాలు. కనుక వారిది సుఖదాంపత్యము. వారి కొక్క కూతురును ముగ్గురు పుత్రులును జనించిరి. కూతురి పేరు కృష్ణభావిని. పుత్రులపేళ్లు వరుసగా తులసీరాము, బాబురాము, శాంతిరాము. వీరిలో బాబురామే అనంతరకాలమున శ్రీ ప్రేమానందస్వామి యని ప్రసిద్ధి గాంచెను.

కల్కత్తా బల్రామ్బోసు (బలరామవసు) కృష్ణభావినిని పెండ్లియాడినందుల ఫలముగా కొన్నియేండ్లకు తారాప్రసన్నుని కుటుంబమునకు శ్రీరామకృష్ణునితో సన్నిహిత సంబంధము లభించినది. బలరాము శ్రీరామకృష్ణుని దర్శింప తఱచుగా పోవుచుండును. తనపత్నిని బిడ్డలనుగూడ తఱచుగా నతడు తనతో పిలుచుకొనిపోవుచుండును. ఒకనా డతడు తన అత్తగారినికూడ శ్రీరామకృష్ణునొద్దకు పిలుచుకొనిపోయెను. పరమభక్తురాలగు నామెకు శ్రీరామకృష్ణునితోడి సమాగమము పరమప్రీతికరమును ధన్యతావహము నయ్యెను.

భక్తులైన దంపతుల కుమారుడు గావున బాబురామునకును ఆధ్యాత్మికజీవితమువంకకు సహజప్రావణ్య ముండెను. కాని ఎల ప్రాయమున నున్న బాబురాముని ఆత్మకు సహజముగ నుండు గుణము లన్నియు వంశపూర్వులనుండి సంక్రమించినవే అని చెప్పుటకు వీలు లేదు. అతని బాల్యమునుగూర్చిన స్మృతులు కొన్ని యున్నవి. అవి యాదృచ్ఛికముగ భద్రపఱుపబడినవి. అనంతరసంభవములతో పోల్చిచూతుమేని అత్యధికమగు ఆ స్మృతులప్రాముఖ్యము స్పష్ట మగును. శిశువుగా వచ్చియు రాని మాటలాడుచున్నప్పుడే అతని మాటలలో వైరాగ్యము ధ్వనించెడి దట. చాల చిన్నవాడుగ నున్నప్పుడు ఎవరేని అతనిని పెండ్లి పెండ్లి అని పరిహాసించిరేని అతడు "అయ్యో!

నాకు పెండ్లి వలదు, నాకు పెండ్లి చేయకుడు, చేసితిరేని నేను చత్తును'' అని ఆర్భాటము చేసెడివాడట. పల్లెబడిలోని అతని సహచరులను ఒకానొక దివ్యప్రేమబంధము అతనివంకకు ఆకర్షించెడిది. తమకు ప్రియుడును సన్నిహితుడును అతడే అని వారు భావించెడివారు. ఎనిమిదేండ్లప్పుడు అతని లక్ష్యము కీకారణ్యముచే మఱుగుపడి ప్రజల దృష్టి కందని యొక చోట, ఒక కుటీరములో, ఒకసహచరసన్న్యాసితో విరక్తిజీవితము గడపుట. బాలుడుగా అతడు కన్న కలలు భవిష్యత్సంభవములకు ఎట్లు సూచకము లయ్యెనో మనము తెలిసికొనగలము. బాల్యమప్పటినుండి అతనికి సన్న్యాసులగోష్ఠియందు మిక్కిలి ప్రీతి. గంగాకూలములందు సాధువులదర్శనము విశ్వమునో హరుడగు సీబాలకుని ఆకర్షించెడిది. వారి గోష్ఠిలో నున్నప్పుడు కాల మెట్లు పరుగెత్తుచుండునదియు అత డెఱుగకుండును.

పల్లెబడిచదువు పూర్తికాగానే పైచదువుకు బాబురాము కలకత్తాకు వచ్చెను. కొన్నాళ్లు ఆర్యన్ స్కూలులో నుండెను. తుదకు శ్యాంపుకూరులోనున్న మెట్రోపాలిటన్ ఇన్‌స్టిట్యూషన్‌లో చేరెను. సుప్రసిద్ధ 'కథామృత' '(గాస్పెల్)' గ్రంథకర్తయగు శ్రీమహేంద్రనాథగుప్త అప్పుడు ఆపాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగ నుండెను. మఱియొక వింత యాదృచ్ఛిక సమాగమము—రాఖాలు (అనంతరకాలపు బ్రహ్మానందస్వామి) కూడ అదే బడిలో బాబురాము చదువుచున్న తరగతిలోనే చదువుచుండెను. ఒక నిగూఢబంధముచే ఈ బాలు రిరువురు నొండొరులచే ఆకృష్టులైరి. ఉభయులమధ్య ఆంతరంగిక బంధుత్వము ఏర్పడెను. సంవత్సరములు గడిచిపోవుకొలది ఆచుట్టఱికము దృఢపడెను. ఇంచుమించు ఈ కాలములోనే శ్రీరామకృష్ణుని ప్రభావము రాఖాలుపై ప్రసరించెను. అతడు అప్పుడప్పుడు దక్షిణేశ్వరమునకువచ్చుచుండెను. ఈమార్గాన శ్రీరామకృష్ణుని పవిత్రమాహాత్మ్యము బాబురాముదృష్టిని తాకెను. అవకాశము లేర్పడెను. అచిరకాలములోనే బాబురామునకు గురుదేవుని పరిచయ మేర్పడెను.

'జొరాసాంకో' లోని హరిసభయందు భాగవతము పఠింపబడుచుండగా వినుటకై శ్రీరామకృష్ణుడు వచ్చియుండెను. బాబురాము శ్రీరామకృష్ణుని మొదటిసారి చూచుట తటస్థించిన దచ్చటనే. శ్రీరామకృష్ణుని తానొకప్పుడు చూచిన జ్ఞప్తి బాబురామునకు బొత్తుగ లేకుండెను. దక్షిణేశ్వరములో నొక యోగి యున్నాడని, భగవన్నామము చెవిని పడినంతనే అతడు శ్రీగౌరాంగునివలె బాహ్యలోకస్మృతిని పూర్తిగ కోల్పోవు ననియు-తన జ్యేష్ఠసోదరుడు చెప్పగా బాబురాము వినియుండెను. ఆ యోగిని దర్శింప వలె ననునాత్రము బాబురామునకు కలిగెను. రాఖాలు తఱచు దక్షిణేశ్వరమునకు పోవుచుండుట బాబురా మెఱుగును. అవతలి శనివారమునాడు ఇద్దఱును కలిసి దక్షిణేశ్వరమునకు పోవునట్లు ఏర్పాటు చేసికొనిరి. నిర్ణీతదినమున పాఠశాల పని ముగియగనే ఇద్దఱును పడవలో బయలుదేఱిరి. దారిలో రామదయాళ చక్రవర్తి అను మిత్రుడు వీరితో కలిసికొనెను. అతడును తఱచు శ్రీరామకృష్ణుని దర్శింపవచ్చుచుండువాడే. రాత్రికి కూడ నుందువా అని రాఖాలు బాబురాము నడిగెను. తాము చూడబోవుచున్నది ఒకానొక సన్న్యాసి ననియు అత డొకగుడిసెలో నుండు ననియు

తలంచిన బాబురాము "అచట మనకు చో టుండునా" అని యడిగెను. ఉండ వచ్చు నని మాత్రము రాఖాలు చెప్పెను. భోజనమును గూర్చిన చింత గల్గి "రాత్రికి ఏమిభుజింతము" అని బాబురా మడిగెను. "ఎట్లో చేయుదము లే" అని రాఖా లనెను.

సూర్యు డస్తమించు నప్పటికి వారు దక్షిణేశ్వరదేవాలయమును సమీపించిరి. ఆపరిసర రామణీయకము బాబురామునకు ముచ్చట గొలిపెను. చూచుట కది దేవభూమివలె నుండెను. వారు శ్రీరామకృష్ణునిగదిలో ప్రవేశించిరి గాని ఆయన అచ్చట లేడు. రాఖాలు అతని నుండు మని పరుగున గుడి కేగెను. కొన్నినిమిషములలో అతడు శ్రీరామకృష్ణుని చేయి పట్టుకొని పిలుచుకొనివచ్చుచుండెను. గురుదేవుడు దైవోన్మత్తదశలో నుండెను. రాఖాలు దారిలో నున్న మిఱ్ఱుపల్లములను ముందుగా తెలుపుచు, తడబడుచున్న గురుదేవునకు దారి చూపుచుండెను. గదికి వచ్చి చిన్నమంచముపై కొంతసేపు కూర్చున్న తర్వాత గురుదేవునకు మామూలుస్మృతిమరల కలిగెను. క్రొత్తగ వచ్చినవారినిగూర్చి విచారించెను. రామదయాళు బాబురామును పరిచయపఱచెను. శ్రీరామకృష్ణుడు "ఓహో, నీవు బలరాముని బంధువవా, అట్లయినచో మాకును బంధువవే" అనెను. సంభాషణచే పరిచయము రవంత హెచ్చుగానే, శ్రీ రామకృష్ణుడు బాబురామునిచేతిని పట్టుకొని "దీపమునకు సమీపమునకు రమ్ము, నీ మోమును చూడనిమ్ము" అనెను. మిణుకు మిణుకు మనుప్రమిదవెలుగులో శ్రీరామకృష్ణుడు అతని ముఖలక్షణములను పరిశీలించెను. పరిశీలన వలన తెలియనైన విషయములకు సంతుష్టుడై ప్రశంసాసూచకముగ తల ఊపెను. తర్వాత బాలునిచేతులను కాళ్లను పరీక్షించెను. కడపట 'ఏదీ నీ అఱచేతిని చూడ ని' మ్మని చూచి ఆఅఱచేతిని తూచి చూచుటకో అనునట్లు తన అఱచేతిపై నుంచుకొనెను. తర్వాత "బాగున్నది బాగున్నది" అని చెప్పి రామదయాళువైపు తిరిగి "ఎంతో కాల మైనది, నరేంద్రుడు ఇచ్చటికి రానే లేదు. అతనిని చూడ వలె నను తహతహ నా కుత్కటముగ నున్నది. అతని నొకనా డిటకు ర మ్మందువా? మఱచిపోవు కదా!" అనెను.

రామదయాళు "అతని ర మ్మని తప్పక చెప్పుదు" న నెను.

రాత్రి ఆయెను. పదిగంట లైనవి. శ్రీ రామకృష్ణునకై రామదయాళు సమృద్ధిగా అన్నము తెచ్చి యుండెను. ఆయన అందులో ఇంచుకే తా నారగించి శేషమును ముగ్వురు భక్తులకు నీయవలసిన దని ఏర్పాటుచేసెను. తర్వాత శ్రీరామకృష్ణుడు వారిని "ఎచట నిద్రించుట మీకిష్టము, నా గదిలోనేనా, లేక బయటనా" అని అడిగెను. రాఖాలు గదిలోనే నిద్రించుట కిష్టపడెను. బాబురాము గదిలో తా నుండుట గురుదేవుని ధ్యానమునకు భంగకర మగునేమో అనుకొనెను. కావున గదిలోనే ఉండు డని శ్రీరామకృష్ణుడు చెప్పుచున్నను అతడును రామదయాళును వెలుపలనే నిద్రింతు మనిరి.

ఇరువురు భక్తులును నిద్రించిరి. ఇంతలోనే గూడకాపరుల అఱపులు వారినిమేల్కొల్పినవి. ఇంతలో శ్రీరామకృష్ణుడే వారి సమీపమునకు వచ్చెను. త్రాగిన వానివలె ఆయన తూలుచుండెను. వస్త్రము నాయనచంకలో జొన్పుకొనియుండెను. రామదయాళును పిలిచి

ఆయన "నిద్రించుచున్నావా?" అని అడిగెను. అతడు 'లే' దనెను. అంత శ్రీ రామకృష్ణు డెంతో ఆత్రముతో "దయచేసి అతనిని రమ్మనుమా. నాగుండె నెవరో ఇట్లు పిండుచున్నట్లున్నది" అని ఆయన గుడ్డను పిండి చూపెను. ఆయన ప్రతిమాటయు ప్రతిచేష్టయు నరేంద్రనాథ విరహమువలన ఆయన పొందుచున్న హృదయవ్యథను సూచించుచుండెను. "ఏమి ప్రేమ! ఐనను అతడు రాకుండుట ఎంత విచిత్రము!" అని బాబురా మనుకొనెను. శ్రీరామకృష్ణుడు తన గదివైపునకు కొన్నియడుగులు నడచెను. మరల రామదయాళుతో "మఱి అతనితో చెప్ప మఱువకుము" అని ఈమాటలనే మరల చెప్పి తూలుచున్న నడకతో ఆయన తన పాన్పుమీది కేగెను. ఒకగంట ఐన తర్వాత ఆయన మరల అగపడి తనహృదయభారమును రామదయాళున కిట్లు తెల్పుకొనెను—"ఇటు చూడు. అతడు పరమపవిత్రుడు. అతడు నారాయణునవతారమనియే నా నమ్మకము. అతనిని ఎడబాసి నేను జీవింపజాలను. అతని విరహము నాగుండె నిట్లు పిండుచున్న" దని మరల తన గుడ్డను పిండి చూపెను. దుర్భర మనోవేదనతో ఆయన "అతనికై నేను చిత్రహింసకు లోనగుచున్నట్లున్నాను, ఒక్కసారి అత డిటకు వచ్చుగాక" అనెను. ఆరాత్రి యంతయు ఆయన గంట కొకసారి వచ్చి ఇట్లు చెప్పి పోవుచుండెను.

మఱునాడు ప్రొద్దున బాబురాము శ్రీరామకృష్ణుని కలిసికొన్నప్పుడు ఆయన పూర్తిగా మాఱియుండెను. మోమున ఆతురము కనిపింపలేదు. తుపాను ఆగినతర్వాతి ప్రశాంత సాగరమువలె ఆయన యుండెను. పంచవటిని ప్రదక్షిణించి రమ్మని ఆయన బాబురాము నంపెను. అటుపోగనే అట వింత దృశ్యము అతని కన్నుల నాకర్షించెను. భవిష్యత్కాలమున ఏకాంతస్థలమున వసించు యోగిజీవితమును బాల్యమున అత డేలాగు భావనచేయుచుండెనో మన మెఱుగుదుము. బాల్యములో తాను కలగన్న తావును ఈపంచవటియు అభిన్నములుగ నుంట గుర్తించినప్పు డత డెంత అచ్చెరు వొందెను. ఈచిత్రమును ముందుగనే అంత సరిగా అత డెట్లు భావింపగల్గెను? అయినను ఈ విషయమును అతడు మనసులోనే ఉంచుకొని మరలి శ్రీరామకృష్ణు నొద్దకు వచ్చెను. "ఈచోటుపై నీయిష్ట మేలాగున్న"దని యడిగినందుకు అతడు "బాగున్న" దని మాత్రము చెప్పెను. తర్వాత గురుదేవు డతనిని కాళిగుడిని చూచి రమ్మని పంపెను. అతడు చూచి వచ్చెను. వీడ్కొని బయలుదేఱినప్పు డతనిని శ్రీరామకృష్ణుడు "మరల ర"మ్మని ప్రేమతో కోరెను.

- ఈ సమాగమము బాబురాముని చిత్తమున గాటముగ నాటుకొనెను. "ఈయన అసాధారణ సజ్జనుడు, నరేంద్రు డితని కత్యంత ప్రియుడు. మఱి నరేంద్రు డీయనయొద్దకు రాకుండుట వింతగ నున్న" దని అత డనుకొనెను. మఱుభానువారము ఎనిమిదిగంటలప్పుడు అతడు మరల దక్షిణేశ్వరమున కేగెను. శ్రీరామకృష్ణు డతనిని ఆదరించి "నీవు వచ్చితివి. మంచిది. పంచవటికి పొమ్ము. అట వారు వనభోజనము చేయుచున్నారు. నరేంద్రుడు వచ్చియున్నాడు. అతనితో సంభాషింపుము" అనెను. పంచవటియొద్ద రాఖాలు బాబురాము

నకు కననయ్యెను. రాఖాలు నరేంద్రుని, అట సమావిష్టులైన గురుదేవుని యువభక్తులను మఱికొందఱిని బాబురామునకు పరిచయ పఱచెను. ప్రథమదర్శనమునసే నరేంద్రుని గూర్చిన శ్లాఘ బాబురామునిలో నిండిపోయినది. అతనిచూచుట అనగా ప్రేమించుటే. నరేంద్రుడు మిత్రులతో మాటాడుచుండి, పాట పాడ దొడగెను. ఆ పాట బాబురామును ముగ్ధు నొనర్చెను. తదేకతానముగ విని "ఔరా, ఇతడెంత సర్వతోముఖ ప్రతిభుడు." అనుకొనెను.

శ్రీరామకృష్ణునితోడి మఱింత సన్నిహిత సంబంధమున కది సోపానమాయెను. దినములు గడచుకొలదియు గురుదేవుని ఉత్కటప్రేమయు పవిత్రతయు పావనతయు బాబురాముని నానాటికిని హెచ్చుగ ఆకర్షించెను. ఆయనతోడి తన చుట్టఱికము కేవల మీ జన్మకుమాత్రము సంబంధించినది కాదు, పెక్కు జన్మములుగా సాగుచుండునదే అన్న జ్ఞానము బాబురామునకు మెల్లగ ఉదయింప నారంభించెను. బాల్యదశలో అతనిస్వప్నములందును భావనలందును అస్పష్టముగ పద్యోచుండిన జీవిత మహోన్నతలక్ష్యములు ఇప్పుడు గురుదేవునిలో ప్రత్యక్షముగ నతడు గుర్తించెను.

శ్రీరామకృష్ణునొద్దకు వచ్చినప్పుడు బాబురాముని వయస్సు ఇరువదిసంవత్సరములు, కాని చూచుట కత డంతకంటె చిన్నవాడుగను అందగాడుగను నుండెను. ఐహికకళంకలేశమైనను లేని శీల మతనిది. నిజమునకు బ్రతికినన్నినాళ్లు నతనిలో శిశూచితామాయకత యుండినది. మానవులు సామాన్యముగ నడుగిడు చెడుదారు లత డెఱుగనే యెఱుగడు. అతని పరమపవిత్రతను గుర్తించిన శ్రీరామకృష్ణుడు తన మనమున నతని నత్యున్నత స్థానమున నుంచుకొనియుండెను. ఒక దృశ్యములో బాబురాము ఆయనకుహారాలంకృతకంఠయగు నొక దేవేరిగా కననయ్యెను. ఇందునుబట్టి అతని విశిష్టతను గురుదేవుడు గ్రహించెను. "ఇది క్రొత్తపాత్ర. ఇందులో పాలు పోయవచ్చు. విఱుగదు" అని ఆయన ఆ బాలుని గూర్చి చెప్పెడివాడు. "బాబురామునందలి ప్రతియెముకయు విశుద్ధమైనది. ఎట్టి అపవిత్రాశయమును అతనిమనశ్శరీరాల కంటదు" అనియు ఆయన చెప్పెను.

ఈపరమపవిత్రతచే బాబురాము శ్రీరామకృష్ణున కంతరంగపరిచారకుడుగ నుండ నర్హుడని తలంపబడెను. అతనిపొత్తు గురుదేవునకు ప్రియముగ నుండెను. శ్రీరామకృష్ణుని అంతరంగశిష్యులు 1879 నుండి రా నారంభించిరి. అప్పటినుండి వారు గురుదేవుని స్వాయముగ అపేక్షించుకొన నారంభించిరి. వారిలో రాఖాలును లాటును సుదీర్ఘకాలము గురుదేవుని పరిచర్య నిరంతరముగ గావించుచుండిరి. కొన్నాళ్లకు తర్వాత రాఖాలు అప్పుడప్పుడు దూరమేగ వలసి వచ్చెడిది. కావున గురుదేవుని అంతరంగపరిచర్యకు అప్పుడప్పుడు ఇబ్బంది గల్గుచుండెను. ఇతరు లున్నను, వివిధమనోదశలందున్నప్పుడు గురుదేవునకు వారి స్పర్శ సహ్యముగ నుండదు. కావున నొకనా డాయన బాబురాముతో "ఈదశలో అందఱి స్పర్శయు నాకు సహ్యము కాదు. నీవు నాతో నుండుము. చాల బాగుండును" అనెను. బాబురాము తఱచు గురుదేవునితో నుండ నారంభించెను. కాని ఇంట వా రేమందురో అను జంకుచే, శాశ్వతముగ అచ్చటనే ఉండు ధైర్య మతనికి కలుగ లేదు.

(సశేషము)

# శ్రీ వివేకానందస్వామి : సనాతనధర్మమహాప్రవక్త

శ్రీ యల్లంరాజు చెంచు సుబ్బారావుగారు, బి.కామ్, ఆనర్సు., ఎల్ఎల్.బి.

'ఎప్పు డెప్పుడు ధర్మానికి హాని కలుగుతుందో, అధర్మం వ్యాప్తిచెందుతుందో, అట్టి సమయాల్లో నే నవతరించి ధర్మరక్షణ చేస్తూ ఉంటాను. సాధువులను రక్షించడానికి దుష్టులను శిక్షించడానికి. ధర్మసంస్థాపన చేయడానికి ప్రతియుగంలో నేను జన్మిస్తూఉంటాను'. ఇవే గీతాచార్యుని ప్రమాణవాక్యాలు. ప్రత్యక్షంగా తాను జన్మించి యీ ధర్మపరిరక్షణ చేయడమే గాకుండా, పరోక్షంగాకూడా భగవానుడు ఈకార్యాన్ని జరిపిస్తూఉంటాడు- శంకర, రామానుజ, మధ్వాచార్యులు, శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీవివేకానందులు, రమణమహర్షి, సాయిబాబాలాంటి దివ్యమూర్తు లంతా ఇలా నియోగింపబడి జన్మించిన మహాపురుషులే. వీరంతా కారణజన్ములు. ఈ పవిత్రభారతదేశంలో సనాతనధర్మాన్ని పరిరక్షించి ప్రచారం చేయవలసిన మహాప్రవక్తలు కావడంవల్ల వీరిజన్మ కర్మలన్నీ అలౌకికాలు; దివ్యాలు. విశ్వనాథుడు, భువనేశ్వరి యను పుణ్యదంపతులకు కాశీవిశ్వేశ్వరుని వరప్రసాదంగా జన్మించిన యనుంగుబిడ్డడే వీరేశ్వరుడు. వీరేశ్వరుడే తర్వాత నరేంద్రనాథ్ అని నామాంతరం పొందాడు నరేన్, బీలే యని ముద్దుపేర్లతో వంగీయు లాతన్ని పిలిచేవారు. అమెరికాఖండమున కేగుటకు ముందు ఖేత్రీమహారాజుకోరిక ననుసరించి ధరించిన దివ్యనామమే -వివేకానందస్వామి.

వివేకానందుని బాల్యజీవిత మంతా ఆటపాటల్లో గడచిపోయింది. సాధువులతో చెలిమి, సీతారాములపూజ, రామాయణకథాశ్రవణం తనబాల్యజీవితంలోని విశేషాలు. ఆరవయేట విద్యాభ్యాసం ప్రారంభించి, యేడవయేటనే వివేకానందుడు రామాయణమహాభారతాలు కంఠస్థంచేశాడు. ఈయన యేకసంథాగ్రాహి. బాల్యంనుండే యీయనకు బ్రహ్మచర్యంపై, పరివ్రాజకజీవితంపై ఆసక్తికలిగింది. బాల్యంలో వివేకానందుడు- అహమద్ ఖాన్ వేణీగుప్తలనే సుప్రసిద్ధగాయకులవద్ద సంగీతాన్ని అభ్యసించాడు. కాని వివేకానందుడు చిరకాలంలోనే గానసరస్వతిని విడనాడిముక్తికాంతకై తహతహలాడసాగాడు. ఆంగ్లము, దేశచరిత్ర, సంస్కృతము, తత్త్వశాస్త్రము లన్న వివేకానందునికి అభిరుచి మెండు. వివేకానందుని కార్యదీక్ష, ధర్మవిశ్వాసమే ఆయన్ను పట్టభద్రు నొనర్చాయి. అనంతరం ఆయన కళాశాల్లో న్యాయశాస్త్రాన్ని చదివారు. బి. ఎల్. చదివికూడా ఆయన పరీక్షకు హాజరు కాలేదు. సనాతనధర్మప్రవక్తయయిన మహాత్మునికి ఈ పొట్టకూటి చదువులు రుచింపకపోవడంలో విశేష మే మున్నది! అప్పటిస్థితిలో భగవత్సాక్షాత్కారమే వివేకానందుని ధ్యేయం. ఈలక్ష్యసిద్ధికే ఆయన బ్రాహ్మసమాజంలో చేరాడు. నిరాకారుడయ్యు భగవంతుడు సగుణుడే యన్న వారిసిద్ధాంతం ఆయనకు నచ్చ

లేదు. ఈయాశయపూర్తికోసమే, వివేకానందుడు సద్గురువును వెదకుకుంటూ మహర్షి దేవేంద్రనాథఠాకూరును దర్శించి ఆయనవలన తనశంక తీరమి, విఫలు డయ్యాడు. కడకు సురేంద్రనాథనే మిత్రునింట వివేకానందునికి శ్రీరామకృష్ణపరమహంస దర్శనభాగ్యం లభించింది. 'తాము దేవుని జూచితిరా?' అనే వివేకానందుని ప్రశ్నకు శ్రీరామకృష్ణులు చక్కని సమాధాన మిచ్చారు. వెంటనే రామకృష్ణులు వివేకానందునిలోని పవిత్ర తేజాన్ని గుర్తించగలిగారు. 'నరేన్, నీవు ధ్యానసిద్ధుడవు. భగవత్సాక్షాత్కారము నీకు తప్పక కలుగుతుంది. నాలాగే నీవు ఆయనతో సంభాషించవచ్చును.' అని సాంత్వన వాక్యాలతో గురుదేవులు జిజ్ఞాసురూపంలో తన్ను సమీపించిన వివేకానందున్ని సంతుష్టిపరచారు. క్రమంగా రామకృష్ణులు తనదివ్యతేజాన్ని శిష్యునిలో ప్రవేశపెట్ట సాగారు. ఒకసారి గురుదేవులు తన కుడిపాదాన్ని వివేకానందుని శరీరంపై నుంచి ఆయన కొక యపూర్వ దివ్యానుభవాన్ని కలుగజేశారు, మఱొకసారి, సమాధిమగ్నులై, వివేకానందుని స్పృశించి ఆయనవద్ద కొన్ని యమూల్యరహస్యాలను సేకరించారు. వివేకానందుడు సిద్ధయోగి యని, ఆత్మద్రష్ట యయిన మహర్షి యని, యోగమార్గమున శరీరత్యాగ మొనర్చు నని శ్రీరామకృష్ణులు గ్రహించగలిగారు. నరేంద్రుని జననమునకు పూర్వమే శ్రీరామకృష్ణులు తమ దివ్యదృష్టిచే ఆయన్నుగూర్చి చాలా ఆశ్చర్యకరములైన విషయాలను సేకరించారు.

గురుపాదస్పర్శచేతనే, ఆయన అఖండాధ్యాత్మికశక్తి వివేకానందునియందు ప్రవేశించి సంపూర్ణవికాసం పొందింది. 'బ్రహ్మచర్యము నవలంబించినచో సూక్ష్మగ్రహణశక్తి వికసిసుంది. మనస్సుకు, బుద్ధికి అతీతమయిన సూక్ష్మవిషయాలను గ్రహింపగలుగుతాము. అట్టి విశుద్ధ విజ్ఞానంచేతనే భగవత్సాక్షాత్కారం పొంద వచ్చును.' గురుదేవుని యీ యుపదేశవాక్యాలే వివేకానందున్ని పరివ్రాజకాచార్యునిగా రూపొందించాయి. మరియు కామకాంచనవిజయాన్నిగూర్చి కూడా రామకృష్ణులు ప్రబోధం కావించారు. తన యిష్టమగు రామమంత్రాన్ని గురుదేవు లవసానదశలో వివేకానందుని కుపదేశించారు. కడకు రామకృష్ణుల యవతారంకూడా తామే నని శిష్యునికి వినిపించి, రామకృష్ణు లస్తమించారు.

శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరం వివేకానందుడే ఆయనవారసు డయ్యాడు. బరానగరమఠమున విరజాహోమ మొనర్చి తానును, సోదరశిష్యులును సమంత్రకముగ సన్న్యాసదీక్ష స్వీకరించారు. పరివ్రాజకదశలో వివేకానందుడు ఉత్తరదేశ తీర్థయాత్రలు కావించాడు. ఈయాత్రాసమయంలోనే ఆయన యీశ్వరానుభూతి పొందగలిగాడు. ఒకనాడు, వివేకానందుడు దుర్గాలయంనుండి వస్తూ ఉండగా, కోతులగుంపొకటి ఆయన్ను వెంటాడింది. వివేకానందుడు భయపడి పరుగెత్త నారంభించగా — "పాఱిపోకుము, పశువుల నెదుర్కొనుము!" అని యొకవృద్ధసన్న్యాసి కంఠరవం వినిపించింది. మఱొకసారి, కరతలభిక్షస్తలతరువాస: అన్న శంకరభగవత్పాదుల యుపదేశాన్ని స్మరించుకొని బృందావనమున కేగి యట గోవర్ధన పర్వతానికి ప్రదక్షిణ మొనర్చి వివేకానందుడు క్షుద్బాధతో యాత్రసాగించాడు. కాని వెనుకనుండి యెవరో—"ఇదిగో, మీ కాహారము

దెచ్చుచున్నా" నని పిలుచుట యాతనికి విని పించింది. పరమేశ్వరకృపను పరీక్షింప నిశ్చ యించుకొని వివేకానందుడు శక్తికొలది పరు గెత్తనారంభించాడు. కాని వెంబడించినవ్యక్తి వివేకానందున్ని ఒక మైలుదూరంలో పట్టు కొని — భుజించగానే యా యజ్ఞాతవ్యక్తి యదృశ్యు డయ్యాడు.

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం
యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహా మ్యహమ్॥

అనే గీతావాక్యాన్ని తలచుకొని వివేకానందు డశ్రువులు రాల్చాడు.

కాని శ్రీరామకృష్ణుల యుపదేశసౌరభ మందిన వివేకానందుడు పుష్పించి పరిమళిం చింది అమెరికాఖండంలోనే. 1893-వ సంవ త్సరమున అమెరికాలో జరిగిన విశ్వమతసభ ప్రపంచచరిత్రలోనే ఒక యపూర్వసంఘటన, నాడు సర్వమతసభలో వేదాంతకేసరి కావిం చిన గర్జనలు, ఈనాటికి పాశ్చాత్యుల హృద యాంతరాళాల్లో మాఱుమ్రోగుతున్నాయి. ప్రాక్పశ్చిమఖండాల్లో పేరుగాంచిన తత్త్వకోవి దులతో, పండితప్రకాండులతో నిండిన సభా భవనంలో అలనాడు అద్వైతకేసరి, ఈశ్వర ప్రేరితమహావక్త, సనాతనధర్మమహాప్రవక్త, విద్యావాచస్పతి, వేదాంతశిరోభూషణము అయిన శ్రీవివేకానందస్వామి కావించిన యుత్తేజకరములై భావోద్రేకాలతో కూడు కొని, భారతీయసనాతనధర్మంలోని విశిష్టతను లోకానికి వెల్లడించే గంభీరోపన్యాసాలు, భాషణప్రవచనాలు 'షికాగో ఉపన్యాసములు' అనే పేరుతో ప్రసిద్ధి కెక్కాయి. విశ్వమత సభలో స్వామివారు కావించిన ప్రవచనాలను స్మరించుట భారతీయుల పవిత్రకర్తవ్యము. శ్రీస్వామివారి సూక్తిముక్తావళిలోని కొన్ని కొలికిపూసలు.

"రుచీనాం వైచిత్ర్యా
దృజుకుటిలనానాపథజుషామ్
నృణామేకోగమ్య
స్త్వమసి పయసామర్ణవ ఇవ ॥

—శివమహిమ్నః స్తోత్రము, 7.

'వివిధప్రదేశాల్లో పుట్టిననదులు సముద్రంలో కలియునట్లే, వివిధభావాలతో మానవు లను సరించే వివిధారాధనమార్గాలు – వక్రము లైనను, అవక్రములైనను, సర్వేశ్వరా నిన్నే ప్రాపింపచేస్తున్నాయి!

"యే యథా మాం ప్రపద్యన్తే
తాంస్తథైవ భజా మ్యహమ్॥"

—భగవద్గీత, 4-11.

* * *

వివేకానందస్వామివారు ప్రకటించిన విని ర్మలమనోభావాలు, విశాలదృక్పథం పరమత సహనం, సర్వమతసామరస్యం – సభ్యులను మంత్రముగ్ధులనొనర్చి సమ్మోహితుల గావిం చాయి పాశ్చాత్యులకు స్వామివా రొసగిన యుపన్యాసాలు జగత్ప్రసిద్ధమయినవారి 'సనా తనధర్మప్రకాశిని' (Paper on Hinduism) లో పొందుపరచబడ్డాయి. దేశకాలాల కతీత మైన సనాతనధర్మమే స్వామివారు ప్రదర్శిం చిన హిందూమతము.

ఈసందర్భంలో అమెరికాలోని ప్రఖ్యాత కవయిత్రి యయిన విల్కాక్సు ఇలావ్రాసింది.

"స్వామివారి యుపన్యాసాలు విని ప్రభా వితుడైన నాభర్త—'ఇదియే నేనింతకాలము

నుండి వాంఛిస్తూ, వెదకుతున్న మతము, భగవద్భావము, తత్త్వము' అనినాతో వచించారు.''

సోదరిని వేదిత ప్రశంసావాక్యాలుగమనింపదగ్గవి:

''వివేకానందస్వామియొక్కడే సర్వమతగమ్యప్రాయమయిన మహోత్కృష్టమతమును గూర్చిబోధింప వచ్చిన మహనీయుడు...''

క్రైస్తవుల్లో స్వమతాభిమానపూరితులయిన సనాతనులుసహితం 'వివేకానందుడు సాక్షాన్నరేంద్రు' డని పల్కిరి.

షికాగోసభనుండి బయటికివస్తూ ఒక క్రైస్తవమతాచార్యుని వాక్యాలను బిసెంటుమాత ఇలా వివరించింది.

''ఆమహనీయుడా, క్రైస్తవమతబాహ్యుడు (Pagan) ఆమహనీయుని దేశీయులయొద్దకా మన క్రైస్తవమతబోధకులను పంపుట! వారే మనయొద్దకు మతబోధకులను పంపుటఉచితం.''

''ఈమహనీయునిముందు మనవిశ్వవిద్యాలయపండితోత్తములు కేవలం పసిబాలురు'' అని పూజ్యుడయిన మిక్సపండితుడు స్వామివారినిగూర్చి వాక్రుచ్చారు.

షికాగో విశ్వమతసభానంతరం, స్వామివారిని ఈశ్వరప్రేరిత మహావక్తయని అమెరికాలోని న్యూయార్కుక్రిటిక్ పత్రిక ప్రకటించింది. శ్రీవివేకానందులు ఈదిగ్విజయయాత్రలోనే షికాగో, బోస్టన్, కేంబ్రిజ్, వాషింగ్టన్, న్యూయార్క్ మొదలయిన ముఖ్యపట్టణాలన్నీ దర్శించి భారతీయుల సనాతనధర్మాన్ని, హైందవవిజ్ఞానాన్ని సహస్రముఖాల వ్యాప్తిచేశారు. దీన్నే పాశ్చాత్యదేశాల్లో స్వామి వారి సనాతనధర్మవిజయయాత్రగా వర్ణింప వచ్చు.

సనాతనధర్మప్రచారం, మాతృదేశపునరుద్ధరణ — ఇవే స్వామివారి మహత్తర ఆశయాలు. పాశ్చాత్యదేశాల్లో శ్రీ స్వామివారికి పరమేశ్వరానుగ్రహం, దివ్యానుభూతి విశేషంగా లభించాయి. అనేకపర్యాయాలు అర్ధరాత్రిసమయంలో స్వామికి మఱుసటిదినం తాను ఉపన్యసింపవలసిన విషయాన్ని గూర్చి యెవరో యొక వ్యక్తి తనయెదుట ఉపన్యసిస్తున్నట్లు వినబడుచుండెడి దట. అదియే మఱునాడు స్వామివారి యుపన్యాసము—'ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా' అను మహావాక్యమే స్వామివారి జీవితంలో చరితార్థమైంది. స్వామివారు ప్రకటించిన రాజయోగసిద్ధాంతాలు సుప్రసిద్ధమానసికశాస్త్రవేత్తయయిన విలియమ్ జేమ్సులాంటి యనేకపాశ్చాత్యపండితుల దృష్టిని భారతీయవిజ్ఞానంవైపు మరల్చాయి. స్వామితో జేమ్సుపండితు డనేకవిషయాలనుగూర్చి చర్చించాడు. 'తత్త్వానుభవరత్నాకరము' (Varieties of Religious Experience) అను తన సుప్రసిద్ధ గ్రంథంలో స్వామి నీతడు 'వేదాంతిశిరోభూషణము' (The Paragon of the Vedantins) అని పేర్కొన్నాడు. సహస్రద్వీపవనమున స్వామి శిష్యులకొసగ్గిన మహోపదేశాలే 'ప్రబోధరత్నాకరము' (Inspired Talks) అనే ఆయన సుప్రసిద్ధ గ్రంథంగా రూపొందాయి. ధనాధికులకు బోధించి వారి నాకర్షించుటకంటె, మానవులనందఱిని సమానదృష్టితో నాదరించి పునీతులను చేయవలయునని స్వామివారొక యాంగ్లమిత్రుని కిచ్చిన యుపదేశమే వారి 'యతిగీతము' (Song of the Sannyasin) న్యూయార్కుపట్టణంలో స్వామి నిర్విరామంగా ఉపన్యాసాలు కావిస్తూ, 'ఆశూపన్యాసకశిరోమణి' యని పేరుగాంచారు.

స్వామినిగూర్చిన యిట్టి ప్రశంస లన్నిటిని సోదాహరణంగా వ్రాయ దలిస్తే, ప్రత్యేక మొకగ్రంథంగా తయారు కాగలదు

ఈ పర్యటనలోనే స్వామివారికి మాక్సు మ్యుల్లరు పండితుని పరిచయం లభించింది. మ్యుల్లర్ దంపతులు గురుభక్తితో స్వాముల కాతిథ్య మిచ్చారు.

అఖండ భోగైశ్వర్య శక్తి సమన్వితమయిన పశ్చిమఖండమున నాలుగేండ్లు నివసించిన వెనుక ఒక ఆంగ్లమిత్రునిప్రశ్నకు స్వామివారిచ్చిన ప్రత్యుత్తరము - శ్లాఘనీయము; పూజార్హం; వారి యనన్యదేశభక్తి కొక దివ్యాభరణం. "నే నిచటికి వచ్చుటకుముందు మా దేశము నూరక ప్రేమించితిని. ఇప్పుడో, భారతదేశపుధూళి నాకు పరమపవిత్రము; భారతదేశపుగాలి నాకు మహాభాగ్యము, భారతదేశ మిపుడు నాకు పావనతమపుణ్యక్షేత్రము". ఇదే స్వామివారి సమాధానం.

మాతృదేశానికి తిరిగి వచ్చి శ్రీవివేకానందులు శ్రీరామకృష్ణమఠం, సేవాసంఘాలు స్థాపించారు. లోకమానవకల్యాణానికై, విశ్వశాంతికై - శ్రీరామకృష్ణపరమహంస, బోధన పూర్వకంగాను, స్వీయజీవితమున ఆచరణ పూర్వకంగాను ప్రకటించిన ధర్మతత్త్వాలను వ్యాప్తిచేయుటయు, ఐహికాముష్మికశ్రేయస్సు__ యీ ధర్మముల నాచరించుటకు పరులకు సహాయపడుటయే శ్రీరామకృష్ణసేవాసంఘో ద్దేశ్యము.

స్వీయముక్తికోసం శ్రీవివేకానందస్వామి ఎప్పుడూ తపించలేదు. మానవసేవయే మాధవ సేవ యని వారిసిద్ధాంతము. ఎవడు జీవారాధకుడో, అతడే ఈశ్వరారాధకు డని స్వామివారు శాసించిన మహత్తరప్రబోధం

భారతదేశంలోని దీననారాయణులను, ఆర్తనారాయణులను, దుష్టనారాయణులను సేవించడమే స్వామివారి ఆకాంక్ష.

దీనదేవో భవ, దరిద్రదేవో భవ, మూర్ఖదేవో భవ. "ఈ పవిత్రభారతదేశంలో ఒక కుక్క అయినా క్షుద్బాధతో బాధపడకుండునంతవఱకు మరలమరల వేయిసార్లైనను ఈ పవిత్రసీమలో జన్మించి సమాజపునరుద్ధరణకు శ్రమిస్తా నని, స్వీయమోక్షేచ్ఛ తనకు లే" దని శ్రీవివేకానందస్వామివారు ఎలుగెత్తి చాటారు.

శ్లో॥ న బుద్ధిభేదం జనయే
దజ్ఞానాం కర్మసఙ్గినామ్,
జోషయే త్సర్వకర్మాణి
విద్వా న్యుక్త స్సమాచరన్.

'కర్మమునం దాసక్తులయిన యజ్ఞానులకు, జ్ఞాని బుద్ధిభేదాన్ని కల్పింపరాదు. అసలువిషయ మేమన, తాను పూనికతో కర్మములను చేస్తూ, వారిచేగూడ చేయింపవలెను' అనే గీతావాక్యా న్ననుసరించే స్వామి సర్వదా వర్తించారు.

వేయేల, వివేకానందునిపథము - ధర్మపథము; జీవనము - పావనఋషిజీవనం; చరితము - దివ్యచరితం; వాక్కు - వేదవాక్కు; వాణి - ఆర్షవాణి; సందేశము - ఉపనిషత్సందేశము; తత్త్వము - గీతాతత్త్వము; మతము - విశ్వమానవకల్యాణదాయియగుసనాతనహైందవమతము; తేజస్సు - బాలభాస్కరుని తేజం; వాదము - మానవతావాదం; శక్తి - శివశక్తి; గర్జనం - సింహనాదం; శాంతి - విశ్వశాంతి; కల్యాణం - జగత్కల్యాణం; శ్రేయస్సు - విశ్వమానవశ్రేయస్సు; ఆరాధన - జీవారాధన, సేవ - మానవసేవ; దృష్టి - సార్వజనీనదృష్టి;

ఆత్మ – విశ్వాత్మ; ముక్తి – సర్వజనులవిముక్తి; జయం – కామకాంచనవిజయం.

"ఉత్తిష్ఠత! జాగ్రత!
ప్రాప్య వరా న్నిబోధత!—"

"లెండు, మేల్కొనుడు, పరమపదప్రాప్తి పర్యంత మాగవలదు." ఇదియే శ్రీరామకృష్ణ వివేకానంద సందేశము! ఇతి శివమ్.

జననీం శారదాదేవీం
రామకృష్ణం జగద్గురుమ్।
పాదపద్మే తయోః శ్రిత్వా
ప్రణమామి ముహు ర్ముహుః॥
భుక్తిముక్తికృపాకటాక్షప్రేక్ష
ణ మఘదళవిదళనదక్షమ్,
బాలచన్ద్రధర మిన్దువన్ద్య
మిహ నౌమి గురువివేకానన్దమ్.
హరిః ఓం తత్ సత్.



# భారతదేశమునకు శ్రీవివేకానందుని సందేశము

(బ్రహ్మచారిణి శర్వాణి)

చాలకాలముక్రిందటినుండి భారతదేశము ప్రప్రథమమున మతధర్మములోను, ఆధ్యాత్మిక జ్ఞానములోను, తత్త్వవిద్యలోను, సంస్కృతి లోను మహాప్రసిద్ధిగాంచినది. లోకమున ఎన్న డేని అవతరించిన అత్యంతపూజ్యులగు గొప్ప గొప్పఋషిసత్తముల పాదస్పర్శచే అతిపవిత్ర క్షేత్రమైనది.

ఆదర్శపురుషుడైన శ్రీవివేకానందుడు కావిం చిన ప్రథమోపన్యాసమున ప్రారంభవాక్యము లివి — "పుణ్యభూమి అనిపించుకొనునర్హత గల దేశ మొకటి యుండునేని, కర్మఫలాను భవమునకై సకలాత్మలును వచ్చి చేరవలసిన చో టొకటి ఉండునేని, దేవునిచేర పురోగ మించుచున్న యొక్కొక్క యాత్మయు తన చరమనివాసముగ చేరు తా వొకటి ఉండునేని, శాంత్యౌదార్యపవిత్రతలందు అత్యున్నతదశ నందుకొన్న మానవులు వసించుస్థల మొకటి ఉండునేని అంతర్ముఖతయు ఆధ్యాత్మికతయు వెలయుచో టొకటి ఉండునేని – అది భారత దేశమే".

అట్టి భారతదేశము నేడు ఎన్నియో విషమ సమస్యల నెదుర్కొనుచున్నది. ఎచ్చటను నేడు శాంతి లేదు. దారిద్ర్యమువలనను, అజ్ఞా నమువలనను జాతులమధ్య కలహములు, కొట్లాటలు, కుతంత్రములు ప్రత్యక్ష మగు చున్నవి. ఈ పరిసితులలో మానవుడు తన నిత్యజీవితమును గడపుటయే ఒకమహాసమ స్యగా నున్నది. యుగయుగాంతరములనుండి గొప్పగొప్పమహర్షులు, జ్ఞానులు, భక్తులు ఉప దేశించిన ధర్మమార్గములు ప్రజలకు రుచిం చుట లేదు. దైవభీతి, దైవవిశ్వాసము, ధర్మా సక్తి, నియమనిష్ఠానురక్తి క్రమక్రమముగా నడు గంటుచున్నవి. అసూయ, ద్వేషము, కామ క్రోధమోహములు, దేశము నలువైపుల విజృం భించి తాండవమాడుచున్నవి. దీనికితోడు భారతదేశము, మహోత్తమజాతీయాదర్శము లైన త్యాగ, సేవలకు దూరమై పోవుచున్నది.

మనహిందువుల సిద్ధాంత మే మనగా, అమృతత్వమును పొందుట. ఇది సర్వపరిత్యా గమువలన కలుగుచున్నది. మన పూర్వకాలపు

ఋషులుకూడ ఇట్లు చెప్పిరి. "ప్రజయా ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః" (సంతానముద్వారమున గాని, సంపదద్వార మున గాని అమృతత్వమును పొందజాలవు, త్యాగముచేత మాత్రమే అది సాధ్యమగును.)

కాబట్టి ఇటువంటి పరిస్థితులలో భగవాను డైన శ్రీరామకృష్ణుని ప్రియతమశిష్యుడును, యుగాచార్యుడైన శ్రీవివేకానందుడు భారత దేశసనాతనధర్మమును, సంస్కృతిని వదలక, దూరదృష్టితో దాని గొప్పతనమును గాంచి ఎటువంటి జంకుగొంకులు లేక నిర్భయముగా చైతన్యమయమగు సందేశము నిచ్చెను. ఈ దివ్యసందేశము విధ్వంసము చేయునది కాదు. కాని సర్వకాల సర్వావస్థలయందు చాల అవ సరమైనది. మఱియు ఈ వర్తమానపరిస్థితులలో ఒక్క భారతదేశమునకే గాక, సమస్తవిశ్వము నకును చాల జరూరు.

సర్వతోముఖప్రతిభాశాలియగు శ్రీ వివేకా నందుడు సహనసహిష్ణుతాసిద్ధాంతమును ప్రచారము చేసెను. శివమహిమ్నఃస్తోత్రములో చెప్పినట్లుగ —

"రుచీనాం వైచిత్ర్యాద్
ఋజుకుటిలనానాపథజుషాం।
నృణా మేకో గమ్య
స్త్వ మసి పయసా మర్ణవ ఇవ"॥

ఏకగంతవ్యమునుజేర్చు ననేకమార్గములే వివిధ మతము లని స్వామిజీ బోధించెను. కావున హిందూధర్మము, సర్వమతములపట్ల సహన మును, మైత్రిని పాటింపవలయునని చెప్పెను.

స్వామిజీ ఈ ఒక్క సహనమునే ప్రచారము చేయ లేదు. కాని బలము, పౌరుషము, సాహ సము అవసర మని సూచించెను. అందులోను ముఖ్యముగా శీలబలము, భయరహితత్వమును బోధించెను. మన దేశమును ప్రపంచపటమున ఇతరదేశములకంటె ప్రముఖస్థాన మధిష్ఠింప చేయ వలయు ననిన దేశమంతయు బలిష్ఠకాయు లైన యువకులు కల్గియుండవలె నని ఆశించెను. ఆయన ఇట్లనెను : "బలహీనమగు మెద డేమియు చేయజాలదు. దానికి మనము పుష్టి కలిగింపవలెను. మన యువకులు బలిష్ఠకాయు లగుట మొదటికర్తవ్యము. మతజ్ఞానము పిదప వచ్చును. పారమార్థికలోకమును చేరుటకు గీతాపఠనముకన్న 'ఫుట్ బాల్' ఆట ఎక్కు వగా ఉపకరించును. భుజకండరములును ఇతర కండరములును, ఇంక కొంత బలిష్ఠములైన పిదప మీరు భగవద్గీత నిప్పటికన్న బాగుగా గ్రహింపగలుగుదురు" అని యువకులను హెచ్చ రించెను. "తరుణవయస్కులును, బలయుతు లును, ఆరోగ్యవంతులును, సూక్ష్మబుద్ధిశాలు లును మాత్రమే బ్రహ్మమును ప్రాపింపగల్గు దురు" అని వేదములు ఘోషించుచున్నవి. కాబట్టి భారతదేశపునరుద్ధరణకు అటువంటి తరుణవయస్కులైన యువతీయువకులు కావలె నని స్వామిజీ కోరెను.

భారతీయులలో ఆత్మవిశ్వాస మంతరించి యుండె ననియు, అదే వారి శారీరక మానసిక సారహీనతకు హేతువు అనియు, ఆ బలహీన తయే వారినీచతకు, అసూయకు, అనైకమత్య మునకు కారణ మని స్వామిజీ గ్రహించెను. ఆ బలహీనతను రూపుమాపి వారిలో శ్రద్ధను లేపుటకై, వారు గోల్పోయిన వ్యక్తిత్వమును మరల కలిగించుటకై, భారతజాతీయ స్వరూప మును రూపొందించిన దివ్యద్రష్ట శ్రీ వివేకా నందుడు ఇట్లనెను : "కఠోపనిషత్తులోగల శ్రద్ధ (అద్భుతవిశ్వాసము) అను దివ్యశబ్దము నా మనస్సులో నాటుకొనిపోయినది. శ్రద్ధాసందేశ

బోధయే నా జీవితోద్దేశము. ఆత్మవిశ్వాసము ప్రప్రథమమైనది. మన ఆత్మవిశ్వాసము పునరుజ్జీవింపచేయబడవలెను. అప్పటికి గాని మన దేశము నెదుర్కొని యున్న సమస్య లన్నిటిని మనమే క్రమక్రమముగా పరిష్కరించుకోగల శక్తి మనకు లభింపదు. కావలసినది చిత్తశుద్ధి, ఓరుపు, పట్టుదల — ఈ మూడును కార్యసిద్ధికత్యావశ్యకములు''.

''కావలసినది బలము, పౌరుషము, బ్రహ్మతేజస్సహకృతమైన క్షత్రియవీర్యము'' అనెను. కాబట్టి ఇటువంటి శ్రద్ధ, ఆత్మవిశ్వాసము మనలో కలిగినయెడల మన దేశమును, సంఘసంస్కరణలతో, జాతీయతతో నింపుటకు ముందు స్వామిజీ కోరినట్లుగా పూర్తిగా దైవికముగ దివ్యభూమిని చేయగల మనుటలో నే సందియము లేదు.

స్వామి వివేకానందుడు పరివ్రాజకుడై, పాదచారియై హిమాలయపర్వతపాదమునుండి కన్యాకుమారిఅగ్రమువఱకు ఏకాకియై సంచరించినప్పుడు భారతదేశస్థితి, అందులోని ప్రజల అజ్ఞానము, పేదఱికము, మహిళలదుఃస్థితి, దానికితోడు సంకుచితత, అసూయ మొదలగునవి ఆయనకు మనోవ్యథను కలిగించి ఆయన హృదయమునుండి రక్తమును స్రవింపచేసెను.

మన భారతదేశపతనమునకు కారణము కేవలము మన ప్రాచీనకాలములోని జాతిభావమును విడనాడుటయే యని స్వామిజీ చెప్పెను. వర్ణవ్యవస్థల తొల్లింటి ప్రాముఖ్యప్రయోజనము లడుగంటి, అవి లక్షలాది ప్రజలకు కేవలము ఇబ్బందులు కలిగించినవి. భగవద్గీతలో తెలిపినట్లు జాతి నశించిన లోకమే నశించును. నేటి వర్ణవ్యవస్థ సరియైనది కాదు. ''జాతికి సంపూర్ణ స్వాతంత్ర్యము నొసగుటచేతనే మన మభివృద్ధి నొందగల'' మని స్వామిజీ సూచించెను. కావున భారతదేశమందలి కులసమస్యలను గుఱించి వివిధకులములవారు పోట్లాడుకొనుటవలన ప్రయోజన మేమియు లేదనియు, కావలసినది పరిశుద్ధాత్మ యని స్వామిజీ నుడివెను.

క్రుంగి లొంగి పోయి యున్న నిమ్నజాతుల నుద్ధరించినగాని మన దేశమునకు విముక్తి లేదని శ్రీ వివేకానందుడు తనప్రసంగములలోను, ఉపన్యాసములలోను, ప్రతిలేఖలోను సూచించెను. ''పైవారిని క్రిందికి పడలాగుటవలన కాక, క్రిందివారిని పైకి లేవదీయుటవలననే ఈ సమస్య పరిష్కారము కాగలదు'' అని స్వామిజీ చెప్పెను. ''నీచజాతిపురుషునికైనను శుశ్రూష చేసి, పరావిద్యను నేర్చుకొనుము. చండాలునికైనను సేవ చేసి ముక్తికి త్రోవను తెలిసికొనుము'' అని మనువుకూడ బోధించుచున్నాడు.

భగవంతునిదృష్టిలో అందఱు సమానులే అని స్వామిజీ వాక్యము. ఇది వేదములలోకూడ చెప్పబడియున్నది. ఆయన స్త్రీ, పురుషుల సమత్వమును 50 సంవత్సరములక్రితమే సూచించెను. ఆయనమాటలు ''ప్రతిపురుషుని, ప్రతిస్త్రీని, ప్రతినరుని, భగవన్మూర్తిగా భావించుచుండుము. ఎవరికేనియు నీవు 'సాహాయ్యము' చేయజాలవు. భగవంతుని బిడ్డలను సేవింపుము. తనబిడ్డలలో నెవరికేని సాహాయ్యము చేయగల శక్తిని భగవంతుడు నీకు ప్రసాదించినచో నీవు అదృష్టవంతుడవు. అంతేకాని స్వాతిశయభావము వహింపకుము. ఆ సాహాయ్యమును 'ఆరాధనా'భావముతో చేయుము. నీవు చేయునది 'ఆరాధనము', 'సేవ'. సర్వజగత్తునెడ పరిపూర్ణభక్తి భావమూని వినమ్రుడవై నిలువుము. తత్ఫలముగా

సమగ్రమగు నిస్సంగత్వము నీకు ప్రాప్తించును.''

ఆధునిక ప్రవక్తయైన శ్రీవివేకానందుడు మఱియు నిట్లనెను. ''ఎన్నడును నాధిపత్యము నెఱప ప్రయత్నింపకుము. ఉత్తమసేవకు డగువాడే యుత్తమపరిపాలకుడు. ఆజ్ఞానువర్తియై (విధేయుడై) నడుచుకొననేర్చినవాడే ఆజ్ఞాపింపసమర్థుడై యుండును'' కాబట్టి ప్రతి మానవుడు ఈర్ష్యాహంకారములు విడనాడి అందఱితోను కలిసి మెలిసి ఏకీభావముతో పాటుపడవలెను.

అన్యోన్యసహకారము, అన్యోన్యగుణగ్రహణము మనలో మిక్కిలి అవసరము. వీని మీదనే మనకార్యసాఫల్య మాధారపడి యుండును. ''వ్యాకోచమే జీవము. సంకోచమే మృతి'' అని స్వామిజీ మాటిమాటికినుడివెను. భారతదేశ దౌర్భాగ్యమునకును, పతనమునకును ముఖ్యహేతువులలో నొకటి ఈ సంకుచితత్వ మనెను. ఇచ్చిపుచ్చుకొనుట జీవశక్తి లక్షణము. ప్రతిఒక్కరును తమయొద్ద ఉన్న దానిని ఇచ్చుచు లేనిదానిని తెచ్చుకొనుచు సమష్టి శ్రేయస్సునకు పాటుపడవలె ననెను.

భారత భవిష్యత్తును గుఱించి 50 సంవత్సరముల క్రిందట స్వామిజీ దివ్యదృష్టితో ఈ విధముగా ఘోషించెను. భారత ప్రజానీకములో విద్యావిజ్ఞానములను వ్యాపింపచేయవలెను, వారిజీవిత మున్నతస్థితికి హెచ్చించువలెను భారతదేశము పునరుద్ధరణమొందుటకు నవకాశము లేదు.'' భారత ప్రజానీకము ద్వారానే, వారు గోల్పోయిన వ్యక్తిత్వమును వెలువడచేయవలయు ననిన దేశముగతి జన సామాన్యస్థితిపై నాధారపడి యుండు ననెను.

కావుననే విద్యార్థులకు మతవిద్యగఱపుట చాల అవసర మనియు ఈవిద్యను గఱపుటకు బ్రహ్మచర్యములో తర్ఫీదైన విద్యాసౌశీల్య శోభితులగు స్త్రీలు, పురుషులు చాల అవసరమనియు కోరెను. స్వామిజీ మఱియు నిట్లనెను. ''ప్రతి వ్యక్తియందును పరిపూర్ణత స్వతస్సిద్ధముగానే కలదు. తత్ప్రకటనమే విద్య''. ''మనలను ధీరుల నొనర్పగల మతము, ధీరుల నొనర్ప గల సిద్ధాంతములు, సర్వతోముఖముగా ధీరులనొనర్పగల విద్య – ఇదియే మనకు వలయునవి.'' కావుననే విద్యార్థులకు ఐహికాముష్మికవిద్యలనుబోధింపవలెననియు, సాధ్యమైనంతవఱ కది జాతీయ పద్ధతి ననుసరింపవలయు ననియు స్వామిజీ సూచించెను.

యుగాచార్యుడైన శ్రీ వివేకానందుడు నవీన సంస్కర్త లనబడు వారి విధముగా సందేశ మిచ్చెను. ''విధ్వంసక మార్గములను వదలి ధర్మమార్గము ననుసరింపవలెను. మొట్టమొదట పారమార్థిక సంస్కారము లేనిదే యేసంస్కారమును పనిచేయదు.'' మనదేశ పతనమునకు కారణము మత మని, మన సనాతనధర్మ మని, తలచుట మిక్కిలి పొరపాటనెను. మన ప్రజల హిందూసంస్కారమును చెఱచుటకై ప్రయత్నింపక వారిని సర్వవిధముల నుద్ధరించుట చాల జరూ రని వారిని హెచ్చరించెను. నిజమైన ప్రేమ తత్త్వ మెటువంటిదో వారికి బోధించెను. ఆయనమాటలు. ''ప్రేమ ఎన్నడును నిరర్థకము కాదు. నేడో, రేపో, శతాబ్దానంతరమో సత్యము జయించి తీరును.'' ''ప్రేమయే విజయసింహాసన మధిష్ఠించును. ప్రేమయే ఏకైకజీవనధర్మము. మీకు ప్రేమ కలదా? మీసోదరమానవుల మీరు ప్రేమింతురా? ఈపేదలును, ఈదీను

లును, ఈ దుర్బలులును దైవస్వరూపులు కారా ?......''

గొప్పగొప్ప మహాపురుషుల నాయకత్వము వలన మనకు దేశస్వాతంత్ర్యము సిద్ధించినది. ఈ సంపూర్ణస్వాతంత్ర్యము లభించిన భారత దేశము నేడు చీనావారిని ఎటువంటి సుస్థిరత్వముతో నెదుర్కొనుచున్నదో ప్రపంచమంతటను తెలిసిన విషయమే. చెన్నపట్నములో స్వామిజీ ఇచ్చిన ఉపన్యాసములో ఆయన ఇట్లనెను. ''......వందలకొలది విదేశీయుల దాడులను భిన్నభిన్నములగు ఆచారమర్యాదల సమ్మేళనవలన గల్గిన వందలకొలది విప్లవములను భరించి నిలిచినట్టి భారతభూమి ఇదియే ! చెక్కుచెదరని శౌర్యముతోడను, వినాశ మెఱుంగని చైతన్యప్రభల తోడను లోకములోని ఏశైలరాజము నైనను మించగలిగిన సుస్థిరత్వముతో నిలిచినది ఈ పవిత్రదేశమే.'' కావున జాతీయజీవితము ఈ నా డెదుర్కొనుచున్న పరిస్థితులకు ఆనాడు శ్రీవివేకానందుడు చేసిన హితోపదేశము చాల అవసరము.

మన ఈ వర్తమాన పరిస్థితుల ననుసరించి దానికి తగినట్లుగా శ్రీవివేకానందుని శతతమ జయంతి మహోత్సవములు విశ్వమంతటను కొనియాడబడును. కావున ప్రతిమానవుడును ఆ చైతన్యమయ సందేశమును బహుముఖముల ప్రచారముచేయుటకై మిక్కిలి పాటుపడవలెను. త్యాగవైరాగ్యములు, ఆత్మవిశ్వాసము, సర్వవిజయశీలమగు దృఢసంకల్పమును ప్రతిమానవుని హృదయములో రేకెత్తించుటకై విద్యావంతులైన ప్రతి స్త్రీయు, పురుషుడును స్వామిజీ చూపించిన ఆదర్శమును దృక్పథమున నిడుకొని తత్ప్రాప్తి నిమిత్తము తీవ్రకృషి చేయవలయును.

శ్రీవివేకానందుడు ఆశించినట్లుగా ప్రస్తుతము మనకు కావలసినది సంఘీభావము, శక్తి సమీకరణము. 'అధర్వవేదసంహిత' యందలి శ్లోకములో చెప్పినట్లుగా, ఎల్లరును ఏకమనస్కులై, ఒక్కసంకల్పముతో నున్నయెడల ఎటువంటి విషమ పరిస్థితినైనను, ఎటువంటి తీఱని సమస్యనైనను స్వాముల ఆశీర్వాదముల వలన మన మెదుర్కొనగల మనుటలో ఏ సందియము లేదు.

లోకవిధ్వంసనము చేయు యంత్రాలును, ఆటంబాంబులును శాంతి నిచ్చు మార్గాలు కావు. కాని స్వామిజీ ఆదేశించినట్లు భావి ప్రజలలో ప్రేమ, త్యాగ వైరాగ్యములు ఐకమత్యము కలుగునట్లు పాటుపడవలెను. ఆ ఉద్యమము నెఱవేర్చుటకై తుదకు ప్రాణముల నైనను అర్పించుటకై సంసిద్ధులమై యుండవలెను. అప్పుడే సకలమానవులకు మానవ సంఘమునకు చిర శాంతి కల్గును. అంతేకాదు. విశ్వశాంతియు గల్గును.

భారతదేశ క్షేమముకొఱకును, పునరుద్ధరణ కొఱకును, దానిమూలముగ అఖిలమానవుల శుభముకొఱకును స్వామిజీ తాను జీవించినంతకాలము పాటుపడి మనకు చేయవలసినవన్నియు చేసెను. ఆత్మముక్తికిని, జగద్ధితమునకును ఆయన మార్గము చూపెట్టినాడు. కాబట్టి ఆయన ప్రారంభించిన ఉద్యమమును పరిపూర్ణముచేయుటకై ఆయన చైతన్యమయ సందేశము నెల్లరు తలదాల్పవలెను. 'ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్ నిబోధత'.

# శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు

## మద్రాసులో

శ్రీ వివేకానందస్వామిజి నూటొకటవ జయంతిమహోత్సవము 'శతతమ' జయంతి మహోత్సవములతో ఏకమై తే 17-1-1963 ది గురువారమునాడు వేకువ 4-30 గంటలకు మద్రాసు మైలాపుర శ్రీరామకృష్ణమఠములో మంగళహారతితో భక్తిగీతములతో ప్రారంభ మైనవి. తర్వాత చక్కగా అలంకరింపబడిన స్వామిజి ప్రరివ్రాజకరూప చిత్రమునకు (చిత్రము 1) పూర్ణకలశములతో (చిత్రము 2) మైలాపూరు నాల్గు మాడవీధులలో ఊరేగింపు చేయబడినది. ఊరేగింపుపొడుగునను వివిధ బృందముల భజనలు (చిత్రము 3) చెల్లినవి. ఊరేగింపు 6-15 కు ప్రారంభమై 7-15 కు ముగిసినది.

7-30 గంట లప్పుడు మద్రాసు శ్రీరామ కృష్ణ మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానంద స్వాములు శంఖధ్వాన వేదఘోషలమధ్యమున స్వలంకృత స్వామిజిచిత్రపటమునెదుట వందల కొలదిగ క్రిక్కిరిసియున్న భక్తులసదస్సున నూటొక్కదీపములలో మొదటిదానిని వెలిగించి శతతమ జయంతిమహోత్సవములకు ప్రారంభ మంగళమును నిర్వహించిరి.

అప్పుడు ప్రసంగించుచు (చిత్రము 5) శ్రీమత్కైలాసానందస్వాము లిట్లనిరి—"స్వామిజి శతతమజయంతి మహోత్సవములు భారతదేశమున మాత్రమే కాక ప్రపంచమున ఇతర ప్రాంతములలో పెక్కింటిలో కూడ జరుపబడు చున్నవి. శ్రీవివేకానందస్వామి నారాధించుటలో ఫ్రాన్సు - అమెరికా - బ్రిటను ప్రజలు



1. తే 17-1-1963 ది నాడు ఊరేగింపబడిన శ్రీ వివేకానందస్వాముల పరివ్రాజకరూపచిత్రము.



2. తే 17-1-63 ది నాటి ఊరేగింపులో పూర్ణకుంభధారులు.



3. తే 17-1-63 ది నాటి ఊరేగింపులో భజనబృందములు.

భారతీయులతో ఏకీభవించుచున్నారు. స్వామిజి జీవితచరిత్రలో మద్రాసునగరమునకు ప్రముఖ స్థానము కలదు. భారతీయతత్త్వమునకు, ఆదర్శ

భూతుడైన శ్రీస్వామిజిని అమెరికాకు పంపుటకు తోడ్పడినవారు మద్రాసునగరవాసులు. మద్రాసు శ్రీస్వామిజి చిత్తమున ఎడబాయ



4. తే 17-1-63 ది నాటి ఊరేగింపులో ఎన్సిసివారు.

కుండెడిది. అమెరికానుండి మాతృదేశమునకు మరలినపిమ్మట స్వామిజి తొట్టతొలి మఠమును మదరాసునగరములోనే స్థాపించెను.''

శ్రీ కె. వి. జగన్నాథముగారు తమిళములో ప్రసంగించుచు, శ్రీవివేకానందస్వామిజి ఉపదేశముల వివరించి ''స్వామిజి సనాతనభావాలకు నూతనమును సజీవము నగు అర్థము చెప్పె'' ననియు ''హిందుశాస్త్రగ్రంథముల ఋజువైన యర్థమును తెలిపె'' ననియు చెప్పిరి.

నాటి | కార్యక్రమాలలో మ ఱొకటి—

శ్రీవివేకానందస్వాముల శతతమజయంతికి స్మారకముగా ఇండియాగవర్నమెంటువారు ముద్రింపించిన తపాలుబిళ్లలను మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రి పూజ్యశ్రీ కె. కామరాజుగారు రామకృష్ణమఠమున వెలువరించిరి. ఆసమయమున సదస్సులో ప్రసంగించుచు పూజ్యశ్రీ కామరాజుగా రి ట్లనిరి —''భారతదేశమునకు గొప్పభవిష్యత్తు ఉన్న దనియు నిర్వహింపవలసిన కార్యభారము ఉన్నదనియు గుర్తించు దివ్యదృష్టి శ్రీవివేకానందస్వామి కుండెను. ఒకక్రొత్తసందేశమును చెప్పి నూత్న ప్రయోజనమును చూపి ఆయన ప్రజల కుత్సాహము కూర్చెను. భారతదేశమున కాయన సంపాదించిపెట్టిన కీర్తిలో నేడు మనము పాలు పంచుకొనుట మన గర్వకారణము.

శ్రీవివేకానందస్వామి పాశ్చాత్య దేశములకు పోయి భారతీయులజ్ఞానసందేశమును ఆత్మపరత్వసందేశము నచట ప్రజలలో ప్రచారము చేసెను. భారతదేశమునకు మరలిన వెంటనే ఆయన అజ్ఞాన - దారిద్ర్య - కల్మషనిమగ్నులగు ప్రజల సముద్ధరణమునకు నిర్విరామముగను నిస్తంద్రముగను పాటుపడెను. ఆయన నెలకొల్పిన రామకృష్ణమిషను, ఆధ్యాత్మిక



5. ధ్యానముద్రలో నున్న స్వామిజీచిత్రపటమునెదుట వెలుగుచున్న నూటొక్క దీపాలు, సదస్సులో ప్రారంభోపన్యాసము కావించుచున్న శ్రీమత్కైలాసానందస్వామి. తే 17-1-63 ది.

సాంఘికరంగములలో ప్రజలకు ప్రశంసార్హముగ సేవ చేయుచున్నది.

కొన్ని యేండ్లక్రితము మద్రాసురాష్ట్రమున దక్షిణజిల్లాలలో వఱదలవలన మహోపద్రవము కలిగినది. అచటి ప్రజలకు సాయ మొనర్త మని పోయితిని. అందఱికన్న ముందుగ నేనే అచటికి చేరుకొనుచున్నా నేమో అనుకొంటిని. కాని పోయి చూడగా, రామకృష్ణ మఠసాధువులు అంతకుముందే అటకు వచ్చి ఆపదలకు లోనైన ప్రజల నోదార్చుచు సాయపడుచు నుండిరి. చూచి సంతోషాశ్చర్యముల జెందితిని. మానవసేవయే మాధవసేవ, జీవుల సేవయే శివపూజ అనెడి శ్రీవివేకానందస్వాముల సందేశమును రామకృష్ణసంస్థవారీ రీతి అమలుజరుపుచుండిరి.''

శ్రీశుద్ధ సత్త్వానందస్వామి కృతజ్ఞతాభివందనోపచారవాక్కులు పల్కిరి.

గుడిలో ప్రత్యేకపూజాహోమములు 1-30 గంటలవఱకు సాగినవి.

మఠమండపములో గూడ కొంతపూజ శివసహస్రనామార్చనలు జరిగినవి. హోమానంతరము పి. ఎస్. హైస్కూలు మైదానములో దరిద్రనారాయణ సంతర్పణ చేయబడినది. దాదాపు వెయ్యిమంది బీదలకు పుష్కలమైన భోజనము పెట్టబడినది.

3 గంటలనుండి 5-45 వఱకు శ్రీ టి. ఎస్. బాలకృష్ణశాస్త్రిగారు కిరాతార్జునీయము కథాకాలక్షేపము జరిపి ఆ కిరాతార్జునులచరిత్రలో శ్రీరామకృష్ణవివేకానందులచరిత్రయు అంతర్భవించునట్లు సరసచమత్కారసంపన్నముగ వీనులకు విందుకూర్చిరి.

హరికథానంతరము భజన ప్రవర్తిల్లినది. 6-30 కి గుడిలో ఆరాత్రికము ఆరంభమైనది.



6. చికాగోలో ఉపన్యసించుచున్నతీరున నున్న స్వామిజిచిత్రము పుష్పనిర్మితభారతదేశపటమధ్యమున అమర్పబడియున్నది. తే 20-1-63 ది పి.ఎస్. హైస్కూలుమైదానమున.

హారతికనంతరము శ్రీ శుద్ధసత్త్వానంద - ర్వజ్ఞానంద - శ్రీకైలాసానందస్వాములు శ్రీమద్వివేకానందుల ప్రవచనములను చదివి వినిపించి, ఆయన జీవితవిశేషాలను గూర్చి ప్రసంగించిరి.

ఆ దినము వేకువజామునుండి రాత్రి 8-30 గంటలవరకు భక్తమహాజనులు స్వామిసేవకై ఎడతెంపులేని ప్రవాహముగా వచ్చుచుండిరి. వాతావరణ మంతయు భక్త్యుల్బణసముజ్జ్వలమై యుండెను.

తే 20-1-1963 ది భానువారమునాడు పి. ఎస్. హైస్కూలు మైదానములో భారత నిధిమంత్రి పూజ్యశ్రీ మోరార్జిదేశాయిగారు శతతమజయంత్యుత్సవాల యథావిధి సముప క్రమము జరిపినారు. చికాగోలో ఉపన్యసించుచు నిలుచున్నతీరున నున్న శ్రీవివేకానంద స్వాముల చిత్రపటము పుష్పనిర్మితమగు భారతదేశపటమధ్యమున అమర్పబడెను (చిత్రము 6).

మధ్యాహ్నానంతరము రెండుగంట లగునప్పటికి ఆకాశము మేఘావృతము కాజొచ్చెను. కొంతసేపటికి చిటపాట చినుకులు ఆరంభమైనవి. వాన కొంత హెచ్చినది సమావిష్టులై యుండిన భక్తులును సభ్యులును చేరువ నీడపట్టులకు పరుగిడవలసివచ్చెను. వాన కొంతసేపు కురిసినది. సభాకార్యక్రమము విఘ్నిత మగునేమో అని దిగులుపడుచుండగా, వాన ఆగిపోయినది. సూర్యుని వెలుగు మరల రాకున్నను, వాన కురియ లేదు.

3 గంటలనుండి 4 గంటలవఱకు శ్రీ కారైకురిచ్చి అరుణాచలముపార్టి వారు నాదస్వర కచ్చేరి జరిపినారు.

సభాకార్యక్రమము అనుకొన్నట్లే 4 గంటలకు వేదసూక్తానుసంధానముతో ప్రారంభమై



7. తే 20-1-63 ది పి.ఎస్. హైస్కూలు మైదానమున శతతమజయంతిమహోత్సవ ప్రారంభమంగళోపన్యాసము కావించుచున్న శ్రీ మోరార్జిదేశాయిగారు.



8. తే 20-1-63 ది స్వామిజీ శతతమజయంతిమహోత్సవసముపక్రమసందర్భమున సమావేశమైన మహాసదస్సు.

సది. శ్రీమత్ప్రియానందస్వాములు ప్రారంభ మంగళగీతము పాడిరి. శ్రీమత్కైలాసానంద

స్వాములు పూజ్యశ్రీ మోరార్జిదేశాయిగారికిని, సభాధ్యక్షులైన డాక్టరు సి. పి. రామ

స్వామిఅయ్యరుగారికిని. ఉపన్యసింప విచ్చేసిన వారికిని, సదస్యులకును స్వాగతాశీస్సు లను గ్రహించినారు.

తమప్రసంగములో వారు ఈలా గన్నారు: "శ్రీ వివేకానందస్వామికి శతతమ జయంతి మహోత్సవమును జరుపు కొందుకో గ్రహించుట మానవతతికి ఆవశ్యకము. ఆ కారణమును తెలిసికొనుట అనగా, శ్రీరామకృష్ణుడు నిర్వహింపబూనుకొన్న పనిని తెలిసికొనుటే, శ్రీరామకృష్ణమిషనువారి లక్ష్యమును తెలిసికొనుటే, శ్రీ వివేకానందస్వాముల సందేశమును తెలిసికొనుటే. పరమహంస శ్రీరామకృష్ణుడును శ్రీ వివేకానందస్వామియు నిత్యాత్మ స్వరూపులు. పూర్వము శ్రీకృష్ణార్జునులుగ అవతరించినవారును వారే. ఒక ప్రత్యేకసందేశ మందించుటకే వారి అవతారము. మానవుని దివ్యతను నొక్కి చెప్పు సందేశ మది. ఉపనిషత్తులందలి మహావాక్యములను మనకు జ్ఞప్తి పఱచుటకే వారవతరించిరి. ఆ మహావాక్యాలే మన డెందములందు ఇప్పుడును అనాదికాలము గనుపదిలపడియున్న మహానిధానములు. భారతదేశహృదయకోశమున వేలకొలది సంవత్సరములుగా ఆ నిధానము లున్నవి. ఆ నిధానముల మనవశమున భద్రపఱచుకొనుటే కాక విశ్వమున కంతటికిని వానిని దానముచేయగలమని రుజువుచేయవలసిన సమయము వచ్చినది. విశ్వమున కంతటికిని, లేదా భారతదేశమునకు మాత్రమే ఐనను 'ఉన్న ఆధ్యాత్మికసంపదను సరిచూచుకొనుట'కు సర్వేశ్వరుడు ప్రసాదించిన సదవకాశమే ఈ శతవార్షికోత్సవము. మనము మన ఐకమత్యమును గట్టిపఱచుకొనుటకు ఈ ఉత్సవ మొక అవకాశము".

శ్రీ టి. వి. విశ్వనాథయ్యరుగారు దేశప్రముఖు లంపిన కొన్ని సందేశాలను చదివారు —

### రాష్ట్రపతి డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి సందేశము

శ్రీ వివేకానందస్వాముల శతవర్షజయంతి మహోత్సవమును అర్హరీతిని మదరాసులో జరుపుచున్నా రని తెలిసినందుకు సంతోషించుచున్నాను. శ్రీరామకృష్ణసంఘపు మొట్టమొదటి శాఖ నెలకొల్పబడినది మదరాసులోనే. షికాగో విశ్వమతమహాసభలో మహత్తరవిజయము గాంచి శ్రీ వివేకానందస్వామి మాతృదేశమునకు మరలినప్పుడు మహాదరముతో ఆయనకు స్వాగతాభినందనము లర్పించినవారు మదరాసుప్రజలే. ఆయన భారతదేశపుత్రరత్నము. హిందూయోగి స్వరూపము, సంఘసంస్కర్తృత్సాహము, దేశభక్తునిపోరాటము — ఈ మూటి అద్వితీయమేళనమునకు ఆయన జీవితము లక్ష్యము. ఆయన శతతమజయంతి మహోత్సవ మీ సమయమున కలసివచ్చుట ఎంతయు అనురూపము.

### ప్రధానమంత్రి పండిత జవహర్లాల్నెహ్రూగారి సందేశము

శతతమజయంతినాడు శ్రీ వివేకానందస్వాములకు నా వందనము లర్పించుచున్నాను. ఆయన గొప్ప దేశభక్తుడు, ఆధ్యాత్మికనాయకుడు, మనప్రజల ఉత్సాహమును ఆయన ఉద్దీపింపజేసినంతగా చేసినవారు అరుదు. ఆయనకు పూజలను, ఉత్సవమును జరుపుట ఎంతయు అనురూపము.

మద్రాసుగవర్నరు శ్రీ విష్ణురామ మేధిగారి సందేశముకూడ చదువబడినది.

రామకృష్ణమిషను హైస్కూలు విద్యార్థులలో ఒకడు శ్రీ స్వామిజి గ్రంథావళినుండి కొన్ని ఘట్టములు వల్లించినాడు.

రామకృష్ణమఠ 'వివేకానందశతతమజయంతి నిర్వాహకపరిషత్కార్యదర్శి' యగు శ్రీ శుద్ధసత్త్వానందస్వామి ఇంతవఱకు జరిగిన కార్యములను తమ నివేదికలో తెలిపినారు. ఈ ఉత్సవమునకు ధనము సేకరింప ఏర్పడి ఉన్న పరిషత్తుకు సమావేశకులైన శ్రీ ఎమ్. వి. వేంకట్రామనుగారు తమ నివేదికలో అంచనప్రకారము కావలసిన పదిలక్షల ఇరువదియేడువేల రూపాయలకుగాను ఇప్పటికి రెండులక్షల ఎనుబది నాలుగువేలరూపాయలు మాత్రమే లభించినవని తెల్పి విరాళము లొసగవలసినదని పౌరమహాశయులను ప్రార్థించినారు.

పూజ్యశ్రీ మొరార్జి దేశాయిగారు శతతమజయంతిమహోత్సవాలకు ప్రారంభము చేసినారు (చిత్రము 7). వారి ఉపన్యాసము వేఱుగా ఇందే ౨౬౯ పుటలో ముద్రితమై యున్నది.

మద్రాసురాష్ట్ర నిధిమంత్రి పూజ్యశ్రీ ఎమ్. భక్తవత్సలముగారు తమిళములో ఉపన్యసించుచు ఇట్లనిరి :—"భారతీయులు తమ పైతృకాధ్యాత్మికసంపదను తుంగలోత్రొక్కి అవివేకులై పాశ్చాత్యుల జీవితవిధానాలను అనుకరించుచున్న కాలమున, దారితప్పినవారిని దారికి మరలించుటకు శ్రీవివేకానందస్వామి అవతరించినాడు. మహిళలలో ప్రజాసామాన్యములో విద్యను వ్యాపింపజేయవలెననుట స్వామి నొక్కి చెప్పిన విషయము. శ్రీస్వామిజిలో ఉన్న మఱొక్క గొప్ప గుణ మిది — ఆయనకు హిందుఋషులనిన ఎంత గౌరవమో అన్యమతములయోగు లనినను అంత గౌరవమే. ఒకసారి జీససునుగూర్చి మాటాడుచు స్వామి 'నేను జీససు కాలమున ఉండియున్న ఆయన పాదాలను, నా కన్నీటితో కాదు, నా హృద్రక్తముతో అభిషేకించియుందు' నని చెప్పినాడు.'' తిరువల్లిక్కేణిలో ఉన్న ఐస్హౌసునకు 'వివేకానంద మందిర' మని పేరుపెట్టవలెనను సర్కారువారి నిశ్చయమును ఆమందిరావరణములో శ్రీవివేకానందస్వాముల శిలాప్రతిమను ప్రతిష్ఠింప సర్కారువారి అనుమతిని శ్రీ భక్తవత్సలముగారు తెలిపిరి.

తదనంతరము శ్రీ మోటూరి సత్యనారాయణగారు (పార్లమెంటు సభ్యులు) శ్రీవివేకానందస్వాముల జీవితసందేశాలనుగూర్చి తెలుగులో ఉపన్యసించినారు.

మదరాసు విశ్వవిద్యాలయపు వైస్ఛాన్సెలరు డాక్టరు ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియారుగారు ఆంగ్లమున ఉపన్యసించుచు మదరాసులోని మఠముతో చిన్ననాటినుండి తమకుగల ఆదరసంబంధాలను స్మరించినారు. శ్రీ వివేకానందస్వామిజి ఇక ఇరువదేండ్లైనను ఎక్కువగా జీవించియుండిన భారతదేశమునకింక నెంత సమున్నతి కల్గియుండెడిదో భావనకు సైతమందదనియు, అస్వల్పజీవితములోనె స్వామిజి ప్రజలహృదయమున వైచిన ముద్రనుమఱవ నెన్నటికిని సాధ్యము కాదనియు శ్రీ మొదలియారుగారు చెప్పినారు.

శ్రీస్వామిజి గొప్పతనమునుగూర్చి శ్రీ కృ. బాలసుబ్రహ్మణ్యయ్యరుగారు సారస్యమాధుర్యధాటీమండితమగు సంస్కృతభాషలో ఉపన్యసించిరి.

'తమిళరసుకழగ'పు నాయకులైన శ్రీ ఎమ్. పి. శివజ్ఞానగ్రామణిగారు తమిళములో ఉపన్యసించుచు 'మానవసంస్కృతికిని విశ్వ

శాంతికిని భారతదేశము పెట్టనికోట అని లోకమునకుచూపినవారు శ్రీవివేకానందస్వామియే' అన్నారు.

సభాధ్యక్షులైన డాక్టరు చెట్పట్ పట్టాభిరామస్వామయ్యరుగారి ఉపన్యాససంక్షేపము : "ప్రాచ్యప్రపంచమున కేమి పాశ్చాత్యప్రపంచమున కేమి శ్రీవివేకానందస్వామి అందించిన సందేశాలలో అన్నిటికంటె గొప్పది ఇది—మానవుల జీవితాలలో ఆత్మప్రబోధము అనునది ఒక సజీవాంశము. బ్రహ్మవిద్యను మన జీవితములోనికి తెచ్చుకోవలె, ఆచరణలోనికి తేవలె. బ్రహ్మవిద్య తెల్పు సత్యములను మన పరిపాలనలోనికిని ప్రదర్శనములలోనికిని ఆదర్శానుష్ఠానములలోనికిని తేవలె. అనగా అదే ప్రజలలో నిమ్నుల - అధఃకృతుల - క్షుధార్తుల - సముద్ధరణము. ఈ పరమసందేశము శ్రీరామకృష్ణమిషనువారు తమ ప్రణాళికలలో అమోఘఫలప్రదముగ అమలుజరుపుచున్నారు."

శ్రీ కె. ఎస్. రామస్వామిశాస్త్రిగారి వందనసమర్పణముతో జాతీయగీతముతో నాటి కార్యక్రమము సమాప్తమైనది.

ఆనాడు పూర్వాహ్ణమున సుమారొక నూఱుగురు భక్తులు మఠములో శ్రీ స్వామిజి జీవితగ్రంథమును సంపూర్ణగ్రంథావళిని మౌనపారాయణము కావించారు.

## బేలూరుమఠము - హౌరా. 17-1-1963

భారతదేశమంతటను ప్రపంచమందలి అన్యదేశములందును విద్వద్యోగిసార్వభౌముడును నవ్యయుగ మహాపురుషుడు నగు శ్రీవివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు ఈనాడు ప్రారంభింపబడినవి.

నేటి ప్రొద్దున 6-25 గంటలప్పుడు వంగరాష్ట్రమంతటను తోడంగిన జయంతి మహోత్సవాలను శంఖధ్వానములును వెలిగింపబడ్డ దీపికల వెలుగులును సూచించినవి.

నేటికార్యక్రమములో ముఖ్యభాగము సూర్యోదయమునకు పూర్వమే బేలూరుమఠమున స్వామిజిమందిరమున వేదధ్వానములు - భజనకీర్తనల - మధ్య, పవిత్ర గంభీర వాతావరణమున ప్రారంభమైనది.

సుదూరప్రాంతాలనుండియు వేలకొలది భక్తులు 'లెండి, మేలుకొండి, లక్ష్యముచేరువరకు ఆగకుడీ' అని తమ్ము ప్రబోధించిన శ్రీ వివేకానందయోగికి తమ భక్తివందనముల సమర్పింప ప్రభాతకాలమునకు హాజరైరి.

మునుపు స్వామిజి వసించుచుండినగదిలో, ఆయన ఉపయోగించుకొనుచుండిన వస్తువులిప్పటికిని భద్రపఱుపబడియుండు గదిలో భక్తులక్షాధికసంఖ్యాకులు ఘుటితాంజలిపుటులై మౌనముగ బారులుతీఱిరి. గోడ లన్నియు స్వామిజి చిత్రఃటములచే అలంకృతములై యున్న స్థా[illegible] కూడ వారు దర్శించినారు.

## 17-1-1963

రామిలామైదానమున సమావేశమైన మహాసదస్సులో శ్రీ వివేకానందస్వాములశతతమజయంతి మహోత్సవమునకు ప్రారంభము చేయుచు ప్రధాని పండిత జవహార్లాల్నెహ్రూగారు ఇట్లన్నారు — ఎంతటి మహాపదలు కమ్ముకొన్నప్పుడును, ధీరులమై ఎదుర్కొనవలె ననుట శ్రీ వివేకానందస్వామి ప్రముఖ మహాపురుషుల ఉపదేశము. శ్రీ వివేకానంద స్వామివంటివారిలో ఉండిన ఆధ్యాత్మికశక్తి ఏ

ఆవంతమైనను అలవఱచుకొనుటకు మనము ప్రయత్నింపవలెను. శ్రీవివేకానందస్వాములు బోధించిన 'బలము' 'విశ్వాసము' 'ఉత్సాహము' 'ఐక్యము' 'దేశభక్తి' 'ధైర్యము'— అను వాని నందఱు తమమనసులలో హత్తుకొల్పుకొనవలె. భారతజాతికి పితయైన గాంధి మహాత్ముడును ఈ పాఠములనే కఱపెను. వీనిని మన మాదరింపవలెను. శ్రీ వివేకానందస్వాముల మనఃపరిపాకమును భావనాశక్తియు ఎంత గొప్ప వనగా, ఆనా డాయన చెప్పినవి, ఈనాటికిని అనుసరణీయములై యున్నవి. ఆయన జీవించినకాలము కొంచెమే. ఐనను విదేశములకు భారతదేశసందేశము నందజేసిన వారిలో ఆయన అగ్రస్థానము అలంకరించినాడు. ఆయన విశ్వప్రజల చిత్తములపైనిచూపిన ప్రభావఫలితముగా, ఆయన ఆశయాలను విశ్వప్రజ లందఱును అభిలషించు చున్నారు. స్వామిజి మానవుల ఆధ్యాత్మికోద్ధరణమునందు విశ్వాసముగలవా డగుటే కాక దేశభక్తుల లోను గొప్పవాడు. ఆయన వ్రాసిన ప్రతిమాట యందును దేశభక్తిసముత్సాహము పిక్కటిల్లుచుండెడిది. మనయువకులే కాదు, భారతీయు లందఱును ఉత్తేజకరములగు స్వామిజి గ్రంథావళిని చదువవలెను. స్వామిజి మనస్సు జ్యోతిర్మయము. మనదేశీయులను ఎంతేని మేల్కొల్పినవా డాయన".

నెహ్రూగారికి ముందుగ మాటాడిన ఢిల్లి మేయరు నురుద్దీన్ అహమ్మదుగారు "( వివేకానందస్వామి దేశభక్తు డగుటే కాక, అపవర్గత్రివర్గములను, ఐహికాధ్యాత్మికములను, మేళవించిన సందేశ మొసగిన వారిలో తానే ప్రథముడు" అన్నాడు. ఢిల్లీ క్రైస్తవమతాధిపతి (బిషప్పు) రైట్. రెవరెండ్. ఎస్. కె. మొందాల్‌గారు తమప్రసంగమున స్వామిజిని గూర్చి 'ప్రవక్త' అనియు, 'తనకాలమువారి ఊహల కందని భవిష్యత్తును భావింపగల్గినవా' డనియు, 'ఆయనదృష్టి విశ్వదృష్టి' అనియు ననిరి.

## కల్కత్తా, 20-1-1963

స్వామిజిజన్మనగరమైన కల్కత్తాలో శతతమజయంతి మహోత్సవాలకు రాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణగారు ప్రారంభము చేసినారు. దాదాపు ముప్పదివేలప్రజలు సమావేశమైరి.

రాష్ట్రపతి తమ ప్రసంగములో ఈలా గన్నారు—"దేని దేనికి శ్రీవివేకానందస్వామి తాను పరమలక్ష్యముగ ఉండెనో, స్వామిజి మన కేమి బోధించెనో, మనల ఏమి చేయ గోరెనో—దానిని భారతదేశము జ్ఞప్తియందుంచుకొనుట ఎంతేని ఆవశ్యకము. శతతమ జయంతి సందర్భమున ఊరక స్వామిజిని స్మరించిన చాలదు, ఆయన ఉపదేశాలను ప్రజలు తమ జీవితములలో కలుపుకొనుటకు ప్రయత్నింపవలె. శ్రీవివేకానందస్వామిని కని మనకు ప్రసాదించిన భారతదేశపు ప్రజలమనిపించుకొనుటకు మనము అర్హత గడింపవలెను. మద్రాసులో నేను విద్యార్థినై ఉండిన దినాలలో స్వాముల లేఖలను ప్రసంగాలను సైక్లోస్టైలు చేసి ఆప్రతులు విద్యార్థులకు పంచిపెట్టెడివారు. ఈ శతాబ్దిప్రారంభదినములలో వివేకానందసారస్వతపఠనము విద్యార్థులను మంత్రముగ్ధులనుగ ఒనర్చెడిది. ఈదేశచరిత్రములోమాత్రమే కాదు, ప్రపంచచరిత్రములో మనము జీవించుచున్న యీ యుగము చిక్కైనది. విలువలు తగ్గుచున్నవి. విలువలు తొఱు

మా జగుచున్నవి. ప్రజలలో సమష్టి ఉన్మాదములు మిక్కిలి చెలరేగుచున్నవి. ఈ స్థితి వారికి మంచిది కాదు. మానవుని గౌరవమునం దీ రీతి అవిశ్వాసము వహించుట, మానవ జాతికే ద్రోహముచేయుట. 'మీ ఆధ్యాత్మిక సంపదపై మీ రాధారపడియుండు' డని శ్రీ వివేకానందస్వామి తన కాలపు ప్రజలను కోరెను. ఆత్మయే సర్వప్రధానము. లోకమున 'అనివార్య'మైన దేదియు లేదు. మానవునకు దీటు లేదు. విశ్వాసమును విడువకున్నచో ఎంతెంతలేసి ఆపదలనైనను నెట్టివేయవచ్చును. అదే శ్రీవివేకానందస్వామి భారతీయులకు కఱపిన పాఠము. ఆపదలు పైకొన్నప్పుడు, ఇతి కర్తవ్యత తెలియనప్పుడు, 'ఆస విడువకుడు' 'ధైర్యము వహింపుడు' అనుటే స్వామిజి బోధ. విద్యయందు శాస్త్రవిజ్ఞానమందు సాహిత్యమందు ఆధ్యాత్మికజ్ఞానమందును అఖండప్రతిభావంతులకు ఈ కల్కత్తానగరము జన్మనగరము. అట్టివారిలో సర్వప్రథముడు శ్రీవివేకానందస్వామి. భారతదేశాత్మయే శ్రీ స్వామిజిలో రూపుదాల్చినది. ఈదేశపు ఆధ్యాత్మికలక్ష్యములకు వాని సంసిద్ధికిని ఆయనయే నిరూపకుడు. సనాతనమైన భారతమాతృహృదయమును, ఆయన తన వాణిలో ఘోషించి విశ్వశ్రవణగోచర మొనర్చినాడు. ఆయన నెలకొల్పిన రామకృష్ణమిషనువారు నిర్వహించుచున్న లోకసేవాఘనకార్యములకు నా అభినందనములు."

ఇంతకుముందే ప్రసంగించిన 'వివేకానంద శతవార్షికోత్సవపరిషదధ్యక్షులు' శ్రీ సి. బి. ముఖర్జిగారు ఈలా గన్నారు. "ఈ పరిషత్తు వారు జరుపనెంచిన కార్యములకై పదునొక్కలక్షలరూపాయలు రాష్ట్రప్రభుత్వమువారు ఇచ్చుటకు సమ్మతించిరి. అందుకే కార్పొరేషనువారు తామును ఒకలక్షరూపాయలు ఇచ్చెద మన్నారు. శ్రీవివేకానంద స్వాములు బాల్యమున కలకత్తాలో వసించిన భవనమును కొని, అందొక సేవాసంస్థను నెలకొల్పవలె ననియు, స్వామిజి జీవితమును దెల్పునొక ప్రమాణగ్రంథమును ప్రకటింపవలె ననియు, ఒక డాక్యుమెంటరి ఫిల్మును తయారుచేయవలె ననియు. పరిషత్తువారు ఉద్దేశించియున్నారు. విశ్వము నాలుగుచెఱగులనుండియు అమూల్యమైన సహకారము లభించుచున్నది.

మాజీరాష్ట్రపతులైన డాక్టరు రాజేంద్రప్రసాదుగారును ప్రధానులైన పండిత జవహర్లాల్నెహ్రూగారును శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారును పంపిన సందేశములు చదువబడినవి. శ్రీ నెహ్రూగారి సందేశములోని వాక్యములు — "శ్రీ వివేకానందస్వామి ప్రజలలో నూతనచైతన్యమును కలిగించినారు. ఆ భారతమాతృపుత్రరత్నమునకు ఈ మహోత్సవ సందర్భమున నా నమోవాకము లర్పించుచున్నాను. స్వామిజి సారస్వతము ఇప్పటి ప్రజలకేకాక, రాగల తరతరములవారికి ఉత్సాహప్రదమగును". శ్రీ రాజగోపాలాచారిగారి సందేశములోని వాక్యములు — "మాతృదేశ మహిమను గుర్తించునట్లుగ భారతీయులకన్నులు తెఱచినవారు శ్రీ వివేకానందస్వామి. ఆయనే రాజకీయ సాంస్కృతిక పారమార్థికరంగములలో భారతస్వాతంత్ర్యనిర్మాణవిధాత".



## వార్తా విశేషాలు

### శ్రీరామకృష్ణమఠము, మద్రాసు - 4
### మాతృశ్రీ జయంతి

మాతృశ్రీ శారదాదేవి 110-వ జయంతి తిథిపూజ 1962-వ సంవత్సరము డిసెంబరు 18-వ తేది మంగళవారము మఠములో కావింప బడినది. ప్రొద్దున 5 గంటలప్పుడు గుడిలో మంగళహారతితో కార్యక్రమము ప్రారంభ మైనది. భజన గీతోపనిషత్పారాయణాలు గుడిలో ప్రత్యేకపూజ మున్నగు పూర్వాహ్ణ క్రమాలు 1-30 గంటలప్పుడు హోమముతో పూర్తి ఐనవి. సుమారు 500 మంది దరిద్ర నారాయణులకు అన్నసంతర్పణ చేయబడినది. 900 మంది భక్తవరేణ్యులకు ప్రసాదము దొన్నెలలో పెట్టి ఇయ్యబడినది. సాయం కాలము ఆరాత్రికమునకు పిమ్మట మఠమండ పమున భక్తసదస్సులో శ్రీశుద్ధ సత్త్వానంద స్వాములు మాతృదేవి సుభాషితాలలోను ఉప దేశాలలోను కొన్నింటిని చదివి వినిపించారు. పశ్చిమబంగాళమున రహారాలోని రామకృష్ణ మిషను బాలురవిడిది కధ్యక్షులైన శ్రీ పుణ్యా నందస్వాములు మాతృదేవి జీవితోపదేశాల విశేషాలను గూర్చి ఉపన్యసించారు.

23-12-1963-వ తేది బహిరంగోత్సవము. మధ్యాహ్నానంతరము 3 గంటలనుండి 5 గం టలవఱకు శ్రీమతి వి. శాంతమ్మగారు శ్రీ శారదాదేవి జీవితకథను హరికథాకాలక్షేపము కావించారు. 5 గంటలప్పుడు పౌరమహాసభ సమావేశమైనది. సోదరి ఆర్. ఎస్. సుబ్బ లక్ష్మమ్మగారు అధ్యక్షత వహించారు. రామ కృష్ణమిషను శారదావిద్యాలయ హైస్కూలు విద్యార్థినులు ప్రార్థనగీతాలు పాడారు. స్కూల్లు మాజీహెడ్ మిస్ట్రెస్ ఐన శ్రీమతి కమలా బాయిగారు సదస్సుకు వక్తలకు స్వాగతం పల్కినారు. శ్రీమతి మాలతి కేరళవర్మగారును, రాణీమేరీకళాశాల అధ్యక్షురాలగు డాక్టరు ఐరావతమ్మగారును ఆంగ్లములోను, శ్రీమతి గౌరి, శ్రీమతి మీనాక్షీసుందరము శివ అను వారు తమిళములోను మాతృశ్రీ గుణవైభవ ములను కొనియాడుచు ఉపన్యసించారు. వక్తృ త్వపు పోటీలలో నెగ్గిన నగరపాఠశాలల విద్యా ర్థినులకు బహుమానము లిచ్చి, అధ్యక్షురా లుపన్యసించిన తర్వాత, శ్రీమతి సరస్వతీ దేశ్పాండేగారి కృతజ్ఞతావందనోపచారముతో సభాకార్యక్రమము పూర్తిఐనది.

తదనంతరము మఠములో భజన సంకీర్త నము కొంతసేపు ప్రవర్తిల్లినది.

---

### ఆంధ్రప్రదేశమున స్వామిజి శతతమ జయంతులు - ఒంగోలు

శ్రీవివేకానందస్వామి శతజయంత్యుత్స వములు ఒంగోలు పట్టణంలో జనవరి 17 నుండి 20 వరకు కడువైభవంగా జరిగాయి. శ్రీస్వామి వివేకానందశతజయంత్యుత్సవ సమితివారు పై కార్యక్రమాన్ని నిర్వహించారు. నాలుగు దినముల సభలకు శ్రీస్వామి శివశంకరులు అధ్యక్షతవహించారు. 17-1-1963-వ తేది ఉద యం వేదప్రవచనం, గురుపూజలతో సభా కార్యక్రమం ప్రారంభమైంది. సాయంకాలం సభలో శ్రీ ఉప్పలపాటి సుబ్రహ్మణ్యంగారు స్వాగతవచనములు పలికారు. సభలో శ్రీ యుతులు చిల్లర భవానీశంకరరావు, తల్లా వఝుల కృత్తివాసతీర్థులు, శ్రీస్వామివారి జీవి తాన్ని గురించి ఉపన్యసించారు. 18-1-1963 తేది సాయంకాలం సభలో సాహిత్యాచార్య శ్రీ వావిలాల సోమయాజులుగారు "స్వామి వివేకానందులు : భారతదేశం" అన్న విష

యంపై ఉపన్యసించారు. శ్రీస్వామివారు భారతీయులకందజేసిన దివ్యసందేశాన్ని శ్రీ సోమయాజులుగారు వివరించారు. 19-1-63 తేదీ సాయంకాలసభ శ్రీ శ్రీ శ్రీ మాతాజీ త్యాగీశానందులవారి మృదుమధుర నామ సంకీర్తనంతో ప్రారంభమైంది. శ్రీ శ్రీ శ్రీ అనుభవానందస్వాములవారు "శ్రీ వివేకానంద ఆదేశము" అన్న విషయంపై అనుభవపురస్సరంగా, సోదాహరణంగా శ్రీస్వామివారి జీవితంనుండి అనేక ఘట్టాలు వినిపించారు. అనంతరం, శ్రీ శ్రీ శ్రీ మాతాజీ త్యాగీశానందులవారు "శ్రీ వివేకానందరూపము" అన్న శీర్షికపై అతి మధురంగా ప్రసంగించారు. శ్రీ మాతాజీ శ్రోతలను భక్తిరసాంబుధిలో నోలలాడించి మీరాబాయిని స్మరింప జేశారు. 20-1-63 తేదీ సాయంకాలం, మహోపాధ్యాయ శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు "స్వామి వివేకానందులు; ఆధ్యాత్మికసాధన" అన్న విషయంపై గంభీరోపన్యాసంచేశారు. శ్రీ శర్మగారు సభలో సంస్కృతాంధ్రభాషల్లో భాషణలుగావించి శ్రోతలను మంత్రముగ్ధులను చేశారు. శ్రీరామకృష్ణ, వివేకానందులు కేవలం నరనారాయణులని, ఆధ్యాత్మికరంగంలో ఆ మహనీయులు భారతదేశానికి మహత్తర సందేశాన్ని, దివ్యప్రబోధాన్ని కావించారని శ్రీ శర్మగారు పేర్కొన్నారు. అనంతరం, శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు "శ్రీ వివేకానందదర్శనము" అనే విషయంపై ప్రసంగించారు. నైరాశ్యంతోకూడుకొన్న భారతదేశంలో వివేకానందుని ఆవిర్భావం, వివేకసూర్యోదయమేనని, వివేకానందునిలాంటి దివ్యమూర్తులు తిరిగి జన్మించాలని తాము ఆశిస్తున్నామని శ్రీమాన్ కృష్ణమాచార్యులు వాక్రుచ్చారు. తర్వాత గుంటూరు విజ్ఞానవర్ధనీ కళాపరిషద్విద్యార్థులు అతి మనోహరంగా గీతోపదేశము' అను నాటిక ప్రదర్శించారు.

శ్రీవివేకానందస్వామివారి నిలువెత్తు తైల చిత్రఫలకాన్ని చిత్రించి సమర్పించిన శ్రీ గట్టుపల్లి రామకృష్ణరావుగారిని శతజయంత్యుత్సవ సమితివారు నూతనవస్త్రాలతో సన్మానించారు. కళ, కళకోసంగాకుండా, భగవదారాధనకు వినియోగించవలసినదని, శ్రీ వివేకానందస్వామి లాంటి కారణజన్ముల చిత్రాలను రచించి కళను సార్థకపరచుకోవలసినదని శ్రీధారా రామనాథశాస్త్రిగారు శిల్పి నాశీర్వదించారు.

అనంతరం, మంగళం, శ్రీ ఉప్పలపాటి సుబ్రహ్మణ్యంగారి వందనాదికంతో సభలు జయప్రదంగా ముగిశాయి. ఇతి శివమ్.

## శ్రీరామకృష్ణసేవాశ్రమము, చట్లతాండ్ర

స్వామి వివేకానంద శతజయంతి ఉత్సవములు శ్రీరామకృష్ణ సేవాశ్రమమునందు 17-1-1963 తేదీనుండి మూడు దినములు జరుపబడినవి. 17-1-1963 తేదీ ఉదయం శ్రీ వివేకానందుని సహస్రనామపూజతో కార్యక్రమము ప్రారంభించబడినది. శ్రీ జి. అప్పలస్వామిగారిచే గీతాపారాయణము కావించబడినది. శ్రీ జానికిస్వామిగారి భజనమండలి వారిచే ఏకాహం భజన జరుపబడినది. శ్రీ భద్రాచలం రామమూర్తిగారిచే భక్తుడు - ముక్తిపొందు విధానంగూర్చి ఉపన్యాసము గావించబడినది. శ్రీ జి. కామరాజు భాగవతులుగారిచే 'భక్తనందనార్' కథా కాలక్షేపము కావింపబడినది. పై మూడుదినములు, ఆరాధన, భజనలు, అన్నసంతర్పణ జరుపబడినవి. బ్రహ్మచారి శ్రీ అప్పారావు, అప్పయ్యస్వామి, శ్రీ చినలచ్చుమునాయుడుగార్ల యాజమాన్యమున పైకార్యక్రమములుజరుపబడినవి.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## శతపత్రము

కర్త: శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు, సంస్కృతోపన్యాసకులు, రిటైర్డు. వెల 0-75. ప్రాప్తిస్థానము: గ్రంథకర్త, 44 జీరా, సికింద్రాబాదు.

ఈ లఘుకావ్యము రవీంద్రుని గీతాంజలి కనుకరణరూపము.

ఉపనిషన్మధువును మనసారగ్రోలి, రామమోహన, ద్వారకనాథ దేవేంద్రనాథ ప్రభృతుల ప్రబోధమును హృద్గతమొనరించుకొని, విశ్వజనీనదృష్టి నలవఱుచుకొని, కృత్తివాస చండీదాస జయదేవ ప్రభృతుల కృతులందలి పీయూషమును జుఱ్ఱి, జ్యోతిర్మయమైన వంగవైష్ణవ వాఙ్మయమునకు జేజేలుపాడి ప్రతీచీ మహాకవుల ఊహలను, నూతనపద సముదాయ ప్రయోగములను గ్రహించి, ప్రాచీన రచనావిధానముల ననుకరింపక, స్వకీయ హృదయగ్రథనముననుసరించి, స్వతంత్రశైలి నవలంబించి సౌందర్యోపాసన మొనరించి, రవీంద్రుడు తన్మయత్వముతో "గీతాంజలి"ని సృజించి, అపూర్వమగుకైసేతను వాగ్దేవికి సమర్పించి యశస్వికుడయ్యెను.—

శిరోమణి సూర్యనారాయణశాస్త్రిగారా "గీతాంజలి"ని పఠించి కాళిదాసు భవభూతి మున్నగు మహాకవుల కృతులందలి మహిమను మాధుర్యమును గ్రహించి, ఆంధ్రమున అద్భుతమగు కవిత్వమును వ్రాయనేర్చిన మహనీయులు. వీరి రచన నవనవోన్మేషమై వెలయును. అది గంభీరభావబంధురమై, సౌందర్య సందీపితమైయుండును. రవీంద్రునికృతికి అనుకరణమనుడు, అనుసరణమనుడు — ఇందలి భావశబలత ఎట్టిదో పరిశీలింపుడు:

"గీ. కన్నుఁదెలిదమ్ములును, మనఃకైరవంబు
నడుగుఁదామరదోయియు హస్తకోక
నదము, లివ్వన్ని గలిపి దండగనుగ్రుచ్చి,
త్వత్పదంబుల నర్పించువాఁడ దేవ"

"గీ. అల్ల శంపాలతా ప్రగ్రహములతోడ
వారివాహాశ్వములఁ గట్టఁబడిన దివ్య
రథముపై నెక్కి యారేఁగురమ్యమూర్తి
దివ్యతేజస్వి గనుఁగొంటిఁదృప్తిఁగంటి"

"పద్మముల్ కావు నీపాదముల్ నామనో
భ్రమరంబునకుఁ జంపకములుగాని
వనజారిగాఁడు నీవదనంబు నానేత్ర
కువలద్వయికిని సవితగాని
సుమ వృష్టిగాదు నీ చూడ్కులనుండి నా
పయిరాలునది బాణపటలిగాని
అమృతంబుగాదు నీ హాసచంద్రికనన్నుఁ
గనుకాలమున విషాకరముగాని"

"ఈమహాజ్యోతి యెచ్చటి దెంతమధుర
మెంతహృదయంగమంబయి యింపునింపు?
తావకీనతనూవల్లికా వితాన
పూరమా? కాక త్వత్కృపాక్షీరసింధు
దవళభంగములా? కాక తావకమగు
సరస రమణీయమందహాసంబొ? చెపుమ."

ఇందలి పద్యములన్నియు నిట్లే రసబంధురములై యున్నవి. కవితావిభూతి ఎట్టిదో గ్రహింపదలచినవారీ పద్యములను సదా పఠింతురుగాక!

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

నూతన ముద్రణము! ఇప్పుడే వెలువడినది!!

# షికాగో నగరోపన్యాసములు

(శ్రీమద్వివేకానందస్వామి ప్రణీతము)

అమెరికాయందలి షికాగోనగరమున జరిగిన విశ్వమతమహాసభయందు శ్రీమద్వివేకానందస్వామి యొసగిన యుపన్యాసము లిందు పొందుపరుపబడియున్నవి. సనాతనమతమును గూర్చిన సమస్తవిషయములు నిందు సులభసుందరమగు భాషయందు వివరింపబడియున్నవి. ఆవశ్యకమగుచోట్ల ప్రమాణవచనములు, వాని టిప్పణులు పాదదీపికలయందు క్రోడీకరింపబడియున్నవి!!

96 పుటలు ఆకర్షకమగు అయిదవ కూర్పు వెల: రూ. 0-50

# శ్రీ శారదా ప్రసంగములు

తృతీయ ముద్రణము

అనువాదకులు: కీ. శే. వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.

శ్రీరామకృష్ణుని సహధర్మచారిణియు, ఆదర్శసతియు, ఆదర్శయోగినియు, ఆదర్శమాతయునగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు! తేటతెనుగున రచింపబడియున్నవి.

346 పుటలు వెల: రూ. 3-00

# శ్రీ కృష్ణవాణి

సంకలనకర్త: శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వామి

అనువాదకులు: శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు

పూర్ణావతారుడని ప్రసిద్ధిగన్న శ్రీకృష్ణుని సందేశమునందలి ముఖ్యాంశములు శ్రీమద్భగవద్గీతా భాగవతములనుండి ఏర్చి కూర్చి విడివిడిగా సులభశైలియందు ముద్రింపబడియున్నవి. నిత్యపారాయణయోగ్యమగు సూక్తిసుమమాల! ఆకర్షకమగు శ్రీకృష్ణుని త్రివర్ణముఖచిత్రముగలది!

(114 + 8 పుటలు) మొదటి కూర్పు వెల: రూ. 0-40

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ ౧౯౬౩, మార్చి: శుభకృత్తు - ఫాల్గుణము సంచిక ౯

## విషయసూచిక



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౩ – మార్చి :: శుభకృత్తు – ఫాల్గుణము { సంచిక ౯


శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

స్థిరో గఙ్గావర్త స్స్తనముకుళరోమావలిలతా
కలావాలం కుణ్డం కుసుమశరతేజోహుతభుజః
రతే ర్లీలాగారం కిమపి తవ నాభి ర్గిరిసుతే
బిలద్వారం సిద్ధే ర్గిరిశనయనానాం విజయతే ॥ ౭౮

| | |
|---|---|
| గిరిసుతే | పర్వతరాజపుత్రీ |
| తవ | నీ |
| నాభిః | పొక్కిలి |
| స్థిరః | వినాశరహితమగు |
| గఙ్గా+ఆవర్తః | గంగానదిలోని సుడిగను |
| స్తనముకుళ | చనుమొగ్గలుగల |
| రోమావళి | నూగారు అనెడి |
| లతా కలా | తీగరేఖను |
| ఆవాలమ్ | ఆలవాలముగను |
| కుసుమశర తేజ | మన్మథ తేజమనెడి |
| హుతభుజః | అగ్నికి |
| కుణ్డమ్ | గుండముగను |
| రతేః | రతీదేవికి |
| లీలాగారమ్ | విలాసగృహముగను |
| గిరిశ | పరమశివుని |
| నయనానామ్ | నేత్రముల |
| సిద్ధేః | తపస్సిద్ధికి |
| బిలద్వారమ్ | గుహాద్వారముగను |
| కిమపి | ఇట్టిదట్టిదనరానిదిగను |
| విజయతే | సర్వోత్కృష్టమైయున్నది. |

తా॥ అమ్మా పార్వతీ, నీనాభిని ఇట్టిదని అట్టిదని నిర్వచించుట శక్యము కాదు. గంగానదియందొకసుడికి నిలుకడ ఉండిన అదెట్లుండెడినో అట్లున్నది నీ పొక్కిలి. పరమశివుని నేత్రములు గావించిన తపస్సునకు ఏది సిద్ధియో, ఆ సిద్ధికి ఉత్పత్తిస్థానమైన గుహాద్వారముగా అది ఉన్నది. రతీదేవికి విలాసగృహముగా అది ఉన్నది. మన్మథుని తేజ మనెడి అగ్ని యందు అగ్నికుండముగా అది యున్నది. అది ఒకపాదు. అందుండి యెదిగిన తీగ నూగారు. ఆ తీగయందలి మొగ్గలే స్తనములు. అట్టి నీ నాభికి జయము.

నిసర్గక్షీణస్య స్తనతటభరేణ క్లమజుషో
నమన్మూర్తే నారీతిలక శనకై స్త్రుట్యత ఇవ
చిరం తే మధ్యస్య త్రుటితతటినీతీరతరుణా
సమావస్థాస్థేమ్నో భవతు కుశలం శైలతనయే ॥ ౭౯

| | | | |
|---|---|---|---|
| | పార్వతీ | త్రుటిత | భగ్నమైన |
| నారీతిలక | మగువలలో మణివంటిదానా | తటినీతీర | ఏటిగట్టు |
| నిసర్గ | స్వభావము చేతనే | తరుణా | చెట్టుతోడి |
| క్షీణస్య | కృశించినదియు | సమ+అవస్థా | తుల్యావస్థలోనే |
| స్తనతట | కుచతటముల | స్థేమ్నః | నిలిచియుండునదియు అగు |
| భరేణ | మిక్కుటపు బరువుచేత | తే | |
| క్లమజుషః | పీడనందుచున్నదియు | మధ్యస్య | నడుమునకు |
| నమన్మూర్తేః | వంగిపోవుచున్నదియు | చిరం | సుదీర్ఘకాలము |
| శనకైః | మెల్లగా | కుశలమ్ | క్షేమము |
| త్రుట్యత ఇవ | విఱుగుచున్నట్లున్నదియు | భవతు | కల్గుత. |

తా॥ అమ్మా, నీ నడుము సహజముగనే సన్ననిది. కుచతటముల మిక్కుటంపు బరువు నీ నడుమునకు బాధాకరముగ నున్నది. నీ నడుము వంగిపోవుచున్నది. మెల్లగ విఱిగియే పోవునా అనిపించుచున్నది. ఏటిగట్టున పెల్లగిలిన చెట్టు పడిపోవున ట్లుండును కదా, ఆ దశలోనే నీ నడుము సదా ఉన్నది. దానికి చిరకాలము క్షేమము కల్గుత.

కుచౌ సద్య స్స్విద్య త్తట ఘటిత కూర్పాసభిదురౌ
కషన్తౌ దోర్మూలే కనకకలశాభౌ కలయతా
తవ త్రాతుం భఙ్గా దల మితి వలగ్నం తనుభువా
త్రిధా నద్ధం దేవి త్రివళి లవలీవల్లిభి రివ ॥ ౮౦

| | | | |
|---|---|---|---|
| | అమ్మా | కలయతా | నిర్మించిన |
| సద్యః | (సాత్త్వికోదయముచే) | తనుభువా | మన్మథునిచేత |
| | తత్క్షణమే | తవ | |
| స్విద్యత్ | చెమర్చుచున్న | వలగ్నమ్ | నడుమును |
| తట | ఉపరిభాగమున | భఙ్గాద్ | (చన్నుల బరువుచే) విచ్చిన్నము కానీయక |
| ఘటిత | తోడుగబడియున్న | | |
| కూర్పాస | రవికను | త్రాతుమ్ | కాపాడుటకు |
| భిదురౌ | చింపునవియు | అలమ్ ఇతి | చాలునని |
| దోర్మూలే | చంకలందు | త్రి | మూడుముడుతల రూపాన |
| కషన్తౌ | రాచుకొనుచున్నవియు | లవలీవల్లిభిః | |
| కనకకలశాభౌ | బంగారుగిండ్లను పోలిన వియు అగు | త్రిధా | మూడుచుట్లు |
| | | నద్ధమ్ ఇవ | కట్టబడినట్లున్నది. |
| కుచౌ | చనుగవను | | |

తా॥ అమ్మా, సాత్త్వికోదయముచే నీ రవిక చెమటలో తడియుచున్నది. నీ చనుగవ విజృంభణముచే రవిక పిగులున ట్లున్నది. దీనిని జూచిన మన్మథుడు స్తనభరముచే నీ నడుము విఱిగిపోకుండుటకై దానికి మూడుచుట్లుగ కట్టిపెట్టిన లవలీలతలు కాబోలు ననిపించుచు త్రివళులు (బొజ్జమీది మూడుముడుతలు) ప్రకాశించుచున్నవి

గురుత్వం విస్తారం క్షితిధరపతిః పార్వతి నిజా
న్నితమ్బా దాచ్ఛిద్య త్వయి హరణరూపేణ నిదధే
అత స్తే విస్తీర్ణో గురు రయ మశేషాం వసుమతీం
నితమ్బప్రాగ్భారః స్థగయతి లఘుత్వం నయతి చ ॥ ౮౧

| | | | |
|---|---|---|---|
| పార్వతి | గిరిరాజసుతా | నిదధే | సమర్పించెను |
| క్షితిధరపతిః | పర్వతరాజు (హిమవంతుడు) | అతః | కావున |
| | | తే అయం | నీ ఈ |
| గురుత్వం | బరువును | నితమ్బప్రాగ్భారః | పిఱుదుల పెంపు |
| విస్తారం | విరివిని | విస్తీర్ణః | విరివికలదియు |
| నిజాత్ | తన | గురుఃసన్ | బరువుకలదియునై |
| నితమ్బాత్ | నడుమునుండి | అశేషాం | సమస్త |
| ఆచ్ఛిద్య | తీసి | వసుమతీమ్ | భూమిని |
| త్వయి | నీయందు | స్థగయతి | కప్పుచున్నది |
| హరణరూపేణ | (పెండ్లియప్పుడు) కన్నెకు తండ్రిచ్చు ధనముగా | లఘుత్వం | తేలికతనమును |
| | | నయతి చ | పొందించుచును ఉన్నది. |

తా॥ అమ్మా పార్వతీ, మీ నాయన 'కొండలరాజు'గారి నడుమున విరివియు బరువును గలవు. ఆ విరివిని బరువును తననడుమునుండి తీసి ఆయన నీ పిఱుదులం దరణముగ నిడినాడు. కావున నీ నితంబము తన విరివిచే భూమిని కప్పుచున్నది, తన బరువుచే భూమిని కొంచెపఱచు చున్నది.

కరీన్ద్రాణాం శుణ్డాన్ కనకకదళీకాణ్డపటలీ
ముభాభ్యా మూరుభ్యా ముభయ మపి నిర్జిత్య భవతి
సువృత్తాభ్యాం పత్యుః ప్రణతికఠినాభ్యాం గిరిసుతే
విధిజ్ఞే జానుభ్యాం విబుధకరికుమ్భద్వయ మసి ॥ ౮౨

| | |
|---|---|
| విధిజ్ఞే | వేదార్థవేత్త్రి |
| గిరిసుతే | పార్వతీ |
| భవతి | అమ్మా |
| ఉభాభ్యామ్ | రెండు |
| ఊరుభ్యామ్ | తొడలచేతను |
| కరీన్ద్రాణామ్ | శ్రేష్ఠగజముల |
| శుణ్డాన్ | తొండములను |
| కనకకదళీ | బంగారు అరటి |
| కాణ్డపటలీమ్ | స్తంభసమూహమును |
| ఉభయమ్ అపి | రెంటిని |
| నిర్జిత్య | గెల్చి |
| సువృత్తాభ్యామ్ | చక్కనివియు గుండ్రనివియు |
| పత్యుః | పరమేశ్వరునికి |
| ప్రణతికఠినాభ్యామ్ | మ్రొక్కుటలచే కఠినములు నగు |
| జానుభ్యామ్ | మోకాళ్లచిప్పలచేత |
| విబుధ | దేవేంద్రుని |
| కరి | ఏనుగుయొక్క |
| కుమ్భ | కుంభస్థలముల |
| ద్వయమ్ | జంటను |
| అపి | సైతము |
| నిర్జిత్య | గెల్చి |
| అసి | (ప్రకాశించుచు) ఉన్నావు. |

తా॥ అమ్మా పార్వతీ, సర్వజ్ఞురాలా, నీ ఊరువులు ఇటు ఏనుగుతొండములను అటు బంగారు అరటిస్తంభములను మించి ఉన్నవి. పరమశివునికి మ్రొక్కి మ్రొక్కి గట్టిపడిన నీ మోకాళ్లచిప్పలు ఐరావతకుంభస్థలములజంటను మించి ఉన్నవి. ఇట్లు నీవు ప్రకాశించు చున్నావు.

పరాజేతుం రుద్రం ద్విగుణశరగర్భౌ గిరిసుతే
నిషఙ్గౌ జఙ్ఘే విషమవిశిఖో బాఢ మకృత
య దగ్రే దృశ్యన్తే దశశరఫలాః పాదయుగళీ
నఖాగ్రచ్ఛద్మాన స్సురమకుటశాణైకనిశితాః ॥ ౮౩

| | | | |
|---|---|---|---|
| గిరిసుతే | ఓ పార్వతీ | యదగ్రే | ఏ (ఆ) తూణీరముల ముఖమున |
| విషమవిశిఖః | పంచబాణుడు | పాదయుగళీ | పాదముల జంటయొక్క |
| రుద్రం | శివుని | నఖ+అగ్ర | గోళ్ళకొసల |
| పరాజేతుమ్ | నిర్జించుటకు | చ్ఛద్మానః | రూపానున్నవియు |
| తే | నీ | సురమకుట | వేల్పుల కిరీటములనెడి |
| జఙ్ఘే | పిక్కలను | శాణ+ఏక | సానరాళ్ళమీద ముఖ్యముగ |
| ద్విగుణ | (5×2=10) రెండంతలైన | నిశితాః | ఉత్తేజితములైనవియు అగు |
| శరగర్భౌ | బాణములు తమలోగల | దశశరఫలాః | పదిబాణాలములుకులు |
| నిషఙ్గౌ | తూణీరములను గా | దృశ్యన్తే | కనబడుచున్నవి. |
| అకృత | కావించుకొనెను | | |
| బాఢమ్ | నిజము | | |

తా॥ అమ్మా పార్వతీ, రుద్రుని గెల్చుటకై పంచబాణుడు తన బాణాలను ద్విగుణీకరించుకొన్నాడు. ఐదింటిని పదింటినిగా చేసికొని, నీ పిక్కలను ఆ బాణాల నుంచుకొను తుణీరములనుగ గావించుకొన్నాడు. ఆ తూణీరముఖములనుండి (5 X 2) పదిబాణాల ములుకులు కానవచ్చుచున్నవి. అవే నీ పాదనఖాలు, వాని మెఱుఁ గెక్కించు సానరాళ్లు వేల్పులకిరీటాలు.



# శ్రీ వివేకానంద యతీంద్ర సంస్తుతి

విద్వాన్ సత్కవి శ్రీ నారునాగనార్యజీ

కం॥ ప్రణతి శతమ్ములొనర్చుచుఁ, బ్రణుతోపనిషద్రహస్య పరమప్రవణ
ప్రణయుని గురుపదవినయుని, వినుతింతుఁ ముందు శ్రీ వివేకానందుఁ.

మ॥ శతసంవత్సరముల్ గతించెఁగద, యుష్మద్బోధ లీనాఁటికిఁ
శతధావృద్ధిఁ గనెఁ, మహాధృతిని బెల్చెఁ స్థానమానార్చనా
ర్హతచేకూరెను; నాఁడునాఁటికి జగద్వ్యాప్తమ్మునై మీఱెఁ, భా
రతులేనాఁటికి నీ ఋణమ్ములఁతీఁ దీర్పఁ నేర్చు పాటింతురో?

శా॥ నీ యాదేశమె యెల్ల దేశములకున్ నిర్వాణసంధాన సూ
త్రాయత్తమ్మగు మంత్రరాజ మది, మిథ్యావాదమూలోత్పతత్
భూయస్సాధనతీవ్రశస్త్రము, భవాంభోరాశినిస్తారక
ప్రాయోడుప్లవ; మట్టి నిన్ బొగడ సాధ్యంబే వివేకోదయా ?

కం॥ ఆశామతిఁ బ్రాక్పశ్చిమ దేశమ్ములు నీ మహోపదేశమ్మున మి
థ్యాశంస లుడిగి, తత్త్వావేశమ్మున బ్రతుకుఁగనె వివేకానందా.

మ॥ 'ఒక వేయేఁడుల బోధఁగూర్చి'తని నాఁ డూహించి మోదించి నా,
వీఁక దేశీయులె స్వార్థభావులయి యెంతే సంస్కృతిం జిక్కి యా
రకపాడైరి – భవత్సుధాశిషములన్ రక్షింపవే! తత్త్వబో
ధకు లాసించిన కాని దొం డయిన కద్దా మూఁడులోకమ్ములన్ ?

శా॥ 'నా దేశమ్మున నొక్క కుక్కయయినన్ బస్తుంటఁ గన్గొన్న నే
ఖేదం బంది తపింతు'నంచు బడబాగ్నింబోలు దుఃఖార్తిమై
స్వాదూక్తిన్ గయికొన్న నీకరుణఁ జెప్పన్ శక్యమే? స్వామి, నీ
యాదేశమ్ము ప్రవాహవేగమునఁ బ్రేమాంభోదు లల్లాడవే!

సీ॥ 'వేదాంతకేసరి' విఖ్యాతపత్రిక నించినావు, యశమ్ముఁ బెంచినావు;
ఆర్యసిద్ధాంతమ్ము లామూలచూడమ్ముఁ బంచినావు, ప్రపత్తి నుంచినావు;
తోడిసన్న్యాసులఁ గూడిమాడి చరించి మించినావు, గురూక్తి నెంచినావు;
గురుదేవుపదములఁ గొల్చి తత్త్వమ్ము నార్జించినావు, భవమ్ముఁ ద్రుంచినావు

గీ॥ అఖిలదిగ్దేశముల కేగి యార్షబోధఁ జేసినావు, ధృతిన్ వడఁబోసినావు;
నీవు పెట్టిన భిక్షయే నేఁటికో వివేకమౌనీంద్ర, విదళితవిషయసాంద్ర.

# శ్రీరామకృష్ణునిలో రూపొందిన పరమనిశ్శ్రేయసము

## [సంపాదకీయము]

శ్రీరామకృష్ణునిఖ్యాతి దినదినాభివృద్ధి నందుచున్నది. భారతదేశమున ప్రజాసేవ – విద్య – మతకార్యక్రమనిర్వాహకులలో రామకృష్ణ మిషను అగ్రశ్రేణిలో నున్నది. ఈ సంప్రదాయమునకు చెందిన సన్న్యాసులు పాశ్చాత్య దేశములందును దూరప్రాచ్యమందును నిస్తంద్రముగ సేవచేయుచున్నారు. అమెరికా–యునైటెడ్ స్టేట్సులో రామకృష్ణమిషను కేంద్రములు సుమారొక పండ్రెండున్నవి. భారతీయాధ్యాత్మికసంస్కృతిని ప్రచారముచేయుటయు ఆధ్యాత్మికపు పునాదులపై విశ్వమానవైక్యమును వర్ధిల్లచేయుటయు వాని లక్ష్యములు. అమెరికాలో పెక్కువిశ్వవిద్యాలయములందు శ్రీరామకృష్ణుని జీవితచరిత్రమును 'సుభాషితావళి'యు కలపబడుచున్నవి. ఆయనప్రవచనములు ఇప్పటికే మేధావంతుల పెక్కండ్ర నాకర్షించినవి. ఈ యుగధర్మము ఆయనలో పరమౌదార్య సంభరితమైన రూపు దాల్చినది. ఆయన పారమార్థికానుభవములు దేవుని లోకమునకు యథార్థముగను అతిస్ఫుటముగను ఎత్తిచూపుచున్నవి. శ్రీరామకృష్ణకథామృతమును (గాస్పెలును) ఆపాతముగ తిలకించినవారికి కూడ ఆయన పారమార్థికదృష్టి యెంత గంభీరమో యెట్లు అన్నిటిని అది తనలో ఇముడ్చుకొనునదో అను అంశములు ఆశ్చర్యము కొలుపక మానవు. భగవంతుడు సర్వాంతర్యామి యనియు మనతలంపులలోను కార్యాచరణములలోను భగవంతుడు వ్యాపించియున్నాడనియు —ఈ విషయములను ఆయన మన అనుభవములకు అనివార్యమైన రీతిలో తెచ్చును.

శ్రీకృష్ణబుద్ధప్రముఖులగు అవతారపురుషులకోవకు చెందిన శ్రీరామకృష్ణుడు 1836 లో బంగాళమున కలకత్తాకు చేరువనున్న యొక గ్రామమున ఒకపేదకుటుంబమున జన్మించెను. ఇతరబ్రాహ్మణుల పెక్కండ్రవలెనే అతని తలిదండ్రులును పేదవారు దైవభీతిగలవారు, సనాతనాచారపరులు. శ్రీరామకృష్ణుని బాల్యము సహజముగను, ఆనందసంపన్నముగను, వినోద సంభరితముగను గడచెను. ఆయనలో సుహిళోచితమైన ఒకసోయగ ముండెడిది. కావున పల్లెభామలకు ఆయనయందు ప్రత్యేకప్రీతి. కాని వెలికి కాన్పించు ఈ ఉల్లాసమునకు మఱుగున ఆయనలో అప్పుడప్పుడు ప్రగాఢగంభీరత కననయ్యెడిది. చదువునం దాయనకు శ్రద్ధ లేదు. ధ్యానారాధనలపట్ల ఆయనలో ప్రత్యేకాభిరుచి కననయ్యెడిది.

తన పదునాఱవయేట రామకృష్ణుడు కలకత్తాకు చేరెను. ఆ కాలమున అది భారతదేశ రాజధాని. కాని దాని ఐహికశోభలు కాని నాస్తికవైజ్ఞానికవాతావరణముగాని ఆయనను ఆకర్షింపవాయెను. ఆయన మనస్సు వేఱొక లక్ష్యమువంకకు ఉన్ముఖమై యుండెను. అది యుండునది కడుదవ్వున. మూడేండ్లకు పిమ్మట కలకత్తాసమీపమున ఒకగుడిలో ఆయన పూజారిగ చేరెను. అచ్చట దైవము కాళిగ దివ్యమాతగ భవతారిణిగ ఆరాధింపబడుచుండును. పవిత్రగంగానది సమీపమున నుండుటయు దేవాలయవాతావరణమును శ్రీరామకృష్ణుని హృదయమున అత్యంతప్రియములుగ హత్తుకొన్నవి. భగవంతుని సాక్షాత్కారాను

భవము పొందవలె నను తలంపు ఆయనను పైకొన్నది. అందుకై అతడు ఎడతెంపులేని ధ్యానప్రార్థనలతో రాత్రింబగళ్లు గడపుచుండెను. కేవల మూర్తిపూజతో తనియక, అనాది కాలమునుండి ఆరాధింపబడుచుండు విగ్రహములకు మఱుగున నిజముగ నేమున్నదో తెలిసికొనవలె నను నుబలాటము ఆయనకు కలిగినది. ప్రగాఢసాధనలచే ఆయన తన బాహ్యాంతరింద్రియములను పూర్తిగ వశపఱచుకొని వానిని భగవదన్వేషణకు వినియోగించెను. ప్రజలు ఆయనను వెఱ్ఱివా డనిరి. కాని అందుచే ఆయనకు తన మార్గమున ఎట్టి స్ఖలనమును కలుగ లేదు. తుట్టతుదకు ఆయనకు దివ్యమాతృసాక్షాత్కారానుభవము లభించెను. ఆయన బ్రహ్మానందమహార్ణవనిమగ్నుడాయెను.

కాని అనంతరకాలమున ఆయనకు కలుగనున్న పెక్కుదర్శనానుభవములకు ఇది కేవలము ఉపోద్ఘాతప్రాయమే. హిందూసిద్ధాంతము పెక్కుపట్టెలుగల రత్నము. ప్రతిపట్టెకాంతియు సాటిలేనిదే. శ్రీరామకృష్ణుడు హిందూసిద్ధాంతమునకు చెందిన పెక్కుసాధనమార్గములలో సంచరింపదొడగెను. శ్రీరాముని, శ్రీకృష్ణుని సంశ్లేషము నొందెను. దేవుని ఆయన ప్రభువుగ, తండ్రిగ, తల్లిగ, శిశువుగ, ప్రియునిగ భావించి వివిధసంబంధముల నెరపెను. ఈమార్గములలో ఒక్కొక్కటియు ఆయనకు తగిన జ్ఞానానందముల కలిగించినవి. వెంటనే ఆయన అన్యమతమార్గములలో కూడ భగవదనుభూతిని పొందగోరెను. క్రైస్తవభక్తు డయ్యెను. క్రైస్తవసాధనల ననుసరించెను. తనప్రియయవిశ్వజననిని హిందూసంప్రదాయమును పూర్తిగ మఱచెను. అచిరకాలములో దేవకుమారుడగు క్రైస్తు విశ్వమాతృసుతుడగు కౌగిలించుకొని ఆయనలో లీను డయ్యెను. మహమ్మదులోను ఆయనకు ఇట్టి అనుభవమే కలిగెను. కావున ఇస్లామును క్రైస్తవమార్గమును బ్రహ్మజ్ఞానసముద్రమునకే చేర్చు నని ఆయన నిర్ణయించుకొనెను. వివిధమతలక్ష్యములును, ఏకైకపరతత్త్వపు ఆవిష్కృతిభేదము లే అనియు ఏమార్గమునైనను సరే హృదయపూర్వకముగ అనుసరించినచో సాధకుడు ఒక్కపరమగమ్యమునొద్దకే చేరుకొను ననియు ఆయన అనంతరకాలమున విసుగు లేక ఎన్నిమార్లైనను చెప్పియున్నాడు. ఎంతమోటుమతమైనను దేవభవనములోనికి చొరవ నిచ్చు వాకిలియే. అది పెరటివాకిలియైన కావచ్చు. శ్రీరామకృష్ణుని శిష్యాగ్రగణ్యుడైన శ్రీవివేకానందస్వామి చెప్పినట్లు మానవునకు క్రింది సత్యమే పైసత్యమున కందించు మెట్టగును, సత్యమున కందించు మెట్టు సత్యమే గాని అసత్యము ఎన్నటికిని కాదు. శ్రీరామకృష్ణుడు సర్వమతసమన్వయాచార్యుడని లోక మెల్ల నేడు ఆయనను సంభావించుచున్నది. యీ సమన్వయము ఆయన వారివలె వీరివలె ఊహించి బోధించినది కాదు. స్వయముగ అనుభవించి తెలిపినది

ద్వైతసాక్షాత్కారముల నన్నిటిని అనుభవించినపిమ్మట రామకృష్ణుడు దుష్కరమైన అద్వైతసాధనాపథమును అనుసరించెను. జీవునకును విశ్వవ్యాప్తమై యున్న బ్రహ్మమునకును గల ఐక్యమును అనుభవమునకు తెచ్చుకొనుటే ఆ సాధనకు లక్ష్యము. చెప్పినను లోకులు నమ్మనంత అల్పకాలములో ఆయన విశ్వైక్యమును తనఅనుభవముచే అందుకొనగల్గెను. హిందూమతానుసారము మానవుని పారమార్థికాన్వేష

ణమునకు ఇది పరమావధి. సాధకునకు బ్రహ్మముతో ఐక్యము సిద్ధించిన వెంటనే ఇక నతడు సాధించుకోవలసినది వే ఱేదియు లేదు. ఆత్మైక్యమును దానిదివ్యతను దానినిత్యతను సదా యెఱిగియే ఆయన తన జీవితకాలమున శేషించిన ఇరువదేండ్లను సోదరమానవసేవకు అంకితమొనర్చెను. సమకాలికుల కంటి యెదుటనే వినోదప్రియుడైన యువకుడు గుడిపూజారిగ నయ్యెను; పూజారి భగవదన్వేషకుడుగ పరిణమించెను. అన్వేషకుడు భగవదున్మత్తభక్తుడుగ మాఱెను. భక్తుడు మానవరూపుడుగ నున్న దేవుడుగ నయ్యెను. మానవరూపమున నున్న ఆ దేవుడు ఆధ్యాత్మికగురుపీఠము నధిష్ఠించి వివిధవర్గాల ప్రజలను, మగవారిని మహిళలను యువకులను వృద్ధులను వైజ్ఞానికులను మూలసిద్ధాంతపరులను తార్కికులను నాటకరచయితలను సంఘసంస్కర్తలను కళోపాసకులను — తనవంకకు ఆకర్షించుకొనెను. శ్రీరామకృష్ణుని సన్నిధానమున ఆయన ఆశీస్సులలో ఒక్కొక్కరు తమ వంతును పొందిరి. ఈ గురువు ఎవరినిగాని క్రొత్తమతములోనికి మార్చుటకు ఎప్పుడును ప్రయత్నింపలేదు. ఏ మతములో నున్న వానికి ఆ మతములోనే పురోగతిని ప్రసాదించెను. శ్రీరామకృష్ణుడు క్రొత్తమతమును ప్రతిపాదింప లేదు. అన్ని మతముల నిజమును నిరూపించి చూపెను. తన ప్రతిశ్వాసచేతను దేవుని సత్యమును ప్రకటించుచు ఆయన భువిపై ఏబదేండ్ల భగవదర్పితజీవితమును గడపెను.

శ్రీరామకృష్ణుని శిష్యులలో అగ్రగణ్యుడు బహుముఖప్రజ్ఞాశాలియైన యువకుడు, ఆయనే అనంతరకాలమున శ్రీ వివేకానందస్వామి యనెడి విశ్వవిఖ్యాతిని గడించెను. 1893 లో అతడు తన గురుదేవుని సందేశమును హిందూమతసందేశమును అమెరికాకు గొనిపోయెను. తర్వాత దానినే యూరోపులోగూడ ప్రచారము చేసెను. పాశ్చాత్యదేశమునకు భారతదేశమునుండి పోయిన మొదటి ఆధ్యాత్మికసందేశహారి వివేకానందుడే.

శ్రీరామకృష్ణుడు పెక్కువిధములలో అసాధారణయోగి. యోగులలో ఇతరులగు పెక్కండ్రవలె గాక ఈయన వివాహితుడు. ఈయన తనపత్నిని సదా తనతోకూడనే ఉండనిచ్చెను. అధికప్రేమాదరములతో ఆమెను మన్నించెను. ఆమె ఆయనకు మొదటిశిష్యురాలు. మొదటి పరిచారిక. వారి సంబంధమున ఐహికస్పర్శలేశమైనను లేదు. మహిళ లందఱును లోకమాతృస్వరూపిణులు అని శ్రీరామకృష్ణుని నమ్మకము.

శ్రీరామకృష్ణుడు నిర్జనైకాంతప్రదేశము లందున్నవాడు కాడు. ఆయన ఉండినది ప్రజల మధ్య. మానవులపై ఆయన కెంతో ప్రేమ. జాతిమతభేదమును పాటింపక సకలమానవులకును పారమార్థిక శ్రేయమును సంపాదించుటకు ఆయన తనసర్వకాలమును వినియోగించెను. తీవ్రరోగబాధకు గుఱియై గొంతెత్తి మాటాడలేక మంచముపట్టియున్న దినములలోసైతము ఆయన సైగలచేతను గుసగుసలచేతను ప్రజలతో సంభాషణలు సాగించుచుండెడివాడు. దివ్యజీవితమే మానవజీవితమున ప్రకటమగును కావున మానవజీవితము ఎంతో విలువకలిగినదని ఆయన అభిప్రాయము. ఆధ్యాత్మికమైన పునాది లేని జగత్తు అసార మనియే ఆయన అభిప్రాయము. కాని జ్ఞానదీపితమైన అయన దృష్టిలో ఈ జగము దేవుని లీలారంగము.

తక్కిన ప్రవక్తలవలెనే శ్రీరామకృష్ణుడును సనాతనమైన ఆత్మసిద్ధాంతమునే బోధించెను.

దానిని ప్రజలు తమ నిత్యవ్యవహారములలో అమలుపఱుపవలె నని వారి నాయన ప్రోత్సహించెను. ఏ పనిగాని తనంతట మంచిదియు కాదు చెడ్డదియు కాదు. ఆత్మైక్యసాక్షాత్కారమునకు సాధకమైనదెల్ల మంచి దనియు ఏ దేది భేదాపాదకమో అ దెల్ల చెడు గనియు ఆయన ఉపదేశించెను. అనేకముల మఱుగున ఉన్న ఏకమును సాక్షాత్కరించుకొనుటచేతనే వ్యష్టి శాంతియు విశ్వశాంతియు చేకూరును. కామము, లోభము, బాధ, భ్రాంతి, భయము, దాపటికము ఇ వన్నియు — అందఱిలో నున్న ఆత్మ తానే అని మానవుడు గుర్తించిన తక్షణమే తొలగిపోవును. "సువర్ణసూత్రము" (గోల్డెన్ రూలు)నకును స్వేచ్ఛకును మానవులహక్కులకును ఈ కాలమున మన మాసించు సకల లక్ష్యములకును పునాది శ్రీరామకృష్ణుడు అనుభవించిన ఐక్యమే.

నవ్యలోకములోని దోషములు రెండే అని శ్రీరామకృష్ణుడు నొక్కి చెప్పినాడు, కామినీ కాంచనములే, అవి ఐహికజీవితమునకు జంట స్తంభములు. భౌతికశాస్త్రమును, సాంకేతిక విద్యయు తమ ఊనికను అనేకత్వముపై నిల్పి మానవునికి నిర్దైవ నిరాత్మ నిష్ప్రియ దృక్పథమును కలిగించినవి. యుద్ధమును యుద్ధభయమును ఐహికపరత్వమునకు అనివార్యవినాశోన్ముఖమై మానవతతి చనుచున్నదని ఆలోచనాశీలురు పలువురు ఎల్లెడల భయపడుచున్నారు. కృపాజలనిధియగు భగవంతుడు ఈ సర్వమానవవినాశమును అనుమతించు టెట్లు అని ఆస్తికుడు ప్రశ్నించును. ఈ వినాశము వస్తుస్థితిలోనే ఉన్నదా? మానవుడేమియు చేయ లేడా? దానిని మీరు విధి యనుడు, విశ్వశక్తి యనుడు, ఏమైన ననుడు. అది మానవునకు అస్వాధీనముమాత్రము కాదు. గతకాల మానవుల చింతితచేష్టితముల దుష్ఫలితములనే నేడు మన మెదుర్కొనుచున్నాము. మనల ముంచుకొనిరానున్న వినాశమునకు కారణ మదే. అట్లే మానవుల చింతితచేష్టితములు సత్ఫలములను సైతము సృజింప గలవు. లోకరక్షకశక్తిని ప్రసాదించి మహోన్నత దివ్యసాక్షాత్కారానుభవముల నొంద మానవునకు తోడ్పడ గలవు.

పరమనిశ్శ్రేయసము (బ్రహ్మము) ద్వంద్వ జగత్తున మంచిచెడుగులుగ ప్రతిఫలించు చున్నది. రెండును ప్రతిఫలములే. రెంటికిని భేదము పరిమాణములోనే.

పరమనిశ్శ్రేయసము శ్రీరామకృష్ణునిలో రూపుదాల్చినది. ఆయనలో అహంకారము నిశ్శేషముగ అంతరించినది. కలలోనైనను సరే ఆయన మనసునందుగాని పనులందుగాని దోషస్పృక్కు లేదు. ఆయనగుండ మాటాడినదియు పనులు చేసినదియు భగవంతుడే. అధఃప్రకృతి దివ్యప్రకృతికి లోబడిపోయినది. పరుషవాక్కు ఆయననోట ఎప్పుడును వెలువడలేదు. విశ్వవిశాలమగు ఆయనహృదయమునుండి కేవలము ప్రేమమాత్రమే ప్రవహించుచుండెడిది. ప్రతి మగవానిలోను, మహిళలోను ఆయన కంటికి దేవుడే కనిపించుచుండెను. దేవుని ప్రత్యక్ష రూపములుగనే ఆయన వారిని ఆదరించుచుండెను. ఎంతటి పాపినైనను సరే ఆయన సన్నిధానమున నొక దివ్యశక్తి లొంగదీసెడిది.

శ్రీరామకృష్ణుని జీవితమును సందేశమును మన్నింపవలసినవారు హిందువు లొక్కరే కాదు. విశ్వమానవతతి కెల్ల అదే ఆశాజ్యోతి.

# శ్రీవివేకానందమరందబిందువులు (౩)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

భౌతికప్రపంచమునఁగాని, ధార్మికప్రపంచమునఁగాని పతనమునకును పాపమునకును మూలకారణము భయమే. భయమే దుఃఖహేతువు. భయమే మరణహేతువు. భయమే దోషహేతువు. ఇఁక భయహేతువేమి? మన యథార్థస్వభావము నెఱుఁగకుండుటయే. మనలోఁ బ్రతివ్యక్తియు రాజరాజేశ్వరునకు వారసుఁడు.

సమస్తపాపములును సమస్తదోషములును నొక్క మాటలో — దౌర్బల్యమనెడి యీ యొక్క మాటలో — నిమిడి యున్నవి. దౌర్బల్యమే పాపకృత్యములకుఁ బ్రేరణశక్తి. దౌర్బల్యమే స్వార్థపరత్వమునకు మూలము. దౌర్బల్యముచేతనే నరు లితరులను బాధించుచుందురు. దౌర్బల్యమే నరులను దమ యథార్థస్వభావమునకు భిన్నముగాఁ బ్రవర్తింపఁజేయునది.

ప్రకృతి కతీతుఁడగుటకుఁ బ్రయత్నించుచున్నంతవఱకే మానవుఁడు మానవనామార్హుఁడగును. ఈ ప్రకృతి బాహ్యముగను నాంతరముగనుగూడ నున్నది. బాహ్యప్రకృతిని జయించుట మంచిదే, విశేషఘనకార్యమే; కాని యాంతర ప్రకృతిని జయించుట యంతకంటెను ఘనతరకార్యము. గ్రహనక్షత్రములను బరిపాలించు నియమములను గ్రహించుట మంచిదే, ఘనకార్యమే; కాని మానవుని కామక్రోధాదులను, జిత్తవృత్తులను, సంకల్పశక్తిని బరిపాలించు నియమములను గ్రహించుట ఘనతరకార్యము.

సమస్తజంతువులకంటెను, సమస్త దేవతలకంటెను మానవుఁడే యధికుఁడు; మానవుని మించినవా రెవ్వరును లేరు. మానవశరీరమూలమున మోక్షమును బొందుటకై దేవతలుసైతము స్వర్గమునుండి దిగి రావలయును. పరిపూర్ణతను బొందునది మానవుఁడొక్కఁడే, దేవతలైనను బొందఁజాలరు.

జగద్రహస్యములలోనికిఁ జొచ్చి సాగరగర్భమునకుఁ బోవలసివచ్చినను, స్వయముగా మృత్యుదేవతను సమీపింపవలసివచ్చినను, జంకని యప్రతిహతమగు సంకల్పశక్తి, ఇనుపకండలు, ఉక్కునరములు — ఇవియే మనదేశమున కిపుడు కావలసియున్నవి.

కావలసినంతకాలము విలపించినాము; విలాప మిఁకఁ జాలును, స్వశక్తిపై నిల్వుఁడు, మానవులై — ధీరులై — యుండుఁడు. మనలను ధీరుల నొనర్పఁగల మతము, ధీరుల నొనర్పఁగల సిద్ధాంతములు, ధీరుల నొనర్పఁగల విద్య — ఇవియే మనకు వలయునవి. శారీరకముగాఁగాని, మానసికముగాఁగాని, యాధ్యాత్మికముగాఁగాని మిమ్ములను బలహీనులను జేయున దేదియైనను దానిని విషమువలె విసర్జింపుఁడు; దానిలోఁ బ్రాణము లేదు, అది సత్యము కాఁజాలదు — ఇదియే సత్యత్వనిదర్శనము. సత్యము బలదాయకము, సత్యమే నైర్మల్యము, సత్యమే సర్వజ్ఞత్వము! సత్యము బలదాయకమై, వికాసహేతువై, శక్తిసామర్థ్యప్రదాయకమై యుండవలయును.

మన మనేకవిషయములనుగూర్చి మాటలాడుచుందుము, కాని యవి చిలుకపలుకులు; వాని నెన్నఁడును మన మనువర్తింపము; చేయుటకాక, చెప్పుట మన యభ్యాసమై పోయినది. దీనికి హేతువేమి? శారీరదౌర్బ

ల్యము. ఇట్టి బలహీనమైన మెదడేమియుఁ జేయఁజాలదు. దానిని మనము బలీయమొనర్ప వలయును. మొట్టమొదట మన యువకులు బలీయులై యుండవలయును; మతము — ధర్మము — దాని తరువాతిమాట. గీతాపఠన మూలమున కంటెఁ గాలిబంతియాటమూలమున స్వర్గమునకు నీవు విశేషసన్నిహితుఁడవై యుందువు. మఱికొంచెము దృఢమైన దండల మూలమున, కండరములమూలమున, గీతను నీవు మఱింతచక్కఁగా గ్రహింపఁ గలుగుదువు. నీలో మఱి కొంచెము బలకరమైన రక్తము మూలమున శ్రీకృష్ణుని మహాప్రతిభను మహా బలమును మఱింతబాగుగా గ్రహింపఁగలవు. నీ శరీరము నీకాళ్లపై సుస్థిరముగా నిలువ, నీవు మానవుఁడనని గ్రహింపఁగలిగిననాఁ డుపనిషత్తులను నాత్మవైభవమును మఱింతబాగుగా గ్రహింపఁగలవు.

మానవులా మీరు? ఆహారనిద్రాదికములతో సంతుష్టులు, భయపిశాచావిష్టులునగు మీరు కేవలము పశుప్రాయులు! కాసంత తార్కికబుద్ధియే లేనిచో నీపాటికి మీరు చతుష్పాదజంతువులుగాఁ బరిణమించెడివారే! ఆత్మగౌరవహీనులై, అసూయాద్వేషపూరితులై, పరదేశీయులచేఁ బరమనికృష్టులుగాఁ బరిగణింపఁబడుచున్నారు మీరు. మీదంభమును మీ రిక్తసిద్ధాంతములను నటుంచి, మీ దైనందిన జీవితచర్యలను బ్రశాంతముగాఁ బరిశీలింపుఁడు. పశుస్వభావమునకు మీరు వశ్యులై యుండుటచే, బ్రదుకుఁదెరువుకోసము ప్రయత్నింపుఁడనియు నందులకై మొట్టమొదట శరీరబలము నార్జించుకొనుఁడనియు మీకు నేను బోధించుచున్నాను. ఉట్టి కెగురలేని యమ్మ స్వర్గమున కెగురఁ బోయెనఁట! బలోపేతులైనచో, మనస్సును నిగ్రహించుటకు మఱింత మీ రర్హులై యుందురు. "నాయమాత్మా బలహీనేన లభ్యః" అనుపట్ల ముఖ్యముగా దుర్బలదేహు లాత్మసాక్షాత్కారమున కనర్హులని మరల మరల నేను నొక్కివక్కాణింతును. మనోనిగ్రహము చేకూరినంతనే, సంపూర్ణముగా మనస్సు మీకు వశమైనంతనే, శరీరము బలిష్ఠముగా నున్నను లేకున్నను మీరు గమనింప నక్కఱలేదు. మనశ్శరీరములు మీకపుడు జోహారు లొనర్చును.

తాపసులు తమ శరీరమును శుష్కింపఁ జేసికొందురు గాక; కర్మనిష్ఠుల కినుపకండలతో, ఉక్కునరములతోఁ గూడిన దృఢ శరీరము కావలయును! కావున వత్సలారా, శరీరబలము నార్జింపుఁడు.

రజోగుణ మిపుడు మిక్కిలియవసరమై యున్నది. సత్త్వగుణవంతులని మీరనుకొను వారిలో నూటికిఁ దొంబదితొమ్మండుగురు గాఢతమస్సున మునిఁగియున్నారు. దేశమంతయుఁ దమోగుణమగ్నమై యుండుటవలన మన కిపుడు కావలసినది విశేషరాజసికశక్తి. ఈ దేశీయుల కన్నవస్త్రముల నొసఁగవలయును — వారిని మేల్కొల్పి విశేషకార్యపరులను జేయవలయును. లేనిచో వారు స్తబ్ధులై — కేవలము శిలావృక్షములంతటి స్తబ్ధులై — పోవుదురు.

ఏదైన నొకయాదర్శము గలవాఁడు వేయి తప్పులను జేసినచో, నేయాదర్శమును లేనివాఁ డేఁబదివేల తప్పులు చేయుననుటకు నాకు సుంతయు సందియములేదు. కావున నొక యాదర్శము గలిగియుండుట మేలు.

### సమైక్య భారత నిర్మాణమునకు పునాదులువేసిన

# మహామేధావులు జగద్గురు శంకర వివేకానందులు

శిరోమణి విద్వాన్ శ్రీ వాదారి శ్రీనివాసశర్మగారు

నిద్రాణమై యున్న భారతజాతిని తట్టి లేపి, మత్తు వదలించి దానిని కర్తవ్యోన్ముఖము గావించిన మహనీయులలో మొదట వివేకానందుని పేర్కొని తరువాతనే మఱెవ్వరినైనఁ బేర్కొనవలసియుండును. అది నిజమే; కాదనువా రెవ్వ రుందురు? ఎందఱు మహనీయులీ గడ్డపై నవతరింపలేదు; ఎందఱు మహాత్ములు తమ దివ్యసందేశములచే ప్రజానీకమును ్రమువైపు నడపింపలేదు — కాని వేయిసంవత్సరముల దాస్యముచే ఆత్మవిశ్వాసమును కోలుపోయిన భారతీయులను తన వచనామృతముచే స్వశక్తిని గుఱుతింపఁజేసి, వివేకానందునివలె వారిని చైతన్యవంతులఁజేసిన పురుషోత్తముఁ డెచ్చట జన్మించెను?

వివేకానందుఁడు శంకరభగవత్పాదుల తరువాత మనల నుద్ధరింప వచ్చిన అపరశంకరుఁడు. శంకరభగవత్పాదుల కాలమున ప్రచారమునకుఁ దగిన సౌకర్యములు లేకుండుటచే వారి దివ్యవాణి భారతదేశపు సరిహద్దులతోనే ఆగిపోయెను. కాని వివేకానందుఁడు అట్టికొఱతను బూర్తి గావించెను. ఆయన శంకరుల బోధలలోని భావగాంభీర్యమును శ్రీరామకృష్ణుల దివ్యోపదేశములచే నర్థముచేసికొనఁగలిగి ఖండాంతరములందు సైతము వ్యాపింపఁజేసి శంకరభగవత్పాదులు వదలిపెట్టిన కార్యక్రమమును కొనసాగించెను.

ఆశయములలో నేమి, ఆచరణలో నేమి, అధ్యాత్మవిద్యచే భారతదేశపు అఖండాత్మను దర్శింపఁగల భాగ్యము ఆనాడు శంకరులకును, ఈనాడు వివేకానందులకును సాధ్యము కాగలిగెను.

చిఱుత ప్రాయముననే శంకరాచార్యులు అన్నివిద్యలందును ఆరితేఱిరి. సాంగోపాంగములుగా వేదము లన్నియు అష్టవర్షప్రాయముననే ఆయనకుఁ గరతలామలకము లయ్యెను. అంతటి వయసులో నన్నివిద్యలను అర్థము చేసికొనఁగలుగు భాగ్యము దక్కుట కెంతో పుణ్యము చేసియుండవలెను. కాబట్టియే శంకరునివంటి మేధావి బుద్ధునివంటి దయాశాలి ఇంతవఱకు పుట్టలేదు; ఇక పుట్టఁబోడను నానుడి యేర్పడినది.

అట్లే బాల్యమున వివేకానందుఁడు ఆంగ్లవంగ గీర్వాణభాషలందు అఖండప్రజ్ఞ సంపాదించెను. తండ్రి విశ్వనాథదత్తుని మరణానంతరము దుర్భర దారిద్ర్యము నెదుర్కొనవలసి వచ్చినను అతఁడు తన ఉన్నతవిద్యను కొనసాగించెనే కాని నడుమ మానివేయ లేదు.

వివేకానందుడును ఒక కార్యమును నిర్వహింప వచ్చిన అవతారపురుషుఁడు. జన్మాంతర వాసనలు చిన్ననాటినుండియు అతనికడ పొడసూపుచునే యుండెను. ఎక్కడ పురాణశ్రవణ మన్నను అక్కడ అతఁడు ప్రాలెడివాఁడు. రామాయణ మన్న చెవిఁగోసికొనెడివాఁడు. పౌరాణికుఁ డొకనాఁడు హనుమంతుఁడు కదళీ వనములో నెల్లవేళల విహరించుచుండు నని చెప్పుసరికి, అతనిని వెదకుటకై ఒంటరిగా నరేంద్రుఁడు రాత్రికిరాత్రి పురముపెలుపల నున్న అరటితోటలలోఁ గ్రుమ్మరుచుండెను. ఎచ్చటను కన్నుల పడక పోగా తెల్లవాఱఁగనే తల్లికడకు వచ్చి యీసంగతివిన్నవించెను. ఆమె "రామకార్యమును నిర్వహించుటకై హనుమంతుఁడు వెడలియుండు" నని చెప్పి అతనిని సమాధానపఱచె నట. బాల్యము నుండియే వివేకానందుని దీక్ష అట్టిది. తాడో పేడో తేల్చువఱకు పట్టిన పట్టును మానెడి వాఁడు కాఁడు.

శంకరులు గోవిందభగవత్పాదుల దివ్యానుగ్రహముచే అద్వైతవిద్యను గ్రహించి, అందఖండానుభూతిని పొందిరి.

వివేకానందుఁడు శ్రీరామకృష్ణపరమహంసుల దివ్యానుగ్రహముచే నాధ్యాత్మికానుభూతిని పొంది సన్న్యాసమును గ్రహించెను.

ఉగ్గుపాలతో నలవడిన మేధాసంపద శంకరుల నూరకుండ నీయ లేదు. దేశమందు తల ఎత్తి నిక్కి చూచెడి పాషండమతములు దేశవిచ్ఛిత్తికి దారితీయుచుండ చూచి సహింపలేక పోయిన దా కోమలహృదయము. సనాతన సంప్రదాయము తలతోకలు లేని కువ్యాఖ్యానములకును, కువిమర్శలకును గుఱియై భారతీయులలో దాని పునాదులను కోల్పోవుచుండెను. నిర్మాణాత్మకమైన విధానములతో వానిని పరాస్తము కావింపఁదలచినారు శంకరులు. ఆసేతుహిమాచలము పర్యటించి దిట్టములైన పునాదులతో – పాషండమతములను నిర్మూలించి – సనాతనసంప్రదాయసౌధమును నిర్మింప దీక్షఁ బూనిరి. ఇట్టి కార్యదీక్షను, ప్రచారాభిరతిని గల్పించిన మహనీయులు శ్రీవారి గురుదేవులగు శ్రీగోవిందభగవత్పాదాచార్యులు. శంకరులకుఁ గల సందేహములనెన్నింటినో వారు పటాపంచలు గావించిరి. తపస్వులగు శ్రీగోవింద భగవత్పాదుల అనుగ్రహముచే శంకరాచార్యులు సన్న్యాసమును స్వీకరించి తమ కార్యక్రమమును కొనసాగించిరి. అట్లే—

పందొమ్మిదవ శతాబ్దములో ఉన్నతవిద్యాభ్యాసము సాగించెడి నరేంద్రునకు రామకృష్ణుల దివ్యబోధలు చెవికెక్కెను. అతఁ డంతకు మునుపే బ్రహ్మసమాజదీక్ష నందియుండెను. అతని మనస్సులో నెన్నో సందేహములుండెను. అది పాశ్చాత్యప్రాచ్యసంస్కృతుల సంధికాలము. పాములవలెఁ బర్వు లెత్తు వేలాది ఆలోచనలకు అతనిమనసులో తెగతెంపులు లేకపోయెను. విశ్వసముద్రములో వివేకానందుని పడవ మెల్లని నడకతో ఇటు నటు ఊఁగుచు, అలల ఉరవడికి ఎప్పుడెప్పుడా అనునట్లు సాగిపోవుచుండెను. కల్లోలమాలికను లెక్కింపక పడవను ముందునకు వేగముగా నడిపింపఁగల ఊతకాతఁడు అఱ్ఱులు చాచెను. రామకృష్ణ పరమహంస అతనికి చేయూతనిచ్చి ఆ కొఱతను దీర్చెను.

గురుసహాయము లేక ఎట్టివాఁడైనను పైకి రాలేడు. భావవీచికలలో గురుదేవుఁడు విజ్రుం

భించునట్లు, అతని సహాయసంపద లేక ఎట్టి శిష్యుఁడైనను విజృంభింపలేడు. ఒకసారి శ్రీరామకృష్ణులే గురుదేవుల ప్రాముఖ్యము నిట్లు వివరించిరి—

"ఒకపొగయోడ మహాసముద్రమున నెంతో వేగముగా సాగిపోవుచుండును. దానికిఁ గట్టఁబడియున్న జీవనౌకలు (లైఫ్-బోట్సు) గూడ పొగయోడ పోయినంత వేగముననే పోవుచుండును. కాని పొగయోడతో దానికిఁ గల గొలుసులను త్రెంపివైచిన అంత వేగముగా సాగదు; సరికదా! అలల ఉరవడికి తట్టుకొనలేక మహాసాగరమున మటుమాయమగును. అట్లే గురుదేవుఁడు పొగయోడవంటివాఁడు. శిష్యులు దానికి కట్టఁబడిన జీవనౌకలవంటివారు. గురుదేవుల కృపాకటాక్షము లున్నంతదాక శిష్యులు వారితో సరియగు వేగముననే పోఁగలిగియుందురు. వారు పోలేకున్నను గురుదేవుఁడు వారికి తన యనుభవశక్తి నూతగా నిచ్చి పోవునట్లు చేయును. గురుదేవులే లేకుండిన శిష్యుల ప్రవృత్తి పైకి రాలేక ప్రయోజనశూన్యమై అడుగునఁ బడినట్లు చిక్కువడును."

బాల్యమునుండియు నరేంద్రునకు సాధువులన్నను, సన్న్యాసులన్నను మిగుల ప్రీతి. వారికేమి కావలసి వచ్చినను తెచ్చియిచ్చెడివాఁడు. ఊహవచ్చిన నాటినుండి తాను దర్శించిన సన్న్యాసు లందఱను నరేంద్రుడు "మీరు దైవదర్శన మయ్యెనా? మీరు దైవమును నేరుగా చూడగలిగితిరా?" అని ప్రశ్నించెడివాఁడు. ఎవ్వరును అతనికి సరియగు జవాబు చెప్పఁజాలక పోయెడివారు. అందఱును సాధనలో నున్నవారే కాని సిద్ధు లొక్కరును లేరైరి. శ్రీరామకృష్ణుల సందర్శించినప్పుడును నరేంద్రుఁ డిట్టి ప్రశ్ననే వైచెను. శ్రీరామకృష్ణుల దివ్యశక్తిముందు వివేకానందుని పీకలు ప్రాకలేదు. గురుదేవుడు తనచల్లని చేతులతో వివేకానందుని నిమిరెను. దానితో నతఁడు బాహ్యజ్ఞానమును కోలుపోయెను. అతని నెచ్చటికో దివ్యలోకములకుఁ గొనిపోవునట్లుండెను. అతనిలో ఈ చర్య అద్భుతపరివర్తనను దెచ్చెను. శ్రీరామకృష్ణు లిట్లు అతనిని కర్తవ్యోన్ముఖుని జేయుటలో సఫలుఁ డాయెను.

భారతీయులు తరతరములనుండి సంపాదించిన సొత్తు అధ్యాత్మవిద్య. భౌతికప్రాధాన్యము గల నేటిప్రపంచమున పాశ్చాత్యదేశములలో దాని ప్రచారమున కెంతయో ప్రాముఖ్యము గలదు. శ్రీరామకృష్ణు డీ పనిని వివేకానందున కంటఁగట్టెను.

శంకరులు భారతీయుల విచారధార చిందఱవందఱయై నాస్తికమువైపు పరుగు లిడుచుండ, దానిని తనజ్ఞానశక్తిచే ఆస్తికమువైపు ద్రిప్పి భారతీయులలో ప్రేళ్లుపాతిన ఆస్తికమతముల నన్నింటిని చేరదీసి నిలుప గలిగిరి. దేశమును నట్టేట ముంచెడి పాషండమతములను ఖండించి వానికి భారతదేశమున తావు లేకుండఁ జేసిరి. ఆస్తికమతరత్నముల నేఱి అద్వైతవేదాంత సూత్రమునఁ గట్టి సార్వజనీనమైన సమైక్యమును భారతవర్షమందు నెలకొల్పిరి. పాషండుల నుండి ఆస్తికులకు ఎట్టి ఇబ్బందులు రానీయకుండ దేశము నలుదిక్కుల నాలుగు మఠములను ప్రతిష్ఠించిరి. నాస్తికమతముల నెదిరించుటకు దిగ్దంతులవంటి పండితప్రకాండులను సన్న్యాసులను నిలిపిరి. హిమాలయములలో కేదారనాథ, బదరీనాథక్షేత్రముల ప్రతిష్ఠించి, ఇటు దక్షిణమున కన్యాకుమారినుండి ఉత్తర

మున కేదారనాథ బదరీనాథముల కొనలవఱకు భారతజాతిసమైక్యస్థాయిని అభేద్యము గావించి తన బాధ్యతను నెఱవేర్చిరి.

అట్లే వివేకానందుఁడు భారతీయుల విచారధార ఆధ్యాత్మికమునుండి ఆంగ్లేయుల వేషభాషలవైపు పడఁగిడుచుండ, దానిని భారతాదర్శమువైపు త్రిప్పి ఆత్మశక్తిని, ఆత్మీయతను ఉద్దీపింపఁజేసెను. జాత్యైక్యమును నిర్మూలింపఁజేయు సంఘముల ప్రవృత్తిని యుక్తివాదములతోఁ గూలఁద్రోసి భారతీయతను ప్రజానీకములో ప్రతిష్ఠింపఁగలిగెను. ప్రపంచమతముల నన్నిటిని శ్రీరామకృష్ణుని దివ్యసూత్రములచే గుదిగ్రుచ్చి ప్రపంచస్థాయిలో భారతవాణికిఁ గల ప్రత్యేకతను అంతట చాటి చెప్పెను. సార్వజనీనమగు భారతీయమతమును విశ్వమంతట చాటిచెప్పుటకును, దేశీయులలో కర్తవ్యపరాయణతను ఉగ్గుపాలనుండి అలవఱచుటకును తన గురుదేవుని పేర రామకృష్ణమఠములను, రామకృష్ణసేవాసంఘములను స్థాపించెను.

భారతదేశమంతట పర్యటించినమీఁదట వివేకానందుఁడు దేశమంతట తాండవించుచున్న దారిద్ర్యమును చూచి ఎంతో వాపోయినాఁడు. "అన్నమో! రామచంద్రా!" అని అలమటించు దీనుల ఆర్తరావములు అతని చెవిని బడని రోజులు లేవు. ఏ తావున పర్యటించినను, ఏ క్షేత్రమును దర్శించినను, ఏ నగరము మెట్టినను దీనులయు, దరిద్రులయు, రోగులయు దశను చూడ లేక దుఃఖనివారణకు ఉపాయము నన్వేషింప అతని మనస్సు ఉద్వేల్లూరుచుండెను. కావున వివేకానందుడు నిర్మాణాత్మకమైన పథకము నొక్క-దానిని అమలు పఱచెను. మఠములో శిష్యప్రశిష్యులకు అధ్యాత్మవిద్య బోధించి తరింపజేయ ప్రయత్నము గావింపబడెను. సేవాసమాజములలో లోకసేవ ప్రధానమై యుండును. సేవాసమాజమువారు ధర్మవైద్యశాలలతో దరిద్రరోగులకు సహాయకార్యక్రమమును నెఱవేర్తురు. కఱవుకాటకములలో ప్రజలకు అన్నివిధముల నిష్కామసేవలకు సంసిద్ధులగుదురు. కొన్ని సంవత్సరముల క్రిందట గోదావరివఱదలు వచ్చినప్పుడు, వఱదలవలన ఇండ్లు, వాకిళ్లను కోల్పోయిన ఆంధ్రులకు రామకృష్ణసేవాసంఘమువారు దేశదేశములనుండి చందాలు ప్రోగుచేసి, ఎంతో సహాయకార్యక్రమమును నిర్వహించిరి.

శ్రీశంకరభగవత్పాదులు శారదాదేవి యనుగ్రహముచే శతాధికములగు గ్రంథముల రచించిరి. ముఖ్యముగా బ్రహ్మసూత్రములకును, ఉపనిషత్తులకును భాష్యములను రచించి తనతో వాదింపవచ్చిన హేమాహేములవంటి పండితప్రకాండులను వాదనైపుణిచే ఓడించి అద్వైతదుందుభిని అంతట మ్రోగించిరి. భారతీయుల దృక్పథమును ఏకసూత్రమున బంధించిరి.

సాధారణముగాఁ గవులవలెనే మహాత్ములును రసమయదృష్టి గలవారు. అంతే కాదు; రససిద్ధులుగూడ. వారి ప్రతిభకు హద్దుపద్దులుండవు. బ్రహ్మ సృజించిన ప్రాణికోటికిఁ బరిమితాయువుండవచ్చును, కాని రసమయదృష్టి గల మహాత్ములు సృజించిన వాఙ్మయకోటి కది శూన్యము. మహాత్ముల సారస్వత మేనాటికిని నశింపదు. సూర్యచంద్రులు నిలుకడ గలిగి యుండునంతదాక వారి ప్రాతిభసృష్టికిఁ బరిపూర్ణాయువు.

శంకరభగవత్పాదులవలెనే శ్రీవివేకానందుడును కాలానుగుణమైన శబ్దసంవిధానముచే

ప్రపంచమున కెల్ల ఆదర్శభూతమైన గొప్ప సారస్వతమును సృష్టించెను.

శంకరభగవత్పాదుల సారస్వతమంతయు సంస్కృతభాషలోనే రచింపబడెను. ఆయన గ్రంథము లన్నియు శాస్త్రీయమగు పరిశుద్ధ తార్కిక శైలితో నొప్పి పెక్కు విషయములతో ప్రతివాదులను నిగ్రహించున ట్లుండును. ఆ కాలమున సంస్కృతభాష రాజభాష. భారత వర్ష మందలి మతము లన్నియు సంస్కృత భాషనే ఊతగాఁ గొని. తమతమ విమర్శ నైపుణిని ప్రదర్శించినవి. శైలి వాదోపవాదముల కుపయుక్తమగు తార్కిక శైలి. బౌద్ధులతోను, జైనులతోను వాదింపవలసి వచ్చి వారిలో నిలువరించిన తర్కవిధానమే వీరికిని ఆలంబ మయ్యెను. ఏ మతమువాడైనను ఈ వాదసరణిని అర్థము చేసికొనుటకు అటు తర్కశాస్త్రమును, ఇటు వ్యాకరణమును క్షుణ్ణముగాఁ జదివెడివాఁడు. ''కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకం'' అని ఆనాటి అభియుక్తోక్తి. అట్టిశైలి ఈనాటి విద్యావంతుల కంత సులభగ్రాహ్యము కాదు. పాశ్చాత్య వాఙ్మయముతోఁ గొద్దియో గొప్పయో పరిచయము గల నేటి యువవిమర్శకుల కానాటి సారస్వతము అందుబాటులో లేని దయ్యెను. కథాకథనరూపమైన నేటి విధానము వేఱు. ఎట్టిశాస్త్రవిషయమైనను సరే - కథ చెప్పినట్లుగా - చేతిలో పండు ఒలిచిపెట్టినట్లుగా - ఏమియు తెలియనివానికిఁగూడ అర్థమగునట్లుగా - జెప్పవలయును. అప్పుడే విషయము - జటిలమైనను - ఆసక్తిని గలిగించును.

వివేకానందుఁడు తన దేశపర్యటనవలన ప్రాచ్యపాశ్చాత్యుల ఆచారవిచారములను అనుభవపూర్వకముగా గ్రహింపఁగలిగినాఁడు. శంకరులనాటి మహోన్నతవేదాంతపరమార్థమును ఈనాటి ప్రపంచ మర్థము చేసికొననియెడల ఎంతయో ఉపద్రవము కలుగునని భావించెను. అందలి గంభీరోపదేశము ప్రజాసామాన్యమునకవగతమగునటుల అన్నింటిని సరళపఱచెను.

ఈనాటి ప్రపంచము ముక్కాలు మువ్వీసము అంతర్జాతీయస్థాయిని అందుకొన్న ఆంగ్లభాషాస్రవంతిపై ఆధారపడియున్నది. కావున వేదాంతశాస్త్రములలోని గభీరపరమార్థమును ఆంగ్లభాషలో సరళశైలిలోనికి దింపి నేటి యువకుల ఆదరాభిమానముల చూరగొనెను. తన అమెరికాపర్యటనములోను, యూరపుఖండపర్యటనములోను, భారతవర్షపర్యటనములోను వివేకానందుఁడు దాని ప్రభావమును గూడ పూర్తిగా నెఱింగియుండెను.

ఋతువులు మాఱిన మాఱవచ్చును గాక! కాలము తన ధర్మమునంతయు కూడఁగట్టుకొని విఱుచుకొని పడిన పడుగాక! దివసములు అతీతములైనను, మాసములు పరుగులెత్తినను, సంవత్సరములు గడచినను, శతాబ్దములు దొర్లినను మహాత్ముల సారస్వతముమాత్రము ఏనాటికిని చెక్కుచెదరనిది కదా! నిత్యనూతనము కదా! వారు సార్వకాలికము, సర్వాబాధితము నగు సారస్వతమును సృష్టించి లోకమందు వైశిష్ట్యమును బొందుదురు.

శంకరభగవత్పాదులు ముప్పదిరెండేండ్లు మాత్రమే జీవించినను తరతరముల ప్రజ లాయనను తలచుకొనునట్లు మహోన్నతము లగు ఉపదేశముల నిచ్చి అజరామరులైనారు. శ్రీ శంకరుల గ్రంథావళిని 'వాణీ విలాస ప్రెస్' వారు ముద్దుముచ్చటగా సంతరించినారు. దేశమందెందెందఱో 'శంకరగ్రంథావళి'ని నిర్వ

హించి ప్రకటించినారు. అట్లే వివేకానందులు ముప్పదితొమ్మిదియేండ్లుమాత్రమే జీవించినను తరతరముల ప్రజ లాయనను స్మరించునట్లు మనకు మహోన్నతపరమార్థసంపద నిచ్చి అజరామరు లైనారు. సారస్వతములో మహాకవుల రచనలవలెనే మహనీయుల రచనలను, సందేశములను ఏర్చికూర్చి వారి గ్రంథావళిని సంపుటములుగా సంతరించుట గొప్ప కళాసేవ. వివేకానందుల దివ్యసందేశములను, రచనలను గ్రంథావళి-సంపుటముల రూపమున ఆంధ్రుల కందఁజేయుటకు శ్రీ రామకృష్ణమఠమువారు నిర్వహించిన పాత్రను, వివరించుటకు మాటలు చాలవు. మంచి డొక్కశుద్ధి గల పండితుల మూలమున - సులభ గ్రాంథికములో - అలతి అలతి నుడికారములతో నొప్పిన జాను తెనుగులో సంతరించిన ఈ 'సంపూర్ణ గ్రంథావళి' ఆంధ్రుల సౌభాగ్యసంపద యగును గాక!

ఆధ్యాత్మికజీవితమే పరమావధిగా గ్రహించి బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసమును గ్రహించి తత్ప్రచారమునకై జీవయాత్ర సాగించిన శ్రీ శంకర భగవత్పాదులు — ఆధ్యాత్మిక జీవితమే పరమావధిగా గ్రహించి బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసమును గ్రహించి తత్ప్రచారమునకై జీవయాత్ర సాగించిన శ్రీ వివేకానందులు — అజరామరులు. సారస్వతాకాశమున తేజోమూర్తులై వెలిగెడు అఖండభాస్కరులు. వారియాత్మలు మనలో లీనమై యున్నవి. ఈ వార్షికోత్సవ సందర్భమున వారిరువురకు 'భక్త్యంజలి' సమర్పింపని భారతీయుఁ డుండఁజాలఁడు. శ్రీ వివేకానందులను, ఆది శంకరులను స్మరింపనినాడు భారతీయులకు, భారతజాతికి మనుగడయే లేదు.

# ఉపనిషద్వాఙ్మయము

శ్రీయుతులు పాటీలు తిమ్మారెడ్డి, ఎం. ఏ.,
బోయనపల్లి రామారావు, బి. ఏ. గారలు

ఉపనిషత్తులు మఱే మతమునందును మఱే భాషయందును లభింపని అమూల్యము అతులనీయము నగు హైందవాధ్యాత్మికసంపదాకరములు. నేడు మన ముపనిషత్పరాఙ్ముఖుల మగుటయే మనదైన్యమునకు ముఖ్యహేతువు. మనయింటిలో నిక్షిప్తమైయున్న యీ మహానిధిని తిరస్కరించి ఎందో గోరాడిన నేమి ఫలము?

పతంజలమహాభాష్యపస్పశాహ్నికము 'ఋగ్వేదమునకు 21, యజుర్వేదమునకు 100, సామవేదమునకు 1000, అథర్వవేదమునకు 9 శాఖలు కల'వని పేర్కొనుచున్నది. అనగా నన్నియు కలసి నాలుగు వేదములకును 1130 శాఖలు గలవు. ఎన్ని శాఖలుకలవో అన్నియే సంహితలు, అన్నియే బ్రాహ్మణారణ్యకములు, అన్నియే కల్పసూత్రములు, ఉపనిషత్తులు కలవని ప్రాచీనసాహిత్యమువలన విదిత మగుచున్నది. కాని మన దురదృష్టవశమున నేడవి యన్నియు లభించుట లేదు. ప్రతిశాఖకు నొక యుపనిషత్తు కల దనుటచే 1130 ఉపనిష

త్తులు లభింప వలయును. కాని నేడు ఉపనిషత్సాహిత్యసారభూతములగు 108 ఉపనిషత్తులు లభించుచున్నవి. (ముక్తికోపనిషత్తు 144) ఈ 108 లో 10 ఋగ్వేదమునకు 19 శుక్లయజుర్వేదమునకు 32 కృష్ణయజుర్వేదమునకు 16 సామవేదమునకు 31 అథర్వవేదమునకు సంబంధించిన వని ముక్తికోపనిషత్తు ప్రథమాధ్యాయమువలన విదితమగుచున్నది. ఇవి గాక పూనానుండి డా॥ బేల్వల్కరుగారు సానువాదములను బాష్కల్య ఛాగల్య. ఆర్షేయ, శౌనకోపనిషత్తులను ప్రకటించిరి. డైసన్ జర్మను అనువాదముతో 60 ఉపనిషత్తులు ప్రకటించెను. నారాయణస్వామిహ్యూమ్‌గారలు ఆంగ్లానువాదముతో 30-30 ఉపనిషత్తులు ప్రకటించిరి. వావిళ్లవారు రామకృష్ణమఠమువారు కూడ పెక్కుపనిషత్తులు ప్రకటించిరి. అడయారు (మదరాసు) లోని థియొసాఫికల్ సొసైటీవారు దాదాపు 200 ఉపనిషత్తులను ప్రకటించిరట.

"ఉప. ని" అను ఉపసర్గములతోడి 'సద్' ధాతువునకు 'క్విప్' ప్రత్యయము చేర్చుటచే 'ఉపనిషత్తు' అను శబ్ద మేర్పడును. బ్రహ్మవిద్య యని దీని తాత్త్వికార్థము. ఈయర్థమునందే యిది రూఢము. కాఠకోపనిషదుపోద్ఘాతమున శంకరాచార్యులవారు "ముముక్షువులకు సంసారబీజభూతమగు అవిద్యను నశింపజేయునది, వారికి బ్రహ్మప్రాప్తి కలిగించునది, సర్వథా దుఃఖములను శిథిలీకరించునది యగు అధ్యాత్మవిద్యయే ఉపనిషత్తు" అని పేర్కొనిరి. దీనిముఖ్యార్థము బ్రహ్మవిద్య యనియే. బ్రహ్మవిద్యాప్రతిపాదకమగు గ్రంథవిశేషమని గౌణార్థము. కాని కొన్ని యుపనిషత్తులయందు యోగస్వరూపవిచారము, కొన్నిట విష్ణు శివ శక్త్యాద్యుపాసనలుకూడ పేర్కొనబడినవి.

ఉపనిషత్తులను, శ్రీమద్భగవద్గీతను, వ్యాసకృతమగు వేదాంత సూత్రములను ప్రస్థానత్రయ మని వ్యవహరింతురు. ప్రస్థానత్రయము హిందూమతహిందూదర్శనసౌధమునకు బునాది వంటిది. ఇందు గీతకును బ్రహ్మసూత్రములకును కూడ ఉపనిషత్తులే మూలస్రోతములు. కావున సంస్కృతసాహిత్యమున వేదముల కనంతరము ముపనిషత్తుల కున్నంత గౌరవము మఱి దేనికిని లేదు. ప్రస్థానత్రయభాష్యము లేని మతసంప్రదాయమునకు గౌరవములేనికతన ఎల్ల సంప్రదాయములవారును వీనిపై భాష్యములు రచించిరి.

వేదములయందు మంత్రబ్రాహ్మణము లని రెండుభాగములు కలవు. ఇందుబ్రాహ్మణభాగములయందు మంత్రార్థనిర్ణయము బడినది, యాజ్ఞికానుష్ఠానముల విస్తృతవివరణమున్నది, వివిధోపాఖ్యానము లున్నవి. తపోధనులగు బ్రాహ్మణులచే సంకలనము చేయబడుటచే నివి బ్రాహ్మణములైనవి. బ్రహ్మ మనగా యజ్ఞ మని యొక యర్థము. యజ్ఞప్రతిపాదకము లగుటచే నివి బ్రాహ్మణములు. ఏ ఋషి, ఏవంశీయులు, ఎవరి శిష్యులు ఏబ్రాహ్మణముల నుపదేశించిరో వారిపేర వానికి నామకరణము గావింపబడినది. బ్రాహ్మణములలో అరణ్యములయం దుపదిష్టములైన భాగము లారణ్యకములు. ఈ బ్రాహ్మణారణ్యకములయందు గహనములు, గంభీరములు, సూక్ష్మమననయోగ్యవిషయసహితములు నగు భాగములే ఉపనిషత్తులు.

ఇప్పు డీ యుపనిషత్తుల నెల్ల నెఱిగించుటకు యత్నించిన వ్యాసము మిక్కిలి పెద్ద దగును. అందు పెక్కింటిని మే మెఱుగముకూడ. కావున

సుప్రసిద్ధములై శంకరాచార్యులభాష్యముచే విరాజిల్లు ద్వాదశోపనిషత్తులను సంక్షిప్తముగ పరిచయము గావింతుము. ఈ పండ్రెండు ఉపనిషత్తులను తమ వేదాంతసూత్రశారీరకభాష్యమందు వేదములని భగవత్పాదులవారు మాటిమాటికి పేర్కొన్నారు. ఇవి కాక మఱియూ ఉపనిషత్తులనుగూడ వారు పేర్కొన్నను భాష్యములనుమాత్రము రచింపలేదు. ఇందు ఛాందోగ్యబృహదారణ్యకములు బృహదాకారములు. ఉపనిషత్తులు కొన్ని గద్యమయములు, కొన్ని పద్యమయములు, కొన్ని గద్యపద్యాత్మకములు. విభిన్నఋషుల ఆధ్యాత్మికానుభవములు సూత్రరూపమున ఉపనిషత్తులయందు గ్రథితములగుటచే వీనియందు కొన్నిచోట్ల పరస్పరసామంజస్యము లోపించుట అసహజము కాదు. ఆమాత్రముచే వీని గౌరవమున కేమియు లోటు లేదు.

ఎ. బి. కీథ్ గారిచే ఆంగ్లములోనికనువదింపబడి ప్రకటితమైన ఋగ్వేదాంతర్గత కౌషీతకి లేదా శాంఖాయనారణ్యకమున పదునైదధ్యాయములుకలవు. ఈయారణ్యకమందలి మూడు మొదలాఱవఅధ్యాయమునఱకుగల భాగమును కౌషీతకోపనిషత్తు అందురు. ఈయుపనిషత్తు ప్రథమాధ్యాయమున చిత్రగార్గ్యాయణి యను క్షత్రియనృపతి ఉద్దాలకారుణి యను విప్రవిద్వాంసునకు పరలోకవిషయమై యుపదేశ మొసగెను. ద్వితీయాధ్యాయమున మహాప్రాణ (పరబ్రహ్మ) పితాపుత్ర స్నేహసంబంధవిషయములు కలవు. తృతీయాధ్యాయమున కాశీరాజగు దివోదాసునకు నింద్రుడు ప్రాణప్రజ్ఞోపదేశము నిచ్చుట కలదు. చతుర్థాధ్యాయమున కాశీరాజగు అజాతశత్రుడు బాలాకి యనువిప్రునకు పరబ్రహ్మవిషయ ముపదేశించుటకలదు.

ఋగ్వేదీయ ఐతరేయారణ్యకమున ఐదు భాగములు కలవు. ఇందలి రెండవభాగము లేదా ఆరణ్యకమునందలి 4, 5, 6 అధ్యాయములకు ఐతరేయోపనిషత్తు అని పేరు. ఇది బ్రహ్మవిద్యాప్రధానమగు నుపనిషత్తు. ఇందు మూడధ్యాయములు కలవు. ప్రథమాధ్యాయము మూడు ఖండములు, తక్కిన వొకొక్క ఖండము. ప్రథమాధ్యాయమున ప్రపంచసృష్టి ద్వితీయమున జీవుల జన్మము తృతీయమున పరబ్రహ్మసమీక్ష కలవు.

సామవేదీయ కౌథుమీశాఖాబ్రాహ్మణమున నలువదిభాగములు కలవు. ఇందు 25-వ భాగము పంచవింశ లేదా తాండ్యబ్రాహ్మణమనియు, 26-30 భాగములు షడ్వింశబ్రాహ్మణమనియు 31-32 భాగములు మంత్రబ్రాహ్మణమనియు 33-40 భాగములు ఛాందోగ్యోపనిషత్తనియు పేర్కొనబడును. ఈ ఛాందోగ్యోపనిషత్తు పెద్ద గ్రంథము. ఇందు 154 ఖండములు, 258 ప్రకరణములు కలవు. ఇందొకటి రెండుభాగములు లేదా ప్రపాఠకములందు ఓంకారోద్గీథ సామవిచారములు కలవు. మూడవ భాగమున పరబ్రహ్మ వివృతికలదు. ఇందే దేవకీతనయుడగు శ్రీకృష్ణునికథ కలదు. శ్రీకృష్ణుడు ఘోరాంగిరసునిచే ధర్మకథ నాలకించి యాకలిదప్పులుమఱచి పోయెను. నాల్గవభాగమున సత్యకామ జాబాల కథకలదు. సత్యకాముడు బాల్యమునందలి స్వాభావికపరంపరను చూచియే పరబ్రహ్మజ్ఞానమును గడించెను. ఐదవభాగమున శ్వేతకేతుడను విప్రుడు ప్రవాహణజైబలి అశ్వపతి కైకేయరాజులకు పరమాత్మోపదేశము గావించుట కలదు. ఈ శ్వేతకేతుడే తండ్రియగు ఉద్దాలకారుణిచే పరబ్రహ్మోపదేశము పొందుట ఆఱవభాగ

గాథ. సనత్కుమారునికడ నారదుడు నామ, వాక్య, మన, స్సంకల్ప, చిత్త, ధ్యాన, విజ్ఞాన, బల, అన్న, జల, తేజ, ఆకాశ స్మ ఆశా, ప్రాణ, పరమాత్మసంబంధోపదేశములు పొందుట ఏడవ భాగమునందలి కథ. ఎనిమిదవప్రపాఠకమున పరబ్రహ్మ ప్రజాపతి సంబంధములగు అనేకానేకజటిలనిగూఢవిషయములు కలవు.

కేనోపనిష సామవేదీయ తలవకార శాఖాంతర్గతము. ఆ శాఖయం దిది తొమ్మిదవ అధ్యాయము. శంకరాచార్యులవారు దీనిపై పదభాష్యము వాక్యభాష్య మని రెండుభాష్యములు రచించిరి. మొదటిరెండు ఖండములందు చక్కనికథ కలదు. తమస్వశక్తిచేతనే అసురులను నిర్జించితిమని దేవతలు గర్వించిరి. అపుడు వారి గర్వము నణచుటకు పరబ్రహ్మ ఒక యక్షుని రూపమున సాక్షాత్కరించెను. ఆతని తెలిసికొనుటకు యత్నించి తమశక్తు లాతని యెదుట ప్రదర్శించి అగ్నివాయువులు విఫలులైరి. ఇంద్రుడు పార్వతిచే ఆతడు పరబ్రహ్మ అని తెలిసికొనెను. వారి యీప్రయత్నముచే ఇంద్రాగ్నివాయువులు దేవతలయందు ప్రముఖులైరి. మొదట తెలిసికొన్నందున ఇంద్రుడు దేవరా జయ్యెను. ఇందు కథావ్యాజమున అగ్ని వాయుప్రముఖములగు ప్ర క్తులు పరమాత్మయధీనములోని వని చెప్పబడినది.

కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయారణ్యకము పది ప్రపాఠకములుగా విభక్తము. ఇందలి 7, 8, 9 ప్రపాఠకములే తైత్తిరీయోపనిషత్తు. శిక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లియను నీ మూడు ప్రపాఠకము లిందు 31 అనువాకములలో అధ్యాత్మవిషయములు వివరింపబడినవి. ప్రథమప్రపాఠకము లేదా వల్లియందు, ఓంకార, భూర్భువస్స్వః అను శబ్దముల ప్రకృత్యార్థము వివరింపబడినది. రెండవవల్లియందు రబ్రహ్మ మీమాంస కలదు. తృతీయమందు వరుణుడు తనపుత్రునకు పరమాత్మోపదేశమిచ్చుట కలదు.

కఠోపనిషత్తు కృష్ణయజుర్వేదీయకఠసంహితకు చెందినది. ఈ కఠశాఖలోని బ్రాహ్మణ భాగ మిది యని కొందఱు ప్రాచీనభాష్యకారులనిరి. కాని కొంద ఱిది సామవేదీయ మని కొందఱథర్వవేదీయ మని పలికిరి. ఇందలి నచికేతునికథ సుప్రసిద్ధము. ఈగాధ ఋగ్వేద దశమమండలమున 135-వ సూక్తమున గల దని సాయణభాష్యము. నచికేతుడు తనతండ్రి యముని కీగా అతనియొద్దకు వెళ్లి మూడువరములను పొందెను. ఇందు మూడవవరముగా మృత్యురహస్యమునుకోరి యమునివలన దానిని బడసెను. ఇందు జీవాత్మపరమాత్మవిషయమై చక్కని ఉపదేశములు కలవు.

శ్వేతాశ్వతరోపనిషత్తుకూడ కృష్ణ యజుర్వేదములోనిదే. చతుర్థాశ్రములకు శ్వేతాశ్వతరమహర్షి దీని నుపదేశించెను. ఇందు ప్రసంగానుసారముగా సాంఖ్యయోగసగుణనిర్గుణ ద్వైతాద్వైతాది పెక్కుసిద్ధాంతములు ప్రతిపాదింపబడినవి

శుక్లయజుర్వేదీయ వాజసనేయసంహితయందలి నలువదవ అధ్యాయము ఈశావాస్యోపనిషత్తు లన్నింట చిన్నది. ఇందు పరమాత్మ విషయమౌ అద్భుతవివేచనము గలదు.

శుక్ల యజుర్వేదీయవాజసనేయకాణ్వసంహితలకు శతపథబ్రాహ్మణ మని పేరు. ఇది బ్రాహ్మణగ్రంథము లన్నింటియందు పెద్దది. దీనిని ఎ. వెబర్ (మాధ్యందిన) డబ్లూకాలెండరు (కాణ్వ)లు లక్షులయూపాయల వ్యయ

ముతో సాయణభాష్యసహితముగా ప్రకటించిరి. మాధ్యందినశాఖాశతపథబ్రాహ్మణమున పదునాల్గు కాండములు నూఱు అధ్యాయములు కలవు. అందుచేతనే ఇది 'శతపథ' మనబడెను. ఇందలి పదునాల్గవకాండమును ఆరణ్యక మందురు. ఈయారణ్యకమందలి చివరి యాఱధ్యాయములకు 'బృహదారణ్యకోపనిషత్తు' అని పేరు. ఇందలి ప్రథమాధ్యాయమున సృష్టి, సృష్టికర్తల పరిచయము కలదు. అజాతశత్రుని కడ గార్గ్యబాలాకి పరమాత్మజ్ఞానము పడయుట ద్వితీయాధ్యాయము. విదేహరాజగు జనకు డొక పెద్దసభ తీర్చెను. దానికి కురుపాంచాలాదిదేశములనుండి వేదజ్ఞులగు పెక్కురు విద్వాంసు లేతెంచిరి. సభ కరుదెంచిన వారి నెల్ల జనకునిపురోహితుడగు యాజ్ఞవల్క్యు డోడించి రాజు మన్నన వడసెను. సభలో గార్గీవాచక్నవియను నొకవిద్వాంసురాలుకూడ ఉండెను. ఆమెయు నోడిపోయెను. ఇది తృతీయాధ్యాయమందలి కథ. చతుర్థాధ్యాయమున జనకయాజ్ఞవల్క్యులు పరమాత్మవిషయమై పరస్పరము తర్కించుట కలదు. ఈ యధ్యాయమునందే నిజపత్నియగు మైత్రేయికి యాజ్ఞవల్క్యుడు పరమాత్మోపదేశము గావించెను. పంచమమున బ్రహ్మ, ప్రజాపతి, వేదత్రయ, గాయత్రీవర్ణనము కలదు. ఆఱవయధ్యాయమున ఉద్దాలకారుణి ప్రవాహణ జైబలి యను క్షత్రియనృపతికడ బ్రహ్మజ్ఞానము పడసి "ఈ యమృతమయోపదేశమునందినచో ఎండిన కట్టెయు చిగురింపగల" దని యాజ్ఞవల్క్యునితో పలుకుట పేర్కొనబడినది.

అథర్వవేదీయోపనిషత్తులయందు ప్రశ్న ముండక మాండూక్యములు ముఖ్యములు. ముండకోపనిషత్తు అథర్వవేదీయమంత్రభాగాంతర్గతము. ఇందు మూడు ముండకములు. ఒకొక్క ముండకమున రెండేసి ఖండములు కలవు. గ్రంథారంభమందు గ్రంథోక్తవిద్య యొక్క ఆచార్యపరంపర పేర్కొనబడినది. అంగిరమహర్షి మహాగృహస్థుడగు శౌనకునకు పరా అపరా అను రెండు విద్యల నుపదేశించుట సవిస్తరముగా కలదు.

ప్రశ్నోపనిషత్తు బ్రాహ్మణభాగములోనిది. ముండకోపనిషత్తులోని విషయము లిందు విస్తరింపబడినవి. ఇందాఱు ఖండములు కలవు. వీనికి ప్రశ్నము లని పేరు. సుకేశాది ఋషికుమారు లాఱుగురు పిప్పలాదమహర్షి యాశ్రమమున కరిగి వేర్వేఱుగా ప్రశ్నించి సమాధానములు వడసి కృతకృత్యు లగుట యిందలి విషయము.

ముండకోపనిషత్తు అథర్వవేదీయబ్రాహ్మణభాగాంతర్గతము. దీనిపై గౌడపాదాచార్యుల కారికలుకూడ కలవు. శాంకరభాష్యకారికా సహితమగు నీయుపనిషత్తు అద్వైతసిద్ధాంత రసికులకు పరమాదరణీయమైనది. ఇందు ఆగమ, వైతథ్య, అద్వైత, అలాత శాంతి ప్రకరణము లను నాల్గు ప్రకరణములు కలవు. ఇవి పండ్రెండును శంకరాచార్యభాష్యవిరాజితములగు నుపనిషత్తులు.

శ్రీమద్భగవద్గీతనుకూడ కొంద ఱుపనిషత్తుగనే మన్నింతురు. ఇది సకలోపనిషత్సారము. ఇందు 18 అధ్యాయములు కలవు. ప్రతి యధ్యాయము చివరను 'భగవద్గీతాసు–ఉపనిషత్సు' అని పేర్కొనబడినది. శంకరభగవానులు శ్రుతి యిట్లు వాకొనుచున్నది యని గీతాశ్లోకములనుకూడ ఉదాహరించిరి. గీతా నామ మెఱుగని హైందవుడు లేడు. దీనిని గూర్చి ప్రత్యేకమగు వ్యాసము వ్రాయబడును.

శ్రీమద్భగవద్గీత ననుసరించి పాండవగీత, శివగీత, రమణగీతలు తదనంతర కాలమున జన్మించినట్లే ఉపనిషత్తులు క్రొత్తవి పెక్కులు వచ్చినవి. వీనిలో అల్లోపనిషత్తు రామకృష్ణోప నిషత్తులవంటివి ముఖ్యములు. రామకృష్ణ పరమహంసల యుపదేశములను రాజగోపాలా చార్యులవారు రామకృష్ణోపనిషత్తను పేర సంగ్రహించిరి.

ఇందు చిత్రమైనది అల్లోపనిషత్తు. ఇందల్లా మాహాత్మ్యము వర్ణింపబడినది. ఇది అథర్వ వేదీయమట. చిత్రములగు ఇందలి మంత్రములు కొన్ని విజ్ఞులు పరిశీలింప దగినవి.

౧. ఓం అస్మల్లాం ఇల్లే మిత్రావరుణో దివ్యాని ధత్తే.

ఇల్లల్లే వరుణో రాజా పునర్దదుః,
హయామిమిత్రో ఇల్లాం ఇల్లల్లేతి.

౨. అల్లోజ్యేష్ఠం పరమం పూర్ణం బ్రహ్మాణ మల్లాః
అల్లో రసుర మహామదరకం పరస్య అల్లో;

3. ఇల్లాకబర ఇల్లాకబర ఇల్లల్లేతి
ఇల్లాలాః ఇల్లా ఇల్లాల్లా అనాది
స్వరూపా అథర్వణీ శాఖాం హ్రాం హ్రీమ్॥

అక్బరుసభలో అబ్దుల్ కాదిర్ బదౌని యను సంస్కృత మెఱిగిన మహమ్మదీయపండితు డొక డుండెను. ఇతడు రామాయణ భారతాదులను ఫారసీలోని కనువదించెను. అతడు తన 'ముంత కబ్ ఉత్తవారిఖ్' అను చరిత్రగ్రంథమం దొకచో నిట్లు వ్రాసెను. "ఈయేట (983 హిజరీ క్రీ. శ. 1575) మహమ్మదీయమతమును బాగుగా నెఱిగిన శేఖ్ భావిన్ అను బ్రాహ్మణుడు దక్షిణభారతమునుండి వచ్చెను. మహమ్మదీయధర్మశాస్త్రోపదేశములకు అథర్వవేదోప దేశములకు గల సామ్యము నేను చక్రవర్తికి చెప్పగా వారు ఫైజీతోడను హాజీ ఇబ్రహీం తోడను అథర్వవేదమును ఫారసీలోని కనువదింపు డని చెప్పియుండిరి. ఈయనువాద సమయమున అట్టిసామ్యములు గలచోట్ల వాని భావము నీ శేఖ్ భావన్ వివరింపలేకపోయెను. ఈ అథర్వవేదమున కురానులోని 'లా ఇల్లాహి ఇల్లల్లాహ్' అను మాట యుండెను. ఈ వాక్యము గ్రహించి శేఖ్ భావన్ పెక్కుర బ్రాహ్మణుల నోడించి వారికి మహమ్మదీయమత మిప్పించెను" ఈవ్రాతవలన దీనిని నాడు బదౌనియో, ఇస్మాయిలో, బ్రాహ్మణబ్రువుడగు శేఖ్ భావనుడో రచించియుందు రని తోచుచున్నది. ఏమతమునందును దురభిమానము లేని ఫైజీమాత్రము మీపని చేసియుండడు. రాజానుగ్రహమును వాంఛించినవ్యక్తు లెంతటి నైచ్యమునకు దిగజాఱుదురో తెలుపుటకీ అల్లోపనిషత్తు తార్కాణము.

బ్రాహ్మణారణ్యకములు కర్మకాండలనియు ఉపనిషత్తులు జ్ఞానకాండ లనియు చెప్పబడును. నేడు కర్మకాండచర్చ నామమాత్రావకమైనది ఏలన తదాధారములు లోపించినవి, లేదా రూపాంతరము దాల్చినవి. కాని జ్ఞానకాండ యందెట్టి పరివర్తనమును రాలేదు. ఉపనిషత్తులలోని ఆత్మ, పరమాత్మ, సృష్టి, పునర్జన్మ, స్వర్గ, ధర్మాదివిషయములు నేడును అదియే రూపమున మన్నింపబడుచున్నవి. నేటికిని హిందూమతమున కవియే యాధార స్తంభములు. కావుననే ప్రతిహిందువును ఉపనిషత్తులలోని ప్రతివాక్యమును మంత్రమువలె ఆలకించి ముగ్ధు డగుచున్నాడు. నేటికిని ఉపనిషత్తులపై పెక్కురు భాష్యములు టీకలు

రచించుచున్నారు. శంకరాచార్యులు, ఆనంద భట్టోపాధ్యాయులు, అనంతాచార్యులు, బ్రహ్మానందులు, శంకరానందులు, విద్యారణ్యులు, సురేశ్వరాచార్యులు, నారాయణులు, విజ్ఞానభాగవతులు, ఆనందగిరులు, నిత్యానందమహర్షులు, రంగరామానుజులు, దిగంబరానుచరులు, మధ్వాచార్యులు, జపతీర్థులు, వ్యాసతీర్థులు, రఘూత్తమస్వాములు, బ్రహ్మయోగులు, నారాయణమునులు, భాస్కరానందులు, అరవిందులు, శ్రీధరులు మున్నగువారి ఉపనిషద్భాష్యవ్యాఖ్యానములు సుప్రసిద్ధములు.

వైదేశికవిద్వాంసులు పెక్కురీ యుపనిషత్తుల చమత్కారము, సారళ్యము, సౌకుమార్యము, సౌందర్యము, మార్దవము, మంజులత్వమును గమనించి ముగ్ధులై వేనోళ్ల గొనియాడిరి. ఆటోశ్రాడర్, జి. ఏ. జాకబ్, ఓర్టల్, మాక్స్‌ముల్లర్, ఆటో బోట్లింగ్, హెర్మన్ ఓల్డెన్‌బర్గ్, ఇ. హ్యూమ్, రాబర్ట్, జిమర్ మాన్, సి. ఓ. హాస్, గోల్డ్‌స్టకర్, పాల్ డైసన్, ఆర్థర్ ఎవలన్, ఎఫ్. టి. బ్రూక్స్ మొదలగు ఆంగ్ల ఫ్రెంచి జర్మను విద్వాంసులు తమతమ భాషలలో వ్యాఖ్యలు అనువాదములు వెలయించి యుపనిషత్తుల గౌరవాతిశయములను సకలప్రపంచమునకు వెల్లడించిరి.

''ఉపనిషత్తులవలె ఉపయోగకరములును, ఉన్నతపథమునకు గొనిపోవునవియునగు గ్రంథజాలములు విశ్వసాహిత్యమున మఱేవియు లేవు. ప్రపంచమందలి సమస్తప్రజానీకమునకు ఇవి మున్ముందు ఏకైకమతగ్రంథములు కాగలవు.'' అని ప్రసిద్ధ జర్మనువిద్వాంసుడు స్కోపెన్హోర్ పేర్కొన్నాడు. ''ఉపనిషత్తులు వేదాంతమునకు మూలాధారములు. ఇందు మానవీయ ఉచ్చభావన ఉన్నతోన్నతశిఖరముల నందుకొన్నది'' అని మాక్స్‌ముల్లర్ ప్రశంసించెను.

సమస్తజ్ఞానమున కుపనిషత్తులు నిలయములు. వీనినుండియే సకలదర్శన, సమస్తశాస్త్ర, నిఖిలతంత్ర, సంపూర్ణయుక్తి, సర్వపురాణ, అఖిల పదార్థవిజ్ఞాన సర్వవిద్యాసముదాయము బయలువెడలి మానవజాతిని ఆనందశాంతివిమలమందాకినీతరంగములచే ప్లావితము నొనరించును.

ఉపనిషత్తులు క్రియాత్మకవిద్యలు, కాల్పనికములు కావు. ఉపనిషద్బోధల నాచరణయందు చూపగలిగినవాడు తాను భగవత్ప్రాప్తి కందుటే కాక సమాజమునుగూడ ఉన్నతశిఖరములకు గొనిపోగలడు. ఉపనిషదుపదేశముల ననుసరించి యరిషడ్వర్గమును పాఱద్రోలి. బ్రహ్మచర్యవ్రతపాలకుడై, శమదమాది సాధనచతుష్టయసంపన్నుడై యాత్మజ్యోతిని గానగలిగినవాడు తనసంఘమును, తన జాతిని, తనదేశమును పావన మొనరించును.

కేవలమధురపదార్థముల పేరు లుచ్చరించినంతమాత్రమున నోరు తీపి కాదు. కావుననే యుపనిషత్తులు 'కేవల ముపదేశము లిచ్చుటతో వినుటతో ఆత్మజ్ఞానము లభింప' దని నిష్కర్షగా చెప్పుచున్నవి. 'శ్రోతవ్యో మన్తవ్యో నిధిధ్యాసితవ్యః'' ఆలకించి బాగుగా మననము గావించి చిత్తవృత్తుల నంతర్ముఖము గావించి మనస్సు నేకాగ్రము గావించి యుపనిషదుపదేశములను ఆచరణయందు పెట్టగలిగినవాడు స్వర్గము మఱెక్కడో లేదు.

ఏదృష్టితో చూచినను ఉపనిషద్వాఙ్మయము హిందూజాతి కనుపమనిధానము. హిందూజాతికి గర్వకారణము, హిందూమతమునకు ప్రాణము. ప్రతిహిందువునకు అవశ్యపఠనీయము.

# ఆస్తిక్యం

## (జీవిత దృక్పథం, విధానం)

శ్రీ పున్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

భగవంతుడు సర్వతోముఖ పరిపూర్ణుడు. అతడు ఏకకాలమందే నిర్గుణుడు, సగుణుడు. అతడు సర్వ సమన్వయస్వరూపుడు. మన తార్కిక దృష్టికి కనబడే వైరుధ్యాలు, మన వ్యవహార జీవితంలోని పరిమితులు, వివిధ ప్రవృత్తుల ప్రభావానికి అధీనమై కలగాపులగంగా ఉన్న మన బాహ్య సత్తకు గోచరించే అసాధ్యాలు దేవదేవునికి ఆరోపించరాదు. భగవంతుని గుణాలలో, శక్తులలో తనకెక్కువ ఇష్టమైన ఏదో ఒకదానిని ఆధారం చేసుకొని, దాని ణ, మనన, నిధిధ్యాసాలతో ఉపాసకుడు సాధన ప్రారంభించడం ఉచితం, సహజం.

ఒకడు భగవంతుని జగత్ప్రభువుగా సేవించవచ్చు. మఱొకడు జగజ్జననిగా ప్రేమించవచ్చు. ఇంకొకడు జగత్పితగా భావించవచ్చు. వేఱొకడు ఆచార్యునిగా ఆరాధించవచ్చు.

ఒకడు ప్రాణేశ్వరునిగా దేవుని ధ్యానించవచ్చు. మఱొకడు శక్తిస్వరూపునిగా ధారణ చెయ్యవచ్చు. ఇంకొకడు సత్యస్వరూపునిగా సాక్షాత్కరింపజేసుకొనవచ్చు. వేఱొకడు పతితపావనునిగా ఉపాసించవచ్చు.

ఒకడు సర్వేశ్వరుని ధర్మస్వరూపునిగా పూజించవచ్చు. మఱొకడు జ్ఞానతేజస్సుగా పరిగణించవచ్చు. ఇంకొకడు నిర్గుణుడుగా తాదాత్మ్యం పొందవచ్చు. వేఱొకడు నిఖిల రసామృతమూర్తిగా గ్రహించవచ్చు.

అభిరుచి, స్వభావ, సంస్కార, సామర్థ్యాల ననుసరించి అనేకులు అనేక రీతుల ఈశ్వరుని సంభావించవచ్చు. ఒకడే తన అవస్థావిశేషాల కనుగుణంగా, తాను పొందుతున్న అభివృద్ధిని బట్టి అనేకవిధాల భగవంతుని సాంగత్యం పొందడానికి సాధన సాగించవచ్చు. ఇదంతా సవ్యమే. ఇందపసవ్యమైన దేదీ లేదు. బ్రహ్మసామ్రాజ్యంలో ప్రవేశించడానికి అనేక రాజమార్గా లున్నవి; అనేక సింహద్వారా లున్నవి.

భగవంతుని ఏ గుణాన్ని, శక్తిని తా నల వఱచుకొనడానికి సాధకుడు ప్రయత్నిస్తుంటాడో దాని కనుగుణంగానే ఉంటవి అతని నిష్ఠలు, నియమాలు, విధులు, నిషేధాలు, ఉపాయాలు, ఉపకరణాలు. కనుక ఇవి ఆస్తికులకందఱకు ఒక్కవిధంగానే ఉండవు. సూక్ష్మంగా పరిశీలిస్తే యివి మనిషి కొక విధంగా ఉండక తప్పదన్నసంగతికూడా బోధపడగలదు. ఒకనికే అనేక సమయాలలో అనేక రీతులు ఉంటవి. సాధన ప్రారంభంలో ఎవరేవిధానం అవలంబించినా, పోనుపోను నియమాలను ఎవరికివారు తమ ఆశయాలను, ప్రయోజనాలను బట్టి నిర్ణయించుకుంటుండాలి; అవసరాన్నిబట్టి మార్పులు చేసుకుంటుండాలి. అప్పుడే అవి సజీవములై ఆత్మోన్నతిదాయకాలు గాగలుగుతవి. వీటిని రెజిమెంటేషన్ పద్ధతిని అనుసరించడం ఆధ్యాత్మిక సాధన

కాదు. సాధన బాహ్య విధానాలు, వాటినిబట్టి జీవిత విధానాలు వేర్వేఱుగా ఉండడం విధి విధానం.

తాను పూజించే దివ్యగుణం, దివ్యశక్తి, తదనుగుణమైన జీవితవిధానమే భగవత్సంబంధ మయినదని, తక్కినదంతా దేవునికి వేఱయిన దని, దేవునికి విరుద్ధమయినదని భావించడం దేవునికి అపచారం చెయ్యడం. దేవునికి అప చారం చెయ్యడం తనకు అపచారం చేసుకోన డమే. తాను ఆరాధించేది పరిపూర్ణమైన పర బ్రహ్మ ఒకానొక అంశమాత్రమే అని, తన జీవిత విధానం తనకు ఉత్కృష్టమైనదని సాధన ప్రారంభంనుంచి ఏకేశ్వరోపాసకుడు స్పష్టంగా గ్రహించాలి. ఇతరుల విధానాలు తన విధా నానికి వేఱుగా కనబడుతున్నప్పటికీ, ఇతరులు కూడా తన దేవునే మఱొకపార్శ్వంనుంచి ఉపాసిస్తున్నారని, వారి విధానాలు వారి ఆత్మో న్నతికి ఉపయోగకరములని నిస్సంకోచంగా తెలుసుకోనాలి. తెలుసుకోనగలిగేవఱకు విశ్వ సించాలి. ఈవిధమైన ఎఱుక, విశ్వాసం ఏకేశ్వర విశ్వాసంలో భాగమే. ఈవిధమైన ఎఱుక, విశ్వాసం లేకపోవడం ఏకేశ్వరజ్ఞానా నికి, ఏకేశ్వరవిశ్వాసానికి విరుద్ధం. ఈ వైరు ద్ధ్యం ఒకవిధంగా దేవుని ఆహ్వానిస్తూ మఱొక విధంగా దేవుని ప్రతిఘటించడం వంటిది. ఉపా సకుని వికాసం ఈ పరస్పరవైరుద్ధ్యానికి తగి నట్టుగా ఉండక తప్పదు.

భగవంతునితో సమగ్రసంయోగానికి, ఉపా సకుని సర్వతోముఖవికాసానికి భగవంతుని వివిధగుణాలను, శక్తులను, చిత్కళలను ధ్యానిం చడం అలవాటుచేసుకోనాలి. భగవంతుని తోను, అతని బహుముఖవికాసంతోను తాదా త్మ్యం పొందడం సమగ్ర సంయోగం. స్వమ తాభిమానంతో, స్వవిధానానుష్ఠానంతో, పర మతాదరంతో సాధన ప్రారంభమై తన దేవుని యం దితరుల దేవులను, ఇతరుల దేవులందు తన దేవుని దర్శించడంగా, తన, పర అనే భేదాన్ని అతిక్రమించడంగా పరిణమించాలి. ఇది ఏకేశ్వరోపాసన పరిణత దశకు నిదర్శనం.

ఈ వైఖరి జీవితరంగంపై ప్రసరించినప్పుడు ''ఇదే సత్యం'' అని కాక ''ఇదే సత్యంకాదు'' అన్న జిజ్ఞాసను పురికొల్పి, సాధకుని నిరంతర సత్యాన్వేషణాపరాయణుని చేస్తుంది. భగవం తుని బహుముఖత్వాన్ని గుర్తించడం ఏకేశ్వరో పాసనకు ప్రాథమిక లక్షణం. ఏకేశ్వరు డంటే అనంతముఖాలుగల ఈశ్వరుడేగాని, అనేక ఈశ్వరులలో ఒకానొక ఈశ్వరుడు కాడు. ఒక దివ్యగుణానికి మఱొక దివ్యగుణానికి, ఒక దివ్యశక్తికి మఱొక దివ్యశక్తికి, ఒక సత్యానికి మఱొక సత్యానికి స్వతస్సిద్ధమైన వైరుద్ధ్యం లేదు. ఏకత అంటే అంతర్గత ఏకతేగాని ఏక రూపత కాదు. పక్షవాతరోగి ఆరోగ్యంవంటి పాక్షిక వికాసం ఏకేశ్వరోపాసన లక్ష్యం కానే రదు. కొంతవికాసంతో సంతృప్తిచెంది అంత టితో నిలిచిపోవడం సజీవమైన ఆస్తిక్యంకాదు. పరిపూర్ణత్వం పొందేవఱకు నిరంతర పురో గమన కాంక్ష సజీవమైన ఆస్తిక్యానికి లక్షణం.

మహాపురుషులలోనే జ్ఞానులను శుష్క వేదాంతులుగా భావించే కర్మశీలురు, రసహీ నులుగా పరిగణించే భక్తులు కలరు. కర్మ శీలురు మందాధికారులని, భక్తులు మధ్యమాధి కారులని చెప్పే జ్ఞాను లున్నారు. భక్తులు పగటి కలలు కనేవారని ఆక్షేపించే కర్మపరా యణులు లేకపోలేదు. కర్త, సర్వేశ్వరుడే అన్న సంగతి గుర్తించని వారిని విమర్శించే భక్తులుకూడా కలరు. సౌందర్యోపాసనను,

అలంకారాలను, లలితకళలను ఏవగించుకునే సంయమ సాధకు లున్నారు. నరకానికి స్త్రీ రాచబాట అని తెగేసి చెప్పిన మహానుభావులు లేరా? సంయమ సాధకుల నియమాలను హేళనచేసే కళారాధకులు మాత్రం ఎందుకు లేరు? సంసారజీవితాన్ని చులకనచేసే సన్న్యాసులకు కొఱత లేదు. సన్న్యాసులను పరాన్న భుక్కులయిన పిచ్చి సన్న్యాసులనుగా పరిహసించే గృహస్థులు కావలసినంతమంది కలరు. మహా పురుషులలోనే కొందఱి ధోరణి యిలా ఉంటే వారి అనుయాయులు తమ మహాత్ములను, తమ విధానాలను గొప్పగాను, ఇతరుల మహాత్ములను, వారి విధానాలను తక్కువగాను చిత్రించడానికి ప్రదర్శించే ఆవేదనకు, ఆవేశకావేషాలకు అంతెందుకు ఉంటుంది?

ఆలాగే తమ రాజకీయపార్టీయే జగత్కళ్యాణదాయకమైనదని, తమ రాజకీయమతమే న్యాయమైనదని, తమ పరిపాలనావిధానమే పరమోత్కృష్టమైనదని, తమ ఆర్థికమతమే అరచేతిలో స్వర్గం చూపగలదని, ఇతర పార్టీలు పెనుభూతాలని, ఇతర ఆర్థిక రాజకీయ పరిపాలనావిధానాలు దుఃఖహేతువులని ప్రచారం చెయ్యడం ఆస్తిక్య ప్రాథమిక లక్షణాలకే విరుద్ధం. స్వమతాభిమానాన్ని పరమత నిరాదరణం ఆనుకొనే ఉంటుంది, దీపాన్ని కీపీనలాగ. అన్నివిధానాల పరమాశయం ఒక్కటే అన్న విశ్వాసం కుదిరితే, ఈ కీనీడను విసర్జించడం కష్టంకాదు.

అయితే, సత్యం బహుముఖమైనదన్న మాటకు అసత్యంకూడా సత్యమే నని అర్థం కాదు. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అన్న ఋక్కును అడ్డంపెట్టుకొని గ్రుడ్డినమ్మకాలను, అమానుషమైన ఆచారాలను, హాస్యాస్పదమైన విధానాలను సమర్థించడం, అసత్యానికి సత్యంతో సమానస్థాయి కల్పించడం, ప్రజలలో స్వమతనురభిమానాన్ని రెచ్చగొట్టడం సహించరాని పని.

# వార్తలు. విశే లు

## శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు

### చింతాద్రిపేట, మదరాసు

వివేకానంద రాక్మెమోరియల్ కమిటీ శాఖవారు సింగన్న చెట్టివీధిలోని తిరువేంగడ ముదైయానుసన్నిధిలో 17-1-63 వ తేదీనాడు ఉదయం 6-49 గంటలకు స్వామిజీ చిత్రపటమును ఆవిష్కరించి శతతమజన్మదినోత్సవమును జరిపినారు. సుమారు ఇన్నూరుగురు దరిద్రనారాయణులకు అన్నసంతర్పణ జరిగినది. సాయంకాలము నగరవీధులలో ఊరేగింపును భజనయు జరిగినవి. ఆనాడు నగరములలో ఇతరభాగములలోకూడ పెక్కు సంస్థలవారి ఊరేగింపులు జరిగినవి.

### తిరువల్లిక్కేణి

తిరువల్లిక్కేణి బీచ్ తిలక్ ఘాటులో స్వామిజి శతతమజన్మదినోత్సవసమావేశము 3-2-1963 తేదీనాడు సాయంకాలము 6-15 గంటలకు రాక్మెమోరియల్ కమిటీవారి ఆధ్వర్యమున సమావేశమైనది. కేరళీయనాయకులలో ప్రముఖులగు శ్రీమన్నాథపద్మనాభంగారు అధ్యక్షత వహించిరి. పెక్కుసంస్థలవారు సభలవారు తాము తెచ్చిన పుష్పమాలలను శ్రీవివేకానందుని పెద్దతైలచిత్రమునకు సమర్పించిరి. పురప్రముఖులు కొందఱు ఉపన్యసించిరి.

### గుంటూరు

సావరిన్ క్లబ్ ఆధ్వర్యమున శ్రీ స్వామి వివేకానందశతజయంతి, రిపబ్లిక్ దినోత్సవము జనవరి 26-వ తేదీ ఉదయం 8-30 గంటలకు క్లబ్ ఆవరణములో క్లబ్ గౌరవాధ్యక్షులు డా॥ కాసరనేని సదాశివరావు, ఎం. ఎస్. గారి అధ్యక్షతను వైభవంగా జరుపబడినది. క్లబ్ అధ్యక్షులు జెండాప్రతిష్ఠాపనచేసిరి. క్లబ్ కార్యదర్శి పొత్తూరి వెంకటేశ్వర్లు సభికులకు స్వాగతం చెప్పారు. ఫ్రెండ్సురిక్రియేషన్ క్లబ్ సాంస్కృతిక కార్యక్రమముల శాఖాధిపతి శ్రీ గుడివాడ వెంకటగోపాలకృష్ణమూర్తి చే క్లబ్ కు బహూకరించబడిన శ్రీ స్వామి వివేకానందుని చిత్రపటమును శ్రీ తుమ్మపూడి శ్రీరాములు ఆవిష్కరించి పూలమాలతో అలంకరించెను.

సభలో శ్రీ అమరేంద్ర, శ్రీ స్ఫూర్తిశ్రీ, శ్రీ మన్నవ గిరిధరరావు, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ, కె. కోటయ్య మొదలగువారు ప్రసంగించారు. ఈ సభకు వచ్చిన అతిథులకు మిఠాయిలు పంచిపెట్టిరి. శ్రీ దింటకుర్తి సుబ్రహ్మణ్యం వందనసమర్పణచేశారు.

### బాదేపల్లి, మహబూబ్నగరుజిల్లా

శ్రీ రవీంద్రపఠనాలయన సుహృద్గోష్ఠి: బాదేపల్లివారిచే జాన్యువరి 17-వ తేదీన పూజ్యవివేకానంద జన్మదినోత్సవము జరుపబడినది. 'మునిజనమోదప్రదాయినిజయహే'తో ప్రార్థన జరిగిన తర్వాత శ్రీ వాసుదేవశర్మ బి. ఓ. యల్. గారిచే వేదోక్తవిధిని స్వామికి పూజ జరుపబడినది.

శ్రీ శ్రీనివాసరావుపాటీల్ బి. ఏ. గారు అధ్యక్షతవహించిరి. శ్రీ కాశీ పాండురంగశర్మ, సాహిత్యరత్న, బి. ఏ., బి. ఇడి. గారు శ్రీవారి జన్మవృత్తాంతమునంతను మధురపదగుంఫనతో 50 నిమిషములసేపు ఉపన్యసించిరి.

శ్రీవారి కార్యములనుగూర్చి, వారి జీవితాదర్శములనుగూర్చి ఉపన్యసించినవారిలో శ్రీయుతులు పండిత పి. చిన్నప్ప, హిందీ సాహిత్యరత్న, ఆర్. నారాయణ, ఆర్. కోటీశ్వరరావు, బి.ఎస్‌సి., మురళీధర్ ఐ.ఏ.యస్. 'ప్రభు' లైబ్రేరియన్ గారలు కలరు. శ్రీ శ్రీనివాసరావుగారి అధ్యక్షోపన్యాసానంతరము మంగళహారతి, సామూహికంగా 'విశ్వగురు తవ అర్చనామే' గానము జరిగెను.

ఉత్సవమును శ్రీ మంగుబాబా, శ్రీ లక్ష్మణ్ నిర్వహించిరి. అంతమున తీర్థప్రసాదములు ఇవ్వబడినవి. పఠనాలయములోని స్వామివారి సాహిత్యమంతయు ప్రదర్శింపబడినది.

*

జాన్యువరి 25 వ తేదీన జిల్లా 'వివేకానంద శతజయంత్యుత్సవకమిటీ' ఒక టేర్పడినది.

ప్రముఖస్థానీయులు పలువురు పాల్గొనిరి. శ్రీ యం. రామరెడ్డి, ఎం. ఎల్. ఏ. అధ్యక్షులుగను, శ్రీ పహిల్వాన్ గారు ఉపాధ్యక్షులుగను, శ్రీ కాశీప్రభాకరశర్మ 'ప్రభు' లైబ్రేరియన్ గారు జెనరల్ సెక్రెటరీగను, శ్రీ మోహన్ లాల్ గారు నిధిప్రముఖులుగను, సభ్యులుగ ఇరువదితొమ్మండుగురును ఎన్నుకొనబడిరి. సంవత్సరకాలమున జిల్లాలోని ప్రతిప్రాంతమునను 'వివేకానంద' ప్రచారము జరుపవలెనని తీర్మానింపబడినది.

## గూడూరు

స్వామి వివేకానంద శతజయంత్యుత్సవసందర్భములో గూడూరుతాలూకా వివేకానంద శతజయంతిమహోత్సవకమిటివారు స్థానిక శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవాలయమువద్ద పెద్దబహిరంగసభను ఏర్పాటుచేశారు. కార్యదర్శి శ్రీ ఎట్టంరెడ్డి చెంచురంగారెడ్డి సదస్యులకు స్వాగతం చెప్పారు.

సభాధ్యక్షులు శ్రీ సి. వి. కృష్ణయ్యగారు మాట్లాడుతూ "భారతీయవిజ్ఞానాన్ని ప్రాచ్య, పాశ్చాత్యదేశాలకు చాటిన లోకోత్తరపురుషుని దివ్యచరిత్రను వివరిస్తూ, కలకత్తాసమీపంలో గంగానదీతీరాన మనోజ్ఞంగా నిర్మింపబడిఉన్న స్వామిజీ "బేలూరుమఠము"ను తాను చూచి ఆశ్చర్యచకితుడనైతినని, ఒకవైపు దేవాలయంవలె, ఇంకొకవైపు మసీదువలె, మూడవప్రక్కన చర్చివలె ఉన్నదానిని అసంఖ్యాక యాత్రికులు నిత్యం దర్శించుకొని వెళ్లుచున్నారని, వారిసందేశాలను మనం ఆచరించా"లని కోరారు.

సంయుక్తకార్యదర్శి శ్రీ యస్. చెంగయ్యనాయుడు స్వామిజీ సందేశాలను కొన్నిటిని వివరిస్తూ ఉపన్యసించారు.

మద్రాసు మైలాపూరు రామకృష్ణమఠమునకు చెందినట్టి, "శ్రీరామకృష్ణవిజయం" పత్రికాసంపాదకులు శ్రీ పరమాత్మానందస్వామిగారు, "నిద్రాణమైన భారతజాతిని తనఅమూల్యసందేశంతో లేపి, సనాతనధర్మాన్ని విశ్వానికంత చాటిన వివేకానందస్వాములవారి జీవితఘట్టాలను వివరించారు. ప్రపంచంలోని అన్ని మతాలకంటె హిందూమతమే గొప్పదనుటలో, అందులోని విశిష్టతను, ధర్మాలను తాను ఆచరించి, ఆలక్ష్యాల తనప్రబోధాలద్వారా పాశ్చాత్యదేశాలను వణికించిన ధీరుని దివ్యచరిత్ర సభికుల మనసులలో హత్తుకొనేటట్లు ఉపన్యసించారు.

"ప్రపంచమునకు ఎవరెస్టు శిఖర మెంత ఉన్నతస్థానాన్ని ఆక్రమించిందో, అలాగే హిందూమత వేదాంతం అత్యున్నత స్థాయిని పొందిఉన్నది. వివేకానందస్వామి జీవితం చాలా ఉదాత్తమైనదనియు, భారతదేశపతనావస్థలో శ్రీరామకృష్ణవివేకానందులు జన్మించి, ఉత్కృష్టమైన మనసంస్కృతిని వేనోళ్ల చాటిరనియు తెల్పిరి. భారతీయులు వీరజాతికిచెందినవారనే విషయం, పరజాతిదాస్యంలో ఉన్నప్పుడు మరచి, పాశ్చాత్యపద్ధతులే అనుసరించి అధోగతి పాలైతిమి.

పాశ్చాత్యవిద్యావిధానంవల్ల వాళ్ల మతం గొప్పది అనేటట్లు చేయగల్గారు. దైవమందు విశ్వాసంకూడా అంతరించిపోయినది. వాళ్ల

సంస్కృతి, అలవాట్లు హెచ్చయి దుఃస్థితి ఏర్పడినది. అట్టితరుణంలో స్వామీజీ అవతరించారు.

వీరత్వాన్ని, పరాక్రమాన్ని విస్మరించ కూడదని చెప్పిన స్వామీజీ చేసిచూపెట్టారు. వారిలో గ్రహణశక్తి, జ్ఞాపకశక్తి హెచ్చుగా ఉంది. మనసా వాచా కర్మణా బ్రహ్మచర్యమును అనుసరించి, కళలనుపొంది, ప్రకృతిని జయించి, లక్ష్యమును సాధించి, విశ్వజనీన ప్రేమను పొందిన మహనీయుడు శ్రీ వివేకానందులు. "ప్రేమపూరితమైన హృదయం పవిత్రంగా ఉండాలంటే సచ్ఛీలం అవసరమన్నారు. శ్రీరామకృష్ణుడు ఏ సాధనలు సాధించి, ఆచరించమనికోరినాడో వాటినన్నిటిని ఆచరించి మనకు చూపెట్టినారు. సంపన్నకుటుంబములో పుట్టియు, కొన్నిరోజులుబీదస్థితిలోజీవించారు". జ్ఞానజ్యోతియైన కాళీమాతను ఆరాధిస్తున్నప్పుడు జ్ఞానాన్ని, నిర్మలభక్తిని ప్రసాదించమని ప్రార్థించినారే కాని క్షుద్రమైన యీ లౌకిక సంపదను కోరనే లేదు.

స్వచ్ఛందమరణాన్ని, నిర్మలభక్తినిసైతం పొందినవ్యక్తి శ్రీ స్వామీజీ అని గురువుచే ప్రశంసల నందుకొన్న శిష్యుడు శ్రీ వివేకానందులే—అనికూడా అన్నారు. హిమాలయాల నుంచి కన్యాకుమారివరకు పాదచారియై, భారత ధర్మాన్ని ప్రచారంసాగిస్తున్నప్పుడు ఆహారం లేక స్పృహతప్పిన సమయాల్లో వారి యిష్టదేవతయగు ఆ జగజ్జనని ఎలా తోడ్పడుతూ వచ్చిందో తెల్పారు.

ఉపనిషత్తులో ఉల్లేఖించినప్రకారం మోక్షాన్ని పొందవలెనన్న, బలహీనుడుగా నుండకూడదన్నారు. గుర్తించుకో! — నీలో దాగియున్న అనంతశక్తిని వ్యక్తంచేసుకో! అని కూడా అన్నారు.

ప్రపంచగురువులైన ఆదిశంకరులవలె, వీరత్వంలో అర్జునునివలె, కరుణాస్వరూపంలో బుద్ధునివలె, భక్తిలో నారదునివలె, బుద్ధిలో బృహస్పతివలె, వేదపారాయణంలో వేదవ్యాసునివలె ఉంటూ, "పరబ్రహ్మ"ను సాధించాను అని చెప్పుకొన్న ధీరుడు శ్రీ వివేకానందులే అని అన్నారు.

శ్రీ ఎన్. రామమూర్తి స్వామీజీ అమృతవాక్కులతోకూడిన అనర్గళ ఇంగ్లీషు ఉపన్యాసాన్ని తెలుగులోనికి అనువదించారు.

కావలి విశ్వోదయ కళాశాల లెక్చరర్ శ్రీ ఎ. ఐ. పురుషోత్తమరావు, ఎం. ఏ. గారు మాట్లాడుతూ, సాంస్కృతికవిప్లవాన్ని తెచ్చిన మహానుభావుడున్నూ, దానధర్మదయావీరుడున్నూ, వీరేశ్వరుడుగా, నరేంద్రనాథుగా, స్వామి వివేకానందుడుగా, అజరామరకీర్తిని గడించిన శ్రీ స్వామి జ్ఞానభాండాగారంలోని విజ్ఞానదీపికలను విపులీకరిస్తూ ఉపన్యసించారు.

గూడూరు తాలూకా శతజయంతిమహోత్సవసమితితరఫున శ్రీ పి. వి. సుబ్బారెడ్డిగారు వందనసమర్పణచేస్తూ, అఖిలభారతకమిటీవారు కన్యాకుమారివద్ద 22 అడుగుల స్వామీజీ శిలావిగ్రహాన్ని ప్రతిష్ఠించి, సదరు శిలవద్దకు యాత్రీకులు వెళ్లుటకు ఒకవంతెనను నిర్మించుటకుగా గూడూరుతాలూకానుండి నిధిని సేకరించి పంపుటలో ప్రతిఒక్కరు సాయపడాలని కోరిరి.



# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## హిందూమతతేజఃప్రభ

గ్రంథకర్త: తిరుక్కోవలూరు పెద్దస్వాములు ఆదివరాహాచార్యులు; గ్రంథప్రాప్తిస్థానము: పెద్దస్వాములు శ్రీకుమార ఆదివరాహాచార్యులుగారు, c/o శ్రీ ఊటుకూరి హాయగ్రీవగుప్తగారు, అడ్వకేటు, బాపట్ల, గుంటూరుజిల్లా; వెల: రు. 1-50.

సనాతనమతము అపౌరుషేయము. తక్కిన మతములు చారిత్రకప్రశస్తిగలవి; ప్రవక్తల ప్రబోధమునుండి పుట్టినవి. సనాతనమతము వేదములనుండి ఉద్భవించినది. కాని ఆధునిక విమర్శకులు, కేవలము చారిత్రకదృష్టిగలవారు వేదములనుగుఱించి, వేదకాలములనుగుఱించి విడ్డూరపు విమర్శలు చేయుచుందురు. అంతర్దృష్టికి, యోగదృష్టికి అందు విషయములను స్థూలదృష్టితో వీక్షించినయెడల సత్యమునకు తలవంపులు వచ్చునని వీ రెఱుగరు. ప్రస్తుత గ్రంథకర్త శ్రీ పెద్దస్వాములు శ్రీ కుమార ఆదివరాహాచార్యులవారు జ్యోతిర్మయమైన సమస్త వైదికవాఙ్మయమును పఠించి ఈ యద్భుతకృతిని ఆంధ్రజగతికి ప్రసాదించిరి. బహుశాస్త్రీకగ్రంథములను పఠింపజాలనివారీ యొక్క గ్రంథమును పరిశీలించినయెడల సనాతనమతతత్త్వమును సమగ్రముగ గ్రహింపజాలుదురు. పండిన చేను తలవంచును. గ్రంథకర్తగారు సుధీజనవిధేయులు. కాని పల్వురు సుధీవరులకు ఆచార్యులు కాదగు మహావిద్వాంసులు. విషయసమీక్ష చేయునపుడు, సునిశిత తార్కికశక్తిని పురస్కరించుకొని, సత్యము నన్వేషించుచు, సత్యము నారాధించుచు, సత్యమును నిర్వచించుచు అచలశృంగములవలె నిలిచిన ఆచార్యుల సిద్ధాంతములను సయితము సముచితరీతిని సమీక్షించుటకు జంకని వీరశిఖామణి ఈ గ్రంథకర్తగారని తెలుపుటకు నేను సంశయింపను. ఘనపాండితికి నైసర్గికప్రతిభ తోడైనపుడు కావింపబడు స్పష్టనిర్వచనము సత్యసందీప్తమైయుండును. ఇందలి స్వతంత్ర నిర్వచనము విశ్వజనీనదృష్టిగలవారి కనంతమైన ఆనందమును కలిగించుననుట నిస్సంశయము.

బ్రహ్మతత్త్వము, ఆత్మతత్త్వము, ప్రకృతితత్త్వము, ప్రాకృతతత్త్వము, మతతత్త్వము అను విషయము లిందు నిర్వచింపబడినవి.

బ్రహ్మతత్త్వమున మిగుల గమనింపవలసిన వాక్యములివి: "భగవంతుడు సర్వశక్తులుగలవాడు. కావున సాకారుడుగాను, సగుణుడుగాను, నిరాకారుడుగాను, నిర్గుణుడుగాను అప్పటికప్పుడు కార్యావసరములవెంట నుండగలడు."

"జీవాత్మల స్వరూపములగూర్చి పరామర్శించి, దేహధారుల కర్మజ్ఞానభక్తులవలన లభించు మోక్ష మెట్టిదో గ్రంథకర్తగారు పర్యాలోచించిరి".

గ్రంథమున వివిధ మతములను గుఱించిన విషయ వివరణములు కలవు.

గ్రంథకర్తగారి యూహల నెల్లరు ఆమోదింపకపోయినను, జిజ్ఞాసువు లీ గ్రంథమును నిష్పాక్షికదృష్టితో పరిశీలింతురని విశ్వసించుచున్నాను.

వివిధమతగ్రంథములందు జ్ఞానమరీచికాగుచ్ఛము తేజరిల్లుటెఱిగి, ఏకొలదివిషయములందో అభిప్రాయభేదములున్నను, అందలి దివ్యజ్యోతిర్లీలకు జేజేలు పాడుట ఉపాసకుల విధి. ''హిందూమత తేజఃప్రభ''కు అంజలిఘటించువారు ''పరంజ్యోతి''ని గుర్తించి ధన్యులయ్యెదరు.

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి



# SRI RAMAKRISHNA PRABHA

Statement about ownership and other particulars about *Sri Ramakrishna Prabha* (according to Form IV, Rule, 8, circulated by the Registrar of Newspapers for India).

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 2. | Periodicity of its Publication | Monthly. |
| 3. | Printer's Name<br>Nationality<br>Address | K. S. S. Rajan.<br>Indian.<br>The Jupiter Press Private Ltd.,<br>109-C, Mount Road, Madras-18. |
| 4. | Publisher's Name<br>Nationality<br>Address | Swami Suddhasatwananda.<br>Indian.<br>Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 5. | Editors' Names<br><br>Nationality<br>Address | Swami Suddhasatwananda and<br>Prof. N. Bhaktavatsalam, M.A., B.O.L.<br>Indian.<br>Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or Shareholders holding more than 1% of the total capital. | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |

I, Swami Suddhasatwananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Signature of the Publisher,
(Sd.) SWAMI SUDDHASATWANANDA.

Date: 1-3-1963.

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# VEDANTA KESARI *(Running 50th year)*

ENGLISH MONTHLY OF THE RAMAKRISHNA ORDER

## Swami Vivekananda Birth Centenary Number (Illustrated)

An illustrated special issue of the *Vedanta Kesari* will be brought out in the month of August, 1963 to commemorate the Birth Centenary of Swami Vivekananda. Articles from well-known scholars dealing with various aspects of Swami Vivekananda's life and teachings will be the contents of the number. It will comprise of the following:

I. Hymns to Sri Ramakrishna and Swami Vivekananda
II. What Holy Mother said of Swami Vivekananda
III. How the Brother Disciples looked upon Swamiji (in their own words)
IV. Homages to Swami Vivekananda
V. Articles by

1. Swami Nikhilananda, Head of the Ramakrishna-Vivekananda Center, New York, U.S.A.
2. Swami Pavitrananda, Head of the Vedanta Society, New York, U.S.A.
3. Swami Kailasananda, President, Ramakrishna Math, Madras.
4. Dr. T. M. P. Mahadevan, Head of the Department of Philosophy, University of Madras.
5. Swami Vimalananda, President, Ramakrishna Advaita Ashrama, Kalady.
6. Swami Ranganathananda, Secretary, Ramakrishna Mission Institute of Culture, Calcutta.
7. Swami Nisreyasananda, now in Salisbury, Southern Rhodesia.
8. Swami Tapasyananda, Head of the Ramakrishna Ashrama, Trivandrum.
9. Swami Shraddhananda, Assistant Minister, Vedanta Society, Northern California, U.S.A.
10. Swami Nityabodhananda, Head of the Ramakrishna Vedanta Centre, Geneva, Switzerland.
11. Swami Adidevananda, Head of the Ramakrishna Ashrama, Mangalore.
12. Swami Budhananda, Assistant Minister, Ramakrishna-Vivekananda Center, New York, U.S.A.
13. Swami Vandanananda of the Vedanta Society of Southern California, Hollywood, U.S.A.
14. Mr Jean Herbert, author of many books and litterateur.
15. Dr V. Raghavan, Head of the Sanskrit Department, University of Madras.
16. Pravrajika Atmaprana from Ramakrishna Sarada Mission, Dakshineswar.
17. Dr Roma Chaudhuri, Principal, Lady Brabourne College, Calcutta.
18. Prof. P. S. Naidu.
19. Dr Jatindra Bimal Roy Chaudhuri.
20. Dr V. P. Varma from Patna University.
21. Prof. Amiya Kumar Mazumdar, Principal, Govt. College, Krishnanagar.
22. Prof. S. S. Raghavachar from University of Mysore.
23. Prof. P. Sankaranarayanan, Bhavan's College, Bombay.
24. Dr Clarence Shute, Professor of Philosophy, Massachusetts University, U.S.A.
25. Prof. K. Subramanyam, ex Vice-Principal of Vivekananda College.
26. Dr Suniti Kumar Chatterji, Chairman, Legislative Council (W. Bengal).

and many other distinguished writers.

**Pages 200. Size D/c Octavo. Price Rs. 3. Postage 75 nP.**

This Special Number will be sent to our regular subscribers on a nominal price of Re. 1 plus registration fee of 50 nP. *So subscribers are requested to remit* Rs. 1.50 for this issue. ANNUAL SUBSCRIPTION Rs. 5. Year starts in May. The Special Number will be about five times the usual issue with a number of illustrations.

It is an excellent medium for advertisement.

*Please remit Rs. 6.50 to :—*

THE MANAGER, SRI RAMAKRISHNA MATH, MYLAPORE, MADRAS-4.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ ౧౯౬౩, ఏప్రిల్; శోభకృత్తు - చైత్రము సంచిక ౧౦

## విషయసూచిక




'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప    ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౩ - ఏప్రిల్ :: శోభకృత్తు - చైత్రము { సంచిక ౧౦


శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు    టీక : నే. భ.

కదా కాలే మాతః కథయ కలితాలక్తకరసం
పిబేయం విద్యార్థీ తవ చరణనిర్ణేజనజలమ్
ప్రకృత్యా మూకానా మపి చ కవితాకారణతయా
త దాధత్తే వాణీముఖకమలతామ్బూలరసతామ్ ॥ ౯౦

| | | | |
|---|---|---|---|
| మాతః | అమ్మా | | అది |
| కలిత | మిశ్రితమైన | ప్రకృత్యా | స్వభావముచేతనే (పుట్టుక చేతనే) |
| ఆలక్తకరసం | లత్తుకరసముగల | | |
| తవ | నీ | మూకానామ్ అపి చ | మూగలైనవారికిసైతము |
| చరణ | పాదాల | కవితాకారణతయా | కవిత్వమును సిద్ధింపజేయున దగుటచే |
| నిర్ణేజనజలమ్ | కడుగునీటిని | | |
| విద్యార్థీ | జ్ఞానార్థినగు | వాణీ | సరస్వతియొక్క |
| అహం | నేను | ముఖకమల | కమలమువంటి వదనమందున్న |
| కదాకాలే | ఎప్పుడు | | |
| పిబేయం | త్రాగుదును | తామ్బూలరసతామ్ | తాంబూలరసరూపమును |
| కథయ | చెప్పుమా. | ఆధత్తే | పొందును. |

శ్లోకములు ౮౮ నుంచి ౯౭ వఱకు టీకాతాత్పర్యములతో వచ్చేసంచికలో ప్రచురింపబడును.

తా. అమ్మా, లత్తుకరసము కలిసిన నీ పాదాల కడుగునీటిని గ్రోలినచో పుట్టుమూగ కైనను సరే అనర్గళకవితాశక్తి కల్గును. ఆ మూగ సాక్షాత్సరస్వతి యగును. గ్రోలిన నీ పాద ప్రక్షాళనజలము ఆ సరస్వతి ముఖకమలం దున్న తాంబూలరస మగును. అట్టి నీ పాదప్రక్షాళన జలమును గ్రోలుభాగ్యము జ్ఞానార్థి నగు నా కెప్పుడు కలుగునో ఆనతిమ్మా.

పదన్యాసక్రీడాపరిచయమి వారబ్ధుమనసస్
స్ఖలన్త స్తే ఖేలం భవనకలహంసా న జహతి
అత స్తేషాం శిక్షాం సుభగమణిమఞ్జీరరణిత
చ్ఛలా దాచక్షాణం చరణకమలం చారుచరితే ॥

| | | | |
|---|---|---|---|
| చారుచరితే | సొంపైన నడకగలదానా | అతః | కావున |
| పదన్యాస | అడుగిడుటయను | చరణకమలమ్ | పాదపద్మము |
| క్రీడాపరిచయమ్ | క్రీడాభ్యాసమును | సుభగ | చక్కని |
| ఆరబ్ధు మనసః ఇవ | తొడంగగోరినవియుంబోలె | మణి | రత్నాల |
| భవనకలహంసాః | పెంపుడు రాజహంసలు | మఞ్జీర | అందెయొక్క |
| స్ఖలన్తః | తొట్రుపడుచు | రణితచ్ఛలాత్ | రవళిరూపాన |
| తే | నీ | తేషాం | వానికి |
| ఖేలమ్ | గతని | శిక్షామ్ | పాఠమును |
| న జహతి | విడువకున్నవి | ఆచక్షాణమ్ | చెప్పుచున్నది. |

తా. అందమైన నడకగల మాతా, పెంపుడుహంసలు నీ సంచారరీతిని నేర్చుకొనగోరి నవియుంబోలె తొట్రుపడుచునే నీ పాదముల నెడబాయకున్నవి. హంసలకు నీ పాదములు చెప్పుచున్న పాఠమే నీ చరణనూపురధ్వని.

దదానే దీనేభ్య శ్శ్రియ మనిశ మాశానుసదృశీ
మమన్దం సౌన్దర్యప్రకరమకరన్దం వికిరతి
త వాస్మిన్ మన్దార స్తబకసుభగే యాతు చరణే
నిమజ్జన్ మజ్జీవః కరణచరణ షట్చరణతామ్ ॥ ౯౨

| | | | |
|---|---|---|---|
| (భగవతి) | (అమ్మా) | ఆశానుసదృశీమ్ | కోరినందులకు తగినంతగా |
| కరణచరణః | మనసుతోకలిసి ఆఱుసంఖ్య గలవగు ఇంద్రియములే చరణములుగ గలదగు | శ్రియం | సిరిని |
| | | అనిశం | సదా |
| | | దదానే | ఇచ్చునదియు |
| మజ్జీవః | నా యాత్మ | అమన్దం | అధికమైన |
| దీనేభ్యః | దరిద్రులకు | సౌన్దర్యప్రకర | చక్కదనపు మొత్తమనెడి |

| | | | |
|---|---|---|---|
| మకరన్దం | పూదేనెను | చరణే | పాద(సుమ)మందు |
| వికిరతి | ఒలుకునదియు | నిమజ్జ౯ | గాటముగ చొచ్చుకొనుచు |
| మన్దార స్తబక | కల్పవృక్ష(పుష్ప)గుచ్ఛపు | షట్చరణతామ్ | (ఆఱుకాళ్లుకలదానితనము) భ్రమరత్వమును |
| సుభగే | సొంపుగలదియు అగు | | |
| అస్మి౯ | ఈ | యాతు | పొందునుగాక. |
| తవ | నీ | | |

తా. అమ్మా, నాయాత్మ ఒక తుమ్మెద. బాహ్యేంద్రియములైదును అంతరింద్రియ మొక్కటియునుంగా నుండు ఆఱింద్రియములే ఈ తుమ్మెదకు చరణములు. ఈ తుమ్మెద నీ పాద పద్మమందు నిమగ్న మగును గాక. నీ పాదపద్మమునకు కల్పవృక్షపుష్పగుచ్ఛపు సొం పున్నది. అది దరిద్రులకు కోరినందులకు తగినంతగా సిరి నిచ్చుచుండును, అందుండి వెలువడు చక్కదనమే దాని మకరందము.

అరాళా కేశేషు, ప్రకృతిసరళా మన్దహసితే,
శిరీషాభా చిత్తే (గాత్రే), దృషదుపలశోభా కుచతటే,
భృశం తన్వీ మధ్యే, పృథురురసిజారోహవిషయే,—
జగత్ త్రాతుం శమ్భోర్జయతి కరుణా కాచి దరుణా ॥ ౯౩

| | | | |
|---|---|---|---|
| కేశేషు | శిరోజములందు(మాత్రమే) | తన్వీ | సన్నదనముగలదియు |
| అరాళా | వక్రత్వముగలదియు | ఉరసిజ+ఆరోహ | స్తనములయు పిఱుదులయు |
| మన్దహసితే | చిఱునవ్వునందు | విషయే | స్థానమున |
| ప్రకృతిసరళా | సహజమైన ఋజుత్వము గలదియు | పృథుః | బలుపుగలదియు |
| | | అరుణా | అరుణ అను పేరును అరుణంపు వన్నెయు గలదియు |
| చిత్తే | మనసున | | |
| శిరీషాభా | దిరిసెనపువ్వువంటిదియు (మార్దవముగలదియు) | కాచిత్ | అనిర్వచనీయయు అగు |
| కుచతటే | స్తనప్రదేశమున | శమ్భోః | పరమశివుని |
| దృషదుపలశోభా | రుబ్బుడుగుండు (కాఠిన్యపు) మెఱుగుగలదియు | కరుణా | కృప |
| | | జగత్ | విశ్వమును |
| మధ్యే | నడుమునందు | త్రాతుమ్ | రక్షించుటకై |
| భృశం | మిక్కిలి | జయతి | సర్వోత్కృష్టమై యున్నది. |

తా. పరమశివునికృపకే మూర్తీభావ మనదగిన అరుణాశక్తికి విశ్వసంరక్షకికి కామేశ్వరికి జయము. ఆమెకు శిరోజములందుమాత్రమే వక్రత్వము కలదు. చిఱునవ్వునందు సహజమైన ఋజుత్వమును, మనస్సున దిరిసెనపువ్వుమృదుత్వమువంటిమృదుత్వమును, స్తనములందు రుబ్బుడు

గుండ్రాతికఠినతయు, నడుమునందు మిక్కిలి సన్నదనమును, స్తనజఘనములందు బలుపును — ఆమెకు కలవు.

పురారాతే ర న్తఃపుర మసి తత స్త్వచ్చరణయోస్
సపర్యామర్యాదా తరళకరణానా మసులభా
తథా హ్యేతే నీతా శ్శతమఖముఖా స్సిద్ధి మతులామ్
తవ ద్వారోపా న్తస్థితిభి రణిమాద్యాభి రమరాః ॥ ౯౪

| | | | |
|---|---|---|---|
| పురారాతేః | పురాంతకుని | శతమఖముఖాః | ఇంద్రుడు మున్నగు |
| అ న్తఃపురమ్ అసి | పట్టమహిషివి | అమరాః | సురలు |
| తతః | కావున | తవ | నీ |
| త్వత్ | నీ | ద్వార+ఉపా న్త | వాకిటిపజ్జ |
| చరణయోః | పాదాల | స్థితిభిః | ఉన్నట్టి |
| సపర్యామర్యాదా | పూజాప్రకారము | అణిమాద్యాభిః (సహ) | అణిమ మున్నగు విభూతుల (తోబాటు) |
| తరళకరణానామ్ | చంచలచిత్తులకు | | |
| అసులభా | దుర్లభము | అతులామ్ | సాటిలేని |
| తథాహి | కావుననే కదా | సిద్ధమ్ | సంసిద్ధిని |
| ఏతే | ఈ | నీతాః | పొందింపబడిరి. |

అమ్మా, నీవు త్రిపురాంతకదేవుని పట్టమహిషివి. ఇంద్రియదాసులకు నీ పాదసేవ దుర్లభము. కావుననే సర్వచక్రబాహ్యములై చతురస్రమున వర్తిలు అణిమాదిసిద్ధులవలె ఇంద్రాదిసురలు అంతఃపురప్రవేశానర్హులై నీ వాకిటనే ఉందురు. నీ వాకిటిపట్టున నుండుట తము వారికి అతులమైన సిద్ధియే.

గతా స్తే మఞ్చత్వం ద్రుహిణహరిరుద్రేశ్వరభృతశ్
శివ స్స్వచ్ఛచ్ఛాయాఘటితకపటప్రచ్ఛదపటః
త్వదీయానాం భాసాం ప్రతిఫలనరాగారుణతయా
శరీరీ శృఙ్గారో రస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్ ॥ ౯౨

| | | | |
|---|---|---|---|
| (హే భగవతి) | (అమ్మా) | తే | నీ |
| ద్రుహిణ | బ్రహ్మ | మఞ్చత్వం | మంచపుదనమును |
| హరి | విష్ణువు | గతాః | పొందినారు |
| రుద్ర | రుద్రుడు | శివః | సదాశివుడు |
| ఈశ్వర | ఈశ్వరుడు అను | స్వచ్ఛచ్ఛాయాఘటిత | తెల్లకాంతిచే రూపొందిన |
| భృతః | భృత్యులు | కపట | కృత్రిమపు |

| | | | |
|---|---|---|---|
| ప్రచ్ఛదపటః | ౨ప్రొః | | మూర్తీభవించిన |
| త్వదీయానామ్ | నీ | శృఙ్గారః రసః ఇవ | శృంగారరసమో అన |
| భాసాం | కాంతుల | దృశాం | (నీ) కన్నులకు |
| ప్రతిఫలన | ప్రతిఫలించుటవలని | పతుకమ్ | ఆనందమును |
| రాగ | రక్తిమచే గలిగిన | దోగ్ధి | కలిగించును. |
| అరుణతయా | ఎఱుదనముచేత | | |

తా. అమ్మా, నీ మంచమున కున్న నాల్గు కాళ్లును నీ భృత్యులగు బ్రహ్మవిష్ణురుద్రేశ్వరులే. తెల్లనిదుప్పటిగ నున్న వాడు సదాశివుడు. నీ శరీరకాంతులు ప్రతిఫలింపగా ఆ తెలుపు ఎఱుపగును. అప్పుడు ఆ సదాశివుడు రూపుదాల్చిన శృంగారరస మనదగి నీ కన్నుల కానందము గూర్చును.

# వివేకానందస్వామి సూక్తిసుధారత్నములు

సంకలనకర్త:

శ్రీ కొత్త గౌరీశంకరరావుగారు

శ్రీ గురుదేవుడు శతఃపరముగ నాకీ విషయమును బోధించియుండెను: సంకల్ప ప్రభావమును, భావశక్తిని ఎఱుంగగలిగినవా రరుదు. ఒకడు గుహాభ్యంతరమున ప్రవేశించి, ఎవ్వరితోడను సంపర్కముంచుకొనక, సత్సంకల్పపూరితచిత్తుడై మరణించినను ఆ సంకల్ప మా గిరిగుహను భేదించుకొని ఆకాశమండలమును ప్రతిస్పందింపజేసి ప్రపంచమునందంతటను వ్యాప్త మగును. సంకల్ప మహిమ మిట్టిది.

విశ్వాసము అకలంకమై ఉద్దేశము పరిశుద్ధమై యుండెనేని విజయము చేకూరుట నిస్సంశయము. ఇది గలవారు అత్యల్పసంఖ్యాకులైనను మహా సమూహములనేని ఓడించి విజయము సాధించియే తీరుదురు.

దాంతము పాపము నామోదింపదు. దోషమును అంగీకరించును. ''నేను బలహీనుడను, పాపిని, దురదృష్టవంతుడను, నాకు శక్తిలేదు, నే నేదియు చేయజాలను''

అని భావించుటే మహాదోష మని వేదాంతము ఉద్ఘోషించుచున్నది.

కార్యాచరణమందే మరణింపుడు. మీకు తోడుగా నేను కలను. నా అనంతరము నాఆత్మ మీకు తోడై పనిచేయును. ఈ జీవితము వచ్చుచు, పోవుచు ఉండునది. సంపద, యశస్సు, భోగములుమూన్నాళ్ళ ముచ్చటలు. సత్యమును బోధించుచు కార్యక్షేత్రమున మరణించుట ప్రాపంచికకీటకములవలె మరణించుటకన్న ఉత్తమము—అపారముగా ఉత్తమము. ముందుకు సాగుడు!

నందగోపాలుడు భగవద్గీతద్వారా హిందువుల కిట్లు చాటియున్నాడు: "రత్నహారమునందలి సూత్రమువలె ప్రతిమతమునందును నేను కలను. మానవలోకమును పావనమొనర్చి యుద్ధరించునట్టి యసాధారణపవిత్రతను అసాధారణశక్తిసామర్థ్యములను మీ రెచట గాంచినను, నే నచట వెలయుచున్నా నని గ్రహింపుడు."

దయాబుద్ధివలన ఇతరులకు మేలుచేయుట మంచిదే కాని, సర్వజీవులను భగవత్స్వరూపములుగా భావించి సేవించుట ఇంకనుమంచిది. ఎవడు జీవారాధకుఁడో వాడే దేవారాధకుఁడు!

స్వార్థపరమైనదంతయు నీతిబాహ్యము, అస్వార్థమైనది నైతికము. అస్వార్థతయే ఎక్కువ ఫలప్రదము. కాని దాని నభ్యసించుటకువలయు ఓర్పు మానవులకు లేదు. మహాత్యాగమూలమున గాని మహాకార్యములు సాధింపబడవు.

మిత్రమా, ప్రతిజీవియు సాక్షాద్భగవంతుడని మనము నమ్మెదము. జీవుడు అజ్ఞానమేఘములచే నావరింపబడిన జ్ఞానభాస్కరుడు; ఈ మేఘముల సాంద్రతయందు గల వ్యత్యాసమే ఒకజీవికిని మఱియొకజీవికిని గల వ్యత్యాసము. తెలిసినను, తెలియకున్నను సర్వమతధర్మములకును నిదియే మూలాధారమనియు నైహికముగా గాని, యాముష్మికముగా గాని, వైజ్ఞానికముగా గాని మానవాభ్యుదయచరిత్రమున కంతకును నిదియే ప్రధానసూత్ర మనియు మనము నమ్మెదము — ఒక్క యాత్మతత్త్వమే వివిధావస్థలయందు వ్యక్తమగుచున్నది.

ఇదియే వేదసార మని మన నమ్మకము.

"శ్రీరమ్యంబగు బ్రహ్మముం దెలియఁగం జిత్తంబునం బూని సం
సారం బేది మహిన్ 'విరాడ్పురుషసాక్షాత్కారముం గంటిరే
మీ' రన్నం 'గనుఁగొంటిఁ జూపెదను గన్మి నీ' వనన్ ముగ్ధుఁడై
బౌరా యంచు గదాధరున్ గను వివేకానందునిన్ గొల్చెదన్".

—ఆశుకవి కిశోర చిలువూరి మాధవకృష్ణకవి.

# శ్రీ ప్రేమానందస్వామి

## [సంపాదకీయము]

(ఫిబ్రవరి సంచిక తరువాయి)

గురుదేవుని పజ్జనుండుకొలది బాబురాముని కంతర్ముఖత హెచ్చెను. చదువతనికి రుచింపక పోసాగెను. అందతడశ్రద్ధ చేయజొచ్చెను. 1884లో ప్రవేశపరీక్షకు వ్రాసెను కాని నెగ్గ లేదు. ఈవృత్తాంతము విని శ్రీరామకృష్ణుడు పాస్ అను ఆంగ్లశబ్దమువలెనే ధ్వనించున దైనను బంధమను నర్థమిచ్చు బెంగాలీపదముకు రెండర్థములు స్ఫురించునట్లు వాడి "అంతవఱకు మేలే అతనికి బంధవిముక్తి గల్గె" ననెను. ఆ మాట విని బాబురాముడు నిబ్బర పడెను. బాబురాము చదువులో అశ్రద్ధ చేయు చుండుటను గురుదేవుడు గుర్తింపక పోలేదు. అతని యభిప్రాయమును పరీక్షించుటకై గురుదేవు డొకనాడు "నీ పుస్తకా లేవీ? చదువు సాగించు ఉద్దేశము నీకు లేదా" అని అడిగెను. అప్పు డట నున్న మహేంద్రనాథగుప్తవైపు తిరిగి గురుదేవుడు "ఇతనికి రెండును కావలె నట. దారి చాల దుర్గమము. రవంతజ్ఞానము దేనిని సాధింప గలదు? చూడు — వశిష్ఠమహా ముని పుత్రశోకపరవశు డయ్యెనే! దాని జూచి ఆశ్చర్యచకితుడై లక్ష్మణుడు రాము నందులకు కారణ మడిగెను. "సోదరా, ఇందులో ఆశ్చర్యపడవలసిన దేమియు లేదు. జ్ఞాన మున్న వాడు అజ్ఞానమును ఉన్నవాడే రెంటిని అతిక్రమింతువు గాక" అని శ్రీరాముడు జవాబు చెప్పెను. బాబురాము నవ్వుచు "అదే నేను కోరునది" అనెను. "రెంటియందును నీ వాసక్తుడవై యుంటివేని రెంటి నతిక్రమించుట నీకు శక్య మగునా? అతిక్రమింపగోరుదువేని తొలగి రమ్ము" అని శ్రీరామకృష్ణు డనెను. ఇంకను నవ్వుచునే బాబురాము "దయచేసి మీరే నన్ను వానినుండి దూరమునకు చేర్పుడు" అని కోరెను.

బాబురాముతల్లి ఈవఱకే శ్రీరామకృష్ణుని భక్తురాలై యుండెను. ఒకనా డామె తన్ను దర్శింప వచ్చినప్పుడు ఆయన "నీకుమారుని నాయొద్ద నుండని"మ్మని ప్రార్థించెను. ఎంతయు ప్రీతినొంది ఆమె మనఃపూర్వకముగ అనుమతించెను. "నాకు భగవద్భక్తి కలుగవలెను, నా జీవితకాలమున నాకు బిడ్డలవియోగము కలుగకూడదు" అను రెండు వరములను మాత్రమే ఆమె కోరెను. ఆమెకోరికలు నెఱవేఱినవి. ఇప్పటి నుండి బాబురాము సదా గురుదేవునితోనే ఉండ నారంభించెను. శ్రీరామకృష్ణు డతనిని దరది (ఆత్మసఖుడు) అని పేర్కొనెడివాడు. అతనిపై గురుదేవునిప్రేమ అంత మిక్కుటము!

తనపట్ల గురుదేవున కుండిన ఉత్కట ప్రేమను అనంతరకాలమున శ్రీ ప్రేమానంద స్వామి ప్రీతితో వర్ణించి చెప్పుచుండెడివాడు. మఠమందలి యువసన్న్యాసులతో ఆయన ఇట్లనును: "మీయందు నాకు ప్రేమ ఉన్నదా?

లేదు, ఉండియే యున్న మిమ్ము నేను సదా నాకు కట్టువడియుండునట్లు చేసియుందును. అహో! గురుదేవునకు మాపై నున్న ప్రేమ ఎంత మిక్కుటము! మీపై మాకున్న ప్రేమ మాపై గురుదేవున కుండిన ప్రేమలో శతాంశ మైనను కాదు. రాత్రులందు ఆయనకు గాలి విసరుచు నేను నిద్రపోదును. వెంటనే ఆయన నన్ను తన దోమతెరలోనికి లాగి తన పాన్పుపై నిద్రింపజేయును. ఆయనపాన్పు నే నుపయోగించుకొనుట మహాపచార మని నేను చెప్పినప్పుడు ఆయన "వెలుపల నుండు వేని నిన్ను దోమలు కుట్టును. కావలసినప్పుడు నేనే నిన్ను లేపెదను లే" అని జవాబు చెప్పును. బాబురామును చూచుటకు గురుదేవుడు కల్కత్తాకు తఱచు వచ్చుచుండును. దక్షిణేశ్వరమునుండి తెచ్చిన భక్ష్యములను ఆయన తన సొంత చేతితో బాబురామునకు తినిపించుచుండును. బాబురాము తన్ను వీడి కల్కత్తా కేగినప్పుడు ప్రేమాత్కట్యముచే ఆయన శిశువువలె ఏడ్చును.

శ్రీరామకృష్ణుని ప్రేమయు మధురవాణియు యువశిష్యుని మృదుచిత్తమునకు రూపేర్పఱుప సాగెను. అన్నిటికంటె గురుదేవుని జీవితమే పరమోపదేశకము. వింతమార్గాలలో ఆయన పాఠము నేర్పెడివాడు. ఒకనాటిరాత్రి బాబు రాము గురుదేవునిగదిలో నిద్రించుచుండెను. కొంతసేపటికి గురుదేవుని అడుగులచప్పుడు విననై అతనిని నిద్రనుండి లేపెను. కన్ను తెఱచి అతడు చూచునప్పటికి, గురుదేవుడు భావోన్మాదదశలో నుండెను. గదియందు ఇటు అటు పచారు చేయుచుండెను. దోవతి కొసను ఆయన తనచంకలో జొన్పుకొని యుండెను. ప్రగాఢమైన వెగటు ఆయన హావభావము లందు గనవగుచుండెను. భావోద్రేకము ద్యోతిలు మోముతో గురుదేవుడు మాటి మాటికిని తీవ్రముగ "అది రాకూడదు, అది రాకూడదు" అనుచుండెను. "అమ్మా నాకు కీర్తి నొసగకుము, నాకు వల దమ్మా" అని జననిని ప్రార్థించుచుండెను. లోకజనని కొంత కీర్తిని శ్రీరామకృష్ణుని కీయజూపుచున్నట్లును ఆయన 'అయ్యో వలదు' అనుచున్నట్లును ఆ బాలునకు తోచినది. ఇది అతని చిత్తమున చక్కగా హత్తుకొన్నది. బ్రతికినన్నాళ్లు నతనికి కీర్తిపై మిక్కుటమైన వెగటు ఏర్పడెను.

శ్రీరామకృష్ణుని పవిత్రజీవితము బాలుని సాధనతృష్ణకు చుఱుకెక్కించెను. శ్రీరామ కృష్ణుని సన్నిధిలో భక్తిగీతములను విని పెక్కండ్రు భావావేశపరవశు లగుచుండిరి. అట్టి అనుభూతి తనకు కలుగ లేదే అని అతడు చింతిల్లుచుండెను. అట్టి అనుభూతులు తనకును గలుగని మ్మని అతడు శ్రీరామకృష్ణుని నిక్కచ్చి చేసెను. అతనికై శ్రీరామకృష్ణుడు లోకజన నిని ప్రార్థించెనుగూడ. "బాబురామునకు జ్ఞానము గల్గునే కాని భావావేశాలు కలుగ" వని లోకజనని చెప్పగా గురుదేవుడు సంప్రీతు డాయెను.

ఒకనాడు ప్రతాప్చంద్రహాజ్రా తన స్వాభా వికరీతిలో బాబురాంప్రముఖయువకులకు "ఊరక శ్రీరామకృష్ణునితో కలిసి సమృద్ధిగ తిని వినోదజీవితము గడపుటకంటె శక్తులు మున్నగువాని రూపాన ప్రత్యక్షముగనుండు వాని నిమ్మని శ్రీరామకృష్ణు నడుగుడు" అని

సలహా చెప్పుచుండెను. చెంత నున్న శ్రీరామ కృష్ణుని చెవిని ఈమాటలు పడినవి. దురుద్దేశ మును గుర్తించి, గురుదేవుడు బాబురాము నీవలకు పిలిచి ఇట్లనెను — "దేనిని మీరు నన్నడుగవలసియున్నది? నాయొద్ద నున్న వెల్ల ఇప్పుడే మీవే కదా! ఔను. సిద్ధుల రూపాన నే గడించిన వెల్ల మీ అందఱికొఱకే. అడుగుట అనునది దూరమును గల్గించును కావున ఆ తలంపు విడనాడు. అంతకంటె నీకు గల నా సంబంధమును గుర్తింపుము. ఆ సంప దకు తాళపుచెవి నందుకో".

గురుదేవుడు జబ్బుపడినప్పుడు బాబురాము కాశీపూరులో ఆయనకు నిండుశ్రద్ధతో ఉపచ రించెను. గురుదేవుని నిర్యాణానంతరము అతడు బరానగరమఠములో చేరెను. 1886 లో క్రిస్ట్మసప్పుడు నరేంద్రనాథుడు యువబృంద మును ఆంత్పూరుకు పిలుచుకొనిపోయెను. అది బాబురామువంశపూర్వులు వసించిన చోటు. పుణ్యప్రసంగాలతోను ప్రగాఢధ్యానముల తోను వారు అచట సుమారొకవారము దిన ములు గడపిరి. సన్న్యసజీవితపుగొప్పలను నరేంద్రుడనర్గళముగ ఉపన్యసింపగా, విని యువమిత్రులందఱును ఉద్రేకపూరితులై సన్న్యసింప నిశ్చయించిరి. బరానగరమునకు మరలిన వెంటనే వారు యథావిధి సన్న్యాసము స్వీకరించిరి. నరేంద్రుడు బాబురామునకు 'ప్రేమానందస్వామి' అను పేరుంచెను. శ్రీరామ కృష్ణుడొకసారి "ప్రేమదేవతయగు శ్రీరాధా దేవియంశావతారమే బాబురాము" అని చెప్పి యుండెను. కావున బాబురామునకు ప్రేమా నందనామము మిక్కిలి అనురూపముగ నుండు నని నరేంద్రుడెంచెను.

మొదట బరానగరమునను తర్వాత ఆలమ్బాజారులోను ఈ బృందమువారు తీవ్ర తపస్సాధనలతో దినములు గడపిరి. దక్షిణ మున గురుదేవుని సందేశమును ప్రచారము చేయుటకై శ్రీరామకృష్ణానందస్వామి మద్రా సునకు తరలగానే, ఆయన నిర్వహించుచుండిన గురుదేవుని నిత్యపూజావిధులకు ప్రేమానంద స్వామి తాను పూనుకొనెను. కొంతకాలము నకు తర్వాత అతడు ఉత్తరభారతమున యాత్ర చేసెను. మఠమును బేలూరునకు మార్చుటకు కొన్నాళ్లు ముందుగనే ఆ యాత్రనుండి ఆయన మరలి వచ్చెను. గురుదేవుని నిత్యపూజానిర్వ ర్తనము మునుపటివలెనే చేయుచుండెను.

శ్రీవివేకానందస్వామి నిర్యాణముకాగానే, శ్రీ ప్రేమానందస్వామిజీవితమున నూతనా ధ్యాయ మారంభ మయ్యెను. ఈయన చాల సాధువు, నిరాడంబరశీలుడు. కావున ఈయ నలో మఱుగువడియున్న నిరవధికప్రేమను కృపను మాధుర్యమును సింహబలోత్సాహ ములను గుర్తింపగల్గుట కష్టము. కార్యభారము ఇతనిపై బడినకొలది ఇతనిలోని సొంపుసంపదలు క్రమముగ వికసించినవి. మిషనుకార్యక్రమాల పర్యవేక్షణము శ్రీబ్రహ్మానందస్వామి వం తాయెను. ఇందుకై ఆయన మనదేశమున వివిధప్రాంతాలలో పర్యటింపవలసినవా డాయెను. కావున బేలూరిమఠనిర్వహణము శ్రీ ప్రేమానందస్వామికి అప్పగింపబడెను. గుడి లోని నిత్యారాధనము, యువబ్రహ్మచారు లయు సాధువులయు శిక్షణము, మఠమునకు సంబంధించిన గృహకృత్యములు వివిధములు, భక్తులను అతిథులను ఆదరించుట, పారమార్థిక విషయములను వారికి బోధించుట — ఈ పను

లకు శ్రీ ప్రేమానందస్వామికాల మంతయు పజెడిది. విరామమే దుర్లభ మాయెను.

తండ్రి పోలికలు పుత్రునిలో కానవగును. శ్రీరామకృష్ణుని మేలుము లెన్నో శ్రీ ప్రేమానందస్వామిలో కనవయ్యెడివి. ఎల్లరపట్ల శ్రీ గురుదేవున కుండిన ప్రేమ ఇతరశిష్యులలో ప్రతిఫలించినంతకంటె హెచ్చుగా శ్రీ ప్రేమానందస్వామిలో ప్రతిఫలించెడిది. సాధువులు గృహస్థులు భక్తులు ఆగంతుకులు అతిథులు — అందఱును ఆయన ప్రేమాతిశయమును అనుభవించినవారే. అనుభవించియే వా రాయనను 'మఠీయులకు తల్లివంటివా' రనిరి. సంఘబహిష్కృతులగు విపరీతవర్తనులకు సైతము శాంతినిధియగు తల్లివలె ఆయన ఆశ్రయమును రక్షణము నొసగెడివాడు. ఆయనసానుభూతి వారి డెందములలో భక్తిని సేవాసక్తిని ఉప్పొంగించెడిది.

చెడ్డవారిసావాసముచే కల్కత్తాలో ఒక యువకుడు చెడుదారులం దడుగిడెను. త్రాగుడులో అత డన్ని మితులను మీఱెను. స్థితి నానాటికి తీసికట్టగుచు అతడు వినాశోన్ముఖుడగుచుండెను. ఆ చెడుసావాసమును తప్పించి అతనిని మంచిదారికి మరల్చుటకై బంధువులును మిత్రులును చేయుచుండిన ప్రయత్నము లన్నియు వ్యర్థము లగుచుండినవి. తుదకు వారు నిరాశ చేసికొనిరి. అదృష్టవశమున ఆ యువకుని బంధువులలో ఒకడు శ్రీ ప్రేమానందస్వామికి మిక్కిలి పరిచితుడుగ నుండెను. సంగతిని పూర్తిగా శ్రీ ప్రేమానందస్వామికి విన్నవించి ఆ బంధువు ఆయన అనుగ్రహమును కోరెను. అతడు చెప్పినదానినెల్ల ఓర్పుతో విని స్వామి ఒకనాడు ఆ యువకునొద్దకుపోయి అతనిని మఠమునకు ర మ్మనెను. అతడు మఠమునకు వచ్చి ఆ దినమంతయు అట హాయిగ ఉండెను. అతడు వెనుదిరిగిపోవునప్పుడు స్వామి అతనితో ''మరల నొకసారి రావోయి'' అనెను. ప్రథమసమాగమమప్పుడే ఆ యువకుడు స్వామిచే ఆకృష్టుడాయెను, మఠమునకు పలుమార్లు వచ్చెను. స్వామిదయాప్రేమల నెడిపరుసవేది అతనియినుపశీలమును క్రమముగా కాంచనముగ నొనర్చెను. అత డిట్లు తలపోసెను. ''ఎంత వింత! భయపడి అవమానపడి బంధువులందఱు బహిష్కరించిన నామీఁద ఇంత ప్రేమాదరములను వర్షించుట ఈయన కెట్లు శక్య మాయెను! నా పాపము లన్నియు ఈయనకు తెలిసినవే. ఐహికసంబంధము లేవియు ఈయనకును నాకును లేవు. ఈయన ప్రేమకు స్వార్థప్రేరణము లేనే లేదు. ఐనప్పటికిని ఎంత ఆశ్చర్యకరముగ నున్నది ఈయన ప్రేమ!'' కొన్నాళ్లలో అతడు సర్వసంగపరిత్యాగము చేసి త్యాగసేవాలంకృత జీవితమునకు వారసుగ నయ్యెను.

స్వాములప్రేమాదరముల నిగూఢాకర్షణచే ఆకృష్టులై భక్తు లత్యధికసంఖ్యాకులు మఠమునకు రాదొడంగిరి. ఇక మఱపునకు రాకుండు రీతిగా వారిచిత్తములందు స్వామి హత్తుకొనుట కొక్కసమావేశము చాలెడిది. మహాయోగుల శక్తులు నిగూఢములుగ నుండును. సొంత విశుద్ధియు గురుదేవు ననుగ్రహమును ఆయనను మహోన్నతసిద్ధస్థాయి కెక్కించినది. ఆ సిద్ధదశలో మానవసేవయే మాధవసేవగా పరిణమించెను. భక్తులను ఆదరించుటయందును ఆతిథ్య మర్పించుటయందును ఆయనకు గల జాగరూకత ఆత్యంతికము. అం దాయన పరిణతదృష్టిజాడలు ఎంతటిమొద్దన్నకైనను కన

నయ్యెడివి. ఆతిథ్యము స్వీకరింపక ఎవరును మఠమునుండి పోలేరు. అతిథులు అ వేళలలో వత్తురు. కావున మధ్యాహ్నము ఒంటిగంటకో రెండుగంటలకో కాని భోజనము ముగిసెడిది కాదు. మధ్యాహ్నముసైతము దాటి సాధువులు అలసి విశ్రమించుచుండు వేళలో ఒక్కొక్కప్పుడు భక్తులు దూరప్రాంతములనుండి వత్తురు. విశ్రమించుచున్న యువకుల నొత్తిడి సేయ నిష్టము లేక శ్రీ ప్రేమానందస్వామి తానే నిశ్శబ్దముగ లేచి, వంటసేయుటకు వంటింటి కేగును. కాని ఆ సంగతి తెలిసెనేని, వెంటనే యువసన్న్యాసులు వంటింటికి పరుగున వచ్చి అంతయు తామే చేసిపెట్టుదురు. అట్లు ముందుకు వచ్చిన వారియెడ స్వామి కత్యంత ప్రీతి. "పాపము గృహస్థుల కెన్నో పనులుండును. సకాలమునకు వచ్చుట వారికి సదా సాధ్యమా? వారికి మనము చేయగల దేమి? సేవమాత్రమే మనము చేయగలము. అందుకు రవంతశరీరకష్టమే తప్ప మనకు వే రేమియు నష్టము లేదు. గురుదేవు ననుగ్రహముచే మన కిక్కడ అన్నియు ఉన్నవి. వీనిని ఆ గురుదేవుని బిడ్డల కర్పించి మనము ధన్యులము కావలదా" అనుచు ఆయన ఆ యువసన్న్యాసులను ప్రోత్సహించి దీవించుచుండును.

మరణించుటకు మునుపటి రుగ్ణదశలో సైతము భక్తులయందలి యీ శ్రద్ధను స్వామి మాన లేదు. "ఈగొడవ మీకు వలదు, మీ ఆరోగ్యము చెడు" నని ఎవరైనను చెప్పినను ఆయన "ఇది నాస్వభావము. భక్తసేవ భగవంతునిసేవయే" అని బదులు చెప్పును. తాను లేనప్పుడు మఠవ్యవహారములను చూచుకొనుచుండిన యొకస్వామిని, శ్రీ ప్రేమానంద స్వామి తనమరణమునకు రెన్నాళ్లు ముందు పిలిచి ఉద్రిక్తభావస్ఫోరకకంఠముతో "ఒక పని చేయగలవా" అని అడిగెను. 'ఆనతిండు, ఏమిచేయవలెనో' అని ఆ సన్న్యాసి బదులు చెప్పెను. "భక్తులసేవ చేయగలవా" అని స్వామి అడిగెను. "ఆహా, తప్పక చేసెదను" అని అతడు చెప్పెను. "అటులేని, మఱువకుండు" మని స్వామి బతిమాలుకొనుచుంబోలె చెప్పెను.

వజ్రదృఢమైన విశ్వాసము స్వామిది. గురుదేవునకు నివేదింపబడిన అన్నశేషము నెవరు భుజింప తటస్థించినను వారిలో భవిష్యత్కాలమున ఆధ్యాత్మికపరత తప్పక అంకురించితీరు నని ఆయన నమ్మకము. మఠమునొద్దకు వచ్చు వారికి ఆయన కన్నులలో ఏదో విశేషమైన విలువ కనన య్యెడిది. ఆయన ఇట్లనుచుండెడివాడు — "ప్రజలకు ప్రీతికరములగు చోట్లు ఎన్ని ఉన్నవి! కొందఱు ఆరామములకు పోవుదురు. కొందఱు వినోదస్థలములకు పోవుదురు. కావున ఇచ్చటికివచ్చువారికి ఈచోట ఏదో విలువ గోచరించియుండును లేకున్న వారు రానేల?"

స్వామిచేయు ఉపచారములు కేవలపుశారీరకసంతర్పణములతో ఆగ లేదు. భక్తులు ఆధ్యాత్మికముగ పెంపొందవలె నను ఆశ ఆయనకు తక్కినఅన్నిటికంటె మిక్కుటము. నిర్విరామమయిన తన కార్యక్రమములో ఆయన ఎట్లో అవకాశము కల్పించుకొని భక్తుల డెందములలో భగవద్భక్తిని వైరాగ్యనిష్ఠను నింప జూచును. అహంకారగంధరహితప్రేమైకప్రభవములు ఆయనమాటలు. కావున అది సూటిగ

దేవస్థానమగు ఆత్మలోనికి చొచ్చుకొనును. మధ్యాహ్నభోజనానంతరము కొంత విశ్రాంతియు నైనపిదప ఆయన నూత్నాగంతుకులతోను సేవార్థులతోను మాటాడుచుండును. సాయంపూజ ముగిసిన తర్వాత వారు అప్పటికింకను మఠములోనే నిల్చియుందురేని వారితో ఆయన మరల అప్పుడు మాటాడును. వారిలో భక్తిజ్యోతిని వెలిగింపవలె ననుట ఆయన యేకైకసంకల్పము. ఆయనమాటలు విన్నవారి మనసుల నొక ఉదాత్తత ఆవహించెడిది. ఒక విధమైన ఆధ్యాత్మికోన్నతి వారి కనుభూత మయ్యెడిది.

విరామదినాలలో సెలవుదినాలలో విద్యార్థులు కొన్నాళ్లు మఠములో గడపుద మని వత్తురు. తల్లి బిడ్డల ఆదరించినట్లుగా శ్రీప్రేమానందస్వామి వారి నాదరించెడివాడు. తనకు మిక్కిలి ఆంతరంగికులైనవారికి ఆయన తఱచు ఉత్తమవృత్త్యోపదేశకములగు లేఖలు వ్రాయుచుండెను. ఆయన మాటలును ఆయన ప్రభావమును ఎందఱో యువకుల డెందములలో చొచ్చుకొని వానిని ఉదాత్తాదర్శనిష్ఠారంజితములుగ చేసెడివి. రామకృష్ణసంప్రదాయ సన్న్యాసులు నేడెందఱో ప్రేమానందస్వామి ప్రసాదించిన ఉత్సాహము తమ జీవితములపై అమోఘప్రభావమును చూపిన దినములను స్మరించుచుందురు. ఆయనకు వారు ఋణపడి యున్నారు. తీఱని ఋణ మది.

మఠములో క్రొత్తగ ప్రవేశించిన శిష్యుల క్షేమమునం దాయన కమితశ్రద్ధ. పరమవైరాగ్యలోకసేవాదర్శమును వారిచిత్తముల కెక్కించుటకే కాక నిత్యజీవితవివిధకృత్యములలో వారిని సుశిక్షితుల నొనర్చుటకు ఆయన ఎంతో ఓర్పుతో పాటుపడుచుండెను. శక్తులు సర్వతోముఖముగ వర్ధిల్లవలె ననుట ఆయన ఉద్దేశము, పాక్షికశ్రద్ధ ఆయనకు అనభిమతము. ఇవే ఆయన వాక్కులు—"గుడిసేవలో గాని, వంటపనిలో గాని, గోవుల అవేక్షణమున గాని, పాకీపనిలో గాని, ఎందైనను కానిండు, ఎట్లు పని చేయ వలెనో మీరు నేర్చుకోవలె. చిన్న పనులందైనను సరే పెద్దపనులందైనను సరే మీ జాగ్రత్త సమానముగ ఉండ వలెను. ఫలముల విషయమున నెంత జాగరూకులరై ఉందురో తత్సాధనముల విషయమునగూడ మీ రంత జాగరూకులరుగనే సదా యుండ వలెను". పనులం దించుకంత అశ్రద్ధ చేసినను ఆయన ఒప్పుకోడు. కాని తప్పులను వెంటనే క్షమించును, మఱచిపోవును.

ఆయన గొప్ప ఆచార్యుడు. త్యాగము చేయుటకును, తన ఉపదేశములను తానే ఆచరణలోపెట్టిచూపుటకును నాయకుడు సంసిద్ధుడై యుండవలె నని ఆయన యెఱుగును. ఆయన తనమాటలచేత బోధించినంతకంటె హెచ్చుగా తన నడవడిచే బోధించెను. 'తలమానిసి తల నిచ్చుటకు సంసిద్ధుడుగ నుండవలె' ననుట ఆయనకు ప్రియములైన సూక్తులలో ఒకటి. ఆయనశీలములోని యీ గుణమును మూఢసంఘాచారపరతంత్రము కాని ఆయన విశాల దృక్పథమును చూపు అనుపేక్ష్యమగు నొక సంభవము—

(సశేషము)

# జటాయుకృత రామసవము

మూలము
శ్రీ తులసీదాసగోస్వామి

అనుకృతి
శ్రీ కేశవతీర్థస్వామి

ఛందస్సు : మత్తకోకిల

రామ, శ్రీ అసమానరూపధరా, గుణాగుణ, ప్రేరకా,
భీమరావణబాహుఖండన విక్రమాస్త్రశరాసనా,
శ్యామలాంగ, సరోరుహానన, అంబుజాక్ష, కృపానిధీ,
ఓమహాభుజ, ఓభవాపహా, ఓప్రభూ, గొనుమానతుల్. 1

వందనంబు లమేయశౌర్య, భవా, అనాది, అగోచరా,
నంద, అద్వయ, ద్వంద్వదూర, అనంతచిన్మయ, భద్ర, గో
వింద, గోపద, కామహీనపవిత్రభక్తజనప్రియా,
సుందరాంగ, స్వమంత్రజాపకశుద్ధమానసరంజనా. 2

ఏ పరాత్పరు వేదముల్ వినుతించు శుద్ధము, బుద్ధమున్
వ్యాపకం బజమై వెలింగెడి బ్రహ్మమంచు నజస్రమున్,
ఏ పరేశు మునీశ్వరుల్ కననెంచి జ్ఞానవిరాగ యో
గోపమార్గము లాశ్రయించెదరో, తదీశుఁడవీ వహా! 3

అట్టి నీవు కృపావశంబున నాశ్రితావళిఁ గావఁగాఁ
బుట్టినా వతిరమ్యవిశ్వవిమోహనాకృతితో ధరన్,
ఇట్టి మన్మథమన్మథాకృతియే, మదీయ హృదబ్జ మె
ప్పట్టునన్ విడిపోని షట్పదవల్లభంబగు రాఘవా. 4

ఏ విభుండు అగమ్యుఁడయ్యును ఎంచిచూడ సుగమ్యుఁడో,
ఏ విభుండు సమానముండు, సమిద్ధశుద్ధుఁడు, శాంతుఁడో,
ఏ విభున్ గనుచుంద్రు చిత్తము నింద్రియంబు లణంచి, నా
నావిధాన సుసాధనంబుల నమ్యయోగిమహాజనుల్. 5

ఏ విభు న్నుతియింపఁగా భవశృంఖలంబులు భంగమౌ
ఆ విభుండు రమానివాసుఁ డనారతాశ్రితవశ్యుఁడౌ
దేవదేవుఁడు, విశ్వనాథుఁడు, దివ్యసుందరమూర్తి, సీ
తావిభుండు, రఘూత్తముండు సదా మదాత్మ వసించుతన్. 6

# ద్వాదశజ్యోతిర్లింగాలు

## శ్రీ వేదం రామశాస్త్రిగారు

సౌరాష్ట్రంలో శ్రీసోమనాథస్వామి, శ్రీశైలంలో మల్లికార్జునస్వామి, ఉజ్జయినిలో శ్రీమహాకాళేశ్వరుడు, నర్మదానదీతీరంలో ఓంకారేశ్వరుడు, హిమాచ్ఛాదిత కేదారఖండంలో కేదారనాథుడు, ఢాకిని అనే చోట శ్రీభీమశంకరుడు, వారణాసిలో కాశీకావిశ్వేశ్వరుడు, గోదావరీతీరాన త్ర్యంబకేశ్వరుడు, చితాభూమిలో శ్రీవైద్యనాథుడు, దారుకావనంలో శ్రీనాగేశ్వరుడు, రామేశ్వరంలో రామేశ్వరుడు, శివాలయంలో ఘుశ్మేశ్వరుడు—మున్నగు పేర్లతో 'ఈశ్వరుడు' ద్వాదశజ్యోతిర్లింగాలుగా వెలసియున్నాడు.

అనుదినం ప్రాతస్స్మరణగా పై పేర్లను ఎవడు జపించుచున్నాడో అట్టివానికి సప్తజన్మముల పాపములు నశించును. కోరికలూ సఫలీకృతములౌతాయి. ఈ జ్యోతిర్లింగాల దర్శన మాత్రముచే పాపం పరిహారమగుటయే గాక, ఈశ్వర కటాక్షం ప్రాప్తిస్తుంది. అందుకే ఈ జ్యోతిర్లింగా లంత ప్రతీతి చెందినవి.

ఈజ్యోతిర్లింగాలనుగూర్చి శివపురాణంలో, రామాయణమహాభారతాల్లో వర్ణన కన్పిస్తూంది. అంతేగాక, స్కందపురాణాంతర్గతములగు 'కాశీ', 'సేతు', 'రేవా', 'అవంతీ', 'కేదార' ఖండములలో—కాశీ, రామేశ్వరం, మహాకాళేశ్వరం, కేదారనాథ తీర్థముల విస్తృత వర్ణన ఉంది

### శ్రీ సోమనాథుడు

శ్రీసోమనాథస్వామి కథియవార్ ప్రదేశాంతర్గత శ్రీప్రభాసక్షేత్రంలో వెలసియున్నాడు. ఈ సహ్యాక్షేత్ర పురాణ కథ ఇది—దక్షప్రజాపతి తన ఇరువదియేడ్గురు కన్యలను చంద్రునకిచ్చి పెళ్ళిచేశాడు. కానీ చంద్రునకు రోహిణియందే ఎక్కువ మక్కువ. తత్ఫలితంగా దక్షునిచే చంద్రుడు శాపగ్రస్తుడై, క్షయరోగపీడితుడైనాడు. సుధాకరుని సుధావర్షం ఆగిపోయింది. చరాచరంలో 'త్రాహి' 'త్రాహి' అనే దీనాలాపం ప్రారంభమైంది.

దేవతాగణం అంతా—ఇంద్రాది దేవతలు వశిష్ఠాది మహర్షి బృందం—బ్రహ్మయొద్దకు వెళ్లి జరిగిందంతా మొరపెట్టుకున్నారు. అప్పుడు బ్రహ్మ చంద్రునకు, తక్కిన దేవతానీకానికీ ప్రభాసక్షేత్రంలో మృత్యుంజయుని స్థాపించి పూజింపుడని ఆదేశ మిచ్చాడు. చంద్రుడు దేవతామండలితో ప్రభాసక్షేత్రం చేరి మృత్యుంజయుని అర్చనానుష్ఠానం ఆరు నెలలు చేశాడు. చంద్రుడు పదికోట్లసార్లు మృత్యుంజయమంత్రాన్ని జపించాడు. దాంతో ప్రమథనాథుడు ప్రత్యక్షమై మృతతుల్యుడైన చంద్రునకు అమరత్వం ప్రసాదించాడు. దాంతో సుధాకరుని సుధాకిరణాలతో ప్రాణసంచారం కాజొచ్చింది. ఈ ప్రభాసక్షేత్రంలోని ప్రవాహపూత సలిలంచేత పాపపుంజం పలాయనమౌతుంది.

ఇట్టి మహిమాన్వితమైన సోమనాథక్షేత్రం కూడ గజినీమహమ్మదు, అల్లాఉద్దీన్ ఖిల్జీ ప్రభృతుల దాడికి సర్వనాశనమైంది. స్వతంత్ర భానూదయమైన తర్వాత కీ. శే. సర్దార్ వల్లభభాయ్ పటేల్ పర్యవేక్షణలో ఆ క్షేత్రం ప్రాచీనరూపురేఖల్ని తీర్చిదిద్దుకొంది.

## శ్రీశైలమల్లికార్జునస్వామి

శ్రీశైలం దక్షిణకైలాసం, పద్మపురాణం, శివపురాణం, మహాభారతం— మొదలైన పురాణాల్లో ఈ శ్రీశైలం వర్ణితమై ఉంది. మహాభారతంలో — 'శ్రీశైలమల్లికార్జును'ని పూజించుటవల్ల 'అశ్వమేధయజ్ఞం' చేసినంత ఫలం ప్రాప్తిస్తుందని వర్ణన. అంతేగాదు— 'శ్రీశైలశిఖరం దృష్ట్వా, పునర్జన్మ న విద్యతే' అని. జననమరణాతీతము, ఆద్యంతరహితము, నిత్యము, నిర్మలము, సర్వశక్తిమంతము, సర్వగతమై వెల్గొందు 'ఆత్మసామ్రాజ్యం' ప్రాప్తిస్తుంది.

భవానీశంకరుల పుత్రులు శ్రీగణేశుడును, శ్రీ కార్తికేయుడు (సుబ్రహ్మణ్యేశ్వరుడు) ను వీరిరువురకు వివాహ విషయంలో వివాదం వచ్చింది. ముందు ఎవరు 'భూ ప్రదక్షిణం' చేస్తారో వానికి మొదట పెళ్ళి చేస్తా నన్నాడు శివుడు. దాంతో కార్తికేయుడు భూప్రదక్షిణానికి బయలుదేరాడు. వినాయకునకు శరీరం స్థూలం, బుద్ధి సూక్ష్మం. అందువల్ల పార్వతీ పరమేశ్వరుల చుట్టూ ఏడుసార్లు ప్రదక్షిణం చేసి, పూజించి—ఇలా ప్రార్థించాడు.

'పిత్రోశ్చ పూజనం కృత్వా
ప్రక్రాంతిం చ కరోతి యః
తస్యవై పృథివీజన్యం
ఫలం భవతి నిశ్చితమ్!'

ఈ నియమానుసారం భూప్రదక్షిణ ఫలితం విఘ్నేశునికి దక్కింది. గణపతి వెంటనే 'సిద్ధి' 'బుద్ధి' అనేవార్ని పెళ్లాడాడు.

కార్తికేయుడు భూప్రదక్షిణంచేసివచ్చేటప్పటికి జరిగిందంతా తెలిసికొన్నాడు. మాతా పితరులపై ఆగ్రహోదగ్రుడై అచటి నుండి వెళ్ళి 'క్రౌంచ' పర్వతం చేరాడు. ఎవరు చెప్పినా తలిదండ్రులయొద్దకు తిరిగి రాలేదు. పార్వతి మాతృహృదయం వ్యాకులం చెందింది. భవాని భవునితోసహా 'క్రౌంచ' పర్వతంపై తన కుమారునివద్దకు చేరింది. అపుడా క్రౌంచ పర్వతంపై 'శంకరుడు' 'జ్యోతిర్లింగధారి' యైనాడు.

## శ్రీమహాకాళేశ్వరం

మాళవప్రదేశాంతర్గతమైన 'ఉజ్జయిని'లో సిప్రానదీతీరంలో వెలసిం దీ క్షేత్రం. దీనికే 'అవంతి' అని మరో పేరు. సప్తమోక్షదాయక పురులలో ఇది ఒకటి. శిప్రానదిలో స్నానం చేసి, శివుని ప్రసాదం ఆరగిస్తే సర్వపాపాలు నశిస్తాయని ప్రతీతి. బృహస్పతి సింహరాశిలో ప్రవేశించినప్పుడు ఇచ్చట 'కుంభోత్సవం' జరుగుతుంది. ఈ క్షేత్రం ఒక గోపబాలుని తపఃప్రభావంతో వెలసింది. భగవంతు డిక్కడ భయంకర రూపంతో వెలసియున్నాడు. అందుచే 'మహాకాళేశ్వరుడు' అనే పేరు ఒప్పి ఉంది. ప్రాతఃకాలంలో ప్రతిదినం చితాభస్మాన్నే పెడుతారీ శంకరునకు. అదే ఇచటి ప్రత్యేకత.

## ఓంకారేశ్వరుడు - అమరేశ్వరుడు

ఓంకారేశ్వరమందిరం, అమరేశ్వర మందిరం నర్మదానదీతీరంలోనే వెలిసి ఉన్నవి. ఈ రెండు దేవాలయాలు ఒకటేనని గణన.

దేవతలు, ఋషులు చేరి, అచటి లింగాన్ని రెండు భాగాలుగా చేసి — 'ప్రణవరూపాన్ని' ఓంకారనాథునిగా, పార్థివలింగంనుండి ప్రకటిత మవటంవల్ల పరమేశ్వరునిగా వెలయ జేశారు. ఈ దేవాలయం చీకటిమయం. ఎప్పుడూ దీపములు వెలుగుతూనే ఉంటాయి. ఇచటి పర్వతం కూడ 'ఓమ్'కార రూపమే. ఇచటి 'లింగం' గర్భగుడి పై భాగంలో ఉంది. దాని చుట్టూ జలమయం. ఓంకారనాథునకు 'సెనగలు' నివేదిస్తారు ప్రజానీకం. ప్రతి సోమవారం ఓంకారేశ్వరుని పంచముఖ స్వర్ణ ప్రతిమను నర్మదానదీజలాల్లో 'జలవిహారం' చేయిస్తారు. ఈ చోటు ఆరోగ్యప్రదమైనది కూడ

## కేదారనాథుడు

ఉత్తరభారతంలో — బదరీనాథం, కేదారనాథం ప్రసిద్ధ క్షేత్రాలు. ఏ వ్యక్తి అయినా కేదారనాథుని దర్శించకుండా బదరీనాథానికి యాత్రసలిపితే 'ఆ యాత్ర' నిష్ఫలం.

'అకృత్వాదర్శనం పశ్య
కేదార స్యాఘనాశినః
యోగచ్ఛేత్ బదరీం తస్య
యాత్రా నిష్ఫలతాం వ్రజేత్!'
(కేదార ఖండం)

కేదారేశ్వర సహిత నరనారాయణమూర్తి దర్శనఫలంగా సమస్తపాపాలు నశిస్తాయి.

'తస్యైవరూపం దృష్ట్వా చ
సర్వపాపైః ప్రముచ్యతే,
జీవన్ముక్తో భవేత్సోఽపి
యోగతో బదరీవనే!
దృష్ట్వా రూపం నరస్యైవ
తథా నారాయణస్య చ,
కేదారేశ్వర నామ్నశ్చ
ముక్తిభాగీ నసంశయః!'

ఈ దేవాలయం మందాకినీ ఘాటున కొండజాతి పద్ధతిలో నిర్మితమైంది. దేవాలయంలో ఘోరమైన అంధకారం. దీపసహాయంతో దర్శనం చేసుకోవాలి. పంచపాండవుల విశాల విగ్రహాలు (ద్రౌపదీసహితంగా) ఇచట వెలసియుండుట మరో విశేషం.

## శ్రీ భీమశంకరుడు

'భీమశంకర జ్యోతిర్లింగం' బొంబాయికి తూర్పున 80 మైళ్ళదూరంలో భీమానదీతీరాన వెలసి ఉంది. ఇచట శంకరుడు 'సహ్యాద్రి'పై స్థాపితుడై ఉన్నాడు. భీమానది ఇచ్చటనే పుట్టుచున్నది. ఆ 'శివలింగం' క్రిందినుండి కొంచెం కొంచెంగా నీళ్లు పైకుబుకుతుంటాయి. త్రిపురాసురవధానంతరం శంకరుడు ఈ చోట విశ్రమిస్తూంటే — అవధదేశ సూర్యవంశరాజు 'భీముడు' తపస్సుచేశాడు శంకరునిగూర్చి. ప్రసన్నుడై ప్రత్యక్షుమై దర్శన మిచ్చాడు భీమునకు జ్యోతిర్లింగరూపంలో. అప్పటినుండి ఇదిజ్యోతిర్లింగం—ఈజ్యోతిర్లింగం భీమ శంకర నామంతో ప్రఖ్యాతమైంది.

ఒకరాజు తపస్సు చేసుకుంటూంటే రాక్షసుడు విఘాతం కల్గించాడు. అంతట శంకరుడు తన భీమత్వాన్నంతాచూపి హతమార్చాడు రాక్షసుని. అందువల్ల 'భీమశంకర' మనే పేరు సార్థకమయింది అని మరో కథ.

## శ్రీ విశ్వేశ్వరుడు

వారణాసిలో విశ్వేశ్వరుడు విరాజమానుడై యున్నాడు ఇచట ఉత్తరమున ఓంకార

నాథుడు, దక్షిణంలో కేదారనాథుడు, మధ్యలో శ్రీ విశ్వేశ్వరుడు ఒప్పారి యున్నారు. ఆది శంకర భగవత్పాదుల కర కమలాలతో ఈ 'జ్యోతిర్లింగం' ప్రతిష్ఠితమైంది. ఆ దేవాల యాన్ని ఔరంగజేబు సర్వనాశనంచేసి — ఒక 'మసీదు' వెలయించినా డాచోట.

శివభక్త మహారాణి అహల్యాబాయి సహ కారంతో పూర్వం ఉన్న దేవాలయానికి సమీ పంలోనే — పునఃప్రతిష్ఠితుడై విశ్వేశ్వరుడు విఖ్యాతిగాంచి యున్నాడు నేటివరకు. పంజాబ్ కేసరి, మహాప్రతాపుడు, మహారాజు రణజిత్ సింహు డీ విశ్వేశ్వరునకు 'స్వర్ణకలశం' సమ ర్పించినాడు—కాశీకావిశ్వేశుని దర్శనమాత్రం తో 'ముక్తి' లభిస్తుందని ఖ్యాతి.

## త్ర్యంబకేశ్వరుడు

ఈ క్షేత్రం నాసిక్ జిల్లాలో ఉంది. గోదా వరీ ఉద్గమస్థాన సమీపంలో 'త్ర్యంబకేశ్వ రుడు' వెలసియున్నాడు. గౌతమమహర్షియు, గోదావరీ నదీమతల్లియు ప్రార్థింపగా శివు డీచోట 'త్ర్యంబకేశ్వరుడు' అనే పేరుతో ఖ్యాతి గాంచాడు. గర్భగుడిలో ఎత్తైనస్థలంలో మూడు చిన్నచిన్న లింగాలున్నాయి. బ్రహ్మ, విష్ణు, శివమూర్తుల చిహ్నము లీ 'లింగాలు'. శివపురాణానుసారం — ''త్ర్యంబకేశ్వరుని'' పూజించినవారు ఇహపరసుఖాలు పొందు తారు.

## వైద్యనాథం

రావణుడు పరమ శివభక్తుడు. హిమాల యంలో శివునిగూర్చి తపస్సుచేసి, శివుని ప్రస న్నుని చేసుకొని వో 'శివలింగాన్ని' లంకకు తీసుకెళ్లటానికి వరప్రసాదం పొందాడు. 'శివ లింగం' త్రోవలో ఎక్కడా క్రింద పెట్ట కూడదు. శివలింగాన్ని తీసుకొని హిమాలయం నుండి లంకాధిపతి బయలుదేరాడు. త్రోవలో చితాభూమిలో పోతూ ఉండేప్పుడు అతని మన స్సులో సందేహాలు జనించాయి. సందేహ నివృత్తికిగాను—ఒక గోపబాలకునివద్ద ఆ 'శివ లింగాన్ని' జాగ్రత్తపరచి వెళ్లాడు. ఆ బాలు డా లింగాన్ని మోయలేక క్రింద పెట్టాడు. శివ లింగం భూమిలో పాతుకుపోయింది. సందేహ నివృత్తి చేసుకొని రావణు డాచోటికి వచ్చాడు. ఎంత ప్రయత్నించినా ఆ 'శివలింగ'మును పైకి ఎత్తటానికి సాధ్యం కాలేదు. విసిగి, వేసారి, తనచేతనున్న ఉంగరాన్ని 'శివలింగం' పై ఉంచి, లంకాధిపతి లంకకు చేరాడు.

బ్రహ్మ, విష్ణువు — రావణుడు వదలిపెట్టి పోయిన ఆ శివలింగాన్ని—ఆ శ్మశానంలో ప్రతి ష్ఠించి పూజించిన పుణ్యభూమి ఇది. ఈ శివ లింగం 11 అంగుళాల ఎత్తు మాత్రం కల్గి ఉంది. ఇచటి శీతోష్ణస్థితి శ్రేష్ఠమైనది. కుష్ఠు రోగు లీచోట కొంతకాలం ఉంటే వారిరోగం మటుమాయమవటం ఈ స్థలంలోని ప్రత్యేకత.

## నాగేశ్వరుడు

సుప్రియుడనే వైశ్యుడు నౌకలో ప్రయాణం చేస్తుంటే ఒక రాక్షసుడు దురాక్రమణచేసి, నావలో ఉండేవార్నంతా పట్టుకొని కారాగా రంలో పెట్టాడు. సుప్రియుడు గొప్ప శివ భక్తుడు. కొంతకాలం కారాగారంలో శివుని గూర్చి ధ్యానించాడు. శివుడు జ్యోతిర్లింగ రూపంతో అతనికి ప్రత్యక్షమై—పాశుపతాస్త్ర

న్నిచ్చి రాక్షసుని బారినుండి అందరిని కాపాడమని అంతర్ధానమైనాడు. రాక్షసునితో సుప్రియుడు ఘోరయుద్ధంచేసి, అతన్ని చంపి, తన అనుచరులను కాపాడాడు. శివుని ఆదేశానుసారం ఈ 'జ్యోతిర్లింగం' నాగేశుడనే పేరుతో ఖ్యాతిచెందింది. ఇది దారుకావనంలో స్థాపితమై ఉంది.

## రామేశ్వరం

రావణుని సంహారార్థం శ్రీరామచంద్రుడు బయలుదేరాడు. ఆయన సేతుబంధం చేరాడు. యుద్ధానికిపోయేముందు ఒక 'శివలింగాన్ని' రామేశ్వరంలో ప్రతిష్ఠించి పూజించి, రావణుని వధించి సీతను పరిగ్రహించాడు. శ్రీరామచంద్రునిచే స్థాపింపబడి విఖ్యాతి చెందిన దీ జ్యోతిర్లింగం.

## ఘుశ్మేశ్వరుడు

ఇది కడపటి జ్యోతిర్లింగం. దీనికే ఘుశ్మేశ్వరుడు, ఘుసృణేశ్వరుడు, ధృష్ణేశ్వరుడు— అని నామాంతరములు. దౌలతాబాదు సమీపంలో 12 మైళ్ళ దూరంలో ఉందీ స్థలం. ఇచట ఒక తటాకం ఉంది. ఆ తటాకంపేరు శివాలయం. ఇచట వెలయు ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగం మహిమ ఇంతంతనరానిది.

'ఈదృశం చైవ లింగం చ
దృష్ట్వా పాపైః ప్రముచ్యతే,
సుఖం సంవర్ధతే పుంసాం
శుక్ల పక్షే యథా శశీ!'

ఘుశ్మేశ్వరమహాదేవుని దర్శనమాత్రంతో సమస్త పాపాలూ హరిస్తాయి. సుఖములు శుక్లపక్షచంద్రునివలె వృద్ధిచెందుతవి.

ఆదిశంకరభగవత్పాదులు— ఈ ఘుశ్మేశునిలా స్తుతించారు.

'ఇలాపురే రమ్య విశాల కేస్మిన్
సముల్లసన్తంచ జగద్వరేణ్యమ్
వందే మహోదార తర స్వభావం
ఘుశ్మేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే!'

—[ఆంధ్రపత్రికవారి సౌజన్యముతో].



శంకర పరమేశ శాశ్వత సర్వేశ కాలకాలాంతక గరళకంఠ
చంద్రశేఖర భీమ శాంకరీహృదయేశ శర్వ మహాదేవ శరనిభాంగ
ఫాలనేత్ర గిరీశ పంచాక్షరీరూప భవహార పురహార భక్తవరద
గంగాధర సురేశ కంజాక్షసన్నుత భుజగభూషణ దీనపోష సోమ
యనుచుఁ బఠియించువారికి ఘనతమీఱ మోక్షసత్రంబు చేసిన దీక్ష నీదె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ రాజితశుభాంగ రేపాలరాజలింగ ॥

—కొమఱ్ఱాజు వేంకటశివకవి.

# పురాణవాఙ్మయము

శ్రీయుతులు పాటీలు తిమ్మారెడ్డి, ఎం. ఏ.,
బోయనపల్లి రామారావు, బి. ఏ. గారలు

ఇతిహాసపురాణాభ్యాం
వేదం సముపబృంహయేత్ ।
బిభేత్యల్పశ్రుతా ద్వేదో
మామయం ప్రహరిష్యతి ॥

"శాస్త్రసమ్యక్శ్రవణము లేనివారు వేదములు మమ్ము ప్రహరించుచున్న వని భీతిల్లెదరు. కావున నితిహాసపురాణాదులవలన వేదార్థములను విస్తరింపవలయును" ఇదియే నేడు జరుగుచున్నది. కాని పాశ్చాత్యవిద్వాంసులు 'వేదముల పశువులకాపరులపాటలు' అని పేర్కొనుట యారంభించిరి. వారన్నదే వేదముగ మనవారి కది ఒంటబట్టెను. 'గీతయు తదితరశాస్త్రములును వేదముల కింతటి ప్రాధాన్య మేలయిచ్చునో నే నెఱుగకున్నాను. వేదమంత్రములయందలి దార్శనికవిషయములు భావములు, విజ్ఞానము అంతకంటె నున్నతముగా నుత్తమముగా మహాభారతమందే కలవు' అని యొక పండితమ్మన్యుడు వాకొనెను. ఇట్లు శ్రుతి నాక్షేపించుటకు కారణము నిరుక్తవ్యాకరణాదులాధారముగ మంత్రముల నర్థముచేసికొన నెంచుట. మంత్రములు మననముచేయుటకై చెప్పబడిన వను సంగతి మరచిపోవుట. ఆయామంత్రాధిదేవతల నాధారము చేసికొని తత్పదప్రత్యయములందు మనస్సు నేకాగ్రమొనర్చుటచే మంత్రార్థదర్శనము సంభవించును. మంత్రము లర్థవిచారముచేయుకొఱకు కాదు. ఇతిహాసపురాణములందా మంత్రార్థములు విస్తరింపబడును. కావుననే మంత్రార్థము నెఱుగగోరినను, ఇతిహాసపురాణాదులందా మంత్రఋషిని గూర్చి చెప్పిన విషయము లన్నియు నెఱుగవలెను. ఎట్లన వేదములందింద్రమంత్రములు పెక్కులు గలవు. తదర్థము నెఱుగవలె నన్న పురాణములందు, స్మృతులందు, శాస్త్రములందు ప్రకరణానుసారముగా చెప్పబడిన యింద్రునిచరిత్రమంతయు తెలియవలెను. ఆయామంత్రఋషులు పురాణాదులందు కన్పించినచోట నాయా మంత్రార్థములు విశదీకరింపబడియుండును.

యజ్ఞోపవీతధారులకే వేదాధికారము కలదు. స్త్రీలకు, శూద్రులకు, ద్విజభ్రష్టులకు వేదమం దధికారము లేదు. వేద మీశ్వరీయ జ్ఞానము. సర్వమానవహితకాంక్షియై పరమేశ్వరుడు దానిని ప్రసాదించెను. అట్టిచో మానవజాతియం దొకవర్గమును దానినుండి వెలివేయుట యెట్లు? అట్లు వేదాధికారములేని వారికి వేదవిజ్ఞానము ప్రాప్తించు టెట్లు? స్త్రీశూద్రాదులు మూర్ఖతాభాజనులై అట్లే యుండవలసినదేనా?

విషయ మది కాదు. అధికారిభేదము ననుసరించి తత్త్వము నెఱిగింపవలెను. మననశీలురు, మంత్రద్రష్టలు, ఉచ్చారణాదక్షులగు వారికి పరమాత్మకృపవలన నీ జ్ఞానసూత్రములు లభించెను. ఈ సూత్రములే మంత్రములు. ఈ మంత్రములయందు జ్ఞానము పరోక్షము "పరో

తీవాదో వేదోఽయమ్'' ఇట్లు సూత్రరూపమున జ్ఞానము ప్రాప్తించుటకు హేతువు జ్ఞానమనంత మగుట. ఆ సూత్రములు కొన్నియే యైనను తదర్థవిస్తృతి యపారము. జ్ఞానసూత్ర సమ్యగ్రక్షణము శక్యమయ్యును తదర్థవిస్తార రక్షణము దుశ్శకమయ్యెను. ఈ స్మరణవిస్మృతి చక్రమునబడి విస్తృతజ్ఞానము నశింపవచ్చును. ఇట్టిచో మూలసూత్రములు రక్షితములై యున్నచో మరల మంత్రద్రష్టలు సంభవించి యా సూత్రార్థములను విస్తరింపగలరు. జ్ఞాన బీజము నశింపదు. గీతియందు భగవాను డర్జునునితో ''నేనీ జ్ఞానమును సూర్యున కిచ్చితిని. సూర్యుడు మనువునకు, అత డిక్ష్వాకునకు నొసగిరి. కొన్నాళ్ళ కా జ్ఞాన మిట్లు కాలవశమున లుప్త మయ్యెను. ఆ యనాదిజ్ఞానమునే ఇపుడు నేను నీ కుపదేశించుచుంటిని'' అని పేర్కొనెను గదా! ఇట్లే ఇతిహాసపురాణములను ద్వాపరాంతమున కృష్ణద్వైపాయన వ్యాసుడు పునస్సంకలనము గావించెను. మనకు నేడు మహాభారతము, పురాణములు ఈరూపమున లభించుచున్నవి. కావున జ్ఞానసూత్రముల నెఱిగి రక్షింపగలవారికి ఈ భగవద్విజ్ఞాన మా సూత్రములరూపమున లభించినది. ఇట్లు జ్ఞాన సూత్రరూపములగుమంత్రములయందు మనస్సు నేకాగ్రము చేయలేనివారికి, మంత్రదర్శనసమర్థులు కానివారికి, సస్వరోచ్చారణ చేతకానివారికి, పరోక్షవాదమును గ్రహింపలేనివారికి, ఈ వేదార్థములు సరళరీతిచే ప్రకటితములయ్యెను. ద్విజులకు వైదికజ్ఞానము సంక్రమించినట్లే ఈ యితిహాసపురాణవిజ్ఞానము సృష్ట్యాదినుండియు వారికి సంక్రమించెను. ఈ రెంటికిని ఒకటి కేవలసూత్రరూపము, రెండవది భాష్యరూప మగుట తప్ప మఱేభేదమును లేదు.

''స యథార్ద్రైధాగ్నే రభ్యాహితాత్పృథగ్ధూమా వినిశ్చరం త్యేవం వా అరే ఽస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః సూత్రా ణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానా న్యస్యై వైతాని నిశ్వసితాని'' (బృహదారణ్యకం (2-4-10).

తడసినయింధనములనుండి పొగ యెగయునట్లుగా — ఈ ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము, ఇతిహాసము, పురాణము, విద్య (ధనుర్వేదాదులు), ఉపనిషత్తు, శ్లోకము, సూత్రము, మంత్రవివరణ, అర్థాదులన్నియు ఆ మహద్భూతముయొక్క నిశ్వాసములు'' అని శ్రుతియు పురాణాదిసమస్త శాస్త్రములను అపౌరుషేయములు, అనాదులు అని పేర్కొన్నది ఈ యీశ్వరీయ విజ్ఞానమే బ్రహ్మకు లభించినది.

ఇతిహాసపురాణాని
పంచమం వేద మీశ్వరః ।
సర్వేభ్య ఏవ వక్త్రేభ్యః
సస్సృజే సర్వదర్శనః ॥
(భాగ. 3-12-39)

'ఇతిహాసపురాణరూపమగు పంచమవేదమును సర్వజ్ఞుడగు నా బ్రహ్మ నిజముఖములచే సృజించెను'.

పురాణం సర్వశాస్త్రాణాం
ప్రథమం బ్రహ్మణా స్మృతం
అనంతరం చ వక్త్రేభ్యో
వేదా అస్య వినిర్గతాః ॥
(మత్స్యపురాణం)

'సమస్తశాస్త్రములకు మొట్టమొదట బ్రహ్మ పురాణముల స్మరణము — ఉపదేశ మొన

ర్చెను. తరువాతనే ముఖములనుండి వేదములు వెల్వారించెను'.

ఈ మత్స్యపురాణవాక్యముచే భగవానుడు మొదట జ్ఞానమును విస్తృతస్పష్టరూపమున ప్రసాదించెననుట వెల్లడియగుచున్నది. దాని కెల్లరును నధికారులే. అదియే తదనంతరము సూత్రరూపమై ఆ సూత్రములు తద్గ్రహణ ధారణసమర్థులయధీనములోనికి వచ్చెను.

ఇట్లే పురాణములును అనాదులు, ఈశ్వరీయజ్ఞానభండారములు. వేదములవలెనే అవియు పారంపర్యముగ సంక్రమించుటయు, ఒక్క మూలపురాణమే అధికారిభేదముచే శాఖాభేదమున విస్తరిల్లుటయు పురాణములచే విదితమగుచున్నది. వ్యాసభగవానుడు పురాణములను క్రొత్తగా రచింపలేదు. సృష్ట్యాదినుండి వచ్చుచున్న పురాణపరంపర నడుమ అస్తవ్యస్తముకాగా వ్యాసమహర్షి వానిని సువ్యవస్థితములు గావించెను. నేడు మనకు ద్వాపరాంతమున వ్యాసభగవానుడు పునర్నిరూపించిన రూపమున నీ పురాణములు లభించుచున్నవి. ఆ తరువాతకూడ నివి యస్తవ్యస్తములైనవి. వానియందు నేడు బహుళాంశములు లభింపమికిని, ఇన్ని పాఠభేదము లేర్పడుటకును కారణ మిదియే.

వేదఋషులు ఘనజటాదివిధులచే వేదపాఠమును సక్రమముగ నుంచిరి. అందొక్కమాత్రయేని పెంచుటకు తగ్గించుటకు వీలు లేదు. కావున నీ వేదవాణి యపౌరుషేయము. కేవల మంత్రక్రమ మర్థస్మరణసౌకర్యము ననుసరించి మార్చిన దగుటచే నీ క్రమ మపౌరుషేయ మన వీలు లేదు. పురాణములవిషయ మట్లు కాదు. వేదార్థములు అత్యంతవిస్తృత మగుటచే వాని నున్న రూపున ధారణయం దుంచుకొనుట దుశ్శక మయ్యెను. కోట్లాదియేండ్లుగా అవి విస్మృతము లయ్యెను. పెక్కుసార్లందు పెక్కు విషయము లజ్ఞాతము లయ్యెను. మాటి మాటికి ఋషులు వానిని మనోనిగ్రహముచే దర్శించి మూలసూత్రములను ప్రకటించిరి. కావుననే కొన్ని వేదమంత్రములకు ప్రాచీన ద్రష్టలు, ద్వితీయఋషులు నేర్పడిరి. ద్వాపరాంతమున వ్యాసభగవాను డీ వేదముల యవ్యవస్థ గమనించి వానిని పునర్వర్గీకరించెను. తరువాత పదునెన్మిదిపురాణములను మహాభారతమును నిర్మించెను. అందు పెక్కుచోట్ల పూర్వఋషులవాక్యములు యథాతథముగా నిబంధించెను. ఇట్లు పురాణములు వ్యాసకృతములైనను. అందలి పెక్కువర్ణనలు, ఉపదేశములు, సంఘటనలు పూర్వకృతములు.

పురాణములయందు వేదార్థవిస్తృతి:— వేదములందు సమస్తజ్ఞానము సూత్రరూపమున పరోక్షపద్ధతిని వర్ణితమైనది. ఆ జ్ఞానమునే పురాణములు స్పష్టపఱచినవి, విస్తృతము గావించినవి. వానియందు గల భూగోళచరిత్రాంశములు గౌణములు. వ్యాసునిదృష్టి చరిత్రనిర్మాణము కాదు ఆయన అన్నాడు గదా!

> స్త్రీశూద్రద్విజబంధూనాం
> త్రయీ న శ్రుతిగోచరా।
> కర్మ శ్రేయసి మూఢానాం
> శ్రేయ ఏవం భవే దిహ॥

(భాగవతం)

'స్త్రీలకు, శూద్రులకు, ఆచారభ్రష్టులగు ద్విజులకు వేదశ్రవణాధికారము లేదు. కర్మ జగమున వారు కల్యాణమార్గ మేదో తెలియని మూఢులై వర్తించుచున్నారు. వీనిచే (పురాణములు, మహాభారతము) వారికి శ్రేయ

ము లభించును' అని. ఇట్లు అనాదియు, అపౌరు షేయమునగు వేదజ్ఞానము తదనధికారులకై మహాభారతపురాణాదిరూపమున లభించినది. అందుచేతనే 'పురాణవ్యాఖ్యా త్రిధా, ఆదిభౌతికీ ఆధిదైవికీ ఆధ్యాత్మికీ చ' యని పేర్కొనబడినది.

పురాణములు త్రివిధవ్యాఖ్యానయుతములు. అనగా పురాణములయం దొక్కసారిగా ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికవర్ణనలు నడచుచుండును. ఇవి మూడును సత్యములు. ఆధ్యాత్మికనిత్యజగత్తు ననుసరించియే యాధిదైవికభావజగత్తు వెలయును. దానిచే నాధిభౌతికస్థూలజగతి వ్యక్తమగును. ఇట్లు జగత్త్రయము సర్వథా పరస్పరానురూపము. కావుననే యొక్కవ్యాఖ్య సత్యమైనను మూడును సత్యములగును. రామాయణమహాభారతములు హృదయమధ్యమున జరుగు దైవాసురభావసంఘర్షరూపకము లనియు, అవి భౌతికజగద్ఘటనలు కావనియు పేర్కొనువాడు అంతర్జగతియే స్థూలజగద్రూపమున వ్యక్తమగునను సత్యము నెఱుగనివాడు. కావున నంతర్జగతియందలి సత్యములు ఐతిహాసికములగుటలో విప్రతిపత్తి లేదు. అంతర్జగతికిని స్థూలజగతికిని వైసాదృశ్యము లేనికతన, స్థూలజగత్తునందలి సత్యసంఘటనలు విడిచి రూపకనిర్మాణముచేయ దలచువాడు ఆ యాంతరికజగతిని చక్కగా వర్ణింప లేక హాస్యాస్పదు డగును.

వేదములందు చరిత్ర కలదు, భూగోళము కలదు, జ్యోతిషము కలదు, మానవసంఘవర్ణనము కలదు. లోకమున సంభవించినది, సంభవించుచున్నది, సంభవింపనున్నది, సర్వము వేదములందు గలదు. ఈ సర్వసంఘటనలు వేదములయందు లేనిచో నవి పరిపూర్ణజ్ఞాననిధులెట్లు కాగలవు? ఈ వేదరేఖాచిత్రములకే పురాణములు రంగు లద్దినవి. వేదములం దపరివర్తనీయమగు నితిహాసము కలదు. పురాణములు కల్పభేదముచే వానియందలి పరివర్తనములను స్పష్టపఱచెను. ఇట్లే భూగోళాదివిషయములును.

ఉదాహరణమునకు వేదములందు దేవాసురసంగ్రామము, శ్రీరామచరిత్ర, శ్రీకృష్ణచరిత్ర, యదుదుష్యంతాదులకథలు వర్ణింపబడినవి. అవి యట విస్తృతములు కావు. ప్రతికల్పమునందును సమానమగు నంశములు మాత్రమందు చెప్పబడినవి. పురాణేతిహాసములం దీ కథలు నానావిధముల విస్తరింపబడినవి. ఒకగ్రంథము, ఒకకల్పచరిత్రనో, అంతకన్న నెక్కువగు కల్పములచరిత్రనో వివరించును. ఇట్లు కల్పభేదమున చరిత్ర భేదించును. రామావతారము ప్రతి త్రేతాయుగమునను సంభవించినను చరిత్రయం దేకొంచెమైనను భేదమేర్పడకపోదు. దీనినే పురాణాదులు వర్ణించును.

పురాణముల స్వరూపము:—పురాణములు పదునెనిమిది. ఇవి మహాపురాణములు. ఇవి కాక యుపపురాణములు కొన్ని గలవు. కొందఱు మహాపురాణము లన్నవానిని మఱికొంద ఱుపపురాణములనుటయు, ఉపపురాణములను మహాపురాణములనుటయు! కావున ఈ నిర్ణయము కష్టము. భాగవతానుసారముగా ఈ పురాణములను శ్లోకసంఖ్యను క్రింద వివరింతును.

| | | |
|---|---|---|
| (1) బ్రహ్మపురాణము | శ్లో. | 10,000 |
| (2) పద్మపురాణము | | 55,000 |
| (3) విష్ణుపురాణము | ,, | 23,000 |
| (4) శివపురాణము | | 24,000 |

| | | |
|---|---|---|
| (5) | శ్రీమద్భాగవతము | ,, 18,000 |
| (6) | నారదపురాణము | ,, 25,000 |
| (7) | మార్కండేయపురాణము | ,, 9.000 |
| (8) | అగ్నిపురాణము | ,, 15.400 |
| (9) | భవిష్యపురాణము | ,, 14.500 |
| (10) | బ్రహ్మవైవర్తము | ,, 18,000 |
| (11) | లింగపురాణము | ,, 11.000 |
| (12) | వారాహపురాణము | ,, 24,000 |
| (13) | స్కందపురాణము | ,, 81.100 |
| (14) | వామనపురాణము | ,, 10.000 |
| (15) | కూర్మపురాణము | ,, 17,000 |
| (16) | మత్స్యపురాణము | ,, 18,000 |
| (17) | గరుడపురాణము | ,, 19,000 |
| (18) | బ్రహ్మాండపురాణము | ,, 12,000 |

ఇట్లీ పురాణములన్నిటి శ్లోకసంఖ్య 4 లక్షల 10 వే లగుచున్నది. కల్పభేదమున మహాపురాణములు మారుచో నీ సంఖ్య మారవచ్చును. కొన్నిచోట్ల '(1) దేవీభాగవతము, (2) వాయుపురాణము' ఇవి మహాపురాణములుగ పేర్కొనబడినవి. వీనినికూడ మహాపురాణములుగా భావించినచో నిక నుపపురాణముల సంఖ్య యిరువదియే డగును. అవి మహాపురాణముల యనంతరరచన యను భావము సమంజసము కా దేమో. ఇందు కొన్ని మఱికొన్నిటికి ఖిలపురాణములు, (మహాభారతమునకు హరివంశము) కొన్ని వ్యాసునకు పూర్వమే నిర్మితములు. వాని నుద్ధరణపురాణములందురు. ఈ యుపపురాణములు (1) సనత్కుమారము, (2) నారసింహము, (3) బృహన్నారదీయము, (4) శివధర్మోత్తరము, (5) దూర్వాససము, (6) కాపిలము, (7) మానవము, (8) ఔశనసము, (9) వారుణము, (10) ఆదిత్యము, (11) కాళికా, (12) సాంబము, (13) నందికేశ్వరము, (14) సౌరము, (15) పారాశరము, (16) మాహేశ్వరము, (17) వాసిష్ఠము, (18) భార్గవము, (19) ఆది, (20) ముద్గలము, (21) కల్కి, (22) దేవీ, (23) మహాభాగవతము, (24) బృహద్ధర్మోత్తరము, (25) పరానందము, (26) పాశుపతము, (27) హరివంశము. మీది రెండు పురాణములను మహాపురాణములుగ గణించినపుడు ఆ సంఖ్యకు సరిగా కూర్మ, బ్రహ్మాండ, భాగవతముల నుపపురాణములుగ గణించుట కలదు.

పురాణములందీ పదిలక్షణము లుండవలె నని నిర్ణయింపబడినది.

(1) సర్గము (సృష్టివిస్తారము).

(2) విసర్గము (విశేషసృష్టి - మానససృష్టి, దేవతాకారకపురుషాది).

(3) స్థానము(సర్వబ్రహ్మాండసన్నివేశము).

(4) పోషణము (జీవధర్మములు, వానిసంఘములు నడచు కట్టుబాటులు).

(5) ఊతి (జీవుల కర్మవాసన, వాని స్వర్గనరకాదిగతులు).

(6) మన్వంతరాధిపతుల చరిత్రములు, వారి వంశక్రమము.

(7) భగవదవతారచరిత్రములు.

(8) నిరోధము (శమదమాదియోగమార్గము).

(9) ముక్తి (జ్ఞానయోగము, దర్శనశాస్త్రములు).

(10) ఆశ్రయము (భగవదాశ్రయము, భక్తిమార్గము).

ఇదికాక

సర్గశ్చ ప్రతిసర్గశ్చ
వంశో మన్వంతరాణి చ।
వంశానుచరితే త్యేకం
పురాణం పంచ లక్షణమ్॥

అని (1) సర్గము, (2) ప్రతిసర్గము, (3) వంశము, (4) మన్వంతరము, (5) వంశానుచరిత మను నైదు లక్షణములు గలది పురాణము. మొత్తమునకు మహాపురాణోపపురాణములు మీాది పదియో, క్రింది యైదో లక్షణములు కలిగి యుండును. వాస్తవమునకు మీాది పదియు క్రింది యైదింటిలో నణగిపోవును. ఈలక్షణము లన్నియు పురాణములందంతట వ్యాపించియుండును గాని యొక్కొక్కస్కంధముననో లేదా యధ్యాయముననో యొక్కొక్క విషయము వర్ణింపబడియుండు నని తలపరాదు. ఈ పది లక్షణములలో సమస్తసృష్టిజ్ఞానము విస్పష్టమగును.

పురాణముల నేటి స్వరూపము :—నారద పురాణమున సర్వపురాణముల విషయసూచిక కలదు. నేడు కల పురాణములలో భవిష్యము మినహాగా సమస్తపురాణముల సూచిక యిందు గలదు. ఈ సూచిక ననుసరించి పురాణముల శ్లోకసంఖ్య చాలవఱకు తక్కువయ గలదు. ఈ సూచికలోని విషయములుకూడ ఆయా పురాణములలో పూర్తిగ లభించుట లేదు. దీనిచే ఆయా పురాణములయందలి పెక్కు భాగములు నేడుపలబ్ధము లగు వానిలో లోపించుట స్పష్ట మగును. క్రింద పదునెన్మిదిపురాణములు సంక్షిప్తముగ పరిచయము చేయబడును.

(1) బ్రహ్మపురాణము : ఈ పురాణము బొంబాయి ప్రతికంటె 'విశ్వకోశము'న నిచ్చిన సూచిక చాల చిన్నది. ఇందు 245 అధ్యాయములు కలవు. కొన్ని పురాణముల ననుసరించి యిందు 13,000 శ్లోకము లుండవలెను. ఇది వైష్ణవము.

(2) పద్మపురాణము : లభించు పద్మపురాణమున (1) సృష్టిఖండము, (2) భూమిఖండము, (3) పాతాళఖండము, (4) ఉత్తరఖండ మని నాల్గుఖండములు కలవు. ఇది గౌడీయము, దాక్షిణాత్యము నని రెండు సంస్కరణము (ఎడిషన్లు) లలో లభించుచున్నది. రెండింటి కథలయందును భేదము కలదు. వీని యధ్యాయములుకూడ సమానములు కావు. నేడు పద్మపురాణమున 48,000 లకు పైగా శ్లోకములు కలవు. స్వర్గఖండము, క్రియాయోగసారము దీని భాగము లందురు. వీనిని కలిపినచో 6 ఖండములు 55,000 శ్లోకము లగును. పద్మపురాణమునుండి తీర్థపర్వమాహాత్మ్యములు పెక్కులు వేర్వేఱు పుస్తకములుగ పెక్కురు ముద్రించియున్నారు.

(3) విష్ణుపురాణము : ఇందు పెక్కు భాగములు లోపించినవి. దీని భాగము లని చెప్పబడు విష్ణుధర్మోత్తరపురాణబ్రహ్మోత్తరఖండములను కలిపినచో శ్లోకసంఖ్య 16,000 అగును. అప్పటికిని 7,000 శ్లోకములు తక్కువగును. బ్రహ్మగుప్తుడు బ్రహ్మోత్తరసిద్ధాంత రచనయందు విష్ణుధర్మోత్తరమునుండి కొన్ని జ్యోతిషవిషయములు గైకొని యుండెను. నేడవి కానరావు. పెక్కు చిన్న చిన్న పుస్తకములు విష్ణుపురాణాంతర్గతము లని వాకొనునవి దానియందు లేవు. ఇవి లుప్తభాగములోనివేమో.

(4) శివపురాణము : కొందఱు శివపురాణము వాయుపురాణము రెండును నొక్కటియే

యందురు. కాని వాయుపురాణభిన్నమగు శివపురాణ మొకటి లభించుచున్నది. దీని శ్లోకసంఖ్యకూడ సరిపోవుచున్నది.

(5) శ్రీమద్భాగవతము : ఉపలబ్ధములగు భాగవతప్రతులు శ్రీధరీయటీకను ప్రమాణముగా గొని ముద్రింపబడినవి. శ్రీధరునిటీకగల శ్లోకముల సంఖ్య 18,000 కన్న లేదు. 'విజయధ్వజ' టీక ననుసరించి యధ్యాయములు శ్లోకములు దీనికి చేర్చినచో శ్లోకసంఖ్య పరిపూర్తి యగును.

(6) నారదపురాణము : ఉపలబ్ధప్రతియందు 18,110 శ్లోకములు కలవు. తక్కిన 6,890 శ్లోకములు లోపించియుండును. బృహన్నారదీయ ముపపురాణములలోనిది.

(7) మార్కండేయపురాణము : ఇందు 9,000 శ్లోకము లుండ వలయును. కాని ముద్రితప్రతియందు 6,900 మాత్రమే కలవు. తక్కిన సర్వవిషయములు నారదపురాణసూచియందు లభించును. కొన్ని నారదసూచికయందు లేనివి.

(8) అగ్నిపురాణము : ఇది విద్యాభండారము. ఇందలి కౌమారవ్యాకరణము చక్కని సంస్కృతవ్యాకరణము. సాహిత్యాలంకార, వైద్య, జ్యోతిష, దర్శన, ధనుర్వేద, గాంధర్వవేద, స్థాపత్యకళాదివిద్య లిందు ఉన్నతస్థాయిలో లభించును.

(9) భవిష్యపురాణము : దీనికి నాల్గుచోట్ల లనుండి ప్రకటింపబడిన నాలుగుప్రతులు కలవు. నారదపురాణమందలి విషయసూచిక ననుసరించి యేప్రతియు సంపూర్ణము కాదు. ఇందొక ప్రతి నారదపురాణసూచికకు సర్వథా భిన్నము. తక్కిన మూడింటి యాయావిషయములు సేకరించినచో నారదసూచికయందలి విషయము లన్నియు వచ్చును. నారదపురాణము ననుసరించి వాని నన్నిటి నొకక్రమమున కూర్చిన నది భవిష్యపురాణవ్యవస్థరూపము కాగలదు. ఇం దెవరికి తోచినవి వారు రచించి స్వేచ్ఛగా దోపియున్నటుల కాన్పించుచున్నది.

(10) బ్రహ్మవైవర్తము : ఇది నారదపురాణమువలె సరియైన రూపమున లభించుచున్నది. కాని నారదసావర్ణిసంవాదము, బ్రహ్మవారాహసంవాదము, బ్రహ్మవివర్తాదిగాథలు దీనియందు కానబడవు.

(11) లింగపురాణము : నవల్ కిశోర్ ప్రెస్ వారి పుస్తకము నారదసూచికతో సరిపోలుచున్నది. కాని నారదపురాణసూచిక ననుసరించి యిది యగ్నికల్పసంబంధి కావలసియుండగా ముద్రితపురాణ మీశానకల్పసంబంధియైనట్లున్నది. హలాయుధుడు తన 'బ్రాహ్మణసర్వస్వము'న బృహల్లింగపురాణమును పేర్కొనెను. కాని యిపు డది లభించుట లేదు.

(12) వారాహపురాణము : ఇది యసంపూర్తిగా ముద్రితమైనది. ఇందు కేవలము 218 అధ్యాయములు కలవు. 10,000 కు పైగా శ్లోకము లున్నవి. ప్రకాశకులకుగూడ నిది యసంపూర్తిగనే లభించిన దట. ఏషియాటిక్ సొసైటీవారి ప్రతియందును ఇన్ని శ్లోకములే కలవు.

(13) స్కాందపురాణము : ఇందు భారతదేశమందలి సర్వక్షేత్రముల మాహాత్మ్యములును కలవు. దీని శ్లోకసంఖ్య యపారము. ఇది నేటి సంకలన (ఎడిటింగు) దోషమువలన సంక్రమించియుండును. పెక్కుభాగములు రెండు మూడుసార్లు ముద్రితము లైనవి. వానిని తొలగించినచో శ్లోకసంఖ్య 81,000 కు కొంచె మధిక మగును. ఈ గ్రంథము కాలానుగుణ

ముగ పెరుగుచున్నట్లు తోచును. నిన్న మొన్నటి యన్నవరక్షేత్రపు స్థలపురాణము స్కాందములో కన్పింపక పోయినను క్షేత్ర వాసులు, అర్చకులు స్కాందమందలి దందురు. ఇట్లే పెక్కులు చేరియుండును. ఇం దేబదిఖండ ములు కల వన్న శ్రీనాథుడు (1) పంచనాగర ఖండము, (2) కమలాలయఖండము, (3) రేవా ఖండము, (4) ఏకవీరఖండము, (5) మైలార ఖండము, (6) గోదావరీఖండము, (7) కాశీ ఖండ మను నేడు ఖండములనే చూచెను. దీని కవయవంబు లారు సంహితలు. (1) సనత్కు మారసంహిత 55,000, (2) సూతసంహిత 6,000, (3) శాంకరసంహిత 30,000, (4) వైష్ణవసంహిత 5,000, (5) బ్రహ్మసంహిత 3,000, (6) సౌరసంహిత 1,000 శ్లోకములు కలవి. ఇట్లిది లక్షగ్రంథపరిమాణముగలదిగా శ్రీనాథు డభివర్ణించెను.

(14) వామనపురాణము: దీనికి నారద పురాణసూచికతో సరిపోలుప్రతి లభించు చున్నది. శ్లోకసంఖ్య కొంచెము తక్కువ.

(15) కూర్మపురాణము: నారదాదిపురాణ ములం దిందు 17,000 శ్లోకము లున్నట్లు పేర్కొనబడినను ప్రాప్తప్రతియందు దాదాపు 6,000 కంటె లేవు. యామలాదితంత్రభాగము లీ పురాణములోనివే కావచ్చును. ఏలన నవి నారదపురాణసూచికతో అన్వయించుచున్నవి.

(16) మత్స్యపురాణము: ఈ పురాణము నేటికిని ప్రాచీనరూపముననే లభించిన దని యెల్ల పరిశోధకు లంగీకరించుచున్నారు.

(17) గరుడపురాణము: ఇది పూర్తిపుస్త కము లభింపలేదు. ఒక్కఖండము లభించి నది. ఈ పురాణమందలి ప్రేతఖండము సుప్ర సిద్ధము.

(18) బ్రహ్మాండపురాణము: అధ్యాత్మ రామాయణము, లలితోపాఖ్యానము ఈపురా ణములలోని వందురు. వానినికూడ చేర్చినచో శ్లోకసంఖ్య సరిపోవును.

ఈ వివరణముచే పెక్కుపురాణములందు పెక్కుఅంశములు నష్టమైనట్లు విశద మగు చున్నది. ఇక భవిష్యపురాణపు ప్రామాణికతనే సంశయింపవలసివచ్చుచున్నది. స్కాందము సంగతి యడుగ బని లేదు. తక్కిన పురాణ ములు చాలవఱకు నారదపురాణసూచికతో సరిపోలుచున్నవి. కావున వాని ప్రామాణికతను సంశయింప బనిలేదు.

ఈ పురాణములు పద్మపురాణోత్తరఖండ మందు (43 అధ్యా.) సాత్త్విక రాజస తామ సములని విభజింపబడినవి.

వైష్ణవం నారదీయం చ
తథా భాగవతం స్మృతం
సాత్త్వికాని పురాణాని
విజ్ఞేయాని శుభాని వై.
బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం
మార్కండేయం తథైవ చ
భవిష్యం వామనం బ్రాహ్మం
రాజసాని నిబోధత.
మాత్స్యం కౌర్మం తథా లైంగం
శైవం స్కాందం తథైవ చ
ఆగ్నేయం చ షడేతాని
తామసాని నిబోధత.

వారాహపాద్మగారుడము లిందు చెప్పబడ లేదు.

(సశేషము)

# ఆస్తిక్యం

(మతసంస్థలు, సంప్రదాయాలు)

శ్రీ పున్నావజ్ఝల సీతారామబ్రహ్మంగారు

భగవత్సాంగత్య సాధనకు నిర్దిష్ట నియమావళితో, విధి నిషేధాల వివరాలతో ప్రతిపాదించబడే ఏ విధానము అన్ని కాలాలకు, అన్ని దేశాలకు, అన్ని పరిస్థితులకు, అన్ని అవసరాలకు, అన్ని అంతస్థులలో ఉన్న అందఱుమానవులకు ఉపయోగపడ జాలదు. ప్రత్యేక విధానాలను ప్రతిపాదించే సంస్థల ప్రయోజనం అనివార్యంగా పరిమితమే కాగలదు. ఒకనికే ఒకప్పుడు విశేషంగా ఉపయోగపడగల సంస్థ మఱొకప్పుడు పనికిమాలినది కాగలదు. ఇంకొకప్పుడు హానికరం కాగలదు కూడా.

మానవుల పరస్పర జ్ఞాన వికాసానికి, అనుకూల వాతావరణకు, ప్రబోధ ప్రోత్సాహాలకు, మతసంస్థలు, సంప్రదాయాలు అవసరమే. ఏ ప్రత్యేక విధానాన్ని ఏ సంస్థ ప్రబోధిస్తున్నప్పటికీ అన్ని సంస్థల, సంప్రదాయాల ఆశయం, భావన ఒక్కటే అయి ఉండాలి. అది ఏకేశ్వర ప్రతిపాదనే కావాలి. ఏకేశ్వర సాక్షాత్కార సాధనకు సహాయ పడగల అనేక విధానాలలో తమ సంస్థ ప్రోత్సహించే విధానం కూడా ఒకటి అన్న జ్ఞానం సంస్థ సంస్థాపకులకు, అనుచరులకు, సభ్యులకుఉండాలి. అనేక శిక్షణ కేంద్రాలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలవలె మత సంస్థలు చిత్త సంస్కార శిక్షణ కేంద్రాలుగా పని చెయ్యాలి.

ఏకేశ్వర విశ్వాసం జీవిత దృక్పథంగా వ్యక్తమైనప్పుడు సర్వజనీనం, సర్వతోముఖం, సమన్వయ పూర్వకం, అభ్యుదయదాయకం అయిన ధర్మ మవుతుంది. అట్టి దృక్పథాన్ని, ధర్మాన్ని ప్రవర్తిల్ల జెయ్యడమే ఏకేశ్వర ప్రతిపాదనకు తార్కాణం.

ఒకానొక ప్రత్యేక విధానాన్ని ప్రతిపాదించడం కాక కేవలం అనంతముఖుడయిన ఏకేశ్వరుని ప్రతిపాదించడం, వివిధ విధానాల ప్రాతిపదికల ఏకతకు, వివిధ విధానాల పరస్పర సంపూరక లక్షణాలను, వివిధ విధానాలలోని సంస్థల కాలపరిస్థితుల ప్రభావాలను, వివిధ విధానాలలోని గుణగణాలను, వాటితోపాటు భ్రమప్రమాదజన్యమైన దోషాలను వెల్లడించడం – సర్వజనీనం, సర్వతోముఖం, సమన్వయ పూర్వకం, అభ్యుదయదాయకం అయిన జీవిత ధర్మాన్ని ఎప్పటి కప్పుడు తత్కాల సమస్యల కన్వయిస్తూ ప్రకటించడం – ఈ లక్ష్యంతోకూడా మత సంస్థలను స్థాపించవచ్చు. అట్టి సంస్థలుకూడా ఎక్కువ కాలం వర్ధిల్ల జాలవు.

వ్యవహార జీవితంలో అమృతత్వం నిరంతర పరివర్తనం వల్లనే సంభవం. సంస్థలు అనేక సభ్యుల సంఘటిత కృషివల్లగాని వర్ధిల్లవు.

ఏ విషయం గురించిగాని మనిషికి మనిషికి అభిప్రాయభేదాలు తప్పవు. అధిక సంఖ్యాకుల అభిప్రాయాలు విధిగా సమంజసమైన వనడానికి వీలులేదు. తమకు నచ్చనప్పుడు ఇతరుల నిర్ణయాలను మన్నించడం ధర్మం కానేరదు. ప్రత్యేక సమస్యలను గురించి ధర్మాన్ని నిర్ణయించి ప్రకటించడంకోసం ఉద్దేశింపబడిన సంస్థలో అభిప్రాయభేదాలతో సభ్యులుగా ఉండడంలో అర్థంలేదు. అభిప్రాయ భేదాలతో వేఱుపడినవారు తమ సిద్ధాంతాల ప్రచారానికి కొత్తసంస్థలు స్థాపించుకొనడం సహజం. ఆ సంస్థలకుకూడా ఈ గతే పడుతుంది. అందుచేత సంస్థలను కాక వ్యక్తులను నమ్ముకొనడం మేలు. వ్యక్తులలోకూడా ఇతరులను నమ్ముకొనడంకంటె ఎవరికి వారు తమ్మ నమ్ముకొనడం ఉత్తమం.

మతంలో మనిషి పుట్టడం అనేమాటకు అర్థంలేదు. పుట్టుకతో ఎవరికీ ఏ మతమూ ఉండదు. ప్రాజ్ఞత వచ్చిన తరువాత ఎవరి మతాన్ని వారు నిర్ణయించుకొనాలి. ఎదుగుబొదుగు అక్కఱలేని వారు ఒక్కమతాన్ని అనేక జన్మలు అంటిపెట్టుకొని ఉండగలరు. నిరంతరవికాసం పొందగోరే వారు నూతన విధానాలు అనుసరించడం అవసర మవుతుంటుంది. అవిమర్శగా దేనిని నిరాకరించరాదు. గ్రుడ్డిగా దేనిని అనుకరించరాదు. ఆ సికుడు ఏ సంప్రదాయానికి, సంస్థకు, విధానానికి, పార్టీకి బద్ధుడు కాజాలడు. కాని, అన్ని సంప్రదాయాలు, సంస్థలు, విధానాలు, పార్టీలు అతనివే. పెక్కు పువ్వులలోని మధువును ఆస్వాదించే మధుపంవలె ఆస్తికుడు వివిధ విధానాలలో, పార్టీలలో, ప్రణాళికలలో వ్యక్తమవుతున్న భగవత్సంకల్పాన్ని గ్రహిస్తుండాలి. నీటినుంచి పాలను వేఱుచేసే హంసవలె అతడు గుణదోష సమ్మిశ్రమైన వ్యవహార జగత్తునం దంతటా గుణం గ్రహిస్తుండాలి. హంసకు గల ఆ లక్షణం సహజధర్మమైన ఆస్తికుడు. పరమహంస.

వ్యవహార జీవితంతో నిమిత్తం లేకుండా కేవలం ఆధ్యాత్మిక జిజ్ఞాసకు, సాధనకు కార్యక్రమాన్ని పరిమితం చేస్తూ సంస్థలను నిర్వహించ వచ్చు. అట్టి సంస్థలు కొలదిమంది జిజ్ఞాసువులను మాత్రమే ఆకర్షించగలవు. ఈఆకర్షణ ప్రధానంగా వాటిఅధినేతల వ్యక్తిత్వంపై ఆధారపడి ఉంటుంది. అధినేతలు మహా పురుషులయితే, వారి అనంతరం సంస్థల ప్రభావం సన్నగిల్లుతుంది. నిత్య జీవిత సమస్యలతో ప్రత్యక్ష సంబంధం లేని సంస్థలందు ప్రజా బాహుళ్యానికి అభిమానం కలగక పోవడం సహజమే. అందుకని కొందఱు తత్వజిజ్ఞాసతోపాటు వైద్య సహాయం, విద్యాప్రచారం, దీనజన సేవ వంటి నిర్వివాద కార్యక్రమాలను సాగిస్తుంటారు. తమ సంస్థలను ప్రజాదర పాత్రం చెయ్యడానికి, సంస్థలకు ప్రజాధనం సేకరించడానికి వారు కృషి చేస్తుంటారు. ప్రజల సహాయం పొందగోరే సంస్థలు ప్రజల ఆచార వ్యవహారాలలో, నమ్మకాలలో గల దోషాలను విమర్శించడానికి – సందేహించడం, వాటిని కొంతవఱకు సమర్థించడం అవసరమవుతుంటుంది. ఇక అవి ఏపాటి ఆధ్యాత్మిక సంస్థలు? అంతేకాదు అట్టి సంస్థలు నిర్వహించే సేవా కార్యక్రమాల యందే ప్రజలకు శ్రద్ధ. తమ సేవా కార్యక్రమాలనుచూపి, తమసంస్థల, సంస్థల స్థాపకుల మహత్త్వమును

ప్రజల మనస్సులలోకి ఎక్కించాలని సంస్థల నిర్వాహకుల ఆరాటం. ఇందుకొఱకు సేవా కార్యక్రమాలను చుఱుకుగా, ఆడంబరంగా సాగిస్తుండాలి. ఏ ముఖ్య ప్రయోజనం కొఱకు తొల్దొల్త సంస్థలు స్థాపించబడుతవో అది అప్రధాన మవుతుంది. అనుపానంగాను, ఉపాంగంగాను అనుసరించబడే కార్యకలాపాలు ప్రధాన మవుతవి. ఈ లోపాలతో పాటు మానవ ప్రకృతి దౌర్బల్యం వల్ల మత సంస్థలలో ప్రవేశించే దోషాలకు మేరలేదు.



# వార్తలు, విశేషాలు

## శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు

### విజయవాడ

17-1-1963 నాడు విజయవాడ శ్రీరామకృష్ణసమితివారు వేదపారాయణముతో భగవద్గీతవిషయికప్రసంగములతో ప్రత్యేకపూజతో శ్రీవివేకానందశతతమజయంతిమహోత్సవమును జరిపినారు. తే 20 దినాడు భజనలు, భగవద్గీతలో పిల్లలపోటీలు, దరిద్రనారాయణసంతర్పణ జరిగినవి. నాడు సమావేశమైన మహాసభలో పురప్రముఖులు పెక్కండ్రు స్వామిజీ జీవితోపదేశములను గూర్చి ఉపన్యసించినారు.

### రామకృష్ణఅద్వైతఆశ్రమము - వారణాసి

స్వామిజీ శతతమజయంతిమహోత్సవసప్తాహకార్యక్రమము వారణాసి రామకృష్ణఅద్వైతాశ్రమములో 17-1-1963 గురువారము నాడు వేగుజామున మంగళారాత్రికముతో ప్రారంభమైనది. పూజా భజనల కనంతరము స్వామిజీ జీవితోపదేశములనుగూర్చి శ్రీ అజ్ఞానందస్వామియు ఆచార్య సత్యాంశుముఖర్జీయు మహోపన్యాసములు కావించిరి. మొదట ఆశ్రమాధిపతులైన శ్రీ అపూర్వానందస్వాములు రామకృష్ణమఠమిషనుల సర్వాధ్యక్షులైన శ్రీమన్మాధవానందస్వాముల సందేశమును చదివి వినిపించిరి.

సాయంకాలము ఆచార్య ప్రశాంతకుమారఘోష్‌గారు స్వామిజీ జీవితసందేశములను గూర్చి ఉపన్యసించిరి. హారతిభజనలకనంతరము అర్ధరాత్రమువఱకు చెల్లిన కాళీపూజతో నాటి కార్యక్రమము ముగిసినది. గుడిప్రాంగణము పుష్పములతో చక్కగా అలంకరింపబడినది.

అలంకృతమైన స్వామీజీచిత్రము వేదికపై ప్రముఖస్థానమున నెలకొల్పబడినది. జనవరి 18-వ తేదీనాడును తర్వాతి మూడుదినములును నిత్యకార్యక్రమము ఉపనిషత్పారాయణముతో ప్రారంభమైనది. తే 18 దినాటి మధ్యాహ్నానంతరము వారణాసి హిందూవిశ్వకళాపరిషత్తుకుచేరిన డాక్టరు సిద్ధేశ్వరభట్టాచార్య శ్రీవివేకానందస్వాముల జీవితోపదేశములలో కననగుచున్న కర్మజ్ఞానముల సమన్వయమును సరళమనోహరముగ నుపన్యసించిరి. సాయంకాలము కొంతసేపు ప్రాచీన – గాత్ర – జంత్ర సంగీతకచేరీలు జరిగినవి.

తే 19 దినాటి మధ్యాహ్నానంతరము భాగవతమునుగూర్చి శ్రీ శివకృష్ణానందస్వాములును మహాభారతోద్యోగపర్వమునుగూర్చి ఆచార్య త్రిపురారిచక్రవర్తి(కల్కత్తా)యు, రామచరితమానసమునుగూర్చి లక్నోవారగు శ్రీరాంజీ బ్రహ్మచారిజీగారును ఉపన్యసించిరి. రామచరిత మానస మహాభారతోద్యోగపర్వములగూర్చిన మలి యుపన్యాసములు ఆ యిరువురిచేతనే జనవరి 21 వ తేదీనాటి సాయంకాలము కావింపబడినవి.

జనవరి 20 వ తేదీనాడు వేయిమంది దరిద్రనారాయణులకు సమృద్ధిగా అన్నసంతర్పణ జరిగినది. ఆనాడే సాయంకాలము 4 గంటలకు పౌరమహాజనసభ సమావేశమైనది. న్యాయమూర్తులును, వారణాసి హిందూవిశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలరును అగు ఎన్. హెచ్. భగవతిగారు అధ్యక్షత వహించిరి. వరుసగా ఆచార్య ప్రశాంతకుమారఘోష్, ఆచార్య ఆర్. కె. త్రిపాఠీ, ఆచార్య త్రిపురారిచక్రవర్తి అనువారలు ఆంగ్ల హిందీ వంగభాషలలో శ్రీవివేకానందుల జీవితోపదేశములనుగుఱించి ఉపన్యసించిరి.

ఐదవనాడు, జనవరి తే 21 ది మధ్యాహ్నానంతరపు ముఖ్యకార్యక్రమము శ్రీ భాస్వరానందస్వాముల ఉపన్యాసము. ప్రాంతీయవిద్వాంసుల వాద్యసంగీతముతో నాటి కార్యక్రమము ముగిసినది.

ఆరవ, ఏడవదినములలో (జనవరి 22, 23 తేదులు) సర్వమతమహాసభ సమావేశమైనది. సిక్కుమతము, దివ్యజ్ఞానమతము, క్రైస్తవమతము, జోరోస్ట్రియమతము, జైనమతము, బౌద్ధమతము, మహమ్మదీయమతము—అనెడి ఈ మతముల ప్రతినిధులు, తమతమ మతములనుగూర్చి ఉపన్యసించిరి. శ్రీ శ్రీధరానంద స్వాములు ప్రాక్పశ్చిమఖండములపై శ్రీరామకృష్ణ-వివేకానందుల జీవితోపదేశాల ప్రభావమునుగూర్చి ఉపన్యసించిరి. శ్రీరామకృష్ణుడు బోధించిన అన్నిమతాలనిజమును అన్నిమతాల ఏకతయు నాటి అందఱిఉపన్యాసాలలో ప్రస్ఫుటముగ గోచరించుచుండినది. ఆ రెండుదినములలో ఉపన్యాసాల కనంతరము జంత్రగాత్ర సంగీతకార్యక్రమము లుండినవి. తుదిదినము శ్రీ గౌరీశ్వరానందస్వాములు శ్రీమద్భాగవతమునుగూర్చి పాండిత్యోజ్జ్వలమైన ఉపన్యాసము గావించిరి. మహారాష్ట్రపండితులు కొందఱు మహావిష్ణుయజ్ఞమును చేసిరి. హిందీలో ప్రచురింపబడిన శ్రీవివేకానందుల జీవితసంక్షేపమును తక్కిన చిన్నగ్రంథములును సభలో సమావిష్టుల కెల్ల పంచిపెట్టబడినవి.

## మునిసిపల్ ఎలిమెంటరి టీచర్స్ యూనియన్, కడప

వివేకానంద శతజయంతి ఉత్సవము 29-1-1963 న మునిసిపల్ ఎలిమెంటరీ టీచర్స్ యూనియన్ ఆధ్వర్యాన నాగరాజుపేట స్కూలులో జరిగెను. సభకు శ్రీ కె. శామ్యుయల్, బి. ఏ., బి. ఎల్., మునిసిపల్ కమీషనర్ గారు అధ్యక్షతవహించిరి. నాగరాజుపేట స్కూలు హెడ్మాస్టరు శ్రీ ఎ. రామస్వామి గారు చిత్రించిన రంగురంగుల వివేకానందుని చిత్రపటము ఆవిష్కరింపబడెను. సరస్వతీపుత్ర శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు ఉపన్యసించుచు హిందూమతవిశిష్టత, సర్వమత సమ్మేళనము, భారతజాతియొక్క సమైక్యభావమును, సంస్కృతినిగూర్చి విదేశాలలో చాటి చెప్పిన మహామహునిగూర్చి వీనులవిందుగా ఉపన్యసించిరి. ఉపాధ్యాయ ఎడిటర్ శ్రీ విజయరామరాజుగారు వివేకానందుని ఔన్నత్యము ప్రతిభారతీయుడు సాధించుటకు యత్నింపవలెననియు, భారతీయసంస్కృతి దేశదేశములందు చిరస్థాయిగా నిల్పుటకు ప్రతిభారతీయుడు శ్రీవివేకానందుని బోధనలను అలవఱచుకొనవలెననియు ఉద్బోధించిరి. అనంతరము మునిసిపల్‌కమీషనరు శ్రీ కె. శామ్యుయల్‌గారు దివ్యపురుషుని బోధనలు ప్రపంచ మంతటిని ఆకర్షించినవనియు, ప్రతిభారతీయుడును ఇందుకు గర్వింపవలెననియు నుడివిరి. యూనియన్ అధ్యక్షులు శ్రీ కె. టి. కృష్ణమాచారిగారు, సభా కార్యక్రమము నడపుచు ఇట్టి మహామహుల సంస్కరణ ఉపాధ్యాయవృత్తికి ఎంతో సహకారి యనిరి.

ఉపన్యాసానంతరము కుమారి పి. బి. మీనాక్షి, కుమారి సుమేధాగారల నృత్యము ఆకర్షకముగా నుండెను. కుమారి వి. పద్మాసని, తంగమణిగార్ల గాత్రసంగీతము సభ్యులకు హాయి గొల్పెను. శ్రీ యం. పార్థసారథిగారి వైయొలిన్ వాద్యము సభికులను ముగ్ధుల నొనరించెను. హార్మోనియం, శ్రీ డి. సుబ్బరాయుడు; తబలా, శ్రీ మంచాల సుబ్బయ్యగారు సంగీతకార్యక్రమములో పాల్గొనిరి. తదుపరి మంగళూరు వాస్తవ్యులు శ్రీ విఠల్‌రావుగారిచే ''మ్యాజిక్ పనులు'' చేయబడెను. చిత్రకారుడు శ్రీ ఎ. రామస్వామిగారి చిత్రకళానైపుణ్యము పొగడుచు వారిని గౌరవించిరి. అధ్యక్షులు శ్రీ కె. టి. కృష్ణమాచార్యులవారి అభినందనలతో జాతీయ గీతాలాపనతో సభ జయప్రదమయ్యెను.

మద్రాసు - మైలాపూరు - శ్రీరామకృష్ణమఠమున ఏప్రిలు, మే నెలలలోని విశేషదినాలు

28-4-1963 ఆదివారము శ్రీశంకర-రామానుజజయంతి.

8-5-1963 బుధవారము శ్రీబుద్ధజయంతి.

12-5-1963 ఆదివారము బుద్ధజయంతి పౌరసభ.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

### పాగల్‌హరనాథ్ (లేక) శ్రీహరనాథుని అపూర్వపత్రావళి

అనువాదము : నే. మోహనకృష్ణ; ప్రకాశకులు : నే. మోహనకృష్ణ, హరనాథశ్రీమందిరము, సోనాముఖిపోస్టు, బంకూరాజిల్లా, పశ్చిమబెంగాలు; మూల్యము : రు 1-00.

పారమార్థికచింతనుండి వైదొలగి, పదార్థచింతనలో కాలమును శక్తిని వృథాచేయు నేటి మానవకోటిని మేల్కొలిపి భగవద్భక్తిప్రేమలు గరపి, భగవద్ధ్యానాభిముఖులనుగా జేయు మహామహులలో నొకరు శ్రీఠాకూరుహరనాథబంధోపాధ్యాయులు. ఈయన 'సాక్షాత్తు శ్రీకృష్ణుని గౌరాంగానంతరపు అవతారము'. మానవులకు ప్రేమపూర్వకమధురభక్తిని చవిచూపి నేర్ప నవతరించిన వైకుంఠాధిపతి యని నమ్మట హరనాథమతము. క్రైస్తవమతమునకు బైబిలు, మహమ్మదీయమతమునకు ఖొరాన్, ప్రాచీనహిందూమతమునకు వేదోపనిషత్ భగవద్గీతాభాగవతములు ఎట్లో, అట్లే యీ హరనాథమతమునకు ఆయన తన భక్తులకు వ్రాసిన పత్రావళి ఉద్గ్రంథ మగును. ఆయాగ్రంథములలోని 'సకలాధ్యాత్మికమతరహస్యములకు' ఇది గొప్పవ్యాఖ్యానము లగును. ప్రభుప్రేమతోను, ప్రభుసామ్రాజ్యమగు ప్రకృతియందలి ప్రేమతోను ఇవి తొణికిసలాడుచుండును. ఈ లేఖలద్వారా ప్రభువు అజ్ఞానాంధకారబంధురమగు మానవహృదయములలో అనంతజ్యోతిని, ప్రేమజ్యోతిని వెలిగించినాడు.

'పాగల్‌హరనాథ్' అను పేర శ్రీ అటల్ బిహారినాంది అను బెంగాలీభక్తుడు ప్రభులేఖలను అనేకములను ఏర్చి కూర్చి పుస్తకముగా ప్రచురించినాడు. అట్లే 'హరనాథునిసందేశము' (మెసేజ్ ఆఫ్ హరనాథ్) అనుపేర బొంబాయివాస్తవ్యురాలు ఈ హరగోపాలునికి యశోదయై వెలయు 'విమలామా' కొన్ని జాబులను ఇంగ్లీషులో ప్రచురించినది. పై గ్రంథములలో లేనట్టివి, మున్నెప్పుడు కననట్టివి, కొన్ని అపూర్వలేఖలకు ఇది ఆంధ్రానువాదము.

అనేకసంవత్సరములుగా సోనాముఖిలోని శ్రీప్రభుమందిరమున అంతేవాసియై ఉండుచు, ప్రభువుతో ప్రత్యక్షసన్నిహితసంబంధములు కల్గిన ప్రభునాంతరంగికభక్తులను కలిసికొని వారినుండి యీ 'అపూర్వలేఖ'లను సంపాదించి, అనువదించి, ముముక్షుపాఠకులకు అందించిన అనువాదకుడు శ్రీ నే. మోహనకృష్ణ, హరనాథభక్తప్రపన్నుల కృతజ్ఞతకు అవశ్యము పాత్రుడు. ఇట్టి హరనాథ 'దివ్యభారతి' గ్రంథములను పెక్కింటిని భక్తలోకమున కందించుటకు ఈ అనువాదకునికి ప్రభువు చిరాయురారోగ్యప్రేమైశ్వర్యములను ప్రసాదించును గాక.

-'హరనాథభక్తపరమాణువు'.

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు-18)న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# వంట చేస్తూనే విశ్రమించండి

ಅಡಿಗೆಯು ನಿಮಗೆ ಭೀಕರ ಶ್ರಮವಾಗಿರ ಬಲ್ಲುದು, ಈ ಆಶ್ಚರ್ಯಕರ ಕಿರೊಸಿನ್ ಕುಕರ್ ಸೌಕರ್ಯವನ್ನು ನೀವು ತಿಳಿದು ಕೊಳ್ಳುವವರೆಗೆ. ಬೇಕಾದ ಕಾಲದಲ್ಲಿ ಅಡಿಗೆ ಮಾಡಿರಿ—ಪರಿಶ್ರಮವಿಲ್ಲ.

ಕಲ್ಲಿದ್ದಲನ್ನು ಮುರಿಯ ಬೇಕಾಗಿಲ್ಲ, ಬೆಂಕಿ ಊದ ಬೇಕಾಗಿಲ್ಲ, ಕಣ್ಣಿಗೆ ಹೊಗೆಯಿಲ್ಲ ಮತ್ತು ಒಳ ಮೂಳಿಗೆಯಲ್ಲಿ ಮಸಿಯಾಗದು. ಈ ಹೊಸ ಕುಕರ್ ಸ್ವಚ್ಛ, ನೇರ ಮತ್ತು ಸರಳ-ದುಡಿಮೆ, ಚಿವರು ಅಥವಾ ಕಂಬನಿಗಳಿಲ್ಲ.




# ఖాస్ జనతా
## కిరోసిన్ కుక్కర్

వంట బాగా తేలికగా చేసుకోండి

ఉత్పత్తిదారులు:
**ఓరియంటల్ మెటల్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**
**77, బౌబజార్ స్ట్రీట్, కలకత్తా-12**

KALPANA O. M.15 TE

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ ౧౯౬౩, మే; శోభకృత్తు - వైశాఖము సంచిక ౧౧

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

| | | | |
|---|---|---|---|
| 740 పుటలు | శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తోలికూర్పు) | రూ. 7/50 |
| 496 పుటలు | శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) | రూ. 5/- |
| 144 పుటలు | శ్రీ శారదాదేవి | రూ. 1-25 |
| 312 పుటలు | శ్రీ శారదా ప్రసంగములు | రూ. 3-00 |
| 540 పుటలు | శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) | రూ. 3-50 |
| 432 పుటలు (సాదా) రూ. 3-50 | శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) | రూ. 4/- |
| 564 పుటలు | స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) | రూ. 5/- |
| 330; 324 పుటలు | సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) | రూ. 3/- |
| 402 పుటలు | పారమార్థిక సంభాషణలు | రూ. 3/- |

| | | | |
|---|---|---|---|
| శ్రీమద్భగవద్గీత ... | 4 00 | గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 0 50 |
| బ్రహ్మానంద బోధనలు ... | 3 50 | షికాగో నగరోపన్యాసములు ... | 0 50 |
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 50 | గురూపదేశములు ... | 0 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 50 | శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 40 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- | శ్రీకృష్ణవాణి ... | 0 40 |
| పరతత్త్వప్రసంగము ... | 2/- | క్రైస్తు సూక్తిమాల ... | 0 40 |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 25 | శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 40 |
| ప్రబోధరత్నాకరము ... | 2 25 | నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 0 37 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- | శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 37 |
| దేవీమాహాత్మ్యము ... | 2/- | నా సంస్కారణ యుద్ధవిధానము ... | 0 37 |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 1 50 | శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 0 25 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 1 75 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... | 0 25 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 1 25 | పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 25 |
| హిందూ మతము ... | 1 25 | నవీన భారతదేశము ... | 0 25 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 25 | తాపత్రయ చికిత్స ... | 0 25 |
| వివేక సూర్యోదయము ... | 1 25 | పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 0 19 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- | సర్వం విష్ణుమయం జగత్ ... | 0 19 |
| భారతీయ మహిళ ... | 1/- | శ్రీ రామకృష్ణ ఆరాత్రికము ... | 0 12 |
| కఠోపనిషత్తు ... | 0 80 | శ్రీరామనామసంకీర్తనము 0 6 యతిగీతము | 0 6 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 75 | నామతము 0 6 వి. సింహగర్జనము | 0 3 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేపరి కొన్నచో: రూ. 18-50)
ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,
వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)
అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4




'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీవ ననుభౌవ్య మశును వత్స.'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౩ - మే :: శోభకృత్తు - వైశాఖము { సంచిక ౧౧

శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

(మార్చినెల సంచిక తరువాయి)

శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌ శేఖరతయా
మ మా ప్యేతౌ మాత శ్శిరసి దయయా ధేహి చరణౌ
యయోః పాద్యంపాథః పశుపతిజటాజూటతటినీ
యయో ర్లాక్షాలక్ష్మీ రరుణహరిచూడామణిరుచిః ॥ ౮౪

| | | | |
|---|---|---|---|
| మాతః | అమ్మా | యయోః | వేనికి |
| యౌ | ఏ | పాద్యంపాథః | ప్రక్షాళనార్థ జలమో |
| తవ | నీ | అరుణ | ఎఱ్ఱనైన |
| చరణౌ | పాదములను | హరిచూడామణిరుచిః | విష్ణుదేవుని తలమానికపు కాంతి |
| శ్రుతీనాం | వేదముల | | |
| మూర్ధానః | శిరములు (ఉపనిషత్తులు) | యయోః | వేనికి |
| శేఖరతయా | శిరోభూషణములుగా | లాక్షాలక్ష్మీః | లత్తుకకాంతియో |
| దధతి | తాల్చునో | ఏతౌ చరణౌ | ఆ (నీ) పాదములను |
| పశుపతి | పరమశివుని | మమ శిరసి అపి | నా తలపైనిగూడ |
| జటాజూట | జడలముడియందలి | ధేహి | ఇడుమా. |
| తటినీ | నది (గంగ) | | |

తా. అమ్మా, పరమశివుడు నీకు మ్రొక్కినప్పుడు ఆయన జడలముడియందలి గంగా జలము నీ చరణములను ప్రక్షాళించును. శ్రీమహావిష్ణువు నీకు మ్రొక్కినప్పుడు ఆయన తలమానికపు కెంజాయ నీ చరణములపైని పర్వి వానికి తాను లత్తుక పారాణి యగును. వేదములకు నీ చరణములు శిరోభూషణములుగ నున్నవి. అట్టి నీ చరణములను దయచేసి నా తలపై నికూడ నిడుమా.

నమోవాకం బ్రూమో నయనరమణీయాయ పదయో
స్తవాస్మై ద్వన్ద్వాయ స్ఫుటరుచిరసాలక్తకవతే
అసూయత్యత్యన్తం యదభిహననాయ స్పృహయతే
పశూనామీశానః ప్రమదవన కఙ్కేళి తరవే ॥ ౮౫

| | | | |
|---|---|---|---|
| (భగవతి) | (అమ్మా) | స్ఫుట | ఉజ్జ్వల |
| | ఏ (నీ) పాదముల | రుచిర | ప్రభగలదియు |
| అభిహననాయ | తాపుతినుటకు | సాలక్తకవతే | లత్తుకపూతకలదియు అగు |
| స్పృహయతే | కోరునట్టి | అస్మై | ఈ |
| ప్రమదవన | పూదోటయందలి | తవ | నీ |
| కఙ్కేళి తరవే | అశోకవృక్షముపట్ల | పదయోః | పాదముల |
| పశూనామ్ ఈశానః | పశుపతి | ద్వన్ద్వాయ | యుగళికి |
| అత్యన్తమ్ | మిక్కిలి | నమోవాకమ్ | 'మ్రొక్కుచున్నార' మనుటను |
| అసూయతి | ఈర్ష్యచెందుచున్నాడో | బ్రూమః | పల్కుచున్నాము |
| నయన | కన్నులకు | | మ్రొక్కుచున్నామనుట. |
| రమణీయాయ | ఇంపైనదియు | | |

తా. అమ్మా, ఉజ్జ్వలప్రభయు లత్తుక పారాణియు గల నీ పాదయుగళి నయనరమణీయముగ నున్నది. దాని తాపు తినుట తనభాగ్యలభ్య మని భావించు పరమశివుడు, ఆ భాగ్యము నకే ఆశపడు మీ పూదోటయందలి యశోకవృక్షముపట్ల మిక్కిలి అసూయ చెందును. (అశోకమునకు మగువకాలితాపు దోహదము).

మృషా కృత్వా గోత్రస్ఖలన మథ వైలక్ష్యనమితమ్
లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే
చిరా దన్తశ్శల్యం దహనకృత మున్మూలితవతా
తులాకోటిక్వాణైః కిలకిలిత మీశానరిపుణా ॥ ౮౬

| | | | |
|---|---|---|---|
| (భగవతి) | (అమ్మా) | లలాటే | నుదుట |
| మృషా | ఆకస్మికముగనే | తాడయతిసతి | ప్రహరింపగా |
| గోత్రస్ఖలనం | మఱొకతెపేరుచెప్పు తప్పును | దహనకృతమ్ | కాల్చుటవలనగల్గి |
| | | చిరాత్ | చిరకాలముగనాటియుండిన |
| కృత్వా | చేసి | అన్తశ్శల్యమ్ | గుండెలోని బాణమును |
| అథ | అంతట | ఉన్మూలితవతా | పెఱికికొన్న |
| వైలక్ష్య | కింకర్తవ్యతామూఢుడై | ఈశానరిపుణా | మన్మథునిచేత |
| నమితమ్ | ప్రణమిల్లిన | తులాకోటి | అందెగజ్జెల |
| భర్తారం | పతిని | క్వాణైః | ఘల్లులరూపమున |
| తే | నీ | | జయఘోష చేయబడినది. |
| చరణకమలే | పాదపద్మములు | | |

తా. అమ్మా, నీ పతి పరాకున వేఱొకప్రియురాలి పేరు చెప్పును. అంతలోనే తన పొరపాటును గ్రహించును. ఇక చేయుటకు వేఱేమియు లేక నీకు మ్రొక్కును. నీవు నీ పాద పద్మములతో అతని నుదుటిపై ప్రహరింతువు. అప్పుడు నీ పాదనూపురములు ఘల్లు మని మ్రోయును. ఆ మ్రోత ఎట్లుండు ననగా — తాను కాల్పబడిననాటినుండి తనగుండెలో నాటియుండిన అలుగును పెఱికివేసికొని, బాధ తీఱగా, మన్మథుడు విజయద్యోతకముగ కావించిన కిలకిలారవము - అన దగి యుండును.

హిమానీహన్తవ్యం హిమగిరినివాసైకచతురౌ
నిశాయాం నిద్రాణం నిశి చరమభాగే చ విశదౌ
పరం లక్ష్మీపాత్రం శ్రియ మతిసృజన్తౌ సమయినాం
సరోజం త్వత్పాదౌ జనని జయత, శ్చిత్ర మిహ కిమ్ ॥ ౮౭

| | | | |
|---|---|---|---|
| జనని | అమ్మా | హిమానీ | మంచుమొత్తముచే |
| హిమగిరినివాస | మంచుకొండలో వసించుటలో | హన్తవ్యమ్ | నాశిల్లునదియు |
| | | నిశాయామ్ | రాత్రియందు |
| ఏకచతురౌ | ముఖ్యముగా సమర్థములును | నిద్రాణమ్ | ముకళించుకొనునదియు |
| నిశి | రాత్రియందును | పరం | ఇంచుకగ |
| చరమభాగే చ | తుదిజామునందును | లక్ష్మీపాత్రమ్ | రమాధిష్ఠితమునగు |
| విశదౌ | వికసించియుండునవియు | సరోజం | పద్మమును |
| సమయినామ్ | స్వభక్తులకు | జయతః | గెల్చును |
| శ్రియమ్ | సిరిని | ఇహ | ఇందు |
| అతిసృజన్తౌ | కొల్లగనిచ్చునవియు అగు | కిమ్ | ఏమి |
| త్వత్పాదౌ | నీ చరణములు | చిత్రమ్ | ఆశ్చర్యము ! |

తా. అమ్మా, ద్మము మంచుచే నాసిల్లును, నీ చరణములు మంచుకొండలో సదా సంచరించుచుండగలవి. పద్మము రాత్రి ముకుళించుకొనును, నీ చరణములు సదా వికసించి యుండును. లక్ష్మిని నిల్పుకొనునది పద్మము, స్వభక్తులకు లక్ష్మిని కొల్లగ నిచ్చునవి నీ చరణములు. అట్టి నీ చరణములు పద్మమును గెల్చునన్నచో; అం దాశ్చర్య మే మున్నది?

పదం తే కీర్తీనాం ప్రపద మపదం దేవి విపదాం
కథం నీతం సద్భిః కఠినకమఠీకర్పరతులామ్
కథం వా బాహుభ్యా ముపయమనకాలే పురభిదా
య దాదాయ న్యస్తం దృషది దయమానేన మనసా ॥ ౮౮

| | | | |
|---|---|---|---|
| దేవి | అమ్మా | | పొందింపబడినది |
| కీర్తీనాం | కీర్తులకు | దయమానేన | కరుణావిష్టమగు |
| పదమ్ | స్థానమును | మనసా | మనస్సుతో |
| విపదామ్ | ఆపదలకు | పురభిదా | సదాశివునిచేత |
| అపదమ్ | అస్థానమును అగు | ఉపయమనకాలే | వివాహసమయమున |
| తే | నీ | బాహుభ్యాం | చేతులతో |
| ప్రపదం | పాదాగ్రము | యద్ | ఏ (అ) పదమును |
| సద్భిః | కవీంద్రులచేత | ఆదాయ | గ్రహించి |
| కఠిన | గట్టి | కథం వా | ఎట్లు |
| కమఠీకర్పరతులాం | తాబేలువీపుచిప్పతోడి సమానత్వమును | దృషది | సన్నికంటిపై |
| | | న్యస్తమ్ | పెట్టబడినది? |
| కథం | ఎటు | | |

తా. అమ్మా, నీ పాదాగ్రము కీర్తులకు స్థానము, ఆపదలకు అస్థానము. దానికి కవులు కఠినమైన తాబేటిమూపుచిప్ప నుపమానముగ చెప్పుదురే, అ దెట్లు పొసగును? శివుడేమో సదయచిత్తుడే కదా, మఱి పెండ్లియప్పుడు నీ పాదమును పట్టుకొని సన్నికంటిపై ఉంచుటకాయనకు చే యెట్లాడెను?

నఖై ర్నాకస్త్రీణాం కరకమలసంకోచశశిభిస్
తరూణాం దివ్యానాం హసత ఇవ తే చ ణ్డి చరణౌ
ఫలాని స్వఃస్థేభ్యః కిసలయకరాగ్రేణ దదతాం
దరిద్రేభ్యో భద్రాం శ్రియ మనిశ మహ్నాయ దదతౌ ॥ ౮౯

| | | | |
|---|---|---|---|
| చణ్డి | భగవతీ | | చందమామలగు |
| దరిద్రేభ్యః | పేదవారికి | నఖైః | గోళ్ల చేత |
| భద్రాం | అమందమైన | కిసలయ | చిగురనెడి |
| శ్రియం | | కరాగ్రేణ | చేతికొనచేత |
| అనిశమ్ | సదా | స్వఃస్థేభ్యః ఏవ | స్వర్గలోకస్థులకుమాత్ర |
| | శీఘ్రముగా | ఫలాని | పండ్లను |
| దదతౌ | ప్రసాదించునవగు | దదతాం | ఇచ్చునట్టి |
| | నీ | దివ్యానాం తరుణామ్ | స్వర్లోకవృక్షములను (జూచి) |
| చరణౌ | పాదములు | | |
| నాకస్త్రీణామ్ | వేల్పుటింతుల | హసత ఇవ | (పరి)హసించుచున్నట్లున్నవి. |
| కరకమల | కేలుదామరలను | | |
| సంకోచ | ముకుళింపచేయుటలో | | |

తా. అమ్మా, స్వర్గలోకమందున్న కల్పవృక్షములు తమ ఫలములను అక్కడనున్న వారికిమాత్రమే ఇచ్చును. మఱి నీ చరణములు ఎంతటిపేదవారికైననుసరే, అమందమైన సంపద నిచ్చును, వెంటనే ఇచ్చును, సదా ఇచ్చును. కల్పవృక్షములను జూచి నీ చరణములు నవ్వుచున్నవి. వానిగోళ్లే ఆ నవ్వు. చందమామ చేయు పనిని ఆ గోళ్లు చేయును. చందమామ పద్మములను ముకుళింపజేయును. నీ పాదనఖములు సురాంగనలకరకమలములను ముకుళింపజేయును. వారు నీ పాదాలకు మ్రొక్కుదు రనుట.

# శ్రీ వివేకానందయతీంద్రసంస్తుతి

## విద్వాన్ సత్కవి శ్రీ నారునాగార్యజీ

కం॥ వేదాంత డిండిమ స్ఫుటనాదము వేధోండగర్భ - నాళీకసము
ద్భేదగతిన్ మ్రోగించి శుభోదర్కజయధ్వజమ్ము - నుంపవె! మౌనీ! ౧

మ॥ సకలాశావలయీకృతాంగల మహాసామ్రాజ్యనేతల్, సమ
స్తకళాకోవిదులయ్యు, నీశ్వరజటాంతర్లీననాకాపగా
ధికధారాతులితేద్ధవాఙ్ముఖమహోద్దేశమ్ములన్ గాంచి వా
రకటా! ముగ్ధవిమోహబాలకులు కారా త్వత్సమక్షమ్మునన్! ౨

శా॥ నీ మూలమ్మున సర్వదేశములు రాణించెన్ గదా! భారతీ
యామూల్యాగమశాస్త్రనిర్వచన శక్త్యాదుల్ విజృంభించి వ
హ్వా! మధ్యాహ్నపిచండమండలక మార్తాండ ప్రచండోగ్ర తే
జోమూర్తిన్ నిను జాఁగి మ్రొక్కరె బుధుల్ జోహారు లర్పించుచున్. ౩

శా॥ ఊరుం బేరుఁ బ్రతిష్ఠలేని జను లెంతోమంది జన్మించి యు
న్నా రీ విశ్వ మదెల్ల వారి నెవరైనన్ లెక్కిడన్ జాలిరే?
పేరుం బెంపు మదింపు నింపు సకలోర్వీచక్రనిర్వక్ర వి
స్ఫారకీర్తిపతాక నిల్పెనొకొ యుష్మత్సామ్య మెక్కం డునేన్? ౪

# శ్రీవివేకానందమరందబిందువులు (౪)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

ఆహా! మీ స్వస్వరూపము మీకుఁ దెలిసినచో నెంత మేలై యుండెడిదో కదా! మీరాత్మలు, సాక్షాద్భగవత్స్వరూపులు. నేనెప్పుడైన నపరాధము చేసితినని భావించునో, అది నేను మిమ్ము మానవు లనునప్పుడే.

నేను సత్యము నారాధింతును. సత్యమున కెప్పుడు నసత్యముతోఁ బొత్తు కుదురనేరదు. సమస్తప్రపంచము నాకెదురై నిల్చినను, సత్యమే తుదకు విజయము నందునది.

ఈ విశ్వము పిఱికిపందలకై యుద్దేశింపఁబడినది కాదు. పాఱిపోఁ జూడకుఁడు. విజయమునుగాని, యపజయమునుగాని లక్షింపకుఁడు.

ప్రతీకారమునుగూర్చి కాని, ద్వేషమును గూర్చి కాని నేనెన్నఁడును బలుకలేదు, బలమునుగూర్చియే సదా చెప్పుచున్నాను. ఈ సముద్రపుఁ దుంపరలలో నొకకణముపైఁ బగ సాధింపవలయునని మన మెన్నఁడైనను దలఁతుమా? కాని దోమ కది యొక విశేషము గావచ్చును!

లెండు, కార్యభారమును వహింపుఁడు — ఎంతకాల మీ మాంద్యము? మీరీప్రపంచమునకు వచ్చియుంటిరి కావున నేదియో కొంత జాడను దిగవిడిచి పొండు. కానిచో, మీకును శిలావృక్షాదులకును భేదమేమి? — అవియుఁ బుట్టి పెరిగి నశించుచున్నవి.

కల్లబొల్లి మాటలేల? పందిని నంది యననేల? పరమార్థమును దుచ్ఛప్రాపంచికవిషయములతో సమన్వయింపఁ జూచు యత్నమునకు మూలకారణము పిఱికితనము, పట్టిపిఱికితనము. ధైర్యమవలంబింపుఁడు. నావత్సలు ధైర్యశాలులై యుండవలయును. నిర్భయులై వేదశాస్త్రములందలి తత్త్వములను బాహాటముగా జనులకు బోధింపుఁడు. మీ గౌరవము పోవు—నని కాని, జనులకు మీయందు ద్వేషము కలుగు నని కాని భయపడకుఁడు. ఇంచుకయు వ్యామోహమునకుఁ జిక్కక సత్యారాధకులై యున్నచో, మీ కలౌకిక బలము కలుగును. అసత్యములని మీరు నిరసించు విషయముల నపుడు మీ యెదుటఁ బ్రస్తావింప జనులు భీతిల్లుదురు. పదునాలుగేండ్లచంచలదీక్షతో సత్యమును మీరు పరిపాలించునెడల, జనులు మీరేమి చెప్పినను విశ్వసించి శిరసావహింతురు. ఇట్లు వర్తించినచో, దేశీయులను బంధవిముక్తుల నొనర్చి, దేశోద్ధారకులై, లోకమునకు మహోపకారము నొనర్చిన వారలయ్యెదరు.

ఇనుపకండరములు, ఉక్కునరములు, తదంతరమున వజ్రాయుధతుల్యమగు మనస్సు— నాయనలారా, ఇవియే మనకు వలయునవి!

అసత్యముకంటె సత్యము కోటిరెట్లు ఘనతరము; సౌజన్యవిషయముకూడ నిట్టిదే. ఇవి నీయొద్ద నున్నచో, నివియే యప్రయత్నముగా మార్గమును నిర్మించును.

సత్యమెచటికి నిన్ను గొనిపోయినను వీడకుము; నీయాశయములవలన నేమి సంభవించినను వానిని విడనాడకుము. పిఱికిపందవును, ఆత్మవంచకుడవును గాకుము.

## శ్రీ వివేకానందమరందబిందువులు

ఏమి జరిగినను మన మేలుకొఱకే యను మనోభావమును—ఆశావాదము—నవలంబించి, ప్రతివస్తువునందును ప్రతివ్యక్తియందునుగల మంచిని గనుగొన ప్రయత్నింపవలయును. కూలబడి మన మనశ్శరీరదౌర్బల్యమునుగూర్చి విలపించినచో నేమియు లాభములేదు; విఘాతములను ప్రతికూలపరిస్థితులను నణచు వీరప్రయత్నమే మనల నాత్మోన్నతి నొందించును.

యాగములును, దండవత్ప్రణామములును, గొణుగు కొనుటలును మతము—ధర్మము—కానేరవు. ధైర్యముతో జక్కని వీరకృత్యముల నవి మనచే జేయించుచు, నాత్మపరిపూర్ణత దెసకు మనభావములను గొనిపోయిననే యవి మంచివి.

మొదట మనము దేవతలము — సాక్షాద్భగవత్స్వరూపులము — గావలయును; ఇతరులు నట్లగుటకు దోడ్పడవలయును. ''ఐ, చేయు'' మనునదియే మన మూలమంత్రము కావలయును.

హనుమంతుని యచంచల భక్తియే దేశమున కిపు డావశ్యకము. కాని మీరేమి చేయుచున్నారు? మృదంగ, కరతాళములతో నేవో పిచ్చిపిచ్చిపదములను బాడుచు జిందులు ద్రొక్కు— శారీరమానసికబలహీనులతోఁగూడు కొనియున్నది మీజాతి నేడు! బృందావన గోపికాభక్తిని,— ఆమహాకఠినసాధనను,— కామలేశమైనను లేని మహోత్కృష్ట మధురభావమును—మీ కామాదినీచప్రవృత్తు లన్నిటితో ననుకరింప యత్నించుచున్నారు! ఫలితమేమి? దేశమంతయు తమోంధమునఁబడి తల్లడిల్లుచున్నది. చిన్ననాటినుండియు నహర్నిశ మీగీతములను జావళీలను విని విని దేశమంతయు నిర్వీర్యమైపోవుటలో నాశ్చర్యమేమి? దేశమున పౌరుషమడుగంటినదే! ఇంతకంటె నధఃపతనము వేఱుండునా? మీఢక్కలు, ఢోలులు, కాహళలు, తూర్యభేరీలు నేఁడేమైనవి? వీనిని మఱల దేశములోనికి దీసికొని రాజాలరా? మీయువకులను, బిడ్డలను శౌర్యోత్తేజకములగు వాని గంభీరస్వనములను విననిండు. భారతపుత్రులారా, నేడు మనము ధైర్యోత్సాహజనకములగు బ్రహ్మరుద్రతాళములను వాయించి డమరును ప్రయోగింపవలయును. ''హర! హర! మహావీర! వ్యోమ! వ్యోమ!'' యనునినాదములచే భూమ్యాకాశములను గంపింపజేయవలయును. ప్రస్తుతము కరుణరసాదులను బురికొల్పు గీతగానములను విరమించి 'ధ్రువపదాదిస్వరములతో' గూడిన వీరరసాన్వితగీతములను, జనులు వినవలయును, బాడవలయును. వేదగంభీరఘోషచే దేశమును బునర్జీవింపజేయవలయును. మనము చేయు ప్రతికార్యమునందును సుస్థిరధీరత్వము పొందుపడియుండవలయును. ఇట్టి ధీరాదర్శము నవలంబించినప్పుడే మాతృదేశక్షేమము మనకు గరతలామలకమగును. నీ వొక్కఁడవైన నిట్టి మహోత్తమాదర్శమును నీవర్తనమున జూపగల్గినచో, వందలకొలది నిన్ననుసరించితీరుదురు. కాని క్షణమైనను ధర్మమార్గమునుండి చలింపకుము; దౌర్బల్యమును విసర్జింపుము. నీజీవితచర్యలలో నిత్యము ధైర్యసాహసములు గల్గియుండుము. ఇదియే పరమేశ్వరీకటాక్షము లభించుమార్గము.



# శ్రీ ప్రేమానందస్వామి

## [సంపాదకీయము]

(గతసంచిక తరువాయి)

ఒకనాడు ఇరువదినాల్గు పరగణాల జిల్లా లోని డైమండుహార్బరునుండి ఒకమహమ్మదీయుడు కొందఱు హిందుమిత్రులగూడి మఠమునకు వచ్చెను. గుడిలోనికి పోయివచ్చిన తర్వాత కొంతప్రసాదము ఆకులో పెట్టి అతని కీయబడెను. అతడు భుజించిన తర్వాత ఆ ఆకును ఎత్తివేసి చోటును శుద్ధిచేయుటకు అక్కడ ఉన్న వా రందఱును వెనుకడుగుపెట్టు చుండిరి. దానిని గుర్తించి శ్రీప్రేమానంద స్వామి బిరబిర వచ్చి ఆపనులను స్వయముగా తానుచేసి వైచెను. చూచి ఎల్లరును అచ్చెరువును సిగ్గును చెందిరి. 1917 లో తూర్పు బంగాళమునకు ఆయన పోయియుండినప్పుడు ఇట్టి సంభవమే మఱొకటి జరిగినది. మైమెన్సింగులో ఒకపల్లెకు స్వామి పోయియుండెను. ''అందఱిహృదయాలలోఉన్న దేవుడొక్కడే'' అని స్వామి చెప్పుచుండగా విని ఒక మహమ్మదీయుడు ''అటులేని స్వామి నేను తాకిన అన్నమును తా మారగింపగలరా'' అని అడిగెను. వెంటనే స్వామి 'తప్పక ఆరగింపగల' ననెను. తత్క్షణమే అత డొక పళ్ళెరమున కొంత అన్నమును తెప్పించి తనచేతులతో అర్పింపగా ఎట్టి జంకును కొంకును లేక స్వామి ఆరగించెను.

మఠసంస్థ పెద్దది. అం దున్న వారి చిత్తవృత్తులు స్వభావములు వివిధములుగనుండును. అట్టి సంస్థను నిర్వహించుటకు స్వామికి ఎంతో ఓర్పు క్షాంతి సహనము ఆవశ్యకములాయెను. ఐనను ఆయన సామర్థ్యమున క దొక లెక్కలోనిది కాదు. నిత్యకృత్యము ల నెట్టి చిత్తముతో తాను నిర్వహింపబూనునదియు ఆయన ఒకనాడు మఠములోని ఒకవృద్ధస్వామి కిట్లు తెల్పుచుండెను. ''ధ్యానజపములముగించుకొని గుడిమెట్లు దిగి వచ్చునప్పుడు 'ఓర్చుకో, ఓర్చుకో, ఓర్చుకో ఓర్పుగలవాడు, నిలువగలడు, ఓర్పులేనివాడు నశించును' అనెడి గురుదేవుని మంత్రమును మరల మరల వల్లింతును''. గర్వాహంకారాలు జాడగానైనలేక, తాను గురుదేవునిచేతి పనిముట్టు అని ఆయన భావించెడివాడు. ఉదాత్తమైన ఆయన పారమార్థిక దృష్టిలో ఈలోక మొక దివ్యజ్యోతిచే కప్పబడియుండెను. ఇందుండి పాపము పరారి అయ్యెను. ఇతరులతప్పులందు ఆయన తనతప్పులనే గుర్తించెను. పెక్కు లేఖలలో ఆయన ఇట్లు వ్రాసెను.

''గురుదేవుని పాదములొద్ద నేను నేర్చుకొన్న పాఠ మిది పిల్లలు తప్పు చేసినప్పుడు నేను వాదించి, తప్పు చేసినది వారు కా దని నిర్ణయింతును. ఉన్న తప్పు నాదే. 'నేను మంచివాడ' నను భావమును చేరనీయను నేను వచ్చియుండునది జ్ఞానము గడించుటకు. జ్ఞానమునకు అంతులేదు. విషయములను మంచి

రీతిలో అర్థముచేసికొను శక్తిని గురుదేవుడు మన కనుగ్రహించును గాక — ఇదే నా ప్రార్థన. ......ఒరులలోని తప్పులపై కన్నుంచితిమేని క్రమముగా అవి మన కంటుకొనును. ఒరుల లోని తప్పులను కనిపట్టుటకును వారిని సరిదిద్దు టకును మనము రాలేదు. జ్ఞానసంపాదనకే మనము ఈలోకమునకు వచ్చియున్నాము.... దేవా, సర్వమును నీవే. నే నెవరిని దూషింతును? సమస్తమును అతడే. పైనుండు మట్టి ఒకచో ఎక్కువగను ఒకచో తక్కువగను ఉండ వచ్చును కాని, లోనుండు బంగార మొక్కటే.''

వినయమార్దవము లింతగా ఉన్నను, సమయము వచ్చినప్పుడు ఆవశ్యకతను బట్టి స్వామి కఠినుడుగను ఉండగలడు. తియ్యనిమాటలను ప్రేమబోధలను పెడచెవిని పెట్టి దారితప్పిన వారిని తీవ్రముగ ఖండించుట కాయన వెనుదీయడు. కాని నొప్పింపవలె నని చెప్పుమాట కాదది. ఒకవేళ మాటపడ్డవాడు బాధపడినచో, వెంటనే ఆయన మంచి మాటలు చెప్పి, మంచివస్తువులు తినబెట్టి అతనిని ఓదార్చును.

దేవగడములో తుదిదినాలలో ఆయన వ్యాధిగ్రస్తుడుగ నుండినప్పుడు, ఒకానొక భక్తుడు దొరకిన శ్రేష్ఠభక్ష్యములను తెచ్చి స్వామిపరిజనుల కిచ్చుచుండెను. దానిని తిన్నందు కొకనాడు స్వామి ఒక పరిచారకుని ఇట్లు మందలించెను. 'సాధువుకు కామలోభము లుండ రాదనియు, సాధువు రాత్రి సగము కడుపునకుభుజింపవలెననియు గురుదేవుడు చెప్పుచుండెడివాడు. కాని జిహ్వాచాపల్యముచే నీవు అందుకు వ్యతిరిక్తముగ చేయుచున్నావు''. ఈ మాటలకు ఆపరిచారకుడు నొచ్చుకొని ఎవరితోను చెప్పక ఎక్కడకోపోయెను. మధ్యాహ్న భోజన మప్పుడు స్వామి ఆపరిచారకుడు లేడని గుర్తించెను, ఆందోళనచెందెను. తా నన్న మాటకు రోషపడి ఆ యువకుడు వెడలిపోయెనని స్వామి అనుమానించెను. అతనిని వెదకి పిలుచుకొని రండని స్వామి ఇతరపరిచారకుల నంపెను, కాని వా రతనిని కనుగొనలేక మరలి వచ్చి వేసిరి. సాయంకాలము స్వామి విష ణ్ణుడై కూర్చుండియున్నప్పుడు, ఆపాతిపోయిన వాడు వెనుకటి వాకిలిగుండ ఇంటిలోనికి వచ్చెను. వచ్చె నని విని స్వామి అతనిని తన చేరువకు పిలిచి "అబ్బాయి, నాకు వయసైనది, వ్యాధిచే బలము తగ్గినది. కోపమును సదా అణచుకోలేకున్నాను. ఈదశలో నే నే మేని అన్నంతమాత్రమున నీవు కోపావిష్టుడవు కావలసినదేనా?'' అనెను. ఈ మాట లనునప్పుడు స్వామి నేత్రములు బాష్పపూర్ణము లైనవి. అంత స్వామి తానే కొన్ని మధురభక్ష్యముల తెచ్చి అతనికి తిన బెట్టెను.

నడవడిలో ప్రశాంతత్వ ముండ వలె నని స్వామి ఎంతయు నొక్కి చెప్పుచుండును. "సాధువులుగ నుండ గోరుచు రేని మొదట ప్రశాంతత అలవడవలె'' నని ఆయన మాటికి మాటికి చెప్పును. "ఈదినాలలో నడవడిలో ప్రశాంతతను మామూలు సంఘమర్యాదలును ఎవరును లక్ష్యపెట్టుట లేదు. మా గురుదేవుడెంతో మెలకువతో మాకు నేర్పిన వివే'' అన్నాడు. స్వామి ధాటీమండితభావప్రపూర్ణ ప్రవచనములచే శ్రీరామకృష్ణ వివేకానందుల ఆదర్శాలను మఠములో క్రొత్తగ ప్రవేశించిన వారి డెందములలో హత్తుకొన చేయుచుండెను.

శ్రీవివేకానందస్వాముల నియమానుసారము శ్రీప్రేమానందస్వామి తనజీవితకాలమున సొంతమునకు శిష్యులను ఏర్పఱచుకొననేలేదు. కాని ఆధ్యాత్మికమార్గప్రయాణికుల కందఱికిని తోడ్పడవలెననెడి ఆయన ఆత్రము నిరుపమానము. తన పర్యవేక్షణములో విచారణలో ఉన్న కుఱ్ఱవాండ్ర ఆధ్యాత్మికక్షేమము పట్ల ఆయనకుండిన ఉబలాటము ఆయన చేసిన ప్రతిపనిలోను తెలియనగుచుండెడిది. ఒకయువసన్న్యాసికి స్పర్శమాత్రముచే ఆయన ఆధ్యాత్మికశక్తి సంక్రమింపజేసెనట. తాను తోడ్పడుటే కాక, మంత్రోపదేశము సేయుమని తన్ను తొందరపెట్టిన వారిని ఆయన మాతృశ్రీయొద్దకో శ్రీబ్రహ్మానందస్వాములయొద్దకో పంపి మంత్రోపదేశము చేయించుచుండెను.

తాను నెలకొల్పిన మిషను భారతదేశపునుద్ధరణనూతనోత్సాహమునకు కేంద్రము కావలెననియు, బేలూరుమఠ మొక్క గొప్ప విద్యాపీఠము కావలెననియు, అందుండి ఉదాత్తోత్సాహప్రదాశయములు వెలువడవలెననియు—శ్రీవివేకానందస్వామి కలలు కనుచుండెడివారు. ఆయన కలలుకనుచుండినదానిలో ఒక కొంతను సాధించుటకు, అనగా మఠము నొక గొప్పగీర్వాణవిద్యాపీఠముగ మార్చుటకు, శ్రీప్రేమానందస్వామి ఎంతయు ప్రయత్నించెను. ఆయన ప్రయత్నాల ఫలముగా మఠమున సమర్థుడగు నొక పండితుని యాధ్వర్యమున నొక పఠనసభ క్రమముగా ఏర్పడెను. పాశ్చాత్యతత్త్వశాస్త్రమువంటి యితర విషయముల పరిశోధననుకూడ ఆయన ప్రోత్సహించెను. పామరప్రజలలో విద్యను వ్యాపింపజేయుటయందుకూడ ఆయన కెంతో ఆసక్తి. అట్టి పనులకు ఎవరు పూనుకొన్నను స్వామి దీవించి ప్రోత్సహించెడివాడు. ఒకానొకరికి ఆయన ఇట్లు వ్రాసెను :—

''జ్ఞానమును వ్యాపింపజేయు మార్గమునకు మీరు వెలుగొసంగువార లగుదురు గాక. సాధువుల గోష్ఠిలో అలవఱచుకొన్న జ్ఞానము దేశమున కొక క్రొత్తరూపు నొసగును. బాలురు తమ జీవితలక్ష్యములను సరిగా నిశ్చయించుకొందురు. అట్లు చేయుటచేతనే బాలురు మానవు లగుదురు. అంతే కాదు ఋషు లగుదురు. వేల్పు లగుదురు. ఒక్కబడిని మూడు నాలుగు సేవాశ్రమములను ఏర్పఱచినంతనే ఏమైనట్లు? భగవంతునికృపయందు విశ్వాసము కలిగియుందుము. ప్రతిగ్రామములోను పల్లెలోను పట్టణములోను బడులను సేవాశ్రమములను నెలకొల్పుము.''

స్వామిది యోగిదృష్టి. మహిళలందఱును ఆయనకంటికి దివ్యమాతృస్వరూపిణులే. వారిపట్ల అతనిప్రవర్తన అక్షరాలా ఒక ఆరాధకుని ప్రవర్తనయే. వారి సన్నిధానములో ఆయన ఒకశిశువువలె నడచుకొనెడివాడు. ఆయన అమాయికరీతులును నిష్కళంకస్వచ్ఛతయు మహిళోచితమైన ఒకసొంపును స్పృహణీయతయు మహిళలనుఆకర్షించెడివి. ఆయనసన్నిధానమున మహిళలు ఎట్టిబెదురునులేక నుండెడివారు. ఘోషానియమములను తు. చ. తప్పక పాటించు కొన్నిసంపన్నమహమ్మదీయకుటుంబములలోని మహిళలు సైతము ఆయన ప్రవచనములను వినుటకు ఢాకా మఠమునకుగాని కలకత్తా మఠమునకుగాని వచ్చెడివారు. శ్రీవివేకానందస్వామి కఱపినలక్ష్యములు ఈయన మనస్సునకు బాగుగ నెక్కినవి. మహిళలకు విద్యయు గౌరవమును లేనిదేశము గొప్పది కాజాలదు అని ఈయన గుర్తించెను. ప్రాచీన

మహిళాదర్శములను అనుసరింపు డని దేశమందలి తల్లులకు బోధించుటే గాక, చదువు నావశ్యకతను వారిమనసుల కెక్కింప ఆయన యెంతయు పాటుపడెడివాడు. ఒకానొక మహిళకు ఈలాగు జాబు వ్రాసెను. "బంగాళమునుండి వేలకొలది నివేదితలు వెలువడుదురు గాక. మనదేశమున క్రొత్తగా అసంఖ్యాకలైన గార్గులు, లీలావతులు, సీతలు, సావిత్రులు ఉద్భవింతురు గాక! ఈభువిని విద్యను మించిన దేమి కలదు? జ్ఞానమును కలిగింపుడు. అది అలవడినకొలదియు అజ్ఞానము అంతరించును".

శ్రీరామకృష్ణుని శిశువులను (శిష్యులను) కలిపియున్న బంధములో ప్రేమతంతువులును గౌరవతంతువులును సమానముగ నుండును. సోదరశిష్యులందలి ఈ పూజ్యభావము శ్రీప్రేమానందస్వామిలో ప్రత్యేకముగ ప్రకాశించెడిది. మిషను ప్రెసిడెంటగు శ్రీబ్రహ్మానందస్వామి సన్నిధానమున ఆయన పరమ విధేయుడగు కింకరుడుగ మెలగెడివాడు. శ్రీ బ్రహ్మానందస్వామి మఠములో నుండెనేని, శ్రీప్రేమానందస్వామి ప్రతిదినము ఆయనకు సాష్టాంగముగ నమస్కరించినపిమ్మటనే తన దినకార్యక్రమమును తొడంగెడివాడు.

సుఖములపట్ల సన్న్యాసికి తప్పక ఉండవలసిన విరక్తి ఆయన కుండెడిది. భుజించుటకు కూర్చున్నప్పుడు తన పళ్లెరమందున్న మేలైన పదార్థములను తీసి మఠీయులలో పిన్నవారికెల్ల పంచిపెట్టెడివాడు. ఆయన గుడ్డలపెట్టెలో అప్పటికి కావలసినంతకంటె హెచ్చుదుస్తులు ఉండెడివి కావు. దేవగడమున. ఆయన వ్యాధిగ్రస్తుడుగ నుండినప్పుడు ఆయన కిమ్మని ఆయన సేవకునిచేతికి నాలుగు చొక్కాలను ఒకభక్తుడిచ్చెనట. ఇది తెలిసి ఆయన తన సేవకుని ఇట్లు చీవాట్లు పెట్టెను — "ఎక్కువ చొక్కాలు ఉంచుకొనుట నా వాడుకలో లేనే లేదు. అన్ని వస్త్రము లుండుట సన్న్యాసికి తగదు"—ఆయన నిర్యాణానంతరము కాగడాలు వెలిగించి వెదకినను ఆయనపెట్టెలో ఆయనకు స్మారకములుగ పదిలపఱచుకొన వీలగు ఒక ఖాళీసంచియు కొన్ని పుస్తకములును తప్ప మఱేమియు దొరక వాయెను.

ఇట్లు వెలికి కానరాక నిరాడంబరమైన జీవితమును స్వామి పెక్కేండ్లు గడపెను. మఠములో ఆఱేండ్లు సేవచేసిన పిదప 1910 లో ఆయన శ్రీశివానందతురీయానందస్వాములతో గూడి అమరనాథమునకుయాత్ర వెడలెను. యాత్రనుండి మరలిన పిమ్మట తన గురుదేవుని విశ్వసందేశమును ప్రచారము చేయుచు ఆయన బంగాళమందలి వివిధప్రాంతములలో పర్యటించెను. ఆపర్యటనములో ప్రజలలో ఆయన కలిగించిన యుత్సాహము ఇప్పటికిని పెక్కండ్ర స్మృతిపథమున నున్నది. ముఖ్యముగ తూర్పుబంగాళమునకు ఆయన పవిత్ర సాన్నిధ్య ప్రేమాశీర్వాదముల భాగ్యము లభించినది. పోయినచోటనెల్ల పెద్దలయు పిన్నలయు మాన్యులయు సామాన్యులయు డెందములలో ఆయన స్పృహణీయరూపము ఇక మఱవరాని రీతిలో హత్తుకొనెడిది. ఆయన పర్యటనము ఒకవీరుని జైత్రయాత్రను తలంపించెడిది. ఆగినచోటనెల్ల జనులు గుంపులు గుంపులుగా ఆయన చుట్టును మూగుచుండిరి. ఆయననోట వెలువడు ఉత్సాహకరములగు పల్కులను కొన్నింటినైన చెవిలో వేసికొనవలెనను ఆత్రముతో ప్రజలు వేకువజాము నుండి నడిరాత్రివఱకు ఎడతెంపు లేక వచ్చుచుండెడివారు.

ఈపర్యటనములో స్మరణార్హములును గుండెను కరగించునవియు నగు సంభవములు పెక్కు ఘటిల్లినవి. ఒక్కదానిని చెప్పగోరు చున్నాము. ఇందు ఆయన ఉదాత్తతయు సూక్ష్మదృష్టియు ప్రకట మగును. డాకాసమీపమున నొక పల్లెలో పాచిపట్టిన మురుగుడు నీటిగుంట ఉండినది. పల్లెలలో సాధారణముగ అనారోగ్యకారకము లవే. స్వామి తన వెంబడి నున్న యువకులను ఆనీటిని శుభ్రపఱుప నియోగించి అందుకు వారికంటె తాను ముందు పూనుకొనెను. ఆయనఆదర్శముచేత ఉత్సాహముప్పొంగ యువకు లందఱును తక్షణమే ఆ తటాకమును శుభ్రపఱచిరి. వారు అంతటితో ఆగలేదు. విక్రమపురమున పెక్కు గ్రామములో ఇట్టిమురుగుడు జలాశయముల శుభ్రపఱచుటకు తా మొక సభగా కూడిరి.

ఈదీర్ఘ పర్యటనముచేత ఆయన కారోగ్యము చెడెను. జ్వరగ్రస్తుడై మఠమునకు ఆయన మరలెను. వైద్యులు దానిని ప్రాణహారకమైన 'కళాఅజార్' వ్యాధిగా గుర్తించిరి. పరిసరములందు కొంత మార్పు ఉండనీ అని ఆయన దేవగడమునకు పంపబడెను. ఆవ్యాధితో ఆయన ఒకటిన్నరసంవత్సరములు బాధపడెను. ఆవ్యాధి తిరుగుముఖమునకు రానుండగా విషజ్వరమునకు ఆయన గుఱి యయ్యెను. ఆయనను కల్కత్తాలో బలరామ్బోసు నింటికి తెచ్చిరి. చేసిన వైద్యము పట్టలేదు. 1918–వ సంవత్సరము జూలై 30 తేది మంగళవారము మధ్యాహ్నానంతరము ఆయన సన్న్యాసులయు సోదరశిష్యులయు నెదుట భౌతికదేహము వీడి మహాసమాధి నొందెను.

ప్రాణహారకమైన వ్యాధిచే జిక్కి యున్నప్పుడును ఆయన విశ్వాసము క్షణమేనిమఱుగు పడలేదు. ఆరోగ్యము కల్గియున్నప్పటివలెనే రోగకాలమునసైతము ఆయన సదా "గురుకృపయే శరణము" అనుచుండెడివాడు. శ్రీరామకృష్ణుని నామమును జపించుచునే యుండెడివాడు. దృశ్యప్రపంచవస్తుపరంపరలో చూపు తగుల్కొన్న సామాన్యమానవుడు ఆయన అధిగమించిన ఆధ్యాత్మికోన్నతులకు కొలది యిడ లేడు. రత్నపువిలువ నగలవర్తకునికే తెలియును. శ్రీరామకృష్ణుడు అతనిని రత్నపేటిక అని పేర్కొనెడివాడు. కాని చూపు నడ్డునది అవిద్యాయవనికను తొలగింపగలదా?

ఆధ్యాత్మికసాక్షాత్కారానుభవముల శిఖరమునందుకొన్న అందఱివలెనె ఆయనయు ఆ యనుభవములను గూర్చి మౌనమునే వహించెడివాడు. కాని ఆయనలో వెలుగొందుచుండిన జ్యోతి తళుక్కు మన్న ఒక్కసంఘటనమును మాత్రము ఇచ్చట చెప్పుచున్నాము. ఒకనాటి సాయంకాలము బేలూరుమఠమున ఆరాత్రికమైన వెంటనే శ్రీప్రేమానందస్వామి దక్షిణపు వరండామూలలో ధ్యానమునకై కూర్చుండెను. ధ్యానమునకు మామూలుగ పట్టు కాలము దాటెను. కాని స్వామి లేవలేదు. గుడిపరిచారకుడు దేవునకు నివేదింప భోగమును తెచ్చెను. తెచ్చిచూడగా స్వామి ఇంచుకవెనుకకు నిగుడుకొన్నమేనుతో శిలాప్రతిమవలె నిశ్చలుడై కూర్చుండియుండెను. బడలికచే నిద్రలో నున్నా డని పరిచారకుడనుకొనెను. కొన్నిమార్లు పిలిచెను గాని ఉపయోగము లేకపోయెను. ఆరాధనను ముగించుకొని వచ్చి మరల నొకసారి పిలిచి చూచెను. అప్పటికిని బదులు లేదు. అంత

నతఁడు స్వామిముఖమున కెదురుగా నొక దీపమును పట్టుకొనెను. కొంతసేపటికి ఆయన కన్నులు తెఱచెను. 'నిదురించితిరా' అని అడిగినందుకు స్వామి జవాబుగ ఇట్లు పాడెను—

నిదుర మేల్కొంటి, నింక మీఁద నిద్రరాదు,
యోగదశలోఁ బ్రబోధంబు నొందినాఁడ,
మాత, నీనిద్ర నిచ్చితి మగుడ నీకె,
నిద్రనే నిద్రపుచ్చితి నిపుడు నేను.

పరిచారకునితో నిట్లనెను. ఈ స్థితిలో నన్ను చూచితివేని పిలువకు, అఱపకు. గురుదేవుని నామమును నాచెవిని చెప్పితివేని చాలును. నాకు స్మృతి కలుగును.

# శ్రీవివేకానందస్వామి సంస్మృతి

ఐక్యరాజ్యసమితి సర్వకార్యదర్శి - వరిష్ఠ శ్రీ యు. థాంట్ *

అధ్యక్షా, స్వాములారా, రాయబారి స్రెహూ, మిత్రులారా,

అవిస్మరణీయమగు నేటికార్యక్రమములో పాల్గొను మనియు ఈ ప్రముఖమహాశయుల సదస్సున ఉపన్యసింపు మనియు నన్ను కోరుట నిజముగ నాభాగ్య మనియే నాయభిప్రాయము. ఇందులకు నే నెంతయు కృతజ్ఞుడను. ముఖ్యముగ ఈనా డిందు పాల్గొనుటకు అవకాశ మిచ్చిన స్వామిజీకి నేను కృతజ్ఞుడను. ఆఱేండ్లకుముందు క్రొత్త ఉద్యోగపదవి నధిష్ఠించుటకై రంగూనును వీడి న్యూయార్కుకు వచ్చితిని. అంతకుమునుపు బర్మాలో నుండగా రామకృష్ణమిషనువారి కార్యప్రణాళికలతో నాకు మిక్కిలి సన్నిహితసంబంధ ముండెడిది. కాని ఈదేశమునకు వచ్చినప్పటినుండి దురదృష్టవశమున కార్యభారము హెచ్చి, ఈ నగరములో ఈ మిషనువారు నిర్వహించుచుండు మహోదాత్తకార్యక్రమములో కలిసికొనుటకు నాకు సాధ్యపడదాయెను.

ఈరాత్రి మన మిచ్చట శ్రీవివేకానంద స్వామి శతతమజయంతిమహోత్సవమును జరుపుచున్నాము. ఆయన నిర్వహించిన అసాధారణ కార్యములను నే నిప్పు డేకరువుపెట్టుట అనావశ్యకము. ఐనను నాకున్న ఈస్వల్పవ్యవధిలో ఆయన ప్రచారకార్యక్రమమునుగూర్చి, ముఖ్యముగ ఈదేశమున జరిగిన కార్యక్రమమును గూర్చి కొన్ని విషయములను చెప్పగోరుచున్నాను.

మీలో అనేకు లెఱుగుదురు. భారతదేశాధ్యాత్మికసందేశహరులలో శ్రీవివేకానంద స్వామికి సాటి లేరు. భారతదేశచరిత్రముననే కాదు, ఆసియాచరిత్రములోనే ఆయన అప్రతిమానుడు. ఈదేశమున ఆయన నిర్వహించిన పనిని నన్ను చెప్పనిత్తురేని దానికి విలువకట్ట

* తే 28-3-1963 దినాడు శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవసందర్భమున న్యూయార్కులో కావింపబడిన ఉపన్యాసము. వరిష్ఠశ్రీ = హిస్ ఎక్సెలెన్సి.

నిత్తురేని అది యిది : ఆటువదిఏండ్లకుమునుపు అమెరికా యునైటెడ్ స్టేట్సుకు ఆయన కావించిన నిత్యస్మరణీయయాత్రకు ఉద్దేశము ఒక సంయోజనవిధానమును (సింథసిస్) కనుగొనుటే. భారతదేశమునకును అమెరికాసంయుక్త రాష్ట్రములకును, ఆసియాకును, పాశ్చాత్య ఖండమునకును అట్టి ఒద్దికను సాధింప వలెననెడి పట్టుదల ఆయనకు మిక్కిలిగా నుండినది. శ్రీ వివేకానందస్వామిని అర్థముచేసికొనవలెనన్న భారతదేశాధ్యాత్మికసాంస్కృతికపునాదులను ఆసియాఖండపుటాధ్యాత్మికసాంస్కృతిక పునాదులను అర్థముచేసికొనుట చాలముఖ్యము.

మీలో అనేకులకు తెలిసియుండును. ఆసియాఖండమున మనకు దేహమునకంటె మనస్సు ముఖ్యము. మనస్సునకంటె ఆత్మ ఇంకను చాల ముఖ్యము. మనలో నేమి జరుగుచున్నదో కనుగొనుట, నిజమును కనుగొనుట, మనలోనున్న పరమార్థమును కనుగొనుట, మానవుని అసాధారణనైతికాధ్యాత్మికగుణములను అర్థముచేసికొనుట — ఇదే ఆసియాఖండమున అనుశ్రుతముగ వచ్చుచుండు విద్యావిధానలక్ష్యము. ''అనుశ్రుతము''గా అను మాటను నొక్కి చెప్పుచున్నాను. అనగా ఆత్మను సాక్షాత్కరించుకొనుట, వినయము, వృద్ధులపట్లభక్తి మున్నగు ఆధ్యాత్మికగుణముల తెలిసికొన యత్నించుట — ఇదే ఇన్ని శతాబ్దులుగను ఆసియాఖండమందలి విద్యాసంస్కృతీనాగరకతలకు అనుశ్రుతముగ ఏర్పడియుండు లక్ష్యము.

పాశ్చాత్యదేశములందు వారి విద్యాలక్ష్యముల నా యీ వివరణము సరియగుచో, ఊనిక బుద్ధిని పెంపొందించుకొనుటయందే. ఇచ్చట మానవుని బుద్ధిని పెంపొందజేసికొనుటయందున్న ఊనిక అతిమాత్రము. పాశ్చాత్యదేశములని నేనన్నప్పుడు అందు అమెరికాసంయుక్త రాష్ట్రములును పశ్చిమయూరపును యూరపునందలి యితరదేశములును కూడ చేరును. డాక్టర్లను శాస్త్రవిజ్ఞానులను ఇంజనీర్లను సృజించుట, ఆకాశమున క్రొత్తలను కనుగొనుట, చంద్రమండలమునకు అంగారకగ్రహమునకు నక్షత్రములకు దారులు కనుగొనుట — ఇదే ఇప్పటివఱకును పాశ్చాత్యదేశములందలి విద్యావిధానలక్ష్యము. నైతికాధ్యాత్మికగుణములను పెంపొందజేసికొను విషయము ఇచట ఇంచుమించు ఉపేక్షింపబడినది.

నైతికాధ్యాత్మికాభివృద్ధి లేక కేవలము బుద్ధిమాత్రము పెంపొందజేసికొన్నచో ఒకదాని వెంబడి నొకటిగా చిక్కులు వచ్చుచునేయుండు నని నా దృఢాభిప్రాయము. ఈ ఇరువదియవశతాబ్దమధ్యకాలమున వ్యోమయానయుగమున బుద్ధిని పెంపొందజేసికొనుట మాని కేవలము నైతికాధ్యాత్మికాభివృద్ధినే సాధింపజూచుట దేశకాలవిరుద్ధము. కావున ఇరువదియవశతాబ్దపుటుత్తరార్ధమున కావలసిన దేమనగా అదో ఇదో మాత్రమే గాక దాని దీని సంయోజనము సామరస్యము కావలెను. అప్పుడే మానవునకు అఖండపరిపూర్తి కలుగును. వైజ్ఞానికముగను నైతికముగను ఆధ్యాత్మికముగను కూడ మానవు డభివృద్ధి నొందవలెను. అప్పుడే మానవుడు తన ఆధ్యాత్మికధర్మలక్ష్యములను సాధించుకొన శక్తుడగును.

ఈదేశమున శ్రీవివేకానందస్వామి నిర్వహించిన కార్యక్రమమునకు ముఖ్యోద్దేశమును పరిశీలింప యత్నించితిమేని, దానిని నే నిట్లు వివరింతును. సంస్కృతీనాగరకతలనుగూర్చిన

ప్రాచ్యులఆశయములకును పాశ్చాత్యులఆశయములకును సామరస్యము కుదుర్పవలె నని, ఒక విధమైన సంయోజనమును సమకూర్పవలె నని ఆయన అభిలషించినాడు. అట్టి సమన్వయసామరస్యములు అఱువదియేండ్లనాడు ఎంత అవశ్యకములై యుండెనో, పెనగులాటలు హెచ్చి-యున్న ఈకాలమున అంతకంటె ఎక్కువ అవశ్యకములె యున్నవి. శతాబ్దములుగ మానవకోటి కూడబెట్టిన నైతికాధ్యాత్మికగుణములను ఉపేక్షించుట గాని మఱచుట గాని నేటికర్తవ్యముగాదు. ఆగుణములే మతధర్మసర్వస్వపేటికకు కుంచెకోలలు.

నాకు తెలిసినంతవఱకు శ్రీవివేకానంద స్వామి బోధించిన మఱొకపాఠము సహనావశ్యకత, మానవుల సంబంధబాంధవ్యములలో సహనావశ్యకత. మతరంగమునమాత్ర ముండు సహనము కాదు, అన్నిక్రియారంగములలోను ఉండవలసిన సహనము. ఈ సహనసందేశమునకు అఱువదేండ్లకుముందుండిన ఆవశ్యకతకంటె పోరాటములు చెలరేగియున్న ఈకాలమున మఱింతయెక్కువ యని నా యభిప్రాయము. చారిత్రకపరిణామములను కొన్నిటిని పరికింతము. కొన్నిశతాబ్దములకు మునుపు మతసహన మనునది లేనే లేదు. మతసహనము అసంభావ్యముగ నుండినది. మతహేతుకయుద్ధముల(క్రూసేడ్సు)ను చూడుడు. ఆకాలమున క్రైస్తవేతరు లందఱును మతద్రోహులని క్రైస్తవులు నమ్మిరి. చాలదృఢముగా నమ్మిరి. వారియభిప్రాయమున మహమ్మదీయులును మతద్రోహులే. హిందువులును బౌద్ధులును యూదులును మతద్రోహులే. యూరోపు చరిత్రనుబట్టి చూతుమేని, 'క్రైస్తవులు మతద్రోహు'లని మహమ్మదీయులును చాల దృఢముగ నమ్మిరి. కావున క్రైస్తవులును సారసినులు (ముస్లిములు) ను ఒక రొకరిని మట్టుబెట్ట నిశ్చయించుకొనిరి. మతహేతుకయుద్ధయులు ఎన్నో చెల్లినవి. లక్షలకొలది మనుష్యులు, క్రైస్తవులును, ముస్లిములును బలియైరి. వివేకోదయమైన పిమ్మట క్రైస్తవమతమును ముస్లిముమతమును ఎట్టిసంఘర్షణలును పెనుగులాటలును విరోధములును లేక పొందు పొసగి మైత్రితో మెలగవచ్చునని ఉభయులును గ్రహించిరి. ఆనాటినుండి మహమ్మదీయ క్రైస్తవమతములు మైత్రితో ప్రక్కప్రక్కనే వర్తిలుచున్నవి. ఈ ఇరువదియవశతాబ్దములో మతసహన మున్నది లెండి. ఇందుల కపవాదములు లోకమున కొన్ని ప్రాంతములలో ఉండవచ్చును గాని సమష్టిగా చెప్పవలె ననిన నూఱిన్నూఱేండ్లకు మునుపు యథార్థముగ అనుభవములో లేనిది ఇప్పు డున్నది. రెండు మూడుతరములకు మునుపు మతసహనము లేదు గాని ఇప్పు డున్నది.

ఆలాగే ఇరువదియవశతాబ్దపు ద్వితీయార్ధభాగమున రాజకీయసహనము లే దని చెప్పవచ్చు; చెప్పిన మీఁదు తప్పక ఏకీభవింతు రని నా నమ్మకము. ఇందు మన మాశ్చర్యపడవలసినది లేదు. మానవప్రకృతి అట్టిది. విరోధద్వేషప్రభృతి భావోద్రేకములకు ఒక్కొక్కప్పుడు మానవులు పాల్పడుచుందురు. ఉన్మాదము సహితము ఒక్కొక్కప్పుడు వారి కభిమతమగును. రాజకీయసహనము ఇప్పు డొకవేళ లేకున్నను మనతరములోనో లేక మనకు తర్వాతి ఒకటిరెండుతరములలోనో కల్గి తీరునని నాకు తోచుచున్నది. ఈ సహనశీలము "ఒరులను బ్రతుక నిమ్ము, నీవును బ్రతుకుము" అనెడి ఈ వేదాంతము, ఎదుటివాని దృక్పథ

మును అర్థముచేసికొన ప్రయత్నింపవలె ననెడి ఈ యాశయము—ఇవే శ్రీవివేకానందస్వామి లోకులకు, ముఖ్యముగ అమెరికనులకు, కఱపిన పాఠములు. స్వామిజీ ఉపదేశములనుండి నేర్చుకొనదగిన గొప్పపాఠము లివి యని నా యభిప్రాయము.

స్వామిజీ పూనుకొన్న పని సమన్వయసామ రస్యసంపాదనము, సహనోపదేశము అని చెప్పి నప్పుడు సంస్కృతిని నాగరికతనుకూడ మన మర్థముచేసికొన ప్రయత్నింపవలెను. నాగర కత ఇట్టి దని నిర్వచించుట చాల కష్టము. నాగరకతనుగూర్చి తప్పభిప్రాయములు అపో హాలు ఉన్నవి. ప్రాచ్యదేశములం దున్న సంస్కృతీనాగరకతలు ఒకరకము వనియు పాశ్చాత్యదేశములం దున్న సంస్కృతీనాగర కతలు వేఱొకరకము వనియు జనులు సామా న్యముగ అభిప్రాయపడుచున్నట్లున్నది. నాగర కత హృదయగుణములను కొన్నింటిని సూచిం చును. నాగరకుడైన భారతీయునకును నాగ రకుడైన అమెరికనునకును నైతికముగగాని మానసికముగగాని ఆధ్యాత్మికముగగాని ఎట్టి భేదమును గుర్తింప లేము. కాని నాగరకుడైన భారతీయునకును నాగరకుడైన అమెరికనున కును వారివారి దేశీయులకును ఎంతో భేదము కననగును. కాబట్టి ప్రాంతీయముగ నాగరిక తను మనము వర్గీకరింప లేము. నాగరకత ముఖ్యముగ ప్రతిభౌదార్యసంభవము.

నాగరకతల సంఘర్షణలును సంస్కృతుల సంఘర్షణలును అశాంతికిని యుద్ధములకును కారణము లనెడి మఱొక దురభిప్రాయము కూడ నున్నది. ఇదియు తప్పు అనియే నా అభి ప్రాయము. చరిత్రను చదివితిరేని ఇంగ్లండు ఫ్రాన్సు దేశములకును, ఫ్రాన్సు జర్మనీదేశము లకును, మాటిమాటికిని జరుగుచుండిన యుద్ధ ములను గుర్తింపగల్గుదుము. ఆ దేశాలవా రందఱును ఒక్కనాగరకతకే ఒక్కసంస్కృ తికే చెందినవారైనను పోరాడుకొనిరి. ఆసియా ఖండమందలి దేశములలోను ఇంతే. ఒక్క సంస్కృతికే ఒక్కమతమునకే చెందిన దేశాల వారు ఒకరితో నొకరు ప్రతిశతాబ్దియందును పోరాడుకొనుచునేయుండిరి. కావున నాగర కతాసంస్కృతీవిభేదములే తప్పక యుద్ధములను కల్గించున వని చెప్ప లేము. యుద్ధములకు ముఖ్యకారణము మానవులలోని దౌర్జన్యము. వారు ఏ దేశీయులైన నగుదురు గాక. ఈ విష యమును గూడ శ్రీవివేకానందస్వామి తన ఉపన్యాసములలోను ప్రతిపాదనలలోను నొక్కి చెప్పియున్నాడు.

ఆయన తన అమెరికనుమిత్రులకు పెక్కం డ్రకు ధ్యానోపాసనమార్గములను నేర్ప ప్రయ త్నించెను. ఆ మార్గములు అనుక్రమితముగ వచ్చుచుండు ఆత్మాన్వేషణవిధానములు. ఆసి యాలో ముఖ్యముగ సంస్కృతీసంపన్నమైన హిందూదేశమున విద్యావిధానములో ఊనిక ఆత్మాన్వేషణముపైనే ఉండెడి దని ఈవఱకే మనవి చేసి యున్నాను. పాశ్చాత్యదేశముల విద్యావిధానములో ఊనిక మానవునివైజ్ఞాని కాభివృద్ధిపైనే అనియు ఇతఃపూర్వమే మనవి చేసి యున్నాను. ఆసియాలో, ముఖ్యముగ భారతదేశమున, ఆత్మప్రాప్తికి ఈ ధ్యానోపాస నలే మార్గములు. పాశ్చాత్యదేశీయులకు అవి అర్థమగుట కష్టము. శ్రీవివేకానంద స్వామి ఈ ధ్యానోపాసనమార్గములను పాశ్చా త్యులకు అత్యంతసరళమైనరీతిలో వివరించి చెప్పుటకు ప్రయత్నించినాడు. ఇతరరంగము లలో లేక వైజ్ఞానికరంగములో మాత్రమే

పాశ్చాత్యులు పెంపొందియుండుటచే వారి అభివృద్ధి అట్లు పాక్షికముగ నుండనీయక సమగ్రమైనదానినిగా చేయవలె నని స్వామి సంకల్పము. ఏల యన వట్టివైజ్ఞానికాభివృద్ధిచేత మన మెంతసేపటికిని వెలుపలి ప్రపంచమును మాత్రమే )సికొనగల మని స్వామి అభిప్రాయః¦డెను. అది సమంజసమైన అభిప్రాయమే. అమెరికాలో యూరోపులో రష్యాలో — ఈ దేశాలలో మనకు వెలుపలనున్నవాని నిర్వచనము అత్యంతస్పష్టముగ చేయబడి యున్నది. కాని మనకు లోపల ఉన్నది అగాధముగను అంధకారబంధురముగను గహనముగను ఉన్నది. కావున స్వామి ఈ దేశమునకు వచ్చినప్పటినుండి ప్రచురించిన పుస్తకములలో ఈ ధ్యానోపాసనవిషయములను స్పష్టపఱచెను. ఈ విధానములనుగూర్చి ఆయన ప్రవచనములలో నొకదానిని మీాకిప్పుడు చదివి వినిపించిన బాగుండునని తోచుచున్నది.

ధ్యానమునుగూర్చి స్వామి వ్రాసినదిది : ''నీవు నీమనసును ఒక లక్ష్యముపై స్థిరముగ నెలకొల్పవలెను. ధ్యానము తైలధారవలె ఎడతెంపు లేకుండవలెను. సామాన్యమానవుని మనస్సు విభిన్నలక్ష్యములపై చెదరుచుండును. ధ్యానసమయములోకూడ మనస్సు మొదట అల్లాడుచునేయుండును. మనస్సులో ఏకోరిక యైనను తలయెత్తును గాక! ప్రశాంతముగ కూర్చుండుము. వచ్చు ఆశయములు ఎట్టివో కనుపెట్టుచుండుము. అట్లు కనుపెట్టుచునే యుండుటచే భావతరంగములు అణగి మనస్సు ప్రశాంత మగును. ఈతరంగములు మనోభావనావ్యాపారమును సూచించును. ఇతః పూర్వమే ఏఏవిషయములనుగూర్చి గాఢముగా ఆలోచించుచుంటివో అవి స్మృతితలమున కడుగున ప్రవహించుచునేయుండును. ధ్యానమునకు కూర్చున్నప్పుడు అవి మనసులో పైకి వచ్చును. ధ్యానసమయమున ఈతలంపుల కల్లోలముల పోటు, నీమనస్సు ఏకాగ్రత కున్ముఖమగుచున్నది అనుటకు సాక్ష్యము.'' నాకు తెలిసినంతవఱకు ఉదాత్తమును స్పృహణీయమునగు ధ్యానోపాసనలసాధనకు ఇది సరళతమమైన వివరణము. ఈసాధనలు ఆసియాలో పెక్కుభాగములలో ఇప్పటికిని ఆచరణలో నున్నవి.

శ్రీవివేకానందస్వాములసందేశములలో కలహకల్లోలనిబిడమైన ఈయుగమునకు చాల ముఖ్యమైనదియు చాల ఉచితమైనదియు ఇది. ''మిమ్ము ఒక క్రొత్తమతములోనికి దింపుటకు కాదు నే నీ దేశమునకు వచ్చినది. మీా మతమునందే మిమ్ము స్థిరపఱచుటయే నా కాంక్షితము. మెథడిస్టు మఱింత మేలైన మెథడిస్టుగా, ప్రెస్బిటేరియను మఱింత మేలైన ప్రెస్బిటేరియనుగా, యూనిటేరియను మఱింత మేలైన యూనిటేరియనుగా — కావలెననుటే నా కోరిక.'' మతసహనమునుగూర్చి ఆయన చెప్పిన వాక్యముగూడ ఉదాహరణార్హము. నా అనుభవములో అంతటి వివేకసంభృతమైన సూక్తి వే ఱొకటిలేదు. ఆయన వాక్యము : 'గతకాలముననుండిన సకలమతములను నేను తలదాల్తును. వానినెల్ల పూజింతును. వానిలో ఒక్కొక్కమతానుసారము నేను భగవంతు నారాధింతును. భగవంతుని వా రారాధించు రూపములలో నెల్ల నేనును ఆరాధింతును. నేను మహమ్మదీయునితోకూడి మసీదుకు పోవుదును. క్రైస్తవునితో కలసి చర్చిలో చొచ్చి సిలువకు మ్రొక్కుదును. బౌద్ధాలయమున ప్రవేశించి బుద్ధుని ధర్మమును శరణుజొత్తును.

విపినములకేగి ఎల్లరడెందముల వెలుగొందించుచున్న జ్యోతిని సాక్షాత్కరించుకొన తపసు చేయుచున్న హిందువుతోగూడి ధ్యానింప గూర్చుందును. నేను ఈమతముల నన్నిటిని అనుసరించుటే కాదు, భవిష్యత్కాలమున వచ్చు మతములకుకూడ నాహృదయకవాటము తెఱచియుంచుకొందును.''

ఇవి అత్యంతవివేకసంభృత సూక్తులు. మిత్రులారా, ఈశుభసమయమున భూతభవిష్య ద్వర్తమానకాలములలో సాటిలేని మహాపురుషుని పూజింప సమావిష్టులమై యున్న మనము ఆయన మనకు కఱపిన ప్రతిజ్ఞానిర్వహణమునకు మన జీవితము నంకిత మొనర్చుకొందముగాక. ఆప్రతిజ్ఞ; ''క్రైస్తవులను మేలైన క్రైస్తవులుగ చేయవలెను. హిందువులను మేలైన హిందువులుగ చేయవలెను. మహమ్మదీయులను మేలైన ముస్లిములనుగా చేయవలెను. బౌద్ధుల మేలైన బౌద్ధులనుగా చేయవలెను. యూదులను మేలైన యూదులునుగా చేయవలెను'' మీకు నా అత్యంతకృతజ్ఞతాభినందనములు.



# నా గురుదేవుడగు శ్రీవివేకానందస్వామి సంస్మృతులు

## శ్రీ సదాశివానందస్వామి

[ఆయనపేరు, ఆయనతో సంబంధపడినవి, ఆయనచోటు, ఆయన మాటాడినవారు, ఆయన స్పృశించినవస్తువులు — ఇవన్నియు నాకు పరమపవిత్రములు. ఏలయన అవి నా ప్రాణనాథునివి. నేను జీవించుట, చరించుట, వసించుట, మాటాడుట, నవ్వుట — ఇదంతయు నా స్వామిప్రీతికే. ఎన్నడుగాని నేను దుఃఖింపజాలను, ఏలన నేను దుఃఖించుట ఆయన కిష్టము లేదు. ఏదేని దుఃఖమే సంభవించినను అందుకు నేను సంతోషింపవలె, ఏలన అది నా ప్రాణనాథుడు నాకు ప్రత్యేకముగ ప్రసాదించినది. దుఃఖించునది ఈ దేహ మనెడి 'నేను' గాదు. నా ప్రాణనాథునిసొమ్మైన 'నేను'. ఆయన ఎవరినిగాని ఎప్పుడుగాని ద్వేషింపడు. కావున ఎవరిని గాని ద్వేషించుట నాకును అశక్యము. నా మనసు వారివంకకు సహజముగ పాఱుట నా గురునాథునికై యే. లోకమందలి ప్రతిప్రాణియు ఆయనది. నేనును ఆయనవాడనే, కావున వారును నావారే. ఆయన నాస్వామి, నాదేవుడు, నాకంటిపాప, నానవ్వు, నా నాళములలోని రక్తము, నాహృదయమునకు హృదయము, నా యెముకలలోని గుజురు, మజ్జ. నేను పూర్తిగా నిరుపాధికముగ ఆయనవాడను.]

### దర్శనము

బీహారులో ఒకమూల ఆరా అను నగరమున్నది. అట జిల్లాకోర్టున్యాయవాది ఒకరు చెప్పగా శ్రీవివేకానందస్వామిపవిత్రనామము నాజీవితమున మొట్టమొదటిసారి నాచెవిని బడినది. ఆ న్యాయవాది ఒకనాడొక గ్రంథాలయమున కొందఱు మిత్రులతో మాటాడుచు చెప్పుచుండెను — కల్కత్తాలోని ఒకబంగాలి

కుటుంబమునకు చెందినవా డని, హిందు సన్న్యాసి అని, చికాగోలో జరిగిన విశ్వమత మహాసభలో సనాతనహిందూధర్మధ్వజమును నాటినా డని, మహాద్భుతములు సల్పినా డని, ఆ మహాసభలో సమావిష్టులైన బహుమతప్రతినిధులయు పండితవతంసులయు ఎదుట అజరామరమగు హిందూసనాతనధర్మప్రభావమును మహాత్మ్యమును నచ్చ చెప్పినా డని

విదేశీయులకు అట్లు నచ్చ జెప్పిన ఆ యువసన్న్యాసి పేరు నాచెవిని పడినంతనే నన్ను కదల్చి వైచినది. ఆయనను నే నంతవఱకు దర్శించియుండ లేదు కాని, ఆయన నా కాత్మబంధు వనిపించెను, అత్యంతప్రియతము డనిపించెను.

* * *

1898 జూలైలో మా అన్నగారు ఆకస్మికముగ మరణించిరి. దుఃఖార్ణవమగ్నయగు మా అమ్మ, వితంతువు, కాశిలో ఉండినది. నేనును అచటికి చేరుకొంటిని. నా కప్పటికే మంత్రోపదేశమైయుండెను. బృందావనములోని శ్రీరంగనాథాలయమునకును మథురలోని ద్వారకాధీశాలయమునకును ధర్మకర్త శ్రీరంగనాథాచార్యస్వామి. ఆయన శిష్యుడు శ్రీభాగవతాచార్యస్వామి. ఆయనకు శిష్యుడు శ్రీరామస్వరూపాచార్యస్వామి. ఆయన నా గురువు. స్వామి న న్నొక వైష్ణవబ్రహ్మచారినిగా చేర్చుకొన్నారు. బ్రహ్మచర్యమునకు విహితములైన ఆరాధననియమాలు సాధననియమాలు అన్నియు ఉండినవి. ఆ దినాలలోనే శ్రీ సురేశచంద్ర దత్తగారు రచించిన 'శ్రీరామకృష్ణుని జీవితసందేశాల' గ్రంథమును నేను చదివియుండినాను. ఆ గ్రంథము న న్నెంతో ఆకర్షించినది. నాకును ఇతరులకు పెక్కండ్రకును జీవితపారమార్థికతృష్ణను అనంతరకాలమున తీర్పనున్న వాహినికి ఉత్పత్తిస్థానసమీపమునకు నే నావిధముగ వచ్చితిని.

అది ఆశ్వయుజమాసమున మహాష్టమి. శ్రీ జగద్దుర్లభఘోషుతోకూడి నేను కాశిలో దుర్గామందిరమునకు పోయితిని. తర్వాత పూజ్యశ్రీ భాస్కరానందస్వాములను దర్శించుటకు కూడ నేను ఈమిత్రునితో గూడియే పోయితిని. అప్పుడు ఆ స్వామి అమితమహారాజుగారి ఆరామభవనమున వసించుచుండిరి. ఎవరితోనో సంభాషించుచుండిన శ్రీ నిరంజనానందస్వామిని శ్రీ శుద్ధానందస్వామిని నేను చూచినదచ్చటనే. చూచి ఆకృష్టుడ నైతిని. వారి నడుమ కాషాయాంబరములు దాల్చి ఒడ్డుపొడుగుగల వ్యక్తిని చూడగానే శ్రీ వివేకానందస్వామి నాతలంపునకు వచ్చినారు. ఆయన అప్పటికి భారతదేశమునకు వచ్చియైనది.

ఆ స్వామియే శ్రీ వివేకానందస్వామిగ నుండు ననుకొని, నిజము తేల్చుకొనుటకై వేచియుంటిని. ఆ స్వామి శ్రీ భాస్కరానందస్వామిని గని 'ఓమ్ నమోనారాయణాయ' అని అభివందనము చేసెను. శ్రీ భాస్కరానందస్వామియు తత్క్షణమే 'ఓమ్ నమోనారాయణాయ' అని ప్రత్యభివందనము కావించెను. ఆంతరంగికముగ మిక్కిలి పరిచితులట్లు వారు మాటాడుచుండిరి. ఎట్లో ఒకట్లు శ్రీ వివేకానందస్వాముల ప్రస్తావము వారినడుమ గలిగెను. ఆ పేరు వినగానే గంభీరమైన శ్రీ భాస్కరానందస్వాముల నెమ్మోమున ప్రేమాదరములు వెలికి తొనకెను. "సోదరా, నాకొక్క-

సారి శ్రీవివేకానందస్వాముల దర్శనము చేయింపవోయి'', భాస్కరానందస్వామి గొప్ప పండితుడనియు సిద్ధుడనియు గౌరవము గల పెక్కండ్రు ఆయనను పరివేష్టించియుండిరి. వారేమనుకొందురో అను విషయము నాయన లక్ష్యపెట్టలేదు. ప్రేమభరితమైన శ్రీవివేకానందసంస్మరణమందే ఆయన నిమగ్నుడై యుండెను. శ్రీవివేకానందుని ఆయన ఇంతకుముందు కలిసికొనియుండెను.*

భాస్కరానందస్వామి యావద్భారతదేశ ప్రశస్తినందిన యోగి, జ్ఞానగంభీరుడు. ఆయన స్వామిజిని దర్శింప ఆత్రపడుచున్నాడు. వీలైనచో ఆ క్షణమందే దర్శింప గోరుచున్నాడు. ఆయన ఉబలాటము నన్ను కదలించివేసినది. ఏలయన నాడెందముననే నిగూఢముగ నున్న ఒక కోరిక వింతగా ఆయనలో ప్రతిఫలించినట్లుండెను. శ్రీ నిరంజనానందస్వామి ''ఆయన ఇంచుక అస్వస్థుడై యున్నాడు. చోటుమార్పుకై ప్రస్తుతము దేవగడమున నున్నాడు. నేను తప్పక ఆయనకు వ్రాసెదను'' అని సవినయముగ బల్కెను. ''అగుచో; చీకటిపడిన వెంటనే నీవు దయచేసి ఇంకొకసారి ఇటకు రమ్ము'' అని భాస్కరానందస్వామి అనెను. వెంటనే వారు చీలిపోయిరి. ఇంతసేపు నేను కనుపెట్టి యుండిన వ్యక్తి కనుచాటై పోయెను. తర్వాత విచారింపగా అతని పేరు తెలిసినది. అతని పేరు శ్రీ నిరంజనానందస్వామి. అతడు వివేకానందునితో బాటు శ్రీరామకృష్ణుని శిష్యుడు.

1898 సెప్టెంబరు నెలలో ఒకదినము నిత్యధ్యానప్రార్థనలను ముగించుకొని నేను వెలికి వచ్చుచు శ్రీ చారుచంద్రదాసును కలిసికొంటిని. ఈయనే అనంతరకాలమున శ్రీరామకృష్ణసంప్రదాయసన్న్యాసిసంఘమున శ్రీశుభానందస్వామియై వారణాసిలోని శ్రీరామకృష్ణ మిషను సేవాకేంద్రమును స్థాపించినవాడు. అప్పుడే కల్కత్తానుండి వెలువడుచుండిన 'ఉద్బోధన' పత్రికకు చందాదారులను చేర్చుటలో పలుకుబడిని వినియోగించి తోడ్పడవలసినది అని ఆయన నన్నడిగెను. కాని అప్పుడప్పుడు ఏకాంతముగ కొంతకాల ముండుట కేటకైన పోవుట నావాడుక. ఆనాడే నేనట్లు తరలవలసిన దినము. ఆసిఘట్టమున నున్న

* అమెరికాకు పోవుటకుముందు పరివ్రాజకసాధువుగా పర్యటించుచుండిన దినాలలో ఒకనాడు శ్రీ వివేకానందస్వామి శ్రీ భాస్కరానందస్వామిని దర్శింపవచ్చెను. పరమహంసల లక్షణములనుగూర్చి శ్రీ భాస్కరానందు డుపన్యసించుచుండెను. రజతస్వర్ణములస్పర్శను సైతము పరమహంసలు సహింపజాలరని ఒకగ్రంథమునుండి ఆయన చదివి చెప్పుచు ''ఈ కలియుగములో అట్టి పరమహంస లొక్కరైనను లేరు లెండి'' అనెను. వెంటనే శ్రీవివేకానందస్వామి లేచి ''అట్టి పరమహంస నొక్కనిని నేను ప్రత్యక్షముగ చూచి యున్నాను. వెండిబంగారముల మాటెందుకు, ఇత్తడిపాత్రనైనను ఆయన ముట్టుకోలేడు. స్పృశించుటకై చాప జూచినను ఆయన చేతులు తమంతట తామే వెనుకకు లాగుకొనును'' అని చెప్పెను. ఆ మాటయందవిశ్వాసమును దెల్పుచు భాస్కరానందుడు చిఱునవ్వు నవ్వెను. శ్రీ వివేకానందస్వామి ఆ మాటనే మరల మరల నొక్కి చెప్పెను. తనమాట కెదురాడగల ఆ యువసన్న్యాసి ధైర్యము భాస్కరానందుని కనలించెను. 'హోయి' 'హోయి' అని ఆయన పిలిచెను. అందుల అర్థము సుగమమే. యువసన్న్యాసిని అటనుండి వెడలించుట కెవరినో పిలిచెను. విసుగుకొనుచు 'నామాట నిజము నీ కొకనాటికి తెలిసివచ్చునులే' అనుచు శ్రీవివేకానందస్వామి వెడలిపోయెను.

వైష్ణవమఠమునకు పోయి అట కొంతకాలముండ నెంచితిని. కావున సాయపడుట కప్పుడు నాకు సాధ్యము కా దంటిని. కాని ఆయన నాతో వచ్చి యుండు నని పట్టుపట్టెను. మేము మిత్రుల మగుటకు ఎంతో కాలము పట్ట లేదు. రామకృష్ణమిషనువారు ప్రచురించిన గ్రంథములను కొన్నిటిని ఆయన నాకు చదువ నిచ్చెను. అందులో కొన్ని శ్రీవివేకానందస్వామి ప్రణీతములు. నామిత్రుడగు శ్రీకేదారనాథమల్లికు నింట ఒకపఠనమందిరమునే ఏర్పాటుచేసికొంటిమి. ఈ కేదారనాథమల్లికే అనంతరకాలమున శ్రీ అచలానందస్వామి అయ్యెను. శ్రీ చారుబాబు సుమారు రెండేండ్లు కష్టపడి కర్మయోగప్రాముఖ్యమును ఆధ్యాత్మికాభివృద్ధికి దాని సాధకతను మాకు నచ్చచెప్పెను. యోగపుటితరవైఖరుల నొక్కి చెప్పునవైన శ్రీవివేకానందస్వాముల ఇతరగ్రంథములను కూడ ఆయన మాకు చదివి వినిపించెను. కొన్ని సమయముల కేదారబాబు నింటను చారుబాబు గృహమునను కొన్నిసమయముల మా కుటుంబముండు నింటను మా సమావేశములు జరుగుచుండినవి. ఈవిధముగ ఆయన కొందఱు యువకుల ప్రోగుచేసి, జైమినిరంజనమజుందారు – కేదారనాథమల్లిక్కు – విభూతిప్రకాశబ్రహ్మచారి – హరినాథఓదేవారు – హరిదాసఛాటర్జీ – దుర్లభచంద్రఘోష్ – జ్ఞానేంద్రనాథసింహ – పండిత శివనాథభట్టాచార్య అను వారితోడ్పాటుతో ఒక చిన్న – చాల చిన్న – సేవాకేంద్రమును* ప్రారంభించెను. కొన్నాళ్లపిదప రాయిప్రమదాదాసమిత్రబహదూరు (ఎమ్. ఏ.) అనువారు మాతో కలిసిరి. ఆ ప్రాంతీయులపరిషత్తు ఒకటి ఇట్లు రూపొందెను. ఆయన నాయకత్వమున ఆ పరిషత్కార్యము కొన్నాళ్లు సాగినది. ఆయన మరణించిన పిమ్మట స్వామిజి ప్రోత్సాహము మేరకును ప్రజల అభ్యుపగతితోను ఈ సంస్థ మిషనువారికి అప్పగింపబడినది.

(సశేషము)



* మొదట అది నాల్గణాల మూలధనముతో ఆరంభమయ్యెను. కాశీనగరమున ఒకవీధిని ఒకముసలమ్మ కలరాతో బాధపడుచుండెను. ఆమెకు దిక్కెవ్వరును లేరు. ఆసుపత్రిలో చేర్చుట కందుబాటు కాదు. ఆమెను గని దయాళువైన శ్రీ జైమినిరంజనమజుందారు ఆమెను తన మిత్రులలో నొకనియింటికి చేర్చెను. ఇదే 'కాశీ సేవాశ్రమమున'కు బీజము.

# పురాణవాఙ్మయము

శ్రీయుతులు పాటీలు తిమ్మారెడ్డి, ఎం. ఏ.
బోయనపల్లి రామారావు, బి. ఏ. గారలు

(గతసంచిక తరువాయి)

తెలుగు పురాణములు: ఇందు 'పెక్కు సంక్షిప్తపరిచయ మీక్రింద ప్రదర్శింపబడు
పురాణములును, పురాణభాగములును తెని చున్నది.
గింపబడినవి. నాకు లభించినంతవఱకు వాని

| కాలము | కవి | పురాణము | అంకితము |
|---|---|---|---|
| 1325 | మారన | మార్కండేయపురాణము | నాగయగన్నమంత్రి. |
| 1340 | ఎఱ్ఱన | నృసింహపురాణము | నృసింహస్వామి. |
| 1350 | కమలనాభుడు | పద్మపురాణము | ? |
| 1400 | శ్రీనాథుడు | భీమఖండము (స్కా) | వీరభద్రారెడ్డి. |
| | ,, | కాశీఖండము (స్కా) | అన్నయ మంత్రి. |
| ,, | తురగారాజకవి | నాగరఖండము | ? |
| 1410 | బమ్మెర పోతన | శ్రీమద్భాగవతము (1-4, 7-10 స్కంధ) | శ్రీరామభద్రుడు. |
| | గంగనార్యుడు | భాగవతము (5 స్కం) | శ్రీకృష్ణుడు. |
| ,, | సింగయార్యుడు | భాగవతము (6 స్కం) | శ్రీరామభద్రుడు. |
| ,, | వెలిగందల నారయ | భాగవతము (11-12 స్కం) | ,, |
| 1420 | మడికి సింగన | పద్మపురాణము | కందనమంత్రి. |
| 1460 | పినవీరభద్రుడు | నారదపురాణము | ? |
| 1480 | నంది మల్లయ, ఘంట సింగయ | వారాహపురాణము | నరసింహదేవరాయలు. |
| 1500 | సూరన (వెన్నెలకంటి) | విష్ణుపురాణము | రాఘవరెడ్డి. |
| | లింగముకుంట తిమ్మకవి | మత్స్యపురాణము | ? |
| ,, | ,, | వామనపురాణము | ? |
| 1508 | పెద్దయమంత్రి | వాయుపురాణము | చినగంగయ. |
| 1509-10 | తెనాలి రామలింగడు | లింగపురాణము | |
| 1530 | పింగళి సూరన | గరుడపురాణము | |
| ,, | వాసిరాజు రామన్న | నారదీయపురాణము | |
| 1800 | సోమనాథకవి | సూతసంహిత (స్కాం) | కామారెడ్డి. |
| | కోదూరి వేంకటాచలపతి | శివరహస్యఖండము (స్కాం) | |
| ,, | శ్రీధరమల్లి వెంకట్రామకవి | బ్రహ్మోత్తరఖండము | శివుడు. |
| 1850 | గోపీనాథం వేంకటకవి | శ్రీకృష్ణజన్మఖండము | శ్రీకృష్ణుడు. |
| 1898 | చిల్కపాటి రామానుజశర్మ | కల్కిపురాణము | ? |
| 1899 | మండ కామేశ్వరకవి | కూర్మపురాణము | ? |
| 1910 | జనమంచి శేషాద్రిశర్మ | బ్రహ్మాండపురాణము | వేంకటేశ్వరుడు. |
| 1928 | | బ్రహ్మపురాణము | ,, |

వర్ణన భేదకారణము : 'ఋచః సామాని ఛన్దాంసి పురాణం యజుషా సహ॥' (అథర్వ. 11-4-24) 'స హోవాచ ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాసం పురాణం పఞ్చమం వేదానాం వేదమ్॥' (ఛాందోగ్య 7-1-1, 2) అని యనాదియు నపౌరుషేయమునగు శ్రుతియందు పంచమవేద మని నుతింపబడిన యితిహాస పురాణములుకూడ నపౌరుషేయము లగుటయందు విప్రతిపత్తి యుండరాదు. అట్టి యీశ్వరీయజ్ఞాన మొక్కరూపముననే యుండవలయును గదా! పురాణములం దొక్క కథయే పెక్కుసార్లు వచ్చుచున్నది. ఒకపురాణమున విష్ణువునకు, ఒకపురాణమున శివునకు, ఒకపురాణమున బ్రహ్మకు, ఒకపురాణమున శక్తికి సర్వోత్తమత్వము సర్వాధికారము, సర్వోపరిత్వము చెప్పబడియున్నది. అపౌరుషేయజ్ఞానమం దీభేద మెట్లేర్పడును?

గృహ్యసూత్ర మనుస్మృతి మహాభారతాది గ్రంథములు పరిశీలించినచో పురాణము లెప్పుడును బహువచనమునందే చెప్పబడినవి. కాన ననాదిగా నివి యొక్కటి కాక యనేక మగుట సత్యము. నేటిపురాణములందు కల్పభేదము ననుసరించి యితిహాసమునం దేర్పడిన భేదములు స్పష్టము చేయబడినవి. ఏ రెండు పురాణములందును ప్రాయికముగ నొక్కకల్పమందలిచరిత్రయే రాలేదు. వానియందు భిన్న భిన్నకల్పములచరిత్ర కలదు. ప్రతికల్పమునందును సృష్టి యేదో యొక నిత్యలోకసన్నిధిని ప్రారంభింపదు. సృష్టిప్రవాహ మొకకల్పమున నొక నిత్యలోకము మఱొకకల్పమున మఱొక నిత్యలోకమునుండియు నారంభించును. ఏకల్పమున (నే నిత్యలోకమునుండి సృష్ట్యారంభము జరుగునో ఆ కల్పమున) ఆలోకాధిష్ఠాతకు ప్రాధాన్య మీయబడును. ఆ కల్పమును వర్ణించు పురాణములు తదధిష్ఠానదేవతకు ప్రాధాన్య మిచ్చి వర్ణించును. వ్యాసభగవానుడు పురాణసంఖ్యను వర్ణనలను తానై మార్పలేదు, అట్లు మార్చుట సాధ్యమును కాదు. వేదార్థస్పష్టప్రతిపత్తికై యేర్పడిన యపౌరుషేయపురాణములను తత్త్వ మెఱిగిన వ్యాసభగవానుడు మార్చెననుట యసంగతము.

వేదములం దధికారిభేదము ననుసరించి సాధనలు కలవు. ప్రతిమానవుడును తన కనురూప మగు నాధ్యాత్మికమార్గ మెన్నుకొనవచ్చును. అందఱు మానవుల స్వభావ మొక్కటి కాదు. కావున నందఱు సమానాధికారము కలవారు కారు. ఈశ్వరీయజ్ఞానమున నేయొక్కనికేని సాధన లే దనుటకు వీలులేదు. పురాణములందు వేదార్థవిస్తృతి జరుగుటచే నీసాధననిష్ఠలు పరిపక్వము లైనవి. కొన్ని పురాణములు శైవనిష్ఠను, కొన్ని వైష్ణవమును, కొన్ని, కొన్ని సౌరమును, కొన్ని శాక్తమును, కొన్ని బ్రాహ్మమును, కొన్ని గాణాపత్యమును ప్రతిపాదించును. ఏపురాణమునం దేకల్పము వర్ణితమయ్యెనో ఆపురాణమునం దే దివ్యలోకమున సృష్టి యుద్భూత మయ్యెనో తదధిష్ఠాన దైవమునకు ప్రాధాన్యమిచ్చి వర్ణించి, యాతని యుపాసన సమర్థింపబడినది. ఒక్కభగవానుడే ఈవిభిన్నాధిష్ఠాతలరూపమున అభివ్యక్తుడై లీలలు పచరించుచున్నాడు. ఇట్లు పురాణములందు పునరుక్తి గాని పరస్పరాతిక్రమముగాని జరుగలేదు.

ఉపాసనాపద్ధతి: అవతారవాదము, దేవోపాసన – ఇవి పురాణములందలి ముఖ్యవిషయములు. సమస్తవేదమంత్రములు యజ్ఞములందు వినియుక్తము కావలె ననుట శ్రుతిమతము. యజ్ఞమనగా ఉపాసన యనియర్థము. యజ్ఞమున దేవారాధనముకూడ కలదు. వేదములయందు పరోక్షరూపమున చెప్పబడిన యుపాసనాపద్ధతి పురాణములందు వివరింపబడినది. శతపథబ్రాహ్మణము, తైత్తిరీయారణ్యకము, తైత్తిరీయసంహిత, తైత్తిరీయ బ్రాహ్మణము, ఐతరేయబ్రాహ్మణము, ఛాన్దోగ్యోపనిషత్తు – వీనియం దన్నిట నవతారగాథ లెల్ల కలవు. బ్రాహ్మణాదిభాగములను విడిచినను మూలసంహితయందుగూడ నవతారగాథలు కలవు. ఉదాహరణమునకు శ్రీకృష్ణచరిత్ర స్వీకరించినచో

స్తోత్రం రాధానాం పతే
(ఋగ్వేద 1-30-5)

స్వాం న్పచక్షా వృషభాను పూర్వీం
కృష్ణాస్వగ్నే అరుషో వి భాహి ॥
(ఋగ్వేద. 3-15-3)

గవామప వ్రజం వృధి
(ఋక్. 1-10-7) అని కలదు.

శ్రీకృష్ణునకు రాధను జయదేవు డంటగట్టెనని యాధునికపరిశోధకులందురు. శ్రీమద్భాగవతమున నీ పేరు కానరానందున వా రిట్టి భ్రమకు లోనైరి. భాగవతకారు డీ గోపిక పేరును పేర్కొనలేదు. మూలసంహితయం దీ రాధికయు, ఆమెతండ్రియగు వృషభానుడు కూడ పేర్కొనబడినారు. తెలుగున చివుకుల అప్పయ్యశాస్త్రికృతమగు గర్గభాగవతపురాణమందు దీని విశదవర్ణనము కాననగును. ఇట్లే తదితరావతారగాథలును.

పురాణములందు శివ, శక్తి, గణేశ, విష్ణు, సూర్యుల ఉపాసనల విశదవర్ణనము కలదు. పురుషసూక్తము, రుద్రాష్టాధ్యాయి వేదములందలి ప్రసిద్ధభాగములు. వీనియందు కాక అన్యత్ర కూడ భగవద్విగ్రహనామములు, రూపములు లీలలు వర్ణితము లైనవి. పురాణములందు, సూర్యాగ్నివాయువులను వైదిక దేవతాపురాణములును గలవు. మూలసంహిత యందు పేర్కొనబడని దేవు డెవ్వడును క్రొత్తగా పురాణములందు పేర్కొనబడలేదు.

వైదికములగు నవతారగాథలు, దేవవర్ణనలు యథాతథముగ పురాణములయందు విస్తరిల్లినవి. కాని వేదచరిత్రమునకు, పురాణగాథలకు కొంత భేదము కాన్పించును. దీనికి కారణ మిది. వేదములందు నిత్యచరిత్ర — సృష్టిచరిత్రయొక్క రూపరేఖలు మాత్రమే కలవు, పురాణములందు ప్రతికల్పమునందలి గాథయు కలదు. ఇట్లు కల్పభేదముచే నీగాథలయందు భేద మేర్పడినది.

ఇట మఱొకమాట చెప్పవలసిన యావశ్యకత కలదు. పూర్వ మెవ్వ డేనిష్ఠ ననుసరించునో తదనురూపమగు పురాణమునే పఠించి తదనురూపాచారముల నవలంబించువాడు. తక్కిన పురాణములతో వానికి నిమిత్తము లేదు. వారి కా యేకైకపురాణమే అత్యంత గుహ్యామయశాస్త్రము. నే డీ యధికారనిష్ఠలయందు విపర్యాస మేర్పడుటయే యిన్ని భ్రమలకు నాక్షేపములకు కారణ మైనది.

వింతవర్ణనలు : పురాణములందలి సర్వాద్భుతభాగములు వానియందలి వింతవర్ణనలు. ఒకొక్కవ్యక్తికి రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, పది, వేయివఱకు తలలు, వేయివఱకు చేతులు, వేయికన్నులు ఉండెడివట. ఇట్లే కుంభకర్ణునివంటి మహాదీర్ఘకాయులు కలరట. ఋక్షవానర నాగాదిజాతులు, వారితో మానవులకు గల సంబంధబాంధవ్యములు నేడు మనకు నమ్మ శక్యముగాక వానిని కల్పనలనియో రూపకము లనియో భావించుచున్నాము.

పురాణముల ననుసరించి ద్వాపరాంతము వఱకు మిక్కిలి కన్నులు, మిక్కిలి చేతులు, మిక్కిలికాళ్లు, మిక్కిలితలలు గల జనులు జనించుచునే యుండిరి. కృతయుగమున నిట్టివారి సంఖ్య మిక్కిలిగ నుండి కాలక్రమమున తగ్గుచు వచ్చెను. అట్లయ్యును మహాభారత పఠనముచే నాటిసమాజమున నట్టివారిజననము విపరీతము కామి యెఱుగవచ్చును. శిశుపాలునకు పుట్టినప్పుడు నాలుగుచేతులు మూడు కన్ను లుండెను. వాని యేడుపు గాడిద యోండ్రవలె నుండెను. చాలనాళ్లు వాడీ యాకృతితో నే పెరిగెను. నేడుకూడ అందందిట్టిశిశువులు జన్మించుట వినుచు, కనుచునున్నాము. బెల్జియములోని యొకగోరీరాతిపై నందలిస్త్రీ యొక్కసారి 360 మంది శిశువులను ప్రసవించినట్లు తారీఖుతో సహా చెక్కబడిన దట. పత్రిక లప్పు డప్పు డిట్టి వార్తలు ముద్రించుచునే యుండును. ప్రకృతిపరిణామముచే నే డట్టి శిశువులు చాలకాలము జీవించుట లేదు. ఇటు సర్వజ్ఞులగు మహర్షులు చెప్పిన మాటలు ప్రత్యక్షము సత్యము, అవి కల్పనలు, రూపకము లనుట మన మూర్ఖతను నిరూపించు మాటలు.

పురాణములయందు ఋక్షవానరనాగరాక్షసాదిజాతుల ప్రసంగములు వచ్చినచోట్ల నాధునికవిద్వాంసులు వీరి ననాగరికులగు నాటవిక జాతులుగా పేర్కొందురు. కాని పురాణములయందలి వీరివర్ణనము గమనించినచో వారు నాగరికు లనియు, విద్యావంతు లనియు, తత్త్వపరిశీలకు లనియు, శాస్త్రప్రవర్తకు లనియు తెలియుచున్నది. వాల్మీకిరామాయణమున కిష్కింధాపురము—

ప్రాప్తాః స్మ ధ్వజయంత్రాఢ్యాం
కిష్కింధాం వాలినః పురీమ్।

అనేకపతాకాలంకృతము, యంత్రాది పరిరక్షితమునై వెలసినట్లు ఉల్లేఖింపబడినది. మఱియు పెక్కుచోట్ల కపుల ధీవైశారద్యము వర్ణింపబడినది. ఆంజనేయుడు సూర్యునికడ సమస్తశాస్త్రము లభ్యసించినవాడు.

పురాణములయం దిట్టి జాతులవర్ణనలు వచ్చినచోటులయం దీ క్రింది విషయములను మనస్సునం దుంచుకొన వలయును.

(1) ఈ జాతులన్నియు కామరూపశక్తికలవి. అనగా తమ యిచ్ఛానుసారమగు రూపములు ధరించు శక్తి వీరికి సహజముగ నబ్బియుండెను.

(2) వీరిస్త్రీలు సాధారణమానవస్త్రీలవలెనే లోకోత్తర సౌందర్యవతులు. మానవులతో వీరికి సంబంధబాంధవ్యములును గలవు.

(3) ఈ జాతులందు పురుషులుమాత్రమే ఋక్షవానర సర్పరాక్షసాద్యాకృతుల సంచరించువారు. ఈయాకారములందుండియు వారు వస్త్రాదులను ధరించుచుండిరి.

దీనివలన తోకలు, విషదంతములు కల కొన్ని మనుష్యజాతులు నాడు వసించుచున్నట్లు తోచుచున్నది. వీరు నాగరకజాతివారే. కామరూపు లగుటచే పురుషులారూపములతో వర్తించువారు. కాలక్రమమున వీరియందా కామరూపశక్తి నశించెను. మానవులతోడి వైవాహికసంబంధము లభివృద్ధియై వారు పూర్తిగ మానవు లైరి. ద్వాపరాంతమున నీ జాతిజనులలో జాంబవంతుడు, ద్వివిదుడు, ఉలూపి మొదలుగా వ్రేళ్లపై లెక్కిడ దగిన వారు మాత్రము మిగిలిరి. నేడు వారి వంశజులు కేవలమానవులు. మధ్యప్రాంతమునను దక్షిణదేశమునందును పెక్కుజనులు ఋక్షవానరగోత్రజులు నేటికిని కలరు. అస్సాము లోని నాగజాతివారి నందఱు నెఱుగుదురు.

ఈపురాణవ్యక్తుల యాయుఃపరిమితియు యాధునికపరిశోధకుల విమర్శకు పాత్రమైనది. ఒకవ్యక్తి వేయిసంవత్సరములు జీవించెనన్నచో వీరు నమ్మరు. పాశ్చాత్యవిమర్శపద్ధతులు వీరికి బాగుగ నొంటబట్టి భారతీయసంప్రదాయముపై విశ్వాసము నశించినది. భీష్ముని యాయుః పరిమాణ మాఱునూర్ల యేండ్లన్నచో వీరికి నమ్మ బుద్ధి పుట్టదు. మెతూషేవయస్సు 969 సం॥లనీ హనోవయస్సు 365 ఏండ్లని, లెమే వయస్సు 777 ఏండ్లని, నోవావయస్సు 950 ఏండ్లని బైబిలు చెప్పినచో అదిపాశ్చాత్యవేదము కనుక నమ్మ వచ్చును. రాముడు వారధి నిర్మించుట మాత్ర మసత్యము. కాని షినారుపీఠభూమిమీద ప్రజలెల్లరుచేరి స్వర్గము నందుకొను భవనము కట్టుట మాత్రము (జెనిసిస్ 11 : 3, 4) సత్యము. జలప్రళయ మత్స్యావతారగాథ లసత్యములు. ఏదో ప్రళయమున నోవా ప్రపంచమునందలి జీవకోటి నంతటిని మచ్చునకు రెండుగా నొకయోడలో చేర్చి ప్రళయము దాటుట నిజము. ఏలన వీనిని పాశ్చాత్యులు నమ్ముదురు. ఇట్లు మనవారి బుద్ధులు పరానుకరణప్రధానములై పాశ్చాత్యవాసనాదోషపరిభ్రష్టములై యున్నంతకాలము పురాణములు వారి కర్థము కావు. న్యూయార్కులోని జార్నెటిక్ ఆస్పత్రిలో కొలంబియావాసియగు జాకీర్ పెరైరా యనువానిని ఆధునికవిజ్ఞానము మూర్తీభవించిన అమెరికావైద్యశిఖామణులు పరీక్షించి యాతనికి 160 ఏళ్ల వయస్సున్న దని చెప్పిరి. అతని కప్పటికైదు పెండ్లిండ్లయినవి. మరల వివాహము చేసికొందునని ప్రకటింపగా ఇండియానా రాష్ట్రవాసిని యందు కంగీకరించిన దట. ఇది యాంధ్రప్రభ దినపత్రికలో 30-9-56 నాడు ముద్రింపబడిన వార్త. సగటు ఆయుర్దాయము 27 ఏండ్లే అగు భారతదేశమున నివసించు మన కీ వార్త విడ్డూరమే. కాని అమెరికనుల సగటు ఆయుర్దాయము నేడు 68 సం॥లు. సంప్రదాయవిశ్వాసము నశించిన కొలది మనయాయువు కాలక్రమమున నశించుచున్నది. యుగములపూర్వము జీవించినవారి చరిత్రను నేటి మనయల్పజ్ఞానముతో పరీక్షించుట యవివేకము. యుగము లక్కఱ లేదు. మొన్న మొన్న జీవించిన పాశ్చాత్యుల చరిత్ర లంగీకరించిన చక్రవర్తుల, రాజుల కవచములు మనరాష్ట్రరాజధాని సాలార్‌జంగ్ మ్యూజియమ్‌లో భద్రపఱుపబడినవి. మొలవఱకు గల కవచములే నేడు మనమెత్తున్నప్పుడు వారెంతటివారై యుండ వచ్చును? నాలుగైదు వత్సరములకృతము ఇటలీలో నాలుగేండ్లు నిద్రించి మేల్కొన్న బాలికగాథ వార్తాపత్రికలు చదువువా రెల్లరువినిరి. కాని కుంభకర్ణు డాఱు

నెలలు నిద్రించె నన్నచో నమ్మము. ఇది పురాణముల దౌర్భాగ్యము కాదు, భారతీయుల దౌర్భాగ్యము.

ఇంకను పురాణములందు ప్రయోగమాత్రముచే సకలబ్రహ్మాండమును నిర్ధూమధామము చేయ గల యాగ్నేయ, వారుణ, నాగ, గారుడ, బ్రహ్మ పాశుపతాద్యస్త్రసంఘము వర్ణిత మైనది. ప్రత్యక్ష మొక్కటే ప్రమాణముగ స్వీకరించు మనము వాని నంగీకరింపక పోవుటలో వింత లేదు. భారతయుద్ధమున నేటి కైదువేలయేండ్లక్రిందట ప్రయుక్తములైన యీ యస్త్రములింతలో నామరూపములు లేకుండ నెట్లు నశింపగలిగెనో? చూడ చూడగ నాధునికవైజ్ఞానికపరిశోధకుల కివి పురాణకారుల యూహాజన్యములై కన్పట్టుచున్నవి.

నేడు సర్వభూతలము పెట్టుబడిదారివర్గము, శ్రామికవర్గము, తటస్థవర్గ మని మూడు వర్గములుగా విభక్తమైనది. అమెరికారష్యాదేశములు మొదటి రెండువర్గములకు ప్రతినిధులై పరస్పరవిజిగీషచే ననేకములగు నణ్వాయుధములను నిర్మించుచున్నవి. భారతదేశముఖ్యములు తటస్థవర్గముగా నిలిచి యీ యణ్వాయుధనిర్మాణమును వ్యతిరేకించుచున్నవి. ఈయమెరికా రష్యాలు శక్తివంతములగు నణ్వాయుధములు, ఖండాంతరవేధులగు రాకెట్లు, గ్రహాంతరయానము సేయు రాకెట్లు నిర్మించుచున్నారు. తా నెక్కడో యొక శాస్త్రశాలయందు కూర్చుండి మీటనొక్కిన యంతిమక్షణమున ఖండాంతరమున నాతఁ డిచ్ఛగించిన అక్షాంశరేఖాంశరేఖలు సంధించుచోట సమస్తభూఖండము భస్మీభూతము కావలసినదేగదా! రష్యావారు 50 మెగాటన్నుల శక్తిగల యణ్వాయుధమును ప్రేల్చిరి. ఆధూమప్రవాహము ప్రసరించిన దేశములందెల్ల ప్రజలయారోగ్యము భంగమగుట యేడాదినాటి మాటయే. దాదాపు ప్రాచీనభారతీయమహాస్త్రము లింతకన్న ననేకపర్యాయములు శక్తివంతములైనవి. నేఁ డీ రాకెట్లనింధనశక్తిచే ప్రేల్చుచున్నారు. పూర్వము మంత్రశక్తిచే ప్రయోగించువారు. గ్రహాంతరములకు చను రాకెట్లను కొన్నిశబ్దతరంగములచే నడపుట నేడు వినుచున్నాము. అట్లే యీయస్త్రములు మంత్రోచ్చారణశబ్దతరంగములచే ప్రయోగింపబడెడివి.

ఈ యగ్రరాజ్యములు రెండును పరస్పరము శాంతిసంధి చేసికొని యస్త్రవిసర్జనము గావించినను, లేదా పరస్పరవిజిగీషాకాంక్షచే ప్రపంచయుద్ధము తెచ్చి పెట్టి లోకము నశించి మరల మానవుఁడు ప్రాతరాతియుగపునాటిజీవితమును పునరారంభించినను, నాటి మానవుఁ డీ యమెరికా రష్యాదేశముల యస్తిత్వమును, ఈ యణ్వాయుధనిర్మాణగాథలను తనబుద్ధి కతీతములగుటచే ననేమిరా విశ్వసింపఁడు. ఆ దృష్టితో నేడు మనము వ్రాయు చరిత్రలు, శాస్త్రములు సర్వథా కల్పితములు, అసత్యములు. దీనిని మాన్ప గల శక్తి నేటి పరిశోధకమ్మన్యుల యధీనమున గలదా? ఒక్కపురాణముల విషయమై మాత్రమే నేమి మన యవిశ్వాసము? భారతమాతా, నీ వెట్టి పుత్రుల గంటివి?

చరిత్ర – భూగోళము : పురాణములే మన చరిత్రలు. పాశ్చాత్యవిద్వాంసులు మనకు చరిత్రము లేదనుట వారి పరిశీలకతాదోషము. ఆధునిక చరిత్రకారులు కొందఱు పురాణముల చరిత్రము నంగీకరించుచున్నారు. మత్స్య

వాయు భాగవతములయం దాంధ్రరాజులగు శాతవాహనుల వంశక్రమ మభివర్ణింపబడినది. ఇక భూమి గోళాకారముగ కల దని యాధునిక శాస్త్రవేత్తలు వర్ణింపగా కమలాకారమున గల దనియు దానిని శేషుడు ధరించు ననియు పురాణములు వర్ణించును. ఇట్లీ రెండిటికి నడుమ మిక్కిలి వైరుధ్యము కలదు. మన దృష్టికి వీని సమన్వయ మత్యంతదుర్ఘటమై పొడకట్టును. కాని కల్యాణపత్రికయందు వీనికి చక్కని సామరస్యమార్గము చూపబడినది. అందలి విషయము లత్యాశ్చర్యకరములు.

ఇప్పటికే యీ వ్యాస మతివిస్తృతమైనం దున నా యీ విషయములు చర్చించుట కిది యదను గాదు. "పురాణములు – ఇతిహాస భూగోళములు అను మఱొక వ్యాసమునం దవి యెల్ల విస్పష్టముగ చర్చింపబడును.

కల్యాణపత్రికా సంపాదకులకు, సుదర్శన సింహగారికి, శేషాద్రిరమణకవులకు, ఉమా మహేశ్వరపండితులకు కృతజ్ఞతతో—

## పుత్రుల జ్ఞానమును పరీక్షించిన తండ్రి

ఒకనికి ఇద్దఱు కుమారు లుండిరి. యుక్త వయస్సు రాగానే వారి నాతడు బ్రహ్మచర్యా శ్రమమున ప్రవేశింపజేసి వేదాధ్యయనమునకై యొకగురునికడ నుంచెను. వారు చాలకాలము నకు చదువు ముగించి ఇంటికి తిరిగి వచ్చిరి. "నాయనలారా, మీరు వేదాంతము చదివి నారా?" అని తండ్రి ప్రశ్నించెను. వారు "ఔను" అని చెప్పగా, "మంచిది, బ్రహ్మ మన నెట్టిదో నాకు చెప్పుడు" అని యాత డడిగెను. అంత పెద్దకుమారుడు వేదముల నుండియు శాస్త్రములనుండియు ప్రమాణముల నెన్నిటినో చూపుచు నిట్లు సమాధానము చెప్పెను: "నాయనా, బ్రహ్మమును నోటిమాట లతో వర్ణించుటకు వీలు పడదు. మనస్సునకు కూడ నది గోచరము కాదు". ఇట్లనియు బ్రహ్మ మట్టిది ఇట్టి దని వర్ణింప బూని తుదకు "నాకంతయు తెలియును" అని వక్కాణించుచు తాను చెప్పుదానిని బలపఱచుటకై వేదాంత వాక్యముల నేకరువుపెట్టసాగెను. తండ్రి విని విని "సరే, నీవు బ్రహ్మమును నిజముగ తెలిసి కొన్నా వన్న మాట! మంచిది, నీపని చూచు కొనుము" అని వానిని పంపివేసెను. అంతట నాతడు తన చిన్నకుమారునిగూడ నదియే ప్రశ్న వైచెను. ఆపిల్లవాడు మౌనముదాల్చి నాడు. వానినోట నొక్కమాటయైనను వెలు వడ దయ్యెను. మాటాడుటకు గూడ నాతడు ప్రయత్నింపనే లేదు. అది గని తండ్రి యిట్లు విమర్శించి పలికెను. "మంచిది, నాయనా, నిజ మంతటిదే. పరబ్రహ్మమునుగూర్చి ఇద మిత్థ మని చెప్పుట కెంతమాత్రము సాధ్యము కాదు. దానినిగుఱించి పలుక నోరు తెఱచి నంతనే అనంతమును సాంతముగను, అపరి చ్ఛిన్నమును పరిచ్ఛిన్నముగను, అప్రమేయ మును ప్రమేయముగను నిర్వచించినవాడ వగు దువు. వేయిశ్లోకములను వేయిప్రమాణము లను ఏకరువుపెట్టుటకంటె నీ మౌనమే ఈవిష యమును మహోత్కృష్టముగ వెల్లడించు చున్నది.

# వార్తలు, విశేషాలు

## శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు

### కాంచీపురం

కాంచీపుర శ్రీరామకృష్ణమఠమున 17-2-1963 తేదినాడు శ్రీవివేకానందస్వామి శతతమజయంతిప్రారంభోత్సవము జఱుపబడినది. మంగళహారతి, భజన వేదపారాయణ, శ్రీశివసహస్రనామార్చనలతో నాటి కార్యక్రమము ప్రారంభమైనది. అలంకృతమైన శ్రీస్వామీజీ చిత్రమునకు ఊరేగింపు చేయబడినది. సుదూరప్రాంతములనుండి వచ్చిన భక్తులు, స్థానికకళాశాల ఎన్సీసివారు, నాలాజాబాదుస్కూలుఆర్కెస్ట్రావారు ఊరేగింపులో పాల్గొన్నారు. శ్రీరామకృష్ణవివేకానందుల పటములను ఏనుగులపై ఊరేగించిరి. మద్రాసు మఠభజనబృందమువారు ఊరేగింపులో భజన కావించిరి. ఊరేగింపు ముగిసిన పిమ్మట మద్రాసు మఠకార్యనిర్వాహకులగు శ్రీశుద్ధసత్త్వానంద స్వామి ప్రత్యేకపూజను హోమమును జరిపిరి. పచ్చయప్పహైస్కూలులో 3-30 నుండి సాయంకార్యక్రమము ప్రారంభమయ్యెను. మద్రాస్ విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలరు డాక్టరు ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియారు సభ కధ్యక్షత వహించి ప్రారంభోపన్యాసము చేసినారు. మద్రాసు శ్రీరామకృష్ణమఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు భారతదేశమున ఆధ్యాత్మికధ్వజము మహోన్నతమైయుండవలె ననిన యువజనులలో వైరాగ్యమును పెంపొందించుట ఆవశ్యక మని తెల్పిరి. 'కలైమగళ్' పత్రికాసంపాదకులగు శ్రీ కి. వ. జగన్నాథంగారు తమిళమున నుపన్యసించి శ్రీవివేకానందునిజీవితసందేశములను శ్రోతల చిత్తములందు హత్తుకొల్పిరి. శ్రీ సర్వజ్ఞానంద స్వాముల వందనవాక్యాలతోను జాతీయగీతగానముతోను నాటి కార్యక్రమము ముగిసినది.

### శ్రీశారదామఠము - దక్షిణేశ్వరము

17-1-1963 గురువారమునాడు శ్రీవివేకానంద జన్మతిథి పూజ కావింపబడినది. 22-వ తేదీనుండి 26-వ తేదీవఱకు బహిరంగోత్సవములు జరిగినవి. రామకృష్ణమఠమిషనుల ఉపాధ్యక్షులైన శ్రీమద్యతీశ్వరానంద స్వాములు ప్రారంభసమావేశమునకు అధ్యక్షత వహించి "స్వామీజీజీవితము, కళలు, విద్యలు" అనువానికి సంబంధించిన వస్తుప్రదర్శనమును (ఎగ్జిబిషన్) ప్రారంభించిరి. రామకృష్ణమఠమిషనుల సర్వాధ్యక్షులగు శ్రీమన్మాధవానంద స్వాములు పంపిన సందేశము చదువబడినది. శ్రీ యతీశ్వరానందులు తమఉపన్యాసములో మనదేశోద్ధరణమునకు ఆధ్యాత్మికజ్ఞానము ఆవ

శ్యకమను విషయమును నొక్కి చెప్పిరి. రామకృష్ణమఠమిషనుల సర్వకార్యదర్శి శ్రీమద్వీరేశ్వరానందస్వామి భారతదేశోద్ధరణమందును మహిళలప్రబోధనమందును శ్రీవివేకానందుల కుండిన అభినివేశమును గూర్చి ప్రసంగించిరి. 23-వ తేదీనాడు భక్తమహిళల సన్న్యాసినుల సమ్మేళనము జరిగినది. భక్తమహిళలును సన్న్యాసినులును శ్రీ వివేకానందస్వాముల జీవితమందలి వివిధవైఖరులనుగూర్చి ఉపన్యసించిరి. 24-వ తేదీనాడు విద్యార్థుల దినము. పాఠశాలల, కళాశాలల విద్యార్థులు నూర్లకొలదిగ సమావేశమై పెక్కుపోటీలలో పాల్గొన్నారు. గెల్పొందినవారికి బహుమతులు పంచిపెట్టబడినవి. 25-వ తేదీనాడు ధర్మసభ జరిగినది. మహిళలు లెక్కకు మిక్కిలిగా సమావేశమైరి. శారదామఠాధ్యక్షురాలైన 'ప్రవ్రాజికభారతీప్రాణ'గారి ప్రారంభోపన్యాసమైన పిమ్మట ఈక్రింద పేర్కొన్నవారును వివిధమతములనుగూర్చి ఉపన్యసించిరి. బౌద్ధమునుగూర్చి శ్రీమతి ఆషారాయి, క్రైస్తవమును గురించి డాక్టరు న్యూవెల్ కుమారి, ఇస్లామునుగూర్చి శ్రీమతి ఫతీమామామూద్, జోరోస్ట్రియమతమునుగూర్చి గాహియరు కుమారి, జైనమునుగూర్చి శ్రీమతి సుభద్రా కపాడియా, హిందూమతమునుగూర్చి ప్రవ్రాజిక వేదప్రాణ. డాక్టర్ రోమాచౌధురి తన అధ్యక్షోపన్యాసమున శ్రీ వివేకానందుల సర్వమతసామరస్యలక్ష్యమును ముచ్చటగ సంక్షేపించిరి.

ప్రతిదినము సాయంకాలములందు ఈక్రింద చెప్పబడిన వినోదకార్యక్రమములు జరుపబడినవి. రామకృష్ణమిషను, సిస్టరునివేదితగరల్సు స్కూల్ బాలికలచే స్వామిజీజీవితవిషయికమైన నాటకప్రదర్శనము, వివేకానందలీలాగీతి; రామకృష్ణశారదామిషను, వివేకానందవిద్యాభవన విద్యార్థులచే భజనకీర్తనలగానము 26-వ తేదీనాడు జరిగిన పెద్ద ఊరేగింపుతో ఈ ఉత్సవ కార్యక్రమములు ముగిసినవి. ఊరేగింపులో సన్న్యాసినులు, బ్రహ్మచారిణులు, ఇతరమహిళలు, వివిధపాఠశాలల, కళాశాలల విద్యార్థులు వేలకొలది పాల్గొనిరి.

## శ్రీరామకృష్ణుని 128-వ జయంతి మహోత్సవము
### రామకృష్ణమఠము, మద్రాసు

25-2-1963 సోమవారమునాడు వేగుజామున మంగళహారతితో కార్యక్రమము ప్రారంభమైనది. భజన, గీతోపనిషత్తుల పారాయణము, ప్రత్యేకపూజ, హోమము, దరిద్రనారాయణసంతర్పణము — ఇవి నాటి పూర్వభాగమున జరిగినవి. సాయంకాలము ఆరాత్రికమునకు పిమ్మట మండపమున సమావిష్టులైన భక్తులగోష్ఠిలో శ్రీశుద్ధసత్త్వానందస్వాములు గురుదేవుని సూక్తిరత్నములను కొన్నింటిని చదివి వినిపించిరి. శ్రీమత్కైలాసానందస్వామి శ్రీరామకృష్ణునిగూర్చి ఉపన్యసించిరి. ఆదినమే శ్రీపరమాత్మానందస్వామి చెంగల్పట్టుజిల్లాలో తిరుమణి అను ఊరికి పోయి కుష్ఠరోగుల నిలయవాసులకు పండ్లను భక్ష్యములను పంచిపెట్టి ఒకగంటసేపు శ్రీరామకృష్ణుని ఉపదేశములనుగూర్చి ఉపన్యసించిరి.

3-3-1963 భానువారమునాడు జయంతి బహిరంగోత్సవము. నాటి పూర్వాహ్ణమున

"శ్రీరామకృష్ణలీలాప్రసంగ" "శ్రీరామకృష్ణ కథామృత" బృహద్గ్రంథముల పారాయణ మును నూర్గురు భక్తులు నిర్వహించిరి. అనంతర కార్యక్రమము త్యాగరాయనగర రామకృష్ణ మిషను హైస్కూలు విద్యార్థుల హరికథా కాలక్షేపముతో ప్రారంభమైనది—పౌరమహా సభకు ముఖ్యమంత్రి పూజ్యశ్రీ కామరాజ నాడారుగారు అధ్యక్షతవహించిరి. శ్రీ అఖండం సీతారామశాస్త్రిగారు, శ్రీమత్కైలాసానంద స్వాములు, శ్రీ ఎమ్. పి. సోమసుందరము గారలు వరుసగా తెలుగు, ఇంగ్లీషు, తమిళము లలో ఉపన్యసించిరి. వివిధపాఠశాలలలో పోటీ లలో నెగ్గిన బాలబాలికలకు బహుమతు లిచ్చిన పిమ్మట సభాధ్యక్షులు తమిళములో మాట్లాడిరి. డాక్టరు టి. ఎమ్. పి. మహాదేవన్ గారి వందనవాక్కుతో సభాకార్యము ముగిసి నది. తర్వాత గంటసేపు మఠభజనబృందము వారు కాళీకీర్తన పాడిరి.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## సిద్ధాన్త శిఖామణి

(శ్రీరేణుకాగస్త్యసంవాదరూపశైవశాస్త్రము)

సంస్కృతమూలము : శ్రీ శివయోగి శివాచార్యులు; ఆంధ్రవివృతి : శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మ; వెల : రూ. 3-00; ప్రాప్తిస్థానము : సాధనగ్రంథమండలి, తెనాలి, గుంటూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.

శివయోగి శివాచార్యులు 'సిద్ధాన్తశిఖామణి' అను ఇర్వదియొక్క పరిచ్ఛేదములతో కూడు కొన్న ఈ శైవాద్వైతదర్శనగ్రంథమును రచించిరి. భక్త, మహేశ, ప్రసారి, ప్రాణలింగి, శరణ, ఐక్యము — మున్నగు వానిని తెలిసికొనుటయే మోక్షహేతువు. అందుచే రేణుకాచార్యులు ఈపై ఆరుసిద్ధాంతములను విశదీకరించి బోధించినారు. ఈ ప్రతిపాదితస్థానముల నుండి నలువదినాల్గు అంగస్థలములు, ఏబదియేడు లింగస్థలములు బయల్వెడలినవి. మతయోగాది విషయములు, ఆధ్యాత్మికదార్శనికవిషయాలూ ప్రతిపాదితములై యున్నవి ఈ గ్రంథములో.

'సిద్ధానశిఖామణి'ని పరమప్రామాణికగ్రంథముగా శ్రీపతిపండిత శ్రీకంఠశివాచార్యప్రభృతులు గ్రహించియున్నారు.

రెండుభాషలలో సమగ్రమైన పాండిత్యము ఉంటేనే తప్ప అనువాదం రాణించదు. కేవలం భాష ఒక్కటే వచ్చియుంటే చాలదు. ఏ విషయాన్ని అనువదిస్తున్నామో ఆ విషయంలో పరిపూర్ణపరిజ్ఞానం ఉండి అనువదిస్తేనే అనువాదం రక్తిగడ్తుంది.

వేదాంతవిషయమన్ననో — ఇది అనేక ఇక్కట్లతో కూడిన పని. అందు సంస్కృతంలోని ప్రామాణిక దార్శనిక గ్రంథము లన్నీ చదివి ఉంటే, ఏ దార్శనికగ్రంథమైనా సులభంగా తెనిగించ వచ్చు. ఇతరమతములను ఖండించినప్పుడు — ఆ మతములోని సంప్రదాయం తెలిసిఉంటేగాని, ఆ ఖండన పకడ్బందీగా ఉండదు. అట్టి చిక్కు లేవీ లేకుండా ఈ గ్రంథం సులభంగా అర్థమయ్యేటట్లు శ్రీ శ్రియానందనాథులు ఈశ్వరసత్యనారాయణశర్మగారు పాఠకలోకాని కందించుటచే అభినందనీయులు. ఈ గ్రంథరాజం మూడు వందల ముప్పదిరెండు పుటలతో ఒప్పియున్నది.

''భావేన గృహ్యతే దేవో
భగవాన్ పరమః శివః
కిం తేన క్రియతే తస్య
నిత్యపూర్ణో హిం స స్స్మృతః''—

షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన పరమశివుఁడు భావముచేతనే గ్రహింపఁబడును. అట్టిపరమాత్మునకుఁ జేయు బాహ్యపూజచేత నేమి ప్రయోజనము సాధింపఁబడును? ఏలన, అతఁడు నిత్యతృప్తుఁడు గదా! (షడైశ్వర్యగుణములు: ఉత్పత్తి, లయము, ప్రాణులరాకడ, ప్రాణుల పోకడ, విద్య, అవిద్య నెఱుఁగుట).

పై శ్లోకమున కిది శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి తెలుగు వివరణ.

వీరశైవం - భారతీయమతములలో ఆగమాంత నిర్దిష్టవిషయములపై పరమవిశ్వాసం జూపు మతములలో నిది యొకటి. అంతే గాక ముముక్షువులకు ముక్తిమార్గంచూపుటయే గాక తత్త్వప్రతిపాదకమైన మతసిద్ధాంతం విశేషంగా బోధిస్తుంది.

శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన ''భగవద్గీత'' వలె — ఇదియు శ్రీరేణుకాగస్త్య సంవాదరూపమై ''సిద్ధాన్తశిఖామణి'' ''రేణుకగీత'' ''రేణుకాగస్త్యసంవాదము'' - మున్నగు నామములతో ఒప్పింది.

ఈ గ్రంథరాజం వీరశైవులకే కాక వివిధ మతజిజ్ఞాసువులకు చింతామణివంటిది.

—వేదం రామశాస్త్రి

మదరాసు శ్రీరామకృష్ణమఠమున 1963-వ సం॥ 'మే' 'జూన్' నెలల విశేషదినాలు

19-5-1963 బుద్ధజయంతి పౌరమహాసభ; ఏకాదశీ రామభజన

22-5-1963 శ్రీ శ్రీ ఫలహారిణికాళిపూజ (సాయం. 8 గంటలనుండి నిశీథమువఱకు)

3-6-1963, 18-6-1963 ఏకాదశీ రామభజన

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18)న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯   ౧౯౬౩, జూన్; శోభకృత్తు - జ్యేష్ఠము   సంచిక ౧౨

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

740 పుటలు శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తొలికూర్పు) రూ. 7/50

496 పుటలు శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) రూ. 5/-

144 పుటలు శ్రీ శారదాదేవి రూ. 1-25

312 పుటలు శ్రీ శారదా ప్రసంగములు రూ. 3-00

540 పుటలు శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) రూ. 3-50

432 పుటలు (సాదా) రూ. 3-50 శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) రూ. 4/-

564 పుటలు స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) రూ. 5/-

330, 324 పుటలు సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) రూ. 3/-

402 పుటలు పారమార్థిక సంభాషణలు రూ. 3/-

| | | | |
|---|---|---|---|
| శ్రీమద్భగవద్గీత | 4 00 | గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 0 50 |
| బ్రహ్మానంద బోధనలు | 3 50 | షికాగో నగరోపన్యాసములు ... | 50 |
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 50 | గురూపదేశములు | 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 50 | శ్రీ శారదా సూక్తి నవనీతము | 40 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- | శ్రీకృష్ణవాణి | 40 |
| పరతత్త్వప్రసంగము ... | 2/- | క్రీస్తు సూక్తిమాల | 0 40 |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 25 | శ్రీ వివేకానంద శంఖారావము | 0 40 |
| ప్రబోధరత్నాకరము ... | 2 25 | నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 0 37 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- | శ్రీ రామకృష్ణ ఉవాచ | 0 37 |
| దేవీమాహాత్మ్యము ... | 2/- | నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 37 |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 50 | శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 0 25 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 75 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... | 0 25 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 25 | పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 25 |
| హిందూ మతము ... | 25 | నవీన భారతదేశము ... | 0 25 |
| అనుష్ఠాన వేదాంతము ... | 25 | తాపత్రయ చికిత్స ... | 0 25 |
| వివేక సూర్యోదయము ... | 25 | పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 0 19 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- | సర్వం విష్ణుమయం జగత్ | 0 19 |
| భారతీయ మహిళ ... | 1/- | శ్రీ రామకృష్ణ ఆరాత్రికము | 0 12 |
| కఠోపనిషత్తు ... | 0 80 | శ్రీరామనామసంకీర్తనము 0 6 యతిగీతము | 0 6 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 75 | నామతము 0 6 వి. సింహగర్జనము | 0 6 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేపరి కొన్నచో: రూ. 18-50)

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



'అఖిలవిభు శరణొందుము, యీ క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.'

-శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯ } ౧౯౬౩ - జూన్ :: శోభకృత్తు - జ్యేష్ఠము { సంచిక ౧౨


శ్రీః

## సౌందర్యలహరి

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

కళఙ్కః కస్తూరీ రజనికరబిమ్బం జలమయమ్
కళాభిః కర్పూరై ర్మరకతకరణ్డం నిబిడితమ్
అత స్త్వద్భోగేన ప్రతిదిన మిదం రిక్తకుహరం
విధి ర్భూయోభూయో నిబిడయతి నూనం తవ కృతే ॥

| | | | |
|---|---|---|---|
| (భగవతి) | (అమ్మా) | త్వద్భోగేన | నీ వనుభవించుటచే |
| కళఙ్కః | మచ్చయే | రిక్తకుహరమ్ | ఖాళీయైన |
| కస్తూరీ | కస్తూరి | ఇదమ్ | ఈ బరణిని |
| జలమయమ్ | పన్నీటిరూపమగు | విధిః | బ్రహ్మ |
| రజనికరబిమ్బమ్ | చంద్రమండలము | ప్రతిదినమ్ | ప్రతిదినమును |
| కలాభిః | కళలనెడి | భూయఃభూయః | మరలమరల |
| కర్పూరైః | కర్పూరములతో | తవకృతే | నీకై |
| నిబిడితమ్ | నింపబడినదగు | నిబిడయతి | నింపుచున్నాడు |
| మరకతకరణ్డమ్ | పచ్చరాతిబరణి | నూనమ్ | నిజము. |
| అతః | అందువలన | | |

తా॥ అమ్మా, పన్నీటిరూపమగు చంద్రమండల మొక పచ్చరాతిబరణి. కళలు కర్పూరఖండములు, మచ్చ కస్తూరి. నీవు ఉపయోగించుకొనుటచే ఆ బరణి ప్రతిదినమును ఖాళి యగుచుండును. ప్రతిదినమును నీకై బ్రహ్మదేవుడు దానిని నింపుచుండును.

కళత్రం వైధాత్రం కతికతి భజన్తే న కవయః ?
శ్రియోదేవ్యాః కో వా న భవతి పతిః కైరపి ధనైః ?
మహాదేవం హిత్వా తవ సతి సతీనామచరమే
కుచాభ్యా మాసఙ్గః కురవకతరో ర ప్యసులభః ॥ ౯౭

| | | | |
|---|---|---|---|
| సతి | ఓ పతివ్రతా | కః వా | ఎవడు |
| సతీనామ్ అచరమే | పతివ్రతలలో అగ్రగణ్యురాలా, | శ్రియః దేవ్యాః | లక్ష్మీదేవికి |
| | | పతిః | పెనిమిటి |
| కతికతి | ఎందరెందఱు | నభవతి | కాడు ? |
| కవయః | కవులు | తవ | నీ |
| వైధాత్రం కళత్రం | చతుర్ముఖుని దేవేరిని | కుచాభ్యామ్ | స్తనములతోడి |
| నభజన్తే | సేవించుటలేదు ? | ఆసఙ్గః | ఆలింగనము |
| కైః అపి | ఏదో కొంత | మహాదేవంహిత్వా | సదాశివునకుతప్ప |
| ధనైః | సంపద ఉన్నంతమాత్రము చేత | కురవకతరోః అపి | గోరంటచెట్టునకు సైతము |
| | | అసులభః | సులభముకాదు. |

తా॥ అమ్మా నీవు పతివ్రత వగుటే కాదు, పతివ్రతలలో అగ్రగణ్యురాలవుగ ఉన్నావు. సరస్వతికి కవు లందఱును "వల్లభులే", లక్ష్మికి ఏకొంత ధనము గలవారైననుసరే, "పతులే." కాని పార్వతివగు నీకు పతి మహాదేవు డొక్కడే. నీ కౌగిలి అతని కొక్కనికే లభ్యము. ఆలింగనమే దోహదముగా గల గోరంట చెట్టునకు సైతము నీయాలింగనము సులభము కాదు.

గిరా మాహు ర్దేవీం ద్రుహిణగృహిణీ మాగమవిదో,
హరేః పత్నీం పద్మాం, హరసహచరీ మద్రితనయామ్,
తురీయా కాపి త్వం దురధిగమనిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మమహిషి ॥ ౯౮

| | | | |
|---|---|---|---|
| హేపరబ్రహ్మమహిషి | ఓసదాశివదయితా | త్వం | నీవు |
| ఆగమవిదః | ఆగమరహస్యవేత్తలు | తురీయా | (ఆముగ్గురగుటేకాక) నాల్గవ దానవు (గనుఉన్నావు) |
| ద్రుహిణగృహిణీమ్ | నలువయిల్లాలైన | | |
| గిరాందేవీమ్ | సరస్వతివి అని | కాపి | అనిర్వాచ్యవు |
| ఆహుః | పల్కుదురు | దురధిగమ | దుర్లభమైన |
| హరేః | విష్ణుదేవుని | నిస్సీమమహిమా | అపరిమితమైన ప్రభావము కలదానవు |
| పత్నీమ్ | పత్నియగు | | |
| పద్మామ్ | లక్ష్మివని | మహామాయాసతీ | శుద్ధవిద్యాంతర్గత మాయా తత్త్వమవై |
| (ఆహుః) | (పల్కుదురు) | | |
| హరసహచరీమ్ | శంభుపత్నియగు | విశ్వం | జగమును |
| అద్రితనయామ్ | గిరిజవని | భ్రమయసి | త్రిప్పుచున్నావు. |
| (ఆహుః) | (పల్కుదురు) | | |

తా॥ ఓసదాశివవల్లభా, బ్రహ్మదేవునిగృహిణియగు సరస్వతి వనియు, విష్ణుదేవునిప్రియ యగు లక్ష్మి వనియు, శంకరుని దయితయగు పార్వతి వనియు ఆగమరహస్యవేత్తలు పేర్కొనుచుదురు నిన్నే. ఆముగ్గురగుటే కాదు, నాల్గవదానవుగను ఉన్నావు. అనిర్వాచ్యవుగ నున్నావు. నీమహిమ అపరిమితము, దుర్లభము. శుద్ధవిద్యాంతర్గతవగు మహామాయవు నీవే, జగమును త్రిప్పుచున్నావు.

సరస్వత్యా లక్ష్మ్యా విధిహరిసపత్నో విహరతే
రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణ వపుషా
చిరఞ్జీవ న్నేవ క్షపితపశుపాశవ్యతికరః
పరానన్దాభిఖ్యం రసయతి రసం త్వద్భజనవాన్ ॥ ౯౯

| | | | |
|---|---|---|---|
| (భగవతి) | (అమ్మా), | రతేః | మన్మథదయితకుగల |
| త్వద్భజనవాన్ | నీ భక్తుడు | పాతివ్రత్యం | పతివ్రతాధర్మమును |
| విధి | బ్రహ్మకును | శిథిలయతి | సడలించును |
| హరి | విష్ణువునకును | క్షపిత | విదళింపబడిన |
| సపత్నః సన్ | అసూయాస్పదుడై | పశుపాశ | జీవావిద్యల |
| సరస్వత్యా | సరస్వతి (కలిమి) తోను | వ్యతికరః | సంబంధముకలవాడై |
| | లక్ష్మి (కలిమి) తోను | చిరఞ్జీవన్ ఏవ | చిరంజీవి అయియే |
| విహరతే | విహరించును | పర+ఆనన్ద+అ | బ్రహ్మానందమును |
| రమ్యేణ | మిక్కిలి చక్కని | రసం | సుఖమును |
| వపుషా | మేనిచేత | రసయతి | ఆస్వాదించును. |

తా॥ అమ్మా, నీభక్తుడు సరస్వతికిని లక్ష్మికిని పతియై బ్రహ్మకును విష్ణువునకును పెన్నుద్ది యగును. మేనిచక్కదనముచేత మన్మథునిదయితకుసైతము మరులుగొల్పి ఆమెకుగల మన్మ

ధ్యానపురుషపరాఙ్ముఖతను సడలించును, అవిద్యాబంధమును విదళించుకొని జీవన్ముక్తుడై నిత్యజీవియై బ్రహ్మానందరసము నాస్వాదించును.

నిధే నిత్యస్మేరే నిరవధిగుణే నీతినిపుణే
నిరాఘాటజ్ఞానే నియమపరచిత్తైకనిలయే
నియత్యానిర్ముక్తే నిఖిలనిగమాన్తస్తుతపదే
నిరాతఙ్కే నిత్యే నిగమయ మ మాపి స్తుతి మిమామ్ ॥ ౧౦౦

| | | | |
|---|---|---|---|
| నిధే | సర్వజగదాధారా | నియత్యానిర్ముక్తే | నియమపారతంత్ర్యరహితా |
| | నిత్యప్రకాశా | నిఖిలవేదాన్త | సకలోపనిషత్తులచే |
| నిరవధిగుణే | అనంతగుణా | స్తుతపదే | కొనియాడబడిన చరణములు గలదానా |
| నీతినిపుణే | ఉపాసకులకు అర్హతానుగుణముగ ఇష్టార్థముల నిచ్చుటయందు నేర్పరీ | నిరాతఙ్కే | భయరహితా |
| | | నిత్యే | నిత్యురాలా |
| నిరాఘాటజ్ఞానే | నిరర్గళజ్ఞానస్వరూపిణీ | మమ | నా |
| నియమపర | జప పూజా ధ్యానాది నియమాసక్తుని | ఇమామ్స్తుతిమ్ | ఈ స్తుతిని |
| చిత్త ఏకనిలయే | మనస్సే ముఖ్యస్థానముగగలదానా | నిగమయ | వేద (తుల్య) ముగ జొనర్పుమా. |

తా॥ అమ్మా, సర్వజగములకు నీ వాధారవు; నీవు నిత్యవు, నిర్భయవు— నీప్రకాశము నిత్యము, నీగుణము లనంతములు, ఉపాసకులకు యథార్హ ఫలమిచ్చుటలో నీవు నిపుణవు. నీ జ్ఞానము నిరర్గళము. యోగులహృదయపీఠము నీకు ముఖ్యస్థానము, నీవు స్వతంత్రవు, సకలోపనిషత్తులును నీచరణములనే కొనియాడును, నేను కావించిన యీ నీ స్తుతికి వేదతుల్యత ప్రసాదింపుమా.

ప్రదీపజ్వాలాభి ర్దివసకరనీరాజనవిధిస్
సుధాసూతే శ్చన్ద్రోపలజలలవై రర్ఘ్యరచనా
స్వకీయై రమ్భోభి స్సలిలనిధి సౌహిత్యకరణం
త్వదీయాభి ర్వాగ్భి స్తవ జనని వాచాం స్తుతి రియమ్ ॥ ౧౦౧

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిన్దభగవత్పూజ్య
పాద శిష్యస్య శ్రీమచ్ఛఙ్కరభగవతః కృతిషు
సౌన్దర్యలహరీ సమాప్తా.

| | | | |
|---|---|---|---|
| వాచాంజనని, | వాక్కులనుకన్న తల్లీ | నీరాజనవిధిః | హారతి (వంటిది) |
| త్వదీయాభిః | నీసొమ్మైన | చన్ద్రోపలజలలవైః | చంద్రకాంతశిలనుండికాఱు నీటిచుక్కలచే |
| వాగ్భిః (ఏవ) | వాక్కులచేతనే (కావింపబడిన) | సుధాసూతేః | చంద్రునకు |
| ఇయమ్ | ఈ | అర్ఘ్యరచనా | అర్ఘ్యమిచ్చుట (వంటిది) |
| తవ | నీ | స్వకీయైః | తన |
| స్తుతిః | స్తోత్రము | అమ్భోభిః | నీళ్లచే |
| ప్రదీపజ్వాలాభిః | దివ్వెమంటలచే | సలిలనిధి | సముద్రమునకు (చేయబడిన) |
| దివసకర | సూర్యునకు (కావింపబడిన) | సౌహిత్యకరణమ్ | తర్పణము (వంటిది). |

తా॥ అమ్మా, వాక్కులను కన్నతల్లివి నీవు. వాక్కులు నీసొమ్ములు. వానితో నేను కావించిన నీస్తోత్ర మెట్లున్న దనగా, సూర్యదేవునకు కరదీపికతో కావించిన నీరాజనము వలెను, వెన్నెలకు కరగిన చంద్రకాంతశిల నీటిచుక్కలచే చంద్రున కర్ఘ్యమిచ్చుట వలెను; సముద్రమందలి జలములతోనే సముద్రమునకు చేయు తర్పణమువలెను—ఉన్నది.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులును
శ్రీగోవిందభగవత్పూజ్యపాద శిష్యులును
అగు శ్రీశంకరభగవత్పాదులకృతులలో
సౌందర్యలహరి సమాప్తము.

# శ్రీ వివేకానందమరందబిందువులు (౫)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

వత్సలారా, భయపడకుఁడు. కొండ విఱిగి మీఁదఁబడునేమోయనుభయదృక్కులతో, బేలచూపులతోఁ జూచెదరేల? ఉండుఁడు, తాలిమి వహింపుఁడు! కొలఁదిగడియలలో నంతయు మీకుఁ బాదాక్రాంతమగును. పరికింపుఁడు, ధనమువలన నేమి ప్రయోజనము? పేరుప్రతిష్ఠలవలన నేమిప్రయోజనము? పాండిత్యమువలన నేమిప్రయోజనము? ప్రేమయే ఫలప్రదము; దుర్భేద్యకష్టపరంపరలనెడి పర్వతములను విదళించి రాజమార్గ మేర్పఱచునది వజ్రాయుధతుల్యమగు శీలము.

'తటపటాయింపు' వలదు. 'గుప్తసాధనలును' గూఢ దుర్మార్గావలంబనములును నెంతమాత్రము కూడవు; రహస్యముగా నొకమూలనక్కి, యేకార్యమును జేయరాదు.

"అభీరభీః" అను విశేషణము భగవంతునకుఁ జెప్పఁబడినది మన వేదశాస్త్రములలో మాత్రమే. మనము భయరహితులమైనచో మన కర్తవ్యము తుదముట్టును.

నీయందలి దైవత్వము ప్రకటింపుము, ప్రకటించినచో సర్వము సమరసభావముతో దానిని జుట్టువారును.

మానవుఁడు తాను దుర్బలుఁడ ననుకొనుటయే మహాదోషము.

లెండు! 'అస్తి! అస్తి!' యను సద్భావమును బ్రకటింపుఁడు—సమన్వయభావములను జేపట్టుఁడు. "నాస్తి-నాస్తి" యను వ్యతిరేకభావములను బట్టుకొని యూఁగులాడుచుండుటచేతనే దేశ మధోగతి పాలగుచున్నది... ప్రతిజీవియందును నఖండ శక్తి కలదు. 'నే నల్పుఁడను, తుచ్ఛుఁడ'నను నాస్తికభావముల నాశ్రయించి పందులును పిల్లులు నగుటయా మీరు? ఏమి ఘోరకలి! నాస్తికతను నిరసనమును బోధింపసాహసించువా రెవ్వరు? 'అబల' లనియు 'భీరువు' లనియు నెవరినిమీరు నిరసించుచుండుట? "శివోఽహం, శివోఽహమ్." నాస్తిక భావములను నిరసనభావములను జనులు నొక్కి వక్కాణించుట వినిన, నాకుఁ దలపైఁ బిడుగు పడినట్లు తోఁచును... ఆత్మనిరసనమును వినయమనవచ్చునా? "నాయమాత్మా బలహీనేన లభ్యః"—ఈయాత్మ బలహీనులకు లభ్యము కానేరదు... హిమసంఘాతమువలెఁ బ్రపంచముపైఁ బడుఁడు—తద్భారమునఁ బ్రపంచము గుభిల్లుమని పగిలి పోఁగాక! హర! హర! మహాదేవ! "ఉదరే దాత్మనాత్మానమ్" - తనవలననే, పురుషప్రయత్నముననే, త న్నుద్ధరించుకోవలయును.

## మనస్సంయమము

మనస్సంయమమువలననే మనకు నిజమైన శీల మేర్పడుచున్నది.

మనస్సంయమమే, మనస్సుయొక్క బహిః ప్రవృత్తి నరికట్టి ప్రజ్ఞానఘనమగు నాత్మస్థితిని బొందించుటకై మనస్సు నంతర్ముఖము చేయుటయే, యోగమునకుఁ బ్రథమసోపానము. మనోనిగ్రహమున కిదియే సరియైన మార్గము.

ఎంతటి దుర్జనుఁడైనను, "ఇఁక నతఁడు యోగ్యుఁడు కానేరఁ" డని చెప్పవలదు. ఆతని ప్రస్తుతవర్తన మాతని యభ్యాసఫలితమే కదా. నూతనమైన సదభ్యాసములచే దన పూర్వాభ్యాసముల నాతఁడు నిగ్రహింపవచ్చును. అభ్యాసఫలితమే శీలము కావున మంచియలవాటుల నలవఱచుకొనుటయే శీలమును జక్కఁజేసికొను మార్గము.

స్వానుభవమువలనను బరుల యనుభవమువలనను గుణపాఠములను గ్రహించి విషయాసక్తిని నిగ్రహించి మనస్సును దానిబారిఁ బడనీయకుండుటయే వైరాగ్యము. విషయేచ్ఛలు నీకు వశమైయుండవలయునే కాని నీవు విషయేచ్ఛలకు వశుఁడవై యుండరాదు. ఇట్టిమనోబలమే వైరాగ్యమనఁబడును. వైరాగ్యమును మించిన మోక్షసాధనము మఱియొకటి లేదు.

ఒకఁడు మన కెగ్గుచేసినయెడల వెంటనే ప్రతీకారముఁ జేయనెంతుము. ప్రతీకారము మనోనిగ్రహసామర్థ్యము కొఱవడియున్నదని వెల్లడించును. దుర్వృత్తి నవలంబించినంతనే మనోబలమును గోల్పోవుచున్నాము. ఒకనిని ద్వేషించుటచేఁగాని, వానికి హాని చేయుటచేఁ గాని ప్రతీకారము చేసినప్పుడెల్ల మనస్సున కెంతయో యనర్థమువాటిల్లుచున్నది. దుష్ప్రవృత్తినిగాని, ద్వేషప్రేరితమగు కార్యమును

గాని, ప్రతీకారము చేయవలయునను మఱెట్టి సంకల్పమునుగాని నిగ్రహించినప్పుడెల్ల మన కది ప్రయోజనకరమగుచున్నది. మనోనిగ్రహమువలన నపారమగు శక్తి లభించును. నిగ్రహమువలన మన కెన్నఁడును నష్టము కలుగదు. ద్వేషమునుగాని, క్రోధమునుగాని నిగ్రహించినపుడెల్ల మహోపయుక్తమగు సత్త్వశక్తిని జేకూర్చుకొనుచున్నాము. ఇట్టి సత్త్వశక్తి నుండియే యుత్తమమానసికశక్తులు వెలువడుచున్నవి.

ఒకని దోషములనుగూర్చి చెప్పుటచే నీవు వానికిఁ దోడ్పడఁజాలవు, అది వానికిని నీకును గూడ హానికరమే.

సంఘమునుగాని, వ్యక్తినిగాని సంస్కరింపవలయునని బలాత్కారముగాఁ బ్రయత్నించుచో, సిద్ధించున దెప్పుడును నపజయమే. ''నీవు మంచివాఁడవే, కాని యింకను మంచివాఁడవగు'' మని చెప్పుము; కాని యెవ్వనిని ''నీవు దుర్మార్గుఁడ'' వనకుము.

రహస్యముగా నితరులను నిందించుట పాతకమని గ్రహింపుము. దానిని నీవు పూర్తిగా విడనాడవలయును. మనస్సున కనేకవిషయములు తోఁపవచ్చును. కాని వానిని వెల్లడింపఁబూనుచో, గోరంతలను గొండంతలు చేయుచుందుము. క్షమచేతను విస్మరణచేతను సర్వము నంతమొందును.

వ్యర్థవాగ్వాదమునిమిత్తము నీయొద్ద కెవ్వరైనను వచ్చినచో, మర్యాదగా నొత్తిగిలుము. సమస్తసంప్రదాయములయెడను నీవు సానుభూతి గల్గియుండవలయును. నీయం దీప్రధానసుగుణములు ప్రకటితమైనపుడే మహాశక్తిసామర్థ్యములతోఁ బనిచేయఁ గలుగుదువు.

తన సోదరుని నిందింపవచ్చువాని మాటలకుఁ జెవియొగ్గకుము. వానిని వినుటకూడ మహాపాపమే. భావిదుఃఖముల కది పుట్టినిల్లు. ప్రతివ్యక్తిలోపములను సహింపుము. లక్షలకొలఁది నేరములనైనను క్షమింపుము.

నీతివర్తనుఁడవై యుండుము, ధీరుడవై యుండుము. మనఃపూర్వకముగా వర్తింపుము -అన్నిటికిని దెగించిన ధైర్యసాహసముల నవలంబించి యఖండధర్మపథానువర్తనుఁడవై యుండుము. మతవాద ప్రతివాదములతో నీ మనస్సును కలవరపఱచుకొనకుము. ఎల్లరను ప్రేమింప యత్నింపుము.

వంచనచే, మోసముచే, నేమహాకార్యమును సాధింపఁజాలము. సమస్త కార్యములును ప్రేమమూలమున, సత్యనిష్ఠమూలమున, అఖండ శక్తిసామర్థ్యముల మూలమున సాధింపఁబడుచున్నవి. కావున నీ పౌరుషమును ప్రకటింపుము.

గాంభీర్యమును బాలనిష్కాపట్యముతో మేళవింపుము. ఎల్లరతోడను బొత్తు కలిగి మనుము. అహంభావమును స్వమతాభినివేశమును బాక్షికభావములను బూర్తిగా విడనాడుము. వ్యర్థవాగ్వాదము మహాపాపము.

నిరుత్సాహమును, అధైర్యమును నెన్నఁటికిని ధర్మమనిపించుకొనఁజాలవు. సదా మందహాసవదనముతో నానందకరుఁడవై యున్నచో, నే ప్రార్థనకంటెను ని న్నది విశేషభగవత్సన్నిహితుని జేయును

జీవాత్మనివాసమగు నీ దేహమందిరము కర్మసాధనము. దీనిని నరకకూపముగా నొనర్చువాఁడును నలక్ష్యముచేయువాఁడునుగూడ నిందార్హులే.

# శ్రీ యోగానందస్వామి

## [సంపాదకీయము]

దక్షిణేశ్వరాలయారామమునకు శ్రీరామకృష్ణుడు తరుణులును వృద్ధులును అగు భక్తులను ఆకర్షించుచుండిన దినములలో ఆఊరిలో నొక కుటుంబమునకు చెందిన ఇరువదేండ్లకు లోబడిన యొకడు రాణీరాస్మణితోటకు వచ్చుచుండెడివాడు. బ్రాహ్మసమాజమువారి రచనలలో అతడు శ్రీరామకృష్ణునిగూర్చి చదివియుండెను. కాని గొప్పయింటివాడగుటచేతను పల్లెప్రజలకు సహజమైన అభిమానము గలవాడగుటచేతను శ్రీరామకృష్ణుని పరిచయము చేసికొనుట మున్ముందు ఘటిల్లదాయెను. ఒకనాడు ఒకపుష్పముపై అతనికి మోజుకలిగినది. అపు డెవడో యొకడు ఆదారిని పోవుచుండెను. అతనిని తోటకాపరినిగా ఎంచి ఆపువ్వును కోసితెమ్మని ఈబాలు డడిగెను. అత డట్లే తెచ్చియిచ్చెను. మఱొకనాడు ఒక గదిలో ఆతోటకాపరికెదుట పెక్కండ్రు జనులు గుమిగూడి అతనివచనామృతమును గ్రోలుచుండ ఈబాలుడు చూచెను. కేశవుడు అంతగా కొనియాడివ్రాసిన రామకృష్ణు డితడేనా? ఈబాలుడు సమీపమునకు పోయెనుగాని వెలుపలనే నిలబడియుండెను. అప్పుడు శ్రీరామకృష్ణుడు వెలుపలనున్నవారి నందఱిని లోనికి పిలుచుకొనిరమ్మని ఒకని నంపెను. అతడు వచ్చి చూడగా వెలుపల ఒక్కబాలుడుమాత్రముండెను. అతనిని లోనికి పిలుచుకొనివచ్చి కూర్చుండబెట్టెను. సంభాషణ ముగిసి అందఱును వెడలిపోయినపిమ్మట శ్రీరామకృష్ణుడు ఆ బాలుని సమీపించి అత్యంతప్రేమతో అతని విషయములను గూర్చి ప్రశ్నించెను.

ఆబాలునిపేరు యోగీంద్రనాథచౌధురి. తన ప్రాతమిత్రుడగు నవీనచంద్రచౌధురికుమారుడే అత డని తెలిసినప్పుడు శ్రీరామకృష్ణు డానందించెను. ఈచౌధురీలు ఒకప్పుడు చాలగొప్ప అంతస్తులో భోగభాగ్యములతో ఒప్పియుండిరి. కాని యోగిను తలిదండ్రులు పేదవారే. అతని తండ్రి సనాతనాచారపరుడైన బ్రాహ్మణుడు. అనేకక్రతువులను చేసినవాడు. తనసాధనదినాలలో శ్రీరామకృష్ణుడు అప్పుడప్పుడు ఆక్రతువులను దర్శింప వచ్చియుండెను. కావునఆయన పరిచయము ఈకుటుంబమువారికి కలిగినది.

యోగిను 1861 లో జన్మించెను. బాల్యమునుండియు అతనిలో ధ్యానప్రవణత యుండెడిది. తోడిబాలురతో ఆడుకొనుచున్నప్పుడు తము తటాలున ధ్యానపరు డయ్యెడివాడు. వెంటనే ఆట మాని పరాకుగ నీలాకాశమువైపు చూపులు పఱపజొచ్చును. తాను ఈభువికి చెందినవాడు కానట్లును ఎందుండియో, ఏలోకమునుండియో తాను వచ్చియున్నట్లును తనచుట్టు నున్న వారు నిజముగ తన బంధువులు కానట్లును — అతనికి తోచుచుండెడిది. అతనికి భోగలాలస ఎన్నడును లేదు. అతని పద్ధతు లన్నియు సరళములైనవి. సహజముగ నతడు మితభాషి, మౌనప్రియుడు. అందుచే అతని మిత్రులు అతనితో విచ్చలవిడిగ మెలగలేకుండెడివారు. ఐనను అందఱికిని అతనిపట్ల ప్రేమాదరము లుండెడివి. ఉపనయనమైనపిమ్మట అత డెక్కువకాలమును ధ్యానారాధనలలో గడపుచుండెను. ధ్యానా

రాధనలలో అతనికి అప్పుడప్పుడు ప్రగాఢ నిమగ్నత కుదిరెడిది.

శ్రీరామకృష్ణుని మొదటిసారి కలిసికొను నప్పటికి యోగినుకు వయస్సు పదునాల్గో, పదునేడో సంవత్సరములు. అప్పు డతడు ప్రవేశపరీక్షకు చదువుచుండెను, ప్రథమసమావేశముననే శ్రీరామకృష్ణుడు ఈబాలునందలి ఆధ్యాత్మికశక్తిని గుర్తించి అప్పుడప్పుడు తన యొద్దకు వచ్చుచుండుమనెను. హృదయపూర్వకముగ గురుదేవుడు చూపిన ప్రేమ యోగినును ముగ్ధనొనర్చినది. వీలైనన్ని పర్యాయములు అతడు శ్రీరామకృష్ణునొద్దకు వచ్చుచుండెను.

శ్రీరామకృష్ణుడు వెఱ్ఱిబ్రాహ్మణు డని దక్షిణేశ్వరమందలి ప్రజల యభిప్రాయము. శ్రీరామకృష్ణునిలోని వైపరీత్యమునకంతటికిని ఆయనకు గల్గిన భగవత్సాక్షాత్కారానుభవమే కారణ మని వారెఱుగ రైరి. శ్రీరామకృష్ణుడు వర్ణధర్మములను సరిగ పాటించుచున్నాడా అని సనాతనవర్గమువారు సందేహించుచుండిరి. కావున ఆయనయొద్దకు ధారాళముగ పోవుటకు యోగినుకు ధైర్యము లేక పోయెను. తల్లిదండ్రులకు తెలిసిన వా రడ్డ పడెద రని అతడు భయపడెను. కావున నతడు శ్రీరామకృష్ణునొద్దకు రాకపోకలను రహస్యముగ సాగించుచుండెను.

కాని హత్యాపరాధమువలె ప్రేమయు భయటపడి తీరును. యోగినుకు రామకృష్ణునందు అత్యధికభక్తి యున్న దనియు తన కాలములో చాలమట్టుకు ఆయనసన్నిధిలో గడపుచుండె ననియు ఎల్లరకు తెలియనయ్యెను. అందు కతని మిత్రులును సఖులును ఎత్తిపొడుచుచు గేలిసేయుచుండిరి. ప్రశాంతశీలుడైన అతడు ప్రతికూల ప్రసంగములనెల్ల మౌనహాసముతో నెదుర్కొనెడివాడు. యోగినుకు చదువునందు శ్రద్ధ లే దనియు శ్రీరామకృష్ణుని ప్రభావమునకు అత డెంతయు లోబడిపోయె ననియు గుర్తించి తల్లిదండ్రులు కలవరపడిరి. కాని నూటిగ అడ్డుపడినచో ప్రయోజనముండ దనుకొని అట్లు చేయ వా రిష్టపడ రైరి.

ఐహికవాంఛ లెవ్వియు లేనందున చదువు సాగించుట నిరర్థక మని యోగిను తలంచెను. కాని పేదఱికముచే బాధపడుచుండు తల్లిదండ్రులకు సాయపడగల్గియుండుటకై నౌకరి వెదకుచు అతడు కాన్పూరుకు పోయెను. కొన్ని నెలలకాలము ప్రయత్నించి చూచెను కాని నౌకరిని సంపాదింపలేక పోయెను. కావున అతడు సమృద్ధిగ నున్న తన విరామకాలమును ధ్యానసాధనలకు వినియోగించెను. ఎవరితోను చేరక తనభావనాప్రపంచములో ఏకాంతముగ నుండుట అతని కిష్టముగ నుండెను. మాటాడుటను తనకు శక్యమైనంతవఱకు తగ్గించుకొనెను. అతనినడవడియు చేష్టితములును విపరీతములుగ నుండినవి. కాన్పూరులో అతడు తన పితృవ్యుని (మాతులుని) తో నుండెను. ఇతనికి వెఱ్ఱిపట్టు నేమో యని ఆపెద్దాయన దిగులుపడి ఈవిషయమునంతను తెలుపుచు "పెండ్లిచేసిననే ఈ పిచ్చి కుదురును, పెండ్లిచేసినయెడల ఐహికవిషయసక్తి కలుగును" అని యోగీంద్రనాథునితండ్రికి జాబు వ్రాసెను.

యోగినుకు ఇవేవియు తెలియవు. ఊరిలో ఎవరో జబ్బున పడియున్నా రను వార్త అతని కందినది. అతనికి తల్లిపై భక్తి యెక్కువ. జబ్బునపడి నామె ఆమెయే కాబోలు నని యెంచి అతడు పరుగున దక్షిణేశ్వరమునకు వచ్చెను. కాని వచ్చి చూడగా తనకందిన

వార్త అసత్య మని తెలిసి అతడు మిక్కిలి చకితు డాయెను. పెండ్లికి అతనిని రప్పించుటకు సాకే ఆవార్త. గొప్పచిక్కులో పడినాడు. పెండ్లి ఆధ్యాత్మికజీవితమునకు ప్రతికూలము. కావున అది అతనికి ఇష్టము లేదు. త్యాగజీవితమును గడపవలె ననియు తన కాలమును శక్తిని పూర్తిగ భగవత్సాక్షాత్కారమునకు వినియోగింపవలె ననియు అతని గొప్ప కోరిక. కాని అతని ఉదారసంకల్పమును విఘ్నిత మొనర్చుటకు ఇప్పుడు కుట్ర జరిగియున్నది.

యోగిను చాల ప్రశాంతస్వభావుడు. తల్లిదండ్రుల కోరికలను, ముఖ్యముగ తల్లికోరికను ప్రతిఘటించు సామర్థ్య మతనికి లేదు. కావున తన వశము తప్పి పెండ్లికి సమ్మతించెను. పెండ్లి చేసిన యోగిను మనస్సు ఐహికప్రవణ మగునని తల్లిదండ్రు లెంచిరే, అది భ్రమ. అందులకు వ్యతిరిక్తమైన పర్యవసానము కలిగెను. బ్రహ్మచారిజీవితమును గడపవలె నను తన సంకల్పము విఘ్నితమైనందున అందుంగూర్చి మిగుల ఖిన్నుడై మనోవ్యథాభరవివశుడయ్యెను. అహోరాత్రములు తాను చేసిన తప్పిదమునుగూర్చి అతడు యోచించుచుండెను. శ్రీరామకృష్ణునకు తన మోము చూపుట కతడిష్టపడ లేదు. ఆధ్యాత్మికముగ ఉజ్జ్వలభవిష్యత్తు తన కున్నదని యెంతో ఆశపెట్టుకొనియున్న శ్రీరామకృష్ణుడు, పెండ్లి చేసికొనుటచే ఆయననిరీక్షణల నన్నిటిని తాను వ్యర్థపుచ్చితినని తెలిసినప్పుడు విఫలాశు డగును — అని ఊహించెను.

తనకు ప్రేమాస్పదుడైన యోగినుకు సంభవించిన వాని వార్త శ్రీరామకృష్ణున కందెను. వచ్చి తన కగపడి పొమ్మని ఆయన యోగినుకు మాటిమాటికిని కబు రంపెను. కాని వచ్చుట కత డిష్టపడ లేదు. అంతట శ్రీరామకృష్ణుడు యోగీంద్రనాథుని మిత్రునితో "యోగిను మును పొకసారి ఇచ్చటినుండి కొంత పైకమును తీసికొని పోయెను. ఆపైకమున కతడు లెక్కను చూప లేదు. దానిని వాపసు చేయను లేదు. వింతగా నున్నదే!" అనెను. ఈమాట విన్నప్పుడు యోగిను చాల నొచ్చుకొనెను. కానుప్పూరుకు తాను పోవుటకు ముందు గుడిఅధికారి యొకడు కొన్ని వస్తువులను కొనితెమ్మని కొంత పైకము తన కిచ్చియుండుట అతనికి జ్ఞప్తికి వచ్చెను. ఈవివాహవృత్తాంతముచే గుడికి పోవుటకు సిగ్గుపడి పైకమును వాపసుచేయ లేకపోయెను. కాని రామకృష్ణుని మాటలు తన్ను మిక్కిలి కలవరపెట్టుటచే శక్యమైనంత తొందరగా పైకమును వాపసుచేయవలెననియు అదే శ్రీరామకృష్ణునొద్దకు తాను చేయు తుదిప్రయాణ మనియు అతడు నిశ్చయించుకొనెను.

యోగిను తన్ను దర్శింప వచ్చినప్పుడు శ్రీరామకృష్ణుడు మంచముపై కూర్చుండియుండెను. ధోవతిని ఒడిమీదికి వేసికొనియుండెను. యోగిను వచ్చినవెంటనే ధోవతిని చంకలోనుంచుకొని ఆదరింప శిశువువలె పరుగిడెను. యోగిను వచ్చినందుకు ఆయన ఆనందపరవశు డయ్యెను. అతనితో రామకృష్ణుడనిన మొదటి మాట "నీవు పెండ్లి చేసికొనినందున ఏమి హాని? నీ యాధ్యాత్మికజీవితమునకు వివాహ మెన్నడును ఆటంకము కాబోదు. భగవదనుగ్రహ ముండినచో నీ ఆధ్యాత్మిక పురోగతికి నూఱుపెండ్లిండ్లైనను ఆటంకములు కాజాలవు. నీభార్య నొకనా డిటకు పిలుచుకొని

రమ్ము. ఆమె నీకు తోడుసు కాక గొప్ప తోడగునట్టుగా నేనామె మనస్సును మార్చెదను.

ఇంచుక ఉద్రిక్తభావదశలోనుండి శ్రీరామకృష్ణుడు పల్కిన ఈమాటలు విన్నప్పుడు యోగీంద్రునిగుండెపై నుండిన పెనుబరువును తీసివేసిన ట్లాయెను. అందనుక చీకటిగనున్న పట్టున వెలుగు కననయ్యెను. క్రొత్త ఆసపాటు ప్రోత్సాహము అతనిలో నిండెను. శ్రీరామకృష్ణుని వీడ్కొనునప్పుడు అతడు తాను బాకీ పడియున్నపైకముమాట ఎత్తెను. శ్రీరామకృష్ణుడు ఆమాటను చెవిలో వేసికొననే లేదు. తన్ను రప్పించుటకే శ్రీరామకృష్ణుడు ఆపైకమునుగూర్చి చెప్పె నని యోగిను గ్రహించెను. శ్రీరామకృష్ణునందు అతనికి ప్రేమాదరములు మఱింతగా హెచ్చినవి. అత డాయన యొద్దకు తఱచుగ రాసాగెను.

పెండ్లికితర్వాతకూడ ఐహికవిషయము లందు యోగీంద్రుడు మునుపటివలెనే విరక్తుడుగ నుండెను. వివాహబంధముచే అతని కైహికసంగమును కలిగింప నెంచిన తల్లిదండ్రులకు మిగుల ఆశాభంగము కలిగెను. వివాహమాడి భార్యను పోషింపవలసిన బాధ్యత గల యువకునకు ఇంతటి ప్రవర్ధమానవైరాగ్యము తగ దని ఒకసారి తల్లి అతనిని మందలించెను. అతడు మిక్కిలి కలవరపడెను. తల్లి యెంతో కోరినందుననే కదా అతడు పెండ్లాడినది. ఈ క్షణముమొదలుకొని ఐహికజీవితవిరక్తి అతనిలో ఇంకనింకను హెచ్చెను. తనపట్ల నిస్స్వార్థమును నిర్వికల్పమును అగు ప్రేమకలవాడు శ్రీరామకృష్ణు డొక్కడే అని అతనికితోచెను. అధికకాలము శ్రీరామకృష్ణునితో గడపసాగెను. ఇందుచే అతనిని తర్ఫీదు చేయుటకు గురుదేవునకును మఱింత యెక్కువ అవకాశము లభించెను.

యోగిను చాల మెత్తనివా డని చెప్పియుంటిమి కదా. ఒకపురుగును హింసించుటయైనను అతనికి కష్టమే. ఒక్కొక్కప్పుడు మితిమీఱిన మృదుత్వము సుగుణము కాకపోవుటే కాక చిక్కులను తెచ్చిపెట్టును; యోగినులోని మెత్తందనమును గుర్తించిన శ్రీరామకృష్ణుడు అతని కీపాఠమును నేర్ప గోరెను. శ్రీరామకృష్ణునిగుడ్డలమూటలో ఒకప్పు డు కొన్ని బరిరెపురుగులు కనిపించినవి. ఈమాటను గదినుండి వెలుపలికి తీసికొనిపోయి బరిరెపురుగులను చంపు మని ఆయన యోగినును కోరెను. యోగినుగుడ్డలను గదినుండి వెలుపలికి కొంపోయెను. కాని తన మృదుశీలముచే వానిని చంపలేక పోయెను. పురుగులను విసరి పాఱవేసెను. ఈ వివరములను శ్రీరామకృష్ణుడు అడుగబో డని అత డెంచెను. కాని అతనికి వెఱగుగొలుపుచు "ఆబరిరెపురుగులను చంపితివా" అని శ్రీరామకృష్ణు డడిగెను. అతడు చంప లే దనెను. తనమాటను పూర్తిగా చెల్లింపనందుకు శ్రీరామకృష్ణు డతనిని మెత్తనిచీవాటు పెట్టెను.

మఱొకనాడు ఇట్టిసంభవమే కల్గినది. యోగిను కల్కత్తానుండి దక్షిణేశ్వరమునకు పడవలో బోవుచుండెను. పడవలో ఇతర ప్రయాణికులును ఉండిరి. వారిలో నొకడు శ్రీరామకృష్ణుని మోసగా డనియు ఇంకను ఏమేమో అనియు దూషింపసాగెను. ఆమాటలకు యోగిను నొచ్చుకొనెను గాని వానిని ఖండించుచు తా నొక్కమాటయైనను బల్క-

లేదు. "శ్రీరామకృష్ణుని నేను సమర్థింపవలసిన అక్కఱ లేదు. మూర్ఖుల దూషణలకు అందని ఉన్నతి—ఆయనకే కలదు' '— అని యోగిను తలంచెను.

దక్షిణేశ్వరమునకు వచ్చినపిమ్మట జరిగిన వాని నెల్ల యోగిను శ్రీరామకృష్ణునకు చెప్పెను. ఆ ప్రయాణికులతో జగడమాడని తన మంచితనమును ఆయన ఆమోదించుననుకొనెను. కాని శ్రీరామకృష్ణుడు అందుకు వ్యతిరిక్తముగ ప్రవర్తించెను. గురుదూషణను వినుచు మిన్నకున్నందుకు చీవాట్లు పెట్టెను. "శిష్యుడు మాఱుమాటాడక గురునిందను ఎప్పుడు విన రాదు. మాట్లాడుటకు తనకు శక్తి చాలకున్న అతడు ఆచోటును తక్షణమే వీడియైన పోవలెను" అనెను.

శ్రీరామకృష్ణునికై కొన్ని వస్తువులు కొనుటకు యోగిను అంగడివీధికి పోయెను. జిత్తులమారి యైన అంగడివాడు తాను చాల ధర్మబుద్ధికలవానివలె అభినయించెను, యోగిను అతడట్టివాడే యని నమ్మెను. దక్షిణేశ్వరమునకు వచ్చి చూచుకొనునప్పటికి అంగడివాడు తన్ను మోసగించె నని అతడు కనుగొనెను. శ్రీరామకృష్ణుడతనిని చుఱుకుగా చీవాట్లు పెట్టెను. "మానవుడు ఆధ్యాత్మికపరుడు అగుట మని కోరవచ్చును గాని అంతమాత్రముచేత అవివేకిగ నుండ రాదు."

(సశేషము)

# బుద్ధదేవుడు

## శ్రీ వివేకానందస్వామి

ప్రతిమతములోను దానికి ప్రత్యేకమైన ఒక విధమైన ఆత్మనిష్ఠ పెంపొందియుండును. ఎట్టి ప్రయోజనమును గాని ఉద్దేశింపక పని (సేవ) చేయుట అను రీతి ఆత్మనిష్ఠ బౌద్ధమతమున మిక్కిలి ఎక్కువగా పెంపొందియున్నది. బౌద్ధమతమే బ్రాహ్మణమతమని భ్రమింపకుడు. ఈదేశములో మీరాలాగు పొరపడవచ్చు. మా వర్గాలలో బౌద్ధవర్గ మొకటి. దానిని నెలకొల్పినవాడొక మహాపురుషుడు. అతనిపేరు గౌతముడు. తనకాలమున ఎడతెంపులేక సాగుచుండిన పరతత్త్వవిషయికచర్చలచేతను, దుర్భరకర్మకలాపములచేతను అంతకన్న ముఖ్యముగ వర్ణవ్యవస్థచేతను ఆయనకు విసుగు పుట్టెను. "మే మొకానొకదశను అందుకొ గలట్లు పుట్టియున్నాము. అలాగుపుట్టనివారి కంటె మేము వరిష్ఠులము" అని కొందఱందురు. మిక్కుటమైన మతాచార్యకైతవమునకు గూడ బుద్ధుడు ప్రతికూలుడే. ఆయన ఉపదేశించిన మతములో పనికి (సేవకు) ప్రేరకమైన ఉద్దేశ ముండరాదు. పరతత్త్వమును భగవంతుని గూర్చిన సిద్ధాంతములు పూర్తిగా అజ్ఞేయములు. 'దేవు డున్నాడా' అని ఆయన పెక్కుసార్లు ప్రశ్నింపబడి "నే నెఱుగ" నని జవాబు చెప్పినాడు. మంచినడవడినిగూర్చి అడిగినప్పుడు

ఆయన ''మంచి చేయుడు, మంచివారుగ ఉండుడు'' అని చెప్పెను. ఐదుగురు బ్రాహ్మణులు ఆయనయొద్దకు వచ్చి ''మా వివాదమును పరిష్కరింపు'' మని కోరిరి. ''నా ప్రమాణ గ్రంథానుసారము భగవంతుని లక్షణములు ఇవి ఇవి, భగవత్ప్రాప్తికి మార్గ మిది'' అని ఒక డనెను. ''అది తప్పు. నా గ్రంథమున ఇట్లిట్లు చెప్పబడియున్నది. భగవత్ప్రాప్తి కిది మార్గము'' అని మఱొకడు చెప్పెను. ఇట్లే తక్కినవారును చెప్పిరి. ఆయన వారి వాదముల నెల్ల నెమ్మదితో విని అం దొక్కొక్కనిని ''భగవంతు డాగ్రహించు నని కాని, ఎవరినైన హింసించు నని గాని, భగవంతు డపవిత్రు డని గాని మీ గ్రంథములలో ఎందైనను చెప్పబడి యున్నదా'' అని అడిగెను. ''లేదు, మహాశయా, దేవుడు విశుద్ధుడనియు, శివస్వరూపి యనియునే ఆ గ్రంథములన్నియు చెప్పుచున్న'' వని వా రనిరి. ''అటులేని, మిత్రులారా, భగవత్స్వరూపమును తెలిసికొనదగినట్లుగా మీరుకూడ మున్ముందు విశుద్ధులుగను సుజనులుగను ఏల కారు?'' అని బుద్ధు డడిగెను.

బౌద్ధమతమును పూర్తిగా నేను ఆమోదింపను లెండి. నామట్టుకు నాకు చాలవేదాంతమే కావలెను. పెక్కువిషయాలలో నా అభిప్రాయము పూర్తిగా భిన్నమైనది. అభిప్రాయభేద మున్నంతమాత్రముచే బుద్ధుని స్పృహణీయతను నేను గుర్తింపకపోరాదు. ప్రేరకమైన ఉద్దేశ్యము బొత్తిగా లేక పని(సేవ)చేసినవాడాయన ఒక్కడే. ఇతరమహాపురుషు లుండిరి. వా రందఱును ''మేము దేవుని అవతారములము, మమ్ము నమ్మిన వారికి నాక మబ్బును'' అని చెప్పినవారే. కొనఊపిరితో నున్నప్పుడు సైతము బుద్ధు డే మనెను? ''ఒరులు నీకు తోడ్పడలేరు, నిన్ను నీవే ఉద్ధరించుకొనవలెను. నీ విముక్తిని నీవే సాధించుకొనుము''. తన్ను గూర్చి ఆయన చెప్పినమాటలు: ''అనంతమును ఆకాశమువలె నిరవధికము నగు జ్ఞానమునకే బుద్ధుడు అనిపేరు. గౌతము డను నేను. ఆదశ నధిగమించితిని. సాధనచేసితిరేని మీ రందఱు గూడ ఆదశ నధిగమింతురు. ''ప్రేరకమైన ఉద్దేశ మేమియును ఆయనకు లేదు. స్వర్గమునకు పోవలయు నని ఆయన కోర లేదు. ధనమును కోర లేదు. రాజ్యమును సర్వస్వమును పరిత్యజించి భారతదేశవీధులలో ఆయన భిక్షాటన మొనర్చెను. పారావార మంతటి విశాల హృదయముతో ఆయన మానవులకే కాక సకలప్రాణులకును హిత ముపదేశించుచు చనెను. యజ్ఞములను మాన్పుటకును పశువులకై తాను ప్రాణమర్పించుటకును సదా సంసిద్ధుడుగ నుండిన పురుషు డత డొక్కడే. ఒకప్పు డొకరాజుతో ఆయన అన్న మాటలు : ''గొఱ్ఱెపిల్లను బలియిచ్చినచో నీకు స్వర్గము లభించునేని మానవుని బలియిచ్చినప్పుడు అంతకంటె పైపదవులు నీకు వచ్చును. కావున నన్ను బలియిమ్ము''. రాజు ఆశ్చర్యస్తబ్ధుడాయెను. మఱి యీ బుద్ధదేవుడు స్వప్రయోజనప్రేరణ మించుకైన లేనివాడు. ఆయన అఖండకార్యశూరుడు. ఆయన అధిగమించిన యున్నతిని చూచితిమేని కర్మాచరణశక్తిచే మనముకూడ ఆధ్యాత్మికశిఖరములను ప్రాపించుటశక్యమగు నని తెలియును.

అనేకులకు దేవునందు నమ్మక మున్నప్పుడే మార్గము సుగమతరమగును. కాని బుద్ధదేవుని జీవితచరిత్రము ఏమి బోధించుచున్న దనగా దేవుని నమ్మకున్నను వేదాంతము నొప్పకున్నను ఏమతమునకును చెందకున్నను ఏగుడికిగాని

ప్రార్థనాగారమునకుగాని పోవకున్నను ఐహిక పరుడ నని చెప్పుకొనుచు ఐహికపరుడుగ నున్నను — అట్టివాడు సైతము పరమోన్నత సిద్ధిని పొందగలడు — అని. బుద్ధునిగుణదోష ములను ఎన్నుటకు మన మధికారులము కాము. బుద్ధుని హృదయవైశాల్యమున అణుమాత్ర మైనను నాకుండరాదా అని నేను కోరుదును. బుద్ధునకు దేవునియందు నమ్మిక ముండవచ్చు, ఉండక పోవచ్చు. అది నాకు లెక్క లేదు. ఇతరులు భక్తిచేతను యోగముచేతను జ్ఞానము చేతను పొందిన పరిపూర్ణతనే అతడును పొంది నాడు. పరిపూర్ణతకు విశ్వాసముతో పని లేదు. మాటలవలన ఏప్రయోజనమును లేదు. చిలు కలు మాటాడ గలవు. నిస్స్వార్థమైన కర్మా చరణముచేతనే పరిపూర్ణత సిద్ధించును.



# శ్రీ శంకర, రామానుజులు

## (ప్రభాకర్)

సకలప్రాణులలోనూ మానవుడు ఉత్త మోత్తముడు. ప్రాణులను దేవత లనీ, మానవు లనీ, తిర్యగ్జంతువు లనీ వర్గీకరించటం పరిపాటి. తిర్యగ్జంతువు లనగా పశుపక్ష్యాదులు. తిర్య గ్జంతువులకంటె మానవుడు పైమెట్టువా డనీ, మానవునికంటె దేవతలు పైమెట్టువా రనీ— స్థూలదృష్టికి గోచరించ వచ్చు. కాని అటు వేల్పులకంటె ఇటు తిర్యగ్జంతువులకంటె కూడ మానవుని స్థానమే విశిష్టమైన దని శాస్త్రాలు చెప్తున్నాయి. తిర్యగ్జంతువులకు వివేకం లేదు, మానవునికి వివేకం ఉంది. కాబట్టి తిర్యగ్జంతు వులకంటె మానవుడు గొప్పవా డనడం సుల భంగానే అర్థ మవుతుంది. ఇక దేవతలకంటె మానవుడు ఏలా గొప్పవా డవుతాడో ఆలో చిద్దాం. పుణ్యం చేసిన నరుడు స్వర్గవాసి అవు తాడు, దేవత అవుతాడు. "క్షీణే పుణ్యే, మర్త్యలోకం విశన్తి" అని భగవద్గీతలో చెప్పి నట్లుగా పుణ్యకర్మఫలానుభవం ముగిసిన వెంటనే నరుడు స్వర్గంలోంచి మానవలోకానికి మరలి చేరిపోతాడు. దేవభూములు భోగ భూములు. భోగవ్యసనపరమైన దేవత్వంలో వివేకం నివురు కవిసిన నిప్పులాగా మఱుగుపడి ఉంటుంది. ధర్మానుష్ఠానానికి ఆధ్యాత్మికసాధ నానుష్ఠానానికి అవకాశం లేని దేవలోకాని కంటే, ఆ అవకాశం ఉండే మానవలోకం ఉత్కృష్టం. ఈ విషయమును శృంగారనైష ధంలో మహాకవిసార్వభౌముడు శ్రీనాథుడు ఆ కథకు ప్రసక్తమైన రీతిలో దమయంతి చేత ఈలాగు చెప్పించాడు —

శర్మమె కాని యవ్విబుధ
సద్మమునందుఁ దలంచిచూడఁగా

ధర్మము సేయ లేదిచట
ధర్మము సేయఁగ నిర్వికల్పక
శర్మమునొందనుం గలదు;
శర్మము ధర్మము గాంచు టొప్పునో
శర్మము గాంచు టొప్పుకొ వి
చారముసేయుము నెమ్మనంబునన్‌॥

కాబట్టి పైలోకంకంటె ఈలోకం మేలనీ, వేల్పుకంటె నరుడు మేలనీ సచమత్కారంగా అవగత మైంది.

మనలోకం ద్వంద్వమయం. అంటే అన్నీ జంటజంటలుగా ఉన్నాయి. జననం మరణం, సంయోగం వియోగం, వృద్ధి క్షయం, పగలు రాత్రి, సుఖం దుఃఖం, మంచి చెబ్బర, పుణ్యం పాపం — ఈలా గున్నాయి. ప్రతిజంటలో ఉన్న రెండూ ఒకదానితో ఒకటి కూడియే ఉంటుంది. కాబట్టి ఒకదాన్ని మనం సంపాదిస్తే, దానిని అంటి ఉండే ఆ రెండోదన్నీ, మనం కోరకపోయినా, ఎంత వద్దనుకున్నా మనకు దాపరించి తీఱుతుంది. ప్రతి జంటలో ఉన్న రెండూ అశాశ్వతాలే. దీనివెంబడి అదీ, దానివెంబడి ఇదీ వస్తూ ఉంటుంది, పోతూ ఉంటుంది —

రాత్రి తెగుడల దిన మేల రాక యుండు?
దినము తెగుడల రాత్రి యే తేర కున్నె?
పరగు సుఖదుఃఖములు కాలపర్యయమున,
నెందు మనుజుల బొందక యేల యుడుగు?

అన్నాడు మహాకవి ప్రబంధపరమేశ్వరుడు ఎఱ్ఱన.

మానవుడు తన అజ్ఞానదశలో ద్వంద్వాలకు ఉన్న అవినాభావసంబంధం మఱచి 'సుఖం కావాలి' 'కష్టం వద్దు' 'మంచి కావాలి' 'చెడుగు వద్దు' 'జననం కావాలి' 'మరణం వద్దు' అని ఆత్రపడుతుంటాడు. కోరింది లభించకపోతే అశాంతి, లభించింది ముగిసిపోతే అశాంతి, ముగిసిపోవడానికి ముందునుంచే ముగిసిపోబోతుం దనే దిగులుచే అశాంతి. అక్కఱలేనిది వచ్చి పడితే అశాంతి, వచ్చి పడుతుం దేమో అనే భయంచేత ముందునుంచే అశాంతి. సమస్తమానవలోకాన్ని పట్టి పీడిస్తుండేది అశాంతి. అనాదికాలంనుండి మానవుడు సదా శాంతినే అపేక్షిస్తున్నాడు, అన్వేషిస్తున్నాడు.

వివేకం భాసించినప్పుడు మానవుడు నిత్యమును అనిత్యమును, తథ్యమును మిథ్యను, సారమును అసారమును గుర్తించగలుగుతాడు. ఆత్మయే నిత్యం, ఆత్మయే తథ్యం, ఆత్మయే సారం, తక్కిన వన్నీ అనిత్యాలు అసత్యాలు అసారాలు అని గ్రహించగలుగుతాడు. అనిత్య-అసత్య-అసారాల వెంటబడడంచేతనే తాను అశాంతిని కొనితెచ్చుకుంటున్నట్లుగా అవగతం చేసుకుంటాడు. అశాంతి అంతరించాలంటే శాంతి సిద్ధించాలంటే నిత్యమునూ సత్యమునూ సారమునూ ఐన దాన్ని పొందా లని తెలుసుకుంటాడు.

సిద్ధికై చేసే సాధన అదొకయాత్ర లాంటిది: అందు కొక మార్గదర్శకుడు- గురువు అవసరం. గురుస్థానావశ్యకతను అంగీకరించని వారు ఉండరు. అంగీకరించక పోవటం అసాధ్యంకూడా. ఏలా గంటే గురువు అక్కఱ లేదనే మతానికి కూడా ఒకగురువు కావాలి.

సొంతఆస్థచేత, గురుసహకారంచేత, దైవ కృపచేత — సాగిన సాధన సిద్ధిస్తుంది.

సాధనమార్గాలు సుప్రసిద్ధాలు రెండు. ఒకటి జ్ఞానమార్గం, రెండోది భక్తిమార్గం.

జ్ఞానమార్గం అంటే అభేదబుద్ధిని అలవఱచుకొనే సాధన. చూడండి — వెండిఅంగట్లో వెండితో చేయబడ్డ వస్తువులు చిన్నవీ, పెద్దవీ — లెక్కలేనన్ని ఉంటాయి. లెక్కలేనన్ని పేర్లతో లెక్కలేనన్ని రూపాలతో ఉంటాయి. గరిటెలూ లోటాలూ చెంబులూ తట్టలూ తప్పేలాలు ఇలాంటివి ఇలాంటివి ఉంటాయి. ఐతే అన్నిట్లో ఉండే లోహం ఒక్కటే, వెండియే. అదే విధంగా లోకంలో చేతనాచేతనములైన వస్తువులన్నిటిలో ఉండే ఆత్మ ఒక్కటే. నామరూపాలమీద మనస్సు చెదరగొట్టుకొన్నామంటే 'నీవు' 'నేను' 'నీది' 'నాది' అన్న భావాలు పొటెక్కి అశాంతి కలుగుతుంది. నామరూపాలమఱుగున ఉన్న ఏకాద్వితీయమైన ఆత్మమీద మనస్సు నిశ్చలంగా నిలుపుకొన్నామంటే, ఆ సాధనలో సిద్ధి పొందినామంటే — అప్పుడు నీవూ నేనూ, వాడూ వీడూ, అదీ ఇదీ అంతా ఆత్మయే అన్న అనుభవం గలిగి శాంతి సిద్ధిస్తుంది. అదే మోక్షమనీ, ముక్తి అనీ కూడా చెప్పబడుతుంది. ఇది జ్ఞానమార్గం. దీనికే అద్వైతసిద్ధాంతం అని పేరు. దీనికి ఉద్ధారకులూ ప్రచారకులూ ఆదిశంకరభగవత్పాదులవారు.

మఱొక సాధనమార్గం భక్తిమార్గం. భగవంతుడు సర్వేశ్వరుడు. విశ్వమంతా ఆయన సొమ్ము. నేను ఆయనసొమ్మును. తన్ను తాను రక్షించుకునే బాధ్యత సొమ్ముకు లేదు. తన సొమ్మును కాపాడుకోవలసిన బాధ్యత సొమ్ము కలవానిది. సర్వజ్ఞుడైన భగవంతుడు తన బాధ్యతను మనచేత చెప్పించుకొని తెలిసికోవలసినవాడు కాడు —

అహం స్మరామి మద్భక్తమ్
నయామి పరమాం గతిమ్॥

"నా భక్తుడిజ్ఞాపకం నా కుంది, వాణ్ణి ఉత్తమగతికి చేర్చే పని నాది" అన్న భగవద్వాక్యం స్మరిస్తూ భగవంతునే నమ్ముకొని మానవుడు తనరక్షణనుగూర్చి ఎట్టి ఆందోళన చెందక నిబ్బరంగా ఉండాలి. భక్తులు కాలం గడిపే విధం — సదా భగవంతుని నామభజన, గుణసంకీర్తన చేస్తుండడం. మనతో కలిసి మెలిసి ఉండాలనే ఆత్రంతో భగవంతుడే భక్తుల రూపంలో మనకు దర్శన మిస్తున్నాడని భావిస్తూ భగవంతుని పూజించినంతకంటె ఎక్కువగా భగవద్భక్తులను పూజించటం. ఈ నామభజన - గుణసంకీర్తన - సాధుసమాగమాలచేత సాధకుడు అవ్యయానంద మనుభవిస్తాడు. 'వైకుంఠవాసే ఽపి న మే ఽభిలాషః' 'నాకు వైకుంఠంకూడా వద్దు పొమ్మంటాడు'. 'దివి వా భువి వా మమాస్తు వాసో నరకే వా' 'స్వర్గంలో భూలోకంలో నరకంలో — ఎక్కడ ఉండమన్నా ఉంటాను — నాకు భగవదనుభవం ఉంటే చాలు' అంటాడు. ఈరీతి సాధన సాగేకొద్దీ అహంకారమమకారాలు అంతరించి శాంత్యానందాలు సిద్ధిస్తాయి. ఈ మార్గానికి భక్తిమార్గ మనీ, ప్రపత్తిమార్గ మనీ, విశిష్టాద్వైతసిద్ధాంత మనీ అంటారు. ఈ మార్గానికి ఉద్ధారకులూ ప్రచారకులూ భగవద్రామానుజులవారు.

# నా గురుదేవుడగు శ్రీవివేకానందస్వామి సంస్మృతులు

## శ్రీ సదాశివానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఇంతలో చోటుమార్పుకై శ్రీవివేకానంద స్వామి వారణాసికి రానున్నా రను వార్త మాకు తెలిసినది. శ్రీనిరంజనానందస్వామికి మిక్కిలి పరిచితుడగు రాజాకాళీకృష్ణఠాకూరు గారి వనభవనమున శ్రీవివేకానందస్వామి బసచేయుటకు ఏర్పాట్లు జరుగుచున్నవి. స్టేషనుకు పోయి శ్రీవివేకానందస్వామిని పిలుచుకొని వచ్చు పనికి మా సభయువకులు నన్నెన్నుకొని పూలలను మాలలను నాచేతికిచ్చిరి. చారుబాబును నేనును స్టేషనునొద్ద బండిరాకకై వేచియుంటిమి. బండి వచ్చినది. స్వామి ప్లాటుఫారము మీదికి దిగినారు. నేను నాచేత నున్న మాలను ఆయనకంఠమున వేసి, పూలను పాదములపై ఉంచి, ఆయన నెమ్మోమును నిదానముగ దర్శించితిని. అది స్వప్నములలో పలుమార్లు కననైన పరిచితమైన ముఖమే అనుట ఆకస్మికముగ నాజ్ఞప్తికి వచ్చినది. కలలో కనిపించిన మోమునకును ఈ మోమునకును చాలపోలిక గలదు. అద్భుతాదరములలో మునిగి నేను మౌనముగ నుంటిని. ఆయన చాలమృదువుగ "ఈ బాలు డెవ"డని నన్నుగూర్చి ప్రశ్నించెను. అప్పటి నా మనస్సంభవములను వర్ణించు సామర్థ్యము కవివాక్కుకే ఉండును. ఆయన నోటినుండి నూఱు మాట లైనను వినుటకుముందే ఆయనకంఠము నాకు పరిచితముగ నుండెను. ఆయనను నేను దర్శించుట ఇది రెండవసారియా, లేక అదంతయు కేవల మనస్సృష్టియా! విభిన్న భావాలు నాలో ఉరవడించినవి. ఆనందము భయము అచ్చెరువు అన్నియు కలిసియుండెను. స్వామిని ఆయన వెంబడినుండువారిని నేను చూచు చూపు మసకమసకగ నుండెను, అంతయు మింటశూన్యములో లీన మగుచున్నట్లుండెను. అదొక విరివి, ఆత్మ సత్త, వ్యావహారికసత్యములెల్ల అట స్వప్నములుగ పరిణమించుచు, స్వప్నము మఱపులేని శూన్యములో లయించిపోవుచున్నది. శరీరము మనస్సు చింతన — ఇవి లేని సత్త అది అని నేను గుర్తింపగల్గియుంటిని. అదొక ప్రశాంతనిశ్శబ్దత, అది నన్ను కమ్ముకొన్నది. ఇంచుమించు ఊపిరాడనీయనిదిగనుండెను. తర్వాత ఆపరిసరములను చూచిన నాకెట్లుండె ననగా మేల్కాంచిన తర్వాతకూడ నిలిచియుండు స్వప్నమువలెనుండెను. చేతులను కాళ్లను నేను కదల్పలేకపోయితిని. ఆలోచనము — అవధారణము — మాట. ఇవి ఒకానొక ఆనందస్థితిలో కరగిపోయినవి. మంచిచెడుగులు మున్నగు సకల ద్వంద్వములును అప్రకంప్యానందమున సమసిపోయినవి. 'నేను' అను సంకుచితస్మృతి అందు మునిగి తనప్రత్యేకతను పూర్తిగా కోల్పోయినది.

సగము స  గలిగియుండిన నా అంజలినుండి రాలినపుష్పములు స్వామిపాదపద్మముల మీద చెదరిపడినవి. అంతట ఆయన నాప్రక్క-

నున్న వారితో మాటాడుటకై వారివైపు తిరిగెను. కాని మరల గాఢప్రేమప్రేరితమును ఆహ్లాదనమునగు తన చూపును ఆయన పార్శ్వమున నున్న నాకన్నులలోనికి పరపెను. చిఱునవ్వు నవ్వెను. అందులకు పట్టిన దొక్క క్షణమే. కాని ఆక్షణములోనే "తండ్రిని విడు, పేరుప్రతిష్ఠల వదలుకో, ఈవిధముగ ఏదేది నీకు నష్టమగునో వాని కన్నిటికిని బదులుగా నన్నవలంబింపు" మను సారాంశము గల వాగగోచర సంఖ్యాతీతధర్మోపదేశములు ఆయనవాక్కున నాకు వినిపించినవి. "చిత్తము, తమమాటను తలదాల్చుచున్నా" నని నాఆత్మ ఆయనకు బదులు చెప్పినది. ఇది ప్రాతకాలపు కవిత్వము కాదు, కట్టుకథ కాదు, నా అనుభవము, సరళసత్యము. ఆ అనుభవము 'బ్రహ్మానందము'న గాని 'పరమానందము'న గాని వ్యక్తమగునది కాదు. ఆనందమునకు సైత మతీతమైన అనుభవ మది. క్షణికమైన ఒక్క వీక్షణముచే గల్గిన దైనను, అది ఈనాటికిని వన్నె మాయకున్నది.

మాకృష్ణుడైనట్టి స్వామిని జపాను అనెడి మధురకు పిలుచుకొనిపోవుటకై వచ్చినందున "మామ అక్రూరు" డని మాచే మాఱుపేరు పెట్టించుకొన్న జపానీయుడగు శ్రీఒకాకూరయు శ్రీనిర్భయానందస్వామి (కనాయ్)యు, శ్రీబోధానందస్వామి (హరిపాద) యు 'గౌర్' 'నాడు' అను నిద్దఱు బాలకులును స్వామితో కూడ నుండిరి. శ్రీశివానందస్వామియు శ్రీనిరంజనానంధస్వామియుకూడ అప్పుడుకాశిలో నుండిరి. వారందఱును కాళీకృష్ణఠాకూరు మహారాజుల 'సౌంథ' వాసమున కేగిరి.

ఒకనాటి సాయంకాలము చారుబాబును నేనును అచటికి పోయితిమి. పైని పేర్కొన్న వా రందఱును అట కుర్చీలపై కూర్చుండియుండిరి. భారతదేశమున స్వామిజి పర్యటనమును గూర్చి శ్రీఒకాకూరతో ఆంగ్లభాషలో ఏదో సంభాషణ జరుగుచుండెను. నేను సాగిలపడి సాష్టాంగముగ నమస్కరించి వినయముతో, నేలపై పఱచియున్న చాపమీద కూర్చుంటిని. స్వామిసంభాషణ మధ్యమున ఆగి చూపులచే ప్రేమను వర్షించుచు నావైపు మఱల మరల చూచెను. వాక్కులకంటె ఆవీక్షణము లెక్కువభావద్యోతకములుగ నుండెను. ఆ చూపులునన్ను పరవశునొనర్చినవి. "అబ్బాయీ, ఈకుర్చీపై కూర్చుండుము" అని ఆయన నన్ను పిలిచెను. పలుసార్లు పిలిచెను, ప్రేమతత్పరతతో బతిమాలెను, ఆయనగారి ఆమాత్రపుకోరికను కాదనుట నాకు అసాధ్య మాయెను. 'గొప్ప' 'కొలది' 'పెద్ద' 'చిన్న' విభేదాలనుపాటించుట ఆయనకు మిక్కిలి దుస్సహమైనది. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'అంతయు బ్రహ్మమే' ఏ యిద్దఱుమానవులకు గాని ఆయనదృష్టిలో భేదము లే దనుట ఆయన నెమ్మోమున నాకు స్పష్ట మయ్యెను. ఆక్షణమున ఎల్లరకంటె ఆయనే నాకు అంతరంగతముడుగను అధిక బంధువుగను తెలిసిపోయెను. సహజముగను సమగ్రముగను నన్నాయన కర్పించుకొంటిని. నిజమునకు ఆక్షణముననే ఆచోటనే నాకు మంత్రోపదేశమైపోయినట్లుండెను. ఆ క్షణమును బ్రతికినంతకాలము నేను స్మరించుచుందును.

రాత్రులందు నేనును చారుబాబును హరిదాసఛాటర్జీయు తఱచు స్వామితో ఉండెడివారము. అందఱము కలిసి భుజించెడివారము. అప్పుడు స్వామిజి మిక్కిలిరుచ్యమగు భోజ్యమును దేనినైన అందుకొని మాకందఱికిని

పంచి పెట్టి "బాగున్నదా, రుచిచూడుడు, రుచిచూడుడు. నా నోటికది ఎంతో బాగున్నందున మీకు ఇచ్చుచున్నాను" అనును. విశ్వమాతకు బిడ్డలపై ప్రేమ ఉండును. కాని అది తర్కాగోచరమైన ఆశయము. మేము ఆవిశ్వమాతృప్రేమను ప్రత్యక్షముగ చూచితిమి, అనుభవించితిమి. ఆయన మా కిచ్చిన పదార్థము మాకు పరమపవిత్రము, 'ప్రసాదము'. మే మందఱము దాని నారగించినప్పుడు ప్రేమ ఆపదార్థముగ పరిణమించెనో లేక పదార్థమే ఆయన ప్రేమ నాస్వాదించెనో, లేక ఆ పరిణామమును ఈ ఆస్వాదనమును ఉభయమును నిజమో, రెంట దేని కంటె ఏది హెచ్చో మాకు తెలియ లేదు.

## మంత్రోపదేశము

'సొంథబస'కును స్వామియుండిన సేవాశ్రమమునకును దూరము అయిదుమైళ్లు. స్వామిని దర్శించుటకు మేము ప్రతిదినమును పోయెడివారము. ఎప్పుడేని రాత్రివేళకూడ అక్కడే ఆగెడివారము. కాని మే మెంతగా కోరినను ప్రతిదినమును అచట ఉండుట మాకు సాధ్యము కాకుండెను. ఒకదినము నేనచట లేకుండినప్పుడు మాకు మంత్రోపదేశము చేయుమని శ్రీశివానందస్వామి ప్రార్థించె నట. అందులకు స్వామిజి సమ్మతించెనట కాని మంత్రోపదేశమునకు దినము ఫలానా అనుట ఇంకను నిర్ణయము కాలే దట. అది నిజమో కాదో కనుగొమ్మని చారుబాబును హరిదాస్ ఛటర్జియు నన్ను కోరిరి. నేను స్వామిజిని సమీపించి అడిగితిని. ఆయన నవ్వుచు మధురకంఠమున "రామానుజవైష్ణవసంప్రదాయమున నీకింతకుమునుపే మంత్రోపదేశ మైయున్నది కదా. విష్ణుపూజ చాలమంచిదే. మరల మంత్రోపదేశ మెందుకో నాకు తెలియలేదే" అనెను.

"నినుబోలు యోగియొద్ద మంత్రోపదేశము పొందవలె నని నాకోరిక" అని నే నంటిని. స్వామి నవ్వి అంగీకారమును సూచించెను.

కొన్నాళ్లలో నాసోదరులలో నాకు మునుపటివాడు వైద్యుడుగ నుండినవాడు ఆకస్మికముగ మరణించెను. బాణాఘాతమువలె ఆదుఃఖము నన్నాపివైచినది. కాని డెందమున దాని ములుకుండగనే, ఆదుఃఖము పోయినది. స్వామిజి పరమానుగ్రహమును ఆశీస్సునే అందులకు కారణ మని నే నెఱుగుదును. ఆదినాలలో ఒకనాడు నిర్భయానందస్వామి ఒక రూపాయి ఇచ్చి స్వామిజికై పిండిని కొని రమ్మని నన్నంపెను. నాహృదయభారము మిక్కుటముగ నుండెను, కాని పిండిని తెచ్చుటకు పోవుచు దారిలో ఆపిండి లేకున్న స్వామిజికి కల్గు ఇబ్బందిని, ఆయన ఆరోగ్యమునకు సకాలమున కా ఆహార ముండ వలయు ఆవశ్యకతను తలపోసితిని, అంతట నా దుఃఖమంతయు విస్మృత మాయెను. ఆశ్రమమునకు పోయి ఆపిండిని నేనే పజ్జనుండి వంటచేయించితిని. అట్లు చేయకుండ లేనైతిని.

కొన్నాళ్ల కనంతరము స్వామిజి "మీ అన్న చనిపోయె నట. ఆమరణము నీ కెట్లుండెనో? ఏమి చెప్పి మీఅమ్మ నోదార్చితివో" అని నన్నడిగెను. ఆప్రశ్నకు చెప్పవలసిన దెల్ల నేను చెప్పిన మీదట స్వామి ఇట్లనెను— "నాసోదరులలో ఒకడే చనిపోయియుండినచో నే నెంతగనో దుఃఖించియుందు ననుటకు సందియము లేదు". నాదుఃఖము స్వామికి తన దుఃఖముగనే ఉండెను. ఆసానుభూతి తత్క్షణమే నా దుఃఖమును పూర్తిగ తుడిచివేసినది. నాకు

పరమమిత్రమును సోదరాధికుడును ఆయనే అనిపించెను. వెంటనే నన్ను ఆయన పాద సేవకు పూర్తిగను ఇక తిరుగులేకుండను అర్పించుకోవలె నని శపథము చేసితిని.

'శ్రాద్ధ' మను నొక కలాప మున్నది. సాధారణముగ అది ఐన తర్వాతనే మంత్రోప దేశము జరుగును కాని స్వామిజి నా విషయ మున 'శ్రాద్ధ' మక్కఱ లేదనెను. మఱునాడే నాకు మంత్రోపదేశ మగు ననియు నేనా రాత్రి మఠమున అధివాస ముండ వలెననియు స్వామి చెప్పెను. ప్రొద్దుననే మేము స్నానము చేసి స్వామిగదివాకిట వేచియుంటిమి. అనుకొన్న వేళకంటె ముందుగనే గదితలుపులు తెఱవ బడినవి. స్వామిజి కనిపించెను. దివ్య తేజ మాయన మోమున వెలుగుచుండెను. ఆయన చేతిసైగతోను నోటిమాటతోనుగూడ మమ్ము ఒక్కొక్కనిగ లోనికి ర మ్మని చెప్పెను. ముందు పొ మ్మని చారుబాబు నన్ను నెట్టెను. నేను సమీపింపగనే స్వామి 'ఓహో, నీవు వచ్చితివా ముందు ! మంచిది, అబ్బాయీ నాతో రా'' అనెను. ఒక చిన్నగదిలోనికి పోయితిమి. అచట నేలమీద రెండు చిన్న చాప లుండినవి. ఒకదానిమీద ఆయన కూర్చుండెను, రెండవదానిమీద నేనుకూర్చుంటిని.

కొన్ని నిమిషములలో స్వామిజి గాఢసమాధిలో మునిగెను. ఆయన మేను నిగుడుకొని యుండెను. సకలావయవములు నిశ్చలములుగ నుండినవి. కన్నులు మిగుల నుజ్జ్వలములుగను అర్ధనిమీలితములుగను ఉండెను. దివ్యభావావేశమును శక్తియు ప్రేమయు ఆయనమోమున కననగుచుండెను. మూర్తీభవించిన ఆనందమే ఆయన. కాని ప్రబలశాంతము అన్నిభావోద్వేగాలను అణచిపెట్టియుండెను. అన్నియు నట ఘనీభవించి నిశ్చలముగ నిస్తరంగముగ నుండెను. నన్ను గదిలోనికి పిలిచిన మంద హాసప్రేమసుందరుడు వేఱు. ఆనందప్రేమాది భావోద్వేగాల కతీతుడుగ ఇప్పుడు నాయెదుట కూర్చున్న ఆయన వేఱు. ఆయనే శ్రీ వివేకానందస్వామి, విశ్వాసిజేత ఉత్సాహము దిగజారి పోవుచున్న మానవులలో శ్రద్ధావిశ్వాసాలను నింపి సంజీవనము చేసినాయన! ముక్తియు బ్రహ్మజ్ఞానమును గడచిపోయిన కాలమువి కావు, ఏదో శాస్త్రగ్రంథాలలో మాత్రమే ఉండునవి కావు. అవి ఆస్వామిలో రూపుదాల్చి ప్రత్యక్షములుగను స్పర్శగోచరములుగను ఉన్నవి.

అట్లు ఆయన నిశ్చలుడై కూర్చుండి యుండెను. కాలగతి మాకు వెలుపలివైపు బద్ధమై యుండెను. ఈదివ్యసాన్నిధ్యావిష్కారమును నిర్గమనమును ఆయన ప్రతిఘటించుచున్నట్లుండెను. క్రమముగ తగ్గి అది ఆయనదేహమున అణగియుండెను. అంత ఆయన నాచేతిని తనచేత పట్టుకొనెను. నాచేయి ఆయనచేతిలో కొన్ని నిమిషములకాల ముండెను. నాజీవితమున పూర్వసంభవములను కొన్నిటిని చెప్పి ఆయన 'నీవు నావలో చాత్రాకు పోవుచుంటివి. అప్పు డొకరు నీతో మాటాడిరి. మాటాడినప్పుడు నీ కెట్లుండెను'' అని అడిగిరి. నేను మఱచిపోయిన విషయమది. వీలైనచో దానిని జ్ఞాపకమునకు తెచ్చుకొమ్మన్నాడు ఆయన. ఆమాటాడినవారు శ్రీరామస్వరూపాచార్య స్వాములు. ఆరాయొద్ద ఆయనను నేను సంధించితిని. అనంతరము నాకు వైష్ణవమంత్రోపదేశము చేసినది ఆయనే. ఆయన అగమడ జిల్లాలో వసించువాడు. శ్రీరామానుజుల విశిష్టాద్వైతమతమునకు చెందినవాడు.

ఆయనను స్మరింపు మన్నాడు స్వామి. స్మరించితిని. 'ఇక ఇప్పుడు శ్రీరామకృష్ణుని ధ్యానింపుము. నీధ్యానములో నన్ను శ్రీరామ కృష్ణునిగా, శ్రీరామకృష్ణుని గణేశునిగా పరిణ మింపజేసికో. సన్న్యాసమునకు లక్ష్యము గణే శుడు'' అనెను.

(రూపములన్నియు ఒకనిలో లయించిపోవు సూక్ష్మదశ, ఆత్మ అపరిచ్ఛిన్నము ఏకము అను జ్ఞానముండగనే జీవునకు పరిపూర్ణబ్రహ్మ సాక్షాత్కారము గలిగినదశ.

అది మాయకు శక్తికి చెందినది; అది జనని సమాధిలో కూర్చున్న గుహద్వారమున సదా మెలకువతో నున్న గణేశుని సంకేతము. తర్వాత శివుడు వచ్చును, పుత్రునితో పోరా డును, అప్పుడు అహంకారము పూర్తిగా అణగిపోవును. అది జీవుని పరమోన్నతస్థితి).

ఆయన నన్ను తాకినంతనే నాలోని కోరి కలును తలంపులును అన్నియు ఇగిరిపోయినవి, మాయమైనవి. ఆకర్షణ లేదు, త్రోపాడుట లేదు, ఆశ లేదు, వాంఛ లేదు, భక్తికై ముక్తికై ఆత్రము లేదు.

ప్రపంచము శాంత మయ్యెను, ప్రశాంత మయ్యెను. విశ్వము నిశ్చల మయ్యెను, నిత్య శాంతి అందు నెలకొనెను. విశ్వమునకు సత్త ఉన్నది కాని, పారమార్థికసత్త కాదు ఆనం దము! ఎల్లెడల ఆనందము! ఆనందమున కతీతమైనదియు, మాటలకు వర్ణనలకు అతీత మైనదియు అగు 'అది' (తత్) ఉండెను. నేను అందు చొచ్చితిని. పైన శాంతి, క్రింద శాంతి, సర్వత్ర శాంతి, లోపలను వెలుపలను శాంతి. అట ద్వైతము మాయ మయ్యెను. ద్వైతపు టునికి ఎప్పుడును పొసగదు. విశ్వసత్తయొక్క సూక్ష్మస్థితిలో అంతరాళమున నోరాడని అవ యవములు చలింపని స్థితిలో నెలకొంటిని. 'అభావ' 'పరిపూర్ణత' లట వెలువడుచుం డును సమస్త చలనముల కొక అర్థకల్పనము చేయు భావప్రవృత్తి ఆట పూర్తిగా ఆగి పోయెను. రూపరహితమును అనిర్వాచ్యము నగు ఆ ఆదిమాకాశమున ఏమి ప్రశాంతి! సమస్జ్యోతియు దీప్తియు ఈ 'నిశ'లో చొచ్చుకొనెను. ఈ 'నిశ'లో చీకటి లేదు. ప్రసరణము లేదు, కాని అన్ని ఆవిష్కృతుల కును స్థానమదే. నేను దానిని కంటిని. దేవుని కరుణచే నేను దానిని ఆక్షణమున అనుభవించి తిని. నామనసు భావనాప్రత్యయన పూర్వక రూపధ్యానమువంకకును విగ్రహధ్యానమువంక కును భావోద్రిక్త వైఖరుల వంకకును పాఱు చుండినదే ఐనను ఆనాటినుండి నాకు ఈరీతి ధ్యాన మభిమతమైనది. ఇట్టి సవికల్పసమాధి దశ నందుకొనుటకు యోగులకు పెక్కేండ్ల శిక్షణమును సక్రమసాధనయు కావలెను. స్వామి ఒక్కసారి తాకినంతమాత్రముచే నాకు ఆసమాధి సిద్ధించినది. నాయెదుట నున్న గది కాని నాఅవయవాలుకాని నాదేహముకాని, స్వామి. రూపముకాని నాకగపడదాయెను. సర్వత్ర నున్నది అపరిచ్ఛిన్నాకాశము అం దనేకత్వమునకు గాని విభేదాలకుగాని అవకా శము లేనే లేదు. నా మేనికి ప్రశాంతి నిశ్చ లతలు కల్గినవి. ఆదశను వర్ణించుటకు మాటలు లేనేలేవు.

(సశేషము)

# శ్రీ రామకృష్ణపరమహంస విలాసము

మూలమ్ :
శ్రీశ్రీ చిద్ఘనానందగిరిస్వాములవారు

తాత్పర్యకాదంబిని :
శ్రీ శ్రీధరబాబు

ప్రవిశ్య పాఠశాలాంయః
పఠితుమ్బాలకో మహాన్ ।
చిన్తయామాస కావిద్యా
మృత్యుతః పాతి మామితి ॥

ఆ అసాధారణబాలకుడు విద్యార్జనకు పాఠశాలయందు ప్రవేశించి, ''నన్ను ఎట్టివిద్య మృత్యువునుండి సముద్ధరింపగలదా'' యని చింతింప నారంభించెను.

2. పాఠశాలార్జితా విద్యా
హ్యుదరమ్భరమే ప్యలమ్।
మునిభిః కీర్తితా విద్యా
బ్రహ్మవిద్యా హి సా భవేత్ ॥

'బడిచదువులు పొట్టకూటికేకదా. ఋషివరేణ్యులచేత అభివర్ణింపబడిన బ్రహ్మవిద్యయే నన్ను మృత్యుసాగరమునుండి తరింపజేయ గలదు' అని.

3. ఏవన్నిశ్చిత్య తత్యాజ
పాఠశాలాంస బాలకః ।
మృత్యుచిన్తానలోద్ధూతో
నిత్యానిత్య వివేకవాన్ ॥

నిశ్చయించి, మృత్యుచింత యనెడి అగ్ని తపింపజేయగా నిత్యానిత్యవస్తువివేకవంతుడై ఆ బాలకుడు బడికి స్వస్తిచెప్పెను.

4. శ్రీరామకృష్ణ ఇత్యాసీ
త్తస్య నామ సుమంగళమ్ ।
సఏవ పరమహంసోఽభూ
ద్వివేకానన్ద జీవనః ॥

మంగళప్రదమగు అతని శుభనామము శ్రీరామకృష్ణుడని. అతడే వివేకానందస్వామి జీవనసర్వస్వమగు పరమహంసగా విరాజిల్లినాడు.

5. గృహీచ భక్తిమాన్ కశ్చి
ద్ధనీ శ్రీ దక్షిణేశ్వరే।
దక్షిణా కాళికాం చైవ
లింగమేకాదశంచ యః ॥

భక్తిసంపన్నుడగు ఒక ధనిక గృహస్థు శ్రీదక్షిణేశ్వరమందు దక్షిణేశ్వరిని, పదునొకండు శివలింగములను, రాధాకృష్ణవిగ్రహమును ప్రతిష్ఠింపజేసెను.

6. రాధాకృష్ణ ప్రతిష్ఠాప్య
రామకృష్ణస్య భ్రాతరమ్।
తన్మందిరేషు పూజార్థ
మ్పూజకం స నియుక్తవాన్ ॥

ఆ దేవాలయములయందు రామకృష్ణుని అన్నగారిని అర్చనాకైంకర్యములు జరుపుటకు పూజారిగ నియమించెను.

7. మృతేచ పూజకే తస్మిన్
తత్పూజార్థమ యుక్తయమ్।
యువానం రామకృష్ణం స
భక్తిమాన్ భాగ్యవాన్ ధనీ ॥

రామకృష్ణుని అన్నగారు మరణింపగా, యువకుడగు రామకృష్ణునకు పరమోత్కృష్టమగు పరమేశ్వరకైంకర్యము జరుపు బాధ్యత ఆ ధనికభక్తు డప్పజెప్పినాడు.

8. రామకృష్ణో యువా లబ్ధ్వా
దైవకైఙ్కర్య ముత్తమమ్ ।
మేనే పుత్రో హ్యపుత్రస్య
దరిద్రస్య నిధిర్యథా ॥

ఉత్తమమగు దైవకైంకర్యావకాశము లభించిన రామకృష్ణుడు పుత్రప్రాప్తి కలిగిన అపుత్రకునివలె ధనరాశి దొరికిన దరిద్రునివలె సంబరపడెను.

9. మానవస్య భవేద్భక్తిః
పరాభగవతీశ్వరే ।
సఏవ భాగ్యవాన్లోకే
సఏవ పుణ్యవాన్ కృతీ ॥

పరతత్త్వమగు ఆ పరమేశ్వరునియందు భక్తి కుదిరిన మానవుడే లోకమునందు భాగ్యశాలి, పుణ్యవంతుడు.

10. సఏవ సుసుఖీ లోకే
శరణఙ్గతవాన్ హరిమ్ ।
హనుమానివ సర్వస్వం
సమర్ప్య ప్రణయాశ్రుభిః ॥

శ్రీహరికి శరణాగతుడై, హనుమంతునివలె ప్రేమాశ్రువులతో తనసర్వస్వమును సమర్పణచేసినవాడే మహత్తరమగు సుఖమును పొందును.

11. సమ్రాడపిచ విద్యాసు
వివిధాసు విశారదః ।
ఈశభక్త్యా వినా మర్త్యో
వితన్తు రివవర్తతే ॥

అనేకవిద్యలలో ఆరితేరినను, సామ్రాజ్యము నేలుచున్నను పరమేశ్వరభక్తిలేని మనుజుడు భర్తృవిహీనయగు వితంతువుతో సమానుడు.

12. ఉదేతి సవితా నూన
మ్భగవానీశ్వరః ప్రభుః ।
విరాగిణాం ముముక్షూణా
మ్భక్తానాం హృదిసూర్యవత్ ॥

ప్రభువగు ఈశ్వరుడు విరాగుల, ముముక్షువుల, భక్తుల హృదయములలో సూర్యునివలె ఉదయింపగలడు.

13. పూతసంస్కారిణా ముక్త్యై
నిమిత్తం సాధనమ్భవేత్ ।
ఆత్మలాభాయ నాన్యేషాం
విదుషామపి నిర్వృతిః ॥

పునీతసంస్కారులకు సాధన ముక్తినిమిత్తకము, ఆత్మలాభప్రదము. సామాన్యపండితుల విషయమున ఇట్లు కాదు.

14. ప్రతీకోపాసనాఙ్కృత్వా
ముముక్షు ర్భవసాగరమ్ ।
సన్తరే దితి ప్రబ్రూతే
ఛాందోగ్యో జ్ఞానమేత్యవా ॥

ప్రతీకోపాసన మొనరించి ముముక్షువులు భవసాగరతరణము గావింపగలరని, వారే జ్ఞానులగుదురని ఛాందోగ్యోపనిషత్తు వాకొనుచున్నది.

15. కాళికావిగ్రహం దృష్ట్వా
కాళీమ్మత్వాస చిన్మ
బ్రహ్మస్వరూపిణీ న్నిత్యం
రామకృష్ణోఽర్చతిస్మతామ్ ॥

చిన్మయము బ్రహ్మస్వరూపము నగు కాళికా ప్రతీకమును సాక్షాత్తు కాళికాదేవిగనే భావించి రామకృష్ణుడు ఆరాధించెను.

16. కాలస్య శీఘ్రగమన
మాలోచ్య మరణన్తథా ।
ఉద్దిశ్య భూతకాలంచ
దేవీ న్ధ్యాత్వారురోదసః ॥

వేగముగా పరుగిడు కాలమును సమీక్షించి, పైబడు మృత్యువునుగూర్చి చింతించి, గడచిపోయిన కాలము నుద్దేశించి రామకృష్ణుడిట్లు విలపించెను.

17. 'అన న్తకోటిభిర్దేవి
జన్మభిః కామ సఙ్కులైః।
బహుధా పీడితస్యాస్య
కాగతిస్త్వాం వినాంబికే॥

"దేవీ, కామసంలగ్నములగు కోట్లకొలది జన్మలనుండి అనేకరీతులుగా పీడితుడనైన నాకు, — అంబికా, నీవేగతి".

18. కుత్రాసిత్వ జ్జగన్మాతః
కుతోమాన్న ప్రపశ్యసి।
కేవలమ్మామనాథ మ్మా -
న్దీనమ్మా మవ్బ పుత్రకమ్॥

అమ్మా, నీవు ఎక్కడనున్నావు? అనాథుడను దీనుడను అగు ఈ చిన్నకుమారుని ఏల బ్రోవరావు?

19. విద్యారహమ్బుద్ధిశూన్య
ఞ్జన్మజన్మాపరాధినమ్।
కారుణ్యరసకల్లోల
లోలనేత్రి ప్రపశ్యమామ్॥

నాకు విద్యయూ రాదు, బుద్ధియూ శూన్యము; జన్మజన్మములనుండి అపరాధినేనమ్మా. కారుణ్యరసకల్లోలనేత్రీ, నన్ను రక్షింపుము.

20. కాళీమాతర్నమామిత్వా
ఙ్కాళీమాత ర్నమామ్యహమ్।
కాలకాళే! మహాదేవే!
నృత్య న్తీన్త్వా న్నమామ్యహమ్॥

కాళీమాతా! నమస్కరించుచున్నాను. అమ్మా! మరల నమస్కరించుచున్నాను. కాలకాలునిపై మహాదేవునిపై నృత్యమొనరించుచున్న నీకు నమస్కారము.

21. అహోగచ్ఛత్య యఙ్కాలో
మృత్యు స్తిష్ఠతి మేపురః।
మహాకాళి స్పృశత్వమ్మే
శిర స్తే పాణి పల్లవైః॥

అయ్యో! కాలము గతించిపోవుచున్నది. ఎదురుగ మృత్యువు నిలబడినది. మహాకాళీ, నీ పాణిపల్లవములతో నా శిరస్సును స్పృశింపుము.

22. నమాం రక్షతి మాతామే
పితా భ్రాతా సహోదరః।
నభార్యాచ మహామోహ
తామిస్రాత్త్వాం వినామ్బికే॥

మహా త్తరమగు మోహాంధకారమున తల్లితండ్రులుగాని, భార్యగాని, అన్నదమ్ములుగాని వెలుగు చూపలేరు. నీకు మినహా అన్యులకది సాధ్యపడదు.

23. కాగతిర్మే జగద్ధాత్రి
మూర్ఖస్య జగదీశ్వరి।
అనాథస్యాత్మబోధేన
శూన్యస్య కరుణామయి॥

జగద్ధాత్రీ, జగదీశ్వరీ, కరుణామయీ, మూర్ఖుడను ఆత్మావబోధశూన్యుడను అగు నా గతి యేమి?

24. శతపత్ర విశాలాక్షి
శతపత్ర పదద్వయమ్।
శరణఙ్కరవాణ్యమ్బ
శతపత్రముఖీశ్వరి॥

శతపత్రవిశాలాక్షీ, శతపత్రముఖీ, ఈశ్వరీ, నీ శతపత్రపదద్వంద్వమునే శరణు జొచ్చుచున్నాను.

25. యథాగోపాయతే మాతా
స్తనన్ధయిన మర్భకమ్।
తథా గోపాయతామమ్బ
కాళి మాం శరణాగతమ్

పాలుత్రాగు బిడ్డను తల్లి వేయికళ్లతో కనుపెట్టుకొని సంరక్షించుకొనును. కాళీమాతా, శరణాగతుడనైన నన్నుకూడ అట్లే సంరక్షింపవలెనమ్మా.

26. వరదాభయ ముద్రాభ్యాం
శోభితే ముణ్డమాలయా।
కరాలకరవాలేన
భిన్న శీర్షేణ చేశ్వరీ

వరదాన—అభయముద్రలతోను, ముణ్డమాలతోను, భయంకరకరవాలముతోను, విరబోసికొన్న కబరీభరముతోను శోభిల్లుచున్న ఈశ్వరీ.

27. సృక్యసృక్ ప్రవహామమ్బ,
నిశ్చలానంద సాగరామ్।
లావణ్యమీన నయనాం
ఫాలనేత్రీం సమాశ్రయే॥

నిశ్చలానందసాగరా, శోభాయమానమీననేత్రీ, ఫాలనేత్రీ, అమ్మా, పెదవులనుండి రక్తము ప్రవహింపజేయుచున్న నిన్నే సమాశ్రయించుచున్నాను

28. ఆలీఢ పాదకమలాం
కాలకాలోపరిస్థితామ్।
ఆసుర్యపాణి శాటీక
కటీమమ్బ నమామ్యహమ్॥

చాపబడిన పాదకమలములుగలిగి, పరమశివునిపై నిలిచిన, ఖండించిన రాక్షసుల హస్తములను కటిభాగమున వస్త్రముగా ధరించిన జగన్మాతా, నీకిదే నమస్కారము.

29. నీలజీమూత శోభాయమాన
ముక్త సుకున్తలామ్।
నమామి రుచిరైః కాళి
శవకుణ్డలమణ్డితే॥

నల్లనిమేఘములవలె శోభిల్లుచు విడినడిన కుంతలములుకల, శవములనే కుండలములుగా అలంకరించుకొన్న కాళీ, నీకు నమస్కారము.

30. రక్తదన్తిని మామ్బాతు
రక్తబీజ వధోద్యతే।
రక్తప్రియే రక్తపాన
రక్తవర్ణా ననామ్బుజే

అమ్మా, నీవు రక్తదంతినివి; రక్తబీజసంహారకారిణివి; రక్తపానముచే నీముఖము ఎఱ్ఱని పద్మమువలె శోభిల్లుచున్నది.

31. దుర్గేమామ్బాతు మోహాబ్ధే
ర్మహిషాసుర మర్దనీ।
దుర్గమ్మార్గం హి మోక్షస్య
సుగమమ్మే కరోతంరమ్॥

దుర్గా, మహిషాసురమర్దనీ, ఈ మోహజలధినుండి సముద్ధరింపుము. దుర్గమమగు ముక్తిమార్గమును శీఘ్రముగా సుగమ మొనరింపుము.

32. ఉలూకస్య దినన్నక్తం
యథామూఢో నపశ్యతి।
అవిద్యకం స్వకమ్బన్ధ
న్దురహంకార మూర్ఛితః॥

గుడ్లగూబకు ప్రకాశమానమగు పట్టపగలే చీకటి. అట్లే అవిద్యాసంబంధమగు స్వకీయమైన బంధమును దురహంకారమూర్ఛితుడు గమనింపడు.

33. మాతర్మాత ర్జగన్మాత
ర్మాతర్మాత ర్జగన్మయీ।

మాతర్మాత స్తమోహా స్త్రీ
మాత స్త్వమేవ చిన్మయీ ॥

అమ్మా, అమ్మా, జగజ్జననీ, జగజ్జననీ, తమోహారిణీ, చిన్మయీ.

34. కుఙ్కుమార్చిత పాదాబ్జే
సిందూరద్యుతిఫాలకే।
కుఙ్కుమాఙ్కిత వక్షోజ
కలసీక భరానతే ॥

కుంకుమార్చితములగు పాదపద్మములతో శోభించుచు, సిందూరమువలె ఎఱ్ఱగా ప్రకాశించు ఫాలము కలదానవై కుంకుమాంకితమగు స్తనముల భారముచే వంగినట్లున్న జగన్మాతా.

35. కాదంబినీ సుందరాఙ్గీ
చాద్యన్తరహితే శివే।
కంబుకంఠీ వజ్రహారైః
సుమణ్డిత కుచోన్నతే॥

కాదంబినీ, సుందరాంగీ, ఆద్యంతరహితా, రుద్రాణీ, కంబుకంఠీ, వజ్రహారములచేత అలంకరింపబడిన కుచములుకలదానా.

36. త్వం జనిత్రీచ గాయత్రీ
సావిత్రీ సర్వమఙ్గలా।
పవిత్రీ కురుతే భక్త
మ్భక్తత్రాణ పరాయణా ॥

నీవు జనయిత్రివి; గాయత్రివి; సావిత్రివి; సర్వమంగళవు; భక్తత్రాణపరాయణవు! ఈ భక్తుని పవిత్రునొనరింపవమ్మా.

37. అనాథోఽహమనాథోఽహ
న్దీనోఽహమతిదీనవాన్ ।
మామ్ప్రీపయతు చాముణ్డే
సంసారాత్త్వ త్పదాంబుజమ్॥

అనాథుడను, ముమ్మాటికి అనాథుడను. దీనుడను, అతిదీనుడను. చాముండేశ్వరీ, నీ పాదాంబుజము సంసారాంబుధిని మున్గిన నాకు ప్రాణభిక్ష యొసగుగాక!

38. ఇత్యేవం విలపన్మాత్రే
ప్రలపన్నమ్బ కాళికే।
రామకృష్ణః స్వప్నతుల్య
న్దదర్శ భువనత్రయమ్॥

ఈ విధముగ విలపించుచు, మోక్షార్థము "అమ్మా, కాళీమాతా," అని ప్రలపించుచు, రామకృష్ణుడు త్రిభువనములను స్వప్నసదృశముగ దర్శించెను.

39. సదదర్శ జగత్సర్వ
ఞ్జఙ్గమ స్థావరాత్మకమ్।
కాళీరూపేణ మోక్షార్థీ
నిష్కామీ సంయమీ మునిః ॥

నిష్కామి, సంయమి, మోక్షకామియైన ఆ మునివరేణ్యునకు చరాచరాత్మకమగు సర్వ జగత్తు కాళీరూపముగనే కన్పడినది.

40. సాయన్తనే ప్రభాతేచ
గమనాగమనం రవేః ।
దృష్ట్వా శిలాతలే దీనో
ఘర్షతి స్మ లలాటకమ్॥

'సూర్యుడు ఉదయించుచున్నాడు, అస్తమించుచున్నాడు. అదిగో ప్రభాతము, ఇదిగో సాయంత్రము. ఇట్లే కాళీదర్శనమువినా కాలము గడచిపోవుచున్నది' అని దీనుడైన రామకృష్ణుడు బండకు గురిచేసి నుదుటిని బ్రద్దలు కొట్టుకొనినాడు.

41. భక్తైః సాకమ్మహాభక్తో
భజతి స్మనిరాకులమ్।
ఆత్మానుభూతి వాక్యాని
వదతిస్మన పావనః

ఆ మహాభక్తుడు భక్తులతోగూడి నిరాకులుడై అమ్మనుభజించినాడు. అట్టిస్థితిలో ఆత్మానుభూతివాక్యరత్నములను వెలువరించినాడు.

42. ఏకాదశాని లిఙ్గాని
కాలీ జ్కృష్ణం ప్రపూజ్యసః।
పూజయామాస మార్జారం
శునకం స్వమ్పరం సమమ్॥

ఏకాదశ శివలింగములను, కాళీమాయిని, రాధాకృష్ణుని సమర్చించి, అతడు స్వపరవిభేదరహితుడై మార్జాలములను, శునకములను కూడ ఆరాధించెను.

43. కతి జన్మాని జాతాని
జ్ఞానహీనస్య మేభువి
భవిష్యన్తిచ జన్మాని
కతిచేతి వ్యచిన్తయత్॥

'ఈ భూతలమున ఎన్నిజన్మలు జ్ఞానహీనతలో గడచిపోయినవి! ఇంక భవిష్యమున ఎన్ని రానున్నవో' అని తలపోసినాడు.

(సశేషము)



# వార్తలు, విశేషాలు

## శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు

### వివేకానంద యజ్ఞము - మచిలీపట్టణము

అఱువదిసంవత్సరములకు పూర్వము మచిలీపట్టణమందలి హిందువులు ఓంకారనిలయముగను అన్నివర్గాలవారికి సమ్మతముగను నొకగుడిని కట్టి వివేకానందమందిర మని పే శ్రీరామకృష్ణుని ప్రత్యక్షశిష్యులలో ముఖ్యులలో నొకరగు శ్రీరామకృష్ణానందస్వామి 27-8-1904 తేదీనాడు దాని కావిష్కరణోత్సవమునుచేసిరి. అఱువదేండకు పిమ్మట ఆ ఆలయమును జీర్ణోద్ధరణము చేసి వర్ణములతో చిత్రములతో సింగారించిరి. ఆ ఆలయమున ఇప్పు డీ యుత్సవములు జరుపబడినవి.

28-4-1963 శంకరజయంతినాడు ఉత్సవములు ప్రారంభింపబడినవి. వేగుజామున 4 గంటలప్పుడు శ్రీచినముత్తేవి సుబ్బరావుపార్టీవారి నాదస్వరముతో కార్యక్రమము ప్రారంభమైనది. శ్రీ మల్లాప్రగ్గడ రంగరావుగారు ధ్యానప్రార్థనలను నడిపిరి. హైదరాబాదు నుండి వచ్చిన శ్రీ జస్వాంతసింహగారు యోగవ్యాయామకత్యలను ప్రారంభించిరి, పూజాహోమములను మదరాసు మైలాపూరు శ్రీ రామకృష్ణమఠమునుండి విచ్చేసిన శ్రీ శుద్ధసత్త్వానందస్వాములు జరిపిరి. తీర్థప్రసాదవినియములతో అప్పటి కార్యక్రమము ముగి

సినది. సాయంసమావేశమున శ్రీశుద్ధసత్త్వానందస్వామి ప్రభృతులు పరమహంసరామకృష్ణప్రార్థనా గేయములను పాడిరి. ఆదిశంకరులయు పరమహంస శ్రీరామకృష్ణునియు జీవితవిశేషములనుగూర్చి శ్రీశుద్ధసత్త్వానందస్వాములును, గాయత్రీపీఠాధిపతులగు శ్రీ విద్యాశంకరభారతీస్వాములును ఉపన్యసించిరి.

మఱునాడు (29-4-1963) ప్రార్థనలును యోగవ్యాయామకక్ష్యలును మామూలు ప్రకారము జరిగినవి. ప్రొద్దున 7-30 గంటలప్పుడు శ్రీశుద్ధసత్త్వానందస్వాములు గీతాసందేశమునుగూర్చి ఉపన్యసించిరి. నాటి సాయంసమావేశమందు శ్రీశుద్ధసత్త్వానందస్వాములేగాక శ్రీజమ్ములమడక మాధవరామశర్మగారును, శ్రీవివేకానందస్వామినిగూర్చియు లోకమున కాయన యొసగిన తాత్త్వికసందేశమునుగూర్చియు ఉపన్యసించిరి. శ్రీ వివేకానందస్వామిసూక్తులను సంస్కృతభాషలోని కనువదించినచో వానికి శాశ్వతత్వమును విశ్వవిఖ్యాతియు కల్గు నని శర్మగారు సూచించిరి. (శ్రీ) రామకృష్ణానందస్వాముల ఆశీస్సులను బడసిన ఆవివేకానందమందిర పవిత్రతను కొనియాడి త్వరలోనే అచట నూతనభవననిర్మాణము నిర్వర్తితమగు నని శ్రీశుద్ధసత్త్వానందస్వాము లనిరి. సదస్యులు కరతాళధ్వానులతో అభినందించిరి. అప్పటికప్పుడే దాదాపు రెండువేలరూపాయల వఱకు విరాళములు వాగ్దత్తము లైనవి.

మూడవదినము (30-4-1963) కార్యక్రమములోని ముఖ్యాంశములు— శివగంగ పీఠాధిపతులు ఉపనిషత్తులనుగూర్చి కావించిన ఉపన్యాసము. శ్రీ కుప్పా లక్ష్మణావధానిగారు విద్యారణ్యస్వామినిగూర్చి కావించిన ఉపన్యాసము.

నాల్గవదినము (1-5-1963) ప్రొద్దున శ్రీ శివగంగస్వాముల ఆధ్యక్ష్యమున కల్యాణదుర్గమువారగు శ్రీవాసుదేవశాస్త్రులవారు శ్రీ భగవద్గీతయందలి నవమాధ్యాయమునుగూర్చి ఉపన్యసించిరి. నాటిసాయంసభలో శ్రీ శివగంగస్వాములవారు శ్రీకృష్ణతత్త్వమునుగూర్చి ఉపన్యసించిరి.

2-5-1963 నాడు పూర్వాహ్ణసమావేశమున శ్రీవాసుదేవశాస్త్రులవారు తమగీతోపన్యాసమును కొనసాగించిరి. సాయంసభలో శ్రీ శివగంగస్వాముల రామతత్త్వోపన్యాసమును శ్రీరామభజనయు జరిగినవి.

3-5-1963 నాడు ప్రొద్దున కఠోపనిషత్తునుగూర్చియు, సాయంకాలము దేవీతత్త్వమునుగూర్చియు శ్రీశివగంగస్వాము లుపన్యసించిరి. విజయవాడ రామకృష్ణసమితివారు రామకృష్ణమతప్రచురణములను అమ్మునట్టి పుస్తకాల అంగడిని ఆమందిరమున ప్రారంభించిరి.

1963 మే నెల 4, 5 తేదులలో ఉపనిషత్తులనుగూర్చి శ్రీశివగంగస్వాములు ఉదయవేళలందును, శ్రీవివేకానందస్వామి జీవితమునుగూర్చియు ద్వైతసిద్ధాంతమునుగూర్చియు సాయంవేళలలో శ్రీ అనుభవానందస్వామియు, మాతాజీయు ఉపన్యసించిరి. ఆరెండుదినముల రాత్రులందు మదరాసు మఠమునుండి శ్రీసర్వజ్ఞానందస్వాములు తెచ్చిన "శ్రీరామకృష్ణ", "శారదాదేవి"- జీవితచరిత్రలను తెల్పుచలనచిత్రములు హిందూ కళాశాలహాలులో ప్రదర్శింపబడినవి.

6-5-1963 నాటి ప్రొద్దున గాయత్రీ పీఠాధిపతులగు శ్రీవిద్యాశంకరభారతీస్వాములు భగవద్గీతనుగూర్చియు అందు ముఖ్యముగ నవమాధ్యాయమునుగూర్చియు ఉపన్యసించిరి. నాటి సాయంకాలము విద్యాశంకరభారతీస్వాములే సభాధ్యక్షులుగ నుండి పతంజలిసూత్రములను గురించి ఉపన్యసించిరి. నెల్లూరివారగు డాక్టరు పుచ్చలపల్లి రామచంద్రారెడ్డిగారు "ఊర్ధ్వ ప్రాణాయామము"ను గూర్చి మహోజ్జ్వలముగ ఉపన్యసించిరి. దాని సాధనవిషయికములైన పెక్కువిశేషములను చేసి చూపిరి. శ్రీజస్వంత సింహగారును యోగాసనములను ప్రదర్శించి అందుంగూర్చి ఉపన్యసించిరి. శ్రీజనార్దన్ గారి నాయకత్వమున ప్రాంతీయయువకులును యోగాసనముల ప్రదర్శించిరి.

7-5-1963 ప్రొద్దున శ్రీశివగంగస్వాములు ఉపనిషత్తులనుగూర్చిన తమ ఉపన్యాసములను ముగించిరి. సాయంకాలము మాతాజీయు శ్రీ అనుభవానందస్వాములును భక్తినిగూర్చియు పరమహంస శ్రీరామకృష్ణునిగూర్చియు ఉపన్యసించిరి. కుమారి లక్ష్మియు, కుమారి గిరజయు—(ఎనిమిదేండ్ల, ఏడేండ్ల వయస్సువారు) తమ నృత్యగానములలో శ్రీ వివేకానందస్వాముల జీవితచరిత్రమును ప్రదర్శించిరి. శ్రీరామాయణమును ఆడి పాడిన లవకుశులను వారు జ్ఞప్తికి తెచ్చిరి. నాడు నృసింహజయంతి కావున శ్రీచల్లపల్లి సత్యనారాయణ, కుందా పిచ్చయ్యపార్టీవారు కూచిపూడి శైలిలో ప్రహ్లాదచరిత్ర యక్షగానమును పాడిరి.

8-5-1963: యజ్ఞోత్సవమున కిది చరమ దినము. మంగినిపూడికి అందఱును బస్సులలో పోయి సముద్రస్నానము చేసిరి. డా॥ ఎ.ఎన్. రావుదంపతులు, శ్రీలంకా రామనాథంగారి పౌరోహిత్యమున నవగ్రహపూజను హోమాదులను జరిపించిరి. సుమారు 1,500 మంది దరిద్రనారాయణులకు అన్నసంతర్పణ జరిగినది. నాడు వైశాఖపూర్ణిమ, బుద్ధ జయంతి. సాయంసభకు శ్రీ కుర్తాళం పీఠాధిపతులు అధ్యక్షత వహించి తమ గురువుగారైన శ్రీవిమలానందభారతీస్వాముల పేరట నొక గ్రంథాలయమును ఆవిష్కరించిరి. డాక్టరు రామ్‌గారును, శ్రీజంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును బుద్ధదేవుని సందేశమునుగూర్చి ఉపన్యసించిరి. నెల్లూరినుండి వచ్చిన కుమారి నిర్మల కాసేపు పిడేలువాద్యకచేరీ చేసెను. శ్రీ కొమ్మ లక్ష్మీనరసింహంగారు మృదంగము వాయించిరి. శ్రీవివేకానందయజ్ఞమహోత్సవమున కార్యనిర్వాహకు లందఱికిని నాటిరాత్రి ఎమ్. పద్మనాభరావుగారు విందుచేసిరి.

9-5-1963 కార్యనిర్వాహకుల నెల్ల సభినందించుటకు ఒక సభ సమావేశమైనది. ఆర్టు పేపరుమీద ముద్రింపబడిన శ్రీవివేకానంద స్వామిఫోటోలు అందఱికినీ పంచిపెట్టబడినవి. మదరాసు ఆకాశవాణి కళాకారులైన శ్రీ మల్లిక్‌గారు పాడిన భక్తిగేయములతోను విశ్వతాపహారకముగ పర్జన్యదేవుడు ప్రసాదించిన మితవృష్టితోను కార్యక్రమము పూర్తియైనది.

## శ్రీరామకృష్ణ మఠము - మదరాసు
## రామానుజ బుద్ధ జయంతులు

12-5-1963 నాటి సాయంకాలము రామానుజజయంతిని కొనియాడుటకై మఠమండపమున కూడిన సదస్సులో శ్రీమత్పరమాత్మానందస్వామి శ్రీరామానుజుల జీవితోపదేశములగూర్చి ఉపన్యసించిరి. 19-5-1963 నాటి సాయంకాలము బుద్ధజయంతి కొనియాడుటకై

మఠమండపమున భక్తసభ సమావేశమైనది. ప్రొఫెసరు కె. ఆర్. ఆర్. శాస్త్రిగారు గౌతమ బుద్ధుని ఆశయములనుగూర్చి ఉపన్యసించిరి. సభాధ్యక్షులైన శ్రీమద్రంగనాథానందస్వాములు బౌద్ధమునకు మునుపటి, సమకాలపు, వెనుకటి — సనాతన ధర్మచరిత్రమును సంక్షేపముగ తెలిపి బుద్ధదేవుని సందేశమును వివరించిరి.

### రామకృష్ణమిషను స్టూడెన్ట్సుహోము 1962-63 నివేదిక

ఈసంవత్సరమున ఇందుండిన వివిధవర్గాల విద్యార్థుల సంఖ్య హైస్కూలువారు 145, కాలేజీవారు 30, టెక్నికల్ శాఖవారు 106; మొత్తము 281; ఉచితభోజనవసతి పడసిన విద్యార్థులలో 74 గురు నిమ్నవర్గాలవారు. మిషనువిద్యాసంస్థలలో లౌకికవిద్యతోపాటు నైతికమతవిద్యయుకరపబడుచుండినది. పెక్కురకములైన క్రీడలకు అవకాశము కల్పింపబడినది. మైలాపూరు రామకృష్ణసెంటినరీ ఎలిమెంటరీస్కూలులో ఈ సంవత్సరము 254 బాలురను, 183 బాలికలును మొత్తము 457 మంది చదివినారు. మల్లియన్కరణై (చెంగల్పట్టుజిల్లా) లోని హైయరు ఎలిమెంటరీస్కూలులో ఈసంవత్సరము చదివిన వారు 22 బాలికలు, 146 బాలురు.

హోముచరిత్రలో ఈసంవత్సరపు గొప్ప సంభవము: శ్రీవివేకానందస్వామి శతతమ జయంతి మహోత్సవజ్ఞాపకముగా బహు ప్రయోజనముల కుపయోగపడు ఒకహాలు నిర్మింపబడినది. 8-3-1962 నాడు ఈహాలుకు శ్రీమత్కైలాసానందస్వాములు పునాది వేసిరి. నిర్మాణము పూర్తియైన తర్వాత 6-3-1963 నాడు శ్రీమద్యతీశ్వరానందస్వాములు దీని నావిష్కరించిరి.

## చందాదారులకు విజ్ఞప్తి

ఈ జ్యేష్ఠమాస సంచికతో పందొమ్మిదవ సంపుటము పూర్తియగును. ఆషాఢమాస సంచికతో క్రొత్త సంపుటము ఇరువదియవది ప్రారంభ మగును. క్రొత్త సంవత్సరము ప్రారంభ మగుచున్నందున ఆంధ్ర మహాజనులు ఈ పత్రిక నెప్పటియట్ల ఆదరింతు రని నమ్ముచు సంవత్సరచందాలను జూలై 10-వ తేదీకిలోపుగ అందజేయవలయునని ప్రార్థించుచున్నాము. వసతిలేనందున చందాలను చాలింపనెంచినవారుకూడ ముందుగా తెలుపవలయునని కోరుచున్నాము. తెలుపకపోయిన సంచికను వి. పి. గా పంపి నష్టపడవలసివచ్చును. శ్రీవివేకానందస్వామి శతతమజయంతి ప్రత్యేకసంచిక అచిరకాలమున వెలువడవలసియున్నందున జూలైసంచిక ప్రత్యేకసంచికగాకాక మామూలుసంచికగానే యుండును.

మేనేజరు,

1-6-1963. శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-4.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## భక్తిరంజని

[మొదటిభాగము]

సంగీతగ్రంథము [సర్వ సాహిత్య తాళాంగముల గుర్తులతో].

గ్రంథకర్త : సంగీతరత్న ఏలూరి సీతారామ్, వెల : రు. 1-25 న.పై.

ప్రతులకు : ప్రిన్సిపాల్, ఎస్. కె. ఎస్. సంగీతకళాశాల, నర్సాపురము, పశ్చిమగోదావరి జిల్లా.

సామవేదం సంగీతమయం. స్వరప్రధానమైనది సంగీతం. స్వరములు సప్తవిధములు. చిన్నచిన్న విభాగాలైన సప్తస్వరములు ఒకదాని కొకటి మేళవింపబడి రాగములై యొప్పారుచున్నవి. రాగమందే అనురాగం జనిస్తుంది. అప్పుడే ఆనందం కలుగుతుంది — 'ఆనందో బ్రహ్మేతివ్యజానాత్'—భగవత్సాక్షాత్కారమూ ఆనందముచేతకలుగుచున్నది. నాదబ్రహ్మోపాసకుడైన త్యాగరాజుమున్నగువారు నాదోపాసన చేసి జన్మమును సార్థకపఱచుకొన్నారు.

ఇక 'భక్తిరంజని'లో—ఆదిశంకర భగవత్పాదుల—'భజగోవిందశ్లోకాలతో, శ్రీసుబ్రహ్మణ్య కవికృత ఆధ్యాత్మరామాయణకీర్తన, శ్రీభాస్కరకవికృత భగవద్గీతాసార కీర్తన, సదాశివబ్రహ్మేంద్రకృత వేదాంతకీర్తన, నారాయణతీర్థుల తరంగము, శ్రీత్యాగరాజస్వామికృత ద్విధాతుదివ్యనామకీర్తన, ఏకధాతుదివ్యకీర్తన, జయదేవకృత ఏకాదశాష్టపది' మున్నగు వీటికి స్వరకల్పనచేశారు సంగీతరత్న ఏలూరి సీతారామ్‌గారు. అంతేగాక రాగములలో ముఖ్యములైన 'ధన్యాసి బిలహరి, ఆనందభైరవి, శంకరాభరణం, శుద్ధసావేరి, కాంభోజి, కేదారగౌళ' మున్నగు వాటికి సామాన్యలక్షణములను ఇందు పొందుపఱచారు.

ఇది సంగీతాభ్యాసకులు, విద్వాంసులుతమ దగ్గఱ ఉంచుకోదగిన గ్రంథం.

సంస్కరింపబడి చిత్తమునకానందం ఏది కల్గిస్తుందో అదే సంగీతం. అప్పుడే "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ"— అను నార్యోక్తి సార్థక మవుతుంది.

—వేదం రామశాస్త్రి.

## గీతామకరందము

రచయిత : శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు.

ప్రాప్తిస్థానము : మేనేజరు, శ్రీశుకబ్రహ్మాశ్రమము, శ్రీశుకబ్రహ్మాశ్రమముపోస్టు, కాళహస్తి, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.

రాయలు పుటలు 1103, వెల రూ. 10.

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత—అనే ప్రస్థానత్రయంలో గీతా ప్రాముఖ్యం అనన్యాదృశం. "ఓమానవుడా అన్నింటిని విసర్జింపుము. దేవు నొక్కనినే ఆశ్రయింపుము — అనుటే గీతోపదేశము" అన్నాడు పరమహంస శ్రీరామకృష్ణుడు. "గీతాసింహనాదము చేయు శ్రీకృష్ణుని అర్చింపవలసిన దినము లివి. శ్రీకృష్ణుడు గీతయొక్క మూర్తిభావము. శరీరమందంతయు అతితీవ్రమగు క్రియాతత్పరత ముఖమునందు వినీలాకాశమును బోలు అగాధ శాంతిగాంభీర్యములు— ఇదియే గీతలోని కేంద్రభావము" — అన్నాడు శ్రీ వివేకానందస్వామి. "ప్రసిద్ధమైన గీతాశాస్త్రము వేదబోధనల అన్నింటి సారసంక్షేపము. భగవద్గీతను చదువునప్పుడు నాకు కలుగునంతటి పరనిర్వృతి (బైబిలులోని) సెర్మన్ ఆన్ ది మౌంటు (పర్వతాగ్రప్రవచనము) ను చదివినప్పుడు సైతము కలుగదు" అని చెప్పినాడు గాంధీమహాత్ముడు. "ఉన్న భాషలలో ఇంతటి చక్కని గ్రంథమును ఇట్టి అప్పటమైన వేదాంతగేయమును వేఱొకటి లేదని" విలియము వాన్‌హంబోల్టు కొనియాడినాడు. బుద్ధయుగమునకంటెనుకూడ ముందే అవతరించిన ఈగ్రంథప్రామాణ్యము నానాటికి హెచ్చుచున్నదే గాని తగ్గలేదు. దీనిని ప్రమాణీకరించుకొనని సిద్ధాంతం లేదు. దీనికి లెక్కలేనన్ని వ్యాఖ్యానాలు ఇతఃపూర్వము వ్రాయబడినవి. ఇప్పటికిని వ్రాయబడుచునే యున్నవి.

ఇప్పుడు సమీక్షింపబడుచున్న వ్యాఖ్యాన ప్రత్యేకత: మొదటినుండి తుదివఱకు వైపుల్యము, వైశద్యము, సారళ్యము అను గుణములు పోషింపబడియున్నవి. ప్రతివాక్యమును అనుభవపరీవాహమని స్పష్టమవుతున్నది. 210 పుటల ఉపోద్ఘాతము సర్వవిషయసంపన్నము. పూర్వవ్యాఖ్యానాలలో లేని విషయాలు ఇందులో ఉన్నవి — అని చెప్పడం సాహసమవుతుంది కాని వానిలోని సకలవిషయములను సామాన్యుల అవగాహనకు అందజేసే ప్రయత్నంలో ఈవ్యాఖ్య పరిపూర్ణసిద్ధిని పొందినదంటే అతిశయోక్తి కాదు. పఠితలసౌకర్యార్థము అకారాది శ్లోకానుక్రమణిక కడపట చేర్పబడిఉంది.

పద్మనాభుని ముఖపద్మమునుండి వినిర్గతమగుటచేత భగవద్గీతయే మకరందము. అందలి సర్వవిషయవివరణదక్షమైన ఈ వ్యాఖ్యకున్ను మాధుర్యంచేత మకరందత్వము అన్వర్థమయినది. గీతాధ్యేత లందఱు తప్పక చదువవలసిన సర్వాంగసుందరమైన వాఖ్య ఇది.

—"ప్రభాకర్".



# శ్రీరామకృష్ణ ప్రభ

## పందొమ్మిదవ సంపుటము

౧౯౬౨ జూలై శుభకృత్తు-ఆషాఢము నుండి ౧౯౬౩ జూన్ శోభకృత్తు-జ్యేష్ఠము వఱకు


సంపాదకులు :

శ్రీ శుద్ధసత్త్వానందస్వామి

శ్రీ నేలటూరి భక్తవత్సలము, ఎమ్. ఏ., బి. ఓ. ఎల్.



శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4.

సాలు చందా రూ. 4. విడిప్రతి 37 న.పై.

# అకారాదిసూచి

# నీ బలమే
# నీ జాతిబలం


సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ సేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# VEDANTA KESARI *(Running 50th year)*

ENGLISH MONTHLY OF THE RAMAKRISHNA ORDER

## Swami Vivekananda Birth Centenary Number (Illustrated)

An illustrated special issue of the *Vedanta Kesari* will be brought out in the month of **Aug. 1963** to commemorate the Birth Centenary of Swami Vivekananda. Articles from well-known scholars dealing with various aspects of Swami Vivekananda's life and teachings will be the contents of the number. It will comprise of the following :

I. Hymns to Sri Ramakrishna and Swami Vivekananda
II. What Holy Mother said of Swami Vivekananda
III. How the Brother Disciples looked upon Swamiji (in their own words)
IV. Homages to Swami Vivekananda
V. Articles by

1. Swami Nikhilananda, Head of the Ramakrishna-Vivekananda Center, New York, U.S.A.
2. Swami Pavitrananda, Head of the Vedanta Society, New York, U.S.A.
3. Swami Kailasananda, President, Ramakrishna Math, Madras.
4. Dr. T. M. P. Mahadevan, Head of the Department of Philosophy, University of Madras.
5. Swami Vimalananda, President, Ramakrishna Advaita Ashrama, Kalady.
6. Swami Ranganathananda, Secretary, Ramakrishna Mission Institute of Culture, Calcutta.
7. Swami Nisreyasananda, now in Salisbury, Southern Rhodesia.
8. Swami Tapasyananda, Head of the Ramakrishna Ashrama, Trivandrum.
9. Swami Shraddhananda, Assistant Minister, Vedanta Society, Northern California, U.S.A.
10. Swami Nityabodhananda, Head of the Ramakrishna Vedanta Centre, Geneva, Switzerland.
11. Swami Adidevananda, Head of the Ramakrishna Ashrama, Mangalore.
12. Swami Budhananda, Assistant Minister, Ramakrishna-Vivekananda Center, New York, U.S.A.
13. Swami Vandanananda of the Vedanta Society of Southern California, Hollywood, U.S.A.
14. Mr Jean Herbert, author of many books and litterateur.
15. Dr V. Raghavan, Head of the Sanskrit Department, University of Madras.
16. Pravrajika Atmaprana from Ramakrishna Sarada Mission, Dakshineswar.
17. Dr Roma Chaudhuri, Principal, Lady Brabourne College, Calcutta.
18. Prof. P. S. Naidu.
19. Dr Jatindra Bimal Roy Chaudhuri.
20. Dr V. P. Varma from Patna University.
21. Prof. Amiya Kumar Mazumdar, Principal, Govt. College, Krishnanagar.
22. Prof. S. S. Raghavachar from University of Mysore.
23. Prof. P. Sankaranarayanan, Bhavan's College, Bombay.
24. Dr Clarence Shute, Professor of Philosophy, Massachusetts University, U.S.A
25. Prof. K. Subramanyam, ex Vice-Principal of Vivekananda College.
26. Dr Suniti Kumar Chatterji, Chairman, Legislative Council (W. Bengal).

and many other distinguished writers.

**Pages 200. Size D/c Octavo. Price Rs. 3. Postage 75 nP.**

This Special Number will be sent to our regular subscribers on a nominal price of Re. 1 plus registration fee of 50 nP. *So subscribers are requested to remit* Rs. 1.50 for this issue. **Annual Subscription is Rs. 5.** Year starts in May. The Special Number will be about five times the usual issue with a number of illustrations.

**It is an excellent medium for advertisement. Those who want to advertise in this issue are requested to contact the Manager, The Vedanta Kesari, immediately for reservation of space.**

THE MANAGER, SRI RAMAKRISHNA MATH, MYLAPORE, MADRAS-4.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦ ౧౯౬౩, జూలై; శోభకృత్తు - ఆషాఢము సంచిక ౧

## విషయసూచిక



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦ } ౧౯౬౩ - జూలై :: శోభకృత్తు - ఆషాఢము { సంచిక ౧


శ్రీః

## శివానన్దలహరి


మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.


కలాభ్యాం చూడాలఙ్కృతశశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే
శివాభ్యా మస్తోకత్రిభువనశివాభ్యాం హృదిపున
ర్భవాభ్యా మానన్దస్ఫురదనుభవాభ్యాం నతి రియమ్ ॥ ౧

| | |
|---|---|
| కలాభ్యాం | వేదములలో ప్రసిద్ధములైన సకల కళలును స్వరూపముగ గలవారును |
| చూడా | సిగలపైని |
| అలఙ్కృత | సొంపొందింపబడిన |
| శశికలాభ్యాం | చంద్రకళలు గలవారును |
| నిజతపః ఫలాభ్యామ్ | ఒక్కరొకరికి రూపుదాల్చిన తపఃఫలమనదగియుండువారును |
| భక్తేషు | భక్తులవిషయమున |
| ప్రకటిత | ప్రకాశపఱుపబడిన |
| ఫలేషు | ధర్మార్థకామమోక్షాదిఫలములుగలవారును |
| అస్తోక | అపరిమితముగ |
| త్రిభువన | ముల్లోకాలకు |
| శివాభ్యామ్ | ఆనందకరులును |
| హృది | హృదయపుండరీకమున |
| పునర్భవాభ్యామ్ | ధ్యానసమయమున మాటిమాటికిని క్రొంగ్రొత్తగ ప్రకాశించువారును |

| | | | |
|---|---|---|---|
| ఆనన్ద | ఆనందముప్పొంగ | | పార్వతీ పరమేశ్వరుల |
| స్ఫురత్ | స్ఫురించు | | కొఱకు |
| అనుభవాభ్యామ్ | అనుభవమును స్వరూపబోధ | ఇయం మే | ఈ నా |
| | ముతో కూడినవారును | నతిః | ప్రణామము |
| | అగు | భవతు | (అర్పితము) అగును గాక |

తా॥ పార్వతీపరమేశ్వరులకు మ్రొక్కుచున్నాను. పార్వతిచేసిన తపఃఫలమే పరమేశ్వరుడుగను, పరమేశ్వరుడు చేసిన తపఃఫలమే పార్వతిగను రూపుదాల్చినది. వేదములందు ప్రసిద్ధములైన సకలకళలును వారి స్వరూపములే. వారిసిగలపై నుండుటచేతనే చంద్రకళ సొంపొందినది. భక్తులకు ధర్మార్థకామమోక్షాదిసకలఫలములను, ముల్లోకాలకు అపరిమితానందమును ప్రసాదించువారు వారు. ఆనందమును తొనకించు స్వరూపబోధము కలవారు వారు. ధ్యానించువారి హృదయములందు వారు క్షణక్షణమునను క్రొంగ్రొత్తగ ప్రకాశించుచుందురు.

గలన్తీ శమ్భో త్వచ్చరితసరితః కిల్బిషరజో
దలన్తీ ధీకుల్యాసరణిషు పతన్తీ విజయతామ్
దిశన్తీ సంసారభ్రమణ పరితాపోపశమనమ్
వసన్తీ మచ్చేతోహ్రదభువి శివానన్దలహరీ ॥ ౨

| | | | |
|---|---|---|---|
| శమ్భో | పరమేశ్వరా | ఉపశమనం | శాంతిని |
| త్వత్ | నీ | దిశన్తీ | ఇచ్చునదియు |
| చరితసరితః | చరిత్రమను నదినుండి | మత్ | నా |
| గలన్తీ | ప్రవహించివచ్చుచున్నదియు | చేతః | మనస్సనెడి |
| కిల్బిషరజః | పాపమనెడిదుమ్మును | హ్రదభువి | మడుగులో |
| దలన్తీ | పోగొట్టుచున్నదియు | వసన్తీ | వసించునదియుగా ఉన్న |
| ధీ | బుద్ధి అనెడి | | పార్వతీ పరమశివులవలన |
| కుల్యాసరణిషు | కాలువదారులగుండ | | గలిగింపబడిన |
| పతన్తీ | పడుచున్నదియు | ఆనన్దలహరీ | ఆనందప్రవాహము |
| సంసార | సంసారమనెడిచక్రమున | విజయతామ్ | సర్వోత్కృష్టమైయుండును గాక. |
| భ్రమణ | సుడియుటచే కలిగిన | | |
| పరితాప | దుఃఖమునకు | | |

తా॥ పార్వతీపరమేశ్వరులకలయికచే ఉప్పతిల్లిన శివానందము ఒకపుణ్యతీర్థము. ఆపుణ్యతీర్థమునకు ఉత్పత్తిస్థానము పార్వతీపరమశివుల పుణ్యచరిత్రమే. బుద్ధియనెడి కాలువదారులగుండ పడుచున్న దానివెల్లువలో పాపపుదుమారమణగిపోయినది. సంసారచక్రమున సుడియుచుండినందున గలిగిన పరితాపము చల్లాఱినది. ఆవెల్లువకు నిలుకడ నామనస్సనెడు మడుగు. పరమేశ్వరా, ఆవెల్లువకు జయము.

త్రయీవేద్యం హృద్యం త్రిపురహర మాద్యం త్రిణయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలమ్బం సామ్బం శివ మతివిడమ్బం హృది భజే ॥

| | | | |
|---|---|---|---|
| త్రయీ | మూడు వేదముల చేతను | మహాదేవం | పరమేశ్వరుడు |
| వేద్యం | తెలియదగినవాడు | దేవం | స్వామి |
| హృద్యం | హృదయాహ్లాదకరుడు | మయి | నాయందు |
| త్రిపురహారం | రక్కసుల మూడు పురము లను ధ్వంసము చేసినవాడు | సదయభావమ్ | కరుణతోగూడిన మనస్సు గలవాడు |
| ఆద్యం | ప్రథముడు | పశుపతిం | జీవరాసులకు భర్త |
| త్రిణయనం | ముక్కంటి | చిదాలమ్బం | జ్ఞానాశ్రయుడు |
| జటాభార | జడలగమిచేత | సామ్బం | అంబికాసహితుడు |
| ఉదారమ్ | అధికుడు | అతివిడమ్బం | నటరాజును - అగు |
| చలద్ | కదలుచున్న | శివమ్ | పరమశివుని |
| ఉరగహారమ్ | సర్పములనెడి హారములు గలవాడు | హృది | డెందమున |
| | | | ఆరాధించుచున్నాను. |
| మృగధరం | జింకను దాల్చియున్నవాడు | | |

తా॥ శివుని నాడెందమున ఆరాధించుచున్నాను. సకలవేదములు శివునే ప్రతిపాదించుచున్నవి. ఆయన ముక్కంటి, ధూర్జటి, భుజగహారుడు, మృగధరుడు, ప్రథముడు, మహాదేవుడు, పశుపతి, జ్ఞానాశ్రయుడు, నటరాజు, పార్వతీసమేతుడు, హృదయాహ్లాదకరుడు, త్రిపురసంహర్త, సర్వస్వామి నాయందు కరుణాళువు.

సహస్రం వర్తన్తే జగతి విబుధాః క్షుద్రఫలదాః
న మన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్
హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరం యాచే శమ్భో శివ తవపదామ్భోజభజనమ్ ॥

| | | | |
|---|---|---|---|
| జగతి | లోకములో | అనుసరణమ్ | ఆరాధించుటను కాని |
| క్షుద్రఫలదాః | అల్పఫలాలనిచ్చు | తత్కృత | వారివలనగల్గు |
| విబుధాః | వేల్పులు | ఫలమ్ | ఫలములను గాని |
| సహస్రమ్ | వేలకొలదిగ | స్వప్నేవా | కలలోనైనను |
| వర్తన్తే | ఉన్నారు | నమన్యే | తలంపనే తలంపను |
| | వారిని | శమ్భో | ఓ సుఖకారణుడా |

| | | | |
|---|---|---|---|
| శివ | ఓ మంగళరూపీ | తవ | నీ |
| నికటభాజామ్ | నీపజ్జనుండు | పదామ్భోజభజనమ్ | పాదపద్మారాధనము |
| హరి | విష్ణువు | చిరమ్ | బహుకాలముగ |
| బ్రహ్మ+ఆదీనామ్+అపి | బ్రహ్మమున్నగువారికి సైతము | యాచే | యాచించుచున్నాను. |
| అసులభామ్ | సులువుగ పొందరానిదగు | | |

తా॥ వేల్పులు వేలకొలదిగ నున్నారు, అందఱును క్షుద్రఫలాల నిచ్చువారే. కలలో నైనను నేను వారి నారాధింపను, వా రిచ్చు ఫలముల కోరను. ఓ శంభూ, శివా, బ్రహ్మ విష్ణ్వాది దేవతలు నీ కెంతసమీపమున నున్న నేమి, వారికి సైతము నీపాదపద్మారాధనము దుర్లభము. అట్టి నీ పాదపద్మారాధనమునే నే నింతకాలముగ కోరుచున్నాను.

స్మృతౌ శాస్త్రే వైద్యే శకునకవితాగానఫణితౌ
పురాణే మన్త్రేవా స్తుతినటనహాస్యే ష్వచతురః
కథం రాజ్ఞాం ప్రీతిర్భవతి మయికోఽహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞప్రథిత కృపయా పాలయవిభో ॥ ౫

| | | | |
|---|---|---|---|
| స్మృతౌ | ధర్మశాస్త్రమందును | రాజ్ఞాం | ప్రభువులకు |
| శాస్త్రే | తర్క-వ్యాకరణాది | ప్రీతిః | |
| | శాస్త్రమందును | మయి | నాయందు |
| వైద్యే | వైద్యశాస్త్రమందును | కథమ్ భవతి | ఎట్లు కలుగును |
| | శకునశాస్త్రమందును | హే పశుపతే | ఓ పరమేశ్వరా |
| కవితాగానఫణితౌ | సాహిత్యసంగీతములందును | ప్రథిత | ప్రసిద్ధుడా |
| పురాణే | పురాణములందును | విభో | స్వామీ |
| మన్త్రేవా | మంత్రశాస్త్రమందును | సర్వజ్ఞ | సర్వజ్ఞుడా |
| స్తుతినటనహాస్యేషు | పొగడ్త - ఆట - నవ్వించుట | కృప | దయచేత |
| | లందును | పశుమ్ | పశువనైన |
| అచతురః | సామర్థ్యము లేనివాడను | మామ్ | నన్ను |
| అహం కః | నే నెవడను | పాలయ | కాపాడుమా. |

తా॥ ఓ పరమేశ్వరా, ఏశాస్త్రమందును ఏవిద్యయందును సామర్థ్యము లేని నే నెవడను? ప్రభువులకు ప్రీతి నాపై నెట్లు కల్గును? కావున పశువనైన నన్ను పశుపతివైన నీవే కృపతో కాపాడుమా.

# శ్రీవివేకానందమరందబిందువులు (౬)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

ఆధ్యాత్మిక జీవనమున నే నానందమును గాంచనిచో, తుచ్ఛవిషయ జీవనమునఁ దృప్తి నొందనగునా? అమృతము నాకు లభింపనిచో, మురుగునీటికై నోరు తెఱవఁదగునా?

ఇంద్రియ నిగ్రహమునకై బిల్వమంగళుని వలెఁ గన్నులను బొడిచివైచుకొనుటయు నొకానొకప్పు డావశ్యకము కావచ్చును.

ప్రతిసుఖమును దుఃఖమను కిరీటమును దాల్చి మానవుని సమీపించుచున్నది. సుఖము నాహ్వానించువాఁడు దుఃఖమును నాహ్వానింప వలసియుండును.

సాంఘిక రాజకీయ స్వాతంత్ర్యములను బొందినను, నింద్రియకింకరులమై యున్నచో విషయలోలురమై యున్నచో . యథార్థ స్వాతంత్ర్యసౌఖ్యము ననుభవింపఁజాలము

తన మనసునకు నచ్చిన కార్యమును బరమ మూర్ఖుఁడైనను సాధింపఁగలుగును, కాని ప్రతికర్మమును దనకు నచ్చునట్లు చేసికొనఁ గలవాఁడే ధీమంతుఁడు. ఏ కర్మమును హీనము కాదు.

సరిగా 'హుక్కా' నమర్పఁగలిగినవాఁడు సరిగా ధ్యానించుటకును సమర్థుఁడగును.

ఆత్మసంయమమును సాధించినవాని నే బాహ్యవిషయమును బాధింపఁజాలదు; ఆతఁ డిఁక దేనికిని దాసుఁడుగాఁడు. ఆతని మనస్సు స్వతంత్రము; అట్టివాఁడే లోకమునఁ జక్కఁగా మనఁగల్గును.

మన మెంత శాంతచిత్తులమై, బాహ్యసంఘటనములచే నెంత నిర్బాధితులమై, యుందుమో, అంతవిశేషముగాఁ బ్రేమింపఁ గలుగుదుము; మన కార్యములును నంతయోగ్యతరములై వెలయును.

బానిసవలెఁగాక ప్రభువువలె నీవు కర్మముల నొనర్పవలయును; నిరంతర కర్మనిరతుఁడవై యుండుము, కాని బానిసవలెఁ గాదు.

అసంగుఁడవై వర్తింపుము; కార్యములను జరుగనిమ్ము, ఇంద్రియములను వ్యాపారములను జేయనిమ్ము; సదా, సర్వదా కర్మముల ఆచరింపుము, కాని యెట్టి చిత్తవృత్తికి నధీనుఁడవు గాకుము. ఆగంతుకుఁడవో యను చందమున—ఈలోకమున నూతన వ్యక్తివో యను రీతిని—కర్మముల నొనర్పుము. నిరంతర కర్మనిరతుఁడవయ్యు, బద్ధుఁడవు గాకుము. బంధము మహాఘోరము.

ప్రస్తుతము భారతదేశమున నేమైనను మహాపాతకమనునది యున్న యెడల నది యీ దాస్యము. ప్రతివ్యక్తియు నధికారము చూపఁ దలఁచును, ఆజ్ఞాపింపఁ దలఁచును, కాని విధేయత చూపఁదలఁచువాఁ డొక్కఁడును లేఁడు; ప్రాచీనకాలమందలి యద్భుతబ్రహ్మచర్యవిధానము లోపించుటయే యిందులకుఁ గారణము.

మొదట విధేయత నలవఱచుకొనుము. ఆజ్ఞాపించు నధికారము దానంత టదియే వచ్చును ఎప్పుడును మొదట సేవకుఁడవై యుండ నేర్చుకొనుము; అంతటఁ బ్రభుఁడవగుటకు నీకు యోగ్యత కలుగును.

ఆత్మశక్తిని, ఆత్మనైర్మల్యమును సంకోచింపఁజేయు భావములన్నియు దుర్భావములు, అట్టి కర్మములన్నియు దుష్కర్మములు; ఆత్మప్రకాశమును గలుగఁజేయు— ఆత్మశ నుద్దీపింపఁజేయు — కర్మములును భావములును సత్కర్మములు, ధార్మిక భావములు.

పురోవృద్ధి నరికట్టునట్టిది, లేదా, పతనమునకుఁ దోడ్పడునట్టిది, ఏదియైనను బాపమే; ఉద్ధరించునదియు సమన్వయము నొందించునదియు నేదియైనను బుణ్యమే.

నిగ్రహింపఁ బడని- వ్యవసాయాత్మికము కాని—మనస్సు మనలను దిగలాగును, శాశ్వతముగా నధోగతిని బొందించును—వినాశము పాలుచేయును; నిగృహీతమై, సుశిక్షితమైన మనస్సే, మనలను రక్షించును, విముక్తులను జేయును.

ప్రకృతితోఁ బొత్తు కలిగియుండుటనిన మాంద్యము, మరణము నన్నమాట. ఈ యింటిని మానవుఁడెట్లు కట్టెను? ప్రకృతితోఁ బొత్తు కలిగియుండుటవలననా? కాదు. ప్రకృతితోఁ బోరాడుటవలన. ప్రకృతికి జోహారు సల్పుటగాక, ప్రకృతితో నిరంతరము డీకొనుటయే మానవవికాసమును గూర్చుచున్నది.

ప్రకృతితోఁ బొత్తు! ఏల? ప్రపంచమున మానవుఁడు పొందిన వికాసమంతయుఁ బ్రకృతితోఁ బోరాడుటచేతనే, ప్రకృతిని జయించుటచేతనే పొందఁగల్గెనను సంగతి మీకుఁ దెలియదా?... చెట్లు ప్రకృతితోఁ బొత్తు కలిగి జీవించును. అచట నంతయుఁ బొత్తే; ప్రతికూల మేమియు లేదు; — వికాస మంతకంటె లేదు.

ప్ర కంజలి ఘటించుట కాదు, ప్రకృతితోఁ బోరాడుటయే మానవుని మానవ నామార్హు నొనర్చుచున్నది.

ప్రకృతి నెదిర్చి నిల్చుటయే యాత్మధర్మము. ప్ర దాస్యమే నేఁటి మన దుఃస్థితికి హేతువు.

ఆత్మసంయమము లేకుండుటయే జనులు బాధపడుచుండుటకుఁ గారణము.

అలసతచేతనో, యశక్తతచేతనో క్షమ చూపుటకంటెఁ బోరాడుటయే మేలు. దేవతా సైన్యములనుసైత మవలీలగా జయింపఁగల్గుదువేని క్షమచూపుము ... ప్రపంచము యుద్ధరంగము. వీరుఁడవై ప్ర కూలురను జయింపుము.

దురాత్ముల నెదుర్కొని ధర్మరక్షణయత్నమునఁ బ్రాణముల నర్పింపవలయునా, లేక శాంతితో నూరకుండవలయునా, యనియా నీశంక? ప్రతీకారమును నే నామోదింపను— కాని యిది సన్న్యాసధర్మము. ఆత్మసంరక్షణము గృహస్థధర్మము.

# శ్రీ యోగానందస్వామి

## [సంపాదకీయము]

(గతసంచిక తరువాయి)

యోగిను శిశువువలె సరళహృదయుడు. ఎవనినైనను సరే సులభముగ నమ్మును. ఐనను అతడు అవివేకి కాడు. చాల చురుకైన వివేచనశక్తి అతని కున్నది. గుణదోషములను తూచి నిర్ణయించువృత్తి అతనిది. కాని యీ గుణదోషనిర్ణయప్రవణతచే అత డొకప్పుడు చిక్కులో పడినాడు. ఒకనాటిరాత్రి అతడు శ్రీరామకృష్ణునితో ఆయనగదిలోనే నిద్రించెను. అతడు నిశీథములో లేచి చూడగా గదిలో శ్రీరామకృష్ణుడు లేడు, గదితలుపు తెరువబడియుండెను. అట్టి అవేళలో శ్రీరామకృష్ణుడు ఎక్కడికి పోయియుండ గలడు అనుటను గూర్చి యోగినుకు మొదట కుతూహలమును పిమ్మట సందేహమును కలిగెను. వెలుపలికి వచ్చి చూచెను. శ్రీరామకృష్ణు డగపడ లేదు. నహబత్తులో నున్న ప్రియురాలి యొద్దకు పోయినా డేమో యని యోగిను తలంచెను. అట్లు పోయియే యుండునేని,
రామకృష్ణుడు తా నెట్టివాడనని చెప్పుకొనునో నిజమున కట్టివాడు కాడు!
ట
ధింపనెంచి యోగిను నహబత్తునుండి ఆయన వెలికివచ్చిన కనిపట్టుటకై సమీపమున వేచి యుండెను. కొంతసేపటికి
పంచవటివైపునుండి వచ్చుచు నహబత్తునొద్ద యోగిను నిలబడియుండుటను చూచి ఆశ్చర్యపడెను. తనకు గలిగిన సందేహమునకు యోగినులజ్జించి మ్రాన్పడెను. శ్రీరామకృష్ణుని వంటి యోగీంద్రుని పవిత్రతను మనసుచేతనైనను శంకించుటయా? అంతకంటె పాపమయమైన పనిని భావింపనైన లేము. శ్రీరామకృష్ణుడు పరిస్థితి నెల్ల అర్థముచేసికొని ధైర్యము గొల్పుచు ఇట్లనెను: ''ఔను, రాత్రులందును పగళ్లయందును యోగిప్రవర్తనను శోధింప వలసినదే.'' ఇట్లనుచు శ్రీరామకృష్ణుడు గదిలోనికి వచ్చెను. యోగిను మౌనముతో వెంబడివచ్చెను. గురుదేవుడు ఇట్లు తియ్యని మాటలు చెప్పినను యోగినుకు ఆరాత్రి నిద్ర పట్టలేదు. తాను చేసినది మహాపాప మని అతని అభిప్రాయము. అందుకు తన్నతడు తనజీవితకాలములో మన్నించుకొనలేదు.

యోగినుకు శ్రీరామకృష్ణునందు ఎంతో భక్తి యున్నను — తనవిమర్శశక్తిని పదును తోనే కాపాడుకొనుచుండె ననియు గురువునందైనను సరే గుణదోషముల నిర్ణయింప వెనుదీయ లేదనియు — సూచించు సంభవములు అనేకములు కలవు. కామినీరక్తిని తొలగించుకొను టెట్లని ఒకప్పు డతడు శ్రీరామకృష్ణు నడిగెను. భగవత్ప్రార్థనచే దానిని సులభముగా తొలగించుకొన వచ్చు నని శ్రీరామకృష్ణుడు చెప్పెను. కాని ఈసరళప్రక్రియ అతనికి సంతృప్తికరముగ లేదు. ఎందరో దేవుని ప్రార్థించుచునే యున్నారు. వారి జీవితములలో మార్పు కలుగ లేదు—అని యోగిను

భావించెను. గురుదేవుడు తనకు ఏదో యోగ సాధనను కఱపు నని అతడు నిరీక్షించెను కాని విఫలాశు డయ్యెను. శ్రీరామకృష్ణుడు ఇట్టి సరళప్రక్రియను చెప్పుటకు కారణము ఇంత కంటె మేలైన ప్రక్రియ ఆయనకు తెలియక పోవుటే అని యోగిను తీర్మానించుకొనెను. ఆదినములలో నొకహఠయోగి దక్షిణేశ్వర మున బసచేయుచుండెను. తన్ను దర్శింప వచ్చిన వారికి అతడు పెక్కు యోగికాద్భుత కృత్యములలో తననేర్పును చూపుచుండెను. యోగినుకు ఆహఠయోగియందు ఆసక్తి కలిగెను. ఒకనాడు గుడికి వచ్చిన యోగిను శ్రీరామకృష్ణుని కలిసికొనక సూటిగా హఠయోగి యొద్దకు పోయి అతనిప్రసంగమును తదేకతానముగ వినుచుండెను. సరిగా ఆసమయమునకు యాదృచ్ఛికముగ గురుదేవు డచటికి వచ్చెను. యోగినును అచ్చట చూచి శ్రీరామకృష్ణుడు ప్రేమాతిశయముతో అతనిభుజములు పట్టుకొని తనగదికి పిలుచుకొనిపోవుచు ఇట్లనెను: "నీ వచటి కెందులకు పోయితివి ? ఈ యోగ సాధనలు చేసితివేని నీ మనస్సు దేవునం దేకాగ్రము కాక దేహమునం దేకాగ్రమగును." యోగిను అంత సులభముగ లోబడువాడు కాడు. హఠయోగిమీద అసూయయు తాను హఠయోగికి శిష్యుడై పోవునేమో అను దిగులును శ్రీరామకృష్ణునకు కల దని యోగిను భావించెను. తాను చాల తెలివిగలవాడ నని యోగిను సదా తలంచుచుండును. కాని మఱొకనూరు ఆలోచించి శ్రీరామకృష్ణుడు చెప్పిన ప్రకియను చేసిచూచెను. మహాద్భుతఫలితములు కలుగగా అత డెంతయు ఆశ్చర్యపడెను. గురుదేవుని సందేహించినందుకు లజ్జించెను. "కామినీవిజయమును పూర్తిగ సాధించినవాడు మనలో నొక్క డుండునేని అతడు యోగినే" — అని అనంతరకాలమున శ్రీవివేకానందస్వామి చెప్పుచుండెడివాడు.

ఇట్టి సంభవమే మఱొక్కటి: గుడి ప్రసాదములో తనభాగము తనకు చేర్పబడనందుకు శ్రీరామకృష్ణుడు చాల చిరాకుచెందుచుండెను. సాధారణముగా గుడికోశాధికారి, ఆరాధనానంతరము ప్రసాదమును పంచిపెట్టెడివాడు. ఓర్పు తగ్గి శ్రీరామకృష్ణుడు కోశాధికారి యొద్దకు నొక బంటు నంపెను. తర్వాత తానే పోయెను. సంపన్నకుటుంబమున జన్మించిన వాడ నను గర్వము యోగినుకు కలదు. ఇట్టి అల్పవిషయమునకై గురుదేవుడు చెందుచున్న కలవరపాటు చూచి "ఈయన గొప్పయోగి కావచ్చు, కాని కుటుంబపుచాలు దాని ప్రభావము ఉన్నవి. వానిఫలితమే ప్రసాదము రానందుకు ఈయన పడుచున్న ఆందోళన. పేద పూజారికుటుంబమువాడైనందున ఈ అల్ప విషయమునకూడ ఇంత పట్టు గలిగి యున్నాడు"—అని తనలో అనుకొనుచుండగా గురుదేవుడు తనంతట అటు వచ్చి ఇట్లనెను. "గుడిప్రసాదమును సాధువులకు పంచిపెట్టవలె నని రాణీరాస్మణి యేర్పాటుచేసియున్నది. సాధుసంతర్పణచే ఆమెకు పుణ్యము కలుగును. గుడిఅధికారులు ఈవిషయ మాలోచింపక గుడిప్రసాదమును తమమిత్రులకు ఇచ్చివేయు చున్నారు. ఒక్కొకసారి గర్హింపదగినవారికి ప్రసాదము ముట్టుచున్నది. ఆపరమోదాత్త భక్తమహిళ సంకల్పము నెఱవేఱవలె ననుట నా అక్కఱ." ఈమాటలు వినగానే శ్రీరామకృష్ణుని అముఖ్యచేష్టితమునందుగూడ అతిగూఢమైన అర్థము ఉండుటగుర్తించి యోగిను

ఆశ్చర్యచకితు డయ్యెను. అతనినిగూర్చి తాను పడిన దురభిప్రాయమునకు సిగ్గు చెందెను.

శ్రీరామకృష్ణుని పర్యవేక్షణలో యోగిను ఆధ్యాత్మికాభివృద్ధి నొందసాగెను. శ్రీరామకృష్ణుడు వ్యాధిగ్రస్తుడై కాశీపూరులో వైద్యము చేయించుకొనుచున్నప్పుడు ప్రియగురునాథునకు అహోరాత్రములు పరిచర్య చేయుచుండిన శిష్యులలో యోగిను ఒకడు. అంతగా బలిష్ఠదేహుడు కానటువంటి యోగిను నారోగ్యము నిరంతరగురుపరిచర్యాక్లేశముచే దెబ్బతినెను. కాని ఆగురుభక్తుడు అందుకు జంక లేదు.

శ్రీరామకృష్ణునకు అవసానకాలము వచ్చెను. శిష్యు లెంతజాగరూకులై యున్నను గురుని రోగాభివృద్ధిని అరికట్టలేరైరి. ఆయన బ్రతుకు నను ఆసపాటు అంతరించెను. ఒకనాడు శ్రీరామకృష్ణుడు యోగినును పిలిచి బెంగాలీపంచాంగమందు కొంతభాగమును దినసరి విశేషములను చదివించుకొనెను. చదువుచు చదువుచు యోగిను ఒక తేదీయొద్దకు వచ్చినప్పుడు శ్రీరామకృష్ణుడు "అక్కడికి అపు" మనెను. ఆ తేదీనాడే శ్రీరామకృష్ణుడు నిర్యాణము నొందినాడు.

శ్రీరామకృష్ణుని మహాసమాధి యెల్లరను దుఃఖార్ణవమున ముంచినది. అందుండి తెప్పరిల్లుకొనుటకై మాతృశ్రీ శారదామణి బృందావనమునకు పోయెను. యోగిను, కాళి, లాటు, గోలపమ్మ, లక్ష్మీదేవి, నికుంజదేవి (గుప్త-మహేంద్రనాథుని పత్ని) వీరును మాతృదేవిని అనుసరించిరి. ఒకసంవత్సరను నిండిన పిమ్మట మాతృశ్రీ కల్కత్తాకు మరలి వచ్చినది. యోగిను అప్పటికి శ్రీయోగానందస్వామియై యుండెను. కల్కత్తాలో ఒక పక్షముదినము లుండి, మాతృశ్రీని కామార్పుకూరుకు పిలుచుకొని పోయి చేర్చి తపస్సాధన చేయుటకై తాను వెడలిపోయెను. 1888-వ సంవత్సరమధ్యమున మాతృశ్రీ మరల బేలూరులో నీలాంబరబాబుగారి తోటమాళిగలో వసించుటకు వచ్చినప్పుడు ఆమెకు పరిచర్య చేయుటకై శ్రీయోగానందస్వామియువచ్చెను. మాతృశ్రీకి ఆయన చేసిన సేవ ఆశ్చర్యకరమైనది. తన శరీరపరిస్థితులను తృణీకరించి ఆయన మాతృశ్రీ సౌఖ్యమునకై పాటుపడును. ఏలయన ఆమెలో ఆయనకు తనగురుదేవుడే ప్రత్యక్ష మగుచుండెను. కావున పూర్ణభక్తితో సేవచేయుటే తినకు పరమ ధర్మమని అతడు భావించెను. మాతృశ్రీ తన పల్లెవాసము విడిచి ఇతరప్రదేశములకు పోయినప్పుడెల్ల ఆమెకు పరిచారకుడుగా శ్రీయోగానందస్వామి తప్పక యుండెడినాడు. అలాగు 1888 నవంబరులో ఆయన ఆమెతోను శ్రీబ్రహ్మానందస్వామి ప్రముఖులతోను పూరిలో మఱి సంవత్సరాదివఱకు నుండెను. 1890 లో బేలూరి సమీపమున ఘుషురిలో శ్రీయోగానందస్వామి మాతృశ్రీతో నుండె ననుట గట్టిగ తెలిసిన విషయము. 1893 లో బేలూరున నీలాంబరబాబుగారియింట నేమి, 1894లో కైల్వారులో నేమి, 1896 లో కల్కత్తాలో సర్కార్బారి లేనులో నొక బాడుగింట నేమి, 1897 లో కల్కత్తాలో బోస్పరాలేనులో మఱొక బాడుగింట నేమి ఆయన మాతృశ్రీకి పరిచర్యచేయుచు నుండెను. తొలిసంవత్సరాలలో ఆ నడిమిదినాలు చాలవఱకు ఆయనకు తపశ్చర్యలో గడచినవి. తపశ్చర్య ఆయన పలుతావులలో చేసెను. తుదకు అనారోగ్యము

పైకొనగా స్థిరముగ కల్కత్తాలోనే ఉండవల సినవా డాయెను.

1891 లో ఒకప్పుడు శ్రీయోగానంద స్వామి వారణాశికి పోయెను, అచ్చట కఠిన తపస్సులో తన కాలము గడపెను. ఏకాంత వనమందిరమున సాధనలందు నిమగ్నుడై యుండెను. ఆదినాలలో భుజించుటకగు కాలము సైతము నిరర్థకముగ గడచిన ట్లతడెంచెడివా డట. ఒకనాడు చేసిన భిక్షాటనమున కొన్ని రొట్టెముక్కలు లభించునేని, నీట నానవేసి యుంచిన అవే మూడునాలుగుదినాలకు తన పూర్తి ఆహారముగా ఆయన సరిపుచ్చుకొనెడి వా డట. ఆసమయమున వారణాసిలో పెద్ద కొట్లాట జరిగినది. కాని ఆయన అప్రాంతీయు లెల్లర ఆదరము చూరగొన్నవాడు కావున కొట్లాడుకొనువారిలో ఏపక్షమువారును ఈ యన జోలికి రాకుండి రట. ఆసాధనలగాసికి ఆయన దేహము ఆగలేక పోయెను. అప్పుడు చెడిన ఆరోగ్యము మరల సరిపడనే లేదు. వారణాసినుండి ఆయన బారానగరమఠమునకు మరలి వచ్చెను. ఎంతో బాధపడుచున్నను ఆయన నెమ్మొగమందలి హాసవికాసములు ఆబాధను కప్పిపెట్టెడి వట. ప్రియసోదరశిష్యు లతో చమత్కారములాడుచు వినోదముల తేలుచున్నప్పుడు ఆయనశరీరములో వ్యాధి యున్న దని ఎవ రూహింపగలరు ?

మాతృశ్రీ కల్కత్తాకు వచ్చినప్పుడు శ్రీ యోగానందస్వామి మరల ఆమెకు పరిచార కుడుగ అమరెను. ఇంచుమించు చొక్క సంవత్స రము మాతృశ్రీకి భక్తిపూర్ణ పరిచర్యలు చేసెను. తర్వాత విశేషకాలము కల్కత్తాలో బలరామబోసునింట వసించుచుండెను. శాశ్వత రోగిగా తయా రయ్యెను. ఆయనను పీడించు చుండిన వ్యాధి ఉబ్బసము. కాని ఆయనలో ఆకర్షకశక్తి యెంతో యుండెడిది. ఆయనను కలసికొన్నవా రందఱు ముగ్ధు లయ్యెడివారు. అంతటి సౌశీల్య మాయనది! ఎవరికిని ఆయన యెదుట క్రోత్తదనపు బిడియ ముండనే యుం డదు. ఆ దినాలలో ఆయన సమాగమ భాగ్య మునందిన కొందఱు యువకులు అనంతరకాల మున రామకృష్ణసంప్రదాయమునకు చెందిన సన్న్యాసు లైరి.

1895 నుండి 1897 వఱకు దక్షిణేశ్వర మున శ్రీయోగానందస్వామి శ్రీరామకృష్ణుని జయంతిమహోత్సవములను అత్యంతవిభవ ముతో జరిపెను. 1898 లో అంతటి మహో త్సవమునే బేలూరులోను జరిగించెను. ఆఉత్స వములు నిర్విఘ్నముగను అంతవిభవోత్తరము గను నెఱవేఱుటకు కారణము యువకబృం దముమీద శ్రీయోగానందస్వామి కుండిన గొప్పపలుకుబడియే. 1897 లో శ్రీవివేకా నందస్వామి అమెరికానుండి మరలి వచ్చి నప్పుడు ఆయనను గౌరవించుటకుజరిగిన గొప్ప ఉత్సవములో శ్రీయోగానందస్వాముల కార్య నిర్వహణసామర్థ్యము స్పష్టమయ్యెను.

శ్రీవివేకానందస్వామి భారతదేశమునకు మరలివచ్చినపిమ్మట ఒకసంస్థను ప్రారంభింప వలె ననెడి తన సంకల్పమును సోదరశిష్యులకు తెలిపినప్పుడు దాని నాక్షేపించినవాడు శ్రీ యోగానందస్వామి. కాలమును శక్తిని పూర్తిగా ఆధ్యాత్మికసాధనలకే వినియోగింపుడని శ్రీ రామకృష్ణుడు ఆదేశించియుండగా వివేకానంద స్వామి తానుగా ఒకసంస్థను ప్రారంభింతు ననుట గురూపదేశము నుల్లంఘించుటే—అని

యోగానందస్వామి వాదము. ఈ మాట ఆసింహమును అతిమాత్రముగ కెరలించినది. అతనిచేత ఆంతరజీవితములో నొక అంశమును వెలువరింప జేసినది. ఎంతో నొచ్చుకొనుచు శ్రీవివేకానందస్వామి ఇట్లనెను: "ఆధ్యాత్మికముగ పరమోచ్చదశనధిష్ఠించిన శ్రీరామకృష్ణునిబోధనలను అతిక్రమించుటకు కొన్నిస్థానగు నే నేపాటివాడను. శ్రీరామకృష్ణుడు సంకల్పించెనేని ఒక పిడికెడుమట్టినుండి నూర్లకొలదిగ వివేకానందులను సృజింపగలడు. తన పనికి శ్రీరామకృష్ణుడు నన్ను కేవల మొక పనిముట్టుగ తావించుకొన్నాడు. శ్రీరామకృష్ణునిసంకల్పమునకంటె భిన్నమైన సంకల్పము నాకు లేదు". వివేకానందుని ఈ మహాద్భుత గురుభక్తి తక్షణమే శ్రీయోగానందస్వామిని అనుకూలునిగ మార్చివేసెను. రామకృష్ణ మిషనుసొసైటీ ప్రారంభింపబడినపుడు శ్రీ యోగానందస్వామియే దానికి ఉపాధ్యక్షుడుగ నియమింపబడెను.

శ్రీవివేకానందస్వామియెడ శ్రీ యోగానందస్వామికి గల ప్రేమ అత్యగాధము. ఐనను తన నాయకుడైన శ్రీవివేకానందునే ప్రతిఘటించి యోగానందుడు తనవిమర్శనపుణ్యాతిశయమును గుణదోషనిర్ణయసామర్థ్యమును చూపించిన సందర్భము ఇదొక్కటే కాదు. గురుదేవునినైతము ధైర్యముతో సునిశితముగ పరిశీలించి తర్వాతనే ఆయన నాశ్రయించిన యోగానందుడు సోదరశిష్యుని విమర్శింపక విడుచునా? పూర్వోక్తసంభవమునకు రెండేండ్ల పిదప సోదరశిష్యులు వివేకానందుని మరల తప్పుపట్టిరి. భక్తియు ఆధ్యాత్మికసాధనలును భగవత్సాక్షాత్కారమునకు ఉపాయము లని గురుదేవుడు బోధించియుండగా శ్రీవివేకానందస్వామి అట్లుపదేశింపక "పర్యటింపుడు, పేదలకు వ్యాధిగ్రస్తులకు సేవచేయుడు, వారికై పాటుపడుడు, వారికి తత్త్వము కఱపుడు"—అని బోధించుట విరుద్ధ మని వా రనిరి. ఈ వాదమునకు ప్రారంభకుడు శ్రీయోగానందస్వామియే. ఈచర్య ప్రారంభములో ఉభయపక్షములందును వేడుకప్రసంగముగ నుండినది కాని క్రమక్రమముగ శ్రీవివేకానందస్వామిది వినోదప్రసంగముగాక ఉద్రిక్తభావపరీవాహముగ పరిణమించెను. పేదలపట్ల ప్రేమకును గురుదేవునందలి భక్తికిని ఆయన డెందమున చెలరేగుచుండిన సంఘర్షణము ప్రత్యక్షముగ కన నయ్యెను. కన్నులు బాష్పపూర్ణము లయ్యెను. దేహము కంపించిపోవుచుండెను. వీనిని మఱుగుపఱచుకొనుటకై శ్రీవివేకానందస్వామి తక్షణమే ఆచోటును వీడి యేగెను. ఆయన వెడలిపోయిన తర్వాతకూడ అచటి నిశ్శబ్దతను చెడగొట్టు ధైర్యము ఎవరికిని లేకపోయెను. కొన్నినిమిషములకు పిమ్మట సోదరశిష్యులు కొందఱు శ్రీవివేకానందస్వాముల గదికి పోయి చూచిరి. ధ్యానానుగుణవైఖరిలో ఆయనకూర్చుండియుండెను. మేను నిశ్చలముగ నుండెను. అర్ధనిమీలితనేత్రములనుండి అశ్రుధార యెడతెంపులేక కాఱుచుండెను. దాదాపుగంటసేపటికి స్వామి తనకై నిరీక్షించుచు సోదరశిష్యులు కూర్చున్నగదికివచ్చెను. ఆయన మాటాడ ప్రారంభింపగనే గురుదేవునందాయనకు గల భక్తి పైకి కనిపించునంత కంటె నిజమున కెంత అగాధతరమో అందఱికిని స్పష్ట మయ్యెను. కాని ఆవిషయమును గూర్చి వారు స్వామిని మాటాడనియలేదు. శ్రీయోగానందస్వామి ప్రభృతులు ఈవిషయ

మును మఱపించుటకై ఆయనను గదినుండి ఆవలికి పిలుచుకొనిపోయిరి.

మాతృశ్రీ పరిచర్యను పూర్తిగా తాను నిర్వహింపలేనంత దౌర్బల్యము పైకొన్నందున శ్రీయోగానందస్వామి ఒక యువసన్న్యాసిని తనకు తోడ్పఱచుకొనెను. మాతృశ్రీ కల్కత్తాలో నున్నప్పుడు మహిళలు సహజముగనే గుంపులుగుంపులుగ ఆమెయొద్దకు వచ్చెడి వారు. ఆపరిస్థితిని జూచి శ్రీవివేకానందస్వామి ఆయువసన్న్యాసిని సహాయునిగా నుంచుకొన్నందుకు యోగానందస్వామిని ఇట్లు మందలించెను: "ఈసన్న్యాసి బ్రహ్మచర్యమునకు ముప్పుగల్గెనేని దాని కెవరు బాధ్యులు?" ఇందుకు యోగానందస్వామి తక్షణమే చెప్పిన జవాబు: "అతనికై నాసర్వస్వమును త్యాగ మొనర్ప నేను సంసిద్ధుడనై యున్నాను." ఆర్జవముతో ఆస్థతో పలుకబడిన మాట లవి. కావున విన్నవారు శ్రీయోగానందుని హృదయవైశాల్యమును కొనియాడకుండజాలక పోయిరి.

శ్రీయోగానందస్వామి కష్టములు త్వరలోనే తీరిపోయెను. 1899 వ సంవత్సరము మార్చి 28-వ తేదీ ఆయన మహాసమాధి నొందెను. గురుదేవుని సన్న్యాసశిష్యులలో మొదట మహాసమాధినొందిన దితడే. మరణించుటకు ముందు ఆయననోట వెలువడిన దివ్యవాక్కులు: "నాజ్ఞానమును భక్తియు అనిర్వాచనీయస్థాయికి వర్ధిల్లినవి." ఆసమయమున ప్రక్కనుండిన సోదరసన్న్యాసి యొకడు ఒక పరమసత్త్వము తమలోనికి ప్రవహించినట్లును ఆత్మ శరీరస్థాయిని దాటి ఉన్నతమును ఉత్కృష్టమును బంధరహితమునగు స్థాయికి అధిరోహించినట్లును తమ అనుభవమునకు స్పష్టముగ గోచరించె నని చెప్పెను. శ్రీయోగానందుని మరణవార్త శ్రీవివేకానందస్వామిని ఎంతయు కల్లజేసెను. గుండెతఱుగు కొనిపోవుచుండ ఆయన "అవసానమున కిది ఆరంభము" అనెను.

వెలుపలినుండి చూచువారికి శ్రీయోగానందస్వామి జీవితములో గణనీయములైన సంభవములు కనిపింపవు. ఆయనవ్యక్తిత్వమును ద్యోతిలజేయు వివరములను కనుగొనుట గాని తెలుపుటగాని చాల కష్టము. చాల సన్నిహితులై మెలగిన ఏకొందఱోమాత్రమే ఆయనఆధ్యాత్మికమహిమలో కొంతైనను గుర్తింపగలిగిరి. అప్పుడు మఠమునందుండిన యువసభ్యులలో నొకడు శ్రీయోగానందుని గూర్చి ఇట్లు వ్రాసెను: "ఆయన గొప్పయోగి. ఒకయువసభ్యుడుగానైనను ఆయనచెందిన సంప్రదాయమునకే చెందుట ధన్యతావహము." రామకృష్ణసంస్థకు చెందిన గృహస్థులకును సన్న్యాసులకునుకూడ శ్రీయోగానందునిపట్ల ఆదరాభిమానములు అత్యధికములు. శ్రీరామకృష్ణుడు "ఈశ్వరకోటులు" "నిత్యముక్తులు" అని నిర్దేశించిన కొలదిమందిలో నిత డొకడు. చేతనులను దేవునిదరికి కొంపోవుటకై అప్పుడప్పు డవతరించు మహాత్ములలో నిత డొకడు. ఆమహాత్ములు బంధము నెన్నడు నెఱుగరు.

# నా గురుదేవుడగు శ్రీవివేకానందస్వామి సంస్మృతులు

శ్రీ సదాశివానందస్వామి

(గతసంచిక తరువాయి)

•

ఆదశలో ఎంత సేపు మునిగియుంటినో నే నెఱుగను. కాని క్రమముగా నాకు శరీరస్మృతి కలిగినది, గదిలోని వస్తువులు అస్పష్టముగ కనబడసాగినవి. అప్పుడే ఒకస్వప్నలోకము గుండ పోవుచున్నట్లు నా కుండునది. కాని ఇంకను తెలిసినవస్తువులనే గుర్తింపలేకయు పేర్కొనలేకయునుంటిని. ఒకక్రొత్తప్రపంచము లోనికి — పూర్తిగా క్రొత్తదైన ప్రపంచము లోనికి వచ్చినట్లున్నది నాకు. స్థూలజగము లోని కిప్పుడే వచ్చిన శిశువువలె నుంటిని. నా ఆత్మ, ఎందుండి తాను వచ్చెనో, అక్కడికి ఎగిరిపోవలె నని కోరుచుండినది. కాని భౌతిక శక్తులు దానిని నిరోధించుచుండినవి. ఆ అర్థ చైతన్యదశలో, రక్తము నానాళములగుండ మరల ప్రవహించినది. నానిట్టూర్పులు నాకు తెలిసినవి. నన్ను నేను చూచుకో గలిగినాను. ఎదుట నున్న స్వామియు నాకంటికి కనబడ సాగెను. కాని నాలోని కొక క్రొత్తప్రాణ మెక్కింపబడ్డట్లుండెను. లోకములోని సకల వస్తువులును మధురములుగను శ్రావ్యములు గను ఉండినవి. ఏల యన అవి యన్నియు స్వామిసొమ్ము కదా. అవన్నియు వివిధరూప ములలో ఆకృతులలో కనవగుచున్న దేవుని ప్రతిబింబములు. బ్రతికినన్నినాళ్లు గుడులలో మ్రొక్కుచుంటినే, అలా గిప్పుడు విశ్వపదార్థ ములలో ప్రతిదానికిని మ్రొక్కగలవాడనైతిని. నేను పీల్చుచుండినగాలి పవిత్రము, నీలాకాశ మును చుట్టుపట్లును పవిత్రములు, నీరును నేలయు చేతనాచేతనము లన్నియు పవిత్రతా సారములే. ఇట్లు నాకు మంత్రోపదేశము ముగిసినది. 'నీకు తర్వాతవానిని పంపు' మన్నాడు స్వామి. నేను వెలుపలికి పోయి, చారుబాబును లోనికి పంపితిని. అతనికిని మంత్రోపదేశ మిట్లే జరిగినది. తర్వాత శ్రీహరిదాసఛటర్జీకి.

శక్తిని సంక్రమింపజేయుటనుగూర్చి బైబిలులో మనము చదువుచుందుము. ఒకక్రొత్త బిషప్పును (మతాధిపతిని) ఎన్నుకొన్నప్పుడు తక్కిన బిషప్పు లందఱును వచ్చి అతని లలాటమును స్పృశించి ప్రార్థనము చేయుదురు. దీనికి (కాన్సెక్రేషన్) పవిత్రీకరణము అని పేరు. ఇప్పు డిది కేవలాచారముగ పరిణమించినది. ఒకానొక కాలమున అది అట్టిది కాదు, ఆత్మశక్తి యథార్థముగనే సంక్రమింపజేయబడు చుండెను. ఐరోపావారి వివిధతత్త్వశాస్త్రాలను చదివిన వారు ఈదేశమున పెక్కండ్రు కలరు. వారి అభిప్రాయమున మత మనగా పారమార్థికపరత అనగా 'మంచినడవడి' 'నీతి' అంతకు మించి వే రేమియు కాదు. కాని అప్పటమైన ఆధ్యాత్మికపరత అనునది వే ఱొకటి కలదు. అది మానవునిఆత్మకు సంబంధించినది. దానినే మనము 'ధర్మము' అందుము. దానిని బ్రహ్మ

తాదాత్మ్యమొందిన ముక్తాత్మ సంక్రమింపజేయు గలదే కాని వేఱొకడు సంక్రమింపజేయలేడు. ఈ ధర్మ మనునది 'మతనియమావళి కాదు' మనదృష్టికిని స్పర్శకును అందు వస్తువులకంటె కూడ అది అధికప్రత్యక్షానుభూతి, లేదా అంతకంటె ఇంకను హెచ్చు. ఏలయన అది మన సత్తాధారమును రూపుమాపును. దానిని క్రమముగా వికసింపజేసి ఏతమైన బ్రహ్మమందు లీనమొనర్చును. అది బ్రహ్మజ్ఞానమాత్రమును కాదు, బ్రహ్మైక్యమే.

ఈసంక్రమణము సూక్ష్మప్రాణశక్తులచేతనే శక్యమగును. ఆశక్తులద్వారా ఒకముక్తాత్మ ఇంకొకనిలో కుండలినిని రగుల్కొల్పును. మంత్రోపదేశమున కిదే అర్థము. శిష్యునిలో గురుడు జ్ఞానదీపమును వెలిగించుట శక్తిజనకమైన యొక మహాయంత్రము. శ్రీవివేకానంద స్వామిగా రూపుదాల్చినది. ఆయంత్రము మనవు మొదలుకొని యుగయుగములుగా సాగుచు వచ్చుచున్న ఈశక్తిని మాలోనికి సంక్రమింపజేసినది. ఈ పితృధనమును తఱుగనీయక రక్షించుటకు మేము ఎన్నుకోబడితిమి.

ప్రాణశక్తిప్రవాహములు దేహమందలి అధఃకేంద్రములలో ప్రవహించినపుడు విశ్వమందలి అనేకత్వము మనకు గోచరించును. ఆప్రవాహములు మేనిలోని ఊర్ధ్వతమభాగమున ఏకమైనప్పుడు, మన అహంకారమునకు ద్వైతమునకు అవిభాజ్యవిశ్వతత్త్వమునకు నిజమైన ఆధారము ఏకత్వమనుట మనకు అనుభూతమగును.

ఈజ్ఞాన మీయబడిన దను విషయమును, నిరుపాధికదానముగ దీనిని గైకొన నగు నను విషయమును, అర్థస్థానమునకు మరల సంక్రమింపజేయ నగు నను విషయమును స్వాముల అనంతదయాప్రసాదములచే నాకు స్పష్టమైనది. దీనినే దివ్యానుగ్రహ మందురు. అది సకల వికల్పవితర్కాలకు పైదశ; నిత్యైక్యము, నిత్యసత్తు, ఏకము అవిభక్తము. ఇది 'చిత్తు'— 'దైవము' అనబడును, ఇందుండియే విశ్వము వెలువడును—దీని కొక రెండవ దైవము లేదు. ఇది తన ఒక్క చైతన్యమును పెక్కుగ విభజించుకొని విశ్వమంతటను సర్వభువనములందును నిండిపోవును. నిశ్చలమగు ఏకావిభక్త ప్రాణశక్తియు పెక్కు చీలిక లగును, వానినే మనము చరము లని, అచరము లని, ఈ మున్నగు రీతుల పేర్కొందుము. ఇట్లు ఏకము ననేకము, విభిన్నము నభిన్నము నొక్కటే. అన్నింటనుండు ప్రాణశక్తి ఒక్కటే రూపమును తిలకించునప్పుడు దానియందున రూపరహితమైనది ఉన్నది. ఆరూపరహితమైన దానితో మన మేకమైనప్పుడు ఏరూపమును కనజాలము, ద్వైతమును కనజాలము.

ఏక మెట్లు పెక్కురూపు లొందునో పెక్కు ఎట్లు ఏకమున లయ మొందునో — ఆవివరాలను నేను తెలిసికొనలేకపోయినాను, ఏలయన అంతయు ఒక్క క్షణమున జరిగిపోయెను. నేను గ్రహించిన దింతమాత్రమే—ధర్మమును పారమార్థికజ్ఞానమును సాక్షాత్కరించుకొనుట సాధ్యమే, అది సరళసత్యమే.

శ్రీరామకృష్ణునందు ఈశక్తి ఆత్యంతిక స్థాయిలో ఉండెను. సంకల్పమాత్రముచేత ఆశంసచేత తనంతటకల్గిన సూచనచేత ఆయన ఇతరుల ఆత్మను మహోన్నతానుభవదశకు కొనిపోగలిగియుండెను. ఆయనను దర్శించి ఆయనతో అటువంటి సంబంధము నొందిన మహాత్ములను మనము ప్రత్యక్షముగ చూచియున్నాము. మంత్రోపదేశ మనగా నిజముగా

నిదియే. మనశాస్త్రగ్రంథములలో శాంభవీ దీక్ష అనబడిన దిదే. ఈశక్తి సంపూర్ణ ముగా శ్రీవివేకానందస్వామికి గల్గినది. శ్రీ రామకృష్ణునిలో రూపుదాల్చినట్లుగానే ఆయ నలోను అది రూపుదాల్చినది. ప్రాణశక్తిచేత అనుభూతిచేత శిష్యునకు సంజీవనము గల్గిన నే కాని, ఉపదేశమున కర్థము లేదు, ప్రయో జనము లేదు.

ఆ ఉపదేశక్రియ ముగియగానే మేమంద అము ఏకపంక్తిలో భుజించితిమి. వెంటనే నేను వెడలిపోవలసియుండెను. సేవాశ్రమ ములో నేను చేయవలసినదిగా ఒకపని కాచు కొనియుండెను. శ్రీవివేకానందస్వామి కలపిన 'సేవాలక్ష్యము'చే గల్గిన యుత్సాహఫలిత ముగ మూడేండ్లకృతము ప్రారంభింపబడినదే ఆ సేవాశ్రమము. అచటిపనివాండ్రలో అత్య ధికసంఖ్యాకులు సన్న్యాసులు, భిక్షాజీవనులు, భిక్షాపర్యటనమునకే వారిశక్తిసరిపోవుచుండెను. సేవాశ్రమకార్యము చెడకూడదుకదా. తమకు శక్యమైనంత వారు పాటుపడుచుండిరి. అందుచే వారి ఆరోగ్యము మిక్కిలి దెబ్బ తినెను. అది చూచి స్వామిజి చాల దుఃఖించెను. ఒకనాడు ఆయన వారి నందఱిని ఆహ్వానించి "లోక సేవ చేయవలె ననిన ఆరోగ్యము బాగుండవలె కాబట్టి మీరు చక్కగా భోజనము చేయవలె, పుష్టికరమైన ఆహారమును భుజింపవలె" అని చెప్పెను.

పనిస్వభావమును పనిచేయువాని దేహ స్వభావమును బట్టి ఆహారమును ఎన్నుకోవలె ననియు, సూచింపవలె ననియు తేలుకొనుట కును పుష్టినొందుటకును తగినట్లు ఆహారనియతి యుండవలె ననియు స్వామి చెప్పుచుండెడి వాడు.

మాలో అనేకులకు నియమనిష్ఠలు కల వారము. కొన్ని కొన్ని ఆహారాలను మధుర భక్ష్యాలను మేము నోట వేసికొనిదైన జూ డము. కాని మొదటనుండి తుదివఱకును సేవా లక్ష్యమును సేవాప్రయోజనమునే స్వామి నొక్కి చెప్పుచుండెను. లోకసేవ చేయవలె ననిన దేహము ఆరోగ్యము గల్గి శక్తిమంతమై యుండవలెను. శాశ్వత పారమార్థికసేవాపరు నకు కర్మయోగికి తపోనిష్ఠయు సాంతసంస్కా రాలును అప్రధానములు. ఆయన ఉపదేశా లకు 'తు' 'చ' తప్పక నేను పాటించు చున్నానా లేదా చూచుటకే అనునయముష్ము లనతో భుజింపుమనెను. మాలో కొందఱము మాయిండ్లలోనే భుజించెడివారము, కాని కొంటికిపూటకిని ఆయన మమ్ముతనతో భుజింపు మనుచుండును. వీలైనప్పుడెల్ల మేము ఆయ నతోనే భుజించుచుంటిమి.

## మూర్తీభవించిన మాతృభావము

శరీరము మిక్కిలిగ కృశించిన బాలు డొకడు మానడుమ నుండెను. స్వామిజిచూపు అతనిపై పడెను. మాయందు స్వామి కెంత కృపయో తెల్పు నిదర్శనము ఆబాలుని వృత్తాంతము.

ఆయువకుడు బంగాళమధ్యప్రాంతము నుండి వచ్చినవాడు. వారణాసిలో చిక్కుకొన్నాడు. అతడు చాల బలహీనుడుగను రోగిగను ఉం డెను. కాని వేఱు దారి లేనందున సేవాశ్రమ మున ఒకపనివాడుగ చేరెను. ఒకనా డతడు స్వామిని దర్శింప నేగెను. స్వామి అతని సంగ తులను అడిగి తెలిసికొని ప్రతిదినము తనతో భుజింపుమని కోరెను — "అబ్బాయి, నీవు మంచి బలిష్ఠుడవుగ లేవు. పనిచేయుట అవి

వార్యము. బాగుగ భుజింపవలెను. నీవు ప్రతి దినము తప్పకవచ్చి నాపంక్తిని భుజించుచుండ వలెను. కనీసము మధ్యాహ్నభోజనమునైనను నాపంక్తిలో జేయవలెను.''

స్వామిజీకి మధుమేహవ్యాధి. దాని నదుపులో నుంచుటకు ఆయన సకాలమునకు భుజింపవలయును. ఆయువకునకు సేవాశ్రమములో పని యెక్కువై స్వామిజి భోజనమునకు నిర్ణయింపబడియుండు గంటను అతడు అతిక్రమించుచుండెను. వైద్యులును సోదరశిష్యులును ఆరోగ్యమును కాపాడుకొమ్మని స్వామిజీని ప్రార్థించెడివారు. ఆయనయు వారిప్రార్థనను మన్నించుచుండెను. కాని ఆబాలునిమీది తల్లిప్రేమ ఒత్తిడిచేసినప్పుడు ఆయన తన ఆరోగ్యవిషయమును వారి ప్రార్థనలను మఱచిపోవుచుండును. ఆబాలునిగూర్చి స్వామిజీ అక్కఱతో విచారించి అతనికై వేచియుండెడివాడు. ఓపికపట్టలేక ఇటు అటు పచారు చేయుచు ఆబాలుడు వచ్చుచున్నాడా లేడా అని గుమ్మమువైపును వీధివైపును పరికించుచుండును. ఎవరు కనిపించినను ''ఆబాలుడు వచ్చినాడా? పాపము! ఏల వాని కీదిన మింత యాలస్యము? చాలబలహీనుడుగ నున్నాడు. ఇప్పటివఱకును ఏమియు భుజింపలేదు. ఛీ, ఛీ- అంత పసివాడు! అంత బలహీనుడు! అంత పని!

స్వామీజీ చూచుకొనవలసిన ముఖ్యవిషయమే దేని యున్న తదేకతానముగ ఆయన అందు నిమగ్నుడై యుండును. ఆయనశక్తి యుక్తు లన్నియు తదేకాభిముఖములుగ నుండును. ఈబాలుని విషయమునగూడ నంతే. ఏపనిలోగాని ఆయనకు ఎక్కువతక్కువ అను భేదభావము లేదు. ఉపన్యాసవేదికపై ఉద్రిక్త భావముతో ఉపన్యసించుట గాని పండితులతో ధ్యానవేదాంతవిషయముల చర్చించుటగాని ఒకయువకుని ఆహారవిషయమును చూచుకొనుటగాని — అన్నియు ఆయనకు సమానములే. అన్నింటను అదే మనస్సు! అదే ఏకాగ్రత! అదే లక్ష్యము, మానవుని యోగక్షేమములు!

స్వామిజిస్నానము అయినది, మడిబట్టలు కట్టుకొన్నారు. వండినఅన్నము చల్లబడుచున్నది. అందఱును ఆయనకై వేచియున్నారు. కాని ఆయనయేమో ఇటు అటు పచారుచేయుచున్నాడు. ప్రగాఢ భావోద్వేగము, మిక్కిలి ఆందోళన ఆయనయందు కనపడుచున్నది. పెదవులు కన్నులు ముఖమందలి కండరములు నాసిక ఇవన్నియు కదలుచు ముడుచుకొనుచు డెందమందలి తుపానును సూచించుచున్నవి. ఆ దృశ్యమును మీరే భావించిచూడుడు.

సకాలమునకు భోజనము చేయుడని అందఱును స్వామిజీని ప్రార్థించిరి. కాని ప్రస్తుతము ఆయనను చెనకగలసాహసము ఎవరికిని లేదు. స్వామీజీ భుజించుటకు ముందు తాము భుజించుటయు ఎవరికిని ఇష్టము లేదు. తన కత్యంత ప్రేమపాత్రుడైన వానికొఱకు స్వామిజీ కాచుకొనియున్నాడు. ఆత్రముతో ఆయనచూపులు మాటిమాటికిని వీధివైపు పర్వుచుండినవి. ఇది దివ్యశిశువైన గోపాలునకై మిక్కిలిఔత్సుక్యముతో ఎదురుచూచుచుండిన పురాణప్రసిద్ధురాలగు యశోదవైఖరిని తలంపించుచుండెను. వైష్ణవకవులు భక్తిగేయములను ఉద్రిక్తభావ కవితలను రచించుటలో నెల్లరను మించినవారు. వారి పవిత్రగేయములు అంతరార్థము మాకు ఈస్వామిజీనడవడిలో బోధపడినది.

లేడకు ఆ బాలుడు పరుగున వచ్చెను. స్వామిజీనేత్రములు పరల మాఱిపోయెను.

ఎడబాసియున్న బిడ్డను కలిసికొన్న తల్లి చెందు సంతృప్తియు సౌఖ్యమును అప్పుడు స్వామి నేత్రముల ప్రకాశించుచుండినవి. ఉత్కంఠయు ఆందోళనయు నున్న చోట ప్రేమోత్సాహముల పొంగు కననయ్యెను. నవ్వుచు ఆయన బాలుని ''అబ్బాయి, ఎందు కింత ఆలస్యము, కార్యభారముచేతనే లే, నాకు తెలియును, కాని ప్రొద్దున ఏమేని అల్పాహారము భుజించితివా, చూడు. నేనింకను భుజింపలేదు. నీకై వేచియున్నాను. రా రా చేతులు కాళ్లు కడిగికొని పరుగున రమ్ము భోజనాలగదికి. ఇప్పటికే ఎంతో ఆలస్యమైనది. నాకు ఆరోగ్యము అంతబాగులేదనుట నీకు తెలిసినవిషయమే. సకాలమునకు భోజనము లేకున్న నా వ్యాధి వృద్ధి యగును. కాబట్టి కొంత ముందుగ వచ్చుటకు ప్రయత్నింపుము. కాని పాపము నీ వేమి చేయగలవు ? నీ కార్యభారముచే నీకు జాగగుచున్నది. అది నేనెఱిగిన విషయమే కదా.''

ఆ బాలునినోట ఒక్క మాటయైనను వెలువడలేదు. స్వామివైపు అమాయికముగ చూపులను మాటికి మాటికి ప్రసరింపజేయుచుండెను. అతనిమోమున మెత్తందనము లజ్జ కననగుచుండెను. ప్రార్థనాసూచకములగు అతని చూపులలో అతనిలో నిండి తొణకుచున్న మాటల కందని ఆనందము కననగుచుండెను. స్వామియు ఆయనవెంబడి ఆ బాలుడును ఇతరులును తమతమ పీటలపై కూర్చుండిరి. భుజించుచున్నంతసేపును స్వామిచూపులు ఆ బాలుని పైనే ఉండినవి. తనకు రుచించినను రుచికరములుగను తోచిన పదార్థములను స్వామి తన పళ్లెమునుండి ఆ బాలునకిచ్చుచుండెను. నోరు మెదల్పలేని ఉద్రిక్తానందముతో బాలుడు స్వామి ఇచ్చినదానినెల్ల దేవామృతముగ భావించి భుజించుచుండెను. స్వామి తన పళ్లెమునుండి పదార్థములను ఆ బాలునకు ంప నందించుచుండెను. ఆయన తనకు కావలసినంతలో సగమైనను తాను తిన్నాడా అని సందేహము. దిక్కులేని పేదలకును బాలురకును సేవ చేయుటే స్వామిపని. ఆయన అవతారప్రయోజనమునకే అది ఉపలక్షకముగ నుండెను. బాలునిచేత తినిపించు నానందమున తాను తిను పని ఆయన మఱచిపోయినాడు. మౌనముగ భుజించుచున్న ఇతరులును స్వామి తా నేమియు భుజించుట లేదనియు భుజించుచున్న బాలునివైపు ప్రేమపూర్వకముగ జాగరూకతతోను సంతోషానందముతోను చూచుచుండుటను గుర్తించి పరమాద్భుతమైన ఈ మాతృప్రేమదృశ్యమును చూచుచు వారును తమభోజనమును మఱచిపోయిరి. నడుమనడుమ ''స్వామిజీ తా మేమియు భుజించుట లేదే. ఏదైన భుజింపుడు'' అని ప్రార్థించుచుండిరి. కానీ ఆ ప్రార్థనను విను వా రెవరు ? స్వామికి ఆ బాలుడు దివ్యశిశువగు సాక్షాద్గోపాలుడే. స్వామి చేతులు నోటియొద్దకు కేవలము యంత్రరీతిగా కదలుచుండినవి. ఆ భోజనాలగది సైతము బ్రహ్మానందమునకు పరమనిర్వృతికి నిలయమాయెను.

# నవభారతమార్గదర్శకుడు శ్రీ వివేకానందస్వామి

శ్రీ ఓగోటి ఆనందరాము, ఎమ్.ఏ., బి.ఎల్. గారు

అది అమెరికాదేశంలో ఒకమహానగరం. ఆమహానగరంలో ఒకరమ్యహర్మ్యం. రాత్రి సమయముకాబట్టి ప్రకాశవిహీనముగాఉన్నది. అందులో ఒకగదిలోనుండి వెక్కి వెక్కి ఏడ్పు వినవస్తున్నది. అసవ్వడికి గృహిణి లేచి వడివడిగా ఆవైపునకు వెళ్లినది. ఆమె తన అతిథి పాదములు ముడుచుకొని పట్టాపై పొరాడడము గమనించి నిర్ఘాంతపోయినది.

"మీరు ...ను విసర్జించి ఈ విధంగా నేలపై పొర్లాడుచూ దుఃఖిస్తున్నారే! నాఆతిథ్యములో ఏమైనా లోప మున్నదా? లేకున్న పీడకల ఏమైన వచ్చినదా?" అని వినయముగా ప్రత్యుత్తరానికై నిరీక్షింప సాగినది.

"అమ్మా! మీరు దయతో ఏర్పాటుచేసిన మృదులతల్పముపై శయనించినవెంటనే నిర్భాగ్యులైన నాదేశీయుల దుఃస్థితి నాకండ్లముందు పొడకట్టినది. వారు పడకకొఱకై ఒకచాపను గాని, దిండుకొఱకై ఒక ఇటుకను గాని సంపాదింపలేకున్నారు. వారే నారక్తమాంసములు. వారీవిధంగా కష్టపడుచున్నప్పుడు నేను సుఖమైన పడకపై, ఎట్లు పరుండగలను? వారి దయనీయమైన స్థితి నామనసుకు ఎంతో ఆవేదన కలిగించినది" అని ఆఅతిథి వాపోయినాడు.

స్వదేశీయులపై ఇంతటి వాత్సల్యాభిమానములు కల్గిన ఆమహనీయు డెవ్వరు? అతడే స్వామి వివేకానందుడు. నవభారతమార్గదర్శకుడు. భారతమాతృ పూజాఫలము. ముముక్షువులకు పెన్నిధి. జిజ్ఞాసువులకు కల్పవృక్షము దేశ భక్తులకు నాయకాగ్రణి.

రాజకీయనాయకులను, ఉన్నతోద్యోగులను మనము దేశభక్తు లని పొగడుదుము. కాని కేవలము పదవులు, నాయకత్వము, కీర్తి, దేశ భక్తికి చిహ్నములు కావు. నిజమైన దేశ భక్తికి బాహ్యాపటాటోప మనవసరము. అది మానసికమైనది. దాని లక్షణములు వివేకానందుని వద్దనే తెలుసుకొనవలెను.

దేశభక్తినిగూర్చి ఆయన ఏమని ఉద్ఘాటించినాడు? "మీరు వ్యసనపడుచున్నారా? దేవతలు, ఋషులు కన్న సంతానములో లక్షలు, లక్షలుగా మూర్ఖులకు పొరుగు వారైనా రని మీరు ఆవేదనపడుచున్నారా? నేడు లక్షలాదిగా పస్తుపడియున్నా రని, యుగయుగములుగా లక్షలకొద్ది పస్తుపడియున్నారని మీరు వ్యాకులపడుచున్నారా? కారుమేఘమువలె అజ్ఞానము దేశమును ఆవరించిన దని మీరు వ్యసనపడుచున్నారా? అది మీకు వ్యాకులము కల్గించుచున్నదా? అది మిమ్ము నిద్రారహితులను చేయుచున్నదా? అది మీ నరములద్వారా మీరక్తమును చేరినదా? మీ హృదయస్పందనలో కలసినదా? అది మిమ్ములను దాదాపు పిచ్చివారిగా చేసినదా? దుఃఖము వినాశము అను ఏకైకభావమే మీకెప్పుడైన కల్గినదా? ఎప్పుడైన మీ కీర్తిని, మీ భార్యలను, మీబిడ్డలను, మీఆస్తిని తుదకు మీశరీరములను కూడ మరచినారా? మిమ్మది

దాదాపు పిచ్చివారినిగా చేసినదా? అదే నిజమైన దేశభక్తునకు మొదటిమెట్టు, మొట్టమొదటి మెట్టు

స్వామి అటువంటి దేశభక్తుడు. "నా దేశములో ఒకకుక్కకూడ ఆకలిగా ఉన్నంతవరకు, నేను స్వర్గమునకు పోవుటకుకూడ ఇష్టపడను" అని వచించిన మహామనీషి. "ప్రజలను నిర్లక్ష్యముచేయుట మన జాతీయదోషమని నేను భావించెదను. అదే మనపతనమునకు దారితీసినది" అన్నట్టి దృక్పథ మాయనకు కల్గినది. అందువలన దేశపురోభివృద్ధికై ఆయన అన్నిరంగములయందు సర్వతోముఖ కృషి చేసినాడు.

ప్రప్రథమముగా దీనజనోద్ధరణకై ఆయన కొందఱు భారతీయధనికులసహాయ మర్థించినాడు. స్వార్థపరులైన ఆధనికు లా మాటలు పెడచెవిని బెట్టిరి. అందుచేత ఆయన తన ప్రయత్నములకు కావలసినసంపత్తిని అమెరికాలో చేకూర్చుకొనవలె నని అనుకొనెను. ఇంతలో చికాగోనగరములో నానామతసభా సమావేశము ఏర్పాటు చేయబడినది. ఒకే దెబ్బకు రెండు పిట్ట లన్నట్లు ఆసమావేశములో పాల్గొనుట ద్వారా వివేకానందుడు హిందూమతప్రచారమును, దీనజనోద్ధరణ కార్యక్రమప్రారంభోత్సవమును సాధించెను. సభ మొదటి సమావేశముననే వివేకానందుని కీర్తి మిన్నందుకొనెను. అమెరికా అంతట ఒక్కరోజులో ఆయనపేరు మారుమ్రోగి పోయెను. "హైందవ ఝంఝామారుతము", "ఈశ్వరప్రేరిత వక్త" ఇత్యాదిగా ఆయన స్తుతింపబడెను. ఆయనప్రభావము అమెరికనులలో ఎంతగా వ్యాపించినదనగా నానామతసభసమావేశములలో జనాకర్షణకొరకై ఆయన ఉపన్యాసమును కట్టకడపట ఏర్పాటు చేసెడివా రట!

ఆసభ పూర్తియైనతర్వాత స్వామి అమెరికాలోను తదితర పాశ్చాత్యదేశములలోను కొన్నిసంవత్సరములు పర్యటించినాడు. భారతీయచరిత్రను, సంస్కృతిని, వేదాంతమును పాశ్చాత్యులకు తెలియబఱచినాడు. ప్రాచీన భారతవైభవమును వారికి చాటినాడు. తాను మాత్రము వారిలోని గొప్పతనమును, మంచితనమును గ్రహించినాడు. కాని తనభారతీయతను, అకుంఠిత దేశభక్తిని అణుమాత్రమైనను కోల్పోవలేదు. పైపెచ్చు పెంపొందించుకొనెను. స్వామి భారతదేశమునకు పోవుటకు ముందు వారిశిష్యులొకరు ప్రశ్నించినారు కదా- "స్వామీ, నాల్గు సంవత్సరములు మా దేశీయులసాహచర్యములో గడపి, ఎంతో ప్రేమ, ఆదరము, గౌరవము పొందినారు. ఈదేశపు ఔన్నత్యమును, పురోభివృద్ధిని గమనించినారు. ఇవన్నియు అనుభవించిన తర్వాత అగాధమైన అజ్ఞానములో, అసహ్యాకరమైన ఆచారవ్యవహారములలో మునిగియున్న భారతదేశమును మీరెట్లు ప్రేమింతురు?" తక్షణమే స్వామి గంభీరముగా బదులు చెప్పినాడు. "నేను ప్రయాణమై వచ్చుటకు ముందు భారతదేశమును ప్రేమించినాను. ప్రస్తుతము భారతదేశపుధూళి సైతము నాకు పవిత్రమైనది. ప్రస్తుత మది పుణ్యభూమి, యాత్రాస్థలము, తీర్థము. ఆతురతతో నేను భారతదేశపు పునీతధూళిపై పొర్లాడుశుభదినమునకై ఎదురు చూచుచున్నాను"

ఈదేశప్రేమయే వివేకానందుని ప్రాభవమునకు మూలకారణము. ఎందఱో సన్న్యాసులు, ప్రవక్తలు జన్మించినారు, కీర్తిని పొంది.

నారు. కాని కొంతకాలముతర్వాత అనేకులు వారిని మఱచినారు. ఎందఱో జ్ఞానులు తమ ప్రాశస్త్యము వెల్లడించినారు. అది వారి మరణానంతరము మఱుగుపడినది. కాని వివేకానందుని దేశము మఱవలేదు, మఱవదు. అందుకు కారణ మాయనశుష్క-వేదాంతి కాకపోవుటయే. ఆనాటి భారతదేశదుఃస్థితికి ఆయన చలించిపోయినాడు. "పొడిపొడిగా రాలుచున్నట్టి మట్టిగోడలతో, వెదురుబొంగుల అస్థిపంజరముతో శిథిలమైన పైకప్పులతో గుడిసెల గుంపులు కనపడుచున్నవి. కృశించిన పడుచువారు ముసలివారు చిరుగుబొంతలు ధరించిన దేహములతో ఇక్కడ అక్కడ తిరుగుచున్నారు. వారిముఖములలో శతాబ్దముల నాటి దారిద్ర్యము, గాఢనిరాశారేఖలు తాండవించుచున్నవి. ఆవులు, ఎద్దులు, దున్నపోతులు అన్నిచోట్ల ఉన్నవి. అయ్యో వాని కండ్లలో అదే దీనదృష్టి; అదే బలహీనదేహములు. దారిప్రక్కన మురుగుడు, పెంటపోగులు. ఇది ఈనాటి మన భారతదేశం!" అని వాపోయినాడు. దేశ సముద్ధరణమే తన ప్రథమకర్తవ్య మని తీర్మానించుకొనినాడు.

ఆయన సర్వసంగపరిత్యాగియైన పరివ్రాజకుడైనను దైనందినావసరములుకూడ తీరక అల్లాడుచున్న ప్రజలకు మతమునుగూర్చి భక్తినిగూర్చి బోధించుట వృథాప్రయాస యని గుర్తించినాడు. వారందఱు గాఢతమస్సులో తలమునకలైయున్నారు. ఆతమస్సునుండి వారిని వెలికి తెచ్చుట తేలిక కాదు. వారిని సాత్త్వికులను చేయుట దుస్సాధ్యము. మొదట వారిని సామాన్యమానవులను చేయవలెను. తర్వాతనే వారు ఔన్నత్యము పొందగలరు. అందుకు మార్గము వారి దుఃస్థితిని తొలగించి, నిరాశను నిస్పృహను పరిహరించి, ఆహారవస్త్రములను కల్పించి, విద్యాబుద్ధులుగఱపి స్వయంశక్తిని పెంపొందించుటయే. కాబట్టి వివేకానందుడు నవభారతనిర్మాణమునకు పునాది వేసినాడు.

పాశ్చాత్యదేశములనుండి తిరిగి వచ్చిన తర్వాత స్వామి బేలూరులో రామకృష్ణమఠమును, రామకృష్ణమిషనును స్థాపించెను. వాని ద్వారా సవ్యసాచివలె ఒకవైపు ఆధ్యాత్మికాభివృద్ధికి, మఱొకవైపు భౌతికాభివృద్ధికి కృషి చేయసాగెను. ఆసంస్థలు త్వరితగతితో దేశమునం దంతట విస్తరించినవి. ఖండాంతరములలోకూడ వ్యాపించినవి. అవి ఆధ్యాత్మిక కేంద్రములను నిర్వహించుట; బాలబాలికలకు యువతీయువకులకు విద్యాలయములు స్థాపించుట, నిర్భాగ్యజనులకు వైద్యసదుపాయములు చేయుట; కఱవుకాటకములు అగ్నిప్రమాదములు, వఱదలు మొదలగు ఈతిబాధలు సంభవించినప్పుడు ముందంజ వేసి బాధానివారణచేయుట — ఈవిధముగా మైన ప్రజాసేవ చేయుచున్నవి. ఈసంస్థల స్థాపించుటయే స్వామి దేశము; కొనర్చిన మహోన్నతసేవ.

కాని ఆయన అంతటితో విశ్రమించ లేదు. దేశపునర్నిర్మాణమునకు ముఖ్యావరోధము సాంఘికదురాచారము లని గ్రహించి వాటిని రూపుమాపుటకు కంకణము కట్టుకొనెను.

ప్రప్రథమముగా ఆయనదృష్టి అస్పృశ్యతవైపు మరలినది. హిందువులలో కొందఱు క్షీణించి, క్షీణించి, క్షీణించి మానవుడు చేరగల చివరిదశవఱకు రాగా, ఉన్నతవర్గీయులు కేవలము వారిని స్పృశించుటగాని, వారితో కూర్చుండుట కాని అశౌచమని భావించి ఆ

యభాగ్యులను "దూర మపసర రే చండాల" అని తిరస్కరించుచుండిరి. ఇది స్వామికి హృదయశల్యమైనది. మహోన్నతమైన మన హిందూమతమును మఱచి, సంస్కృతిని విస్మరించి కేవలము "తాకవద్దు" మతస్థులుగా మారిపోయినా మని, వంటయిల్లే దేవళముగా, వంటపాత్రలే దేవతలుగా "తాకవద్దు"అన్న దే మతముగా హిందువులు దిగజాఱిపోయి రని ఆయన అంగలార్చెను. అస్పృశ్యత సిగ్గుచేటని, తరతరములుగా మనసోదరులైనవారిని దూరముగా నుంచుట తగ దని, సాటిహిందువులను దూరముగా నుంచి సాంఘికహక్కులకై వారు అన్యమతములు స్వీకరించునట్లు చేయుట పరమ మూర్ఖత్వ మని, అస్పృశ్యతను పాటించుట పిచ్చితన మని, అటువంటివా రున్న ప్రదేశములు పిచ్చాసుపత్రు లని స్వామి సవర్ణులకు నయమున భయమున ఆదురాచారము మాను డని బోధించెను. మనము మనచుట్టును ఉన్న వాటిని పూజింపవలెను; విరాట్పూజయే తొలి నోము అని హితబోధ చేసెను. ఇంకను స్వామి యిట్లు ఘోషించెను :

* పరమదయాంతరాత్మకుని
బాహిరరూపము లిట్లు కన్పడెన్
బెరతలయందు రోయుదువె
విశ్వమయాత్మ? నభేదబుద్ధి నే
నరుఁడు సమస్తమున్ ప్రదికర
ణంబులఁ బ్రేమకుఁ దావు చేయు. నా
నరుడె మహేశ్వరున్ ప్రదికర
ణంబులఁ గొల్చినవాఁడు చూడఁగన్.

* పద్యానువాదము విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, ఎమ్.ఏ. గారిది.

కేవలము పురుషులే కాక స్త్రీలుకూడ ఉన్నతిపొందవలె నని స్వామి వక్కాణించినాడు. అనాదినుండి భారతనారీమణులు పురుషులకు దీటుగా విద్యావతులై యుండినారు. వేదకాలమునుండి గౌరవింపబడుచుండినారు. కాని ప్రస్తుతము వారు గౌరవహీనలైయుండుట ఆయనకు వ్యాకులత కల్గించినది. స్త్రీలను "తుచ్ఛమైనపురుగులని", "నరకద్వారము" లని దూషించుట దోష మని పురుషులను హెచ్చరించినాడు. స్త్రీలు అభివృద్ధిపొందనిదే గృహము కాని, గ్రామము కాని, సంఘము కాని, దేశము కాని పురోభివృద్ధి చెందజాలదని వాదించుచు మన మూలపురుషుడైన మనువు ప్రజలకు

యత్ర నార్యస్తు పూజ్యన్తే
రమన్తే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యన్తే
సర్వాస్తత్రాఫలాః క్రియాః.

అని హితబోధ యొనర్చినట్లు జ్ఞప్తికి తెచ్చెను.

దురాచారనిర్మూలనతోపాటు సాంఘిక సమన్వయముకూడ దేశాభివృద్ధికి అవసరము. అందువలన స్వామి ప్రజలలో ఐకమత్యము కలిగించుటకై కృషి చేసెను. అనేకులు హిందువులైనను వర్గదృక్పథముతో, ప్రాంతీయ మూఢవిశ్వాసములలో మునిగియుండిరి. దురహంకారముతో తమతమవర్గములుమాత్రమే శ్రేష్ఠమైన వనియు, తమతమమూఢవిశ్వాసములు ప్రామాణికము లనియు వారిలో వారు పోరాడుకొనుచుండిరి. స్వకలహములు మనసును కలుషితము చేసి, ఆలోచనను పాడుపఱచి, దేహదార్ఢ్యమును తగ్గించి సంఘమును చేటు తెచ్చు నని గ్రహించిన స్వామి

మనపూర్వీకులు, మనస్మృతులు గర్హించిన కలహములను మాని, విరోధమును విసర్జించి పరస్పర సాహాయ్యముచేసికొను విశాలదృక్పథ మవలంబింపుడని హిందువులనుహెచ్చరించెను. "మనమందఱము—ద్వైతులు, అద్వైతులు, విశిష్టాద్వైతులు, పాశుపతులు. మొట్టమొదట హిందువులము. ఏవర్గమునకు చెందినప్పటికి కొన్ని సామాన్యలక్షణములు ఏకైకలక్ష్యముగా అనుభవసిద్ధిని కలవారము. భగవంతుని వివిధ నామములు ఒకేసర్వోత్కృష్టజీవిని తెలుపుచున్నవి. ఏకం సత్ విప్రా బహుధా వదన్తి-ఒకేవస్తువును ఋషులు వివిధనామధేయములతో పేర్కొనుచున్నారు. ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అను మూడుమార్గములు విభిన్నమైనవి కావు. అవి ఆధ్యాత్మికాభివృద్ధిలో వివిధదశలు......కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము అన్నియు దాని (హిందూమత) ఆధ్యాత్మిక జీవితపథకములో సముచిత స్థానము కల్గియున్నవి. దానికర్మయోగము, భక్తియోగము, రాజయోగము, జ్ఞానయోగము ఆధ్యాత్మికజీవితపు సంపూర్ణచిత్రము" అని ఉపన్యసించుచు ఆయన హిందువులలో ఐకమత్యము కల్గించెను.

అంతేకాక వివేకానందుడు దక్షిణభారత దేశీయులు ద్రావిడజాతీయు లని, వారు ఆర్యులైన ఉత్తరభారతీయులకు సంపూర్ణముగా విభిన్ను లని, దక్షిణభారతదేశములోని బ్రాహ్మణులు మాత్రమే ఉత్తరమునుండి వచ్చిన ఆర్యు లని కొందఱు ప్రచారము చేయు వాదమును ఖండించెను. "ఇదిపూర్తిగా నిరాధారము....భేద మెక్కడఉన్నది? కొంచెము భాషాభేదముమాత్రమే. సంస్కృతము మాట్లాడు బ్రాహ్మణులు దక్షిణభారతదేశమునకు వచ్చి ద్రావిడభాషను స్వీకరించిన ట్లయిన ఇతరకులములుకూడ ఉత్తరభారతదేశమునుండి వచ్చి ద్రావిడభాషలను స్వీకరించియుండవచ్చును. కాని వీ రందఱు ఉత్తరమునుండి వచ్చిన ఆర్యులే. భారతదేశము సంపూర్ణముగా ఆర్యదేశమే. ఇం కేదియు కాదు" అని స్వామి విభేదములను ఖండించి ఏకీకరణను ప్రోత్సహించెను.

ఐక్యమునకు ముఖ్యసాధనముభాష. యావద్భారతదేశమును రాజకీయముగా, సాంస్కృతికముగా, సాంఘికముగా ఐక్యపఱచుటకు ఒక సామాన్యభాష అవసరము. వివేకానందుడు సంస్కృతము ఈపాత్రను నిర్వహించ గల దని గుర్తించెను. తరతరములనుండి వేదములు, పురాణములు, ఇతిహాసములు, శాస్త్రములు సంస్కృతభాషలో రచింపబడిన గ్రంథముల ద్వారా వ్యాప్తి నొందినవి. అంతప్రాచీనము, అంతవిస్తృతము, అంతభాగ్యవంతము అయిన భాష వేఱొకటి లేదు. సంస్కృతపదముల శబ్దము మాత్రమే జాతికి గౌరవము, శక్తి, బలము ఇచ్చును. అది భారతీయసంస్కృతికి చిహ్నము. ఇందువలన విషయములు ప్రాంతీయభాషద్వారా తెలిసికొన్నప్పటికి, అదే సమయములో సంస్కృతభాషాపఠనము అవసరము. ముఖ్యముగా నిమ్నవర్గములవారిని ఉద్దేశించి "మీపరిస్థితిని మెఱుగుపఱచుకొనుటకు ఒకేమార్గము సంస్కృతభాషాపఠనము" అని వక్కాణించెను.

వివేకానందుడు తనఆశయసాధనకై విద్యావంతులలో మార్పు తేవలెనని గ్రహించినాడు. పాశ్చాత్య విద్యావిధానమువలన విద్యావంతులలో పాశ్చాత్యవ్యామోహము ప్రబ

లమై పోయి స్వదేశ మున్నను, స్వమత మున్నను, స్వసంప్రదాయమున్నను వెగటుపుట్టినది. అగ్నికి ఆజ్యము తోడయినట్లు విదేశీయ మతప్రచారకులప్రభావమువలన వారిలో అనేకులకు మనయందఱము మూఢాచారపరాయణుల మన్న నమ్మకము కల్గినది. అది పోగొట్ట దలచి ఆయన మనమతము అశాస్త్రీయమైనది కా దనియు, శాస్త్రసమ్మతమైన దనియు, దాని కర్మశాసనము, దానిపరిత్యాగసిద్ధాంతము, దానివిశ్వపరిణామభావన, దానిమానవమన స్తత్వప్రావీణ్యము, దానిజ్ఞానసిద్ధాంతము, శుద్ధమునుగూర్చి దాని భావము, దానిమోక్షపథకము మొదలైనవన్నియు హిందూమతశాస్త్రీయతను తెలుపుచున్న వని ఉద్ఘాటించి విద్యావంతుల అపోహాలు తొలగించెను.

స్వామివిద్యావిధానములోకూడ మార్పు రావలెనని సూచించెను. "విద్య మీ మెదడులో ఉంచబడి జీవితమంతయు జీర్ణము కాక కుళ్లిపోవు సమాచారము కాదు. జీవితనిర్మాణాత్మకమైన, మానవతాకరమైన, శీలకారకమైన భావములను మనము జీర్ణముచేసికొనవలెను". అందుచే కేవలము పాశ్చాత్యవిద్య పనికి రాదు. ఆయన ఉద్దేశ్యములో ఆదర్శవిద్య ఆధ్యాత్మికఐహికవిషయముల సమన్వయమై దేశీయులచేతులలో జాతీయమార్గములో జాతీయపద్ధతులద్వారా బోధింపబడవలెను. శ్రీరామకృష్ణమిషను యాజమాన్యమున నున్న అనేకవిద్యాలయములలో లక్షలాది బాలబాలికలు, యువతీయువకులు ఇట్టి ఆదర్శవిద్యను పొందుట ముదావహము. దేశీయపురోభివృద్ధికారకము.

దేశపునర్నిర్మాణములో యువకులే ముఖ్యపాత్రను నిర్వహించవలెను కనుక స్వామి దృష్టి ఎల్లప్పుడు వారిపై నిమగ్నమై యుండెడిది. అవకాశ మున్నప్పు డెల్ల ఆయన వారిలో దేశప్రేమ, దైవభక్తి, ప్రజాసేవ పెంపొందించుటకై ఉత్సాహమూరించు ఉపన్యాసము లిచ్చెను. "మనకు కావలసినది రక్తములో చేవ, నరములలో శక్తి, ఇనుపకండరములు, ఉక్కునరములు. మెత్తగా బుడబుడనుండు ఆలోచనలు కాదు. యువకులకు మన స్మృతులసత్యమును స్వదేశములోను పరదేశములలోను బోధించుటకై తగిన శిక్షణ ఇచ్చు సంస్థలను భారతదేశములో స్థాపించుట నా ప్రణాళిక. మనుష్యులు, మనుష్యులు, మనుష్యులు, వీరే కావలెను. మిగిలినవన్నియు సిద్ధమగును. కాని శక్తివంతమైన, బార్ధ్యవంతులైన విశ్వాసపూరితులైన మనుష్యులు - నరనరములలో నమ్మకమునిండినవారు కావలెను. అటువంటివారు నూఱుమం దున్న చాలును, ప్రపంచము తలక్రిందు లగును... ......బానిసగా నుండుట విడిచిపెట్టుము, రాబోవు ఏబదిసంవత్సరములవఱకు- ఈమహనీయభారతమాత, ఇదే మనశ్రుతిగా ఉండవలెను. అంతవఱకు మనమనస్సులనుండి తదితరవ్యర్థదేవతలు మాయమై పోనిమ్ము" అని యువకుల నాయన ఉత్తేజితులను చేసెను. మద్రాసువిద్యార్థులు గుఱ్ఱములను విప్పి వేసి స్వామిరథమును స్వయముగా లాగి రన్న వారిపై ఆయనప్రభావ మెంతటి గురుతరమైనదో తేటతెల్ల మగుచున్నది.

ఇటువంటి మహనీయుడు పిన్నవయసులో మరణించుట భారతమాతకు తీరనిగర్భశోకము, కాని ఏడుసంవత్సరములలో ఆయన అసమాన కౌశల్యముతో భారతపునర్నిర్మాణమునకు పునాది వేసి భారతాంబ కెనలేని సంతోషము

కల్గించెను. ప్రతిరంగములోను పురోభివృద్ధి సాధించుటకు ప్రణాళికలు వేసెను. ఇంతటి దేశభక్తుడు స్వాతంత్ర్యసమరమునే ఎందుకు ప్రారంభింపలే దన్న సందేహము కొందఱికి కల్గవచ్చును. కాని స్వాతంత్ర్యము సాధించుటకు ముందు కొంతప్రారంభ కార్యక్రమము నిర్వహించవలెను. నిద్రాణమైయున్న దేశమును చైతన్యవంతము చేయవలెను. ప్రజలను కార్యోన్ముఖుల గావింపవలెను. అప్పటికి గాని వారు స్వరాజ్యోద్యమములో పాల్గొనుటకు సిద్ధము కారు. అందుచేత స్వామి ప్రారంభ ప్రయత్నములలో నిమగ్నుడై యుండెను. పైగా తాను నలువదియేళ్లవఱకు జీవింప నని తెలిసికొన్న ఆమహాశయుడు తనజీవితకాలమున సాధింపగలకార్యములనే ప్రారంభించుట సముచిత మని తలపోసి దురాచారనిర్మూలన, విద్యాసంస్కరణ, దేశైకమత్యము మొదలైనవాటి కొరకు ప్రయత్నించి కృతకృత్యు డయ్యెను. ఆవిధముగ సకలరంగములలో కృషిసల్పిన వారు సమకాలీనభారతీయులలో మృగ్యులు. అందువల్లనే వివేకానందస్వామి నవభారత మార్గదర్శకుడు. నవభారతనిర్మాతలలో ప్రప్రథముడు.

ఈనాడు పవిత్రభారతదేశమును వినీల యుద్ధమేఘములు ఆవరించుచున్నవి ప్రజలు భయభ్రాంతు లగుచున్నారు. నాయకులలో కొందఱు "మనము ఆదేశముతో చేరిపోవలెను. ఈదేశముస్నేహము ఎట్లైన సంపాదింపవలెను" అని వాదించుచున్నారు. కాని స్వయంశక్తితో విజయము సాధింపగల మను ఆత్మవిశ్వాసము మన కుండవలెను. భారతమాతయన్న భక్తి, సోదరభారతీయు లన్న ప్రేమ, స్వాభిమానము, క్రమశిక్షణ ఇట్టి విపత్కరపరిస్థితిలో అత్యావసరము. అవన్నియు వివేకానందశంఖారావశ్రవణ మాత్రముననే కల్గును—

"ఓధీరుడా, ధైర్యము తెచ్చుకొనుము. నీవు భారతీయుడై నందుకు గర్వించి, సగర్వముగా 'నేను భారతీయుడను, ప్రతిభారతీయుడు నాసోదరుడు. భారతీయుడే నాజీవితము. భారతీయ దేవీదేవతలే నాదేవుడు. భారతీయ సంఘము నాపసితనపు ఊయల, యౌవనపు ఆనందవనము, వృద్ధాప్యపుపవిత్రస్వర్గము, వారణాసి' అని ఉద్ఘాటింపుము. సోదరా ప్రకటింపుము: 'భారతభూమి నా ఉత్తమోత్తమ స్వర్గము. భారతదేశక్షేమమే నాక్షేమము".

---

రా జ హం స ని పు ణ రా మ కృ ష్ణ !

ఏకశయ్యనుండు నిల్లాలి నేమరి యిహపరసుఖభేద మెంచుకొంచు
యోగనిద్ర గన్న యోగీంద్ర, ప్రణతులు రాజహంస నిపుణ రామకృష్ణ ॥
ఎవనియందు డిందు నీహాప్రపంచంబు శవమునందుఁబోలె శాశ్వతముగ
నతఁడు మానవోత్తమాధికారము నొందు రాజహంస నిపుణ రామకృష్ణ ॥
విరులచుట్టుఁ దిరుగు భృంగంబు రొదసేయు పువ్వుఁదేనె గ్రోలు పూరి మాను
దత్త్వవేత్తయైనఁ దర్కంబు లుండవు రాజహంస నిపుణ రామకృష్ణ

—శ్రీ దెందులూరి గోపాలకృష్ణగారు

# శ్రీరామకృష్ణానందస్వామి - దక్షిణభారతమున రామకృష్ణ వేదాంతోద్యమము

మాధవ బ్రహ్మచారి

మదరాసు రామకృష్ణమఠమిషనుల ప్రథమా ధ్యక్షుడైన రామకృష్ణానందస్వామి ఈసంప్ర దాయమువారికెల్ల అవిస్మరణీయశక్తిరూపుడు. శ్రీ రామకృష్ణదేవుని ప్రత్యక్షశిష్యులలో నొకడు, ఈ ఉద్యమమునకు మూలస్తంభము లలోనొకడు. శ్రీవివేకానందస్వామి జన్మించిన 1863-వ సంవత్సరమందే ఈయనయు జన్మించి నాడు కాబట్టి ఈయన శతతమజయంతి జూలై నెల 19-వ తేదీనాడు వచ్చును.

ప్రగతిశీలమైన ఆధ్యాత్మికశక్తి శ్రీరామ కృష్ణునిలో రూపుదాల్చినది. ఫ్రెంచి సహృద యుడు రోమైరోలాం చెప్పినట్లు "ముప్పదికోట్ల ప్రజల రెండువేలేండ్ల ఆధ్యాత్మికజీవితము శ్రీ రామకృష్ణునిలో పరిపూర్తి నొందినది. శ్రీ రామకృష్ణుని సాక్షాత్కారముల అనుభవా మృతమును ఈయిరువదవ శతాబ్దప్రపంచమున కందజేసి వారి ఆధ్యాత్మికక్షుత్తును తీర్చినవారు ఆయనశిష్యులు. ఆసందేశామృతమును దక్షిణ భారతమున కందజేసినవాడు శ్రీరామకృష్ణా నందస్వామి.

హుగ్లీజిల్లాలో మాయాల్ ఇచ్ఛాపూర్ అను గ్రామమున ఈశ్వరచంద్రచక్రవర్తి అనెడి తాంత్రికసాధకునకు జ్యేష్ఠకుమారుడు రామ కృష్ణానందుడు. ఇతని పూర్వాశ్రమనామ ధేయము శశిభూషణుడు. సనాతనాచారనిష్ఠ గల ఆవరణములో ఎదిగినవా డితడు. జన్మ చేత ఇతడు శాక్తుడే అయినను చిత్తవృత్తిచేత వైష్ణవుడు. శ్రీగౌరాంగుని జీవితోపదేశ ప్రభావములకు లోనై ఇతడు సదా శాకాహారి గనే యుండెను. ఇతని ఆధ్యాత్మికజీవితములోని ముఖ్యాంశములు - గురుప్రపత్తి, గురుసేవ— "మానవునిలోని మానవుడు తన్ను చూపు కొన్నప్పుడు అత డన్ని విధములైన ఘోర కార్యములను జేయును. మానవునిలో దేవుడు తన్ను చూపుకొన్నప్పుడు అతడు మంచివా డగును, పవిత్రు డగును, ధార్మికుడగును—" అనెడి ఈ మొదలైన ఆయన బోధనలు అతని ధార్మికవైఖరిని వ్యక్తపఱచును. తానుభక్తుడే ఐనను జ్ఞానకర్మయోగమార్గములందు ఆదరము కలిగియే యుండెను. అంతేకాదు, జ్ఞానకర్మ యోగసూత్రములకు లక్ష్యపరిపూర్తి అతని యందే కలిగెను. ఆయన చెప్పినాడు: "మోక్ష మనగా స్వర్గమునకు పోవుటకాదు. నీవు విశిష్టా ద్వైతివేని భగవంతుని పుత్రుడ వనియు అద్వైతివేని భగవంతునితో అభిన్నుడవనియు సాక్షాత్కరించుకొనుటే మోక్షము. ఈ రెం డనుభవములును ఒక్కటే, అభిన్నములే.

రుచి గల అతని ఆత్మ శైశవమునుండియు దేవునకై తహతహలాడినది. 1883 లో శ్రీరామకృష్ణునితో సమాగమము కలిగినప్పుడే అతని ఈ ఆకలి తీరినది. ప్రథమదర్శనమప్పుడే గురుశిష్యు లొకరొకరిని అర్థము చేసికొనిరి. సుదృఢప్రేమపాశబద్ధులైరి. శశి తన్ను గురుచరణములకు పూర్తిగా అర్పించుకొనెను. ఇందుంగూర్చి చెప్పుచు గురుదేవుని గృహస్థశిష్యులలో నొకడైన శ్రీ రామచంద్రదత్త ఇట్లనెను: ''శ్రీరామకృష్ణదేవుని ఆశ్రయించిన వారందఱును ఏదో ఒక ప్రయోజనమును కోరియే ఆశ్రయించిరి. 'నేనెట్లు రక్షింపబడుదును' 'ఆధ్యాత్మికజీవితమున నేనెట్లు పురోగమింతును' అని ఈరీతి వారడుగుచుండురు—అట్టి ప్రయోజనాపేక్ష శశికి లేదు. తన ఆత్మను పరిపూర్ణముగ గురుదేవునకు అర్పించుకుని నిస్వార్థసేవాధర్మమును ఆయనయొద్దనుండి నేర్చుకొనెను. ఆధర్మానుష్ఠానముచేతనే ఆయనకు నిరుపమానధన్యత సిద్ధించినది పరమానందకర గురుదేవుని సన్నిధానములో సంవత్సరములు గడిచిపోయినవి.

గురుదేవుడు వ్యాధిగ్రస్తుడైనప్పుడు శశి చదువుకు స్వస్తిచెప్పి గురుదేవునికి పరిచర్య చేయుటకు పరుగున వచ్చెను. అతని గురుభక్తియు గురుసేవయు మిక్కిలి అపూర్వములైనందుచేతనే శ్రీరామకృష్ణుని మహాసమాధికనంతరము యువశిష్యులు సన్న్యాసదీక్షను స్వీకరించినప్పుడు శ్రీవివేకానందస్వామి శశిమహారాజుకు రామకృష్ణానందుడను పేరు పెట్టెను.

బరానగరమున నొక బాడుగింట శ్రీరామకృష్ణుని శిష్యులు కూడిరి. అప్పుడు శ్రీరామకృష్ణానందస్వామి గురుదేవుని అస్థికల పరిరక్షణమునకును సోదరశిష్యులపరిచర్యకును సర్వాత్మగా తన్నర్పించుకొనెను. మఠమునకు దినములు గడవని ఆకష్టకాలములో దాని పోషణకై అతడు కొన్నినెలలు ఒక హైస్కూలులో ఉపాధ్యాయుడుగ కూడ పనిచేసెను. దానినిగూర్చి శ్రీవివేకానందస్వామి ఇట్లనెను: ''అహో, శశియందు లక్ష్యాభినివేశము ఎంతగా కనిపించెడిది! మాకు అతడే తల్లి. మేము వేకువను మూడుగంటలకు నిద్రలేచెడివారము, పూజామందిరమున జపధ్యానములకై కూర్చుండెడివారము. సాయంకాలము నాలుగైదుగంటలవఱకు ధ్యానము సాగిన దినములు కూడ కలవు. మాకు భోజనముపెట్టుటకై శశి వేచియుండెడివాడు. ఆవశ్యకమగుచో ధ్యానమునుండి మమ్ము బలాత్కారముగ లాగివేసెడివాడు. అప్పుడు ఈలోకము ఉన్నదో లేదో, ఎవడు లక్ష్యపెట్టినాడు''.

తర్వాత యువసన్న్యాసుల కందఱికిని పర్యటనతృష్ణ కలిగినప్పుడు గురుదేవుని అస్థికలపూజనుండి కదలకుండు నిశ్చయము రామకృష్ణానందస్వామికి మాత్రమే యుండెను. ఆయనకు అన్నియాత్రలకంటెను గురుపాదసేవయే అధికోదాత్తతావహము. ఉన్నతికరము. సోదరశిష్యులు ఎక్కడెక్కడ అల్లాడుచుండినను మఠములోని రామకృష్ణానందుని సన్నిధానము వారి నట కాకర్షించెడిది. ''శశియే లేకుండిన మఠములో మా జీవితమే అసాధ్యముగ నుండెడిది—'' అని శ్రీవివేకానందస్వామి ఒకప్పుడు చెప్పెను.

పాశ్చాత్యదేశములనుండి మరలివచ్చిన వివేకానందస్వామిని మద్రాసుభక్తులు ''ఇచట

నొక ఆధ్యాత్మిక కేంద్రమును ప్రారంభింపు'' మని ప్రార్థింపగా ఆయన మనసునకు తటాలున స్ఫురించిన వ్యక్తి రామకృష్ణానందస్వామి. ఏలయన సనాతాచారనిష్ఠ దక్షిణభారతదేశమున కలంకార మగునేని శ్రీరామకృష్ణానంద స్వామి సనాతనాచారనిష్ఠకే అలంకారమైన వాడని ఆయన యెఱుగును. కావున "దక్షిణ భారతమున అత్యంతాచారనిష్ఠులను మించిన నిష్ఠగలవాడును భగవద్ధ్యానపూజలలో అద్వితీయుడును అనతిక్రాంతుడు నగు నొకనిని మీ యొద్దకు పంపెదను'' అనెను. గురుదేవుని అస్థికలపర్యవేక్షణను మాని కల్కత్తాకైనను పోని రామకృష్ణానందుడు మదరాసుకు పొమ్మనెడి వివేకానందునాజ్ఞను శిరసా వహించి శ్రీరామకృష్ణుని చిత్రపటమొక్కటే తన ధనముగ 1897 మార్చినెలలో మదరాసుకు వచ్చి చేరెను.

మదరాసులో స్వామి మొదట 'ఫ్లోరా కాటేజి'లో నుండెను, తర్వాత శ్రీవివేకానందస్వామివాసముచే పవి 'ఐస్హౌసు'కు మాఱెను. గురుదేవుని గుడియే కేంద్రస్థానముగా, స్వామి కార్యక్రమములు సాగెడివి. ఆయన ఆరాధించుచున్నప్పుడు ఆ ఆరాధనము వేల్పులకు సైతము దర్శనీయము చూచుచుండుభక్తులు తద్భక్తిచే అత్యంతము ముగ్ధులై తామును భక్తివేగితు లయ్యెడివారు.

ఐస్హౌసు శ్రీ బిలిగిరి అయ్యంగారిది. ఆయన మరణించినపిమ్మట అది వేలమువేయబడెను. స్వామి కొంతపైకము పోగుచేసి 1907 లో మైలాపూరు బ్రాడీసురోడ్డులో నొకయిల్లు కట్టుకొని అచ్చటికి చేరెను. కాని అది పగులు వాఱినది, అందుండుట అపాయకర మయ్యెను. రామకృష్ణానందస్వామి ఎన్నో కష్టములకు పాలయ్యెను. ఆనాటి ఆయన తపఃఫలముగనే ఇప్పటి మఠభవననిర్మాణము 1917 లో పూర్తి అయ్యెను.

ప్రారంభదినములలో స్వామి చాలకష్టములు పడెను. తనకు తానే వంటవాడుగా సేవకుడుగా ఉండుచు, ఉపన్యాసములు పాఠబోధనములు మున్నగువాని ద్వారా నగర వివిధభాగములలో వేదాంతకార్యక్రమమును సాగించుచుండెను. ఎంతో దూరము నడచి పోవలసియు వచ్చెడిది. కాని తనకే శక్యమగు ధైర్యశాంతములతో ఆకష్టముల నాయన ఓర్చుకొనెను. తనఆత్మను భగవంతునిలో లీనమొనర్చుకొని అత డాచిక్కుల నెదుర్కొనెను. "హృదయమున పరిపూర్ణవైరాగ్యముతో మీరు పనిసాగింతురేని, మీకు దుఃఖము గల్గదు. లోకములో మీరు పనిచేయ గోరుదురేని, ఈమార్గము ననుసరించిననే కర్మశృంఖలల త్రెంచుకొనగలరు'' అనుట ఆయన ఉపదేశము. పాఠమును వినుట కెవ్వరును రాకున్నను, అంతసేపును దానిని మననము చేయుచు ఆయన అచ్చటనే ఉండెడువాడు. "నేను వచ్చినది విద్యను నాకు బోధపడజేసికొనుటకే'' అనెడివాడు. అచిర కాలములో ఆయన పాఠములును ఉపన్యాసములును జనప్రీతిని చూరగొన్నవి. మహాదరముతో ఆ సమాగమములను స్మరించుచుండు వా రిప్పుడును కలరు. సోదరి దేవమాత తన గ్రంథములో ఇట్లు వ్రాసియున్నది. "శ్రీరామకృష్ణానందస్వామి మఠపవిత్రత నెవరిని మఱువనీయడు. అవిచారితముగ ఎవడేని మఠములో వార్తాపత్రికను చదువబూనిన 'దాని నావల

పెట్టవోయి, వేఱెచ్చటనైన చదువుకో దగిన దది, ఇది భగవద్ధ్యానముచేయవలసినచోటు' అని మందలింపగా నేను కొన్నితూర్లు విని యున్నాను''.

వేదాంతప్రచారాభినివేశము చాల గల వాడు స్వామి. మద్రాసులో మైలాపూరు తిరువల్లిక్కేణి చింతాద్రిపేట టంకసాల మున్నగు ప్రాంతాలకును, వెలుపల వానియంబాడి అరకోంపట్టి కృష్ణగిరి బరూరు తిరునల్వేలి ధర్మపురి మచిలీపట్టణము మున్నగుచోట్లకును ఆయన ఉపన్యాసాదికములు వ్యాపించినవి. వేదాంతకార్యక్రమమును శాశ్వతముగ సాగించుచుండుటకై ఆయన కొన్నిచోట్ల వివేకానందసంఘములు నేర్పఱచినాడు.

1905 ఫిబ్రవరినెలలో రామకృష్ణానంద స్వామి ప్రారంభించిన విద్యార్థులవిడిది (స్టూడెంట్సుహోము) దీనమానవులపట్ల స్వామి కుండిన కృపను ఇప్పటికిని స్మరింపజేయునదై యున్నది.

మదరాసుననే కాక దక్షిణభారతమున పెక్కుచోట్లలోను, సింహళమందును రంగూను నందును, మలయాయందును, కేంద్రముల నాయన ప్రారంభించినాడు.

ఆంగ్లములోను వంగభాషలోను ఆయన పెక్కు గ్రంథములు రచించినాడు. ఆయన బెంగాలీలో వ్రాసిన ''శ్రీరామానుజుని జీవిత చరిత్రము'' ఉత్తరభారతమున ఆ ఆచార్యుని జీవితచరిత్రమును జనప్రీతికరముగ చేసినది.

మాతృశ్రీయు శ్రీబ్రహ్మానందస్వామియు వచ్చి దక్షిణభారతదేశమునకు ధన్యత గల్గింప వలె ననెడి శ్రీరామకృష్ణానందుని కోర్కె 1911 లో నెఱవేఱినది.

నిర్విరామ దుర్వహకార్యనిర్వహణముచే ఆయన ఆరోగ్యము చెడి, క్షయవ్యాధి పైకొని, 1911 ఆగస్టులో మహాసమాధి నొందించినది.

గురుభక్తికిని ప్రజాసేవకును 'ఆత్మనో మోక్షార్థమ్ జగద్ధితాయ చ' అను ఆదర్శమునకును మహోజ్జ్వల లక్ష్యము శ్రీరామకృష్ణానందస్వామి జీవితచరిత్రము.



సీ॥ అఖిలదేశమ్ముల కార్షేయపదతుల్ బలికినా వమృతమ్ము చిలికినావు
వేదమతమ్మెయుర్విక్ ధ్యేయమౌనని చాటినా విచ్ఛను దాటినావు
రామకృష్ణ పదాబ్జ రజము భక్తిమతాన ముట్టినావు జగమ్ము మెట్టినావు
గురుదేవు వాక్యముల్ కోకొల్లలుఁగ వినఁజాలినా వానంద మేలినావు.

గీ॥ సర్వమతపరిషత్ప్రవేశమ్మునంది మించినావు, జగమ్ము లూరించినావు
దైవదత్త మహావక్తృతాపటిష్ఠ, శ్రీవివేకయతీంద్ర, నిర్జితమహేంద్ర.

సీ॥ వేదాంతవీథిలో విరివిగా దిరుగాడి 'పంజాబు మెయి'లట్లు బర్వినావు
నిజగురునాజ్ఞలన్నియు దెల్ప భక్తుల మంచి 'హైరోడ్డు' ద్రొక్కించినావు
సలలితోపన్యాసములనిచ్చి 'వాటరు ఫాల్సు' ధాటిని క్రిందుపఱచినావు
ఉన్నతాదర్శమ్ము లన్నిరూపించి 'హిందూయిజమ్ము'ను దులఁదూఁచినావు.

గీ॥ సునిశితాజేయ భవదీయజనవిధేయభాగధేయ మహీయసంపత్ప్రశాంత
'లైటుహౌసు' ను కొనగోట మీటినావు శ్రీవివేకమునీంద్ర, నిర్జితఫణీంద్ర.

శ్రీనారునాగార్యజీ

# వార్తలు, విశేషాలు

## శ్రీవివేకానందస్వామి శతతమజయంతి మహోత్సవములు

### ఆసాన్సాలులో

రామకృష్ణమిషను ఆశ్రమ భవనమున ఏప్రిలు 11-వ తేదీ నుండి 30-వ తేదీ వఱకు ఇరవై దినముల కార్యక్రమము నిర్వర్తితమైనది. ముఖ్యాంశములు: (1) 12-వ తేదీ నాడు ముఖ్యవీధులలో ఊరేగింపు. (2) పెద్దస్వాములును పౌరమహాజనులును స్వామిజీ జీవితోపదేశములగూర్చి కావించిన ఉపన్యాసములు. (3) వస్తుప్రదర్శనము: మృత్ప్రతిమలద్వారా స్వామీజీ జీవితచరిత చిత్రణము. (4) సుప్రసిద్ధ ఆకాశవాణికళాకారులచేత భజన. (5) బేలీ కీర్తనసమర్పణము. (6) రామాయణ గేయములగానము. (7) దేహవ్యాయామాద్భుత ప్రదర్శనము. (8) స్వామీజీ అను నాటక ప్రదర్శనము. (9) స్వామిజీ జీవితమునుగూర్చి చర్చలు.

### షిల్లాంగులో

ఎనిమిది దినముల కార్యక్రమము నిర్వర్తితమైనది. మే 5, 1963 ప్రారంభదినము. వేదపారాయణము ఊరేగింపు పౌరసభ. అస్సాముగవర్నరుగారగు వరిష్ఠ శ్రీ విష్ణుసహాయ్ సభకు అధ్యక్షత వహించిరి. ఉపన్యసించినవారు శ్రీరంగనాథానందస్వామియు, ప్రణవాత్మానందస్వామియు. మే 6 పౌరసభ మాజిక్ లాంతరు ఉపన్యాసము. మే 7 మహిళలదినము. మే 8. 1901 లో స్వామీజీ షిల్లాంగుకు విచ్చేసి బసచేసినందుకు స్మారకముగ ఒకఫలకమును ఆవిష్కరించుట — పౌరమహాశయుల ఉపన్యాసములు, శ్రీరంగనాథానందస్వాముల ఉపన్యాసము. ప్రాంతీయ కళాకారుల గానసేవ. మే 9. శిశువులదినము. వివేకానందలీలాగీతిగానము. మే 10. భక్తిగేయావళి. మే 11. విద్యార్థులదినము. మే12. పౌరమహాసభ. ప్రముఖుల ఉపన్యాసములు.

## శ్రీవివేకానందస్వామి శతతమజయంతి మహోత్సవముల కమిటీ - బర్మా

### శతతమజయంతి మహోత్సవప్రారంభము

ఈకమిటీవారి ఆధ్వర్యమున జనవరి 17-వ తేదీ మొదలు 25 వ తేదీవఱకు శతతమ జయంతి మహోత్సవములకు ప్రారంభము కావింపబడినది. "రామకృష్ణమిషను సొసైటీ వారిగుడి, 230 బొటాటాంగ్ - పగోడారోడ్, రంగూను—"లో ప్రాతఃపూజతో కార్యక్రమమారంభమైనది. ప్రొద్దున 7-30 నుండి 9-40 వఱకు గొప్పనగరోత్సవము జరిగినది. అందు పాల్గొన్నవారు దాదాపు ఒక మైలు పొడవుగా బారులుతీరిరి. గుఱ్ఱములపై మోటారు కార్లపై ఊరేగిన ప్రజల సంఖ్య 5000 కంటె ఎక్కువే. యుద్ధానంతరము రంగూనులో ఇంత పెద్ద ఊరేగింపు లేదనుకున్నారు. రామకృష్ణమిషను సొసైటీభవనమునుండి సేవాశ్రమమువఱకు ఊరేగింపుసాగినది. గుడిలో

ప్రత్యేకపూజ వేదపారాయణము ధమ్మపద, శ్రీవివేకానందజీవితగ్రంథ పారాయణములుజరిగినవి. ఉత్సవమునకు హాజరై ప్రసాదమును స్వీకరించినప్రజలసంఖ్య దాదాపు 5 లక్షలు. సాయంకాలము 5 గంటలప్పుడు సొసైటీ హాలులో పౌరసభ సమావేశమైనది. తిరి - ప్యాంచియు - చిత్ - తౌంగ్ గారు సదస్యులకు స్వాగతము పల్కిరి. సభలో దాదాపు రెండువందలమంది బౌద్ధభిక్షువు లుండిరి. హిందువులసమావేశమునకు బౌద్ధులు ఇంతమంది వచ్చుటకు ఇదే మొద లట. సభాధ్యక్షులైన సయాదాపూజ్యశ్రీ అగ్గా మహాపండిత యు. వై. లు. వున్ గారు శతవార్షికోత్సవమునకు ప్రారంభ మంగళము కావించినారు. కార్యదర్శి ఆత్మస్థానందస్వామి శ్రీరామకృష్ణ సర్వ మతాధ్యక్షులైన శ్రీమన్మాధవానందస్వాముల సందేశమును చదివినారు. సాయంపూజానంతరము మరలకూడిన భక్తసదస్సులో శ్రీ ఆత్మస్థానందస్వామి ఇంగ్లీషులో ధాటీమండితముగ ఉపన్యసించిరి. సమావిష్టులైన 700 భక్తమహాజనులకు ప్రసాద మీయబడినది. 18 వ తేదీ నాడు తెరపై కొన్ని చలనచిత్రములు చూపబడినవి. 19 వ తేదీనాడు శ్రీస్వాహానంద స్వామి కర్మయోగమునుగూర్చి ఉపన్యసించినారు. 20-వ తేదీనాడు పగలు 11-30 నుండి 2-30 వఱకు సుమారు 4,000 మందికి సమగ్రమైన విందు చేయబడినది. 22-వ తేదీ నాడు అషిన్ ఒఖాటాగారు ఆంగ్లములోను బర్మీసుభాషలోను శ్రీవివేకానందస్వామి జీవిత సందేశములనుగూర్చి ఉపన్యసించిరి. 25-వ తేదీనాడు సాయంకాలము అన్నివర్గాలవిద్వాంసుల సంగీతసేవ జరిగినది. ఫిబ్రవరి 3-వ తేదీ నాడు ణసంకీర్తనము జరిగినది. ఇట్లు విభవోత్తరములైన కార్యక్రమములు ఈసంవత్సరముపొడుగునను జరుగుచుండును. నివేదికలు అప్పు డప్పుడు పత్రికలలో వెలువడుచుండును.

## శ్రీ రామకృష్ణమఠ ధర్మవైద్యశాల, మైలాపూరు

### 1962-63 నివేదిక

ఈధర్మవైద్యశాల ప్రజాసేవను నిర్వహిస్తూ 37 సంవత్సరాలు పూర్తిచేసింది. ఈసంవత్సరం ఇక్కడ వైద్యసాహాయ్యం పొందిన వారి సంఖ్య 1,55,037.

నేత్ర శాఖ - క్రొత్తరోగులు 2454, ప్రాత రోగులు 8,176. మొత్తము 10,630. శస్త్రచికిత్సపొందినవారు 85. కిరణవక్రీకరణ చికిత్స పొందినవారు 291.

శ్రోత్ర ఘ్రాణ కంఠ శాఖ—ప్రాతరోగులు 8115, క్రొత్తరోగులు 4,488. మొత్తం 12,603. గవదకాయచికిత్స 61.

దంతశాఖ - వివిధ చికిత్సల పొందినవారి మొత్తం 7,689.

ఎక్స్‌రేశాఖ - చిత్రములు తీయించుకున్నవారు 666. పరిశోధనశాఖలో పరీక్షింపబడిన దినుసులు మొత్తం 1,223. 1,53,953 మంది పోషణచాలని స్త్రీలకు బిడ్డలకు పాలు పంచిపెట్టబడినది. 6,356 గురు వ్యాధిగ్రస్త శిశువులకు మందుపాలు పంచిపెట్టబడినది. చేయబడిన ఇంజక్షన్లు : 22,359.

మైనరాపరేషన్లు—633. వ్రణములకు కట్టినకట్లు- .16,958.

ఈసంవత్సరంధనాదాయం రూ. 25,723.21 వ్యయం రూ. 36,800.88 కాబట్టి వచ్చుబడి కంటె ఖర్చు రూ. 11,077.67 హెచ్చు. వైద్యశాలానిర్వాహకులు తమమిత్రులకు ధన దాతలకు కృతజ్ఞతను తెలుపుకొనుచు ఉదార మహాశయులను తమ విరాళాలను సహాకార మును కొనసాగించుచుండవలసినదిగా ప్రార్థించు చున్నారు.



# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## నీరాజన

(దివ్యపరిపూర్ణతను ప్రకాశింపజేయు త్రై మాసక పత్రిక) సంవత్సర చందా రూ. 2/- ప్రాప్తిస్థానములు: నీరాజన (శాఖ) శ్రీఅరవిం దాశ్రమము, పాండిచేరి-2 అనిగాని లేక నీరా జన శ్రీ అరవిందపఠన కేంద్రము, జయపురం, (కోరాపుటి జిల్లాలు).

'నీరాజన' సంవత్సరానికి నాలుగు సంచికలు వెలువడును. అందు ప్రథమసంపుటియందునాల్గవ సంచికఇది. సంవత్సరమునకు నాల్గుసార్లు వెలువ రించుటలో— అభిప్రాయ మే మన—సంవత్స రమున నాల్గుసార్లు మాతృశ్రీ దర్శనభాగ్యం లభిస్తుంది భక్తమహాజనులకు. ఇది కేవలం ఒకపత్రిక కాదు — ఈ నాల్గుసంచికలు ఒక టిగా చేరిస్తే — సమగ్రమైన 'పూర్ణయోగ' గ్రంథం ఔతుంది.

ఆంధ్రదేశంలో వేదాంతసంచికలు వెలు వడుతూ దిన ప్రవర్థమానమవుతూన్నాయి. పరమావధి మాత్రం అన్నిటికీ ఒక్కటే. శ్రీఅరవిందులును, మాతృశ్రీయు ప్రవచిం చిన పూర్ణయోగోపన్యాసములు– అన్ని తరగ తుల ప్రజానీకానికి, సర్వకాల సర్వావస్థలకు సరిపోవువానిని అందించటమే 'నీరాజన' ధ్యేయం.

శ్రీమాతారవిందుల పూర్ణయోగ వాఙ్మ యానికి ఒకసమగ్రరూపం ఈ 'నీరాజన' సంచి కలు అంటే అతిశయోక్తేమీ లేదు. అంతే కాక — ఈ సంచికలలో—చిన్ని చిన్ని పద్యా లతో చక్కనిశైలితో వ్రాయబడిన 'సావిత్రి' కథ ప్రచురింపబడియున్నది. ఇంతవఱకు తెలు గున 'సావిత్రి' కథను ఎఱ్ఱన నుంచి నేటిదనుక తెలుగున అనేకులు సంతరించి యున్నారు. ఇది ఎంతపొంకంగా సులభంగా వ్రాయబడిందో మచ్చున కొక పద్యమును పరికింపుడు—

"..................చెంత జేరె
భాస్వంత మండలాభ్యంతరమ్ము
వెలువడ్డ భగవతీ వరప్రసాదిత
భాగధేయమటు లనంత సద్గుణ

మాన్యచరిత, సావిత్రి, సుభాషిణి,
మానితలీలా మానవరూపిణి''—

కనుగొనినాడు కృతార్థుడైన అశ్వపతి క్షితీంద్రుడు.

ఉన్నతజీవితం పరిపూర్ణత నొందించుకొను టకు నీరాజన ఒక వెలుగుబాట.

## ఆంధ్రవేదాంత పరిభాష

కూర్పరి: బి.వి. నారాయణస్వామినాయఁడు. వెల: రూ. 3.50 న.పై. ప్రాప్తిస్థానములు: శ్రీ బి. లజపతిరాయ్, 51, క్లబ్బురోడ్డు ఈస్టు, పెనాయ్నగరు, మద్రాసు-30; శ్రీ బి. వి. మల్లికార్జునం, పెరుమాళ్లపట్టు పోస్టు, (వయా) తిన్ననూరు (ఆర్.ఎస్.), చెంగల్పట్టు జిల్లా; లేక కార్యదర్శి: శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయము, రాజపద్మాపురము, మణూరు పోస్టు, (వయా) అర్కోణం.

ఏశాస్త్రమునకైనను పరిభాష అత్యంత ముఖ్యము. శాస్త్రము ముందా పరిభాషముందా— అంటే శాస్త్రమే లేకపోతే పరిభాషే లేదు. అందువల్ల శాస్త్రం ముందు పుట్టి ఆతర్వాత పరిభాష యేర్పడిం దని చెప్పాలి.

బౌద్ధులు, జైనులు, శైవులు, వైష్ణవులు, అద్వైతులు, ద్వైతులు — భారతదేశమున తమతమమతములను సిద్ధాంతములను ప్రతిపాదించి ప్రచారము గావించినారు. అంతేగాక వారి వేదాంతచర్చలలోగూడ ప్రత్యేకపరిభాషను కల్పించి రూపురేఖలుదిద్దినారు. ఇవంతా సంస్కృతభాషలోనే ఉన్నాయి.

ఇక తెలుగుభాషయందో—తిక్కన సోమయాజి, నాచన సోమనాథుడు, బైచరాజు వేంకటనాథరాజకవి—మున్నగువారు హరిహర రూపకల్పనచేసి—సాచివ్యము నొందినారు.

శైవులు శైవపరంగా, వైష్ణవులు విష్ణుపరంగా తమసిద్ధాంతములను గ్రంథాలయూపంలో వ్యాప్తికి తెచ్చారు. కాని ఇరువదవ శతాబ్దంలో అనేకములైన వేదాంతగ్రంథములు తెలుగున వెలువడినవి. వేదాంత పరిభాషనువివరించే గ్రంథంఒకటికూడ వెలువడ లేదు. ఆకొరత 'ఆంధ్ర వేదాంతపరిభాష' అనే గ్రంథం కొంతవఱకు తీరుస్తుంది. ఇది ముఖ్యంగా సాధకులపాలిటి కల్పవృక్షం.

నారాయణస్వామినాయఁడుగారు అనేక ఉత్కృష్టరచనలు చేస్తూన్న నిష్కామయోగి. ''శ్రీ నారాయణస్వామినాయఁడు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, వేదాంతాదిబహు గ్రంథములను పరిశోధించి వ్రాసిన ''ఆంధ్ర వేదాంతపరిభాష'' అను ఈ వేదాంత పదకోశం — వేదాంత గ్రంథపాఠకులకు 'కరదీపిక' ''— అను శ్రీ బూదూరు రామానుజ రెడ్డిగారి ప్రశంస అన్వర్థం.

—వేదం రామశాస్త్రి.

# శ్రీ వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్రపాఠకులకు అమూల్యతరుణము

# శ్రీవివేకానంద సంపూర్ణగ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడుతున్నది. ప్రతిసంపుటంలోను దాదాపు 500 పుట లుంటాయి. ఖరీదు:- అట్టబైండుసెట్టు రు. 50 లు. కాలికోబైండుసెట్టు రు. 65 లు. పోస్టేజి ప్రత్యేకం.

స్వామిజిసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదే మొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూ లేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

వివరములు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| మొదటి సంపుటము | : 575 | పుటలు | అట్టబైండు | రూ. 5/- | క్యాలికో | రూ. 6-50 |
| రెండవ సంపుటము | : 553 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| మూడవ సంపుటము | : 586 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| నాల్గవ సంపుటము | : 592 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| అయిదవ సంపుటము | : 544 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| ఆఱవ సంపుటము | : 585 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| ఏడవ సంపుటము | : 570 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| ఎనిమిదవ సంపుటము | : 544 | ,, | ,, | రూ. 5/- | ,, | రూ. 6-50 |

విలాసము :

మేనేజరు,

శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# OUR ENGLISH PUBLICATIONS

| | Price. Rs. | nP. |
|---|---|---|
| Sri Ramakrishna the Great Master (2nd Edn.) (Calico) | 25 | 00 |
| " " (Morocco) | 35 | 00 |
| The Gospel of Sri Ramakrishna (3rd Edn.) (Calico) | 20 | 00 |
| " " (Morocco) | 30 | 00 |
| Ramakrishna: Prophet of New India | 10 | 00 |
| Sri Ramakrishna .. | 1 | 50 |
| Sayings of Sri Ramakrishna (9th Edn.) | 5 | 00 |
| Ramakrishna Upanishad (2nd Edn.) | 1 | 00 |
| Tales and Parables of Sri Ramakrishna (2nd Edn.) | 2 | 50 |
| The Ramakrishna Mission its ideals and activities (6th Edn.) .. | 0 | 50 |
| Sri Ramakrishna and His Mission (2nd Edn.) | 0 | 62 |
| The Master and the Disciple .. | 2 | 00 |
| Sri Ramakrishna and Sarada Devi | 2 | 50 |
| Holy Mother Sri Sarada Devi (Gambhiranandaji) (3rd Edn.) (Ordinary) | 7 | 00 |
| " " (Calico) | 9 | 00 |
| Sri Sarada Devi the Holy Mother (Tapasyanandaji) (Ordinary) | 6 | 50 |
| " " (Calico) | 8 | 00 |
| Inspired Talks (Swami Vivekananda) (8th Edn.) (Board) | 2 | 00 |
| " " (Calico) | 3 | 00 |
| Hinduism (6th Edn.) .. | 1 | 00 |
| Education (6th Edn.) .. | 1 | 00 |
| The Eternal Companion (3rd Edn.) (Ordinary) | 2 | 25 |
| " " (Calico) | 3 | 25 |
| For Thinkers on Education (Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Story of a Dedicated Life (Life of Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Message of Eternal Wisdom (Swami Ramakrishnananda) | 3 | 00 |
| God and Divine Incarnations (Swami Ramakrishnananda) | 2 | 25 |
| The Ancient Quest (Swami Ramakrishnananda) | 1 | 50 |
| Sri Krishna, The Pastoral and King-maker (Swami Ramakrishnananda) (5th Edn.) | 1 | 25 |
| Life of Sri Ramanuja (Board) | 4 | 00 |
| " " (Cloth) | 5 | 00 |
| Isavasya Upanishad (7th Edn.) | 0 | 75 |
| Kena Upanishad (6th Edn.) | 0 | 75 |
| Katha Upanishad (9th Edn.) | 1 | 50 |
| Adventures in Religious Life (2nd Edn.) (Board) | 4 | 00 |
| (Cloth) | 5 | 00 |
| Taittiriya Mantrakose .. | 1 | 00 |
| Prasna Upanishad (5th Edn.) .. | 1 | 00 |
| Mundaka Upanishad (6th Edn.) .. | 1 | 00 |
| Mandukya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Taittiriya Upanishad (4th Edn.) .. | 2 | 00 |
| Aitareya Upanishad (3rd Edn.) .. | 1 | 00 |
| Svetasvatara Upanishad (3rd Edn.) | 1 | 50 |
| Chandogya Upanishad .. | 8 | 00 |
| Brihadaranyaka Upanishad (2nd Edn.) | 7 | 50 |
| Mahanarayanopanishad .. | 5 | 00 |
| Srimad-Bhagavad-Gita (Swami Vireswarananda, with Sridhara's Gloss) .. | 7 | 00 |
| Bhagavad-Gita: the Song of God (4th Edn.) | 2 | 75 |
| Upadeshasahasri (3rd Edn.) .. | 3 | 50 |
| Atmabodha (2nd Edn.) .. | 4 | 00 |
| Yatindramatadipika .. | 5 | 00 |
| Srimad Bhagavatam: The Wisdom of God (2nd Edn.) .. | 3 | 50 |
| Stotraratna (2nd Edn.) .. | 0 | 75 |
| Divine Life (4th Edn.) .. | 3 | 00 |
| Universal Prayers (5th Edn.) .. | 2 | 25 |
| Prince of Ayodhya (Ordinary) | 3 | 00 |
| " " (Calico) | 4 | 50 |
| Vedic Religion and Philosophy (4th Edn.) | 2 | 50 |
| Narada Bhakti Sutras (3rd Edn.) .. | 3 | 00 |
| Vakyavritti & Atmajnanopadeshavidhi (2nd Edn.) .. | 1 | 00 |
| Devi-Mahatmyam (Chandi) (2nd Edn.) | 2 | 00 |
| Saint Durga Charan Nag (3rd Edn.) | 2 | 25 |
| Thus Spake Sri Ramakrishna (7th Edn.) | 0 | 40 |
| Thus Spake Holy Mother (3rd Edn.) | 0 | 40 |
| Thus Spake Vivekananda (9th Edn.) | 0 | 40 |
| Thus Spake The Buddha (4th Edn.) | 0 | 40 |
| Thus Spake Sri Krishna (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake The Christ (3rd Edn.) | 0 | 40 |
| Thus Spake Prophet Muhammad (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Guru Nanak .. | 0 | 40 |
| Worship of Sri Ramakrishna .. | 1 | 00 |
| A Man of God (Ordinary) | 3 | 00 |
| " " (Calico) | 4 | 00 |
| Buddha and Our Heritage .. | 0 | 40 |
| Path to Perfection (7th Edn.) .. | 0 | 40 |
| Consolations (3rd Edn.) .. | 0 | 31 |
| Women of India (4th Edn.) .. | 0 | 25 |
| Spiritual Life .. | 0 | 06 |
| Path Beyond Sorrow .. | 0 | 06 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

ప్రతిక్షణమూ విలువైనదే
దృఢ నిశ్చయముతో కృషిచేయి


సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ గోలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦    ౧౯౬౩, ఆగస్టు; శోభకృత్తు - శ్రావణము    సంచిక ౨

## విషయసూచిక



'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦ } ౧౯౬౩ – ఆగస్టు :: శోభకృత్తు - శ్రావణము { సంచిక ౨


శ్రీః

## శివానన్దలహరి (౨)

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.

ఘటోవామృత్పిణ్డోఽప్యణురపి చ ధూమోఽగ్నిరచలః
పటోవా తన్తుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్
వృథా కణ్ఠక్షోభం వహసి తరసా తర్కవచసా
పదామ్భోజం శమ్భోర్భజపరమసౌఖ్యం వ్రజసుధీః ॥ ౬

| | |
|---|---|
| హేసుధీః | ఓ సుబుద్ధీ |
| మృత్పిణ్డః అపి | మట్టిరూపమైనను |
| అపిచ | మఱియు |
| అణుః | అణువో |
| ధూమః | పొగయో |
| అగ్నిః | అగ్నియో |
| అచలః | కొండయో |
| పటః వా | వస్త్రమో |
| తన్తుః వా | నూలో |
| ఘోరశమనమ్ | భయంకర నరకమార్గమును |
| పరిహరతికిమ్ | తప్పించునా ఏమి? |

| | |
|---|---|
| తర్కవచసా | తర్కవాక్యములచే |
| వృథా | వ్యర్థముగా |
| కణ్ఠక్షోభం | గొంతు రాపిడినే |
| వహసి | తాల్తువు |
| శమ్భోః | శివుని |
| పద+అమ్భోజమ్ | పాదపద్మమును |
| భజ | సేవింపుము |
| తరసా | వేగముగా |
| పరమ సౌఖ్యం | బ్రహ్మానందనిలయమగు మోక్షమును |
| వ్రజ | పొందుము. |

తా॥ ఓ సుమతీ రిత్తతర్కములను కట్టిపెట్టు. సాక్షాత్పరమేశ్వరుని దివ్యచరణారవిందములే యముని రాకను అడ్డగలవు. కావున ఆచరణారవిందములనే సేవించి మోక్షానంద మొందుమా.

మన స్తే పాదాబ్జే నివసతు, వచ స్స్తోత్రఫణితౌ,
కరౌ చాభ్యర్చాయాం, శ్రుతిరపి కథాకర్ణనవిధౌ,
తవధ్యానే బుద్ధి, ర్నయనయుగళం మూర్తివిభవే—
పరగ్రన్థాన్ కైర్వా పరమశివ జానే పరమతః? ॥ ౭

| | | | |
|---|---|---|---|
| పరమశివ | ఓపరమేశ్వరా | బుద్ధిః | బుద్ధి |
| మనః | మనస్సు | తవ | నీ |
| తే | నీ | ధ్యానే | ధ్యానమందును |
| పాద+అబ్జే | అడుగుదామరలందును | నయనయుగళమ్ | కన్నుగవ |
| వచః | మాటలు | మూర్తి విభవే | నీమంగళవిగ్రహ దర్శనమందును |
| స్తోత్రఫణితౌ | (నీ) స్తుతిసల్పుటయందును | | |
| కరౌ | హస్తములు | నివసతు | స్థిరముగ నుండుగాక |
| అభ్యర్చాయామ్ | (నీ) పూజయందును | అతః పరమ్ | అటుపిమ్మట |
| శ్రుతిః | వీను (లు) | కైః వా | ఏయింద్రియములచే |
| కథ+ఆకర్ణనవిధౌ అపి | (నీ) కథామృతమును వినుటయందును | పరగ్రన్థాన్ | వేఱుకావ్యములను |
| | | జానే | ఎఱుగగలను ? |

తా॥ ఓపరమేశ్వరా, నా మనస్సు నీ అడుగుదామరలందే ఉండును గాక, నావాక్కు నిన్ను స్తుతించుచునే ఉండును గాక, నాహస్తములు నీపూజయందే, నావీనులు నీ కథాశ్రవణముననే, నాకన్నులు నీ రూపదర్శనముననే, నాబుద్ధి నీధ్యానమందే - స్థిరముగ నుండుగాక. ఇక కావ్యాంతరముల నెఱుగ వే ఱింద్రియము లేవి ఉన్నవి ?

యథాబుద్ధి శ్శుక్తౌ రజతమితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్
తథా దేవభ్రాన్త్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వా పశుపతే ॥ ౮

| | | | |
|---|---|---|---|
| మహాదేవ | ఓ దేవదేవా | యథాభవతి | ఎట్లు కలుగునో |
| శుక్తౌ | ముత్తెపుచిప్పయందు | తథా | అట్లే |
| రజతమ్ ఇతి | వెండియనియు | పశుపతే | ఓ పశుపతీ |
| కాచాశ్మని | గాజు పూసయందు | జడజనః | మూఢుడు |
| మణిః | రత్నమనియు | ఈశం | సర్వేశ్వరుడవగు |
| పైష్టే | పిండికలిపిన | త్వాం | నిన్ను |
| జలే | నీటియందు | మనసిచ | మనసులోకూడ |
| క్షీరం | పాలు అనియు | నమత్వా | తలంపక |
| మృగతృష్ణాసు | ఎండమావులందు | భవదన్యం | నీకంటె ఇతరుడైన వానిని |
| సలిలమ్ | నీళ్లు అనియు | దేవభ్రాన్త్యా | ఈశ్వరుడను భ్రాంతిచే |
| బుద్ధిః | భ్రాంతి | భజతి | ఆరాధించుచున్నాడు. |

తా॥ ఓ మహేశ్వరా, ముత్తెపుచిప్పను జూచి వెండి యనియు, గాజుపూసనుచూచి రత్న మనియు, పిండికలిపిన నీళ్ళను జూచి పాలనియు, ఎండమావులను జూచి నీళ్లనియు, మూఢులు మోసపోవుట లేదా, అట్లే వారు ఇతరులను జూచి దేవు లని మోసపోయి ఆరాధించుచుందురు. నిజమునకు దేవుడవు నీ వొక్కడవే.

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖే నావస్థాతుం జన ఇహ న జానాతి కి మహో ॥ - ౯

| | | | |
|---|---|---|---|
| ఉమానాథ | ఓ పార్వతీవల్లభా | ఏకః | ఒక్కటేయగు |
| జనః | జనుడు | చేతః సరసిజమ్ | మనఃకమలమును |
| జడమతిః | మందమతియై | భవతే | నీకు |
| కుసుమార్థం | పూలకై | సమర్ప్య | సమర్పించి |
| గభీరే | లోతైన | సుఖేన | సుఖముతో |
| కాసారే | తటాకమునను | అవస్థాతుం | ఉండుటకు |
| విజనే | నిర్జనమగు | జనః | జనుడు |
| ఘోరవిపినే | భయంకరారణ్యమునను | ఇహ | ఇచట |
| విశాలే | పెద్ద | నజానాతి | ఎఱుగకున్నాడే |
| శైలే | కొండ (ల) యందును | కిమ్ | ఏల |
| విశతి | ప్రవేశించును | అహో | అయ్యో — |
| భ్రమతిచ | చుట్టుతిరుగును (కాని) | | |

తా॥ ఓ పార్వతీవల్లభా, సాటిలేని తనమనఃకమలమును నీ కర్పించి హాయిగ నుండుటకు జనునకు తెలియ కున్నదే! ఆమందమతి పూలకై సరః పర్వతారణ్యములం దన్నిట అల్లాడుచున్నాడే, అయ్యో!

నరత్వం దేవత్వం నగవన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్
సదా త్వత్పాదాబ్జస్మరణపరమానన్దలహరీ
విహారాసక్తం చేద్ధృదయ మిహ, కిం తేన వపుషా? ॥ ౧౦

| | | | |
|---|---|---|---|
| నరత్వం | మనుష్యత్వమును | | నీ |
| దేవత్వం | దేవత్వమును [ము | పాద+అబ్జ | పాదపద్మములను |
| నగవనమృగత్వం | పర్వతారణ్యవాసిజంతుత్వ | స్మరణ | స్మరించుటవలని |
| మశకతా | దోమతనము | పరమ | ఉత్కృష్టమగు |
| | పశుత్వము | ఆనన్దలహరీ | ఆనందప్రవాహమున |
| కీటత్వం | క్రిమిత్వము | విహార | విహరించుటలో |
| విహగత్వాది | పక్షిత్వము మొదలగు | ఆసక్తంచేత్ | నిమగ్నమైయుండు నేని |
| జననం | పుట్టుకయు | తేనవపుషా | ఆ దేహము చేత |
| భవతు | కలుగనిమ్ము | | (ఆజన్మము చేత) |
| హృదయం | డెందము | కిమ్ | ఏమి (కొదువ)? |

తా॥ హృదయమున నీ పాదపద్మస్మరణపరమానందలహరీవిహారాసక్తి ఉన్న చాలును, దేవ – మనుష్య – మృగ – పక్షి – కీటాది జన్మములలో ఏజన్మము కలిగినను పరవా లేదు.

# శ్రీ వివేకానందమరందబిందువులు (౨)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

శత్రువులవిషయమున గృహస్థుఁడై వీరుఁడై వర్తింపనొప్పును. శత్రువుల కాతఁడు ప్రతీకారము చేయవలయును. ఇది గృహస్థుని విధి. అంతియేకాని యొక మూలఁ గూర్చుండి యేడ్చుచు, అప్రతికారమునుగూర్చి యర్థరహితప్రలాపము లాడఁగూడదు. శత్రువుల యెడ శౌర్యమును ప్రకటింపనియెడల నాతఁడు తన విధ్యుక్తమును నెఱవేర్పనివాఁడగును. గురువులయెడలను బంధుగులయెడలను నాతఁడు మేఁకపిల్లవలె శాంతమూర్తియై మెలఁగవలయును.

సంసారవిధ్యుక్తకర్మములు నిజముగా దుఃఖకరములు, తదీయ సుఖములు క్షణభంగురములు, సారహీనములు; జీవితగమ్యమో,

అస్పష్టముగా, ఛాయామాత్రముగాఁ గాన్పించును; ఐనను ధీరాత్ముఁడా, నీకర్తవ్యమును నెఱవేర్చుచు, నీ శక్తిసామర్థ్యముల నన్నిటిని వినియోగించి, యీ సంసారాంధకారమునుండి వెలువడుము.

స్వప్రయోజనమునుగూర్చి తలపోయకుండు నప్పుడే మహోత్తమ కార్యములను నెఱవేర్చు చుండుము; మహోత్తమ ప్రభావమును వెలువరించుచుండుము. భగవానునకుఁ బూర్తిగా నాత్మసమర్పణము గావించుకొనుము, కర్మఫలములయెడ సంపూర్ణముగా నసంగుఁడవై యుండుము; అపుడే నీ వేదియైన నిజమైన కార్యము నొనర్పఁ గలుగుదువు.

అపవిత్రకర్మ మెంతచెడ్డదియో, అపవిత్ర భావము నంతచెడ్డదియే. ఇచ్ఛను నిగ్రహించినచో, మహోత్తమ ఫలప్రదాయకమై యొప్పును.

మంచివి కానిమ్ము, చెడ్డవి గానిమ్ము — నీ కర్మముల నుమ్మివలె విడిచివేయుము, వానిని గూర్చి మఱల తలపెట్టకుము. కడచినదేదో కడచినది. వ్యసనమును విడనాడుము. మృత్యుముఖముననైనను దౌర్బల్యమున కధీనుఁడవుగాకుము, పశ్చాత్తాపము చెందకుము, జరిగినదానినిగూర్చి యూరక పరితపింపకుము, నీ సత్కార్యమునైనను సరియే స్మరింపకుము; విముక్తుఁడవై యుండుము.

నానాఁటికి నే నల్పవిషయములలోఁ జూపఁబడు మహత్త్వమును గనుఁగొన వాంఛించుచున్నాను. మహాత్ముఁడగువాఁ డేమిభుజించునో, ధరించునో, సేవకులతో నెట్లు సంభాషించునో — కనుఁగొనఁ దలఁతును! సర్ ఫిలిప్ సిడ్నీ మహాశయు నౌన్నత్యమునుజూడఁదలంతును; తమయవసానసమయమున నితరుల దప్పిని స్మరించువా రరుదుగదా! ఉన్నతదశలో నున్నప్పుడు ప్రతివ్యక్తియు నఖండుఁడే! నాటక రంగమునఁ బిఱికిపందయు భీముఁడే! అపుడు ప్రేక్షకు లాతని ధైర్యసాహసములను జూచి నిశ్చేష్టులగుదురు! ప్రతిదినము, ప్రతినిమేషము, నిరాడంబరముగాఁ, బ్రశాంతముగాఁ దన ధర్మము నిర్వర్తించు కీటకమురొక్క ఘనతయే నిజమైన ఘనతయని నాకుఁ దోఁచుచున్నది.

పరిపూర్ణమనోనిగ్రహము లభింపనిచో యేమియొనర్చినను నడవిని గాచిన వెన్నెలవలె నిష్ప్రయోజనము. యోగభ్రష్టులు తమవాంఛల నీడేర్చుకొనుటకై పునర్జన్మమున నొకప్పుడు కిరీటాధిపతులై జన్మింతురు. అట్టివారికిఁ దఱచు పూర్వజన్మయోగవాసనలును స్ఫురణయు నుండును. అక్బరు చక్రవర్తికిట్టి పూర్వజన్మస్ఫూర్తి యుండెడిది. పూర్వజన్మమునఁ జ్యుతినొందిన యొక బ్రహ్మచారినని యాతఁడు భావించెను.

మనోనిగ్రహ మెంతకష్టసాధ్యమోకదా! మతిచెడిన కోఁతికిని మనస్సునకును మంచి పోలికగలదు. కోఁతు లన్నిటివలెనే సహజముగాఁ జంచలమైన యొక కోఁతి యుండెను. స్వాభావికమగు నిట్టి చాంచల్యము దానికిఁ జాలదో యనునట్లు లెవ్వరో దానిని గల్లు త్రావించిరి. అందుచే దానికిఁ జాంచల్యము హెచ్చెను. ఈ స్థితిలో దాని నొక తేలు కుట్టెను. మనలను తేలు కుట్టినప్పు డాదినమంతయు గంతులు వేయుచుందుముకదా! పాపమా కోఁతి దురవస్థ యిఁకఁ జెప్పవలయునా? ఈ గ్రహచారము చాలక దానినొక దయ్యము పట్టెను. ఇఁక దాని చాంచల్యస్థితినిగూర్చి

మీరే యూహించుకొనుఁడు! మన మన స్సొ కోఁతివంటిది. క్షణమైనను నిలుకడ యనునది లేక సదా పరుగెత్తుచుండుట దీనిస్వభావము. ఇఁక నిది విషయవాంఛయను మద్యపానము చేసినంత నే దీని సంక్షోభము మఱింతవృద్ధి యగుచున్నది. అనంతర మసూయయను తేలు కుట్టుచున్నది. తుద కహంభావమను పిశాచ మావేశించి యందఱికంటెను దానే ప్రము ఖుఁడ నని మనుష్యుని గర్వింపఁజేయుచున్నది. ఇట్టి మనస్సును నిగ్రహించు టెంతటి కష్ట సాధ్యమో తలంపుఁడు.

కొంతసే పొకచోటఁ గూర్చుండి మనస్సును యథేచ్ఛముగాఁ బరుగెత్తనిచ్చుటయే మనో నిగ్రహమునకుఁ బ్రథమోపాయము. అట్లు కూర్చుండియున్నంతసేపును మనస్సటునిటు గంతులువేయుచు, నిలుకడలేని కోఁతివలె నెగిరిపడుచుండును. ఈ మనోమర్కటమును శక్తికొలఁదియు నెగురనిచ్చి మీరు నిరీక్షించు చుండుఁడు. 'జ్ఞానమే శక్తి' యను వచనము యథార్థము. మనోవ్యాపారము దెలియకుండు నంతవఱకు మనస్సును నిగ్రహింపఁజాలరు. స్వేచ్ఛగా దానిని సంచరింపనిండు. వికృతా లోచన లనేకములు కలుగును. అట్టి తలంపులు కలిగినందులకు మీ కాశ్చర్యమగును. కాని క్రమముగా నానాఁటికానాఁడు చాంచల్యము క్షీణించి మనఃప్రసన్నత కలుగుచుండును. మున్ముందుఁ గొన్ని నెలలవఱకును మనోవృత్తు లపరిమితముగా నున్నట్లు కాన్పించును. అనం తర మవి క్రమముగా క్షీణించిపోవుచుండును. తుదకు మనస్సు సంపూర్ణముగా వశమగును. కాని ప్రతిదినమును బూనికతోమనము సాధన చేయవలయును. ఓరిమి వహింపవలయును.

## శ్రద్ధ

వత్సలారా, సంఘమున సామాన్యులు, వినమ్రులునయ్యును శ్రద్ధాయుక్తులగు మీ యందే భారతమాత యాశ పెట్టుకొని యున్నది.

గుంపులకొలఁది పరమతావలంబకులతో నాకుఁ బనిలేదు, నిజమైన మానవు నొకనిని నా కొసఁగుఁడు. ఎవ్వరిసాయము నపేక్షింప కుఁడు. సమస్తమానవసాహాయ్యముకంటెను, బరమేశ్వరసాహాయ్యము కోటిరెట్లుఘనతరము. అకలంకులై యుండుఁడు — పరమేశ్వరుని నమ్ముఁడు, సదా వానిమీఁదనే ఆధారపడి యుండుఁడు. అదియే సరియైన మార్గము; ఇఁక మీ కేభయమును నుండదు.

విధేయతయను సుగుణము నలవఱుచు కొనుము, కాని నీ విశ్వాసమును — శ్రద్ధను— నీవు విడనాడరాదు. పెద్దలయెడ విధేయత యనునది లేనిదే సంఘీభావముతోఁగూడిన యేకార్యమును గొనసాగఁ జాలదు. వ్యక్తిగత శక్తులను గేంద్రీకరించిననేకాని యే మహా కార్యమును నెఱవేఱఁజాలదు.

మీలోఁ బ్రతివ్యక్తియు శారీర మానసిక బలముల రాశిసుఁడు గావలయును,—ఐతీర వలయును, ఉద్యమమునెడ విధేయత, ప్రేమ, సంసిద్ధత — యను నీ మూఁడును మీయొద్ద నున్నచో, హరిబ్రహ్మాదులైనను మిమ్మడ్డు కొనఁజాలరు.

# శ్రీ నిరంజనానందస్వామి

## [సంపాదకీయము]

నిత్యసిద్ధులనియు ఈశ్వరకోటు * లనియు అనగా పుట్టినదాది యెన్నడును మాయలో తగుల్కొనక నిత్యపరిపూర్ణులై యుండువారని శ్రీరామకృష్ణుడు కొందఱిని పేర్కొనెడివాడు. వారిలో నిరంజనానందస్వామి యొకడు. శ్రీ రామునిగుణములు తనయందు కలవాడుగ ఈనిరంజనానందుడు జన్మించియున్నాడని గురుదేవు డొకసారి ప్రత్యేకముగ చెప్పియుండెను.

శ్రీనిరంజనానందస్వామికి పూర్వాశ్రమ నామము నిత్యనిరంజనఘోషు. నిరంజన్ అను సంక్షిప్తనామముతో అతనిని వ్యవహరించుట వాడుక. ఇరువదినాల్గుపరగణాలజిల్లాలో నొక పల్లె అతనిజన్మగ్రామము. అయినను అతడు తనమేనమామయగు కాళీకృష్ణమిత్రునింట కల్కత్తాలో నివసించుచుండెను. బాల్యము లోనే అతనికి కల్కత్తాలో నొకభూతవైద్యుల ముఠాతో పరిచయ మేర్పడెను. భూతములను ఇతనిమీదికి ఆవాహనచేయుటకు ఇతడు తఱచుగ వరింపబడుచుండెను. ఆమధ్యవర్తిపదవిలో ఇతడు చాల బాగుగ నెగ్గుచుండెను. ఈ దినములలో ఇతనియందు రోగముల ను మాన్పుట మున్నగు అద్భుతశక్తులు కొన్ని వర్ధిల్లినవి. ఒకానొకధనికుడు నిద్రపట్టక బాధ పడుచుండె నట. పదునెనిమిది సంవత్సరములు అట్లే గడచిన వట. తనరోగమును మాన్పు మని అతడు నిరంజనుని ఆశ్రయించెను. అనంతర కాలమున నిరంజను డిట్లనెను: ''అతనికి నావలన నిజమైన సాయము ఏమైన లభించెనో లేదో నే నెఱుగను. కాని అంత సిరిసంపద లుండియు జీవితమున నతడు పడుచుండిన బాధలను చూచినప్పుడు ఐహికసంపదలు ఎంతటి అసారములు అను నిర్వేదమునకు నేను వశుడనైతిని.''

శ్రీరామకృష్ణుని గొప్ప ఆధ్యాత్మికశక్తిని గూర్చి విని నిరంజనుడు ఒకనాటి మధ్యాహ్నానంతరము ఆయనను దర్శించుటకు దక్షిణేశ్వరమునకు వచ్చెను. మొదట తన భూతవైద్యుల ముఠాతో కలిసియే శ్రీరామకృష్ణునొద్ద కతడు వచ్చె నని కొందఱు చెప్పుదురు. భూతములను శ్రీరామకృష్ణునిమీదికే ఆవాహనచేయుటకై వారు ప్రయత్నించి రట. శిశువువలె అందు కంగీకరించి శ్రీరామకృష్ణుడు పీఠముపై ఆసీనుడైయుండె నట. కాని కొంతసేపటికి ఆయన కది ఇష్టపడక లేచిపోయె నట.

శ్రీరామకృష్ణుని మొదటిసారి కలసికొనినపుడు నిరంజనునకు వయసు పదునెనిమిది సంవత్సరములు. పొడుగరియు విశాలస్కందుడును దృఢదేహుడునగు నతని ఆకారము అతి గంభీరముగ నుండెడిది. పసివాడే అయినప్పటికిని అతని కన్నులలో నిర్భయత్వము ప్రకాశించెడిది.

* ఇతరులనుగూర్చి గట్టిగ తెలియదు గాని ఈ క్రింద పేర్కొనబడిన అర్గురు నిత్యసిద్ధులనుట నిర్వివాదము—నరేంద్రుడు, రాఖాలు, యోగిను, బాబురాము, నిరంజన్, పూర్ణుడు.

నిరంజనుడు వచ్చినప్పుడు భక్తులు శ్రీరామకృష్ణుని పరివేష్టించి యుండిరి. వారందఱును చీలిపోయినతర్వాత సాయంకాలము శ్రీరామకృష్ణుడు నిరంజనునివైపు తిరిగి అతని సకల విషయములను విచారించెను. భూత విజ్ఞాన మందలి అతని ఆసక్తిని గుర్తించి శ్రీరామకృష్ణుడు బాలనిరంజనునితో "అబ్బాయి, భూతప్రేతములనుగూర్చి తలంచుచుందువేని నీవును భూతమువో, పిశాచమువో అగుదువు, దేవునిగూర్చి తలంచుచుందువేని నీది దివ్యజీవిత మగును - ఈరెంట నీకేది యిష్టము" అని యడిగెను. "దివ్యజీవితమే నాకిష్టము అని నిరంజనుడు బదులు చెప్పెను". "అటులైన ఈభూతవైద్యులముఠాతో సంబంధమును పూర్తిగా వదలుకో" మ్మని శ్రీరామకృష్ణుడు హిత ముపదేశించెను. నిరంజను డంగీకరించెను.

మొదటిసారి కలిసికొనినపుడే శ్రీరామకృష్ణుడు నిరంజనునితో చిరకాలపరిచితునితో మాటాడినట్లు మాటాడెను. చీకటిపడుచుండుటను గుర్తించి శ్రీరామకృష్ణుడు నిరంజనుని ఆరాత్రిని దక్షిణేశ్వరముననే గడపు మని నిక్కచ్చి చేసెను. కాని తనమామ తనకై ఆందోళన చెందుచుండును కావున నిరంజనుడు అట్లుండ లేక పోయెను. మరల వత్తు నని శ్రీరామకృష్ణునకు మాట ఇచ్చెను.

ఇంచుక సేపు సాగిన సమావేశమే ఐనను ఇది నిరంజనుని డెందమున గాఢముగ హత్తుకొనెను. ఇంటికి పోవుచున్నప్పుడు దారి పొడుగునను అతనిచిత్తమున శ్రీ రామకృష్ణుడే మెదలుచుండెను. ఇంట నున్నప్పుడుకూడ అతనితలంపు లన్నియు శ్రీరామకృష్ణుని గుఱించినవిగనే యుండెను. కావున రెండు మూడు దినములలో అతడు మరల శ్రీరామకృష్ణునొద్దకు వచ్చెను. ఆబాలుని గుమ్మమునొద్ద చూచిన తక్షణమే శ్రీరామకృష్ణుడు పరుగున నెదు రేగి గాఢముగ కౌగిలించుకొనెను. తర్వాత ప్రగాఢమైన అనుతాపముతో "నాయనా, దినములు గడిచిపోవుచున్నవి. భగవంతు నెప్పుడు సాక్షాత్కరించు కొందువోయి, భగవంతుని సాక్షాత్కరించుకొనక పోవుదువేని జీవిత మంతయు నిరర్థక మగును. పూర్ణహృదయముతో నీవు భగవత్పరుడవుగ నెన్నడగుదువో అని నేను మిక్కిలి ఉబలాట పడుచున్నాను"— అని చెప్పసాగెను. నిరంజనునకు ఆశ్చర్యముచే నోట మాట వెలువడ లేదు. ఇట్లనుకొనెను. "నిజముగ నిది వింత. భగవత్సాక్షాత్కారము నాకు కలుగనందుకు ఈయన కింతటి మనోవ్యథ కలుగు టెట్లు, ఈయన ఎవరో!" ఐనను ఆ మాటలు అత్యంత హార్దములగుటచేత బాలుని డెందమును ఎక్కువగ కరగించినవి. అత డా రాత్రిని దక్షిణేశ్వరమున గడపెను. మఱుదినమును దాని మఱుదినమునుగూడ శ్రీరామకృష్ణునిసన్నిధిలో ఆనందోద్రేకముతో గడచినవి. నాల్గవ దిన మతడు కల్కత్తాకు మరలివచ్చెను. ఇంటికి వచ్చినవెంటనే మామ అతనిని అన్నాళ్లు ఇంటికి రానందుకు చీవాట్లుపెట్టి ఇక నెచ్చటికిని పోనీయక అతనిని నిర్బంధములో నుంచెను. కాని తర్వాత నచ్చినప్పుడెల్ల దక్షిణేశ్వరమునకు పోవుటకు నిరంజనునకు అనుమతి లభించెను.

కల్లకపటము లెఱుగక ఉన్నమాటను చెప్పివేయు స్వభావమునిరంజనునిది. ఈస్వభావము గురుదేవునకు మిగుల నచ్చినది. ఏలయన ఆయన అభిప్రాయములో నిష్కపటతయు

మఱుగులు లేకుండుటయు అరుదైన సుగుణములు. పూర్వజన్మతపఃఫలముగనే అలవడు గుణము లవి. భగవత్సాక్షాత్కారము సాధ్యమగు నని ఆగుణములు సూచించును. గృహస్థ జీవితముపట్ల నిరంజనునకు మిక్కుటమైన వెగటు. పెండ్లియాడు మని బంధువులు నిర్బంధించిన వప్పుడు ఆ తలంపే అతనికి భయంకరముగ నుండెను. వినాశనమువంకకు తాను లాగబడుచున్నట్లు అతడు అనుకొనెను. అతఁ డత్యంత విశుద్ధాత్ముడు. "నిరంజనుడు అంజనరహితుడు" (=నిష్కళంకుడు) అని గురుదేవుడు వ్రాచుచుండెడివాడు.

నిరంజనుడు మృదుహృదయుడే ఐనను అతనికి ముంగోప మెక్కువ. కోపము వచ్చెనా, అతడు హద్దులకు లోబడడు. ఒకనా డతడు పడవలో దక్షిణేశ్వరమునకు పోవుచుండెను. అతడు వినుచుండగా తోడిప్రయాణికులు కొందఱు శ్రీరామకృష్ణుని తూలనాడసాగిరి. నిరంజనుడు మొదట "కాదు" "కూడదు" అనెను. మంచిమాటలు పనికిరా వని తోచి నపుడు "మిమ్మందఱిని ముంచివేసెదను." అని బెదరించుచు పడవను ఊపసాగెను. మొదట తిట్టినవారు అతనికోపమును అతనిగంభీరాకారమును చూచి గడగడలాడి తమ అపరాధమును మన్నింప వేడుకొనిరి. ఈసంభవమును విన్నంతనే శ్రీరామకృష్ణుడు అట్టి తీవ్రమైన ముంగోపము కూడ దని నిరంజనుని చీవాట్లు పెట్టెను. "కోపము మహాపాపము. దానికి నీ వేల వశపడవలెను? అవివేకులు శోచనీయమైన తమ అజ్ఞానముచేత పెక్కుమాట లాడుదురు. అవి లెక్కింపబడదగినవి కా వని వానిని పూర్తిగ ఉపేక్షింపవలెను"—అనెను శ్రీరామకృష్ణుడు.

ఒకప్పుడు నిరంజనుడు ఒకానొక ఆఫీసులో ఉద్యోగమునకు సమ్మతింపవలసిన పరిస్థితి ఏర్పడెను. ఆ వార్తవిని శ్రీరామకృష్ణుడు ఎంతయు విషణ్ణుడై "నిరంజనుడు మరణించెనని వినియుండినచో నే నింతగా దుఃఖించెడివాడను కాను"—అనెను. ఆ ఉద్యోగమును నిరంజనుడు వృద్ధురాలైన తనతల్లిని పోషించుటకై అంగీకరించినా డను వివరము తర్వాత తెలియనై శ్రీరామకృష్ణుడు నిట్టూర్పు విడచి నిబ్బరపడి "అటులైనచో, సరియే, అది నీమనస్సును చెడగొట్టదు. ఉద్యోగమును నీకొఱకే స్వీకరించియుంటివేని నీస్పర్శసైతము నాకు అసహ్యముగ నుండియుండును. అంతటి నైచ్యమునకు నీవు పాల్పడుదు వనుట నిజముగ అసంభావ్యము". ఈమాటలను విని శ్రోతలలో నొకడు "ఉద్యోగము చేయుట ఇంత నింద్యమగుచో మానవుడు తన్ను తన కుటుంబమును ఎట్లు పోషించుకొనగలడు" అని ప్రశ్నించెను. అందులకు శ్రీరామకృష్ణుని జవాబు—"ఇతరులు తమ కిచ్చ వచ్చినట్లు చేయుదురు గాక. తాము ఒక ప్రత్యేకవర్గమువారైనట్టి ఈయువ సాధకులకుమాత్రమే నేను చెప్పినది."

ఆ నౌకరిని నిరంజనుడు చిరకాలము చేయలేక పోయెను. శ్రీరామకృష్ణుడు కాశీపూరులో వ్యాధిగ్రస్తుడుగ నుండినప్పుడు తమ సభక్తికపరిచర్యలచే ఆయనవ్యాధిని నయము చేయుటకు వీలగు నేమో అను ఆసచే ఆయన అక్కరలను విచారించుకొనుచు అహోరాత్రములు ఆయనతోనే గడపిన యువశిష్యులలో నిరంజను డొకడు.

శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము ఆయన అస్థికలను గంగలో నొకచోట నుంచునట్లు

భక్తు లందఱు అంగీకరించిరి. కాని తర్వాత రామచంద్రదత్త మున్నగువారు అస్థికలను కంకూర్గచ్చికి కొనిపోవ గోరిరి. కాని మొదట అనుకొన్నట్లే జరుగవలె నని ధైర్యముతోపట్టు పట్టినవాడు నిరంజనుడు. అందుచే నాతడు స్మరణార్హుడు. అతడు కలిగించుకొన్న జోక్యము చేత అస్థికలలో అధికభాగము ఈయువసన్న్యా సులకు దక్కినవి.

శ్రీరామకృష్ణుని నిర్యాణానంతరము నిరంజనుడు బరానగరమఠములో చేరి పరమార్థ సాక్షాత్కారమునకై తన ఆత్మను హృదయ మును అంకిత మొనర్చుకొనెను. సన్న్యాసు లను ఒక్కచోటనే కట్టువడి ఉండనీయని స్వేచ్ఛాప్రేరణ ఒకటి కలదు కదా. అందుచే నిరంజనుడు అప్పుడప్పుడు ఇచ్చటి కచ్చటికి పర్యటించుచుండెను. కాని తక్కినసోదరశిష్యు లకువలెనే నిరంజనునకును మఠమే, అది బరా నగరములోనున్నప్పుడును ఆ లం బ జా రు కు మాఱినప్పుడును, ముఖ్యస్థానము (హెడ్ క్వార్టరు) గా ఉండెడిది.

మఠములో పదిలపఱుపబడియున్న గురు దేవుని అస్థికలను ఆరాధించు స్థిరభక్తిదీక్షు లలో నిరంజనుడు శశికే (శ్రీరామకృష్ణానంద స్వామికే) దీటు: శ్రీరామకృష్ణునందలి అతని శ్రద్ధ ఎంత ప్రబలమైన దనగా విశ్వప్రజలంద ఱును భూషించినను దూషించినను ఇతనికి లక్ష్యము లేదు.

శ్రీవివేకానందస్వామి పాశ్చాత్యజైత్ర యాత్రనుండి వెనుదిరిగివచ్చుచున్నప్పుడు పరు గున నెదు రేగి కొలంబోయొద్ద ఆయనను కలిసికొన్నవాడు శ్రీనిరంజనానందస్వామి.

తర్వాత నిరంజనానందుడు శ్రీవివేకానంద స్వామితో కూడి ఉత్తరభారతమున కొన్ని చోట్లకు పర్యటించెను. కొంతకాల మతడు కాశీలో భిక్షాటనము చేయుచు తపోవ్యగ్రుడై ఉండెను.

జీవితచరమభాగములో నిరంజనానంద స్వామి అతిసారవ్యాధిచే ఎక్కువగ బాధ పడెను. హరిద్వారమున తపస్సు చేయుచుం డగా ఆయనకు కలరావ్యాధి అంటుకొనెను. 9-5-1904 నాడు ఆయన మహాసమాధి నొందెను.

శ్రీనిరంజనానందస్వామి ఆకారము వెఱగు కొల్పునట్టిదిగా పైకి కనిపించునే గాని ఆయన హృదయము ప్రేమపూర్ణము. మాతృశ్రీతో ఆయన అనుభవించిన కడపటి సమాగమము గుండెను కరగించివైచునట్టిది. ''అప్పు డతని ప్రకృతిలోని ఉద్రేకమును ప్రేమయు ప్రకట మైనవి. సమీపించుచున్న మరణమునుగూర్చి అత డొక్కమాటయైనను చెప్ప లేదు. కాని బాష్పపూర్ణ నేత్రుడగుశిశువువలె తల్లిపాదము లను విడనాడకుండెను. మాతృశ్రీయే తనకు సర్వమును చేసిపెట్టవలె ననియు అన్నమును సయితము తినబెట్టవలె ననియు తనకై ఆమె వండిపెట్టినదే తనకు కావలయు ననియు అతడు పట్టుపట్టెను. ఆమెను ఎడబాసిపోవలసివచ్చి నప్పుడు అందు కిష్టములేక ఆమెపాదములపై బడి కన్నీరు కడవలుగ నేడ్చెను. తర్వాత లేచి మాతృశ్రీదర్శనము తన కిక లే దను గట్టి పరిజ్ఞానముతో నిశ్శబ్దముగ వెడలి పోయెను'' — అని యొక భక్తుడు వ్రాసి పెట్టెను.

నిరంజనునికి మాతృశ్రీయందు గల భక్తి నిరతిశయము. శ్రీవివేకానందస్వామి ఇట్లనెను: ''నిరంజనుడు చేసెడి పెయ్యితప్పులనైనను సరే నేను మన్నింపగలను. మాతృదేవిపట్ల అతని కున్న భక్తి అట్టిది''

నిరంజనుని మాతృభక్తికి గిరీశచంద్ర ఘోషుకూడ సాక్షియే. ఆ తొలిదినములలో మాతృదేవిదివ్యత్వము సర్వత్ర గుర్తింపబడ లేదు. అందు నమ్మకము లేనివారిలో తా నొకడ నని గిరీశుడే ఒప్పుకొనియున్నాడు. గిరీశునికి అచిరకాలములో కన్ను తెరచిన వాడు నిరంజనుడే. నిరంజనుడు గిరీశుని మొదట మాతృశ్రీయొద్దకును తర్వాత జయ రాంబాటిలోని ఆమెపుట్టింటికినికూడ పిలుచు కొనిపోయెను. నిరంజనునితోబాటు గిరీశుడును మాతృదేవిప్రేమపూర్వకపర్యవేక్షణలో కొన్ని నెలలకాల ముండెను. ఆ ఉనికిచే ఆధ్యాత్మిక సిద్ధిని అపారముగ గడించెను. నిజముగ మాతృదేవియొక్క ఆధ్యాత్మికమహిమను పెక్కండ్రుభక్తులచేత గుర్తింపజేసినది నిరం జను నుపదేశమే.

అతనిశీలములో పరుషత్వమృదుత్వముల వింత కలయిక యుండెను. అతని సత్యాభిరతి ఎట్టిపరిస్థితిలోను తగ్గునది కాదు. ఎంతటి త్యాగమునకైనను జంకునదికాదు. కల్కత్తా నుండి వచ్చిన సంపన్నుడొకడు వారణాసిలో నొకశివాలయమును నిర్మించెను. ఆవార్త విని శ్రీవివేకానందస్వామి యిట్లనెను. పేదలదుః స్థితిని తీర్చుటకిత డేమేని చేసిన ఇట్టి శివా లయములను వేయింటిని కట్టించినపుణ్యము ఇతనికి కలుగును. స్వామి చెప్పిన ఈమాట అతనిచెవిని పడినది. వెంటనే అతడు వారణా సిలో అప్పుడు ప్రారంభావస్థలో నున్న రామ కృష్ణమిషను సేవాశ్రమమునకు విరాళముగ ఒకపెద్దమొత్తముపైకమును ఇత్తుననెను. కాని ఆతొలిఉద్రేకము చల్లబడగనే మొదట నిత్తు నన్న మొత్తమును తగ్గింపగోరెను. ఈవాగ్దా నోల్లంఘనమునకు సత్యనిష్ఠుడైన నిరంజనా నందస్వామికి చాల కోపము వచ్చి ఆమొత్త మును కైకొన నిరాకరించుటవలన సేవాశ్రమ మునకు ఎంత కష్టముకలిగినను పూర్తిగ నిరా కరించెను.

బాహ్యసంభవముల మూలమున ఆధ్యా త్మికపురుషునివిలువను నిర్ణయించుట చాల కష్టము. తనచుట్టుపట్ల అతడుకలిగించు ఉత్సా హమునుబట్టి అతని ఆధ్యాత్మికమహిమను తెలిసికొనవచ్చు, అదియు కొంతమట్టుకే. శ్రీ నిరంజనానందస్వాముల జీవితముద్ర పెక్కం డ్రపై కననగుచుండును. కొందఱు ఆయన ప్రభావమునకులోనై దేవునకై సర్వమును పరిత్యజించి రామకృష్ణసంస్థలో చేరిరి. ఒక శిష్యుడు సన్న్యాసిగను అయ్యెను. శ్రీనిరంజ నానందస్వామిని గూర్చి తెలిసికొనవలె ననిన అందు కన్నిటికంటె ఎక్కువ ఆధారము అత నిని గుఱించి గురుదేవుడు చెప్పుచుండిన మాటయే. నిరంజనానందస్వామి తన అంత రంగభక్తులలో నొకడని గురుదేవుడు చెప్పు చుండెను.

# శ్రీ వివేకానందోదాహరణము

శ్రీ పాటీలు తిమ్మారెడ్డి, ఎం.ఏ. గారు

"జగత్తంతయుఁ గ్రియారూపము. సర్వక్రియయుఁ బరమేశ్వరునందుఁ బర్యవసించును. ధాతువు సర్వథా విభక్త్యాశ్రయము. ఏవిభక్తితో సంబంధములేక క్రియలేదు. అందుచేత నన్నివిభక్తులతోఁ బరమేశ్వరునిఁ జెప్పినపుడు భగవంతుఁడు సర్వక్రియాస్థానభూతుఁడని వ్యంగ్యము. ఇది యుదాహరణ కావ్య రహస్యము."

—'కవిసామ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ

ప్రథమావిభక్తి - శార్దూలము

శ్రీకైవల్యపథప్రదర్శకుఁడున్
శ్రీరామకృష్ణ ప్రియుం
డాకల్యాణ గుణాలవాలుఁడు వివే
కానందుఁ డాస్వామి లో
కైకారాధ్యుఁడు దీనబాంధవుఁడు యో
గీంద్రుండు సుజ్ఞాని నా
వాకల్ సేకొని మ్రొక్కులొననియు సం
భావించుఁగాత న్ననున్. 1

విశ్వనాథుకుమార రత్నము
వెలుఁగుబాటయి జగతిమించెను
శాశ్వతమ్మయి పొల్చునట్టి య
శమ్మనంతమ్ముగ గడించెను
గనుల తేజముచే సకలలో
కముల గెలువఁగఁ జాలినట్టిఁడు
ఘనుఁడు శంకరుఁడీతఁడంచు జ
గానఁబొగడికగన్న యట్టిఁడు

త్రిపుటతాళము - కళిక - వృషభగతిరగడ

మఱియుఁ బాశ్చాత్యులకు సద్ధ
ర్మములు దెలుపఁగఁ బుట్టినట్టిఁడు
పరమగురుఁడగు రామకృష్ణుని
పదములను జేపట్టినట్టిఁడు
భారతీయుల గొప్పఁదనము ప్ర
పంచమందునఁ జాటిచెప్పెను.
భారతీయుల పూర్వపావన
పథములందున నడకమప్పెను.

త్రిపుటతాళము - ఉత్కలిక - హరిణగతిరగడ

ధరఁ జికాగోనగరవరమున
జరుగు నామత సభాంగణమున
జలదగంభీర స్వనమ్మున
జిలుక మకరందమురయమ్మున
నమెరికావాసులను లోఁగొని
విమలనిగమౌన్నత్యమును విని
పించిమించిన యాయజేయుఁడు
ప్రాంచదమల సుకీర్తికాయుఁడు

ద్వితీయావిభక్తి - ఉత్పలమాల

ఈభరతోర్వియందు జని
యించుట నాకదిగర్వకారణం
బీభరతోర్వియందు నమ
రేంద్రపురమ్ముతృణమ్ము నాకటం
చే భగవానుసాక్షిగ వ
చింతునటన్న పునీతవాక్యసం
శోభితు విశ్వవంద్యుని వి
శుద్ధచరిత్రు సదా నుతించెదన్

జంపెతాళము - కళిక - ద్విరదగతిరగడ

రామకృష్ణ మఠమ్ము
రమణ నిల్పినవాని
రామకృష్ణునకుఁ బాఁ
బ్రాణమే యగువాని
భువనేశ్వరికిఁ బున్న
ముల పంటయగువాని
భువినుద్ధరింపఁగాఁ
బుట్టి పెరిగినవాని
నుపనిషన్మర్మము
లుగ్గడించినవాని
జపతపమ్ముల రహ
స్యమ్ములెఱింగినవాని
నఖిలమతముల సత్య
మది యొక్కటనువాని
నిఖిలేశుపై దృష్టి
నిలిపి మసలినవాని

జంపెతాళము - ఉత్కళిక - ద్విరదగతిరగడ

ఎదుటఁ గాళిక నిల్చి
ముదముమీరఁగఁ బిల్చి
వరముఁ గోరుమటన్నఁ
బరమజననీ మిన్న
యా యోగసంసిద్ధి
నీయవే యశబుద్ధి
ననుచుఁ గోరినవాని
వినుత శీలమువాని. 6

తృతీయావిభక్తి - ఉత్పలమాల

ఆయువు గల్గినప్పుడె ర
యమ్మున జీవుఁడు పారలౌకిక
శ్రేయముగూర్చియో జనులు
సేయుట లెస్సగుఁ, గాలమేఁగినన్
జేయునదేమి? యట్లగుట
శీఘ్రముపాదము లాశ్రయించి సం
శ్రేయపథంబెఱుంగుదము
శ్రీమహితాత్మునిచేత స్వామిచే. 7

రూపకతాళము - కళిక - తురగవల్గనరగడ

మఱియు విశ్వమంగళమ్ము
మదిఁదలంచువానిచేత
భరతభూమి పేరువిన్నఁ
బరవశించువానిచేత
భయదవృషభజృంభణమ్ము
వాపినట్టి వీరుచేత
భయమునకు భయమ్ము సెప్ప
వలఁతియైన శూరుచేత
గుండె వ్రేల్చినం గల
గుండువడని ధీరుచేతఁ
గండబలము గుండెబలము
గలిగినదుముదారుచేతఁ
ప్రగతిపథము నాశ్రయించి
పయనించెడి స్వామిచేత
జగతి నూపివైచినట్టి,
చండతరుఁడు సామిచేత. 8

రూపకతాళము - ఉత్కళిక - హయప్రచారరగడ

కడకు నొక్కటుక్క కేనిఁ
గుడుప నింతకూడు లేని
చెట్టకాలమది గతించు
నట్టిదాఁక నాకునించు
కేని విరతి లేదటంచు
సానుభూతి నెడఁదనించు
కరుణాంభోరాశిచేతఁ
బరమయోగి వంద్యుచేత. 9

చతుర్థీవిభక్తి - చంపకమాల

సతతము రామకృష్ణుఁడును
శారదయున్నిజమానసాంబుజ
స్థితులయి కార్యశక్తి నుప
దేశముసేయఁ దదాజ్ఞ నెంబడిన్
మతము సముద్ధరింపఁగ స
మన్వయమార్గము నేర్పరించి సం
తతము కృషించి యొనర్చిన సు
ధామయ పావనమూర్తికై నతుల్ 10

ఏకతాళము - కళిక - హరిగతిరగడ

పసితనమందున విగ్రహానిందకుఁ
బాదిరినోర్యాయించు నతనికై
యసమాత్ముని యవతారమ్మనిజను
లతిభక్తినిబూజించు నతనికై
ఖండాంతరముల హైందవవాణికి
ఖ్యాతిగడించిన విజ్ఞునికొఱకై
శాండిల్యాదుల తత్త్వవిచారము
జగతికిఁజాటినతజ్ఞునికొఱకై
దీనజనుల పరిరక్షణకోసము
దీక్షవహించునుదారుని కొఱకై
నానాత్వమునం దైక్యదర్శనము
నందిన యామహనీయుని కొఱకై
యాధునిక విధానమునశాస్త్రముల
కర్థముచెప్పిన యాతనికొఱకై
సాధనపథమున సమన్వయమ్మును
సాధించిన యోగీంద్రుని కొఱకై 11

ఏకతాళము - ఉత్కళిక - మధురగతిరగడ

నలువది కోటుల భారతీయులకు
నలువది యాదీర్ఘశతాబ్దములకుఁ
జాలిన కార్యము నొక్కఁడయ్యును
హేలగ నలువది శరత్తులయ్యును
నిండకమునుపే తా సాధించిన
రెండవ శంకరుఁడని నుతిగాంచిన
దీక్షాదక్షుండైనవానికై
శిక్షిత సకలకలుష సంఘునకై. 12

పంచమీవిభక్తి - మత్తేభము

అకటా రాతిరియుం దివమ్మనక ని
ద్రాహారముల్ లక్ష్యపె
ట్టక, యొక్కమ్మడి నుక్కగుండె కలవాఁ
డై నాఁడు పోరాడియ
ట్లుకడున్ గ్లేశములోర్చు స్వామివలనన్
లోకాన నీనాఁడు దా
నొక హిందూమతమంచు నిల్చినది,
యోహో మాకు సంభావ్యమై. 13

జంపెతాళము - కళిక - ద్విరదగతిరగడ

భవదుర్గమాటవీ
పటుకుఠారునివలన
స్తవనీయవిమల కవి
తావిశారదు వలన
నతులనీయుఁడగు వే
దాంత కేసరివలన
నతిరమ్యమా సచ్చి
దానంద నిధువలన

స్వాత్మ సాక్షాత్కార
మదిగాంచు ఘనువలన
నాత్మవిశ్వాసియై
యలరు ధీరునివలన
విమలవాఙ్నేతృతా
విఖ్యాతయశువలనఁ
గమనీయ దివ్యవిగ్రహ
విరాజితు వలన 14

జంపెతాళము - ఉత్కళిక - ద్విరదగతిరగడ

పరమ శ్రద్ధను బాప
భరము జగతికిఁ బాపఁ
దలఁచి నిష్కామకృషి
సలుపు ప్రాచీన ఋషి
సత్తములకుం బోని
యుత్తముండగు వాని
వలనఁ జన్మయు వలన
సులభగమ్యుని వలన. 15

షష్ఠీవిభక్తి - ఉత్పలమాల

అంచితమైన నాదుహృద
యాంబురుహమ్మును భక్తితో సమ
ర్పించి తదీయదివ్యపద
పీఠికడన్ బ్రణతుల్ ఘటించెదన్
గాంచనశైల ధీరునకుఁ
గారణజన్ముఁడటంచు నెల్లెడన్
మించిన కీర్తి నొప్పెడు స
మిద్ధ చరిత్రున కెల్లవేళలన్. 16

రూపకతాళము - కళిక - తురగవల్గనరగడ

చిన్నతనమునందె ధ్యాన
సిద్ధిగన్న మహాత్మునకుఁ
దెన్నుఁజూపి జనులఁ దీర్చి
దిద్దినట్టి సజ్జనునకు
నామరణ బ్రహ్మచర్య
మవలంబించిన వానికి
నామ రహితు నామమొండె
నాకు శరణమనువానికి
భ్రాతృశిష్యసంఘమనః
పద్మబాల భాస్కరునకు
నేతృత్వము పూని వారి
నిలిపినట్టి యాఘనునకు
నొకవిలయమునాఁటి ఝంఝ
యోయన విసరినయతనికి
సకలధరాపాల ప్రణుత
చరణయుగళ జలేజునికి 17

రూపకతాళము - ఉత్కళిక - హయప్రచారరగడ

† దుందుభిని జనించి విజయ
దుందుభిని జగమ్మున రయ
మునను మెఱయఁజేసి హెచ్చి
జనుల యెడఁదలందుఁ జొచ్చి
ప్రాఁతక్రొత్తలకును మేలి
సేతువుగా జగతిఁగ్రాలి
నట్టి విమల విజ్ఞానికి
గట్టి గుండెగల వానికి. 18

సప్తమీవిభక్తి - మత్తేభము

భగవంతుండను దివ్యతేజమును ద
త్ప్రాప్త్యర్థ్యమీరెండె యీ
జగతిన్నేనభిమానమున్నిలుపు న
స్మద్రాజకీయమ్ములం
చుగళమ్మెత్తి వచించినట్టి ఘనునం
దున్ స్వామియందున్ సదా
నెగడున్ మామక భక్తియుక్తులనకే
నేత్రమ్ముగ్గు సూపించెదన్. 19

† దుందుభినామసంవత్సరమున స్వామిజనించెను.

రూపకతాళము - కళిక - తురగవల్గనరగడ

ఉక్కుస్వామియనుచు ఘనత
నొందివెలయు ధీరునందు
దిక్కటాహముగలించిన
దివ్యయశస్సహితు నందుఁ
గార్కొనియిల్లఁగని సమాధి
గాంచిన మహనీయునందుఁ
గర్మఠులగు సన్న్యాసులఁ
గావించిన స్వామియందు
గిరి నిర్ఝరమట్లు పొంగి
క్రేళ్లురికెడు మూర్తియందు
ధరఁ బ్రౌవృడ్జలద గర్జి
తములునెఱపు యోగియందు
నాకంధి విధమ్మున న
త్యంతము గంభీరునందు
నాకసమ్ము వోలె నూహ
కందని యవ్యక్తునందు 20

రూపకతాళము - ఉత్కళిక - హయప్రచారరగడ

వర్గకలహములను ద్రేపి
స్వర్గసుఖములెల్ల మాపి
జాతియందనైక్యము నవి
నీతి పామకొల్పకుఁడవి
తొలఁగఁ గృషి యొనర్పవలయుఁ
గలిసి శ్రమింపంగవలయు
నన్ననీతి వేత్తయందు
సన్నుతాంఘ్రి పద్మునందు. 21

సంబోధన ప్రథమావిభక్తి - శార్దూలము

ఏనాఁడో ఋషులుండిరంచు వినుటాం
డే కాని వారెట్టి వా
రో నాయూహలనందలేనయితి, నో
హోస్వామి, నిన్జూచి య
న్నా! నేఁడూహయొనర్చి వారల మహో
వ్యక్తిత్వముఁ, శ్రీవివే
కానందా, మహనీయమూర్తి, గురుదే
వా, యిత్తుఁ బుష్పాంజలుల్. 22

త్రిపుటతాళము - కళిక - వృషభగతిరగడ

స్పర్శచే గురుదత్తమై చను
జ్ఞానభక్త్యాదికధనుండా,
దర్శనమ్ములయందు శక్తిని
దరిసి భాషించినఘనుండా,
శిష్యులకును సమాధిపద్ధతి
చిత్తములరఁగఁ దెలుపువాఁడా,
భాష్యకారులకన్న మిన్నగ
భక్తితత్త్వము పలుకువాఁడా,
ప్రకటితాఖిల దీనసుక్షే
త్రములపాలిటి యంబుదమ్మా,
సకల హైందవ ప్రజామానస
చంచరీక జలేరుహమ్మా,
సాంఘికాభ్యుదయమ్ము కొఱకై
శ్రమల కోర్చిన కర్మవీరా,
సంఘటిత జాతికిఁ బునాదులు
సంఘటించిన ధర్మవీరా. 23

త్రిపుటతాళము - ఉత్కళిక - హరిణగతరగడ

అనుపమమ్మగు భక్తియుక్తులఁ
దనదు ప్రియవరుల శక్తుల
నెల్లలోకము లెఱుఁగఁ జాటిన
యెల్ల హృద్వీణలను మీటిన
స్వామి, సత్సన్నుత చరిత్రా,
రామకృష్ణ ప్రీతిపాత్రా,
ధన్యజీవీ, మాననీయా,
నాన్యతో దర్శిత సుకాయా! 24

సార్వవిభక్తికము - ఉత్పలమాల
నీవు మహానుభావుఁడవు
నిన్ను సదామది నెన్నువాఁడ నీ
చే వెలుఁగుల్ లభించినవి
చేతులు మోడ్చెద భక్తి నీకునై
నీవలనన్ గృతార్థుఁడను
నీకు నమస్కృతి నీపదమ్ములం
దే విలసిల్లు భక్తివసు
ధేశ్వరపూజిత పాదపంకజా. 25

అంకితాంకము - సీసము
శ్రీరామదివ్యచరిత మానసాది స
త్కావ్యనిర్మాణైక కర్మఠుండు
పాటిలువంశాబ్ధి పార్వణచంద్రుఁడం
కంపల్ల్యభిజనుండు ఖ్యాతుఁడైన
గోవిందరెడ్డికిఁ గూరిమితనయుఁడు
పుట్టమాంబాగర్భ పుణ్యఫలము
భారతీయతకునై ప్రాణమిచ్చెడువాఁడు
పరతత్త్వ జిజ్ఞాసు ప్రథముఁగన్నఁ

డైనవాఁడు లిమ్మారెడ్డి యభిధవాఁడు
స్వామి శ్రీవివేకానంద చరణములకు
సంకితముగ శతతను జయంతివాఁడు
భక్తియుక్తి నీచిఱుతకబ్బము రచించె. 26

# శ్రీ వివేకానందస్వామి - దేశాభ్యుదయము

బ్రహ్మచారిణీ లలిత

శ్రీవివేకానందస్వామి జన్మించి ఒక శతాబ్దము పూర్తియైనది. భారతదేశమందే కాక విదేశములందుకూడ స్వామివారి శతతమ జయంతి ఉత్సవములు కడువైభవముగ జరుప నిశ్చయించిరి. కాని ప్రస్తుతము చీనాదేశపు దాడివలన ఊరేగింపులు, వినోదప్రదర్శనములు, వస్త్రప్రదర్శనశాలలు మున్నగువానికై ధనము వ్యయించుట ఉచితము కాదని రామకృష్ణమిషన్ వారు శ్రీ వివేకానందశతతమ జయంత్యుత్సవప్రణాళికనుండి వానిని రద్దుచేసిరి. దేశము కష్టదశలో నున్నది. వేనకువేలు సోదరులు స్వదేశమునకై యుద్ధమున తమ భౌతికదేహము లర్పించి వీరస్వర్గము నలంకరించుచున్నారు. అంతఃకలహముల నెల్లమఱచి దేశము ఒక్కటియై శత్రుసేనల పాఱద్రోలుటకై నడుముకట్టినది. 'నిద్రాణమైయున్న మన భారతాంబ మేల్కొంచుచున్నది!......ఆమె నెవ్వరు ఇక ప్రతిఘటింపజాలరు, ఆమె మరల నిద్రపోదు; ఏ బాహ్యశక్తియు ఆమె నిక నిరోధింపజాలదు. అదుగో అఖండభారతవర్షము విజృంభించుచున్నది.' అని స్వామిజీ వచించిన పల్కులు యథార్థములైనవి. భారతమాతా, నీకు జయము సుగాత! నీబిడ్డలు నిన్ను మరల దాస్యశృంఖలకు బద్ధురాలిని చేయకుండుటకు గాను దృఢప్రతిజ్ఞ పూనియున్నారు. స్వతంత్ర భారతదేశ ఖ్యాతి నలుపైపుల ప్రసరించుచున్నది. తమ స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటయే కాక ప్రపంచమునకు మార్గదర్శకమై నిలువవలెను, భారతజాతి. బాహ్యోన్నతి వైపునకే కాక ఆత్మవికాసమువైపునకు కూడ

మనము దృష్టిని మరలింపవలెను. అపుడే మనకు సంపూర్ణవిజయము చేకూరగలదు. ప్రస్తుతము వివేకానందుని వాఙ్మయము సాహిత్యము ఎక్కువగ ప్రచారముచేయవలసిన అదను వచ్చినది. ఈశతతమజయంతిసందర్భమున పట్టణములందే కాక, వాడలయందును, పల్లెలయందును ఇంటింటికిని శ్రీస్వామివారి దివ్యవాణిని అందజేసి, భారతజాతికి ఆధ్యాత్మికముగను, మానసికముగను, ఆర్థికముగను నైతికముగను ఏవిధముగనైనను బలహీనత చెందనీయక నూతనధైర్యోత్సాహముల కలుగజేయవలెను. శ్రీవివేకానందుడు కేవలము సన్న్యాసియే కాదు, అసమాన ప్రతిభాసంపన్నుడు, త్రికాలజ్ఞాని, నవీనభారతహృదయమున ఆశాజ్యోతిని వెల్గించిన యతిపుంగవుడు. తనదృష్టిని నలువైపుల ప్రసరింపజేసి భారతజాతికే కాక విశ్వమంతటికిని అభివృద్ధిమార్గముల చూపెను. నేడు మనము ఎదుర్కొనవలసిన సమస్యల కన్నింటికిని సమాధానములు వివేకానందవాఙ్మయమున కానవచ్చుచున్నవి. అందుచేతనే శ్రీవివేకానందస్వామి శతతమజయంతిస్మారకముగ, వారి రచనలు, లేఖలు, ఉపన్యాసములు, సంభాషణల నన్నింటిని దేశభాషలలో అనువదించుచున్నారు. ఆబాలవృద్ధము, స్త్రీపురుష విచక్షణలేక చదువువచ్చినవారెల్లరును శ్రీవివేకానంద సంపూర్ణగ్రంథావళిని సమగ్రముగ చదివి సక్రమముగ అర్థముచేసికొని, వానిని ఆచరణలో పెట్టుటకు ప్రయత్నింపవలెను. అంతటితో ఆగక వానిని సామాన్యప్రజలకు బోధింపవలెను.

స్వామి వివేకానందుని మత మేమి? ఆయన నూతనమతమును స్థాపించెనా ఏమి అని కొంద అనుకొనవచ్చును, హిందూశ్రుతిస్మృతులలో తెల్పినవాక్యములనే ఆయన తిరుగవల్లించిరే కాని, నూతనవిషయమేమియు బోధించుటకు రాలేదు. పందొమ్మిదవశతాబ్దాంతమున భారతజాతి శారీరక, మానసిక, ఆర్థిక, నైతికబలముల నెల్ల కోల్పోయి చాల హీనస్థితికి వచ్చియుండెను. అట్టితరుణమున శ్రీవివేకానందస్వామి జన్మించి ఆధునిక భారతసమాజమునకు అరటిపండు ఒలిచి చేతబెట్టినట్లుగ గీత, ఉపనిషత్ వాక్యములనెల్ల సులభశైలిలో ఎల్లరకును అర్థమగునట్లుచెప్పి, ప్రజలలో నూతనోత్సాహమును మేల్కొల్పెను. వారిట్లు పల్కిరి : 'భారతజాతీయాదర్శము, భగవద్భక్తిసంజనితమగు త్యాగమునే లక్ష్యముగానిడుకొని సింహబలసాహసములతో దూషణాద్యతీతులై, కర్మఫలకాంక్షను విసర్జించి, కార్యరంగమును వరింపుడు. హనుమన్మహావీరుడే మీకు ఆదర్శపురుషుడు. జితేంద్రియచక్రవర్తియు, అద్వితీయ ధీశాలియునగు నాతడు రామనామమందలి యఖండభక్తితో ప్రాణభీతిని విడనాడి, యొక్కదుముకులో సాగరము నెట్లు లంఘించెనో చూడుడు! అత డెట్టి భగవత్సేవకుడో! ఆదర్శమూర్తియో! తన యఖండబాహుబలముచే, అద్వితీయపరాక్రమముచే, రావణుని రాక్షససైన్యములను హాహాకార మెత్తింప కల్గిన మహావీరు డాతడు. మఱియొకవైపున రామపదపంకజార్చకులలో నద్వితీయుడు నాతడే. అట్టినిశ్చంచలభక్తియే దేశమునకిపుడు ఆవశ్యకము.'

శారీరక, మానసికార్థిక, నైతికబలములు సమకూర్పనిదే భారతజాతి పునరుద్ధరణ కాజాల దని స్వామి స్పష్టముగ పల్కెను. 'నా మత సారము బలము (శారీరక మానసికాధ్యాత్మిక బలము) గీతోపనిషద్భాగవతధర్మములలో నేది

యైనను కానిండు, మనః స్థైర్యము నాత్మతేజము కల్గింపని ధర్మమును, నేనుధర్మముగా పరిగణింపను. ధర్మ మనగా బలము, శ బలమును మించిన దేదియు లేదు. స్వామిజీ హిందువులకు ముఖ్యముగ శారీరబలము సంపాదించుకొనుట ప్రథమకర్తవ్య మని బోధించిరి. శరీరదౌర్బల్యమే మనదుఃఖముల కన్నింటికిని కారణము. శరీరదుర్బలతవలననే మనము చిన్నవిషయమునకు భయపడుదుము, ఇతరులను చూచి జంకుదుము. ఏపని చేయుటకును ముందుకురాము. 'సమస్తపాపములును సమస్తదోషములును, నొక్కమాటలో—దౌర్బల్యమనెడి యీయొక్కమాటలో—నిమిడియున్నవని గ్రహింపుము. దౌర్బల్యమే పాపకృత్యములకు ప్రేరణశక్తి. దౌర్బల్యమే స్వార్థపరత్వమునకు మూలము......శారీరకముగా కాని, మానసికముగా కాని, యాధ్యాత్మికముగా గాని మిమ్ముల బలహీనుల చేయునదేదియైనను దానిని విషమువలె విసర్జింపుడు; దానిలో ప్రాణము లేదు, అది సత్యము కాజాలదు—ఇదియే సత్యత్వనిదర్శనము. సత్యము బలదాయకము. సత్యమే నైర్మల్యము, సత్యమే సర్వజ్ఞత్వము! సత్యమేబలదాయకమై, వికాసహేతువై, శక్తిసామర్థ్యప్రదాయకమై యుండవలయును.'

మానవునకు తగినంత శరీరబలము లేనిదే దేశమునకు గాని, సమాజమునకు కాని, కడకు తనకుటుంబమునకు గాని ఏలాటి సహాయము చేయజాలడు. అంతియే కాక అత డున్నత విషయములనుగూర్చి చింతింపజాలడు. సర్వదా తనదేహముగూర్చియే చింత. ఆధ్యాత్మిక విషయములగాని, వైజ్ఞానికవిషయములగూర్చి కాని చింతింపజాలడు. అట్టివాని కిక సంస్కృతి అనునది ఎచ్చటినుండి వచ్చును? అందుచేతనే స్వామిజీ ఇట్లు పల్కిరి : 'మొట్టమొదట మన యువకులు బలీయులై యుండవలయును; మతము ధర్మము—దాని తరువాతి మాట... మఱి కొంచెము దృఢమైన కండరములమూలమున గీతను నీవు మఱింత చక్కగా గ్రహింపగలుగుదువు. నీలో మఱికొంచెము బలకరమైన రక్తము మూలమున శ్రీకృష్ణుని మహాప్రతిభను, మహాబలమును మఱింత బాగుగా గ్రహింపగలవు.' నీశరీరము నీకాళ్ళపై సుస్థిరముగ నిలువ, నీవు మానవుడ నని గ్రహింపగల్గినపుడు ఉపనిషత్తులను, ఆత్మవైభవమును మఱింత బాగుగా గ్రహింపగలవు.' ఈబలమును గూర్చి స్వామిజీ నూతనముగ సృష్టింపలేదు. ''నాయ మాత్మా బలహీనేనలభ్యః'' అని ఉపనిషత్తులు ఘంటాపథముగ ఘోషించుచున్నవి. ''శరీర మాద్యం ఖలు ధర్మసాధనం'' అధ్యాత్మికసాధనలకు శరీరబలము మొట్టమొదట ఆవశ్యక మని స్మృతులుపల్కుచున్నవి. కాన ధర్మార్థకామమోక్షములలో ఏదేని పొంద వలెనన్నచో మొదట శరీరసౌష్ఠవ మావశ్యకము, బలమే భవరోగముల కెల్ల ఔషధము, బలవంతుడు త్వరగా కామక్రోధాదులకు వశుడుకాడు. బలహీనుడు ఇహమునకుగాని పరమునకుగాని కొఱగాడు. కావున స్వామిజీ నవీనయువకులకు నవీనశైలిలో ఇట్లు బోధించిరి.

'...ఇనుప కండరములు, ఉక్కునరములు, తదనంతరము వజ్రాయుధతుల్యమగు మనస్సు—నాయనలారా! ఇవియే మనకు వలయునవి.'

'...మొట్టమొదట శరీరబలము నార్జించుకొను డని నేను మీకు బోధించుచున్నాను. ఉట్టికెగుర లేని యమ్మ స్వర్గమునకు ఎగుర బోయె నట! బలోపేతులై యున్నచో మన

స్సును నిగ్రహించుటకు మరెంత మీరు సమర్థులై యుందురు'...మనోనిగ్రహము చేసూరినంతనే, సంపూర్ణముగా మనస్సు మీకు వశమైనంతనే, శరీరము బలిష్ఠముగా నున్నను లేకున్నను మీరు గమనింప నక్కర లేదు. మనశ్శరీరములు మీ కపుడు జోహారు లొనర్చును.'

శారీరక బలముతోపాటు ఆర్థికబలమును కూడ సంపాదించుకొనవలెనని స్వామిజీ పెక్కుమార్లు పల్కిరి. మన దేశమును దరిద్రదేవత పెక్కు సంవత్సరములుగ బాధించుచున్నది. దారిద్ర్యము మూలముననే అనారోగ్యము హెచ్చెను, విద్య అడుగంటెను విద్య లేని వాడు వింతపశువు' అన్నట్లుగ మన దేశస్థులు వింతపశువులుగ తయారైరి. సమస్త భారత దేశమును కాలినడకన పర్యటించి మన దేశస్థుల అజ్ఞానమును, దరిద్రతను చూచి స్వామిజీ హృదయము ద్రవించిపోయెను. దేశవాసుల దుఃఖమును ఆపు టెట్లో యని స్వామి పరితపించెను. పేదలకై ఏదేని సేవ చేయ కల్గు ఉపాయమునకై మన దేశములోని ధనికుల కడకు వెళ్ళెను. వారు స్వామిజీసలహాల పెడ చెవినిపెట్టిరి. అటుపై స్వామి ఆర్థికసాహాయ్యార్థమై పశ్చిమఖండములకు వెళ్ళి – అచటినుండి చాలినంత ధనము సంపాదించి శ్రీరామకృష్ణ సేవాసంఘముస్థాపించెను. నేడు దేశములో పెక్కుచోట్ల ఈసంఘోపశాఖలు ఏర్పడినవి. ఈసంఘము ప్రజల కష్టముల బాపుటకు సర్వవిధముల పాటుపడుచున్నది. ముముక్షువులకు జ్ఞానదానము, విద్యార్థులకు విద్యాదానము, రోగులకు ఉచితచికిత్స – క్షుధార్తులకు అన్నదానము ఇంకను పలుసేవలు చేయుచున్నది. ఆకటి బాధతో ఉన్న వానికి మతబోధకావించుట వెఱ్ఱితన మని స్వామి బోధించెను. వట్టి కడుపులకు మతము అంటదు, వా రిట్లనిరి: 'మొదట అన్నము అటుపై మతము...అన్నమో రామచంద్రా! యని పలవించునార్తులకు మతబోధ, లెందులకు? వలయునది అన్నము.' మన దేశదరిద్రుల అగచాట్లకు స్వామిజీ పెక్కుమార్లు విలపించిరి. పాశ్చాత్యదేశములలోని ప్రజల సిరిసంపదల చూచినపుడు మన దేశస్థులు ఒక్కపట్టెడన్నమునకై వాపోవు సంఘటనలు జ్ఞప్తికి వచ్చి స్వామి వెక్కివెక్కి ఏడ్చెను. స్వామి ఇట్లు పల్కెను: 'అనాథల కన్నీటిని ఆపజాలని — వారల కడుపు జిచ్చు చల్లార్ప పట్టెడన్నము పెట్టజాలని మత మనినను, దేవుడన్నను నాకు నమ్మకము లేదు. ఎంత గొప్ప సిద్ధాంతములను ప్రకటించినను, ఎంతబ్రహ్మాండమైన వేదాంతమును చాటినను, పుస్తకములను సిద్ధాంతములను అంటిపట్టుకొనియుండు ధర్మమును నేను ధర్మ మన జాలను....మా మతధర్మము లని చెప్పుకొని మీరు గర్వించునట్టి వానిని ఆచరణలో చూపుడు, ముందంజ వేయుడు!'

అన్ని దానములలో నన్నదానము గొప్పది అన్నారు పెద్దలు. తిండి లేక మలమలమాడుచు ఆకలో అని తనవాకిటికి వచ్చిన వానికి పట్టెడన్నము పెట్టగల్గినవాడే శుష్కముగు జపతపములు చేసిన వానికన్న కోటిరెట్లు ఘనుడు. స్వామిజీ ఇట్లు పల్కెను: 'అభ్యుదయమునొంద వలయు నినిన, మీకర్మకలాపములను గంగలో కలిపి, సజీవదైవమును మానవదైవమును — ప్రతిమానవరూపుని—విశ్వమునవే కాక, ప్రతి వ్యక్తియందును వెలయు భగవంతు— నారాధింపుము. భగవంతుని విశ్వరూపమే యీ ప్రపంచము.' పేదలపట్ల నిరసనభావమును ఏనాడు మనము చూప ఆరంభించితిమో

ఆనాటినుండియే మనదేశపతనము ఆరంభించెను. ప్రాచీనకాలమునుండియు దానధర్మములకు ప్రసిద్ధి కెక్కిన మనదేశమునకు ఇట్టి నీచస్థితి గల్గుట వాస్తవముగ శోచనీయమగు విషయమే. స్వామిజీ వాక్కుల పరిశీలింపుడు: 'జనసామాన్యమును అలక్ష్యముచేయుటయే మనసాంఘికమహాపాతకము. మనపతనమునకిది యొక గొప్ప కారణము. భారతజనసామాన్యమునకు మరల చక్కని విద్యగఱపి, అన్నపానముల సమకూర్చి సంరక్షించిననేకాని ఎన్ని శ్రీరంగనీతులు చెప్పినను, ఎంతరాజకీయాందోళనముచేసినను లాభము లేదు.'

పేదఱికముతోపాటు నిరక్షరత హిందూసమాజమును మఱింత బలహీనపఱచెను. అందుచే స్వామిజీ హిందువులను విద్య నేర్చి బుద్ధిబలమును కూడ వృద్ధిచేసికొనవలె నని కోరెను. విద్యలేనిచే రాజనీతి, సాంఘికవ్యవస్థలుకూడ చక్కబడజాలవు.

'ఉజ్జీవనకరము, ధైర్యవీర్యజనకము, శీలనిర్మాణసమర్థమునగు భావముల గ్రహించుటయే విద్య.'

'దేనివలన శీల మేర్పడునో, మనోబల మభివృద్ధిచెందునో, బుద్ధి వికసించునో, స్వశక్తిపై నిలుచుటకు మానవు నెయ్యది సమర్థుని చేయునో, అట్టి విద్యయే మనకు కావలయును.'

ఏవో కొన్నిపుస్తకములు బట్టిపట్టి ఒకడిగ్రీ పొందినంతనే విద్వ కాజాల దని స్వామిః పల్కువారు. 'మానవునిలో అంతర్హితమై యున్న దివ్యశక్తిని ప్రకటించునదియే విద్య.'

'ప్రతివ్యక్తిలోను పరిపూర్ణత స్వతస్సిద్ధముగనే కలదు. తత్ప్రకటనయే విద్య.' విద్యవలననే మానవత్వము చేకూఱును. చదువువలననే తమసొంతకాళ్ళపై తాము నిలువబడగల్గు శక్తి ఏర్పడవలెను. 'కేవల పుస్తకపాండిత్యమువలన ప్రయోజనము లేదు. దేనిచే శీలమేర్పడునో, మనోబలము అభివృద్ధియగునో, ధీవికాసము కలుగునో, ఏది మనలను స్వశక్తిపై నిల్చుధీరుల నొనర్చునో — అట్టి విద్య మనకు కావలయును.... అట్టి విద్యావిధానమువలన స్త్రీలు తమసమస్యల నన్నింటిని తామే పరిష్కరించుకొనగలరు......స్త్రీలు ధైర్యస్థైర్యములను, ఆత్మసంరక్షణమును అలవఱచుకొనవలయును. నేడు ఇది యెంతయో ఆవశ్యకమైయున్నది.…మతము, లలితకళలు, శాస్త్రము, గృహపరిపాలనము, పాకకళ, కుట్టుపని, ఆరోగ్యశాస్త్రము. వీనిలోని ముఖ్యవిషయములను మన స్త్రీలకు బోధింపవలయును. వారలను నవలలను చదువనిచ్చుట మంచిది కాదు. ......సీత సావిత్రి, దమయంతి, లీలావతి, ఖానా, మీరాబాయి మున్నగువారల సచ్చరిత్రములు వారల హృత్పీఠము నలంకరింపవలయును.......అంతియే కాక ఐహికపరిస్థితుల అభివృద్ధికై వినియోగించు పారిశ్రామిక విద్యల నెల్ల పాశ్చాత్యులవద్దనుండి నేర్చుకొని, మతసంబంధమైన విద్యను పాశ్చాత్యులకు ఈయవలసినదిగా స్వామిజీ కోరెను. పశ్చిమఖండవాసులు భౌతిక విజ్ఞానమున ఎంతయో ముందుకు సాగుచున్నారు. మనము కడుశ్రద్ధతో వారలవద్ద నుండి నేర్చుకొనవలెను, వారలతో సంబంధముంచుకొనవలెను.

'ప్రపంచముతో—భారతదేశము వెలుపలనున్న ప్రపంచముతో — సంబంధము వీడి మనము మనజాలము. మనగల మనుకొనుట మన బుద్ధిహీనత..........విశాల కూపములనుండి

వెలువడి ప్రపంచజాతులనడుమ ఎంతసంచరించిన — మీకును — దేశమునకును గూడ— అంత మంచిది.' ఈవిధముగ 'ఇహమున సుఖింప హేమవిద్యను, పరమున సుఖింప బ్రహ్మవిద్యను—' ఈ రెంటిని నేర్చుకొనవలసినదని స్వామిజీ మనలను కోరెను.

వీనిఅన్నింటికన్న స్వామిజీ ఎక్కువగా కోరినది ఆత్మబలము. శారీరక, ఆర్థిక, బుద్ధిబలములకన్న సర్వోత్కృష్టమైనది ఆత్మబలము. మిగతబలము లన్నియు ఈ ఆత్మబలమును సంపాదించుటకు తోడ్పడవలెను. హిందూదేశము ఇంతటిక్షీణదశకు వచ్చుటకు ముఖ్యకారణము మన వేదాంతమతమును మఱచుటయే. సర్వవ్యాపియగు ఆత్మ ప్రతిమానవునిలో ప్రకాశించుచున్న దనియు, ఆఆత్మను తెలిసికొనుటకు ఎల్లరకును హక్కు కల దనియు వేదాంతమతము తెల్పుచున్నది. కొందఱు పాశ్చాత్యనాగరికతాలోలురగు హిందువులు వేదాంతమును పనికిమాలిన విద్యగా పరిగణింతురు. వేదాంతమును వారు సక్రమముగ అర్థముచేసికొనకుండుటయే ఇందులకు కారణము. నిజముగ వేదాంత మొక్కటియే నిర్భయునిగను, బలవంతునిగను చేయును. వేదాంతి కానోరు వానిని చూచి ముందుగ పిఱికితనము పారిపోవును. నిజమగు వేదాంతి సుఖదుఃఖములకతీతుడు. దుఃఖములే కదా మానవుని అధఃపాతాళమునకుచేర్చునవి? వేదాంతబలము కూర్చుకొనినచో మానవుడు దుఃఖముల నోర్చుకొని ముందునకు సాగును. మానవుడనగ దేహము కాదు, మనస్సు కాదు; ఆత్మ —దీనిని అస్త్రములు ఛేదింపజాలవు, అగ్ని కాల్పజాలదు; వాయువు శోషింపజాలదు.— ఆత్మ అనంతము, సర్వవ్యాపి, సర్వకాలసర్వావస్థలయందు శాశ్వతముగ నుండునది—అదియే సచ్చిదానందస్వరూపము. ఈఆనందము ఒక్కబొట్టు అనుభవించినచో ప్రాపంచిక విషయానందము తుచ్ఛముగ తోచును. హిందువులు యథాతథముగ తమ మతమును తెలిసికొన్నచో ఈఆత్మశక్తిప్రభావమును అర్థము చేసికొనగలరు. ఉపనిషత్తులలో ఈ వేదాంతమతమును ఆత్మతత్త్వమును గూర్చి చక్కగ తెలుపబడినది.అందుచేతనే స్వామిజీ సామాన్యప్రజలకు ఈఉపనిషన్మతమునుగూర్చి బోధించి, ఆత్మబలోపేతుల నొనర్పగోరెను. ఇంతవఱకు ఏకొద్దిపాటి బ్రాహ్మణులవద్దను పండితులవద్దను భద్రపఱచియుంచినట్టి ఈమతమును ఇంటింటికి కొనిపోయి ప్రచారముకావింపగోరెను.

'వేదాంతము నొకమతముగా—ధర్మముగా —గైకొనిచూచినచో, అత్యంతానుష్ఠానయోగ్యమై యుండవలయును. సర్వావస్థలయందును మనము అది ఆచరింపదగినదిగా నుండవలయును. అంతమాత్రమే కాదు, వ్యవహారమునకును పరమార్థమునకును గల ప్రకృతివైషమ్యము తొలగి పోవలయును; ఏలన వేదాంత మేకత్వమును బోధించును — సర్వవిషయములందును జీవ మభిన్నముగ నుండవలయు నని శాసించును. మతాదర్శములు జీవనరంగమునం దంతటను సంపూర్ణవ్యాప్తి గలవై, మనభావములన్నింటియందును జొచ్చి విశేషముగా అనుష్ఠానములోనికి రావలయును.' ఈవేదాంతమును అత్యంత సహజభాషలో బోధించి, నిత్యజీవనమునకు తోడ్పడ జేయవలయుననియే స్వామిజీవాంఛ. పసిబాలురు సహితము అర్థముచేసికొనగల్గునట్లుగ ప్రజలకు తెలుపవలెను.

'ఆత్మవిశ్వాసమును కోల్పోయి అచలమై, నిద్రాణమై యున్న భారతదేశమును మేల్కొల్పుటయే ఇపుడు నా ఏకైక వాంఛ.' జీవితములో ఈ అద్వైతవేదాంతప్రయోగ మెట్లు కావించుకొనవలయునో స్వామిజీగ్రంథములలో కానవగును.

ఇంతటితో ఆగక దేశాభ్యుదయమునకై స్వామిజీ ఇంకను కొన్ని మార్గముల సూచించెను. వానిలో త్యాగము — సేవ ఇవి ముఖ్యమైనవి. మహాత్యాగమువలననే మహాకార్యములు సిద్ధించును కదా! సమదర్శనమున కవసరమగుచో సమస్తము త్యజింపవలయును. స్వామిజీ పల్కుల నాలకింపుడు —

'వలయునది త్యాగము- అదిలేనిదే పరహితార్థమై ఎవ్వరును మనఃపూర్వకముగా పాటుపడజాలరు. త్యాగి ఎల్లరను సమదృష్టితో జూచును— లోకమున సదా దాతవై వర్తింపుము. అన్నిటి నిచ్చివేయుము, ప్రతిఫలము నాశింపకుము. ప్రేమను, సాయమును, సేవను నీచేతనైన యేయల్పవస్తువునైనను నొసగుము. కాని కోమటిబేరపు దృష్టితో మాత్రమువలదు. ఏషరతులను విధింపకుము, అపు డెవ్వరును వంచితులు గారు. భగవానుడు మన కొసగునటులే ఔదార్యముతో నిచ్చివేయుదుముగాక!'

'త్యాగము సేవ. ఇవియే మహోత్తమాదర్శము లని భారతీయులు గుర్తింపవలయును.

'ప్రతిపురుషుని, స్త్రీని, ప్రతివ్యక్తిని సాక్షాద్భగవత్స్వరూపముగా గనుము. నీ వెవ్వరికి నుపకారము చేయజాలవు— కేవలము సేవింపగలవు—అంతియే. నీ కధికార మున్నచో పరమేశ్వరసంతానమును సేవింపుము... మానవశరీరమున మానవాత్మయే మనకర్పనీయుడైన భగవంతుడు.'

దేశాభ్యుదయమునకై స్వామి వివేకానందుని ఈసింహగర్జన పిలుపు ఆలకించిన ఉన్నతి నందగలము:

'వత్సలారా, ధీరోదారులారా, సహృదయులారా, ఉజ్జ్వలదీక్షాదక్షులు కండీ, ఆశయసాఫల్యమునకు గాను కృషిచేయుడీ, కార్యక్రమము కొనసాగింపుడీ! పేద ప్రతిష్ఠలను గాని మఱియే మూర్ఖతను గాని ఆసింపకుడు. స్వార్థమును బాఱద్రోలి కార్యాంగణమున నుఱుకుడు! గడ్డిపోచలను పెంటిగా జేసినచో, వానితో మదించిన యేనుగును బంధింపవచ్చునని జ్ఞప్తి నుంచుకొనుడు. సర్వేశ్వరుడు మిమ్మందఱ ననుగ్రహించు గాక! సర్వేశ్వరశక్తి మీ యందఱియందును వెల్గొందుగాక! లెండు, మేల్కొనుడు, పరమపదప్రాప్తివఱకు ఆగవలదని వేదములు ఘోషించుచున్నవి. దీర్ఘనిశీథము పటాపంచలగుచున్నది. ప్రభాతము సమీపించుచున్నది. ఉత్సాహతరంగము బయల్వెడలినది.... వత్సలారా, ధైర్యసాహసములు! ప్రేమ — విశ్వమానవప్రేమ — విశ్వాసము ఆత్మవిశ్వాసము, ఇక భయము లేదు; భయమే మహాపాతకము'' దేశాభ్యుదయమునకు ఇంతకంటె మించిన ఉపదేశముల నెవ రీయగలరు ?

ఓం శాంతిః శాంతిః శాంతిః



# తిరస్కృతరాజాశ్రయులు - మహోజ్జ్వల సారస్వత నిర్మాతలు : బమ్మెర పోతన

విద్వాన్ శిరోమణి శ్రీ వాదారి శ్రీనివాసశర్మగారు

కట్టలు తెగి ప్రవహించెడి భక్తిరసామృత ప్రవాహమునఁ దన్మయుఁడై మునకలు వేయుచు, తద్రసానుభూతిని సాటివారల కందింపఁబూనిన శ్రీరామభక్తుఁడు బమ్మెర పోతన—అహర్నిశలు శ్రీరామపాదారవింద కీర్తనాయత్తమగు చిత్తముతో నిత్యనూతనములగు కృతులను రచియించి గానముచేసి, తద్రసానుభూతిని అందఱికిని సమానముగాఁ బంచిపెట్టఁదలచిన శ్రీరామభక్తుఁడు త్యాగరాజు — ఏడుకొండలవాని యడుగులకు మడుగులొత్తుచు శ్రీవేంకటేశ్వర దివ్యచరణసన్నిధిని భక్తిపారవశ్యముచే నప్రయత్నముగాఁ బొంగి పొరలి వచ్చెడి కీర్తనలతోఁ దిరుమలప్పని గుణగానము చేయుచు భక్తాగ్రగణ్యుఁడైన తాళ్ళపాక అన్నమయ్య— భక్తిపారవశ్యమున నెవ్వరికిని దీసిపోక, సంకల్ప పూర్వకమైన దృఢాశయము గలిగి వరదరాజకటాక్షవీక్షాపాత్రతచేఁ బ్రతివాదులకు గుండెలో గాలమైన కవితార్కికసింహులు, సర్వతంత్ర స్వతంత్రులునైన శ్రీ వేదాంతదేశికులు — భగవత్కృపకుఁ బాత్రులగుటయేగాక మహోన్నత సారస్వత నిర్మాతలునైరి. నలువురును కవితాసామ్రాజ్యమున పట్టభద్రులైన భక్త సార్వభౌములు. దక్షిణాపథమునకే వన్నెచిన్నెలు దెచ్చి తమ సారస్వతమునకుఁ బండిత పామరులలో సమాన భక్తిప్రపత్తులు రేకెత్తించిన కవిపుంగవులు. విద్వత్తు, వినయము, వైరాగ్యము, భక్తి– ఇవి నాలుగు వీరియందు మూర్తీభవించినవి. నలువురును తమ్ము వెదకికొనుచు వచ్చిన రాజాశ్రయమును కాలఁ దన్నిన మహనీయులు.

బమ్మెర పోతన ఆంధ్రవాఙ్మయమున పేరు ప్రతిష్ఠలు గడించిన మహాకవి. పూవుపుట్టగనే వాసనలు అబ్బినట్లు ఈయనకుఁ జిన్ననాడే జన్మాంతరవాసనాసంచితములైన విద్య లబ్బినవి. గీర్వాణాంధ్రము లీయనకుఁ గరతలామలకములైనవి. అంతే కాదు; వివిధ విద్వాంసుల మహోన్నత గ్రంథాశయముల నాకళించిన మనీషి యితఁడు. ఇతని ప్రతిభ ఒక్క కావ్యమార్గముననే కాదు; శాస్త్రమార్గములలోఁ గూడ సాగి గొప్ప అనుభూతులు గడించి కాకలు దీరినది. కావుననే ఇతనిది సహజము.

పోతన పుట్టిన దొక సామాన్యకుటుంబమైనను జీవితపరమార్థమును గ్రహించి, ప్రశాంత జీవనమును సాగింప నిశ్చయించుకొనిన దృఢసంకల్పుఁడు. పొలము దున్ని అందువచ్చు ఫలితముచేఁ దన జీవయాత్ర సాగించి అమూల్యకాలమును గ్రంథరచన చేయుచు గడపిన కర్మవీరుఁ డితఁడు. ఇతఁ డాంధ్రుల కొసఁగిన 'మహాభాగవతము' సారస్వతాకాశమున వెలిఁగెడు మహాద్భుత తేజోరత్నము. పోతనవంటి రససిద్ధులచే రూపొందింపఁబడిన ఈ గ్రంథము ఆంధ్రుల పాలిటిపెన్నిధి

మైనది. భాగవతములో నొక్కొక పద్యమును మధురభావఝరిని ఒలకఁబోయుచుండును. అం దలి మధురభావములకు మురిసి శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

''ముద్దులు గాగ భాగవత
 మున్ రచియించుచు పంచదారలో
 ద్దితి వేమొ గంటము మ-
 హాకవి శేఖర, మధ్య మధ్య - అ
 ట్లద్దక వట్టి గంటమున
 నట్టిటు గీచిన తాటియాకులో
 బద్దెములందు - ఈ మధుర
 భావము లెచ్చటనుండి వచ్చురా! ॥

అని పోతన పద్యమాధుర్యమును సొగసుగాఁ గీర్తించినాడు.

భాగవతమునకు అధ్యాత్మసాధనలో మిగుల ప్రాధాన్యము గలదు. భారతీయులలో దాని కున్న పలుకుబడి, మానవత్వమును ఉన్నత దృక్పథములో నడిపింపఁగల స్వత్వము మఱి యే గ్రంథమునకును లేదు. ఎందఱో భక్తులు భాగవతమును నిత్యపారాయణము చేయుచు, తాము తరించి యితరులను దరింపఁజేసినారు. భక్తిసంప్రదాయమునకు భాగవతము ఒక మూర్తిమంతమైన ఆకారము. భక్తిసామ్రాజ్య మున పట్టాభిషిక్తులగు భక్తాగ్రగణ్యుల పరమ పావనచరిత్రములు దానికి ఉదాహరణములు. అట్టి భాగవతగ్రంథము, శ్రీరామునే నమ్మి, తానుచేసెడి ప్రతికృత్యము తారకనాముని దయావిలాసమని భావించెడి పరమభక్త శిరో మణి పోతనవంటివాని చేతిలోఁబడి పునీత మైనది. తేటతెనుగు నుడికారముల నేర్చి కూర్చి, మధురాతిమధురము లగు భావముల విరజిమ్ముచు రసవత్పద్యజాలమును కుప్పించి తన జన్మను సార్థక మొనర్చుకొన్నాడు పోతన. శ్రీ జంధ్యాలవారు పోతనను పొగడుచు—

''కమ్మని తేటతెల్గు నుడి
 కారము తేరిచికూర్చి చాకచ
 క్యమ్ముగఁ గైతలల్లు మొన
 గాండ్రు కవీశ్వరు లెంతమంది లో
 కమ్మున లేరు - నీవలె నొ
 కండును భక్తిరసామృతప్రవా
 హమ్ముల కేత మెత్తిన మ
 హాకవి యేఁడీ తెలుంగుగడ్డపై!!''

భక్తిరసామృతప్రవాహమున కేత మెత్తిన సార్థకకవి యని పోతనార్యుని స్థాయి ని గుర్తించినాడు.

గ్రంథము పరమపావనమైన భాగవతము. గ్రంథకర్త పరమభక్త శిరోమణి, మహనీయ గుణగరిష్ఠుఁడగు పోతన. ఇఁక ఆగ్రంథమెచ్చట నున్ననేమి! దాని ప్రభావము నలువైపుల ప్రస రింపకపోదు. దానినిఁ బాతాళమునఁ బాతి పెట్టినను సరే, పైకిరానీయక అడ్డినను సరే— అది పొక్కి బయలుపడక పోదు. ''నహి కస్తూరికామోదః శపథేన నివార్యతే.''

ఒకనాడు పోతనకు శ్రీరామచంద్రుఁడు సాక్షాత్కరించి తన నామాంకితముగా మహా భాగవతమును దెనిగింపుమని చెప్పి దీవించి అదృశ్యుఁడైనాడు. భగవదాజ్ఞను శిరసా వహించి పోతన—

''పలికెడిది భాగవతమట,
 పలికించెడివాడు రామభద్రుండట, నే
 పలికిన భవహర మగునట,
 పలికెద, వేఱొండుగాథ పలుకఁగ నేలా?''

అని నిశ్చయించి భాగవతమును తెనిగించు తప శ్చర్యకుఁ బూనినాడు.

కల మెత్తి కవనము సాగించు ప్రతికవియు నిప్పచ్చరమున చొప్పఁదోఁగుచుండును. పోతన మిగుల పేదవాడు. అతని యింట నొకపూటకే గాని రెండవ పూటకుఁ జాలినంత సంభారము లేదు. వ్యవసాయ మతని కులవృత్తి. అందు వచ్చెడి ధాన్యపుగింజలు ఇంటి కేతెంచు నతిథుల మర్యాదలకే సరిపోవుచుండెను. వారి ఆదాయము పట్టుమని నోటికిని చేతికినిగూడ అందనిది. ఇంత దారిద్ర్యమనుభవించుచున్నను నతఁడు రాజాస్థానములకుఁ బోయిగాని, ధనికుల యిండ్లకుఁ బోయిగాని యెఱుఁగడు. భాగవతకవితను విని యానందించుటకు నతని యింటికి వచ్చిపోయెడివారిని ఒక్కనాఁడైన నడిగి యెఱుఁగడు.

పోతన బావమఱది శ్రీనాథకవి. శ్రీనాథుఁడా కాలమున రాజాస్థానములలోఁ బేరుమోసిన కవిసార్వభౌముఁడు. సంస్కృతాంధ్రములకు నతఁడు పెట్టినది భిక్షగా నాకాలమున నెగ్గుచుండెను. అతఁడు ముట్టినదంతయు ముత్తెములు, పట్టిన దంతయు బంగారము నగుచుండెను. శ్రీనాథుఁ డొకనాడు పోతనను జూడవచ్చెను. తనకుఁగల వైభవమంతయు బావయగు పోతనకుఁ జూపి, యతనిలో నసూయను రేపి అతనికిఁగూడ రాజాశ్రయమును గల్పింపవలె నని శ్రీనాథుని సంకల్పము. పోతనకూడ రాజులచేఁ దనవలెనే గౌరవింపఁబడుచు నఖండవైభవము ననుభవింపవలె నని శ్రీనాథుని భావము. కావున శ్రీనాథుఁడు పదార్గురు బోయీల పల్లకిలో వచ్చెను.

పోతన పొలము వ్యవహారము గమనించుచు చేని గట్టుపైఁ గూర్చుండియుండ శ్రీనాథుఁ డతనిని సమీపించి 'హాలికులకుఁ గుశలమేనా?' యని ప్రశ్నించెను. పోతన కొంచెమైనను గోపింపఁడాయెను. అతఁడు శ్రీనాథునితో—

"బాల రసాల సాల నవ
పల్లవకోమల కావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపుఁ
గూడు భుజించుటకన్న సత్కవుల్
హాలికులైననేమి, గహ
నాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైన నేమి, నిజ
దారసుతోదరపోషణార్థమై!"

అని చెప్పి యెత్తి పాడిచెను. ఇది విని శ్రీనాథుఁడు వేళాకోళము మానెను. పోతన శ్రీనాథు నాదరించి యింటికిఁ గొనిపోయెను.

ఇంట మధ్యాహ్నభోజన మైన తరువాత శ్రీనాథుఁడును, పోతనయు నిష్టాగోష్ఠి నుండిరి. పోతన తన భాగవతములోని మధుర ఘట్టములను చదివి వినిపించెను. శ్రీనాథుఁడు పోతన కవితాసంపద కలరి బావనుచూచి "బావా, ఇంతటి కవితాసంపద యుండియు నిన్ను దారిద్ర్యము వీడకున్నది. ఈ దారిద్ర్యమును రూపుమాపగల దారి నీకింకను గోచరించినట్లులేదు. భారతావనిలో గణింపఁదగ మహాపండితులలో నొకఁడవై, వాక్సిద్ధిగల మహాకవివినీవు. నాకుఁ గర్ణాటక్షితిపాలురకడ మంచి పలుకుబడి యున్నది. నీకు నే నన్నివిధముల సహాయుఁడనై యుండఁగలను. నీ విప్పుడు తెనిగించుచున్న భాగవతమును కర్ణాటక్షితిపాలుర కంకితముచేసి వారివలన మహోన్నత సత్కారముల నందరాదా? వలయునన్న ముందే నీకన్ని యేర్పాట్లను గావింతు" ననెను.

పోతన దాని కేమియుఁ బ్రత్యుత్తరమీయ లేదు. అతఁ డాలోచనా నిమగ్నుఁ డయ్యెను. శ్రీనాథుని యోచనయు నొకవిధముగాఁజూడ

సమంజసమై యున్నది. రాజాశ్రయము దొరకినా, తన దారిద్ర్యము పటాపంచలగును. శ్రీనాథునివలెనే తానును ఎనలేని భోగము లనుభవింపవచ్చును కాని...

తెంపులేని యాలోచనలోఁబడి పోతన కొట్టిమిట్టాడుచుండెను. శ్రీనాథుఁ డతని మౌనము నంగీకారముగ గ్రహించి బావగారికడ సెలవు గైకొని వెడలిపోయెను.

భగవత్ప్రేరణచే వ్రాయఁబడిన పవిత్ర గ్రంథమును నరాంకిత మొనర్చుటయా? అందులో భాగవతమువంటి పునీతగ్రంథమును భగవంతునకంకిత మీయక ఇతరుల కిచ్చుట పాడియా? మఱే గ్రంథమైనను లెక్కలేదు. అతని కేమియుఁ బాలు పోలేదు. శ్రీనాథుఁ డొకవేళ ఏ రాజునైనను అంకితమునకుఁ బ్రోత్సహించి పంపిన నెట్లు? అప్పుడు తానేమిచేయఁ గలఁడు? వద్దని ముందుగ నొక్కమాటయైనను చెప్పలేదే! మౌన మంగీకారముగా గ్రహించిన నేమగును?

పోతన ఈ దిగులుతో పూజాగృహమున కేగి శ్రీరామసన్నిధిని దైవమునే నమ్మి దైవ ధ్యానమునకు పూనెను. కాని మనసు ధ్యానమున లగ్నము కాలేదు. అనాలోచితముగాఁ దాను గావించిన పనికిఁ దన్ను నిందించుకొనుచుండెను. కంట నీరు గ్రమ్మెను. అతని యెదుటఁగూడ అశ్రుసంసిక్తనయన యగు సరస్వతి సాక్షాత్కరించెను. అదిచూచి పోతన మిగుల కలఁత చెందెను. సరస్వతి కంట కన్నీరేల? తాను గావింపనెంచిన యకృత్యమునకు సరస్వతి కంట తడి పెట్టెనా? అవును. అతఁడు సరస్వతికి ప్రణమిల్లి ఆమెను బుజ్జగించుచు—

"కాటుకకంటి నీరు చను
గట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభ దైత్య మర్దనుని
గాదిలికోడల, యో మదంబ, యో
హాటకగర్భురాణి, నిను
నాఁకటికై కొనిపోయి యల్లకర్ణాటకిరాత కీచకుల
కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!!"

పరమపవిత్ర భాగవతగ్రంథము కర్ణాటకిరాతుల కంకిత మీయనని చెప్పి తన నిశ్చయమును విన్నవించి యామె దుఃఖమును పోగొట్టెను.

అన్నట్లుగా శ్రీనాథుఁడు సర్వజ్ఞ బిరుదాంకితుఁడగు సింగభూపాలునికడ కేగి భాగవత గ్రంథము నంకితమిచ్చు విషయమును ప్రస్తావించెను. సింగభూపాలుఁడు గొప్ప విద్వత్కవి కూడ. అతఁడు సంస్కృతభాషలో 'రసార్ణవ సుధాకర' మను గొప్ప అలంకార గ్రంథమును రచించెను. అది మిగుల ప్రామాణిక గ్రంథములలో నొకటి. పోతన భాగవతము నంకితము గొనుట కాతఁ డెంతయో సంబరపడెను. సర్వజ్ఞసింగభూపాలుఁడు తగువైభవముతోఁ గదలివచ్చి భాగవతము నంకితమిమ్మని పోతన నడిగెను. పోతన తన నిరాకరణ సంకల్పమును వినయపూర్వకముగ మనవి చేసెను. రాజది విని ఆగ్రహోదగ్రుఁడై దానిని మిగుల అవమానకర విషయముగ భావించి పోతనను బలవంతపఱుప సైన్యముల నియోగించెను. భగవంతుఁడు యజ్ఞవరాహరూపియై వచ్చి సైన్యముల రూపుమాపెను. సర్వజ్ఞసింగభూపాలుఁడు పోతనకాళ్ళపైఁ బడి తన్ను క్షమింపవేడెను. పోతన భగవల్లీలల కెంతయు నలరి అతనిని క్షమించెను.

పోతనామాత్యుఁ డిట్లు తన్ను వలచివచ్చిన రాజాశ్రయమును తిరస్కరించెను. మహాకవులు వశ్యవాక్కులు. భగవంతుఁడు వారి నెల్ల వేళల వేయికన్నులఁగాపాడుచుండును. వారికి రాజుల నిగ్రహానుగ్రహములతోఁ బనిలేదు. లోకమునకు, లోకులకు వారు పెట్టిన భిక్ష శ్రీరామ రక్ష. పోతన రచియించిన శ్రీమదాంధ్ర భాగవతము ఆంధ్రావనిలో నిత్యపారాయణ గ్రంథము. మృదు మధురమైన శైలిలో ఉత్కంఠను రగుల్కొల్పు కమనీయ భావజాలముతో నొప్పు నీ గ్రంథరాజము ఆంధ్రుల పాలిటి కల్పవృక్షమై అలరారుచున్నది. శ్రీ పాపయ్యశాస్త్రిగారు భావుక మూర్తి యగు పోతన దీక్షను ప్రశంసించుచు—

"గంటలు గట్టుకొంటి వట
 గా విటగాండ్రను బోలునట్టి యీ
కుంటి కురూపి భూపతుల
 కుం గవితాసతి నీయ" నంచు - ఆ
పంట వలంతి యల్లునికె
 భాగవతమ్మును ధారవోసి ని
ష్కంటక వృత్తికై నడుము
 గట్టితి వెంతటి పుణ్యమూర్తివో!!"

తన భక్తిని ప్రకటించినాఁడు. పోతన యెంతయో పుణ్యమూర్తి. గొప్ప సారస్వత ఖండములను ఆంధ్రుల కందించిన సారస్వత స్రష్ట.

# శ్రీ రామకృష్ణపరమహంస విలాసము

మూలమ్ :
శ్రీశ్రీ చిద్ఘనానందగిరిస్వాములవారు

తాత్పర్యకాదంబిని :
శ్రీ శ్రీధరబాబు

(జూన్ సంచిక తరువాయి)

44. భగవత్యమ్బ చాయాత
 మ్ప్రభాత మఖిలేశ్వరీ।
దర్శనం త్వవ నాభూన్మే
 మూర్ఖస్యాజ్ఞస్య తే శిశోః॥

భగవతీ, అంబా, మరల ప్రభాతమైనది. మూర్ఖుడను, అజ్ఞానినగు ఈబిడ్డకు నీదర్శనము లభింపలేదు.

45. అహో గచ్ఛతి సూర్యో౽యం
 పశ్చిమాం బోనిధిం శివే।
సాయన్తనః సమాయాతి
 దర్శనం త్వవ నో లభే॥

సూర్యుడు పశ్చిమసముద్రమున క్రుంకుచున్నాడు. సాయంతన మాసన్నమైనది. ఇంకను నీదర్శనము కాలేదు.

46. అహో గతశ్చలః కాలః
 ప్రత్యాయతి కదాపి న।
ఆయూ రన్ధ్రిఘటా న్నీరం
 యథా గచ్ఛతిగచ్ఛతి॥

అంబా, చంచలస్వభావయగు కాలము దొరలిపోవుచున్నది. మరల ఎప్పుడును తిరిగిరాదు. ఆయువన్నదో రంధ్రమున్న కుండలోని నీటివలె తరిగిపోవుచున్నది.

47. చంద్రో ఽపుష్ణాయతే మాతః
ఫణిభూషణ మణ్డనః ।
మామప్రీత్యమ్ప తథా వాయు
ర్గఙ్గాశీకర శీతలః ॥

ఫణిభూషణాలంకారుడగు చంద్రుడు వేడిని పుట్టించుచున్నాడు. అట్లే గంగాశీకరశీతలమగు వాయువుకూడ నాకు చల్లదనమును ప్రసాదించుట లేదు.

48. ఇదం శరీర మ్భారో మే
జాతో మాత స్త వామ్బికే ।
దర్శనేన వినా దేవి
బ్రహ్మవిద్యా రహాస్యవా ॥

అమ్మా, బ్రహ్మవిద్యారహస్యము బోధపడని, నీదర్శనములభింపని ఈజన్మ నిరర్థకము. కాన ఈశరీరము నాకు భారమనిపించుచున్నది.

49. క్రోశయానః స పుణ్యాత్మా
మూర్ఛా మా ప్సైవ మేకదా ।
యథా లోహోఽగ్నితప్తః స్యా
త్తథాభూ త్త త్కలేబరమ్ ॥

ఒకనా డిట్లు విలపించుచు ఆపుణ్యాత్ముడు మూర్ఛిల్లినాడు. లోహమగ్నితప్తమైనరీతిగా అతని శరీరము భగవద్విరహముచే తపించినది.

50. తీవ్రతీవ్రతరో భక్త్యో
రామకృష్ణ పరాత్తవాన్ ।
శయానో మూర్ఛయా త్రీణి
దినా న్యనయ దుత్తమః ॥

పరతత్త్వ సంలగ్నమనస్కుడును, తీవ్రభక్తిసంపన్నుడు అగు రామకృష్ణుడు మూర్ఛితుడు కాగా మూడునాళ్ళు గడచిపోయినవి.

51. త న్తదా వసనాచ్ఛాద్య
జ్కృత్వా నీత్వా చ స్వర్ణదీమ్ ।
అస్నాపయ ద్యతిః కశ్చి
న్మూర్ఛాశాంతి రభూ త్తతః ॥

ఆమూర్ఛలో ఎవరో ఒకయతీశ్వరుడు అతని యొడలికి బట్టలు చుట్టి, వియన్నదికి గొనిపోయి, స్నానము చేయింపగా మూర్ఛనుండి తెప్పరిల్లెను.

52. ఏవం త్రింశ ద్దినాని స
వ్యతిచక్రామ నిద్రయా ।
విరహీ రామకృష్ణ స్తు
వినానేత్ర నిమీలనమ్ ॥

ఈవిధముగా ముప్పదిదినములు నిద్రారహితుడై రామకృష్ణుడు తెప్పపాటుకగడిపినాడు.

(సశేషము)

---

# వార్తలు, విశేషాలు

## శ్రీవివేకానందస్వామి శతతమజయంతి మహోత్సవములు

### గ్వాలియరు

గ్వాలియరు రామకృష్ణాశ్రమమున 1963 జనవరి 17-వ తేదీనాడు పూజతో భజనలతో కీర్తనలతో ఆరాత్రికములతో శ్రీవివేకానంద స్వాముల శతతమజయంతి ప్రారంభింపబడినది. సుమారు 400 దరిద్రనారాయణులకు అన్న సంతర్పణకావింపబడినది. నాటి సాయంకాలమే పౌరమహాసభయు కూడినది. మార్చి నెల 31-వ తేదీనాడును, ఏప్రిలు నెల 2-వ తేదీ

నుండి 7-వ తేదీవఱకును శ్రీసత్స్వరూపానంద స్వామి వివిధవిషయములనుగూర్చి ఉపన్యసించినారు.

## బెంగుళూరు

1963 ఏప్రిలు 28-వ తేదీనాడు శ్రీయతీశ్వరానందస్వామి బెంగుళూరి శ్రీరామకృష్ణాశ్రమమున వివేకానందశతతమజయంతి "మెమోరియలుహాలును" పునాదివేసినారు. ముఖ్యకార్యక్రమము మే 8-వ తేదీనాడు ప్రారంభమైనది. ప్రారంభమంగళోపన్యాసము 12-వ తేదీనాడును, పరిసమాప్తి మంగళోపన్యాసమును 18-వ తేదీనాడును శ్రీయతీశ్వరానందస్వామిచే కావించిరి. మొత్తము 11 సాయంసమావేశములును, 5 ప్రాతస్సమావేశములును జరిగినవి. సన్న్యాసులు కవులు విజ్ఞానశాస్త్రజ్ఞులు వేదాంతులు పెక్కండ్రు పాల్గొనిరి. ఆయాసమయములకు అనురూపములైన వేదపారాయణములు కార్యక్రమగాంభీర్యమును హెచ్చించినవి. స్వామిజీ జీవితోపదేశములనుగూర్చి ఉపన్యాసములకదంబము గానవినోదములు నాటకప్రదర్శనములు పౌరమహాజన సమావేశములు, భజనలు — ఇవి కార్యక్రమములో ప్రాముఖ్యమువహించినవి. శిశువులదినమని యొకటియు, మహిళలదినమని యొకటియు ప్రత్యేకముగ కొనియాడబడినవి.

[illegible]

1963 జనవరి 17-వ తేదీనాడు న్యూ రామకృష్ణమిషను విడిదిలో ఉషఃకీర్తన మంగళారాత్రిక వేదపారాయణ పూజా—ప్రసాద వినిమయాలతో శ్రీవివేకానందస్వాముల శతతమజయంతి మహోత్సవము పాటింపబడినది. నాటిసాయంకాలము రామ్లీలామైదానమున జరిగిన పౌరమహాసభ కార్యక్రమ నివేదిక శ్రీరామకృష్ణప్రభ ఫిబ్రవరి సంచికలో వెలువడినది. ఇంగ్లీషు, గీర్వాణ, హిందీ, బెంగాలీ, పంజాబీ, తమిళ—భాషలలో గ్రంథభాగములు వల్లించు పోటీలును ఆంగ్లభాషలో వక్తృత్వపు పోటీలును స్కూలు కాలేజీ విద్యార్థులకు ఫిబ్రవరి 1-వ తేదీనుండి 10-వ తేదీవఱకు జరుపబడినవి. 3,224 అభ్యర్థులు పాల్గొనిరి. వివిధవైఖరులలో శ్రీ వివేకానందస్వాముల ఫోటోలును ఆయన దివ్యవాణినుండి ఉద్ధారములును ప్రదర్శింపబడినవి. రామకృష్ణ మిషను విడిదిలో ఫిబ్రవరి 3-వ తేదీనాడు జరిగిన పౌరమహాసభకు శ్రీజవహర్లాల్నెహ్రూగారు అధ్యక్షతవహించిరి. శ్రీస్వాహానంద, భక్తానంద స్వాములును ఢిల్లీకాలేజీ ప్రిన్సిపాలు బెగ్గు గారును, రైల్వేబోర్డు మాజీ చేర్మెన్‌గారగు సర్దారుబహాదూర్ కర్నైలు సింగుగారును ఉపన్యసించిరి.

శ్రీనెహ్రూగారి అధ్యక్షోపన్యాస సంక్షేపము:—ప్రజలు శ్రీవివేకానందస్వాముల బోధనల అనుసరింపవలెను. మానవుల డెందములలో భయమును నిర్మూలింపవలెను. దేశీయ జీవిత వివిధరంగములలో ఉన్న దౌర్బల్యములను దులిపివేయుటకు శ్రీవివేకానందస్వామి పోరాడెను. పిల్లలకేమి యువకులకేమి ఏకైకాదర్శముగ పేర్కొనదగినవాడు శ్రీ వివేకానందస్వామి అని నాయభిప్రాయము. శ్రీవివేకానందస్వామి నలుబదవయేటనే మరణించినను చరిత్రయందు ఆయన గాఢముద్రను ఏర్పఱచినాడు. స్వామి వ్యక్తిమహిమ అద్వితీయము. మన ప్రాచీన విజ్ఞానమునకును నేటి జీవితమునకును ఆయన చక్కని సమన్వయము కుదిర్చి

నాడు. సనాతనలక్ష్యములకు నిత్యనూతనము లైన మెఱుగులుదిద్దినాడు.

ఫిబ్రవరి 10-వ తేదీనాడు విద్యార్థుల సమావేశమునకు శాస్త్రపరిశోధనా విజ్ఞానశాఖకు కేంద్రమంత్రియైన ప్రొఫెసరు హుమయూను కబీరు అధ్యక్షతవహించి పోటీలలో పాల్గొన్న విద్యార్థుల నభినందించి నెగ్గినట్టి 468 అభ్యర్థులకు బహుమతులిచ్చిరి.

## గుంటూరు

ఫ్రెండ్సరిక్రియేషన్‌క్లబ్ ఆధ్వర్యాన 21-4-1963 న శ్రీస్వామి వివేకానందశత జయంత్యుత్సవము క్లబ్ ఆవరణలో జరిగెను. ఈసభకు శ్రీ తెల్లాకుల కోటీశ్వరరావు అధ్యక్షతవహించిరి. శ్రీగుడివాడ హనుమంతరావు స్వాగతము చెప్పారు. శ్రీ నేరెళ్ల తాండవ కృష్ణమూర్తి ప్రార్థనచేసెను. శ్రీ గుడివాడ వేంకట గోపాలకృష్ణమూర్తి బహూకరించిన శ్రీ వివేకానంద చిత్రపటమును శ్రీ మన్నవ గిరిధరరావు, ఎం. ఏ, ఆవిష్కరించెను. గుంటూరు హిందూకళాశాల ఉపన్యాసకులు శ్రీ అమరేంద్ర, శ్రీ పిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు, ఎం.ఏ., శ్రీ వై.యస్.ఆర్. చంద్రన్, ఎం. ఏ., ఎల్ ఎల్ బి, మొదలగువారు ప్రసంగించిరి. పెద్దలు పంపిన సందేశములను శ్రీ యన్.టి. కృష్ణమూర్తి చదివెను. హిందూ కాలేజి మల్టీపర్పసు స్కూలులో, స్కూలు పీపుల్‌లీడర్ శ్రీ ఎన్. వేంకటేశ్వరరావు శ్రీరామకృష్ణపరమహంస, వివేకానంద రచించిన 10 పుస్తకములను క్లబ్‌కు బహూకరించెను. శ్రీ నూనె. వేంకటేశ్వరరావు వందన సమర్పణచేశారు. శ్రీ జి. వి. జి. కృష్ణమూర్తి ఈ ఉత్సవకార్యక్రమాలన్నింటిపై పర్యవేక్షణ జరిపెను. అల్పాహారవిందు జరిగెను. సభానంతరము జనగణమన జాతీయగీతము పాడిరి.

## శ్రీరామకృష్ణసేవాశ్రమము, చల్లతాంధ్ర, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా.

శ్రీరామకృష్ణ సేవాశ్రమ కార్యనిర్వాహక వర్గ సమావేశము 6-6-1963 తేదీని ఆశ్రమమునందు శ్రీభద్రాచలం రామమూర్తిగారి అధ్యక్షతను జరుపబడినది.

అధ్యక్షులు జ్ఞానయోగమునుగూర్చి ఉపన్యసించిరి. తదుపరి కార్యదర్శి ఆశ్రమభవన నిర్మాణమునుగూర్చి యింతవరకును అయిన పనిని గూర్చి యింకను జరుగవలసిన పనిగూర్చి సభ్యులకు వివరములు తెలిపిరి. శ్రీరామకృష్ణ గ్రంథాలయము, ఆసుపత్రినిగూర్చి పైకప్పు వేయుటను శ్రీ బచ్చల సింహాచలంగారు పూర్తి చేయుటకు తమ సంసిద్ధతను తెలియపఱచిరి.

శ్రీఆట్టాడ కృష్ణమూర్తినాయుడు, బచ్చల సింహాచలం, లింగూడు కామరాజు, వాడరేవు కామన్న, వాడరేవు సింహాచలం. పెద్దపు సూర్యనారాయణగార్లను ఈ సంఘమునందు శాశ్వత సభ్యులుగ నమూదుచేయుచూ తీర్మానించడమైనది.

బృందావనం, హరిజనభక్తులు, చాట్ల చిన రామయ్యగార్లు దయతోఇచ్చిన య 0.50 ట్లు భూమిని స్వీకరించుచు తీర్మానించడమైనది. ప్రధానకార్యదర్శి ప్రవేశపెట్టిన యింతవరకు అయిన జమాఖర్చులు ఆమోదించడమైనది.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## శంకరగ్రంథ రత్నావళి

(ఆత్మజ్ఞానోపదేశవిధి, మాయావివరణము, ఉపదేశసాహస్రి పఞ్చీకరణము)

(పఞ్చీకరణవార్తికము – శ్రీ సురేశ్వరులు)

ద్వితీయ సంపుటము – అనువాదకులు : శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. ప్రకాశకులు : సాధనగ్రంథమండలి, తెనాలి. వెల : రూ. 4-00.

"రెండుబాసలకు మేమె కవీంద్రులమంచు" మీసంమీద చేయివేసుకొని హుందాగా నుడివిన శ్రీతిరుపతి వెంకటకవుల శిష్యశిఖామణులలో శ్రేష్ఠులు శ్రీ శివరామశాస్త్రిగారు. గ్రాంథికవ్యావహారిక భాషలలో ఉదాత్తమైన శైలిలో వ్రాసిన వ్రాయగల వ్రాసే నిష్ణాతులు. ఈగ్రంథమునందు ఆదిశంకరభగవత్పాదాచార్యుల 'ఆత్మజ్ఞానోపదేశవిధి, మాయావివరణము, ఉపదేశసాహస్రి, పఞ్చీకరణము'— మున్నగు ప్రకరణములలోని ప్రతి సూత్రానికి చక్కని అర్థం, తాత్పర్యం (సంస్కృతంలో శంకరభగవత్పాదుల మూలవ్యాఖ్యానంతో) చక్కని సులభశైలిలో తెలుగు జిజ్ఞాసువులకందించిన శ్రీ వేలూరి శివరామశాస్త్రులవారికి ధన్యవాదాలు.

అంతేగాక, ఈగ్రంథమున జగద్గురు శ్రీమచ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీస్వాముల శ్రీముఖము, జగద్గురు అభినవవిద్యాతీర్థ మహాస్వాములవారి ఆశీస్సులు, శ్రీగాయత్రీ పీఠాధిపతులు శ్రీ విద్యాశంకర భారతీస్వాముల. శ్రీ శ్రీ నృసింహానందభారతీస్వాముల ఆశీస్సులు పొందుపరుపబడియున్నవి.

ఈగ్రంథము 325 పుటలతో ఆది శంకర భగవత్పాదుల ముఖచిత్రంతో ఒప్పారుతూంది.

అపవాద – వివరణ

మచ్చుకు శ్రీ శివరామశాస్త్రిగారి వివరణము క్రింద కొంత ఉదాహరింపబడినది:— పరికింపుడు. 'కారణంకంటె కార్యం వేరుగా ఉండదు' అనే ఎరుకచే ఆలిచిప్పకంటె వేరుగా వెండీ, తాడుకంటె వేరుగా పామూ లేనట్లే 'బ్రహ్మము కంటె వేరుగా ప్రపంచం లేదు' అనే నిషేధం అపవాద. 147 పుట.

ముముక్షుత్వం అంటే తనయిల్లు తగులడిపోతూవుంటే తానేకాలిపోతున్న చందంగా వున్న యింటివాడు, ఆలుబిడ్డలను విడిచి తన బ్రతుకుతెరువే చూచుకొని బయటికి పరుగెత్తగోరినట్లు సంసారి సంసారతాపాన్ని పోగొట్టుకోడానికి ఏషణలన్నీ విడిచి బ్రహ్మతాదాత్మ్యం పొందగోరుతాడు. అట్టి తీవ్రేచ్ఛ. (ముముక్షు) 151 పుట.

పై విధంగా సులభమైన భాషలో భావం పొదిగించి మన కందించి అమూల్యమైనశోభను కూర్చారీ గ్రంథమునకు శ్రీ శివరామశాస్త్రులుగారు.

ఇది ప్రతివారూ చదివితీరవలసిన గ్రంథరాజం. తెలుగున వెలువడిన శ్రీశంకరభగవత్పాదుల రచనలలో సులభశైలిలో ఇదే అగ్రగణ్యం అంటే అతిశయోక్తిమీ కాదు.

—వేదం రామశాస్త్రి

---

# దీక్షతో పనిచేయండి
# దేశంశక్తి మీపైన ఆధారపడివుంది


సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్సు ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రా మ కృ ష్ణ ప్ర భ

సంపుటము ౨౦    ౧౯౬౩, సెప్టెంబరు; శోభకృత్తు - భాద్రపదము    సంచిక ౯

## వి ష య సూ చి క

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

740 పుటలు శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తొలికూర్పు) రూ. 7/50

496 పుటలు శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) రూ. 5/-

144 పుటలు శ్రీ శారదాదేవి రూ. 1-25

312 పుటలు శ్రీ శారదా ప్రసంగములు రూ. 3-00

540 పుటలు శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) రూ. 3-50

432 పుటలు (సాదా) రూ. 3-50 శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) రూ. 4/-

564 పుటలు స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) రూ. 5/-

330; 324 పుటలు సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) రూ. 3/-

402 పుటలు పారమార్థిక సంభాషణలు రూ. 3/-

| | | | |
|---|---|---|---|
| శ్రీమద్భగవద్గీత | 4 00 | గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 50 |
| బ్రహ్మానంద బోధనలు ... | 3 50 | షికాగో నగరోపన్యాసములు | 50 |
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 50 | గురూపదేశములు | 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 50 | శ్రీ శారదా సూక్తి నవనీతము | 40 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- | | 40 |
| పరతత్త్వప్రసంగము ... | 2/- | క్రీస్తు సూక్తిమాల ... | 40 |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 25 | శ్రీ వివేకానంద శంఖారావము ... | 40 |
| ప్రబోధరత్నాకరము ... | 2 25 | నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 37 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- | శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 37 |
| దేవీమాహాత్మ్యము ... | 2/- | నా సంస్కరణ యుద్ధవిధానము ... | 37 |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 1 50 | శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 25 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 1 75 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము... | 25 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 1 25 | పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 25 |
| హిందూ మతము ... | 1 25 | నవీన భారతదేశము ... | 25 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 25 | తాపత్రయ చికిత్స ... | 25 |
| వివేక సూర్యోదయము ... | 1 25 | పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 19 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- | సర్వం విష్ణుమయం జగత్ | 19 |
| భారతీయ మహిళ ... | 1/- | శ్రీ రామకృష్ణ ఆరాత్రికము | 12 |
| కఠోపనిషత్తు ... | 0 80 | శ్రీరామనామసంకీర్తనము 0 6 యతిగీతము 0 | 6 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 75 | నామతము 0 6 వి. సింహగర్జనము 0 | 6 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేపరి కొన్నచో: రూ. 18-50)

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4




‘అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీకు ననుభావ్య మగును వత్స.’

—శ్రీ శారదామణి.


  **రామకృష్ణ ప్రభ** 

సంపుటము ౨౦ } ౧౯౬౩ - సెప్టెంబరు :: శోభకృత్తు - భాద్రపదము { సంచిక ౩


శ్రీః

# శివానన్దలహరి (౩)


మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ


వటు ర్వా గేహీ వా యతి రపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చి ద్భవతు భవ కిం తేన భవతి
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
తదీయ స్త్వం శమ్భో భవసి భవభారం చ వహసి ॥ ౧౧

| | |
|---|---|
| భవ / పశుపతే / శమ్భో | ఓ పరమశివా |
| నరః | మనుష్యుడు |
| వటుః వా | బ్రహ్మచారి అయినను |
| గేహీ వా | గృహస్థుడైనను |
| జటీ వా | జడలుగల వానప్రస్థుడైనను |
| యతిః అపి | సన్న్యాసియైనను |
| | పైనచెప్పినవారిలో చేరని |
| యః కశ్చిత్ | ఎవడైనను |

| | |
|---|---|
| భవతు | కానిమ్ము |
| తేనకిమ్భవతి | దానివలన నేమగును? |
| యదీయం | ఎవని |
| హృత్పద్మం | హృదయకమలము |
| భవదధీనం యది | నీయధీనమున నుండునేని |
| త్వం | నీవు |
| తదీయః భవసి | అతనివాడ వగుదువు |
| భవభారం చ | సంసారభారమును |
| వహసి | వహింతువు. |

తా॥ ఓ పరమేశ్వరా, బ్రహ్మచారి కానీ, గృహస్థుడు కానీ, వానప్రస్థుడు కానీ, సన్న్యాసి కానీ, ఈ చతురాశ్రమములలో చేరనివాడు కానీ, ఎట్టివాడైన కానీ, తనహృదయమును నీ యధీనమొనర్చునేని, నీవు అతనివాడ వగుదువు, అతనికి సంసారభారమును తొలగింతువు. నిశ్శ్రేయసప్రాప్తికి ఆశ్రమధర్మానుష్ఠానమునకన్నను శివభక్తి అమోఘసాధన మనియు, శివుడు భక్తపరాధీనుడనియు తాత్పర్యము.

గుహాయాం గేహే వా బహి రపి వనే వాద్రిశిఖరే
జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్
సదా య స్యైవా న్తఃకరణ మపి శమ్భో తవ పదే
స్థితం చే ద్యోగో௨సౌ స చ పరమయోగీ స చ సుఖీ॥ ౧౨

| | | | |
|---|---|---|---|
| శమ్భో | ఓపరమేశ్వరా | యస్య | ఎవని |
| గుహాయాం | గుహాలోగాని | అన్తఃకరణమ్ | మనస్సైనను |
| గేహే వా | ఇంటగాని | తవపదే ఏవ | నీ పాదమందే |
| బహిః అపి | వెలుపలగాని | సదా | ఎల్లప్పుడును |
| వనేవా | అడవియందుగాని | స్థితంచేత్ | ఉండునేని |
| అద్రిశిఖరే | కొండశిఖరమందుగాని | అసౌ | అదే (అట్లుండుటే) |
| జలేవా | నీటియందుగాని | యోగః | యోగము |
| వహ్నౌ వా | అగ్నియందుగాని | సచ | |
| వసతు | వసించును గాక. | పరమయోగీ | యోగులలోనికెల్ల వరిష్ఠుడు |
| వసతేః | వసించినందుకు | సచ | |
| ఫలమ్ కిం | ఫలము ఏమి | సుఖీ | సుఖము గలవాడు. |
| వద | చెప్పుము | | |

తా॥ మనస్సు సదా శివపాదారవిందమున నిమగ్నమై యుండుటే యోగము, సుఖము; అట్టి మనస్సు కలవాడే యోగులందరిలో సుఖులందరిలో వరిష్ఠుడు. అతని వాసస్థానమేదైన కావచ్చు. అత డింట నుండ వచ్చు, వెలుపల నుండ వచ్చు, కొండకొమ్మున నుండ వచ్చు, కొండబిలమున నుండ వచ్చు, అడవిలో ఉండ వచ్చు, నీట ఉండ వచ్చు, నిప్పున నుండ వచ్చు. శివపాదనిమగ్నచిత్తత లేక, ఈచోట్లలో ఎక్కడ నున్నను, ఆ ఉనికి నిష్ఫలమే.

అసారే సంసారే నిజభజనదూరే జడధియా
భ్రమన్తం మా మన్ధం పరమకృపయా పాతుముచితమ్
మదన్యః కో దీన స్తవకృపణ రక్షాతినిపుణ
స్త్వదన్యః కోవా మే త్రిజగతి శరణ్యః పశుపతే॥ ౧౩

| | | | |
|---|---|---|---|
| పశుపతే | ఓ పరమేశ్వరా, | పాతుమ్ | కాపాడుట |
| కృపణ | దీనులను | ఉచితమ్ | (నీకు) తగినది. |
| రక్షా | కాపాడుటయందు | త్రిజగతి | ముల్లోకములలోను |
| అతినిపుణ | మిక్కిలి సమర్థుడా, | తవ | నీకు |
| అసారే | సారముకానిదియు | దీనః | దయార్హుడు (అర్హుడు) |
| నిజ | నీ | మత్ | నాకంటె |
| భజన | ఆరాధనమునకు | అన్యః | వేఱొకడు |
| దూరే | దవ్వైనదియు అగు | కః | ఎవడు ? |
| సంసారే | ఐహిక జీవితమున | మే | నాకు |
| జడధియా | మొద్దు బుద్ధితో | శరణ్యః | రక్షకుడును |
| భ్రమన్తం | సుడియుచున్న వాడును | త్వత్ | నీకంటె |
| అనం | కన్నుగానని వాడునగు | అన్యః | వేఱొకడు |
| మాం | నన్ను | కః | ఎవడు ? |
| పరమకృపయా | అత్యంతదయతో | | |

తా॥ రక్షింపుమనే పుణ్యములో ఈముల్లోకములందును నీకు సాటి లేరు. రక్షింపబడదగిన యోగ్యతలో ఈముల్లోకములందును నాకు సాటి లేరు. నీవే తప్ప నాకు రక్షకులు లేరు. నేనే తప్ప, ఇంతటి దీనత గల, రక్షితవ్యుడు నీకును లేడు. ఈసంసారము అసారము. జడబుద్ధినై అజ్ఞానాంధుడనై నే నిందు సుడియుచున్నాను, అత్యంతదయతో నన్ను కాపాడుట, ఓపరమేశ్వరా, నీ కుచితము.

ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబన్ధుః పశుపతే,
ప్రముఖ్యోఽహంతేషా మపి, కిముతబన్ధుత్వమనయోః,
త్వయైవక్షన్తవ్యాశ్శివ మదపరాధాశ్చ సకలాః,
ప్రయత్నా త్కర్తవ్యంమదవన, మియం బన్ధుసరణిః ॥ ౧౪

| | | | |
|---|---|---|---|
| పశుపతే | ఓ పశుపతీ | త్వయా ఏవ | నీ చేతనే |
| శివ | ఓ మంగళరూపా | మత్ | నా |
| ప్రభుః | సర్వేశ్వరుడవైన | సకలాః | అన్ని |
| త్వం | నీవు | అపరాధాః చ | అపరాధములును |
| దీనానాం | దీనులకు | క్షన్తవ్యాః | క్షమింపబడదగినవి. |
| పరమబన్ధుః ఖలు | అత్యంతబంధువవు కదా | మత్ | నన్ను |
| తేషాం అపి | ఆదీనులలోను | అవనం | రక్షించుట |
| అహం | నేను | | ఎంతోపూనికతో |
| ప్రముఖ్యః | అగ్రగణ్యుడను | కర్తవ్యం | చేయబడదగినది. |
| అనయోః | మన | ఇయం | ఇది |
| బన్ధుత్వం | చుట్టరికము | బన్ధుసరణిః | బంధువులమార్గము. |
| కిమ్ ఉత | ఎట్టిదిగానుండవలెను | | |

తా॥ ఓపరమశివా, పశుపతీ, దీనులకు అత్యంతబంధువవు నీవే కదా. నా అంతటి దీనుడు మఱొకడు లేనందున, నాఅంతటిబంధువు నీకు మఱొకడు లేడు. కాబట్టి నాసకలాపరాధములను క్షమించుటయు మిక్కిలి పూనికతో నన్ను కాపాడుటయు నీకు తప్పవు. తమవారి తప్పులను తాము మన్నించుటయు తమవారిని తాము కాపాడుకొనుటయు ఇది బంధువుల మార్గము.

ఉపేక్షా నోచేత్కిం నహరసి భవద్ధ్యాన విముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపి, మశక్తోయదిభవాన్
శిర స్తద్వైధాత్రం ననఖలు సువృత్తం పశుపతే,
కథం వా నిర్యత్నం కరనఖముఖేనై వలులితమ్ ॥ ౧౩

| | | | |
|---|---|---|---|
| | | అశకః యది | శక్తి లేనివాడవగుచో |
| పశుపతే | ఓ పశుపతీ | | ఆ |
| ఉపేక్షా | చూచుచు మిన్నకుండుటను | వైధాత్రం | బ్రహ్మదేవుని |
| నోచేత్ | (నీకు) బుద్ధి లేదేని | శిరః | తల |
| దురాశా | చెడ్డఆశలతో | ననువృత్తం నఖలు | దృఢముగా అమర్పబడనిది కాదు గదా |
| భూయిష్ఠాం | | నిర్యత్నం | సునాయాసముగ |
| భవద్ | నిన్నుగూర్చి | కర | (నీ) చేతి |
| ధ్యాన | ధ్యానించుటకు | నఖ | గోటి |
| విముఖామ్ | ప్రతికూలమైనదియు నగు | ముఖేన ఏవ | కొసచేతనే |
| విధిలిపిమ్ | బ్రహ్మ (నొసటవ్రాసిన) వ్రాతను | కథం వా | ఎట్లు |
| | | లులితమ్ | గిలివేయబడినదో |
| కిం నహరసి | ఏల చెఱుపకున్నావు ? | | |
| భవాన్ | నీవు | | |

తా॥ ఓ పరమశివా, నాయందు నీకు ఉపేక్ష లేకున్నచో దురాశలతో నింపి నిన్ను ధ్యానింప నీయకున్న విధిలిపిని ఏల చెఱుపకున్నావు ? దానిని చెఱుపుటకే శక్తి లేని నీవు, విధి శిరమును గోటికొసతో ఎట్లు గిల్లివేయగల్గితివి ? విధిశిరమునే గోటికొసతో గిల్లివేయగల్గిన నీకు విధిలిపిని చెఱుపుట అశక్యమా ?



# శ్రీవివేకానందమరందబిందువులు (౮)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

దీపముండఁగనే యిల్లు చక్కఁబెట్టుకోవల యును. సోమరితనము పనికిరాదు. ఈర్ష్యను, నహంభావమును బూర్తిగా, శాశ్వతముగా, విడనాడుఁడు. అఖండ శక్తిసామర్థ్యములతోఁ బనిచేయుటకై కార్యరంగమున నుఱుకుఁడు. మిగిలినదానివిషయమునఁ బరమేశ్వరుఁడే మీ మార్గదర్శకుఁడై వెలయును.

తొందరపడి యేకార్యమును సాధింపఁ జాలము. సహనము, పవిత్రత, కార్యదీక్ష,— వీనియన్నిటికంటెను ప్రేమానురాగములు— ఇవి యున్నచో విజయము మిమ్ము వరించును, సమస్తకాలమును మీదియే. ఊరక తొందర పడనేల ?

ఆత్మవిశ్వాసము గలవారే ఘనులును బలాన్వితులునై యుండుట ప్రతిదేశచరిత్రయందును మీకు గోచరించుచునే యుండును.

ఆత్మవిశ్వాసపూరితులగు కొందఱమానవుల చరిత్రయే ప్రపంచచరిత్ర. అట్టి విశ్వాసమే, శ్రద్ధయే, లోని దివ్యత్వమును బ్రకాశితమొనర్చును. శ్రద్ధాభక్తు లున్నచో, సమస్తము సుసాధ్యమగును. అపజయమనఁగా నేమి ? అంతర్నిహితమగు నఖండశక్తిని వ్యక్తమొనర్చుటకై శక్తికొలఁదియుఁ బ్రయత్నింపకుండుటే. ఆత్మవిశ్వాసము లేకుండుటయే మరణము.

మొదటిది యాత్మవిశ్వాసము, తరువాతిది భగవద్విశ్వాసము. 'ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః' కార్యదక్షులు, దృఢగాత్రులు, బలోపేతులు నగువారు) — ఇట్టివారు పదుగురున్నచోఁ బ్రపంచము నుఱ్ఱూఁత లూఁగింపవచ్చును. దయార్ద్రపూర్ణహృదయము, మేధాసంపత్తి, భుజబలము — ఇవియే మనకువలయునవి.... భగవత్కార్యముల నొనర్చుట కర్హులు, నిమిత్తమాత్రులు కండు. భగవంతుఁడే కర్త. మీరు కాదు. మానవునందు, మానవునం దననేల, అణువునం దీ విశ్వమంతయు నిమిడి యున్నది. విశ్వశక్తియంతయు నణువున కాధారభూతమై యున్నది. హృదయమునకును బుద్ధికిని వైషమ్యము సంభవించినచో హృదయప్రేరణము నవలంబింపుఁడు.

నా కఖండమైనయాత్మవిశ్వాసము కలదు. భారతీయులు బలహీనులనియు నత్యల్పులనియు నిరసించు పాశ్చాత్యులు, భగవదనుగ్రహమున నాకట్టివిశ్వాస ముండుటచేతనే, నన్ను దమ గురువుగాఁ బరిగణించుచున్నారు. నీవును నంఖండశక్తి జ్ఞానసంపన్నుఁడ వని విశ్వసించి వర్తించినచో నద్భుతకార్యము లొనర్పఁగలవు. 'లెమ్ము! మేల్కొనుము! ఈ స్వప్నస్థితి చాలును. నీలోనున్న దివ్యశక్తిని బ్రకటింపుము!' అని ప్రతి భారతీయునకును దెల్పుము !

అల్పవిషయమహత్త్వము—ఇదియే భగవద్గీతాబోధన. ఆ పురాతన గ్రంథమునకు జయమగుఁ గాక !

మృతులు తిరిగిరారు; కడచినరాత్రి మరల గోచరింపదు; పతనమైన యల క్రొత్తఁగా

లేవఁబోవను; ఇట్టి మానవుఁడను బాహ్యశరీరమును మరల ధరింపఁబోఁడు. కావున నో మానవుఁడా, భూతమృతవిషయారాధనమును మాని సజీవవర్తమానము నుపాసించుటకై మేము నిన్నాహ్వానించుచున్నాము; గతార్థములనుగూర్చి యూరక చింతించుటను మాని ప్రస్తుతకార్యాచరణమునకై మేము నిన్నాహ్వానించుచున్నాము; ప్రాఁత పుంతలను శిథిల మార్గములను దిరిగి కనుఁగొనుటలో నీ శక్తిసామర్థ్యములను వ్యర్థ మొనర్చుకొనుట మాని యతిసమీపమునఁ గల నూతన విశాలరాజమార్గములను బట్టుటకై మేము నిన్నామతించుచున్నాము. ధీమంతు లిది గ్రహింతురు గాక!

యథార్థమగు శ్రద్ధాశయమును మరల మనము లక్షింపవలయును. ఆత్మవిశ్వాసము మరల మనలోఁ రగుల్కొల్పఁబడవలయును, మన దేశము నెదుర్కొనుచున్న సమస్యలపుడే స్వయముగా మనచేతనే క్రమముగాఁ బరిష్కరింపఁబడఁగలవు.

కొంచెము మర్యాదగా మాటలాడుచుండుటవలన సామాన్యమానవునికంటె నీ వధికుఁడ వనుకొనుచున్నావు కాఁబోలును. అన్నిటికంటెను 'నేను పారమార్థికుఁడ'నను నహంభావము నీలోఁ బ్రవేశించినయెడల దౌర్భాగ్యము నీకు దాపరించినదన్నమాటయే. అది మహాఘోరమగు బంధము.

కఠోపనిషత్తునందుఁగల శ్రద్ధయను దివ్యపదము నాకు జ్ఞప్తియందున్నది. శ్రద్ధాతత్త్వమును, లేక యథార్థవిశ్వాసమునుగూర్చి ప్రచార మొనర్చుటయే నా జీవితోద్యమము. మానవకోటియందును సకల మతధర్మములందును ప్రబల శక్తిసముపేతములైనవానిలో శ్రద్ధ ముఖ్యమని పలుమారు నేను నొక్కి వక్కాణింతును. మొట్టమొదట నాత్మవిశ్వాసము గలిగి యుండుఁడు. ధనికులను గొప్పవారిని లక్షింపకుఁడు. ప్రపంచమందలి మహాకార్యములను బ్రహ్మాండమైన యుద్యమములను నన్నిటిని నిర్వహించినవారు నిర్ధనులే. సుస్థిరులై యుండుఁడు. అన్నిటికంటెను నిష్కపటులై వినిర్మలులై, కార్యదీక్షా దక్షులై యుండుఁడు. మహాకార్యముల కుద్దేశింపఁబడినవారమను విశ్వాసము గలిగియుండుఁడు

ఆత్మవిశ్వాసమును గోల్పోయి యచలమై, నిద్రాణమైయున్న భారతదేశమును మేల్కొల్పుటయే యిపుడు నా యేకైక వాంఛ. ఈ దేశమును మేల్కొల్పి సనాతనధర్మోన్నతిని గుర్తింపఁజేయఁగలిగితినేని శ్రీ రామకృష్ణుని యాగమనమును మా జననమును వ్యర్థము కాలేదని తలఁతును. ఇదియే నా తాపత్రయము. ముక్తి మొదలగునవన్నియు నాకెంత మాత్రము గణనీయములు కావు... మన పురాతనగ్రంథములు ప్రమాణభూతములని యేకరువు పెట్టుచుండుటవలన నేమియు లాభము లేదు. పాశ్చాత్యనాగరికతాతరంగ ముప్పొంగి దేశముమీఁదికి వచ్చి పడుచున్నది. అణుమాత్రమైనను బ్రయోజనమును గమనింపక పర్వతాగ్రములపై ధ్యానస్థితులమై కూర్చుండుట వలన లాభము లేదు. గీతలో భగవానుఁడు దెల్పినచందమున నప్రతిహతశక్తితో, అఖండ ధైర్య సాహసములతోఁ దీవ్రకర్మయోగము నవలంబించుటయే యిపుడు మన కర్తవ్యము. అప్పుడే దేశీయులు నిద్ర మేల్కొందురు.

# శ్రీ శారదానందస్వామి

## [సంపాదకీయము]

దక్షిణేశ్వరమున నొకనాడు శ్రీరామకృష్ణుడు భావోద్రేకదశలోనుండి ఒకానొక యువకునిమొడిలో కూర్చుండి తర్వాత ఇట్లనెను. ఇత డెంతబరువు మోయగలడో అని పరీక్షించితిని.'' ఆయువకుడు ఎవడో కాదు శరచ్చంద్రుడే. అనంతరకాలమున రామకృష్ణ మఠమిషనులకు సర్వకార్యదర్శిగా అతడు మోయవలసిన బరువునకు అతిమానుషబలము కావలసియుండెను. అతనికి శ్రీరామకృష్ణునిలో దృఢ విశ్వాసము, కావున ఎంతటి ఇక్కట్టులో నున్నను నెమ్మదిని నిల్పుకోగలడు. ''గురుదేవుడే అన్నిటిని చక్కబెట్టును. మీ రూరకుండుడు'' అనిచుట్టునున్నవారితో చెప్పగలడు.

శ్రీశారదానందస్వామి సంపన్నవైదిక బ్రాహ్మణకుటుంబమునకు చెందిన వాడు. కలకత్తాలో అమ్‌హెర్‌స్టువీథిలో వసించుచుండెను. అతనిపూర్వాశ్రమనామము శరచ్చంద్రచక్రవర్తి. అతడు 1865 డిసంబరు 23-వ తేదీనాడు జన్మించెను. శనివారము సాయంవేళలో జన్మించినందున ఈబిడ్డభవిష్యత్తు ఎట్లుండునో అని పెక్కండ్రు భయపడిరి. కాని శరచ్చంద్రుని పితృ (మాతృ) సోదరుడు జోస్యములో నిష్ణాత. ''ఈశిశువు వంశమునకు తేజము చేకూర్చునంత గొప్పవాడగు'' నని చెప్పెను.

బాల్యమునుండియు శరచ్చంద్రుడు చాల ప్రశాంతముగ నుండెడివాడు. చురుకు లేనే లేదేమో అను భ్రాంతి కలుగుచుండెడిది. కాని బడిపాఠములలో అచిరకాలములోనే అతడు తన అసాధారణప్రతిభను వెలయించెను. అన్ని పరీక్షలలోను గెల్పొందినవారి పేళ్లలో ఇతని దగ్రగణ్యముగ నుండెడిది. పెక్కు ఇతర కార్యక్రమములలోగూడ అతడు వినోదించుచుండెడివాడు. విద్యార్థులకర్తృత్వపుపోటీలలో ఇతడు ప్రముఖస్థానమును అధిష్ఠించుచుండెడివాడు. వ్యాయామములు చేసి దేహమును అతడు బలిష్ఠముగా పెంపొందించుకొనెను.

గాఢమైన అతని ఆధ్యాత్మికపరత శైశవమందే ప్రకటమైనది. తనతల్లి తమయిలువేల్పును ఆరాధించుచున్నప్పుడు ప్రశాంతముగ ప్రక్కనే కూర్చుండియుండి తర్వాత తనమిత్రులయెదుట ఆమంత్రములను ఒక్కతప్పైనను లేక వల్లించెడివాడు. ఉత్సవసమయములలో మామూలు బాలురుకొను బొమ్మలు ఇతనికి నచ్చెడివి కావు. దేవతలవిగ్రహములనే ఇతడు కోరెడివాడు. చాలకాలమువఱకు అతడు మిక్కిలి ఇష్టపడుచుండిన ఆట యేమనగా భగవదారాధనానుకరణము. ఉపనయనమైన వెంటనే ఇంటిగుడిలో పూజచేయుట కధికారము అతనికి కలిగినది. బ్రాహ్మణబాలురు ప్రతిదినము చేయవలసిన ధ్యానములను అతడు తు. చ. తప్పక చేసెడివాడు.

శరత్తు స్వభావములో చాల సభ్యత కలవాడు. ఎవరితోనైనను పరుషముగ ఒక్క

మాటమైనను ఆడుటయు ఇతరుల మనస్సులను నొప్పించుటయు అతనికి చేతనైన పనులుకావు. అతనిహృదయము మృదువైనది. సానుభూతి కలిగినది. తనతరగతిలోని పేదబాలురకు తన శక్తికొలది సాయము చేయదగిన అవకాశమును ఒక్కదానినైన అతడు జాఱవిడిచెడివాడు కాడు. తన ఉపాహారమునకై ఇంటినుండి పంపబడినపైకమును అతడు తఱచు పేద బాలురకై వెచ్చించెడివాడు. ఒక్కొకసారి వస్త్రవిహీనులకు అతడు తనవస్త్రములను ఇచ్చి వేసెడివాడు. బంధువులుగాని మిత్రులుగాని పరిచితులుగాని పొరుగువారుగాని పరిచారకులు గాని పరిచారికలుగాని ఎవరు వ్యాధిగ్రస్తులైనను శరచ్చంద్రుడు తప్పక చెంతనుండి పరిచర్యచేసెడివాడు. పొరుగింట నొకప్పుడు పరిచారికకు కలరావ్యాధి వచ్చినది. ఇంటి యజమానుడు ఆవ్యాధి ఇతరులకంటుకొనునని భయపడి ఆమెను పైకప్పుమీద ఒకమూలలో చేర్చి మరణింపు మని అచట విడిచెను. ఈ వార్త తనచెవినిబడిన తత్‌క్షణమే శరచ్చంద్రుడు పరుగున నచటికి పోయి ఆమె యుపచారమునకుకావలసినవానినెల్ల ఒంటరిగ తానే నిర్వహించెను. అత డెంత శ్రద్ధతో పరిచర్య చేసినను, పాప మామె మరణించినది. యజమానుడు ఆమెకు చేయవలసిన క్రతువుల విషయములో సైతము శ్రద్ధ లేకుండగా వానికి కావలసిన యేర్పాట్లనుగూడ శరత్తే చేసెను.

కొంత పెద్దవాడైనపిమ్మట శరత్తు బ్రాహ్మసమాజనాయకు డగు కేశవచంద్రసేను ప్రభావమునకు గుఱియయ్యెను. క్రమముగా బ్రాహ్మసమాజసారస్వతమును చదివి వారిపద్ధతి ప్రకారము ధ్యానసాధన చేయుటకు కూడ ప్రారంభించెను.

1882 లో శరచ్చంద్రుడు హేర్‌స్కూలులో విశ్వవిద్యాలయప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడై మఱు సంవత్సరమే సెంట్‌క్సేవియర్ కాలేజిలో చేరెను. ఆ దినములలో ఫాదర్ లాఫ్రాన్టు ఆకాలేజికి అధ్యక్షుడుగ నుండెను. శరచ్చంద్రుని ప్రగాఢాధ్యాత్మికప్రకృతిని గుర్తించి అతని కాయన బైబిలు బోధింప పూనుకొనెను.

శరత్తునకు శశియను నొక జ్ఞాతి యుండెను. అతడును వీరికుటుంబములోనే యుండి మెట్రోపాలిటన్ కాలేజిలో చదివెను. ఒకప్పుడు శశిసహాధ్యాయి డొకడు దక్షిణేశ్వరమున గుడితోటలో ఒకమహాయోగి యున్నాడనియు ఆయననుగూర్చి అపారముగ ప్రశంసించుచు కేశవచంద్రుడు ఇండియన్ మిఱ్ఱరు పత్రికలో వ్రాసియున్నా డనియు తెలిపెను. ఒకనాడీ ముగ్గురును ఆయోగిని దర్శింత మని తీర్మానించుకొనిరి.

శరత్తును శశియు అట్లు దక్షిణేశ్వరమునకు వచ్చినది 1883 అక్టోబరులో నొక దినము. శ్రీరామకృష్ణుడు వారిని అత్యంత ప్రేమపూర్వకముగ ఆదరించెను. తొలివిచారణలు విన పిమ్మట, వారు అప్పుడప్పుడు కేశవుని బ్రాహ్మసమాజమునకు పోవుచుందు రని తెలిసికొని గురుదేవు డెంతయు ప్రీతు డయ్యెను. అప్పుడాయన ఇట్లనెను: ''పెంకులమీదను ఇటికరాళ్లమీదను వ్యాపారముద్రను ముద్రించిన పిమ్మట వానిని కాల్చినచో వానిపైనిఆముద్ర ఎప్పటికిని నిలిచియుండును. కాని ఈదినములలో తలిదండ్రులు తమ కుమారులకు చాల పసిప్రాయముననే వివాహములు చేయుచున్నారు. చదువు పూర్తియగునప్పటికే వారు బిడ్డలకు తండ్రులై కుటుంబపోషణార్థము

నొకరికై ఇక్కడి కక్కడికి పరుగులెత్తవలసి యుండును.'' ''అటులైనచో వివాహమాడుట తప్పా? అది భగవదిచ్ఛకు విరుద్ధమా'' అని శ్రోతలలో నొకడడిగెను. అంత శ్రీరామ కృష్ణుడు షెల్ఫులో నున్న పుస్తకములలో నొకదానిని అతనిచేత తీయించి వివాహమును గూర్చిన క్రైస్తునభిప్రాయమును తెలుపు బైబిలునుద్ధారములను అందుండి బిగ్గరగా చదువుమనెను, ''తల్లిగర్భమునుండి నపుంసకులుగనే పుట్టినవా రున్నారు. పుట్టినపిమ్మట నపుంసకులుగ చేయబడినవా రున్నారు. స్వారాజ్య సిద్ధికై తమ్ము తామే నపుంసకులుగ చేసికొన్నవా రున్నారు. ప్రతిగ్రహించుటకు శక్తి గలవాడు ప్రతిగ్రహింపనీ.'' సెంట్‌పాలు నభిప్రాయము: ''కావున నేను చెప్పున దేమనగా అవివాహితులును విధవలును నావలె శాంతి కల్గియుండుట మంచిది. అట్లు తమ్ము వారు అణచుకొనలేకుండిన వారిని వివాహమాడనిండు. ఏల యన మలమలమాడుటకంటె పెండ్లియాడుట మేలు'' ఈవాక్యములు చదువబడగనే శ్రీరామకృష్ణుడు సకలదాస్యమునకును మూలము వివాహమే అనెను. అప్పుడు శ్రోతలలోనొకడు ''వివాహము భగవత్సంకల్పమునకు విరుద్ధ మనియా మీ అభిప్రాయము! ప్రజలు వివాహములు మానినచో సృష్టి ఇక నెట్లు కొనసాగును?'' అనియడిగెను. శ్రీరామ కృష్ణుడు చిఱునవ్వునవ్వి ఇట్లనెను: ''అందుం గూర్చి విచారింపకు. వివాహ మాడ గోరువారు వివాహమాడుటకు వారికి పరిపూర్ణ స్వాతంత్ర్యము కలదు. నేను చెప్పినది మా నడిమి విషయము. నేను చెప్పవలసినది చెప్పినాను. అందులో నీయిష్టప్రకారము ఇంతో అంతో నీవు గ్రహింపవచ్చు''.

ఊపిపైచునట్టి ఈ వైరాగ్యోక్తులు శరత్తునకును శశికిని ఒక నూతనదృశ్యమును ఎదుట బెట్టినవి. శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వము ఉభయులను ముగ్ధుల నొనర్చెను. శరత్తు చదువుచుండిన కళాశాలకు గురువారములు సెలవు దినములు. ఏదో చాల ముఖ్యమైన పని అడ్డము రాకున్న, అతడు తప్పక ప్రతిగురువారమును దక్షిణేశ్వరమునకు వచ్చుచుండ మను నొక నియమమును కావించుకొనెను. శ్రీ రామకృష్ణునిసంపర్కము నానాటికి హెచ్చుగ కలుగుకొలదియు శరత్తు శ్రీరామ కృష్ణుని వంకకు మఱింత హెచ్చుగ ఆకర్షింపబడుచుండెను. శ్రీరామకృష్ణుని ప్రేమ ప్రవాహమున శరచ్చంద్రుడు చిక్కుకొనెను.

మొదటిసారి చూచినప్పుడే శ్రీరామ కృష్ణుడు ఆబాలునిలో మున్ముందు కలుగనున్న ఆధ్యాత్మికవికాసమును గుర్తించి అతనికి మార్గము చూపి అతని ఆధ్యాత్మికాభివృద్ధిని కనిపెట్టియుండెను. ఒకనాడు శ్రీ రామ కృష్ణుడు భక్తవర్గపరివృతుడై దక్షిణేశ్వరమున తనగదిలో కూర్చుండియుండెను. హిందువుల విజయాధిదేవత యగు గణేశునిగూర్చి చర్చ సాగుచుండెను. ఆదేవుని ఋజుశీలమును కామరహితత్వమును తల్లియగు దుర్గాదేవిపట్ల ఆయన కున్న ఏకాంతికభక్తిని గురుదేవుడు మిక్కిలి కొనియాడెను. పసివాడగు శరత్తు అచ్చట నుండెను. తటాలునఅందుకొని శరత్తు ''సరి, మహాశయా, గణేశునిశీలమునాకత్యంత ప్రియముగ నున్నది. అతడే నా లక్ష్యము''— అని చెప్పెను. తత్‌క్షణమే గురుదేవుడు అతనిని ''కాదు, గణేశుడు నీ లక్ష్యము కాదు. నీ లక్ష్యము శివుడు. నీకు శివుని గుణము లున్నవి'' — అని సవరించి ''నీవు శివుడ

వనియు, నేను శక్తి ననియు సదా భావించు చుందము. నీశక్తుల కన్నిటిని నేనే పరమా శ్రయమను''— అని సలహా చెప్పెను.

మఱొకప్పుడు గురుదేవుడు శరత్తును ''దేవుని సాక్షాత్కారము ఏలాగుపొందుట నీ కిష్టము? ధ్యానించుచున్నప్పుడు ఎట్టి దివ్య దృశ్యములు నీ వెక్కువగ కాంక్షింతువు?'' అని ప్రశ్నించెను. శరత్తు చెప్పిన జవాబు: ''ధ్యానములో దేవునిరూపములలో దేనినైన నొకదానిని ప్రత్యేకముగ చూడవలె నను కోరిక నాకు లేదు. విశ్వమందలి సకలచరా చరములలో మూర్తిభవించిన వానినిగ దేవుని సాక్షాత్కరించుకొనుట నాకిష్టము. దివ్య దర్శనములు నాకు నచ్చవు''. చిఱునవ్వుతో గురుదేవుడు ''నీ వన్నది ఆధ్యాత్మికోన్నతి అనెడి నిచ్చెనలో అన్నిటికంటె పైమెట్టు. అదంతయు నీవు తక్షణమే ప్రాపింపజాలవు''— అనెను. కాని ఆబాలుడు ''అంతకంటెతక్కువ దైన దేనితోగాని నేను సంతృప్తిచెందను. అధన్యదశ నధిగమించువఱకు ఆధ్యాత్మిక సాధనామార్గములో నాయాత్రను సాగించు చునే యుందును''— అని బదులు చెప్పెను.

శరచ్చంద్రుడు శ్రీరామకృష్ణునొద్దకువచ్చు టకుపూర్వమే నరేంద్రుని—అనంతరకాల వివేకానందస్వామిని—ఒకసారి కలిసికొనియుం డెను. అనంతరకాలమున శరత్తు ఎవనిని ప్రేమించి నాయకునిగా వరించి అనుసరించెనో అతనినిగూర్చి ఆమొదటిసమావేశములో చాల దురభిప్రాయపడెను. మధ్యకలకత్తాలో ఒక మిత్రుడు చెడుదారిని పడె నను వార్త విని శరత్తు అతనిని చూచుటకు పోయెను. ఆమిత్రు నింట నొక యువకుని చూచెను. అతడు మహా గర్విగా కనిపించెను. అతని నడవడికపద్ధతులు నాగరికమైనవిగ లేనే లేవు. అట్టియువకునితోడి సాంగత్యముచేతనే తన మిత్రుడు చెడిపోయె నని శరత్తు తీర్మానించుకొనెను.

కొన్ని నెలలకు పిమ్మట నరేంద్రనాథు డను నొకయువకుని శ్రీరామకృష్ణుడు అపారముగ కొనియాడుచుండెను. ఆపొగడ్తను విన్న శర చ్చంద్రునకు అట్టియువకునితో పరిచయము గడింపవలయు నను ఆశ కలిగినది. ఆయువ కుని చిరునామాను శ్రీరామకృష్ణునడిగి తెలిసి కొనెను. పోయి నరేంద్రనాథుని చూడగా అలనాడు తనమిత్రునింట తాను చూచిన యువకుడే అతడు—అని తెలిసినప్పుడు శరత్తు నాశ్చర్యము ఇంతంతగాదు. ప్రథమపరిచ యము ఆంతరంగికస్నేహముగ పరిణమించెను. వారి పరస్పరప్రేమ ఎంత హెచ్చె ననగా — ఒకరొకరితోడి సంభాషణలో గాఢముగనిమ గ్నులై రాత్రి ఒంటిగంటవఱకుకూడ కలకత్తా వీథులలో కననగుచుండెడివారు. ఒకరొకరిని సాగనంపకోరుచు ఇద్దఱును తమయిండ్ల నడిమి దూరమును పెక్కుపర్యాయములు నడచెడి వారు. అనంతరకాలమున శరచ్చంద్రుడు ''వివేకానందస్వామి మాతో ఎంత విశృంఖల ముగాకలసి మెలసి యున్నను, ప్రథమసమా గమములోనే ఆయన తరగతి ప్రత్యేకము అను టను గుర్తించితిని'' అని చెప్పుచుండెడివాడు.

నరేంద్రుడు శరచ్చంద్రుని ఇంటిలో ప్రవే శించినప్పు డొకసారి రసవంతమైన సంభవ మొకటి ఘటిల్లినది. అది 1884 లో చలి కాలము. మధ్యాహ్నమప్పుడు శరత్తును శశియు నరేంద్రనాథునింటికి వచ్చియుండిరి. సంభాషణ ఘనందుగా సాగినది. గంటలుగడచి పోవుచుండుటను అందఱును మఱచిపోయిరి. ఇన్నాళ్లును శరత్తును శశియు శ్రీరామకృష్ణుడు

కేవల మొకయోగియని మాత్రమే తలంచి యుండిరి. కాని శ్రీరామకృష్ణునితోడి నరేంద్రు ననుభవములు విన్నప్పుడు శ్రీరామకృష్ణుడు జీససుకును అట్టి ఇతరప్రవక్తలకును సమానుడైన మహానుభావు డని తలంపసాగిరి. సంభాషణ సాగుచునే యున్నది. సాయంకాలమైనది. సాయంవాహ్యాళికై నరేంద్రనాథుడు వారిని కారన్వాలీసుచదుకమునొద్దకు పిలుచుకొనిపోయెను. సంభాషణ అచ్చటను సాగుచునే యుండినది. సంభాషణమధ్య నరేంద్రుడొక్కపాటపాడెను. గడియారము రాత్రి తొమ్మిదిగంటలు కొట్టినప్పుడు, శరత్తునకు ఎంత ప్రొద్దైనదియు తెలిసినది. కొంతదూరము వఱకు వారిని సాగనంపుదమని నరేంద్రుడు వారితో బయలుదేఱెను, కాని సంభాషణలో మునిగి అతడు శరచ్చంద్రునింటి యొద్దకే వచ్చెను. తమయింట భుజింపు మని శరత్తు ప్రార్థించెను. నరేంద్రు డంగీకరించెను. లోన ప్రవేశించుచుండగనే నరేంద్రుడు అత్యాశ్చర్యముతో ఆగిపోయెను. తానింతకు ముందొకప్పుడు ఈయింటనుండినట్లును ప్రతిగదియు నడవయు తనకు పరిచితములైనట్లును అతనికి తోచినది. పూర్వజన్మస్మరణము కాబోలునని యత డనుకొనెను.

శరచ్చంద్రుడు నరేంద్రనాథుని కలిసికొనుటే గాక, వారిరువురిమధ్య గాఢప్రేమ యేర్పడిన దని విని శ్రీరామకృష్ణుడు అపరిమితానందము చెందెను. ఆయనకే సహజమైన ముదుగుశైలిలో ''ఏగిన్నెకు ఏమూత సరిపడునో ఇల్లా తెలుగును'' అనెను.

శరత్తు 1885లో ఎఫ్.ఏ. పరీక్షలో నెగ్గెను. అతనితండ్రి కొక మందుల అంగడి యుండెను. అందొక వైద్యుని నియమింప వలసిన ఆవశ్యకత కూడ నున్నందున అతడు కుమారుని వైద్యవిద్యను చదివింపగోరెను. వైద్యుడుగ నగుద మను కోర్కె శరత్తునకు లేదు గాని నరేంద్రనాథుని సలహాపై అతడు కల్కత్తాలోని వైద్యకళాశాలలో చేరెను. శరత్తు వైద్యుడుగ కా రా దనెడి విధినిర్ణయ ముండెను. శ్రీరామకృష్ణుడు వ్యాధిగ్రస్తుడై కాశీపూరుకు చేర్చబడినప్పుడు ఇతరులతోబాటు శరత్తును అక్కడే యుండి పరిచర్య చేయసాగెను.

శరచ్చంద్రుని ఈపరిణామమునకు అతని తండ్రి దిగులుపడెను. వారికుటుంబగురువు జగన్నాథతర్కాలంకారుడు. ఆయన ప్రసిద్ధ పండితుడు, పెక్కు తాంత్రికసాధనలలో నిష్ణాత, నిపుణుడైన అట్టి ఆచార్యుని విడిచి శరత్తు మఱియొకని ననుసరించుటయా! ఒక నాడు శరచ్చంద్రుని తండ్రి గిరీశచంద్రుడు జగన్నాథతర్కాలంకారుని కాశీపూరులో శ్రీరామకృష్ణునొద్దకు పిలుచుకొనిపోయెను. ఆయన ఉద్దేశ మిది: తమకులగురువునకును రామకృష్ణునకును సంభాషణ సాగునప్పుడు తమగురువునకంటె శ్రీరామకృష్ణు డెంత తక్కువైనవాడో స్పష్టమగును, కులగురువును తాను పరిత్యజించుట పొరపా టని శరత్తు స్పష్టముగ గుర్తించును. కాని సంభాషణ క్షణకాలము సాగినంతనే నిష్ణాతయైన ఆపండితుడు తన కెదుటనున్నవాడు ఒక పరంజ్యోతి యని గుర్తించెను. ''అట్టిగురుసమాశ్రయణము నందగల్గిన నీకుమారుడు భాగ్యశాలిఅని తలంపవలెను''- అని జగన్నాథుడు గిరీశుని చెవిలో చెప్పెను.

కావున శరత్తు శ్రీరామకృష్ణునికిసేవ చేయుచునే యుండెను. 1886-వ సంవత్సరము జన

వరి నెల 1-వ తేదీ అతనిస్థైర్యమునకు ఒరపిడి కలిగెను. శ్రీరామకృష్ణు డానాడు ఉద్రిక్త భావదశలోనుండి తనభక్తులను పెక్కుండ్రను స్పృశించెను. ఆస్పర్శ వారి మనస్సులను మహోన్నతాధ్యాత్మికస్థాయి కెక్కించెను. శ్రీరామకృష్ణుని ఆవైఖరిని గుర్తించి, సమీపముననున్న వారందఱును ఆయన దీవెనల నందుకొనుటకై పరుగున వచ్చిరి. శరత్తును లాటూను ఆసమయమున తమకు విధింపబడి యుండిన వేఱొకపనిలో నిమగ్నులై యుండిరి. అయాచితముగ ఆధ్యాత్మికోన్నతి లభించుచున్నదే అను తలంపునైనను వారిపనినుండి తొలగింప జాల దాయెను. అప్పుడు శ్రీరామకృష్ణునొద్దకు నీ వేల పోవైతి వని అనంతర కాలమున జిజ్ఞాసువులు తన్ను అడుగగా శరత్తు చెప్పిన జవాబు:—"పోవుట ఆవశ్యకమని నాకు తోచలేదు. నేనేల పోవలెను? నాకు ప్రియతమములైనవానిఅన్నిటికంటె గురుదేవుడే అధికప్రియుడు కదా. కావున నాకు ఆవశ్యకమైనదానిని తనంతట ఆయనే ఇచ్చుననుటకు సందేహమే మున్నది?" కావున నేను ఇంచుకేని ఆందోళన చెందలేదు."

ఒకనాడు గురుదేవుడు తనయువశిష్యులను భిక్షాటనకు పొం డని ఆజ్ఞాపించెను. నిరభ్యంతరముగ వారు ఆయాజ్ఞను నెఱవేర్చిరి. కాని వారిచక్కని రూపములు, వారుసంపన్నకుటుంబములకు చెందినవా రను విషయమును మఱుగుపఱుపజాలకపోయినవి. కావున భిక్షమడుగపోయినప్పుడు వారిలో కొందఱు 'అయ్యో' అనిపించుకొనిరి. కొందఱు తిట్లుతినిరి. కొందఱు అత్యంత సానుభూతితో ఆదరింపబడిరి. తన అనుభవములను శరచ్చంద్రుడు అనంతరకాలమున చిఱునవ్వునవ్వుచు ఇట్లు చెప్పెడివాడు : "నే నొక చిన్నపల్లెలో చొచ్చి భిక్షమడుగు సన్న్యాసులు చేయునట్లు భగవన్నామమును పల్కుచు ఒక యింటివాకిట నిలబడితిని. నాపిలుపు విని ఒక పెద్దామె లోపలినుండి వచ్చినది. దృఢమైన నాదేహమును చూచి మిక్కిలి తిరస్కారముతో "ఇంతగ బలిసియుండు నీకు బిచ్చమెత్తి బ్రతుకుట లజ్జావహముగ లేదా? నీవు కనీసము ట్రాముకండక్టరుగానైన ఏల కాగూడదు?" అని అఱచి దభాలున తలుపునుమూసికొని పోయినది.

(సశేషము)

## శ్రీ [illegible] మహారాజు

### శ్రీ శుద్ధసత్త్వానందస్వామి

శ్రీవివేకానందస్వామి జీవితచరిత్రముతో ఖేత్రీనగరమునకును భవ్యుడైన ఆనగరమహారాజు అజిత్సింగునకును అత్యంతసన్నిహిత సంబంధ ముండుటచే ఖేత్రీనగరమునకు పోయి చూచి రావలయునను ఆశ నాకు చిరకాలముగ నుండెను.

అందు కవకాశము 1961 నవంబరులో నేను ఢిల్లీలో నుండగా కల్గినది. రామకృష్ణసంస్థాధ్యక్షులగు శ్రీరంగనాథానంద స్వామిని పిలానిలోని బిర్లా ఇంజనీరింగు మున్నగుకళాశాలల విద్యార్థులును ఉపాధ్యాయబృందములును అచ[illegible] "[illegible]స్సి

ఉపన్యసింపు'' డని ఆహ్వానించియుండిరి. బిర్లా విద్యాసంస్థలకులపతి శ్రీ రంగనాథానంద స్వామిని పిలుచుకొనిపోవుటకు కారు నంపెను. శ్రీరంగనాథానందస్వామి ఆహ్వానింపగా మేము కొందఱము పిలానికి బయలుదేఱితిమి. పిలాని 120 మైళ్ల దూరమున నున్నది. శ్రీ రంగనాథానందస్వామి పిలానినుండి ఖేత్రీకిని పోవుదు నని చెప్పినందున ఆయన వెంబడి పోవుటకు మాకు ప్రత్యేకమైన మోజు కల్గినది. ఖేత్రీనగరము పిలానికి 30 మైళ్ల దూరమున నున్నది. ఢిల్లీ నుండి పిలానికిని పిలాని నుండి ఖేత్రికిని కాలము క్రమము తప్పక బస్సులు పోవుచుండును.

రాజపుటానాలో ఒక చిన్నజమీందారీ ఖేత్రీ. అది జయపురమునకు 90 మైళ్లదూర మున నున్నది. ఖేత్రియందు జయపురమహా రాజుకు ఎంతోమాట చెల్లుబడి కలదు. ఆసంస్థా నము చిన్నదైనప్పటికిని పురోగతియందు చాల ముందంజ వేసియుండెను. ఖేత్రీమహారాజు చాలవిశాలదృక్పథము కలవాడు. ఆయనకు శ్రీవివేకానందస్వామితో సంబంధము కలిగి ఆయన స్వామిజీయందు అత్యంతభక్తిగల వాడైన పిమ్మట ఆసంస్థానప్రజలపరిస్థితి మఱింత మెఱుగుదేఱెను. ఆరాజునకును శ్రీవివేకా నందస్వామికిని ప్రథమసమాగమము ఆబూ పర్వతమునొద్ద. అది 1891 లో ఏప్రిలునెల. శ్రీవివేకానందస్వామికి అప్పటి పేరు శ్రీవివిది షానందస్వామి. ఆయన నిర్జనమైన ఆబూ కొండగుహలో బసచేసియుండెను. దేశీయ ప్రభుకుమారులలో నొకనికి వకీలగు నొక మహమ్మదీయుడు స్వామీజీని ఈగుహలో కలసికొనెను. ఆయన వైదుష్యమును యోగ తేజస్సంభరిత గంభీరరూపమును అతనిడెంద మున హత్తుకొన్నవి. ఆమహమ్మదీయుడు స్వామిజీని ప్రార్థించి తా నొంటరిగ నివసించు చుండు ఇంటికి ఆయనను చేర్చుకొనెను.

కొన్నాళ్లలో స్వామిజీపేరు 'ఆబూ' కొండ ప్రాంతమందలి విద్యావంతులగు ప్రజలలో వ్యాపించెను. ఖేత్రీమహారాజునకు అంతరంగ కార్యదర్శియగు మున్షీజగ్మోహన్లాలు స్వామి జీని సంధించుటకై ఆభవనమునకు వచ్చెను మున్షీ జగ్మోహన్లాలు స్వామిజీని అడిగినమొదటి ప్రశ్న: ''సరి, స్వామీజీ, హిందూభిక్షువులైన మీరు మహమ్మదీయునితోకూడి ఎట్లు వసించు చున్నారు? మీ అన్నమును అత డంటియుం డునే''. మండిపడి స్వామిజీ ఇట్లు బదులు చెప్పెను: ''మహాశయా నేను సన్న్యాసిని. సకలసాంఘికవ్యవస్థలను అతిక్రమించినవాడను. నేను భంగి (పాకీ) వాని పంక్తిలోసైతము భుజింపగలను. ఇది దేవునకు సమ్మతమే. కావున దేవునికి నేను భయపడను. శాస్త్రము లును దీని నంగీకరించునవే. కావున వానికిని నేను భయపడను. కాని మీకు మీసంఘము నకు నేను భయపడుదును. దేవునిగూర్చియు శాస్త్రములను గూర్చియు మీ కేమియు తెలి యదు.'' ఈజవాబు జగ్మోహన్లాలుకు ఎంతయు మనసుకెక్కెను. స్వామిజీలో వెలుగొందు చున్న దివ్యతేజమును అతడుగుర్తించి మాంటు ఆబూకొండయొద్ద ఖేత్రీభవనమునకు రమ్మనియు ఖేత్రీమహారాజును సంధింపు మనియు స్వామిని ఆహ్వానించెను. రెండుదినములకు తర్వాత వత్తు నని స్వామి అనెను. కాని స్వామిజీని గుఱించి వినిన మహారాజు ఆయనదర్శనము నకు ఎంతయు ఉబలాటపడి ''నేనే పోయి ఆయనను దర్శింతు'' ననెను. ఆమాట విన్న తత్క్షణమే స్వామియే రాజభవనమునకు

చనెను. అక్కడ మహారాజు ఆయనను మహాదరముతో ఉపచరించెను. మామూలు ఆచారవ్యవహారములు ముగియగనే "స్వామీ, జీవితమనగా నేమి" అని ప్రశ్నించెను. అందులకు స్వామి చెప్పిన జవాబు : "ప్రతికూలపరిస్థితులను ప్రతిఘటించుచు పడయు వృద్ధియు, వికాసమునే జీవితము." మహారాజు పెక్కు ప్రశ్నలడిగెను. ప్రతిప్రశ్నకును స్వామి సూటిగను నచ్చునట్లుగను జవాబు చెప్పెను. ఆజవాబులు మహారాజు హృదయమున స్థిరముగ నాటుకొన్నవి.

తర్వాతిదినములలో వారు మరల మరల కలిసికొనుచుండిరి. ఖేత్రీలో తనభవనమునకు రమ్మని మహారాజు స్వామిని ఆహ్వానించెను. స్వామి నిరభ్యంతరముగ అంగీకరించెను. ఇద్దఱును జయపూరునొద్ద కలసికొనిరి, అక్కడినుండి ఖేత్రీవఱకు 90 మైళ్లు దూరము రాజుగారిబండిలో పయనించిరి. మహారాజు అత్యంత శ్రద్ధతో ప్రార్థింపగా స్వామి ఆయనకు మంత్రోపదేశము చేసెను. అద్భుతమైన శిష్యుడుగ రాజేర్పడెను. రాజు సాగిలబడి నమస్కరించి మహాభక్తితో స్వామియెదుట మోకాళ్లపై కూర్చుండెను. ఆచార్యుని హృదయమునుండి ఆఅనురూపశిష్యునిపై ప్రేమాశీర్వాదములు సహజముగ ప్రవహించెను. కాలము గడచుకొలది ఈ గురుశిష్యుల సంబంధము అత్యంతము ఆంతరంగికమైనదిగ పరిణమించెను.

సంభాషణసమయములలో మహారాజువివిధ విషయములను గూర్చి పెక్కుప్రశ్నలు అడుగుచుండెను. స్వామీజీ ఎట్టి విసుగును లేక జవాబులు చెప్పి అతనిసందేహముల నెల్ల తీర్చుచుండెను. ప్రియగురువునెడ మహారాజునకుండిన గాఢభక్తిని మాటలలోవర్ణింపజాలము. స్వామి నిదురించుచుండినప్పుడు మహారాజు ఆయనకు పాదసంవాహనము చేయుచు కొలిచియుండును. అంతటిది అతనిభక్తి. కాని ఇతరుల ఎదుట స్వామి రాజును ఇట్టిపనులను చేయనిచ్చెడివాడు కాడు. ఏలయన చూచిన ప్రజలకు రాజునందు గౌరవము తగ్గ వచ్చు.

ఇట్లు మహారాజు "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" (గీత IV-34) "సేవచే ప్రణామములచే ప్రశ్నలచే విషయ మెఱుంగుము", అనెడి శ్రీకృష్ణునాదేశమును తు.చ. తప్పక అనుసరించెడివాడు. స్వామియు ఆదర్శతత్త్వదర్శి కావున బ్రహ్మజ్ఞానమును అతనికుపదేశించెను. శిష్యునిప్రతిభ సునిశితమైనది. స్వామి యనుగ్రహముచే ఆఉపదేశములను ప్రాపించి అందుకు తానెంతయు అర్హప్రతిగ్రహీత యయ్యెను.

దేశమునకు విజ్ఞానశాస్త్రాభివృద్ధి ఎంతయు జరూరని తెల్పి స్వామిజీ మహారాజునకు ఆపరిశోధనలందు తీవ్రాసక్తిని కల్పించెను. విజ్ఞానశాస్త్రశాఖలను కొన్నింటిని మహారాజునకు స్వామియే బోధించెను. స్వామిమాటను తలదాల్చి మహారాజు తనభవనపు పైభాగమున నక్షత్రాదులను చూచుటకు వలయు సాధనముల నమర్చెను. భౌతికశాస్త్రపరిశోధనాలయమునుగూడ ప్రారంభించెను. స్వామీజీ అతనికి న్యాయశాస్త్రమునుగూడ బోధించెను. ఒకనాడు మహారాజు న్యాయశాస్త్రమును నిర్వచింపుమని స్వామీజీని కోరగా తడుముకొనక వెంటనే ఆయన చెప్పిన జవాబు: "నీతి పూర్తిగా ఆంతరమైనది. అది వెలుపలనుండునది కాదు. అది బుద్ధికిని అనుభూతికిని విషయమైనది...."

మహారాజు నాస్థానపండితుడగు నారాయణదాస్త్రీశర్మతో స్వామికి పరిచయ మేర్పడెను. శర్మ సంస్కృతభాషయందును పెక్కు శాస్త్రగ్రంథములందును ఎంతయు నిష్ణాత. ఆయన వైదుష్యమునకు ఎంతయు ప్రీతుడై స్వామీజీ ఆయనయొద్ద పాణినీయమైన అష్టాధ్యాయిని పతంజలిమహాభాష్యమును మఱికొన్ని శాస్త్రగ్రంథములను చదివెను.

స్వామీజీ తనకు శిష్యుడైనందుకు ఆపండితుడు అతిమాత్రప్రీతు డయ్యెను. మొదటినాటి పాఠము ముగిసిన వెంటనే ఆయన "స్వామీ, నీవంటి శిష్యుడు లభించుట యెంతయుఅరుదు" అనెను. స్వామికుండిన మహాద్భుతధారణశక్తియు అద్వితీయగ్రహణశక్తియు ఆపండితుని ముగ్ధు నొనర్చినవి. అచిరకాలములోనే అతడు స్వామితో "స్వామీ, ఇక బోధించుటకు నాయొద్ద నేమియు లేదు. నాకు తెలిసినదిచెప్పివేసితిని. దానిని నీవు పూర్ణముగ గ్రహించితివి" అనెను. స్వామి తనగురువును అర్హరీతిని గౌరవించి అతనికరుణకు తనకృతజ్ఞతను చెల్లించెను. అమెరికాలో నున్నప్పుడు కూడ ఈ పండితుని తనగురు వని పేర్కొనుచు ఇతనిని గూర్చి విచారించెడివాడు.

స్వామీజీ ఖేత్రీలో నున్న కాలమున మనోహరసంభవ మొకటి గలిగెను. అది వేసవి సాయంకాలము. సూర్యుడప్పుడే అస్తమించెను. ప్రకృతి అప్పుడే ప్రశాంత మగుచు వచ్చెను. చీకట్లు కమ్ముకొనుచుండినవి. మహారాజు మిత్రులతో గూడి ఆరామభవనమునకు పోయెను. తటాలున అతనికి స్వామీజీ జ్ఞప్తి కలిగెను. తత్క్షణమే అచ్చటికి రమ్మనెడి తన ప్రార్థనను స్వామి కందించెను. ఆయనరాగానే కొన్ని ఆధ్యాత్మికవిషయములను గూర్చి చర్చ సాగుచుండెను. అప్పుడు నర్తించుమహిళలోకజట్టువారు వచ్చి ప్రభువునకు ప్రణమిల్లిరి. వారిలో మధురమోహనకంఠముతో పాటపాడ గలిగినయొకతె పాడుటకు మహారాజు ననుమతిని కోరెను. ఆమె పాటప్రారంభింపనుండగా స్వామీజీ తనపీఠమునుండి లేచి విడిదికి పోగోరెను. అప్పుడా గాయకురాలు ముకుళితకరకమలయై స్వామి నిట్లు ప్రార్థించెను. "స్వామీ, దయచేసి ఆసీనులు కండు, నేనొక భక్తిగేయమును పాడగోరుచున్నాను. దయచేసి దేవరవారు దానిని విన్నచో నేను ధన్యురాల నగుదును". తాను నాట్యాంగన అయిన కారణముచేత స్వామి అటనుండి లేచిపోగోరెనని గుర్తించిన ఆమెకు చాల మనోవ్యథ కలిగెను. ఆమెదుఃఖమును అనుతాపమును ఆమెప్రార్థనలో ప్రకట మయ్యెను. మహారాజు గూడ "ఈమె పాడు భజనపాటలనిన అందఱికిని ఇష్టమే. కాబట్టి దయచేసి వినుడు" అని స్వామిజీని కోరెను. స్వామి సరే అని కూర్చుండెను గాని పరధ్యానమున నుండెను. సుప్రసిద్ధుడైన సూరదా సనెడి అంధయోగికవీంద్రుడు రచించిన యొక పాటను ఆమె పాడనారంభించెను. ఆమె తన హృదయమందలి భక్తి నంతటిని ఆగీతములో పలికించెను. ఆపాట పల్లవి ఇది :

"ప్రభు, మేరో అవగుణచిత న ధరో
సమదరసీ హై నామతిహారో
అబమోహి పార కరో"

ఈపాటను స్వామిజీయే ఆంగ్లములోనికి అనువదించెను. దాని ఆంధ్రానువాదము:

దేవ నాదోషములపైని దృష్టి నిడకు;
సమవిలోకను డను నామ మునుగు నీకు;

ఆలయములోన మూ_ర్తిగా నైన ఇనుము,
హంతకుని చేతికత్తిగా నైన ఇనుము—
ఈఇనుముల రెంటి నొకట నిడితి మేని
సరియె కా కాంచనము సేయు పరుసవేది.
దేవ, నాదోషములపైని దృష్టినిడకు;
సమవిలోకను డను నామ మమరు నీకు;
పావనంబైన యమునలో బరగు నీరు
మురుగుకాల్వలో బాఱెడి మురికి నీరు—
గంగలోబడ రెంటికి గల్గు తుల్య
మా పవిత్రత, వాసి సుం తైన లేక.

పాట ముగిసినది. అది శ్రోతలమనసులలో ప్రగాఢముగ నాటుకొన్నది. స్వామిజీ హృదయము పూ_ర్తిగా కరగినది. ఆయన కన్నుల నుండి బాష్పములు జాలువాఱినవి. "అహో, ఆయోగీంద్రుని ఈభ_క్తిగేయమును పాడి ఈ నాట్యాంగన 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ' అను మహావాక్యార్థమును నా మనస్సులో మేలుకొల్పినది". అని ఘోషించి స్వామి ఇట్లు వ్రాసెను. "ఆపాట వినగానే నామనసున ఇప్పటికిని నేను సన్న్యాసిని ఈమె నాట్యాంగన అను భేదదృష్టి మాసిపో లేదే. సర్వమందును బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుట అంత కష్టము!..."

ఆనాట్యాంగనతో స్వామిజీ ఇట్లనెను. "అమ్మా, నేను అపచారము చేసితిని. దయచేసి నన్ను మన్నింపుము. నీపైని నిరాదరముచే నేనిటనుండి లేచిపోనుంటిని. కానీ, నీఅద్భుతగీతమును అందలిభ_క్తిని ఉదా_త్తార్థమును వినగనే నాకు కనువిప్పు కల్గినది." అప్పటినుండియు స్వామి ఆమెను అమ్మా అనియే సంబోధించెడివాడు. ఆయన ఆశీస్సులచే ఆమె జీవితము మాఱిపోయెను. అప్పుడచ్చటనుండిన వారి కెల్ల ఈ అనుభవము నిజముగ రోమాంచము కలిగించినది.

స్వామికి జగత్ప్రసిద్ధమైన వివేకానంద నామమును పెట్టినవాడు ఖేత్రీమహారాజే అను విషయము పలువురకు తెలియదు. ఖేత్రికివచ్చినప్పుడు స్వామి తనపేరును వివిదిషానంద అని వ్రాసికొనుచుండెడివాడు. స్వామిజీ ఖేత్రికి వచ్చినది మూడుసార్లు. ఆయన అచ్చట గడపిన కాలము మొ_త్తము ఇంచుమించు ఐదు నెలలు. మొదటిసారి వచ్చినప్పుడు ఒక నాడు రాజును స్వామియు ఆసీనులై యుండ రాజు నవ్వుచు "స్వామీ, మీపేరు ఉచ్చరించుటకు కష్టముగ నున్నది. వ్యాఖ్యానసాహాయ్యము లేక ఆపేరున కర్థ మెఱుంగుటయు కష్టమే. అంతే కాక మీవివిదిషా కాలము దాటిపోయినది. వివిదిషా అనగా తెలిసికొనవలయునని కోరిక అని అర్థము. మీకు సర్వము తెలిసియున్నది. ఇక మీరు తెలిసికొనవలసినదేమియు లేదు" అనెను. ఆమాట స్వామికి నచ్చినది. "మఱి నా కే పేరు పెట్టుట నీ కిష్టము" అనిస్వామిఅడిగెను. రాజు "అల్పజ్ఞుడనగు నాకు తెలిసినంత వఱకు 'వివేకానందు' లను నామము మీకెంతయు తగి యుండును". అని చెప్పెను. స్వామి తనభ_క్తశిష్యుని కోరికను మన్నించి నాటినుండి 'వివేకానంద' అని సంతకము చేయ నారంభించెను. స్వామిజీని గూర్చి రాజున కుండిన చక్కని పరిజ్ఞానమును భ_క్తియు రాజునందు స్వామికుండిన మహానురాగమును పూర్వో_క్తసంభవములవలన తెలియ నగుచున్నది.

(సశేషము)

# భారతీయ యువకులకు స్వామి వివేకానందుని సందేశము

బ్రహ్మచారిణి శర్వాణి

దివ్యపురుషుడైన స్వామి వివేకానందుని శతతమ జయంతి మహోత్సవాలు వర్తమాన పరిస్థితుల ననుసరించి తగినవైభవాలతో ఈ సంవత్సరము విశ్వమంతటను కొనియాడ బడును. ఈసందర్భాన స్వామిజీకీర్తికి నమస్సులర్పించి ఆయన ఒసగిన అమరజీవిత సందేశమును ప్రతియువకుడును స్మరించి అనుష్ఠింప ప్రయత్నింపవలెను.

ప్రస్తుతదేశపరిస్థితులు, ఈనాటి ప్రపంచ చరిత్ర, మిక్కిలి విషాదకరముగా సాగుచున్నవి. ఎచ్చట చూచినను పేదవారు నిలుచుటకు నీడ, కట్టుకొనుటకు వస్త్రము లేక, ఆకలిదావాగ్నిచే మలమలమాడుచు తమ ప్రాణములను అరచేతులలో నుంచుకొని దైవ కృపకై వేచియున్నారు. సామాన్యప్రజానీకములో స్వామిజీ కోరినట్లుగా ఇంకను, తగినంత విద్యావ్యాప్తి కలుగక, అసంఖ్యాకులగు ప్రజలు నిరక్షరాస్యులై యున్నారు. జీవులచిత్తములలో నింకను ఆధ్యాత్మికసాధనలు కలుగకున్నవి. వారివైరాగ్యవిజ్ఞానములు పెంపొంద లేదు. ఇంతే కాదు ఇంకను ఎన్నో తీరరాని సమస్యలను పవిత్రభారతజనని మిక్కిలి సహనముతోను, ధైర్యసాహసములతోను తన అనుంగుపుత్రుడైన స్వామివివేకానందుని దివ్యవాణిపై నాధారపడి ఎదుర్కొనుచున్నది.

యతివరేణ్యుడైన స్వామివివేకానందుడు దూరదర్శి. భావిభారతదర్శనముపై ఆధ్యాత్మిక వాణిని ప్రవహింపచేసి భారతదేశమును పునరుద్ధరణనొందించి జనసామాన్యమును, పేదలను, సుఖవంతులొనర్చవలయు నని ఆనాడు ఆయన ఘోషించెను. ఈఘనకార్యము సాగించుటకై బలిష్ఠులు, మేధానిధులు, త్యాగవైరాగ్యచిత్తులు, సర్వకాలసర్వావస్థలయందు హృదయవిశ్వాసముతో కృషిచేయు యువకులు, ముందంజవేసిన యెడల భారతదేశము నెదుర్కొనుచున్న విషమపరిస్థితులన్నియు పరిష్కారము కాగల వని ఆయన ఆశించెను. వారిలో ఉత్సాహమును పురికొల్పుటకై స్వామిజీ ఇట్లు ఘోషించిరి. ''ఓ వీరభారత పుత్రా, ధైర్యము వీడకుము: నేనుభారతీయుడ నని గర్వింపుము: 'నేను భారతీయుడను ప్రతి భారతీయుడును నా సహోదరుడు' అని సగర్వముగా ప్రకటింపుము : ఉద్దేశములందును ఆశయములందును, భారతదేశీయసంస్థలను మించిన సంస్థలతోగూడిన దేశము ప్రపంచమున వేఱొకటి లేదని సదా జ్ఞప్తి నుంచుకొనుడు. వేదాంతజీవన వికాసముల నింటింటికిని గొనిపోయి, ప్రతివ్యక్తియందును నిద్రాణమైయున్న దేవత్వమును మేల్కొల్పుడు. సాంఘిక, రాజకీయాశయములను భారతదేశమున వ్యాప్తి చేయుటకుముందు పారమార్థికాశయములచే దేశము నాప్లావిత మొనర్పుడు......వత్సలారా: ఉజ్జ్వలదీక్షాదీక్షులు కండు. ఆశయసాఫల్యమునకుగాను కృషిచేయుడు. స్వార్థ

మును బాటద్రోలి కార్యాంగణమున నుఱుకుడు......’’

జ్యోతిః స్వరూపుడును, బలిష్ఠుడును ముఖమండలమున ప్రదీప్తాగ్నిజ్యోతి దీపిల్లు ఉజ్వల విశాలనేత్రములు గలవాడును, కాషివస్త్రములు ధరించినవాడును, దండకమండలధారియు, పరివ్రాజకుడైన, స్వామి వివేకానందుడు ఆనాడు కురుక్షేత్రములో శ్రీకృష్ణుని పాంచజన్య శంఖారావమువలె, ‘ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత—లెమ్ము, మేల్కొనుము, గమ్యప్రాప్తిపర్యంత మాగవలదు’ అని పదేపదే తనశంఖారావమునునలువైపుల మరల ప్రతిధ్వనింపచేయుట మనకు వినిపించుచునే యున్నది. అవును ఆయన ప్రారంభించిన మహోద్యమము నిర్వహించుటకు మనలో శిక్షణము పూర్తి కాలేదు. కావున ఆయన రాక మఱియు ఆయన శంఖారావము ఈనాడు మిక్కిలి అవసరము. కాని యువకులారా, స్వామిజీ విశాలనేత్రములనుండి మరల అశ్రువులు ఏకధారగా కాఱుచున్నవి! సర్వసంగపరిత్యాగియగు సన్న్యాసి కండ్లనీరు పెట్టుకొనుటలో నేమాత్రమును ఆశ్చర్యము లేదు. సన్న్యాసులకుకూడ హృదయ మున్నది. అవును, ఆనాడు అమెరికాలో బహుకోటీశ్వరుడగు నొకనింట విశ్రమింపవలసివచ్చిన నాటి రాత్రి ఆమెత్తని పాన్పుపై స్వామిజీకి నిదుర రాక, ఆపాన్పు ముండ్లమయమై తోపగా, ఆరాత్రియంతయు తనభారతదేశప్రజల దరిద్రతను స్మరించి స్మరించి విలపించుచు, ‘భారతదేశప్రజలను దారిద్ర్యమునుండి ఉద్ధరింపు’ మని భగవంతుని హృదయపూర్వకముగా ప్రార్థించెను.

కావున నేటి యువకులందఱును ఈ ఎడతెగని స్వామిజీ శంఖారావమును విని ఆయన ఆశించినట్లు అత్యంతవిశాలములు, మహోన్నతములు, అగు భావములను, పారమార్థికాశయములను, లోకులకు ప్రకటించి వానిని తమ దైనందిన జీవితమున అనుష్ఠించి ప్రచారము చేయుటకై బద్ధకంకణులు కావలయును. స్వామిజీమహోద్యమమును కొనసాగించు నిమిత్తమై జీవించి అహోరాత్రములు కృషి చేసి, ఆధ్యాత్మికతతో విశ్వమును జయించుటకై పోరు రణరంగమునందు, మరణించిన శాశ్వతశాంతి పొందగలరనుటలో సందియమును లేదు. స్వామివివేకానందుని నోటినుండి ఇట్లు వెలువడినది. ‘‘...ప్రాణములున్నంతవఱకు నేను నాయుద్యమమును విడువను. మరణానంతరముకూడ లోకకల్యాణార్థము కృషి చేసెదను...’’

కావున ప్రతియువకుడును తనఅలసతను, ప్రాలుమాలికను వీడి దీర్ఘనిద్రనుండి మేల్కొనవలయును. స్వామిజీ మాటలు ‘‘.....అలసతను నైహికాముష్మికభోగములను విసర్జింపుడు. త్యాగాగ్ని కీలలోదుమికి జనులకు పారమార్థికచింత గలిగింపుడు.’’

మనయువకులలో స్వామిజీ ఆశించినట్లు ఇపుడు కావలసినది బలము, పురుషకారము. బలముపొందగోరితిమేని ఉపనిషదుపదేశములకు తలదాల్పవలెను. స్వామిజీ ఇట్లనిరి. ‘‘‘నాయమాత్మా బలహీనేన లభ్యః’ ఈఆత్మ బలహీనులకు లభ్యము కానేరదు....హిమసంఘాతమువలె ప్రపంచముపై బడుడు. తద్భారమున ప్రపంచము గుభిల్లుమని పగిలిపోవుగాక.’’ ‘‘గీతాపఠనమువలనకంటె

కాలి బంతియాటమూలమున స్వర్గము నకు విశేషసన్నిహితుడవై యుందువు.''

"బలాఢ్యుడవై ధైర్యశాలివై నిలువుము. బాధ్యత నంతయు నీమీదనే పెట్టుకొనుము. నీసిద్ధికి నీవే కారణభూతుడవని ఎఱుగుము. నీకు వలయు శక్తియంతయు, సాహాయ్యమంతయు నీయందే కలదు. కావున నీభవిష్యత్తును నీవే నిర్మించుకొనుము.''

నేడు మన విశ్వవిద్యాలయములలో అసంఖ్యాకులైన యువకులు, విద్యల నభ్యసించియు మతమును విస్మరించి త్యాగశీలములనలవఱచుకొనక, ఐకమత్యము లేక పేరంగమందును కాలిడకున్నారు. వసుంధరలోని ప్రతివాడు తనవాడని ప్రేమించుశక్తి వీరిలో కలుగునదెప్పుడు? తమ విద్యార్థిజీవితములో సక్రమముగా విద్య నభ్యసింపక సమ్మెలుకట్టుచు వృథాకాలయాపనచేయుటలో కలుగు ఫలిత మేమి? వీరు ఆధ్యాత్మికశీలము నలవఱచుకొనునదెప్పుడు? స్వామిజీ ఈవిధముగా సింహగర్జన మొనర్చిరి. "ఇనుపకండరములు, ఉక్కునరములు, లోదంతరమున వజ్రాయుధతుల్యమగు మనస్సు, నాయనలారా, ఇవియే మన కిప్పుడు వలయునవి.'' హనుమంతునియచంచలభక్తియే దేశమున కిపు డావశ్యకము....భారతపుత్రులారా, నేడు మనము ధైర్యోత్సాహజనకములగు బ్రహ్మరుద్రతాళములను ధ్వనింపజేసి డమరును మ్రోగింపవలయును. హర! హర! మహావీర! వ్యోమ! వ్యోమ! యను నినాదములచే భూమ్యాకాశములను కంపింపచేయవలయును.''

కాబట్టి ప్రతియువకుడును తనదైనందిన జీవితములో మంచి అలవాటుల నలవఱచుకొని శీలమును పెంపొందించుకొనవలయును. మనస్సంయమువలననే నిజమైన శీల మేర్పడునని మఱియు వారీవిధముగా నుడివిరి. "ఒకనిదోషములను గూర్చి చెప్పుటచే నీవువానికి దోడ్పడజాలవు. అది వానికిని నీకునుగూడ హానికరమే....తనసోదరుని నిందింప వచ్చువాని మాటలకు చెవియొగ్గకుము. వానిని వినుటకూడ మహాపాపమే. భావిదుఃఖముల కది పుట్టినిల్లు. ప్రతివ్యక్తిలోపములను సహింపుము. లక్షల కొలది నేరములనైనను క్షమింపుము. నీతివర్తనుడవై యుండుము. ధీరుడవై యుండుము. మనఃపూర్వకముగా వర్తింపుము. ఎల్లరను ప్రేమింప యత్నింపుము.'' ఈ దివ్యసందేశమును యువకులందఱు తలదాల్పవలయును. అంతే కాదు. ముఖ్యముగా దుస్సాంగత్యమును సర్వవిధముల త్యజించి లౌకికులతోడి సహవాసము వీడవలయును.

యువకులు ఎన్నటికిని నిరుత్సాహవంతులు కారాదు. సదా మందహాసవదనముతో ఆనందముతో నుండుటకై ప్రయత్నింపవలయును. ఒరులకై సమస్తము త్యజించువానికే ముక్తి యనియు మహాత్యాగమువలననే మహాకార్యములు సిద్ధించుననియు మహాపురుషులు నుడివిరి. అవసరమగుచో తన విషయమును సంపూర్ణముగా మఱచి ఇతరులమేలుకొఱకై సమస్తమును త్యజించుటకు సిద్ధపడవలయును. స్వామిజీ ఇట్లు ఘోషించిరి. "ప్రతిజీవియు సాక్షాద్భగవత్స్వరూప మని గ్రహించి దరిద్రనారాయణుల నార్తనారాయణుల నర్చించు విధానము లోకమునకు మనము చూపవలసి యున్నది. భారతదేశమున నూతన సన్న్యాస సంప్రదాయమును స్థాపించుటయే నా జీవితోద్దేశము. జనసామాన్యము నుద్ధరించుటకై

జీవితములను ధారపోయుటయే యీ సన్న్యాసుల ఆదర్శము.'' మఱియు వారిట్లనిరి. ''భారతమాత యధమపక్ష మొక వేయిమంది యువకుల త్యాగమును గోరుచున్నది. — వలయునది పౌరుషముగల యువకుల త్యాగము, పశుప్రాయుల త్యాగము కాదు......ఈ మీ దరిద్రసోదరకోటి నుద్ధరించుటకై నూతన పరిస్థితుల గొనివచ్చుటకై — పేదలమెడ సానుభూతిని, క్షుధార్తులగువారల కడుపుమంట చల్లార్ప బట్టెడన్నమును, జనసామాన్యమునకు విద్యను జేకూర్చుటకై ప్రాణముల నర్పించు త్యాగులను చెన్నసగర మిపు డొందఱను సమకూర్పగలదా?''

# శ్రీ రామకృష్ణపరమహంస విలాసము

మూలమ్: శ్రీశ్రీ చిద్ఘనానందగిరిస్వాములవారు

తాత్పర్యకాదంబిని: శ్రీ శ్రీధరబాబు

(గతసంచిక తరువాయి)

53. పప్రచ్ఛ కశ్చి దాగత్య
వైదిక స్సుమహాజనః
రామకృష్ణ మహాభాగ
హ్యుపవీతః కుతో యయౌ ॥

అట్టిస్థితిలో వైదికబ్రాహ్మణు డొకడు వచ్చి 'రామకృష్ణా నీ యజ్ఞోపవీత మేది?' యని ప్రశ్నించెను.

54. వసన మ్మే గతం జ్ఞాత
న్న మయా తస్య దుర్గతిమ్।
కథం వేద్మ్యుపవీతస్యే
త్యూచే వాచం స భక్తిమాన్ ॥

'ఒంటిమీద బట్టయున్నదో లేదో తెలియకున్నది. ఇక యజ్ఞోపవీతము సంగతి నే నేమి చెప్పగలను?' అనినాడు ఆభక్తశ్రేష్ఠుడు.

55. కేచి దాహు ర్జనా దృష్ట్వా
రామకృష్ణం జితేన్ద్రియమ్।
యేత దున్మాదరో గీతి
నైవయుక్తో ఒర్చనే భవేత్ ॥

కొందఱు జితేన్ద్రియుడగు రామకృష్ణుని చూచి, 'ఇతడు పిచ్చివాడు. అర్చనకు తగడు' అనిరి.

56 తే తు పత్రన్ధర్మకర్త్రే
ప్రేషయామాసు రీదృశమ్।
ధీమ న్తమ్పూజకమ్పూజా
కర్మణ్యత్ర నియోజయేత్ ॥

అని నిశ్చయించి, ఇక్కడ పూజాదికములు నిర్వర్తించుటకు మఱియొక ధీమంతుని నియోగింపుడని ధర్మకర్తకు లేఖవ్రాసిరి.

57. తతః స ధర్మకర్తాపి
భార్యయా సాక మాయయా
దదర్శ రామకృష్ణ న్తం
సమర్చ న్త మ్పరం శివమ్ ॥

ఆధర్మకర్త భార్యతోసహా తరలివచ్చి పరాత్పరుడగు పరమేశ్వరుని సమర్చించుచున్న రామకృష్ణుని చూచెను.

58. సత్య మ్మృగయతా మీశ,
సర్వేషా మ్పరమా గతిః ।
త్వ మేవ విశ్వనాథో ఽసి
నదీనాం సాగరో యథా ॥

'ఈశ్వరా, సత్యాన్వేషకులకు నీవే చరమగతివి. నదులకు నాథుడగు సముద్రునివలె నీవే ఈవిశ్వములన్నిటికిని అధినాథుడవు.'

59. మంత్రపుష్పైః స్తువ న్దేవం
సమభ్యర్చ్య సభక్తిమాన్ ।
తిష్ఠ న్నేవ యయౌ యోగే
సమాధి మచలం సుఖమ్ ॥

అని మంత్రపుష్పములతో స్తుతించి, శివుని సమర్చించి ఆభక్తవరేణ్యుడు నిలబడియే నిశ్చలమగు సమాధిగతు డయ్యెను.

60. తిష్ఠ న్నే వాచల స్తత్త్వం
గతస్య పావనస్య చ ।
ఆసీచ్ఛ్రీరామకృష్ణస్య
ముఖాద్బ్రహ్మార్చిరుద్గమమ్ ॥

కదలిక ఇంచుకంతయు లేక నిశ్చలమగు అనుభవానందమును ఆస్వాదించుచున్న శ్రీరామకృష్ణుని ముఖారవిందము బ్రహ్మతేజమును వెదజల్లుచున్నది.

61. శిశో ర్ముఖం యథా తస్య
నిర్వికారముఖ మ్ప్రభా ।
నిర్మల ఇచ్ఛ ప్రశాంత ఇచ్ఛ
స్తన్యపానసుఖజకమ్ ॥

స్తన్యపాన సుఖాంబుధిలో మున్గిన నిర్మలము, ప్రశాంతమునగు శిశువు ముఖమువలె అతనినిర్వికారముఖమండలము శోభిల్లుచున్నది.

62. పునఃపునః స్తన్యపాన
వాఞ్ఛయాక్రన్దితస్య చ ।
శిశో రివ ముఖం హ్యాసీ
ద్రామకృష్ణస్య యోగినః ॥

మాటిమాటికి తల్లిపాలకొఱకు ఏడ్చు పసివానిమోమువలె శ్రీరామకృష్ణుని ముఖాబ్జము వెలుగుచున్నది.

63. సంకల్పవిరహ శ్చిత్తం
రోదనే నాప్తవాన్ సుధీః ।
కాలి కాలీతి కాలీతి
మాత ర్మా మ్పాతు చేతి సః ॥

సంకల్పవికల్పరహిత చిత్తుడై బుద్ధిని క్రమమార్గమున నియోగించిన ఆరామకృష్ణుడు 'అమ్మా, కాళీ, కాళీ, నన్ను రక్షింపుము' అని విలపించెను.

64. చిదానన్దమయ మ్బ్రహ్మ
మన్వానో మాతరం ప్రధీః ।
రామకృష్ణో మహాకాలీం
సిషేవే పరమః శుచిః ॥

చిదానందమయమగు బ్రహ్మమును మాతృమూర్తిగా భావనచేసి శుచిర్భూతుడై మహాకాళిని సేవించెను.

65. తత్రాపి స హి నిష్కామీ
ప్రేమానన్ద పిపాసయా ।
పీయూషసిన్ధు మధ్యస్థ
రత్నమీన ఇ వాబభౌ ॥

ప్రేమానందపిపాసువగు ఆనిష్కామభక్తుడు అమృతసముద్రమధ్యమునం దున్న రత్నమివాన మువలె భాసించినాడు.

66. చిన్తాభిః పీడితో లోకః
కీర్త్యై ద్రవ్యార్జనాయ వా।
స్వార్థో యాతి సుఖ శ్చిత్తం
సఙ్కల్పవఙ్కలి ప్తకమ్॥

కీర్తిప్రతిష్ఠలకు, ద్రవ్యార్జనకు ఆరాటపడి బాధపడు మనుజుల మలినసంకల్పములతో కూడిన చిత్తము సునాయాసముగా స్వార్థ మార్గమును త్రొక్కును.

67. దృష్ట్వా భక్త ర్ధర్మకర్తా
సమాలోచ్య ముహుర్ముహుః।
నాయ మున్మాదరోగీ స్యా
దున్మాదో ఽయం సుదుర్లభః॥

ఆస్థితిలోనున్న భక్తశ్రేష్ఠుని చూచి, ధర్మకర్త అనేకవిధములుగా ఆలోచించి 'ఇతడు ఉన్మాదరోగి కాడు. ఇతని ఉన్మాదము సుదుర్లభ మైనది.

68. కశ్చిత్కశ్చి ద్ధి చైతస్మా
దున్మాదా ద్యాతి నిర
పేపీయమాన మమృత
మితిబుద్ధ్వా ననామ తమ్॥

ఈ ఉన్మాదము అమృతత్వము ప్రసాదించు పరమార్థమును అందింపజేయు నని తలచి, రామకృష్ణునకు రెండుచేతులు జోడించి నమస్కరించెను.

69. గురుత్వే కాచనాసేద్యా
శాక్తేయతంత్రపణ్డితా।
దేవీమన్త్రోపదేష్ట్రీవా
వృద్ధాప్యస్య మహాత్మనః॥

ఆకాలమున శాక్తేయతంత్రప్రవీణ యొకతె (భైరవిబ్రాహ్మణి) కలదు. ఆమె దేవీ మంత్రోపదేశకురాలు ; వృద్ధాంగన ; మహాత్మురాలు.

70. జగ్రాహసా త్త్వికఙ్కృత్యం
శాక్తేయాద్రామకృష్ణకః।
నిర్మలానాం హి సర్వత్ర
నిర్మలఙ్మనమ్భవేత్ ॥

ఆమెవద్దనుండి రామకృష్ణుడు శాక్తేయ సాధనలను సాత్త్వికరూపములుగా గ్రహించెను. నిర్మలమనస్కులకు సర్వము నిర్మలముగనే కన్పడును.

71. మలినానాం హి సర్వత్ర
నిర్మలమ్మలినాయతే।
పద్మపత్రసమం రామ
కృష్ణో నిర్లేపతాం యయౌ॥

మలినమనస్కులకు సర్వత్ర నిర్మలముకూడ మలినమై పోవును. ఆస్థితిలో రామకృష్ణుడు పద్మపత్రముపై నున్న జలబిందువువలె నిర్లిప్తుడై నాడు.

72. ఏకదా చిన్తయత్స్వామీ
రామకృష్ణః స్వకే హృది।
కాలీమాతా కథమ్భుఙ్క్తే
నైవ భోజ్యన్నివేదితమ్॥

ఒకనాడు రామకృష్ణునిహృదయమున "కాళీమాత నిత్యము నివేదించుచున్న భోజనము నెందుకు భుజించుటలేదు" అనిన భావము పొడమినది.

73. యావద్దేవీ నివేద్యం య
ద్భుఙ్క్తే భోజ్య న్నచేదహమ్।
తావ ద్భుఞ్జే న భోజ్యఞ్చ
పానీయ న్న పిబామి చ॥

జగజ్జనని నివేదించిన అన్నమును భుజించు ర్యంతము నాకు భోజన మక్కఱ లేదు; నీరు ముట్టను.

74. ఇత్యానమ్య మహాదేవీ
    మ్ప్రణతార్తి హరాముమా
  కారుణ్యనిలయాం రామ
    కృష్ణః శపథవానభూత్ ॥

అని ప్రణతార్తిహారిణి, కరుణానిలయ, మహాదేవియగు ఉమకు నమస్కరించి, రామకృష్ణుడు శపథము పట్టెను.

75. దైవీక ప్రేమమత్తస్య
    ప్రేమభావోర్మి సఙ్కులమ్ ।
  కో వా జానాతి సంసారీ
    ధీవరా ఇవ చన్దనమ్ ॥

చేపలు పట్టువానికి చందనసౌరభము తెలియనట్లు సామాన్యపామరునకు పరమేశ్వర ప్రేమోన్మత్తుని అంతస్సముద్రమునుండి పైకెగయు భావతరంగములను గుఱించి ఎట్లు తెలియును?

76. కర్మకాణ్డవిధానేన
    సమారాధ్య మహేశ్వరీమ్ ।
  సమర్ప్య చాన్న నైవేద్య
    మ్బబన్ధ స కవాటకమ్ ।

అర్చనాకాండ ననుసరించి శాస్త్రోక్తముగా మహేశ్వరి అర్చించి, అన్నమును నివేదించి, గర్భాలయపు తలుపులు మూసెను.

77. గ్రీష్మాతపేన స నపే
    గఙ్గాసోపానకే యతిః ।
  శయనం కృతవా నాసీ
    త్ప్రరుదన్ శర్కరామయే ॥

అటు కవాటములను బంధించి, గ్రీష్మకాలపు ఉష్ణతకు క్రాగిన, దూళిధూసరితమగు సోపానముమీద పరుండి ఇట్లు విలపించెను.

78. 'మ దమ్బ జగదమ్బ త్వ
    న్నయావ ద్భోక్ష్యసే సుఖమ్ ।
  అన్న న్నివేదితం యావ
    న్నైవ భక్ష్యామి కిఞ్చన ॥'

'నీవు నాకు తల్లివి, జగత్తు లన్నిటికిని తల్లివి. ఈ నివేదాన్నము నీవు స్వీకరించువఱకు నే నేమియు ముట్టను'.

79. అనాదితో వియుక్తో ఽస్మి
    సంవిద స్త్వత్త ఈశ్వరీ ।
  వియుక్తో ఽయ మహాదేవి
    త్వయా త్వయి నియుజ్యతాః

ఈశ్వరీ, అనాదికాలమునుండి నీ నుండి నిస్సృతమగుచున్న జ్ఞానమునకు దూరుడనైతిని. ఇట్టి నేను నీ కరుణచే నీలో లీనుడనై పోవుదును గాక!

80. కరుణాయత లోచనత్రయా
    హ్యరుణామ్బురుహా పాదమాశ్రయే ।
  శరణాగతవత్సలే, శివే,
    కురు కారుణ్యకటాక్ష మాశ్రితే ॥

అమ్మా, నీవు కరుణతొణకిసలాడు మూడు కన్నులు కలదానవు. ఎఱ్ఱనిపద్మములవలె నున్న నీపాదములను ఆశ్రయించుచున్నాను.

81. స్మరణ మ్భవరోగ భేషజమ్
    కురుతే యో న భవే భవే దుమే ।
  కరుణావరుణాలయాపి యా
    కురుషే కి న్న నివేదిత మ్మయా ॥

నీస్మరణము భవరోగౌషధము. కరుణావర్షము కురియు మేఘమవై కూడ నాపై కరుణ వర్షించి నివేదిత మగు పదార్థమును స్వీకరింప వేల?

82. అరుణాధరి మీనలోచనే
పరమానన్దరసప్రవర్షిణి।
పరమేశ్వరి భుఙ్క్ష్వ భోజనమ్
కురు మాం మమ్బ పదాబ్జషట్పదమ్॥

పరమేశ్వరీ, నీవు ఎఱ్ఱని అధరముతో శోభిల్లుచున్నావు; మీనలోచనివి; పరమానందరసము వర్షించుదానవు. ఈనివేదనను స్వీకరింపుము. నన్ను నీ పాదపద్మమకరందము నాస్వాదించు మధుపముగా నొనరింపుము.

83. దయయా కురు భోజనం శివే
తవ పుత్రేణ మయా సమర్పితమ్।
సుతయో వివిధా హి వీచయ
స్త్వముమే నిత్యసుఖాంబుధిః స్వభూః॥

రుద్రాణీ, స్వయంభువవైన నీ నిత్యసుఖ సముద్రములో ని పుత్రులు తరంగములవంటి వారు. నేనుకూడ కుమారుడనే కదా! అట్టి నీబిడ్డ సమర్పించిన భోజనము స్వీకరింపుము.

(సశేషము)



# ప్రవ్రాజక వివిదిషానంద

## (ఏకాంకిక)

విద్వాన్, శిరోమణి శ్రీ వాదారి శ్రీనివాసశర్మగారు

### ౧ వ రంగం

(అళ్వారునగర వీథి)

శంకరం—(ప్రవేశించి) రామరామ! (నెత్తి మీద మొత్తుకుంటూ) ఇదేం పోగాలమో కాని ఒక్కడికైనా నీతి నిష్ఠా లేదే. స్నానం లేదు, పానం లేదు. తెల్లవారితేస్తే తిండిమీదే కలవరం. కాఫీలేనిదే శాస్త్ర పనికూడా జరగదంటారు—

కాప్యాధీనం జగత్సర్వం
కాప్యాధీనం తు దైవతమ్
తత్కాపి అయ్యరధీనం
అయ్యరో మమ దేవతా.

అంటారు అందరు. దీనికి ఎవడేంచేస్తాడు. అంతా ఘోరకలి.

సీతారాం—(ప్రవేశించి) ఏమండోయ్ శంకరంగారూ, ఇలాగేసి బయద్దేరారేం! ఎక్కడికీ వెళ్త?

శం—ఓహో సీతారాంగారా? ఇవాళ మా అమ్మాయి ఈఊరొస్తుంది. స్టేషనుకు రావలసిందని జాబు రాసింది. పిల్లా జెల్లావెంట బెట్టుకొని రావటం కాబట్టి పోతున్నా.

సీ—మీ అబ్బాయి ఉన్నాడుగా? వాణ్ణిపంప గూడదూ?

శం—సీతారాంగారూ, మీకు నేనుచెప్పాలా, ఈకాలం పిల్లలసంగతి - ఖర్మఖర్మ - ఎవరికివారే యమునాతీరే.

సీ—మీవాడలాంటివాడు కాడే, చాలా యోగ్యుడని, మంచి అలవాట్లుగలవాడని అం

దటూ అనుకుంటూ ఉంటే విన్నా.

శం—వాళ్ళ శ్రాద్ధం వాళ్ళకేం తెలుసు వాడి గొడవ. చదవవేస్త ఉన్నమతి కాస పోయిందిట. ఇంతదూరంచదువుకొని బ్రహ్మ సమాజంలో చేరాడు. అస్తమానం మీటింగులూ, ఉపన్యాసాలూ, స్నానమా? పానమా? సంధ్యా? నిష్ఠా? ఏమీలేదు.

—కాలం మారిపోయిందండి. మీరు కాస్త మీఅభిప్రాయాలుమార్చుకోవాలి, లేకుంటే బతకటమే కష్టమౌతుంది సుమండీ.

[రౌడిమస్తాను మూటెత్తుకొనివస్తూ తూలి పడతాడు. శంకరంగారికి తగులుతుంది]

శం—[మండిపడి] ఏయ్ కళ్ళుకనబడ్డంలేదూ? మీద పడతావ్ ?

మస్తాన్—అరే బొమ్మన్, ఇంకోసారి అట్లా మాట్లాడావంటే పళ్ళురాలగొడతా. కళ్లు తిరిగింది. క్రిందపడ్డా. సాయం చేయాల్సింది పోయి 'ఏయ్' 'గీయ్' అంటావ్? (మీదికి రాబోతాడు)

[శంకరం సీతారాం భయపడతాడు]

వివిదిషానందుడు— వీరి తగవు శ్రుతిమించి రాగానపడుతూఉంది. వారించాలి [దగ్గఱికి వస్తాడు] (శంకరంతో) అయ్యా మీరెందుకు ఇతనిదగ్గఱ నోరు పారేసుకుంటారు? మీంశుచిని మీరు కాపాడుకోండి [అంటూ కదలిపొమ్మని సైగచేస్తాడు. శంకరం సీతారాములు నిష్క్రమిస్తారు] (మస్తానుతో) పొరపాట్లు అన్నిచోట్లా ఉంటాయి అందుకని తగవులాడితే లాభమేమి? అసలెందుకీ కొట్లాట? ఇంతటికోపతాపాలు పనికిరావని నా అభిప్రాయం. నీమూట నేను మోస్తాను. పట్టు [అంటూ మూట ఎత్తుకొని సాయబువెంట నడుస్తాడు]

డాక్టరు ప్రవేశం

డాక్టరు—ఏమిటోయ్ మస్తాన్ ఇది. సన్న్యాసిచేత మూటమోయిస్తున్నావు? ఏమిటిది.

[మస్తాను గడగడ లాడుతాడు]

వివిదిషానందుడు—ఏమీలేదండి. మూట మోయలేక తూలి క్రిందపడ్డాడు. నేను ఆదుకున్నా.

డా—[ఆశ్చర్యపోయి] మీరు మహాత్ముల్లా కనిపిస్తున్నారే! మీలో ఇంతసంస్కారమా?

మస్తాన్— సాధుమహారాజ్ మీరు ఇంత గొప్పోరని తెలీదు. నాకు బుద్ధొచ్చింది. నీ చెప్పులోక్కపకడ్తా. మాఫ్ కరో సాధుజీ. [అని స్వామి కాళ్ళమీద పడతాడు.]

వి—[లేపి] నీవుభయపడవద్దు. నీ యింటిదాక నే తెస్తా యీమూట.

మస్తాన్—వద్దు. వద్దు. ఇంకాచేస్తే అల్లాకుమించదు. ఇలాఇవ్వండి. [అని తీసికొని వెళ్ళిపోతాడు]

డాక్టరు—[స్వామికినమస్కరించి] మీరెవరు. ఏఊరునుండి ఒచ్చారు?

వి—సర్వత్ర బ్రహ్మమును సాక్షాత్కరించుకొంటూ పర్యటించే యాత్రికుణ్ణి. ఒకప్పుడు మాది బెంగాలు. ఇప్పుడు జగత్సర్వం.

డా—మీరు బెంగాలీలా, నేనూ బెంగాలీనే. మాది కల్కత్తా.

వి—సరి కాని, డాక్టరుగారూ, ఈ ఊళ్లో సన్న్యాసులుండేందుకు తగినచోటు ఎక్కడుంది? కాస్త చూపి పుణ్యంకట్టుకోండి.

డా—సాధు మహారాజ్, మిమ్మల్ని చూస్తుంటేనే నాకేదో చెప్పరాని ఆనందం కలుగుతూంది. విశిది చూపిస్తాను రండి. [కలిసి వెళ్తారు]

తెరవాల్తుంది

## ౨ వ రంగం

[మాల్వీసాహేబు ఇల్లు]

డాక్టరు - మాల్వీ ప్రవేశం

డా— మైడియర్ ఫ్రెండ్, మాల్వీ, ఇవ్వాళ నేనుచూచిన సన్న్యాసి చాలా గొప్పవాడు. ఆయనముఖంలో తేజస్సు, ఆయన మాటలు, ఆయన ఉద్దేశాలు — ఇవన్నీ నన్ను మంత్రముగ్ధుణ్ణి చేశాయంటే నమ్ము. పుట్టి బుద్ధెఱిగి నేనిలాంటి సాధువును ఇంతదాకా చూల్లేదు.

మా—అరేభయ్యా!, ఏం స్వాములు. ఓయ్, మీస్వాములూ! దగ్గఱకుపోతే ఎగిరిపడతారు. పొరపాటున తగిలితే స్నానం చేస్తారు.

డా—ఫ్రెండ్ అలా అనకు. రౌడీమస్తానయ్య మాట మోశాడోయ్ ఈసాధువు. ఆరౌడీ చివరికి దారికొచ్చి స్వామిజి కాళ్లమీద పడి లెంపకాయ లేసుకున్నాడు.

మా—నిజంగానా! పోయిచూద్దాం పద.

## ౩ వ రంగం

[వివిదిషానందునిగది-కొందఱు పురజనుల నడుమ స్వామి]

వి—డాక్టరుగారి పుణ్యమాఅంటూ ఒకచోటు దొరికింది. డాక్టరుగారు మళ్ళావస్తామన్నారు, స్నేహితునితోపాటుగా.

[డాక్టరూ, మాల్వీవచ్చి నమస్కరిస్తారు]

డా—[మాల్వీని చూపుతూ] ఈయన నా మిత్రుడు, మాల్వీసాహేబు.

వి—నారాయణ! నారాయణ! రండి, రండి, అలాకూర్చోండి. మీరు వచ్చినందుకు నాకెంతో సంతోషంగాఉంది. మహమ్మదు గొప్ప ప్రవక్త. ఆయన నిర్యాణించి పదకొండు వందల సంవత్సరాలయినాయి. కాని ఈనాటిదాకా ప్రక్షిప్తాలుకాని మార్పులు కాని లేక ఉన్నగ్రంథం మీ 'ఖురాన్' ఒక్కటే.

[అందఱూ బహుశ్రద్ధతో ఆలకిస్తారు]

(శంభునాథజీ ప్రవేశం)

శం—సాధుమహారాజ్, నమస్తే. డాక్టరుగారి మూలంగా తెలిసింది మీసంగతి. దర్శించి పోదామని వచ్చాను. మీవాక్సుధ ఆస్వాదించాను.

వి.—రండి. కూర్చోండి. (శం. కూర్చుండును) ఎవరుమీరు? ఏంచేస్తున్నారు?

శం—నాపేరు శంభునాథ్ అంటారు. నేను ఈ ఆళ్వారు సంస్థానంలో ఒక ఇంజినీర్ని.

వి—మీ బస ఎక్కడ?

శం— పక్కవీథిలోనే. ఇక్కడికిఅరమైలు ఉంటుంది. మీకుఆక్షేపణ లేకుంటే, రేపు భిక్షకు మాయింటికిరావలసిందని ప్రార్థిస్తున్నా.

వి—అసలు నేనుచోటుమార్చాలనిచూస్తున్నా.

శం—మాయింటిలో ఏర్పాటు చేస్తాను. మీరెంతకాలంపాటున్నా, అది మాభాగ్యం. చోటు విశాలమైనది. ఎంతమందైనా రావచ్చు పోవచ్చు.

వి—ఎంతమందైనా అంటేచాలదు. ఏజాతులవారైనా ఏతాహత్తులవారైనా అనండి.

శం—చిత్తం. ధన్యోస్మి. తప్పేదయచేయండి.

తెరపడుంది

## ४ వ రంగం

[శంభునాథ్ జీ యిల్లు]

[భక్తగోష్ఠిలో స్వామి ఆసీనుడై ఉంటాడు]

ఒకసభ్యుడు—(లేచి) స్వామీ మీకులమే మండి?

వి—[విసుగులేకుండా] నాయనా, ఒకప్పుడిది కాయస్థశరీరం.

మఱొకసభ్యుడు—(లేచి) స్వామీ, మీరెం దుకు కాషాయపుబట్టలు కట్టారు?

వి—ఇది బిచ్చగాళ్ల వేషం. నేనో బిచ్చగాణ్ణి. తెల్లబట్టలు కట్టుకుంటే నేను బిచ్చగాణ్ణని తెలియక ఇతర బిచ్చగాండ్రు వచ్చి నన్ను యాచిస్తారు.

[ప్రవేశం దివాన్ రామనాథ్ జీ - స్వామితప్ప తదితరులంతా లేచి నిలబడుతారు]

శం— సాధుమహారాజ్, వీరు ఈసంస్థానాధీశులుంగారి దివాను, శ్రీరామనాథజీ

వి—దివాన్జీ, స్వాగతం.

ది—స్వామీ, ఎక్కడచూచినా మీమాటే ఎవరినోటివెంబడివచ్చినా మీ ప్ర శం సే. మిమ్మల్ని దర్శించాలని చాల ఉబలాట పడి, తీరికచేసుకొని వాలాను.

వి—పరిపాలన - తెంచిక్కదు - నిజమే.

ది—మాప్రభువులకి ఆటలన్నా వేటలన్నా చాలహుషారు. దానిలో ఉండేమజా వారికి పరిపాలనలో లేదు. కాబట్టి యావత్తు వ్యవహారాలు నేనేచూచుకొంటాను.

వి—మీ ప్రభువు ఎలాంటి వాడేమిటీ?

ది—వారిప్పుడిప్పుడే పాశ్చాత్యవిద్య పూర్తి చేసివచ్చారు. వారికి పాశ్చాత్య వ్యామోహం రోమరోమాలా వ్యాపించిపోయింది. హాలులో ఉండే దేవుడిపటాలన్నీ పెఱికి పారవేయించారు. అవన్నీ అజ్ఞానులవట. అన్నింటినీ వెటకారంగా చూస్తూంటారు. భారతీయ ధర్మాల్ని ఆచారాల్ని దుయ్యబడుతుంటారు. వారిని సరియైనదారికి తీసుకురావడం పెద్ద సమస్యే.

వి—దేవుడు అనుగ్రహిస్తే అన్నీ చక్కబడ తాయి.

ది—వీలుకలుగ చేసుకొని మహారాజును తప్పక పిలుచుకవస్తాను. దానికన్ని ఏర్పాట్లూ చేస్తాను.

వి—ఆలాగే కానీయండి.

తెరవాలుంది

## ౫ వ రంగం

[వివిదిషానందుని గది. మహారాజు మంగిళ సింగు మొదలుగా అందఱూ కూర్చునిఉంటారు]

మహా—(సగర్వంగా) స్వామిజి మహారాజ్, మీమాటలు వింటుంటే, మీరు గొప్ప విద్వాంసుల్లాగా కనిపిస్తున్నారు. ఇంత చదువుచదివిన మీరు ఉద్యోగంచేస్తే కావలసినంతధనం సంపాదించ వచ్చునే. ఎందుకీశాఠీ భిక్షుక వేషం?

వి—[నిర్భయంగా] వేటలనీ వేడుకలనీ మీ రెప్పుడు తెల్లవాళ్ల మార్గాలలో తిరుగుతూ, రాచకార్యాల్ని అలక్ష్యంచేసు న్నారు కదా! అలా ఎందుకు చేస్తున్నారో ముందు నాకు చెప్పండి.

[అందఱూ ఆశ్చర్యపడతారు]

మహా—[ఆలోచించి] వేరేకారణంచెప్పలేను. నాకు అది ఇష్టంకనక ఆలాచేస్తున్నాను.

వి—అయితే, నేనూనాయిష్టాన్నిబట్టే సన్న్యాసినయ్యానని మీరెందుకు అనుకోకూడదు?

మహా—స్వామిజీ, మతోమాట. విగ్రహారాధన అంధసంప్రదాయం అని అంగీకరిస్తారా?

వి—నన్ను హేళన చేస్తున్నారా?

మహా—కాదు, కాదు, నా అభిప్రాయం చెప్తున్నా. నిజంగా నేను ఇతరులలాగా ఱాయిని అప్పను పూజ చెయ్యను. నాకు నమ్మకం లేదు. దీనివల్ల నాకు అధోగతి వస్తుందా అని అడుగుతున్నాను.

వి—(కొంచెము ఆలోచించి, గోడమీదున్న రాజుగారి పటం కేసి చూచి) దివాన్‌జీ ఆపటం ఇలా తెప్పించండి.

[అందుకొని దివానుకు చూపి],

దివాన్జీ మీరు దీనిమీద ఉమ్మి వేయండి.

ది—(దిగ్భ్రాంతుడై గడగడలాడుతూ) స్వామీ మీరు నన్ను ఏంచేయమంటున్నారు? ఇది మా మహారాజావారి రూపం కదా.

వి.—కావచ్చు; స్వయంగా మహారాజు ఇందులో లేడుగా! మహారాజు శరీరంగాని, రక్తంగాని, ఎముకలుగాని ఇందులో లేవే? ఇది మహారాజులాగా మాటాడదే! కదలదే!

(కొంచె మాగి)

కాని మహారాజు బొమ్మమీద మీకుండే గౌరవం మహారాజుమీదిగౌరవమే కాబట్టి దీని మీద ఉమ్మటం మీరాజును అగౌరవ పరచటం ఒక్కటే అని మీకు తోచింది.

(రాజుపక్క

మహారాజా! చూశారా! ఈ చిత్రం మీరు కాకపోయినా, మీరే అయ్యారు. పటం చూచేవారికి మీరే దానిలో కనిపిస్తున్నారు. అందువల్ల మిమ్మల్ని గౌరవించేటట్టే పటాన్ని కూడా గౌరవిస్తున్నారు. ఇష్టదేవతారాధన లని పెట్టుకుని పూజించే భక్తుల విషయం కూడా అంతే.

విగ్రహం చూచేసరి వారికి తమ ఇష్టదేవతా స్వరూపమూ, గుణాలూ గోచరిస్తాయి. ఱాళ్ళను, రప్పలను, ఎవ్వరూ పూజించటం లేదు. వారు ఓఱాయీ, నిన్ను నేపూజిస్తాను. ఓరప్పా, నన్ను అనుగ్రహించు అని ప్రార్థన చేయటం లేదు. అలా ప్రార్థించిన హిందువుని — ఇన్ని దేశాలు తిరిగినాను కాని — ఎక్కడా చూడలేదు. ప్రతి విగ్రహారాధకుడూ విగ్రహామూలకంగా పరమేశ్వరుని ఆరాధిస్తున్నాడు. భగవంతుడే వారికి గోచరించేది. ఇదీ ఇందులోని మర్మం.

మహారాజు— (చేతులు జోడించి) స్వామిజీ, మీ అనుగ్రహంవల్ల ఈవిషయం నాకిప్పుడు బోధపడింది. ఈ దీనుణ్ణి కరుణించాలి.

వివిది—కరుణించేవాడు ఆభగవంతుడొక్కడే. మీరంతా దయాసముద్రుడైన ఆభగవంతుని ప్రార్థించండి.

జై శ్రీగురుమహారాజికీ.

అందరు—జై.

(తెరవాలుతుంది)

[మదరాసు వివేకానందకళాశాలవారు 'స్వామిజి' శతతమజయంతిమహోత్సవాల సందర్భమున ప్రదర్శించుటకై వ్రాయించిన యీనాటిక ఆకళాశాలాధ్యక్షుల అనుమతితో ఇందు ప్రకటింపబడినది—సం.]

# వార్తలు, విశేషాలు

## అశ్రుతర్పణము

శ్రీశాశ్వతానందస్వాములు (వయస్సు 69 సంవత్సరములు) ఆగస్టు 27-వ తేదీ రాత్రి 10 గంటలప్పుడు బేలూరు మఠములో మహాసమాధినొందినారు. రెండేళ్లుగా ఆయన హృద్రోగముతో బాధపడుచుండినారు. ఈ సంవత్సరములోగా జూలై 29-వ తేదీ మూడవసారి ఆయన ఆస్పత్రికి తేబడెను. వ్యాధి విషమించుకొలది ఆయన కోరికప్రకారము ఆగస్టు 23-వ తేదీ ఆయనను మరల మఠమునకు చేర్చుట జరిగినది. అత్యుత్తమమైనవైద్యము చేయబడుచున్నప్పటికిని అవసానము అనివార్యమై ముంచుకొని వచ్చినది. ఈయన శ్రీశివానందస్వాముల శిష్యుడు. 1919 లో వారణాసి సేవాశ్రమములో చేరినారు. 1925 నుండి 1928 వఱకు మద్రాసు స్టూడెంట్సుహోముకు వార్డనుగా నుండిరి. 1929 నుండి 1936 వఱకు బేలూరులో నిర్వాహకపరిషత్తులో సభ్యులుగ నుండిరి. 1936 నుండి 1944 వఱకు మద్రాసు మఠమునకు అధ్యక్షులుగ నుండిరి. 1947 లో ఆయన ట్రస్టీగాను సహాయకార్యదర్శిగాను నియమింపబడినారు. ఈపదవులకుతోడు 1959 లో శారదాపీఠాధ్యక్షత్వమునుగూడ అధిష్ఠించారు. దృఢవ్రతులు ప్రేమార్ద్రహృదయులు ఐన ఈయన సన్నిధికివచ్చిన యువకులు ఎందఱోఎంతో శ్రేయ మొందినారు. ఈయనను కోలుపోవటం ఈసంస్థకు తీరని లోటు. ఈయన ఆత్మకు శాంతి గల్గుత.

## శ్రీరామకృష్ణమఠము, మద్రాసు

శ్రీవివేకానందస్వామి సెంటనరీభవననిర్మాణము పూర్తియై దానిసంప్రోక్షణము 1963-వ సంవత్సరము ఆగస్టు 21-వ తేదీనాడు జరిగెను. శ్రీశారదా శ్రీరామకృష్ణ స్వామివివేకానందుల చిత్రపటములును సరస్వతీ-శ్రీరామచంద్రులపటములును అలంకృతములై అమర్చబడినవి. కూటమంతటను క్రింది అంతస్తును పై అంతస్తును 300 అడుగులపొడుగైన మార్గమును తోరణములతో మాలికలతో అలంకరింపబడినవి. శ్రీరామకృష్ణుని ప్రత్యేకపూజయు హోమమును కావింపబడినవి. భక్తులు దేవీమాహాత్మ్యమును భగవద్గీతలోను ఉపనిషత్తులలోను కొన్నిభాగములను పారాయణము చేసిరి. పురోహితులు వాస్తుహోమమును చేసిరి. ఈ కార్యక్రమమంతయు ఉదయము 6-30 గంటలనుండి 9-30 గంటల వఱకు జరిగినవి. భక్తులు అత్యధికసంఖ్యాకులు సమావేశమైరి. వారికి ప్రసాదము పంచిపెట్టబడెను. సాయం ఆరాత్రికమునకు పిమ్మట క్రొత్తభవనములో రామనామభజన చేయబడినది. 500 మంది భక్తులు పాల్గొనిరి.

భవనమునకు అంతస్తులు రెండు. క్రింది అంతస్తున శ్రీరామకృష్ణసెంటనరీ గ్రంథాలయమును పిల్లలగ్రంథాలయమును పత్రికాపఠనాలయమును కలవు. 800 మంది ప్రజలు కూర్చుండుటకు చోటుగల ఉపన్యాసకూటము గా ఇది ఉపయోగపడును. పిల్లల గ్రంథాలయ

మున్నవైపు గోడలమీద స్వామిజీబాల్య జీవితసంభవములు చిత్రింపబడి యున్నవి. ఆ బొమ్మలను భక్తికానుకగా చిత్రించియిచ్చిన శ్రీవిశ్వరంజన్ చక్రవర్తి, ఎమ్.ఏ. (కలకత్తా) గారికి మేము కృతజ్ఞులము. ఈభవనమునకు ప్రారంభమంగళోత్సవము యథావిధిగా 1964 జనవరిలో జరుగును.

### శ్రీరామకృష్ణానందస్వాములజయంతి

శ్రీ రామకృష్ణానందస్వాముల 101-వ జయంతి 1963 జూలై 19-వ తేదీనాడు మామూలు వైభవముతో జరుపబడినవి. మంగళ హారతి, పూజ, హోమము దరిద్రనారాయణ సంతర్పణము ఎప్పటివలెనే సాగినవి. జూలై 21 వ తేదీనాడు బహిరంగోత్సవము. మధ్యాహ్నానంతరము శ్రీబాలకృష్ణశాస్త్రులు జడభరతోపాఖ్యానమును హరికథాకాలక్షేపము చేసిరి. తర్వాత కూడిన పౌరసభకు సుప్రీమ్కోర్టుమాజీన్యాయమూర్తులైన శ్రీ టి.ఎల్. వెంకటరామయ్యరుగారు అధ్యక్షత వహించిరి. మఠాధ్యక్షులైన శ్రీమత్కైలాసానందస్వాములుఉదకమండల శ్రీరామకృష్ణాశ్రమాధ్యక్షులైన శ్రీనిష్కామానందస్వాములు వరుసగా ఆంగ్లమునను తమిళమునను శశిమహారాజజీవిత విశేషములనుగూర్చి ఉపన్యసించిరి. అధ్యక్షోపన్యాసానంతరము వివేకానందకళాశాల అధికారపరిషత్కార్యదర్శులైన శ్రీ ఎస్. పార్థసారథిఅయ్యంగారు సదస్సుకు కృతజ్ఞతాభివందనములు సమర్పించిరి. ఆరాత్రికము భజన —వీనితో కార్యక్రమము పూర్తి యైనది.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

### వేదాంత కేసరి

స్వామివివేకానందశతతమజయంతి మహోత్సవ సంచిక. పుటలు. 328, వెల: 3.00 ప్రాప్తిస్థానము : మేనేజరు, శ్రీరామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాస్-4.

స్వామి జీవితవిశేషములను గూర్చియు, సందేశమునుగూర్చియు విద్వద్వతంసులు వ్రాసిన గొప్పవ్యాసములు అర్ధశతమువఱకు ఇందు కలవు. దేశీయ విదేశీయస్థలములలో స్వామి పర్యటనమును సూచించు చక్కని అపూర్వ చిత్రపటములు కలవు. శ్రీ వివేకానందస్వాముల బాల్యజీవితమును చిత్రపటములతో వివరించు వ్యాసము జిజ్ఞాసువులకు అత్యంతప్రీతికరము. విషయమెఱుగగోరువారికి విశేషముల పరికింపగోరువారికి సరళ మధుర

ఆంగ్లసాహిత్యరసానుభవతృషితులకు ఈ సంచికకల్పవృక్షము వంటిది. ప్రతిగ్రంథాలయమునను ప్రతిపఠనాలయమునను తప్పక ఉండవలసినది. మీ ప్రతికి నేడే వ్రాయుడు.

## గీతోపదేశము

(అమూల్యము)

రచయిత: ఉపన్యాసరత్న - కవితావిశారద ధనకుధరం వరదాచార్యులు, శ్రీలక్ష్మీ నారాయణపురము, గుంటూరు-4.

మనమతమునకు భగవద్గీత పరమ ప్రమాణ గ్రంథం. ఉపనిషత్సారమే భగవద్గీత.

ఆదిశంకరభగవత్పాదులు, శ్రీ రామానుజులు, నిన్న మొన్న వెలసిన మహనీయులు లోకమాన్య బాలగంగాధరతిలక్, మోహనదాస్ కరంచంద్ గాంధీ, ఆచార్యవినోబాభావే, శ్రీనిర్వికల్పానందస్వాములు—మున్నగువారూ భగవద్గీతకు వ్యాఖ్యానములు వ్రాసి వాసి గాంచినారు.

ప్రాచ్యపాశ్చాత్యదేశములలో 'భగవద్గీత' విశేషవ్యాప్తినొందినది.

భగవద్గీత భగవన్ముఖోద్గతమైన గీత. దీన్ని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు కురుక్షేత్ర సంగ్రామారంభమున బోధించినాడు. జ్ఞానం ఉదయించింది అర్జునునికి. తత్ఫలితంగా కర్తవ్య నిర్వహణకు గడంగినాడు అర్జునుడు.

గీతాపారాయణంవలన అనంతమైన ఫలం ప్రాప్తిస్తుందని పద్మపురాణం ప్రబోధిస్తూంది.

శ్రీధనకుధరం వరదాచార్యులచే ముద్దులొలుకు చిన్నచిన్న వాక్యములచే రచింపబడిన ఈ 'గీతోపదేశము' భగవద్గీతకు సంక్షిప్త రూపం. గీతాసారసర్వస్వం ఇందు ఇమిడియున్నది. నిత్యం దీన్ని పఠించువారు గీతా పారాయణఫలం పొందగలరు. కనుక క్రింది గీతాప్రశస్తిని గమనింపుడు.

'సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాలనన్దనః
పార్థో వత్సః సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్.'

(1) శ్రీరామభజనకీర్తనలు
వెల: 25 న.పై.

(2) శ్రీశివభజనకీర్తనలు
వెల: 25 న.పై.

రచయిత: శ్రీ బూరెల సత్యనారాయణ మూర్తి, ప్రాప్తిస్థానము: శ్రీ చందా నారాయణశ్రేష్ఠి-పుస్తకములవ్యాపారము, సికిందరాబాద్ - హైదరాబాద్ - వరంగల్.

సకలగుణాభిరాముడైన శ్రీరామునిపై వ్రాసిన పాటలు మొదటిగ్రంథమున పొందు పరుపబడియున్నవి. అవి ఏయేరాగములలో పాడుకొనవలయునో కూడ తెల్పబడియున్నది.

రెండవగ్రంథము: సకలభువనములకు ప్రభువైన పరమేశ్వరునిలీలలను కీర్తించుచు వ్రాసిన పాటలు దీనిలో కలవు.

పై రెండు గ్రంథములు భజనకు చక్కగా ఉపయోగపడువిధంగా కీర్తనలు వ్రాయబడినవి. ఇవి భక్తుల పాలిటి పెన్నిధానములు.

-వేదం రామశాస్త్రి.

# శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు, మద్రాసు

## విరాళములకై విన్నపము

1963 జనవరిలో శతతమజయంతిమహోత్సవములకు యథావిధిగా అంకురార్పణము చేయబడినదని యెల్ల రెఱిగిన విషయమే. అప్పటి నుండి ఆమహోత్సవములు భారతదేశమందలి వివిధప్రాంతములలోనే గాక విదేశములందును జరుగుచున్నవి. మద్రాసుకు స్వామిజీతో గల సంబంధము చాలసన్నిహితము. కాబట్టి వారిశతతమజయంతి మహోత్సవములను యథోచిత వైభవముతో 1964 జనవరి 6-వ తేదీనుండి 20-వ తేదీవఱకు జరుపవలెనని తీర్మానింపబడినది.

భారతరాష్ట్రపతి డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి ఆదరమునను డాక్టరు సి. పి. రామస్వామిఅయ్యగారి ఆధ్యక్ష్యమునను సెంటనరీకమిటీవారు విభవోత్తరమైన కార్యప్రణాళికను నిర్ణయించిరి. ప్రణాళికలోని అన్ని అంశములు పూర్తియగుటకు దాదాపు పదిలక్షలరూపాయలు పట్టును. ప్రణాళికలో చేరిన బాలికలహైస్కూలు పుష్కలమైనగ్రంథాలయము, శిలావిగ్రహప్రతిష్ఠ, పత్రికాపఠనాలయము, శిశుకేంద్రము, (చిల్డ్రెన్స్ కార్నరు) ఉపన్యాసకూటము, తమిళమందును తెలుగునందును శ్రీవివేకానందస్వాముల సంపూర్ణగ్రంథావళిని ప్రకటించుట — మున్నగు అంశములు ఆచంద్రార్కము నిలుచునవి, పెక్కేండ్లపాటు ప్రజలకుపయోగపడునవి.

కేంద్ర — మద్రాస్ — ఆంధ్రప్రదేశప్రభుత్వములవారును కొందఱు మిత్రమహాశయులును దయతో ఔదార్యముతో విరాళము లిచ్చిరి. కావుననే ప్రణాళికలో అధికభాగమును ఇంచుమించు పూర్తిచేయగలిగితిమి. ప్రణాళికలోని తక్కిన అంశములు నిర్వహించుటకును ఉత్సవములను అర్హరీతి జరుపుటకును ఇంకను రెండులక్షల రూపాయలు కావలసియున్నది.

కాబట్టి శ్రీవివేకానందస్వాముల భక్తుల కందఱికీ దయతో ధారాళముగ విరాళము లిచ్చి శ్రీవివేకానందస్వాములు కలిపిన మానవసేవాలక్ష్యమునకు తోడ్పడ గాంచిన ధన్యతకు పాత్రు లగుదురుగాత మని విజ్ఞాపించుచున్నాము.

విరాళములకు వరుమానపన్ను లేదు. ''రామకృష్ణమిషను, స్వామివివేకానంద సెంటినరీ, C/o శ్రీరామకృష్ణమఠము, మద్రాస్-4 (ఇండియా) అను విలాసమునకు ధనవిరాళములను పంప ప్రార్థన.

శుద్ధ సత్త్వానందస్వామి,
సెక్రెటరీ, స్వామివివేకానంద సెంటినరీ కమిటీ,

2-9-1963

# శ్రీ శారదా ప్రసంగములు

**తృతీయ ముద్రణము**

**అనువాదకులు : కీ. శే. వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ.**

శ్రీరామకృష్ణుని సహధర్మచారిణియు, ఆదర్శసతియు, ఆదర్శయోగినియు, ఆదర్శమాతయునగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు! తేటతెనుగున రచింపబడియున్నవి.

346 పుటలు — వెల : రూ. 3-00

# శ్రీ కృష్ణవాణి

**సంకలనకర్త : శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వామి**

**అనువాదకులు : శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

పూర్ణావతారుడని ప్రసిద్ధిగన్న శ్రీకృష్ణుని సందేశమునందలి ముఖ్యాంశములు శ్రీమద్భగవద్గీతా భాగవతములనుండి ఏర్చి కూర్చి విడివిడిగా సులభశైలియందు ముద్రింపబడియున్నవి. నిత్యపారాయణయోగ్యమగు సూక్తిసుమమాల! ఆకర్షకమగు శ్రీకృష్ణుని త్రివర్ణముఖచిత్రముగలది!

(114 + 8 పుటలు) — మొదటి కూర్పు — వెల : రూ. 0-40

---

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4.

# OUR ENGLISH PUBLICATIONS

| | *Price.* Rs. | nP. |
|---|---|---|
| Sri Ramakrishna the Great Master (2nd Edn.) (Calico) | 25 | 00 |
| " " (Morocco) | 35 | 00 |
| The Gospel of Sri Ramakrishna (3rd Edn.) (Calico) | 20 | 00 |
| " " (Morocco) | 30 | 00 |
| Ramakrishna: Prophet of New India | 10 | 00 |
| Sri Ramakrishna .. | 1 | 50 |
| Sayings of Sri Ramakrishna (9th Edn.) | 5 | 00 |
| Ramakrishna Upanishad (2nd Edn.) | 1 | 00 |
| Tales and Parables of Sri Ramakrishna (2nd Edn.) | 2 | 50 |
| The Ramakrishna Mission its ideals and activities (6th Edn.) .. | 0 | 50 |
| Sri Ramakrishna and His Mission (2nd Edn.) | 0 | 62 |
| The Master and the Disciple .. | 2 | 00 |
| Sri Ramakrishna and Sarada Devi | 2 | 50 |
| Holy Mother Sri Sarada Devi (Gambhiranandaji) (3rd Edn.) (Ordinary) | 7 | 00 |
| " " (Calico) | 9 | 00 |
| Sri Sarada Devi the Holy Mother (Tapasyanandaji) (Ordinary) | 6 | 50 |
| " " (Calico) | 8 | 00 |
| Inspired Talks (Swami Vivekananda) (8th Edn.) (Board) | 2 | 00 |
| " " (Calico) | 3 | 00 |
| Hinduism (6th Edn.) .. | 1 | 00 |
| Education (6th Edn.) .. | 1 | 00 |
| The Eternal Companion (3rd Edn.) (Ordinary) | 2 | 25 |
| " " (Calico) | 3 | 25 |
| For Thinkers on Education (Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Story of a Dedicated Life (Life of Swami Ramakrishnananda) | 3 | 00 |
| The Message of Eternal Wisdom (Swami Ramakrishnananda) | 3 | 00 |
| God and Divine Incarnations (Swami Ramakrishnananda) | 2 | 25 |
| The Ancient Quest (Swami Ramakrishnananda) | 1 | 50 |
| Sri Krishna, The Pastoral and King-maker (Swami Ramakrishnananda) (5th Edn.) .. | 1 | 25 |
| Life of Sri Ramanuja (Board) .. | 4 | 00 |
| " " (Cloth) .. | 5 | 00 |
| Isavasya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Kena Upanishad (6th Edn.) .. | 0 | 75 |
| Katha Upanishad (9th Edn.) .. | 1 | 50 |
| Adventures in Religious Life (2nd Edn.) (Board) | 4 | 00 |
| (Cloth) | 5 | 00 |

| | *Price.* Rs. | nP. |
|---|---|---|
| Taittiriya Mantrakose .. | 1 | 00 |
| Prasna Upanishad (5th Edn.) .. | 1 | 00 |
| Mundaka Upanishad (6th Edn.) .. | 1 | 00 |
| Mandukya Upanishad (7th Edn.) .. | 0 | 75 |
| Taittiriya Upanishad (4th Edn.) .. | 2 | 00 |
| Aitareya Upanishad (3rd Edn.) .. | 1 | 00 |
| Svetasvatara Upanishad (3rd Edn.) | 1 | 50 |
| Chandogya Upanishad .. | 8 | 00 |
| Brihadaranyaka Upanishad (2nd Edn.) | 7 | 50 |
| Mahanarayanopanishad .. | 5 | 00 |
| Srimad-Bhagavad-Gita (Swami Vireswarananda, with Sridhara's Gloss) .. | 7 | 00 |
| Bhagavad-Gita: the Song of God (4th Edn.) | 2 | 75 |
| Upadeshasahasri (3rd Edn.) .. | 3 | 50 |
| Atmabodha (2nd Edn.) .. | 4 | 00 |
| Yatindramatadipika .. | 5 | 00 |
| Srimad Bhagavatam: The Wisdom of God (2nd Edn.) .. | 8 | 50 |
| Stotraratna (2nd Edn.) .. | 0 | 75 |
| Divine Life (4th Edn.) .. | 3 | 00 |
| Universal Prayers (5th Edn.) .. | 2 | 25 |
| Prince of Ayodhya (Ordinary) | 3 | 00 |
| " " (Calico) | 4 | 50 |
| Vedic Religion and Philosophy (4th Edn.) | 2 | 50 |
| Narada Bhakti Sutras (3rd Edn.) .. | 3 | 00 |
| Vakyavritti & Atmajnanopadeshavidhi (2nd Edn.) .. | 1 | 00 |
| Devi-Mahatmyam (Chandi) (2nd Edn.) | 2 | 00 |
| Saint Durga Charan Nag (3rd Edn.) | 2 | 25 |
| Thus Spake Sri Ramakrishna (7th Edn.) | 0 | 40 |
| Thus Spake Holy Mother (3rd Edn.) | 0 | 40 |
| Thus Spake Vivekananda (9th Edn.) | 0 | 40 |
| Thus Spake The Buddha (4th Edn.) | 0 | 40 |
| Thus Spake Sri Krishna (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake The Christ (3rd Edn.) | 0 | 40 |
| Thus Spake Prophet Muhammad (2nd Edn.) | 0 | 40 |
| Thus Spake Guru Nanak .. | 0 | 40 |
| Worship of Sri Ramakrishna .. | 1 | 00 |
| A Man of God (Ordinary) | 3 | 00 |
| " " (Calico) | 4 | 00 |
| Buddha and Our Heritage .. | 0 | 40 |
| Path to Perfection (7th Edn.) .. | 0 | 40 |
| Consolations (3rd Edn.) .. | 0 | 31 |
| Women of India (4th Edn.) .. | 0 | 25 |
| Spiritual Life .. | 0 | 06 |
| Path Beyond Sorrow .. | 0 | 06 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** *Publication Dept.,* **MYLAPORE, MADRAS-4**

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్సు ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦ ౧౯౬౩, అక్టోబరు; శోభకృత్తు - ఆః సంచిక ౪

## విషయసూచిక




'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦ ౧౯౬౩ అక్టోబరు :: శోభకృత్తు - ఆశ్వయుజము సంచిక ౪


శ్రీః

## శివానన్దలహరి (౪)

మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : సే. భ.

విరిఞ్చి ర్దీర్ఘాయు ర్భవతు, భవతా తత్పరశిర
శ్చతుష్కం సంరక్ష్యం, సఖలు భువి దైన్యం
విచారః కోవా? మాం విశదకృపయా పాతి శివ తే
కటాక్షవ్యాపార స్స్వయమపి చ దీనావనపరః ॥ ౧౬

| | | | |
|---|---|---|---|
| శివ | ఓమంగళస్వరూపా | లిఖితవాక్ ఖలు | (లలాటములందు) వ్రా పెట్టియున్నాడు కదా. |
| విరిఞ్చిః | బ్రహ్మ | | |
| దీర్ఘాయుః | చిరంజీవిగా | దీన | ఆరులను |
| భవతు | ఉండును గాక | అవన | రక్షించుటయందు |
| తత్ | అతని | పరః | ఆసక్తిగలదగు |
| పర | శేషించిన | తే | నీ |
| శిరః+చతుష్కమ్ | తలలు నాల్గు | కటాక్షవ్యాపారః | కడకంటిచూపు |
| భవతా | నీచే | స్వయమ్ అపి | తానే |
| సంరక్ష్యమ్ | కాపాడబడదగినవి | మాం | నన్ను |
| సః | అతడు | విశదకృపయా | స్ఫుటదయతో |
| భువి | భూలోకమున (ఎల్లరకు) | పాతి | కాపాడును |
| దైన్యం | దీనత(తోకూడిన బ్రతుకు)ను | విచారః | వగపు |
| | | కః వా | ఏమున్నది (లేనేలేదనుట) |

తా॥ ఓపరమపురుషా, బ్రహ్మదేవుని చిరంజీవిగ ఉండనిమ్ము. అలనాడు నీవు గిల్లి వేసిన తల పోగా, అతనికి మిగిలియుండు నాల్గు తలలను కాపాడుము. ఇహలోకవాసుల లలాటము లందు ''దీనజీవితములు గడపు'' డని ఆయన వ్రాసిపెట్టియుండుట ప్రసిద్ధమే. అయినను దీన సంరక్షణ దీక్షితమగు నీకడకంటిచూపు దయతో నన్ను కాపాడుచున్నది, కనుక విచారము లేనే లేదు.

ఫలా ద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేఽపి స్వామిన్, భవ దమల పాదాబ్జయుగళమ్
కథం పశ్యేయం, మాం స్థగయతి నమ స్సంభ్రమజుషాం
నిలిమ్పానాం శ్రేణి ర్నిజకనక మాణిక్యమకుటైః? ॥ ౧౬

| | | | |
|---|---|---|---|
| విభో | ఓవిశ్వవ్యాపీ | పశ్యేయమ్ | చూతును |
| స్వామిన్ | ఓప్రభూ | నమః | (నీపాదాలకు) మ్రొక్కుటలో |
| పుణ్యానాం | పుణ్యముల | | |
| ఫలాత్ వా | ఫలముచేతనో | సంభ్రమజుషామ్ | తొట్రుపాటుగల |
| మయి | నాయందలి | నిలిమ్పానాం | వేల్పుల |
| కరుణయా వా | కరుణచేతనో | శ్రేణిః | వరుస |
| త్వయి | నీవు | నిజ | తమ |
| ప్రసన్నే అపి | అనుగ్రహించువాడవైనను | కనకమాణిక్య | బంగారు రత్నాల |
| | | మకుటైః | కిరీటములచే |
| అమలం | స్వచ్ఛ | మాం | నన్ను |
| పాద+అబ్జ | పాదపద్మముల | స్థగయతి | కన్నులు మిఱుమిట్లు గొల్పుచున్నది. |
| యుగళమ్ | జంటను | | |
| కథం | ఎటు | | |

తా॥ ఓవిశ్వవ్యాపీ, ఓపరమపురుషా, నాపుణ్యములు ఫలించియో, నీ అవ్యాజకరుణ చేతనో, నీవు నాయందు ప్రసన్నుడవైనప్పటికిని, నీకు ప్రణమిల్లుటకై బారులు తీరి సంభ్రమించు వేల్పుల బంగారుకిరీటాల రత్నకాంతులు నాకన్నులకు మిఱుమిట్లుగొల్పుచున్నవే, నీపాదసందర్శనము నా కెట్లు ఘటిల్లును?

త్వ మేకో లోకానాం పరమఫలదో, దివ్యపదవీం
వహన్త స్త్వన్మూలాం పున రపి భజన్తే హరిముఖాః,
కియ ద్వా దాక్షిణ్యం తవ! శివ, మదాశా చ కియతీ!
కదావా మద్రక్షాం వహసి కరుణాపూరిత దృశా? ॥ ౧౭

| | | | |
|---|---|---|---|
| శివ | ఓమంగళరూపా | భజన్తే | ఉపాసించుచుందురు |
| త్వం | నీవు | తవ | నీ |
| ఏకః | ఒక్కడవే | దాక్షిణ్యం | దయ |
| లోకానాం | ప్రాణులకు | కియద్వా | ఎంతటిదో ! |
| పరమఫలదః | శ్రేష్ఠపురుషార్థమగు మోక్షము నిచ్చువాడవు | మత్ ఆశాచ | నా ఆశయు |
| | | కియతీ | ఎంతటిదో ! |
| హరిముఖాః | నారాయణాది దేవతలు | కదా | ఎప్పుడు |
| త్వత్ మూలమ్ | నీవలనగలిగిన | కరుణాపూరిత | దయనిండిన |
| దివ్యపదవీం | (వైకుంఠాది) దివ్యస్థానము (ల)ను | దృశా | దృష్టితో |
| | | మద్రక్షాం | నా రక్షణమును |
| వహన్తః | వహించుచున్నవారై | వహసి | నిర్వహింతువో |
| పునః అపి | మరలకూడ | నజానే | ఎఱుగను. |
| (త్వామ్ ఏవ) | (నిన్నే) | | |

తా॥ ఓపరమశివా, సకలప్రాణులకును మోక్షప్రదాతవు నీవొక్కడవే. విష్ణువు మున్నగువేల్పులకు వైకుంఠాదిదివ్యస్థానముల నొసగినవాడవు నీవే. ఆదివ్యస్థానములందుండియు వారు ఇంకను నిన్ను ఉపాసించుచునే యున్నారు. ఎంతెంతమహోన్నతపదవులం దున్నవారికైనను, నీవు ఉపాస్యుడవు. నీదయకు నా ఆశకు అవధులు లేవు. నీవు నన్ను దయజూచి రక్షించు టెన్నడో ఎఱుగకున్నాను.

దురాశాభూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే
దురన్తే సంసారే దురితనిలయే దుఃఖజనకే
మదాయాసం కిం నవ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతిశ్చేత్తవ శివకృతార్థాః ఖలువయమ్ ॥ ౧౯

| | | | |
|---|---|---|---|
| శివ | ఓమంగళరూపా, | సంసారే | ద్వంద్వప్రపంచమున |
| కస్య | బ్రహ్మదేవునకు | మత్ | నా |
| ఉపకృతయే | ఉపకారముచేయగోరి, | ఆయాసం | కష్టమును |
| దురాశాభూయిష్ఠే | చెడ్డ ఆశలు నిండినదియు | నవ్యపనయసికిమ్ | తొలగింపకున్నావా ? |
| దురధిప | దుష్టప్రభువుల | వద | చెప్పుము |
| గృహద్వార | ఇండ్లవాకిండ్లయొద్దకు | తవ | నీ |
| ఘటకే | చేర్చునదియు | ప్రీతిః | ప్రీతి |
| దురన్తే | అవధిలేనిదియు | ఇయంచేత్ | ఇదే అగునేని |
| దురితనిలయే | పాపములకునికిపట్టును | వయమ్ | మేము |
| దుఃఖజనకే | దుఃఖములగలిగించునదియు అగు | కృతార్థాః ఖలు | సఫలజన్ములముకదా |

తా॥ ఓమంగళరూపా, నేనీ సంసారమున శ్రమపడుచున్నాను. ఇది పాపములకు ఉనికి పట్టు, దుఃఖములకు ఉత్పత్తిస్థానము దురాశలతోనిండినది, దుష్టప్రభువులను సేవింపజేయునది. దీనికొక అంతము లేదు. దీనిని సృజించిన బ్రహ్మదేవునిమీాది పక్షపాతముచే, ఇందు నేననుభవించుచున్న కష్టములను తొలగింపకుందువా? చెప్పుమా. అదే నీప్రీతి అగునేని మాజన్మములు సఫలము లైనట్లే కదా! ఈ కడపటివాక్యమును విపరీతలక్షణ (ఐరని) గా గొనవచ్చును. లేదా—'ఓ దేవా, నీకు ఈ (=దీనజన) ప్రీతి యున్నచో మేముకృతార్థుల మగుదుముకదా'' అనియు కొనవచ్చును.

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖా స్వటతి ఝటితి స్వైర మభితః
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యన్తచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురువిభో॥ ౨౦

| | | | |
|---|---|---|---|
| కపాలిన్ | ఓబ్రహ్మకపాలధారీ | నటతి | నర్తించును |
| భిక్షో | ఓభిక్షూ | అభితః | అన్నివైపుల |
| శివ | ఓమంగళరూపా, | ఝటితి | తటాలున |
| విభో | ఓప్రభూ | స్వైరం | ఇచ్చవచ్చినట్లు |
| (మే) | (నా) | అటతి | తిరుగాడును |
| (హృదయ) | (మనస్సనెడి) | అత్యన్త | మిక్కిలి |
| (కపిః) | (వానరము) | చపలం | చంచలమగు |
| సదా | ఎల్లప్పుడును | మే | నా |
| మోహ | అజ్ఞానమనెడి | హృదయకపిం | మనస్సనెడి వానరమును |
| అటవ్యాం | అడవిలోను | భక్త్యా | భక్తి (అనుదారము) తో |
| యువతీనాం | జవరాండ్ర | దృఢం | గట్టిగా |
| కుచగిరౌ | చనుగొండ (ల) యందును | బద్ధ్వా | బంధించి |
| చరతి | సంచరించును | భవదధీనం | నీ వశము |
| నటతి | ఆడును | కురు | చేసికొనుము. |
| ఆశాశాఖాసు | కోర్కెలనెడి (చెట్టు)కొమ్మలందు | | |

తా॥ ఓదేవా, మిక్కిలిచపలమైన నా మనస్సనుకోతి. అడవులందును, కొండల పైనను, వృక్షశాఖలందును, అన్నివైపులను కోతి తిరుగుచుండును, ఎగురుచుండును, నర్తించుచుండును. అట్లే నామనస్సు అజ్ఞానమందును కామినులందును ఆశలందును అన్నియెడలను తిరుగుచున్నది, ఎగురుచున్నది, నర్తించుచున్నది. దీనిని భక్తిపాశముతో కట్టివైచి నీవశమందుంచుకొనుమా.

ధృతి స్తమ్భాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివస సన్మార్గఘటితామ్
స్మరారే మచ్చేత స్స్ఫుటపటకుటీం ప్రాప్యవిశదాం
జయ స్వామి౯ శక్త్యాసహ శివ గణై స్సేవిత విభో ॥ ౨౧

| | |
|---|---|
| స్మరారే | ఓమన్మథాంతకా |
| స్వామి౯ | ఓపరమేశ్వరా |
| శివ | ఓమంగళరూపా |
| గణైః | ప్రమథగణములచే సేవింపబడువాడా |
| విభో | విశ్వవ్యాపీ |
| ధృతి | దృఢమైన (మిథ్యనెల్లతథ్యముగ నెంచుట అను) |
| స్తమ్భ | స్తంభము |
| ఆధారాం | ఆధారముగగలదియు |
| దృఢ | గట్టి |
| గుణ | గుణములనెడి త్రాళ్లచే |
| నిబద్ధాం | కట్టబడినదియు |
| సగమనాం | చంచలమైనదియు(సంచార సామర్థ్యముగలదియు) |
| విచిత్రాం | వింతయైనదియు |
| విశదాం | (సకలదుర్వాసనాయుతమును) నిర్మలమును |
| పద్మాఢ్యాం | సింగారింపుతో(ధనాశతో) కూడినదియు |
| ప్రతిదివస | ప్రతిదినమును |
| సన్మార్గ | రాజమార్గమున (బ్రహ్మవిచారమార్గమున) |
| ఘటితామ్ | నెలకొల్పబడినదియు అగు |
| మత్ | నా |
| చేతః | మనస్సనెడి |
| స్ఫుటపటకుటీం | ప్రకాశవంతమగు గుడారమును |
| శక్త్యాసహ | పార్వతీసహితుడవై |
| ప్రాప్య | చేరి |
| జయ | ఉండుమా. |

తా॥ ఓపరమేశ్వరా, నాచిత్త మొక డేరా, మిథ్య నెల్ల తథ్యముగ నెంచుట అను స్తంభము దాని కాధారము. సత్త్వరజస్తమోగుణములు దాని కట్టుత్రాళ్లు. ఈడేరా ఒక చోటునుండి మఱొకచోటుకు సంచరింపగలది, దుర్వాసనావైవిధ్యము గలది, ధనాశ అనెడి చికిలీపని గలది. ఇది బ్రహ్మవిచారమార్గ మను రాజమార్గమున నెలకొనియున్నది నీ విందు పార్వతీసహితుడవై అధివసించి సర్వోత్కృష్టుడవుగ వెలుగొందుమా.



# శ్రీవివేకానందమరందబిందువులు (౯)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

మన జాతీయరక్తమునఁ బ్రవేశించుచున్న యీ ఘోరవ్యాధిని—ప్రతివిషయమును జూచి హేళనచేయుటను—అశ్రద్ధను—విడిచిపెట్టుఁడు. దానిని దరిఁజేరనీయకుఁడు. ధీరులై శ్రద్ధ నవలంబింపుఁడు. మిగిలినవన్నియు స్వయముగనే దాని ననుసరించును.

'మేము నిర్ధనుల' మనియు 'మాకు మిత్రులు లే'రనియుఁ గుందకుఁడు. ధనము మనకు మానవత్వమును సంపాదింపఁజాలునా? మానవుఁడే యెప్పుడును ధనమును సంపాదించువాఁడు. మానవశక్తిచే, ఉత్సాహశక్తిచే, శ్రద్ధాశక్తిచే—వీనిచేతనే ప్రపంచమంతయు నిర్మింపఁబడి యున్నది.

మతాభిమానపూరితుని తీవ్రతతో, గాంభీర్యముతో — నైహికవాది బాహ్యదృక్పథపై శాల్యము మేళవింపఁబడవలయును—ఇదియే నేను గోరునది. సాగరమంతటి గంభీరము, అనంతాకాశమంతటి విశాలము—నిట్టి హృదయమే మనకు వలయునది.

నీ యాదర్శము నెడఁ దీవ్రశ్రద్ధాభక్తులు—మహానిష,—తాత్కాలికమైనది కాక, యుఱుముల నడుమను మెఱుముల నడుమను నాకసమువంకనే చూచుచు, మేఘమండలమునుండి పడు బిందువులనే కాక మఱియొక నీటిని గ్రోవని చాతకపక్షినిష్ఠను బోలిన నిష్ఠ — నీ కుండ వలయును.

పవిత్రుఁడవగు ప్రయత్నమున శరీరమును ద్యజింపుము; సహస్రపర్యాయములైనను మృత్యువు నాహ్వానింపుము. నిరుత్సాహము జెందకుము. చక్కని యమృతము లభింపనియెడ, విషము గ్రాగవలయుననుట కది హేతువు కాఁజాలదు.

మతమునుగూర్చి యెన్నఁడును వాదులాడకుము. మతసంబంధమగు వాదోపవాదము లన్నియుఁ బారమార్థికశీలము లేదనియే తెలుపును. మతవివాదము లెప్పుడును గుంజును విడిచి తొక్కకే సంబంధించునట్టివి. పవిత్రతయుఁ బారమార్థికతయుఁ బలాయనమైపోవ, హృదయము శుష్కమైయుండునపుడే వివాదము లారంభమగును, అంతకు ముందుఁ గాదు.

వాదములను లక్షింపకుము, సిద్ధాంతములను గాని, సంప్రదాయములను గాని, యాలయములను గాని, దేనిని లక్షింపకుము ; ప్రతి

మానవునందునుగల బ్రహ్మతత్త్వము నందలి సారమగు పారమార్థికతతోఁ బోల్చిచూచి నచో నివి యెందులకును గొఱగావు ; పార మార్థికశీల మెంతవికాసముచెందునో మానవుఁ డంతటి మహిమాన్వితుఁడై యొప్పును. మొదట దానిని సంపాదింపుము. ఎవ్వనినిగూర్చియు విమర్శింపకుము, ఖండింపకుము ; ఏలన, సర్వ సిద్ధాంతములయందును సర్వమత సంప్రదాయ ములందును నేదియో కొంత మేలుండును. మత మనునది—ధర్మమనునది—శబ్దములతోఁగాని, నామములతోఁగాని, సంప్రదాయములతోఁ గాని కూడుకొనియుండునది కాదనియు సాక్షా త్కారమే మతమనియు — ధర్మమనియు— నీ జీవితముచే లోకమునకుఁ బ్రకటింపుము.

మనఃపూర్వకమగు విశ్వాసము, వినిర్మలా శయము—ఇవియే విజయోపేతములై యొప్పు నవి ; వీనిచే శోభించునట్టివారు కొలఁదిమంది యైనను సమస్తనిరోధములను నెదిర్చి నిలువఁ గలుగుదురు.

సత్యవ్రతము, నైర్మల్యము, స్వార్థరాహి త్యము ననువానిచే నొప్పువాని నణంచుశక్తి ముల్లోకములందును లేదు. అట్టివాఁడు విశ్వము నంతను నెదిర్చి నిలువఁ గలఁడు.

దౌర్బల్యమునకు గుఱియగు సమయము లలో నిట్లు పర్యాలోచించుకొనుము: నేనాతని (శ్రీరామకృష్ణుని) పుత్రుఁడనుగానా? ఆమహా నీయు ననుసరించు నే నిట్టినీచకార్యములు చేయ వచ్చునా ?'' దైన్యమును దుర్బలమనోభావ ములను జోనడచి, ధీరుఁడవై నిలిచి, ''నే ననంతశక్తి ప్రపూర్ణుఁడను, విశుద్ధధీనిధిని. అఖండ జ్ఞానస్వరూపుఁడను. సచ్చిదానందమయపర బ్రహ్మమును నేను !'' అని భావింపుము. ''నే నామహనీయుని శిష్యుఁడను. కామకాంచన విజేతయగు శ్రీరామకృష్ణుని దాసానుదాసుఁడ'' నను భావముననే నీ యహంభావమిమిడియుండ వలయును. ఇట్టి యాత్మగౌరవము లేనివానిలో నెన్నఁడును బ్రహ్మశక్తి ప్రజ్వలింపదు. ''జగ జ్జననీ పరిపాలనమున, నీ జగంబున నే భయ పడున దెవరికి?'' అను (నర్థమిచ్చునట్టి) రామ ప్రసాదునికీర్తనమును వినలేదా ? ధీరుఁడవై మహావీరనామమును స్మరించుచు, 'మహా మాయ'ను శరణుపొందుము. సమస్త ప్రపంచ మును బ్రహ్మస్వరూపముగాఁ జూడుము— దైన్యము, దౌర్బల్యము, పిఱికితనము నంత నిన్ను సమీపింపఁజాలవు.

నీయందును నీ దేశీయులందును శ్రద్ధా భక్తులను బురికొల్పుము. తత్త్వాన్వేషణము నకై యావశ్యకమగుచో, నచికేతునివలె యమాలయమునకైనను బోవుటకు వెను దీయ కుము ! భయమే మరణము, కావున నిర్భయుఁ డవు కమ్ము. భయరహితుఁడవై నేఁటినుండి యాత్మమోక్ష జగత్కల్యాణములకై నీ జీవి తము నాహుతి యొనర్పసంసిద్ధుఁడవు కమ్ము. కానిచో, నీ రక్తమాంసమయకళేబరమును మోయుటవలని ఫలమేమి ?



# "వివేకసంయమి"

శ్రీ బృందావనం రంగాచార్యులు

యుగములనాటి ఆర్షవిభవోద్ధతికిన్ బ్రతిబింబమైన నీ
మొగమును గాంచువారలు ప్రమోదపరీవృతచిత్తులై హిత
ప్రగతియుతప్రసిద్ధ నవభావపరంపర కూగిపోయి రీ
జగమున నిన్ను బోలగల సాధువు లేరి వివేకసంయమీ ? ౧

*

రుచులూరించుచు భవ్యభావబలమున్ రూపించు నీ వేషమే
ప్రచురమ్మైన యశమ్ము గూర్పగ, లసద్వాక్తృత్వవైశిష్ట్య ని
ర్వచన మ్ముజ్జ్వలశోభ బెంపగ, జగద్వంద్యుండ వైనాడ వ
య్య, చరిత్రల్ పులకించు దావక నవాధ్యాయమ్ముతో నిచ్చలున్.

*

చరితార్థుండవు భారతీయలసదాశాజ్యోతి వార్షాభిమా
నరతిన్నీ జగ మెల్ల నింపగ నుపన్యాసామృత మ్మాను మే
దురకారుణ్యరసావతారుడవు సంస్తుత్యుండ వత్యున్నత
స్ఫురదూహాబలవర్ధితాత్ముడవు సంపూర్ణుండవే అన్నిటన్. 3

పొంగుల్వారెడు గాంగనిర్ఝరికి పోల్పుం గూర్చు వాగ్గై
శృంగారప్రతిభాపరంపరలు వాసిన్ బెంపగా నన్యరా
జ్యాంగమ్ముల్ తలలూప బల్కితివి వేదాంతమ్ము సొంతమ్ముగా
బంగారమ్ములు పండిపోర్లినవి విద్వన్మూర్తి, నీ గొంతులో. ౪

*

నీ పయనమ్ము లోకోపకారాత్మక దీక్షాపథాన పరీక్ష కాగ
నీ యాశయము గణనీయధర్మావేశ వితతి రేకొల్పి సన్నుతుల గాంచె
నీ దర్శనమ్ము మహాదర్శమై మానవతలోన గల విభిన్నతల నణచె
నీ చూపు నవనవాలోచన ల్వీరియించి దేశదేశాల కుద్దీప్తి గూర్చె

నీ యుపన్యాసలీల వన్నెల వరాల
తరుణదైవిక భావమందారమాల
గా రహించి — సృజించె నిష్కలుషమాత్ర
భక్తిలో పారవశ్యమ్ము పలువిధాల. ౫

*

గురుకీర్తిం గొన బాట జూపెనె చికాగోవిశ్వవిద్వత్సభా
వరపీఠమ్ము – పవిత్రమానవతకున్ భద్రమ్ము జేకూర్చునే
పరమోత్కృష్ట విశిష్టధర్మ మని సంభావించి వాక్రుచ్చెనే
ధర యుప్పొంగగ నాడు – నీగళ మనంతప్రేమ నొల్కించుచున్. ౬

నయగారాజలపాతవైఖరుల నీ నాడైన గన్పట్టు ని
ర్భయదుర్భేధ్యమహాధికారయుతధారాశుద్ధితో సర్వదే
శయతీంద్రుల్ వెరగొంద సల్పిన ప్రశస్తమ్మా ప్రసంగప్రభా
మయతేజమ్ము నిరంతరాయముగ యుష్మత్కీర్తికిం జిహ్వామై. ౭

*

పండెన్ దండిగ సేల నల్గడల సౌభ్రాతృత్వసస్యమ్ము నీ
యండన్ ఖండము లన్నిటన్ మెరసె నయ్యా, భారతాధ్యాత్మికో
ద్దండప్రాభవ పాండితీగరిమ – సత్యస్వచ్ఛసందేశముల్
నిండెన్ శాశ్వతవైభవాభ్యుదయవాణీమూర్తి, నీ సత్కృపిన్. ౮

అమెరికా విశ్వమత సభాభ్యంతరమున
మారుమ్రోగిన నీదు వాగ్ధార లాని
చిగురు దొడగెను పాశ్చాత్యసీమ లెల్ల
పచ్చదనమున లోకాలు పకపక మనె. ౯



# శ్రీ శారదానందస్వామి

(గతసంచిక తరువాయి)

## [సంపాదకీయము]

శ్రీరామకృష్ణుని మహాసమాధి కనంతరము శరత్తు ఇంటికి మరలివచ్చినప్పుడు తల్లిదండ్రులు నిబ్బరపడిరి. కాని నరేంద్రనాథుని రాఖాలును అప్పుడప్పు డతని ఇంటికి వచ్చుచుండిరి. గురుదేవునిసందేశానుసారము జీవితమును నిర్మించుకొను టెట్లు అను విషయమునుగూర్చియే వారు సంభాషించుచుందురు. వారు ఆహ్వానింపగా శరత్తు అప్పుడప్పుడు మఠమునకు వచ్చుచుండెడివాడు. ఇందుకు అతని తండ్రి దిగులుపడి ఇట్లనెను. "శ్రీరామకృష్ణుడు ఉన్నంతవఱకు ఆయనకు సేవచేయుట పరిచర్యచేయుట ఆయనతోనుండుట సరియే, కాని ఇప్పు డాయన లేడే. ఏల నీవు ఇంట కుదురుగ నుండరాదు?" ఇట్టి మందలింపులకు ఉపయోగము లేక పోగా తండ్రి కుమారుని గదిలో పెట్టి బీగము వేసెను. అట్లు చేసిన, శ్రీరామకృష్ణునియువశిష్యులయొద్దకు ఇతడు పోకుండు నని, వారితో కలియకుండు నని-అత డనుకొనెను. శరత్తు ఇంచుకేని కలవరపడ లేదు. ధ్యానమందును తక్కిన ఆధ్యాత్మిక సాధనలందును అతడు కాలము గడపుచుండెను. కాని యాదృచ్ఛికముగ అతనితమ్మునికి అతనిపై జాలిపుట్టి అతడు తలుపు తెఱచెను. శరత్తు వెలుపలికివచ్చి బరానగరమఠమునకు పాఱిపోయెను.

1886 సంవత్సర క్రిస్మసులో నరేంద్రాదులు శ్రీప్రేమానందస్వాముల జన్మస్థలమగు ఆంతుప్పూరునకు పోయిరి అచ్చట వారు సన్న్యాసజీవనమును గడప నిశ్చయించుకొనిరి. మఱిసంవత్సరప్రారంభముననే వారు యథావిధిగా సన్న్యాసము స్వీకరించిరి. శరత్తు శ్రీశారదానందస్వామి యయ్యెను. ఈవార్త విని అతని తల్లిదండ్రులు బరానగరమునకు వచ్చిరి. ఈతూరి వారు వచ్చినది అతనిని నిరుత్సాహపఱచుటకు కాదు. అత డెన్నుకొన్న కార్యమార్గమును అనుసరించుటకు సమగ్ర స్వేచ్ఛ నిచ్చుటకే.

నిజమైన తపోవృత్తి ఇప్పు డారంభమైనది. బరానగరమున అర్ధరాత్రమప్పుడు నరేంద్రనాథుడును శరచ్చంద్రుడును ధ్యానసాధనకై శ్రీరామకృష్ణుని దేహమునకు అగ్నిసంస్కారము చేసిన చోటికో అట్టి మఱొక్కచోటికో రహస్యముగ పోయెడివారు. ఒక్కొక్కప్పుడు వారు రాత్రిని పూర్తిగా ఆధ్యాత్మికసాధనలో గడపెడివారు. ధ్యానజీవితమున ఇంతటి ప్రవణత కలిగియున్నను— సేవాకార్యనిర్వహణము చేయవలసివచ్చినప్పుడు శరచ్చంద్రు డందులకు సదా సంసిద్ధుడుగ నుండెడివాడు. సేవాసక్తి అతనికి సహజమైనందున సోదరశిష్యులలో ఎవరికి వ్యాధికల్గినను ఉపచరించుట కితడు సజ్జనే యుండెడివాడు.

శ్రీశారదానందస్వామికి మధురరక్తకంఠముండెడిది. దూరమునుండి వినువారికి అది స్త్రీకంఠ మనిపించును. ఒకనాటి రాత్రి ఇరుగు

పొరుగువారు కొందఱు, ఆవేళలో నొకమహిళ మఠమున నుండుట ఎట్లు సంభవించెనో అని కుతూహలితులై ప్రహరీగోడ నెక్కి సంగీతము వినవచ్చుచున్న గదిలోనికి పోయిరి. నిజము తెలియవచ్చినంతనే వారు లజ్జితులై మన్నింప వేడుకొనిరి. శారదానందుడు తన మధుర కంఠముతో "చండి"నిగాని ఇతరగేయములను గాని పాడినప్పుడు ప్రక్కనుండువారికి ఆధ్యాత్మికోన్నతి అనుభవగోచర మయ్యెడిది. అనంతరము వృద్ధుడైనప్పుడుగూడ శ్రీరామకృష్ణ వివేకానందుల జయంతిమహోత్సవసమయములలో ఉప్పొంగు ప్రేమభక్తులతో ఒకటి రెండు పాటలు పాడెడివాడు.

'పరిపూర్ణముగ భగవద్గతజీవనుడనై యుంద' మను ఆత్రము శ్రీశారదానంద స్వామిలో ప్రారంభమైనది. కావున నతడు తపస్సాధనకై పూరీజగన్నాథమునకుపోయెను. బరానగరమునకు మరలి వారణాసికి అయోధ్యకు పోయి తుదకు హరిద్వారముగుండ హృషీకేశమునకు చేరుకొనెను. అచ్చట కొన్ని నెలలు తపస్సులో గడపెను. 1890 వేసవి రాగానే అతడు శ్రీతురీయానందస్వామితోను వైకుంఠనాథ సన్యాలుతోను కలిసి గంగోత్రి మీదుగా కేదారనాథ బదరీనారాయణములకు బయలుదేఱెను. వారికి ఈయాత్రలో దేహములను పులకరింపజేయు అనుభవములు కలిగినవి. కొన్నాళ్లు వారు పస్తుండవలసివచ్చెను. కొన్నాళ్లు వారు నిలువనీడ లేకుండెడిది. అట్టి చిక్కులతోకూడిన ప్రయాణసమయములందు సైతము అత్యంతత్యాగకృత్యములను చేయుటలో అతడు వెనుకబడెడివాడు కాడు. ఒకనాడు చాలనిట్రముగనున్న కొండనెక్కుచుండిరి. సోదరశిష్యు లిద్దఱును ముందుండిరి. శ్రీ శారదానందస్వామి వెనుకనుండెను. ఒక్కొక్కరిచేతను ఒకకఱ్ఱయుండెను. శ్రీశారదానందస్వామి మెల్లగా దిగుచున్నప్పుడు తనకు వెనుక నున్న యొక జట్టులో నొకవృద్ధ స్త్రీని చూచెను. చేత కఱ్ఱలేనందున దిగుటకు ఆమె కష్టపడుచుండెను. "నాఅక్కఅకంటె నీ అక్కఅగొప్ప" అనెడి చరిత్రప్రసిద్ధాదర్శము ననుసరించి శ్రీశారదానందస్వామి తనచేతి కఱ్ఱను నిశ్శబ్దముగ ఆముసలామె కిచ్చివేసెను.

కేదారనాథము తురగనాథము బదరీనారాయణము అను క్షేత్రములను దర్శించిన పిమ్మట శ్రీశారదానందస్వామియు వైకుంఠనాథుడును 1890 జూలైలో ఆల్మోడాకు వచ్చి లాలా బదరీనాథ్షాగారి యింట అతిథులుగ నుండిరి. ఆగస్టునెలయప్పటికి శ్రీవివేకానందస్వామియు శ్రీఅఖండానందస్వామియు ఆల్మోరాకు చేరిరి. అందఱునుకలసి గర్హ్వాలునకు బయలుదేఱిరి. అచ్చట వివిధప్రదేశములను చూచినపిమ్మట టెహ్రీకి వచ్చిరి. శ్రీ అఖండానందస్వామి జబ్బునపడెను. ఆఊరిలో మంచి వైద్యుడు లేనందున ఆయన డేరాడూనుకుకొనిపోబడెను. దారిలో ముసూరీకి క్రింద రాజ్పూరు నొద్ద వారు యాదృచ్ఛికముగ శ్రీతురీయానంద స్వామిని కలిసికొనిరి. కేదారనాథమునకు పోవుచున్నప్పుడు శ్రీశారదానందస్వామినుండి చీలిపోయిన శ్రీతురీయానందస్వామి తపస్సుకై యిచ్చటికి వచ్చెను. శ్రీఅఖండానందస్వామికి వ్యాధి యించుక నయము కాగానే ఆయన మీరట్టుకు పోయెను. శ్రీవివేకానందస్వామియు శ్రీతురీయానందస్వామియు శ్రీశారదానందస్వామియు హృషీకేశమునకు పోయిరి. అచ్చటనుండగా హరిద్వారసమీపమున కంఖాలునొద్ద శ్రీబ్రహ్మానందస్వామి తపస్సు

చేయుచున్నాడను వార్త వారికి తెలియనయ్యెను. కావున వారందఱును ఆయనను కలిసికొనుటకు కంఖాలుకు పోయిరి. అచ్చట నుండగా శ్రీఅఖండానందస్వామి మీరట్టులో నున్న సంగతి వీరికి తెలిసెను. ఆయనదర్శనప్రీతికై అందఱును మీరట్టునకు పోయిరి. కొన్ని నెల లచ్చటనుండి అందఱును ఢిల్లీకి వచ్చిరి. ఢిల్లీయొద్ద శ్రీవివేకానందస్వామి వీరిని విడిచి ఒంటరిగ పర్యటింప నేగెను. తర్వాత శ్రీశారదానందస్వామి మథుర, బృందావనము, ప్రయాగ మున్నగు క్షేత్రములను దర్శించుచు వారణాసికి వచ్చెను. వారణాసిలో శ్రీశారదానందస్వామి గాఢధ్యానపరుడై కొంతకాల ముండెను. మిక్కిలి అస్థగలయొక భక్తుడు గురువు నన్వేషించుచుండి ఈయనను దర్శించెను. ఈయన అతని హృదయమున స్థిరమైన స్థానము గడించెను. ఆభక్తుడు ఈయనయొద్దనే సన్న్యాసదీక్ష స్వీకరించి శ్రీసచ్చిదానందస్వామిగ నయ్యెను. 1891 వేసవిలో శ్రీఅభేదానందస్వామి శ్రీశారదానందస్వామిని కలిసికొనెను. ఇద్దఱును పూర్వోక్తభక్తునివెంట నిడుకొని ఆపుణ్యనగరముచుట్టును సుమారు నలువదిచదురపు మైళ్లు పాదయాత్ర గావించిరి. ఈయాత్రలో వారు పడ్డ కష్టములఫలితముగ ముగ్గురికిని తీవ్రజ్వరము పైకొనెను. జ్వరము తగ్గిన కొన్నాళ్లకు శ్రీశారదానందస్వామికి అతిసారవ్యాధియు కలిగెను. కావున 1891 సెప్టెంబరు నెలలో ఆయన బరానగరమఠమునకు మరలి రావలసివచ్చెను.

బరానగరమున మేలైన వైద్యవసతులున్నందున శ్రీశారదానందస్వామికి వ్యాధి పూర్తిగా నయ మయ్యెను. అంతట మాతృశ్రీని దర్శించుటకై ఆయన జయ్రామ్బాటికి బయలుదేరెను. జయ్రామ్బాటిలో శ్రీశారదానందస్వామికి కాలము చాల హాయిగా గడచెను. కాని ఇచ్చటనుండగా ఆయనకు మలేరియా జ్వరము అంటుకొనెను. దానితో, ఆయన బరానగరమునకు మరలిన పిమ్మట కూడ, బాధపడుచుండెను.

పాశ్చాత్యదేశములలో శ్రీవివేకానందస్వాముల ఉద్యమము చాల పెంపొందియున్నప్పుడు ఆయన కొక సహాయుడు కావలసివచ్చెను. ఆస్థానమునకు తుదకు శ్రీశారదానందస్వామి యెన్నుకొనబడెను. కావున శ్రీవివేకానందస్వామి రెండవసారి 1896 లో లండనునకు వచ్చినప్పుడు, ఏప్రిలు మొదటి తేదీనాడే అచ్చటికి వచ్చియుండిన శ్రీశారదానందస్వామిని కలిసికొనెను. లండనులో శ్రీశారదానందస్వామి కొన్ని ఉపన్యాసములు కావించెను. కాని అచిరకాలములోనే ఆయన న్యూయార్కుకు పంపబడెను. న్యూయార్కులో వేదాంతసొసైటీ అప్పటికే స్థాపింపబడియుండెను. అమెరికాకు వచ్చినవెంటనే మతములను పోల్చి పరిశోధించు గ్రీనేకరు పరిషత్తున ఉపాధ్యాయులలో నొకడుగనుండు మని ఈయనకు ఆహ్వానమువచ్చెను. ఆ సమావేశమునకు పిమ్మట బ్రూక్లీను న్యూయార్కు బోస్టనులలో ఉపన్యసింప ఈయన ఆహ్వానింపబడెను. ఎక్కడికి పోయినను ఈయననడవడిలోని ఉదాత్తత మృదుసరసత్వము అన్నివిధముల ప్రశ్నలకు జవాబు చెప్పు సంసిద్ధత ఈ అన్నిటికంటె ఈయన అధిరోహించియుండు ఆధ్యాత్మికపరమోన్నతి — ఈ గుణములు ఈయనకు పెక్కండ్రు మిత్రులను అభినందకులను భక్తలను సంపాదించినవి. తర్వాత శ్రీశారదా

నందస్వామి వేదాంతోద్యమమును సక్రమముగా కొనసాగించుటకు న్యూయార్కు నగరమున స్థిరవాస మేర్పఱచుకొనెను.

శ్రీవివేకానందస్వామి భారతదేశమునకు మరలిన పిమ్మట ఏసంఘమును ప్రారంభించెనో అదే ఇప్పుడు రామకృష్ణమిషను అన బరగుచున్నది. ఆసంఘకార్యనిర్వహణమునకు ఆయన కొక సమర్థుడు కావలసివచ్చెను. అందుకు శ్రీశారదానందస్వామిని పిలిపించెను. శ్రీశారదానందస్వామి 1898 జనవరి 12-వ తేదీనాడు అచ్చట నావలో బయలుదేఱి దారిలో లండను, పారిసు, రోము మున్నగు నగరములను దర్శించుచు ఫిబ్రవరి ప్రారంభమప్పటికి కలకత్తాకు వచ్చిచేరెను. రోములో ఆయన సుప్రసిద్ధమైన పీటరుయోగీంద్రుని పెద్ద గుడిని (కెథిడ్రల్) దర్శించెను. అంతకు రెండేండ్లకు మునుపు లండనునకు పోవుచు దారిలో ఆయన ఆగుడిని దర్శించినప్పుడు భావసమాధి నిమగ్నుడైనాడట. విస్మృత బాహ్యలోకుడైనాడట. పూర్వజన్మములో ఈయన జీససు ననుచరులలో నొక డని గురుదేవుడు చెప్పుచుండెడివాడు. ఈసమాధ్యనుభూతి గురుదేవుని ఆ మాటను నిజపఱచునా?

మఠమునొద్దకు వచ్చినవెంటనే ఆయన రామకృష్ణమఠమిషనులకు కార్యదర్శి (సెక్రెటరీ)గా నియోగింపబడెను. ఆపదవియందు ఆయన బ్రతికినన్నినాళ్లుండెను. తన ఆఫీసు పనులను నిర్వర్తించుటే గాక ఆయన మఠములోని వారి ఆధ్యాత్మికక్షేమమునుగూడ విచారించుకొనుచుండెను. ప్రజాహితమునకై ఉపన్యాసములు కావించుచుండెను. తరగతులు పెట్టి పాఠములు చెప్పుచుండెను.

కొన్ని నెలలపిమ్మట కాశ్మీరమునందున్న శ్రీవివేకానందస్వామికి అనారోగ్యము పైకొన్న దను తంతివార్త రాగా శ్రీశారదానందస్వామి అచ్చటికి బయలుదేఱెను. దారిలో ఆయన కొక కష్టము కలిగెను. రావల్పిండికిని శ్రీనగరమునకును మధ్య పోవుచున్నప్పుడు ఆయన కూర్చున్నబండి గుఱ్ఱము తటాలున భయపడి కొండక్రిందికి పరుగుతీసెను. బండి అక్కడ ఒకచెట్టుకు కొట్టుకొనెను. శ్రీశారదానందస్వామి బండినుండి వెలికుఱికెను. అప్పుడే పైనుండి ఒకపెద్దబండ ఆగుఱ్ఱముపై బడెను. అది నలిగి చచ్చెను. ఈవిధముగ శ్రీశారదానందస్వామి మాత్రము అద్భుతమైన రీతిలో తప్పించుకొనెను. అంతకంటెను ఆశ్చర్యకరమైన విషయ మే మనగా అట్టి విపత్క్షణమున గూడ ఆయన తనమనోనిర్భరతను కోల్పోవలేదు.

లండనుకు పోవుచుండగా మధ్యధరాసముద్రమునొద్ద పెనుతుపాను తానున్న నావను ఉఱ్ఱూతలూపినప్పుడు కూడ శ్రీశారదానందస్వామిలో ఇట్టి నిర్భరతయే కనవచ్చెను. ఓడలోనున్నవారందఱు గడగడలాడిపోయిరి. జీవితాశ వదలుకొని ఇటుఅటుపరుగులెత్తిరి. భయమును అణచుకోలేక పెక్కండ్రు ఆక్రందించిరి. కాని ఈదృశ్యమున కంతటికిని శ్రీశారదానందస్వామి మౌనసాక్షిగ నుండెను.

మఱొకప్పుడు ఆయనకలకత్తానుండి బేలూరుకు గంగలో పడవలో పోవుచుండెను. ఆయనతో మఱొకభక్తుడు నుండెను. పెనుతుపాను వీచి ఆపడవ పొంగెక్కిన కెరటముల మధ్య దాదాపు మునిగిపోవుచుండెను. కాని శ్రీశారదానందస్వామి ప్రశాంతముగ హుక్కాలో పొగపీల్చుకొనుచుండెను. ఈ ప్రశాంతతకు

ఆభక్తుడు చాలమండిపడి ఆహుక్కాను పెటికి గంగలో పాఱవైచెను. ఆభక్తుని ఈకోపము నకును దయాంచితమైన మందహాసమే స్వామి ప్రత్యుత్తరము.

శ్రీనగరునొద్ద శ్రీవివేకానందస్వామికి వ్యాధి నిమ్మళించెను. ఆయన తన పాశ్చాత్య శిష్యులకు కొందఱికి ఆర్యావర్తమందలి పుణ్య క్షేత్రములను చూపవలసిన దని శ్రీశారదా నందస్వామిని కోరెను. ఈయాత్రకనంతరము ఆజట్టువారు కల్కత్తాకు చేరిరి.

1899 ఫిబ్రవరి 7-వ తేదీనాడు శ్రీశారదా నందస్వామి శ్రీతురీయానందస్వామితో కలసి ఆధ్యాత్మికసందేశప్రచారము కావించుటకును మఠమునకు విరాళములు సంపాదించుటకును గుజరాతుకు బయలుదేఱెను. కాన్పూరు, ఆగ్రా, జైపూరు, అహమ్మదాబాదు, లిమ్డీ, జునగడము, భావనగరు మున్నగుచోట్లలో సంచరించినపిమ్మట, వారు మేనెల ప్రారంభ మున మఠమునకు మరలి వచ్చిరి. ఏలయన మరల పాశ్చాత్యదేశములకు బయలుదేఱవలె నని పన్నాగించుకొన్న శ్రీవివేకానందస్వామి వీరికి తంతివార్త నంపెను.

ఆసంవత్సరము డిసెంబరులో అనివార్యము లైన ఆహ్వానములను మన్నించుటకై ఆయన ఢాకాకు నారాయణ్గంజుకు బరీసాలుకు పయనిం చెను. ఈచోట్లందెల్ల ఆయన సాన్నిధ్యము మహాసంచలనమును కలిగించెను. బరీసాలులో ఆయన ఎనిమిది దినము లుండెను. పౌరమహా సభలలో మూడుసార్లు ఉపన్యసించెను. కాని తమ ఆధ్యాత్మికసమస్యలను పరిష్కరించు కొనుటకు ఆశ్రమముతో గుంపులుగుంపులుగ వచ్చిన ప్రజలతో ఆయన రాత్రింబగళ్లు మాటాడుచుండవలసివచ్చెను. శ్రీరామకృష్ణుని ప్రదును వివేకానందస్వామి సోదరశిష్యు డును ఒకడు తమ నగరమునం దడుగిడినందుకు బరీసాలులో మహాభక్తుడును రాజకీయనాయ కుడు నగు అశ్వినీకుమారదత్త ఆనందపరవశు డయ్యెను. అశ్వినీకుమారునింట ఉన్నన్నినాళ్లు సేవాదుల నాదరించుటలోను. వివిధసమస్యలను వారితో చర్చించుటలోను శారదానంద స్వామి కాలములో విశేషభాగము గడచినది. 1900 జనవరిలో ఆయన బేలూరుమఠమునకు మరలి వచ్చెను.

ఆదినములలోనే ఆయన తాంత్రికసాధన లకు పూనుకొనెను. శశికి తండ్రియు శరత్తుకు పితృవ్యుడును (మాతులుడును?) అగు ఈశ్వర చంద్రచక్రవర్తి తాంత్రికసాధనలో నిష్ణాతుడు. శ్రీశారదానందస్వామికి ఈసాధనలకు కావల సిన ఉపదేశములను ఆయన కావించెను. సర్వత్ర లోకజననిని సాక్షాత్కరించుకొనుటే తాంత్రికసాధనల లక్ష్యము. ఈసాధనలో ఆయన సిద్ధిపొందినా డనుట ఆయన వ్రాసిన 'భారతీశక్తిపూజ' అను చక్కని బెంగాలీగ్రంథ సమర్పణపత్రమున వ్రాసిన పంక్తులను బట్టి ఊహింపవచ్చును. అందు ఆయన వ్రాసినది : ''ఎవరి అనుగ్రహముచే ఈరచయిత భువియం దలి ప్రతిమహిళయందును లోకమాతృప్రత్యేక రూపమును సాక్షాత్కరించుకొనెనో వారికి ఈగ్రంథము అత్యంతభక్తితో సమర్పితము''

శ్రీవివేకానందస్వామి రెండవసారి పాశ్చాత్యదేశములకు పోయి 1900 డిసెంబ రులో ఆకస్మికముగ బేలూరుమఠమునకు మరలివచ్చినప్పుడు ఆయనకు అనారోగ్యము పైకొని యుండెను. అంతే కాక ఆయన తాను ప్రారంభించిన ఉద్యమమునకు సాధ్యమైనంత అభివృద్ధి తనజీవితకాలముననే చూడవలె నని

ఆత్రపడుచుండెను. కావున ఆయన అప్పుడప్పుడు తనవ్యవహారములలో చాల కచ్చితముగ నుండెడివాడు. అట్టిసమయములలో సోదరశిష్యులలో ఆయనకు పరమాదర ప్రేమపాత్రులైనవారికి సైతము ఆయనను సమీపించుటకు ధైర్యముండెడిది కాదు. ఇందుకు శ్రీశారదానందస్వామి అపవాదము. గంభీరమైన ఆయన శాంతస్వభావము ఎవరికోపమునైనను చల్లబఱుప గలదు. ఆయనలోని ఈ గుణమును గుర్తించి శ్రీవివేకానందస్వామి తమాషకు ఇట్లనెడివాడు : "శరత్తులో నున్న రక్తము మత్స్యరక్తము. దానికి వెచ్చదనమెప్పుడును కలుగదు!" శ్రీ శారదానందస్వామి కుండిన అత్యంతాత్మనిగ్రహమునకు పెక్కుదాహరణములను చెప్పుచుందురు. మఠము ఆలంబజారులో నున్నప్పు డొకదినము ఆయన గుడిలోనికి పోయి చూడగా వంటవాని అడుగుజాడలతో ఆచోటంతయు మలినముగ నుండెను. తత్క్షణము ఆయన వంటవానిని పిలిచెను. పాప మతడు స్వామి మహాగ్రహమునకు తాను గుఱికావలసివచ్చునని నిరీక్షించుచు గడగడలాడుచు వచ్చెను. ఇంతలోనే స్వామి తన్ను తనవశములోనికి తెచ్చుకొని అతనితో "ఏమియు లేదు, నీవు పోవచ్చు" అనెను. స్వామి కుండిన శాంతియు, సహనశక్తియు అపారములు. దారితప్పిన పెక్కండ్రను ఆయన తన ప్రేమచేతను ఓర్పుచేతను దారికి తెచ్చిన ఉదాహరణములు పెక్కులు కలవు. వేఱెవ్వరికిని లోబడని పెక్కండ్రు ఆయనకు భవ్యులై పరివేష్టించి ఉపయోగకరములగు పనులను నిర్వహించుచుందురు.

(సశేషము)

# శ్రీ వివేకానందస్వామి - ఖేత్రీమహారాజు

## శ్రీ శుద్ధ సత్త్వానందస్వామి

(గతసంచిక తరువాయి)

మహానందముతో ఖేత్రిలో కొన్నినెలలు గడపి స్వామి జైపూరుమీదుగ గుజరాతుకు తరలెను. గుజరాతునుండి దక్షిణభారతమునకు వచ్చెను.

అజిత్సింగుమహారాజుకు పుత్రులు లేరు. అది అతని కొక మనోవ్యథ. తనకు వారసులెవ్వరా అను చింత ఆయన నప్పుడప్పుడు బాధించెడిది. స్వామీజీ తన కెట్టి వరమైనను ఈయగల డని అతని గట్టి నమ్మకము. కావున ఒకనా డతడు తనదుఃఖమును అణచుకొనలేక "నా కొకపుత్రుడు కల్గున ట్లనుగ్రహింపు" డని స్వామిని ప్రార్థించెను : స్వామి, తథాస్తు అనెను. అట్లే కాలక్రమమున మహారాజున కొక పుత్రుడు జన్మించెను. మహారాజు అత్యంత సంతుష్టి నందెను. రాజకుమారుని జన్మమును కొనియాడుటకై ఒకమహోత్సవము ఏర్పాటు

చేయబడెను. ఆ ఉత్సవమప్పుడు మహారాజు నకు తనగురుదేవుని జ్ఞప్తి కలిగెను. ఆయన లేకుండిన ఆఉత్సవపుటందము చాలవఱకు నష్ట మగు నని ఆయన అనుకొనెను. కావున ఆయన మున్షీజగ్మోహన్లాలును మదరాసుకు పంపెను. మున్షీ మదరాసులో ఎంతో కష్టముతో స్వామిని కనుగొనెను. ఆ శుభసమయమున స్వామి ఖేత్రీలో నుండవలె ననియు రాజశిశువును దీవింపవలె ననియు రాజుగారి వినయపూర్వకమైన ప్రార్థనను హృదయపూర్వకమైన కోర్కెను అతడు తెల్పెను. స్వామిజీ అప్పుడు అమెరికాలో జరుగనున్న విశ్వమతమహాసభలో హాజరగుటకు సన్నాహములు చేయుచుండెను. ఐనను ఆయన రాజుగారి సప్రేమాహ్వానమును శ్రద్ధాయుతమైన వేడికోలును కాదనలేక పోయెను. రాజుపై స్వామికి అత్యంతప్రేమ. స్వామి జునగడపుదివానుకు ఇట్లు వ్రాసెను. "ఖేత్రీమహారాజుకును నాకును ఉన్న అత్యంతగాఢప్రేమబంధములు నీకు జ్ఞప్తియుండవచ్చు"....స్వామి ఖేత్రికి వచ్చి చూచినప్పుడు నగరమంతియు సమగ్రముగ అలంకరింపబడియుండెను. ఎల్లెడల నృత్తగీత వాదిత్రఘోషలు వినవచ్చుచుండెను. మహారాజు రాజనౌకయొద్ద నుండెను. గొప్పరాజాతిథులును రాజపుత్రస్థానప్రముఖులును ఆయనను పరివేష్టించియుండిరి. అప్పుడు మహారాజు స్వామిజీకి సాష్టాంగముగ నమస్కరించి మహోన్నత పీఠముపై కూర్చుండబెట్టి అతిథులందఱిని ఆయనకు పరిచయపఱచెను. స్వాముల అనుగ్రహముచేతనే తనకు పుత్రలాభము కలిగిన దని ఆయన అందఱికిని చెప్పెను. శిశువును స్వామికి చూపిరి. స్వామి హృదయపూర్వకముగ ఆశీర్వదించెను.

కొన్నాళ్ల తర్వాత మహారాజు స్వామిజీని సాగ నంపుటకు జైపూరువఱకు స్వయముగ వచ్చెను. అక్కడినుండి బొంబాయివఱకు తోడుగ నుండుటకును గంతవ్యము చేరువఱకు అగు సకలవ్యయములను చెల్లించుటకును తగిన దుస్తులను ప్రయాణమునకు వలసిన సకలసామగ్రిని తీసియిచ్చుటకును మహారాజు తన అంతరంగిక కార్యదర్శిని పంపెను. స్వామిజీ పాశ్చాత్యదేశములో తనకు పెట్టుకొన్న పని గొప్పది, అవిస్మరణీయమైనది. అందుకు సకల వ్యయములను భరించు అద్వితీయభాగ్యము ఖేత్రీమహారాజునకు దక్కినది. 1893 వ సంవత్సరము మే నెల 31 వ తేదీనాడు స్వామి బొంబాయియొద్ద నావ నెక్కి అమెరికాకు బయలుదేఱెను. స్వామిజీని అమెరికాకు పంపుటకై మదరాసులోని భక్తులును ప్రశంసకులును సమకూర్చిన ధనము స్వామిజీకోరికమేరకు పేదలకు పంచిపెట్టబడెను. తలపాగ కట్టుకొను విధమును స్వామి నేర్చుకొన్నది ఖేత్రీలో.

1893-వ సంవత్సరమున సెప్టెంబరునెలలో చికాగోలో జరిగిన విశ్వమతమహాసభలో శ్రీ వివేకానందస్వామి సదా స్మరణార్హములగు ఆఱు ఉపన్యాసములను కావించెను. అద్వితీయమైన ఆయనవిజయమునుగూర్చిన వార్త మహారాజు చెవినిబడగనే ఆయన తక్షణమే ప్రత్యేకముగదర్బారును సమావేశపఱచి స్వామిజీ సాధించిన మహాద్భుతవిజయమును హృదయపూర్వకముగ అభినందించుచు ఒక తీర్మానమును కావించెను. ఆ తీర్మానము స్వామికి పంపబడెను. అందలి ప్రతిమాటలోను ఆరాజుకును ఆప్రజలకును స్వామియందుగల ప్రేమయు మెప్పును గర్వానందకృతజ్ఞతలును స్పష్టములగుచుండెను.

స్వామి ఖేత్రీమహారాజుకు ఒక ఫోనోగ్రాఫు రికార్డును పంపెనట. రాజ్యమును పాలించు విధమునుగూర్చియు ప్రజలపట్ల వహింపవలసిన జాగ్రత్తనుగూర్చియు స్వామి సందేశము ఆ రికార్డులో నున్నదట. హిందీలో స్వామిచేసిన ఉపన్యాసము ఖేత్రీలో రికార్డుచేయబడిన దట. కాని మనదురదృష్టముచే ఆ రికార్డుజాడయైనను లేదు. ఉండియున్న ఈదినముసైతము స్వామి కంఠమును విన గల అదృష్టము మనకు దక్కెడిది.

అమెరికానుండి స్వామి ఖేత్రీమహారాజుకు పెక్కు జాబులు వ్రాసెను. అవి ఉత్సాహప్రదములగు సందేశములతో నిండియుండినవి. రాజునెడ స్వామి కుండిన గాఢప్రేమను గుణగ్రహణమును అవి సూచించుచుండును.

స్వామి అమోఘముగ సాగించిన ప్రచారముచేతను విన్నవారికి నచ్చునట్లు కావించిన ఉపన్యాసములచేతను అమెరికాసంయుక్తరాష్ట్రములలో వేదాంతధ్వజము మహోన్నతస్థాయి నందుకొనెను. 1897 లో స్వామి ఇండియాకు మరలి వచ్చెను. ఆయనయెడల అప్పుడుగల్గిన ప్రజాదరము అకృత్రిమము, అపూర్వము. స్వామికి హృదయపూర్వకమైన స్వాగతాభివందన మర్పించుటకును, ఖేత్రీకి రమ్మని ఆహ్వానించుటకును అజిత్సింగుమహారాజు తన ఆంతరంగికకార్యదర్శిని మదరాసు కంపెను. స్వామి ఖేత్రీని సమీపించినప్పుడు మహారాజు పదునెనిమిది మైళ్లు ఎదురేగి ఆఱుగుఱ్ఱము లమర్చిన రాజరథములో స్వామిని తానే స్వయముగ రాజభవనమునకు పిలుచుకొని వచ్చెను. నగరమంతటను మహోత్సవము జరిగెను. స్వామికి రాజోపచారము చేయుటకు సర్వసన్నాహములును చేయబడినవి. మహారాజుకూడ కొన్నాళ్లక్రిందనే యూరోపునకు పోయి మరలి వచ్చియుండెను. ఆయనకును స్వామికిని ఉభయులకును స్వాగతమర్పించుటకై అచటి హైస్కూలులో ఒక మహాసభ ఏర్పాటు చేయబడెను.

రామకృష్ణసంస్థతరఫున మొదట స్వామీజీ మహారాజునకు స్వాగతాభివందనము సమర్పించెను. మహారాజు అందుకు తగిన ప్రత్యుత్తరము చెప్పుచు వైద్యశాలలను ఔషధాలయములను విద్యాసంస్థలను నెలకొల్పి తనశక్తి కొలది ప్రజాసేవచేయుదు నని వాగ్దానము చేసెను. ఆయన ఉపన్యాసానంతరము అనేక సంస్థలవారును మిత్రులును సమర్పించిన స్వాగతాభివందనములను స్వీకరించి కరతాళఘోష మహోత్సవమధ్యమున స్వామీజీ ఇట్లనెను. ''...భారతదేశాభివృద్ధికి నే నేకొంచెమైనను జేసియుంటినేని అది నాకు ఈమహారాజుగారి సమాగమభాగ్యము లేకున్న శక్యమై యుండెడిది కాదు.'' తక్కిన మాటలు పెక్కుల టుండ నిండు. ఈఒక్కవాక్యము'' చాలును స్వామీజీకి మహారాజునం దుండిన ప్రేమను ఆయనమహోద్యమమునకు మహారాజు కావించిన సాయమును స్పష్టముగ తెల్పుటకు.

శ్రీవివేకానందస్వామి నియమానుసారము సోదరశిష్యుడగుశ్రీఅఖండానందస్వామి శ్రీరామకృష్ణసేవాసంఘ కార్యకలాపమును మొదట ఆరంభించినది ఖేత్రీలోనే. 1894 లో శ్రీఅఖండానందస్వామి ఖేత్రీలో నుండెను. ఆయనకు శ్రీవివేకానందస్వామి ఇట్లు వ్రాసెను. ''ఖేత్రీ నగరములో పేదలు నిమ్నవర్గాలవారు నుండు చోట ఇంటింటికి పోయి వారికి మతమును

గఅపుము....... నీవు జగద్ధితమునకై మనో వాక్కాయముల నర్పింపవలయును. మాతృ దేవో భవ, పితృదేవో భవ, నీతల్లియే నీకుదైవ మగుత, నీతండ్రియే నీకు దైవ మగుత—అను వాక్యములను చదివి యున్నావు. నే నందును: దరిద్రదేవో భవ, మూర్ఖదేవో భవ, దరిద్రుడు నీకు దైవ మగుత, మూర్ఖుడు నీకు దైవ మగుత. పేదలు నిరక్షరాస్యులు అజ్ఞానులు బాధితులు వీరు నీకు దైవ మగుత. వీరికి చేయుసేవయే మహోన్నతాధ్యాత్మిక ధర్మ మని యెఱుగుము.

మహారాజు అత్యంతౌదార్యముతో సాయపడగా అతని నిండుతోడ్పాటుతో శ్రీఅఖండానందస్వామి అచట నొక హైస్కూలును కొన్ని ధర్మసంస్థలను నెలకొల్పెను. స్వామివాక్యమును మహారాజు వేదశాసనముగ తలదాల్చి దానిని పాటింప శక్తికొలది పాటుపడెడివాడు. స్వామీజీతల్లి ఆర్థికదుఃస్థితిలో నున్న దని వినగనే మహారాజు ప్రతినెలయు ఆమెకు నూఱు రూపాయలు పంపుచుండునట్లు ఏర్పాటుచేసెను. స్వామియందు ఆయన కున్న హృదయపూర్వక ప్రేమాదరములను ఇది సూచించుచున్నది. మహారాజును స్వామీజీయు, ఇరువురును మరణించిన పిమ్మటగూడ స్వామీజీతల్లి జీవించి యున్నంతకాలము ఖేత్రీఖజానానుండి ఆమొత్తము పంపబడుచువచ్చెను.

నిజమునకు అజిత్సింగుమహారాజుకును శ్రీవివేకానందస్వామికిని కలిగిన ఆసమాగమము అవిస్మరణీయమైనది. రాజపుత్రస్థానములో నొక చిన్నసంస్థానపాలకుడు స్వామి వివేకానందుని దేశభక్తిప్రేరితవిశ్వజనీనలక్ష్యమును ఎట్లు హృదయపూర్వకముగ ఆదరించెనో అంగీకరించెనో దాని నమలుపఱచుటకు అన్ని సాహాయ్యములు చేసెనో పాఠకుడు సులభముగ గ్రహించును. స్వామిజీయు పరమోదాత్తుడగు ఆరాజపుత్రుని గొప్పతనమును సమగ్రముగ గ్రహించెను. అందుకు ఖేత్రీరాజాజీబహదూరుకు స్వామీజీ స్వయముగ వ్రాసిపంపిన ఈ క్రింది కావ్యఖండమే నిదర్శనము.

తిరముసేయుదిటవు ధృతమతి

ఆ. తపను సుంత యంబుదము కప్పు పెట్టిన
మిన్ను కళల నేది విన్నఁబోవ
తిరము సేయు దిటవు ధృతమతి మఱికొంత
సందియంబు లేదు జయము ధ్రువము

పిదప మధువుగ్రాఁగ బొదలును శిశిరమ్ము
లోనివంపు తరగపైని పెంపు
ఒందు నొందు ద్రోయుచుఱుకు నీడయు వెలు
చక్క నిలుము బలము చలము మెఱసి.

మంజరి॥ జీవనంపు విధులు చింతలు వెతలు
సౌఖ్యముల్ వృథలు తత్క్షణ భంగురములు
ప్రాప్య మవ్యక్తము పఱచెడి ఛాయ
కల చేవయును లావు గదియంగఁ బట్టి
ఇరులను గడకొత్తి ధృతమతిఁ జనుము.

ఉడిగిన జవము, నారడిపోవ నాశ
వృథ గాదు యత్న మే కృతి వీటిఁబోదు
వెలయఁగలా ఔరసులు వారసులును
దిటవు సడలనీక ధృతమతి నిలుము
పరిపోదు సూ శుభాచరణ మెందైన.

ఆ. జగతి నరిది సుధులు సాధులు, నేతృతా
గరిమ వారిసొమ్ము, కాల మరుగఁ
గాని, వారి విలువ గన లేరు జనములు
చూడ కెదిరి మృదువు జాడ నడపు॥

తోడుపడఁగలారు దూరదర్శులు నీకు
సాయ మౌను సర్వశక్తి నీకు
పరమశోభనములు గురియును నీపైని
జయము లెపుడు ముందు చను మహాత్మ॥*

కొంతకాలము క్రింద ఇప్పటి ఖేత్రీమహా
జు రాజభవనములో శ్రీవివేకానందస్వామి
చేసియుండిన భాగమును రామకృష్ణమిషను
వారికి దానము చేసెను. రామకృష్ణమిషను
శాఖయొకటి అచట ప్రారంభింపబడెను. శ్రీ
వివేకానందస్వామి యుండిన గది గుడిగా
మార్చబడినది.

ఆపవిత్రస్థానమున మౌనధ్యానముతో
కొంతసేపు కూర్చుండి స్వామిసంస్మృతులు
మా డెందముల నిండి తొణకుచుండగా మరలి
వచ్చితిమి.

* శ్రీరామచంద్ర కౌండిన్యగారి తెలిగింపు.

# భారతీయ యువకులకు స్వామి వివేకానందుని సందేశము

బ్రహ్మచారిణి శర్వాణి

(గతసంచిక తరువాయి)

మననిత్యజీవితములో వలయునది శాంతము,
రాడంబరము, అచంచలమైనకృషి యని
పతియువకుడును సదా జ్ఞాపకమునం దుంచు
నవలయును. శ్రద్ధయున్న యెడల సమస్తము
ంభించితీరును. స్వామిజీ మాటలు. "లోక
మున సదా దాతవై వర్తింపుము. అన్నిటినిచ్చి
వేయుము. ప్రతిఫలమునాశింపకుము. ప్రేమను
సాయమును, సేవను నీచేతనైన యేయల్ప
వస్తువునైనను నొసగుము.......భగవానుడు
మన కొసగునట్లు ఔదార్యముతో నిచ్చి
వేయుదముగాక", అసూయ, అహంభావము,
మనయువకులలో నెన్నడును కలుగరాదు.
విశ్వశ్రేయమునకై మిక్కిలి పాటుపడవల
యును. సంఘమున సామాన్యులై వినీతులై
మెలగవలయును. స్వామిజీ ఇట్లు నుడివిరి.
"ఎవ్వని విశ్వాసమునుగాని శ్రద్ధనుగాని చెడ
గొట్టప్రయత్నింపకుము. చేతనైనచో వానికున్న
దానికంటె విశేష మొసగుము. వానియథార్థ
స్థితిని గ్రహించి యందుండి పురోభివృద్ధిగల్గిం
పుము. అంతియే కాని వానికున్న దానిని పాడు
చేయకుము". ఇటువంటి స్వామిజీ దివ్యవాణిని
ప్రతియువకుడును తనదైనందిన జీవితములో
అనుష్ఠించుటకై పాటుపడవలయును.

మానవసేవయే మాధవసేవ యనుట
మఱవరాదు. ఎవ్వడు మానవసేవచేయునో
వానికి మోక్షము కరతలామలకము. శ్రీవివే
కానందస్వామి ఈ విధముగా ఘోషించెను.
"ప్రచండదీక్షతో, మహోత్సాహముతో

మీలో గొందఱు నలుదిక్కులకు వెడలి మన దేశమున నింతవఱ కెవ్వరును నిర్వహింపని యీ విశ్వరూపారాధన ప్ర· సాగిం పుడు.......సమ స్తజీవస్వరూపుని, అ ద్వి తీ యుని, వి శేషము నాయా ర్తనారాయణుని, నాదీననారాయణుని, సమ స్తదేశీయులకెల్ల పేద యగు నాభారతనారాయణుని- నాయిష్టదేవత నర్చించుటకై యెన్నిజన్మములైన నెత్తెదను గాక, ఎన్ని వేలబాధలనైనను ననుభవింతును గాక!....పవిత్రహృదయులు, ప్రచండదీక్షా దక్షులు, భగవద్విశ్వాసబలోపేతులు,— దరి ద్రులపై, దీనులపై, నధఃకృతులపై సాను భూతికతన సింహాసాహసాన్వితులు- ఒక లక్ష మంది స్త్రీపురుషులు- మోక్షసందేశమును, సంఘోద్ధరణసందేశమును, సమత్వసందేశ మును, జాటుచు యావద్భారతదేశమునను సంచరింపవలసియున్నది ''

కలకత్తాలో స్వామిజీ ఒసగిన ఉపన్యాస ములో, కలకత్తానగరయువకులనుద్దేశించి ఈ విధముగా నుడివిరి. ''...మీ దేశము ఈమహా యజ్ఞమును కోరుచున్నది. యువకులే దానిని నిర్వహింపవలసియున్నది. యువకులును, బల యుతులును, స త్త్వవంతులును, దృఢకాయు లును అగువారు నిర్వహింపదగినదే ఈ కార్యము. ఈ కలకత్తానగరమున వందల కొలదిగా, వేలకొలదిగా అటువంటి యువకు లున్నారు.......మేలుకొనుడు; ప్రపంచము మిమ్ము ఆహ్వానించుచున్నది. భారతదేశము నందలి ఇతర ప్రాంతములందు బుద్ధి, శక్తి యున్నది; ధనమున్నది; కాని ఉత్సాహము మాత్రము నాజన్మభూమియందే కలదు. అది ఇప్పుడు వెలువడి రావలయును. కాబట్టి నగర యువజనులారా, మీరక్తములోని ఉత్సాహ శక్తితో లేచి నిలువబడుడు.'' ఇటువంటి సందే శము ఈవర్తమానదేశపరిస్థితులలో మిక్కిలి అవసరము. మనయువకులు మానవత్వమును, పౌరుషమును ప్రకటించుట కిదే సమయము. ''నావత్సలు సమరమున దుముకవలయును. సంసారపరిత్యాగము చేయవలయును. అప్పుడు సుస్థిరమైన పునాది. యేర్పడును.'' అని స్వామిజీ నుడివిరి.

ప్రతి యువకుడును బలిష్ఠుడును, మేధా నిధియునై యుండవలయును. కావుననే ఇటు వంటి వీరుల వెలువడచేయు జాతీయవిశ్వవిద్యా లయములు స్థాపింపబడవలయు నని స్వామిజీ ఆశించెను. యువకులు విద్యనభ్యసించు కాల ములో మానవత్వము, శీలము, ఐకమత్యము ఏకాగ్రత మొదలగునవి అలవఱచుకొనుట ఎంతైన అవసరము. యుగాచార్యుడైన శ్రీవివే కానందస్వామి ఇట్లు ఘోషించెను. ''మనలను ధీరుల నొనర్పగల మతము, ధీరుల నొనర్పగల సిద్ధాంతములు, సర్వతోముఖముగా ధీరుల నొనర్పగల విద్య-ఇవియే మనకు వలయునవి.'' ''ప్రతివ్యక్తియందును పరిపూర్ణత స్వతస్సిద్ధ ముగనే కలదు. తత్ప్రకటనమే విద్య. అన్య భాషలో నన్యులభావములను 'బట్టీపట్టి' వానిని మెదటినిండ దట్టించుకొని యేవిశ్వవిద్యాలయ బిరుదములనో సంపాదించినంతనే విద్యావంతుల మనుకొనుచున్నారు కాబోలును! ఇదియా విద్య! మీ స్థితి ఎట్లున్నది? ఇకమీరు చేయు చున్న దేమి?......పుస్తకం హ స్తభూషణం అనునట్లు చేతులలో పుస్తకములతో సముద్ర తీరమున విహరించుచు, ఐరోపీయధీసంజాత మైన యేశాస్త్రములనుండియో నాలుగు ముక్కలు ముక్కున కంఠించుకొని వాని నేకరువుపెట్టుచు యావదాత్మను ముప్పదిరూకల

'గుమాస్తాపదప్రాప్తిపై, లేదా, యువభారత దేశమునకు ఆశాపరమావధియనదగు 'లాయరు పదవి'పై లేక, 'డెప్యూటి మేజిస్ట్రేట్' పదవిపై లగ్నమొనర్చుటయా? ఇదియేనా మీ విద్యాగమ్యము?......మిమ్ములను, మీపుస్తకములను, మీ గౌనులను, మీ విశ్వవిద్యాలయ బిరుదములను సమస్తము ముంచివేయజాలినంత నీరు సముద్రమున లేదా!''

యువకులందఱును బ్రహ్మచర్యమును పరిపాలింపవలయునని స్వామిజీ ఆశించెను. వారి మాటలు: ''పండ్రెండేండ్లస్ఖలిత బ్రహ్మచర్యమును పరిపాలించువాని కపూర్వశక్తిసామర్థ్యములు లభించును. ఇది లోపించుటయే మన దేశక్షీణతకును, పతనమునకును కారణము. ...బ్రహ్మచర్య మద్భుతమానవవశీకరణ సామర్థ్యమును చేకూర్చును. కాబట్టి ప్రతిబాలుడును ప్రతివిద్యార్థియు నస్ఖలిత బ్రహ్మచర్యమును పరిపాలింపసుశిక్షితుడు కావలయుననియు, అందుమూలమున శ్రద్ధాభక్తులు ఆత్మవిశ్వాసము, సర్వకాలసర్వావస్థలయందు, మనోవాక్కాయములందు, నైర్మల్యము నేర్పడు ననియు, అదియే బ్రహ్మచర్య మని స్వామిజీ సూచించిరి. అంతేకాదు మఱియు వారిట్లనిరి. ''దేశక్షేమమునకై తనబిడ్డలలో కొందఱు విశుద్ధ బ్రహ్మచారులును, బ్రహ్మచారిణులును గావలయు నని భారతమాత కోరుచున్నది.''

ప్రతియువకుడును మొట్టమొదట పెద్దల యెడ, అధికారులయెడ భక్తి శ్రద్ధలు చూపవలయును. ఆజ్ఞాపరిపాలనము (విధేయత) నేర్చుకొనవలయును. స్వామిజీ ఇట్లనిరి. ''సేవకుడవై యుండుట ప్రథమమున నభ్యసింపుము, అంతట నీవధికారపదవి కర్హుడవు కాగలవు''. ఇతరుల యందు దుష్టత్వము కల దని మన మెన్నడును తలపరాదు. అదియే మన దౌర్బల్యమునకు మూలము. ద్రవ్యము, పేరు ప్రతిష్ఠలు, పాండిత్యము ఇవన్నియు నిష్ప్రయోజనము లనియు ప్రేమయొక్కటియే ఫలప్రద మనియు స్వామిజీ ఘోషించిరి. కాబట్టి నేటియువకులందఱును గాంభీర్యమును, శిశుసహజమగు నిష్కపటత్వమును కలిగి యుండుట ఎంతో అవసరము. మఱియు ఏకాకులై యుండక అందఱితో అనుకూలముగా కలిసి ఏకీభావముతో పరహితార్థము పాటుపడ నభ్యసింపవలెను. స్వామిజీ ఆదేశించినట్లు ఈర్ష్యాహంకారములు విడనాడి చిత్తశుద్ధితో సత్యప్రతిష్ఠితులై మెలగుట కభ్యసింపవలయును. ''సత్యమేవ జయతే నానృతమ్''— సత్యమే జయించునది.

కావున మనయువజనసమితి ఎల్లప్పుడు నీతిపరులై ధైర్యవంతులై త్రికరణశుద్ధిగా సింహబలముతోటి భావిభారతదేశాభ్యుదయము కొఱకు కార్యరంగమున నుఱుకవలయును. అప్పుడు ఒక్కచైనాదేశీయులనే కాదు, మరియే ఇతరదేశీయులనైనను అనాయాసముగా నెదుర్కొనుశక్తిగలవార మగుదుము. వీరసేనాపతియగు శ్రీవివేకానందుడు ఇట్లు ఘోషించెను. ''కార్యాచరణమందే మరణింపుడు. మీకు తోడుగా నేను గలను. నా అనంతరము నాఆత్మ మీకు తోడై పనిచేయును. ఈజీవితము వచ్చుచు పోవుచు ఉండునది. సంపద, యశస్సు భోగములు మూన్నాళ్ళముచ్చటలు. సత్యమును బోధించుచు కార్యక్షేత్రమున మరణించుట ప్రాపంచిక కీటకములవలె మరణించుటకన్న

ఉత్తమము — అపారముగా ఉత్తమము ముందుకు సాగుడు''.

యువకు లెన్నటికిని అనాలోచితముగా తొందరపడి ఏపనియు చేయరాదనియు, చిత్తశుద్ధి ఓరుపు, పట్టుదల, ఈమూడును కార్యసిద్ధి కత్యావశ్యకము లనియు స్వామిజీ అభిప్రాయము. మఱియు మనలో నున్న సంకుచిత భావమును రూపుమాపవలయు ననిరి. లాహోరులో ఒసగిన ఉపన్యాసములో వివేకానంద స్వామి ఇట్లు నుడివెను. ''......లాహోరు యువజనులారా, అదె ంతమహాధ్వజమును లేవనెత్తుడు!......మీరు ఇతరులకు సాయపడ గోరుదు రేని మీ సంకుచితాత్మ తొలగి పోవలయును. క్రైస్తవులు చెప్పునట్లు మీరు దైవమును ధనమును ఏకకాలమున కొలువ లేరు. ......మీరు తిండి లేక చచ్చినను అది ఏపాటిది? మీరును, నేనును, మనబోటి వేయి మందియు మనజాతి సజీవమైయుండుట కొఱకు నలిగి బలియైన నేమి?......ఈస్వల్పప్రాణము పోయినను లెక్కఏమి? ప్రతివాడును చావవలసినదే గదా! మహాఋషియు, మహాపాపియు, అత్యంతధనికుడును అత్యంతదీనుడును, చివరకు మరణింపక తప్పదు గదా! ఎట్టివారికిని శరీరము శాశ్వతమై నిలువబోదు. లెండు! మేల్కొనుడు! కపటము విడిచి నిలబడుడు. మన కపటవర్తనము ఘోరముగా పెరిగిపోయినది. మన కిప్పుడు కావలసినది శీలము. యమునికుండు హఠముతో పూనిన కార్యమును పట్టువిడువకుండ నిర్వహించు దీక్షయు శీలమును మనకు అవసరములై యున్నవి.

కాబట్టి, ఈ దివ్యసందేశమును మనయువకు లందఱును పాటించిరి, ఉత్సాహప్రదాలైన స్వామిజీ ఆదర్శాలను, ఆశయాలను సకల దేశములందలి జనులకు అమోఘముగా తెలుపుటకై తీవ్రకృషి చేయవలయును. స్వామిజీపిలుపు నెవరునుఉపేక్షింపరాదు. ఈనాడుమరలఆయన రాక మిక్కిలి అవసరము. మరల భారత దేశమున నలుమూలలకును హిమాలయమునుండి కన్యాకుమారివఱకును ఆయన సంచరింపవలసియున్నది అంతేకాదు మరల సరళప్రజానీకముతో ఏకరీతిగ కలిసి జీవింపవలసియున్నది.

స్వామిజీ కోరినట్లు, అంతయు త్యజించి, భారతదేశమును సంరక్షించుటకై ఎంతమంది యువకులు ఇటీవల చైనాదేశీయులతో కల్గిన యుద్ధములో ధైర్యసాహసములు చూపి, తుదకు తమ అసువులను గోల్పోవ లేదు! ఆహా! వారు ప్రాణము లర్పించి తుదకు వీరస్వర్గము నలంకరించిరి కదా! కావున వారి ఆత్మలకు శాంతి గల్గించుటకును, నేడు మనల నాశీర్వదించి ఆధ్యాత్మికపురోగతి గల్గించి, సకల మానవులకు శాంతిసౌఖ్యములు గల్గించుటకును శ్రీ వివేకానందస్వామిని మనఃపూర్వకముగా ప్రార్థింతము గాక.

# తిరస్కృతరాజాశ్రయులు - మహోజ్జ్వల సారస్వత నిర్మాతలు :

## త్యాగయ్య

విద్వాన్ శిరోమణి శ్రీ వాదరి శ్రీనివాసశర్మగారు

పోతరాజునకుఁ దరువాత రాజాశ్రయమును దిరస్కరించిన మఱియొక సారస్వతస్రష్ట ప్రముఖవాగ్గేయకారుఁడగు త్యాగరాజు.

కావేరీతీరమందు 'తిరువయ్యారు' అను పేరుగల పంచనదక్షేత్ర మాతని జన్మభూమి. తల్లి శాంతాదేవి; తండ్రి రామబ్రహ్మము. రామబ్రహ్మము జీవిక భిక్షాటనము. అతని జ్యేష్ఠపుత్త్రుఁడు జప్యేశుఁడు. రెండవవాడే జగత్ప్రసిద్ధుఁడైన త్యాగరాజు. త్యాగరా జను నది ఊరూర ప్రసిద్ధుఁడై వెలుగొందిన పరమశివుని పేరు.

పెద్దవానికిఁ జదువంట లేదు. కాని త్యాగరాజు చిన్ననాటినుండియు బుద్ధిమంతుఁడు. సంస్కృతాంధ్రములయం దాతనికిఁ జక్కని పాండిత్య మలవడెను. ఎన్నో సంవత్సరముల సాధనకుఁ దరువాతవచ్చెడి కోమల పదవిన్యాస మాతనికి ధారావాహికగా బాల్యమందే కలసి వచ్చెను.

త్యాగరాజు గొప్ప భావుకుఁడు. దీనికిఁ దోఁడు రామభక్తిగూడ చిన్ననాటినుండియే యేర్పడినది. వారి కులదైవము శ్రీరామచంద్రమూర్తి. త్యాగరాజు ప్రతిదినము తండ్రిగారికి తులసియు, పూవులు కోసి తెచ్చి యిచ్చెడివాడు. కావేరి కేగి శ్రీరామచంద్రమూర్తి కభిషేకమునకై స్వయముగా మడినీరు తెచ్చెడివాడు. వయస్సు ముదిరినకొలదియు భక్తియు త్యాగయ్యకు హెచ్చెను.

ఒకనాడు సన్న్యాసియొకడు త్యాగయ్యకు దర్శన మొసఁగెను. అతఁడు 'స్వరార్ణవ'మను నొక గ్రంథమును త్యాగరాజున కొసఁగి శాస్త్రీయసంగీతము నభ్యసించి, శాస్త్రీయములైన కీర్తనలురచింపుమని బోధించెను. అతనికి రామతారకమంత్రమునుగూడ నుపదేశించి 'యీ మంత్రమును నియమపూర్వకముగా జపించిన ఈ జన్మముననే రామసాక్షాత్కారమగు' నని చెప్పి సన్న్యాసి వెడలిపోయెను. త్యాగయ్య తన్నిట్లనుగ్రహించిన యతీంద్రుని నారదమహర్షిగా భావించెను. భక్తిభావముతో గురుదేవునిపై కొన్ని కీర్తనలఁ బాడెను. తంజావూరు రాజాస్థానగాయకుఁడగు శ్రీ శొంఠి వెంకటరమణయ్యకడ కేగి త్యాగరాజెన్నియో సంగీతవిద్యారహస్యముల గ్రహించెను.

సంగీతవిద్యయం దాతఁడు బహుముఖప్రజ్ఞను గడించెను. కంఠమాధుర్యము, గాంధర్వవిద్య రెండును గలసి యేర్పడిన మూర్తి త్యాగరాజు. పోతన, రామదాసులవంటి భక్త

కవిపుంగవు లాతని ధ్యేయమూర్తులు. అన్న వదినెల పోరు పడలేక త్యాగయ్య తన కేయాస్తియు వలదని చెప్పి తండ్రి యర్చించుచుండిన పూజావిగ్రహములను మాత్రము గైకొన్నాడు. అతఁడు తండ్రివలెనే భిక్షకేగి భౌతికజీవితమును గడపుచు, తక్కిన కాలమంతయు పూజాకలాపములతో గడపుచుండెను. త్యాగయ్య భార్య శాంత. చాల దొడ్డ యిల్లాలు. మహా సుగుణవతి. ఆమె సర్వకాల సర్వావస్థలయందుఁ దన పెనిమిటిని నీడవలె ననుసరించినది.

త్యాగయ్య ప్రతిదినము లక్షయు నెన్మిది వేలవంతున రామనామమును జపింప నారంభించెను. అతనికి ఐహికచింత లేదు. 'అంతా రామమయమై' అతనికి గోచరించెను. అతఁడు పెక్కుసంవత్సరములకుఁ దొంబది యాఱుకోట్ల రామనామము జపింపఁగలిగినాడు. చిట్టచివఱకు త్యాగయ్య శ్రీరామచంద్రుని నేరుగా దర్శింపఁగలిగినాడు. ఇంట నన్నయు, వదినెయు నతనిని నిష్కారణముగనే ద్వేషించిరి. పిచ్చివాఁడనిరి. అతఁడు పడిన బాధ లనేకములు. ప్రపంచజను లతని నెంతయో నిందించిరి. దారిద్ర్య మింటిలో సహస్రముఖముల దాండవించుచుండెను. ఈ కష్టముల నన్నిటిని త్యాగరాజు ఓర్పుతో సహించెను.

శ్రీరామదర్శనమైననాటినుండి త్యాగయ్య వదనారవిందమునుండి సంకీర్తనలు అనర్గళముగా వెలువడుచుండెను. కొన్ని కృతులు శిష్యులలో బహుళప్రచార మంది వారిపే రన్నిచోట్ల వ్యాపించెను. వాల్మీకి ఇరువదినాల్గు వేల శ్లోకములతో శ్రీరాముని గుణగానము చేసినట్లు, త్యాగరాజు ఇరువదినాల్గువేల కీర్తనలతో శ్రీరాముని గుణగానము చేయ సంకల్పించెను. ప్రతినిత్యము ఎన్నో కృతులను వ్రాసి శ్రీరామచంద్రునియెదుట గానము చేసెడివాడు.

తంజావూరిని పాలించుచున్న శరభోజీ మహారాజు ఆకాలమున గొప్ప సంగీతవిద్వాంసుఁడు. అతఁడు సంగీతమన్న జెవిఁగోసికొనును. రాజొకనాఁడు కొలువు తీరియుండ త్యాగరాజకీర్తనను వినుట సంభవించెను. త్యాగరాజుకీర్తినిగూడవినియున్నవాఁ డగుటచే రాజు త్యాగరాజునకుఁ దనయాస్థానమున సంగీతవిద్వత్పదవి నీయ సంకల్పించి, అతనిని బిలువ వార్తాహరులను పంపెను. వార్తాహరులు తిరువయ్యారుకు వచ్చి రాజాజ్ఞను అందించిరి.

త్యాగరాజునకు రాజాస్థానమం దుద్యోగమునఁ గుదురుట ఇష్టములేదు. రాజోద్యోగమును నిలుపుకొన అప్పుడప్పుడు రాజుపైఁ గృతులు చెప్పవలసియుండును. నరస్తుతి త్యాగయ్యకు సుతరాము ఇష్టము లేదు. అన్నయు, వదినెయు దీని నంగీకరింపుమని త్యాగయ్యను బలవంతపెట్టిరి. త్యాగయ్య అల్పసంతోషి. గొప్ప వైభవముల ననుభవింపవలె నను నాశ అతని కేకోశమునను లేదు. (అతని కేమియుఁ బాలుపోక, పూజాగృహమున కేగి శ్రీరాముని సన్నిధి నుండెను. అతఁడు తన మనస్సును సంబోధించి యొక ˆ రన నిట్లు పాడెను.

నిధి చాల సుఖమా? రాముని
సన్నిధిసేవ సుఖమా?
నిజముగఁ దెలుపు మనసా!
దధినవనీత క్షీరములు రుచో?
దాశరథిధ్యానభజన సుధారసము రుచో ని॥

మమతాబంధనయుత నరస్తుతి సుఖమా?
సుమతి త్యాగరాజనుతుని కీర్తనసుఖమా?॥ని॥

ఈకీర్తన పాడినవెంటనే అతని మనసులో రాజాశ్రయమును లెక్కచేయని పోతనాదులు మెదలినారు. ఒక నిర్ణయమునకు వచ్చి యతఁడు తన యభిప్రాయమును రాజభటుల మూలమున శరభోజీమహారాజున కిట్లు వార్త నంపెను.

"రాజాధిరాజైన శ్రీరామచంద్రుని ఆస్థాన గాయకుఁడను నేను. రాజదర్శనమునకు నేను రాలేను. నా సంగీతవిద్యను శ్రీరామునకే సమర్పించినాను. అది నరులను గొల్వదు."

రాజభటు లీమాటను తంజావూరు ప్రభువునకుఁ దెలిపినారు. శరభోజీమహారాజు ఈమాట విన్నవెంటనే తోక ద్రొక్కిన త్రాచువలె మండిపడెను. రాజు లైశ్వర్యమదాంధులు. వారికిఁ గ్రిందు మీఁదులు తెలియవు. త్యాగరాజును బలవంతమున నీడ్చుకొని రావలసినదని భటుల కాజ్ఞాపించెను. వారు త్యాగయ్య కడకు సర్వసన్నాహములతో వచ్చినారు. వారు వచ్చులోపుగనే రాజునకు భరింపరాని కుక్షిశూల ప్రారంభ మయ్యెను. భక్తున కపచారముచేయుట భగవంతున కపచారము చేయుటవంటిది. భాగవతాపచారమువలననే తన కీకడుపునొప్పి వచ్చెనని నిశ్చయించి రాజు సపరివారుఁడై కదలివచ్చి త్యాగయ్య పాదములపైఁ బడి తన్ను మన్నించి తన కడుపునొప్పి మాపుమాప వేఁడెను. వేలు మందులకు మాఁకులకు మానని రోగము శ్రీరామభక్తుని కటాక్షవీక్షణ ప్రసారముచే ఆగిపోయెను.

ఇరువది నాలుగువేల కృతులను బూర్తి గావించి త్యాగరాజు శ్రీరామచంద్రున కంకితము గావించెను. ఇదిగాక అతఁడు ప్రహ్లాద విజయము, నౌకాచరిత్రము — అను రెండు గ్రంథములనుగూడ రచించెను.

రాజాశ్రయమును నిరాకరించిన త్యాగరాజుపై అతని అన్నయు, వదినెయు మండిపడి అతఁడు ప్రతినిత్యము పూజించుచుండిన పూజావిగ్రహములను కావేరిలోఁ బాఱవైచిరి. త్యాగరాజు పూజావిగ్రహములు లేక ఎంతయో బాధపడి వానిని వెదకుట కదేపనిగా దేశాటనము గావించెను. దేశాటనమునుండి తిరిగి వచ్చిన పిదప దైవప్రేరణముచేఁ గావేరినదిలోనే పూజావిగ్రహములను కనుగొనఁగలిగెను.

ఈ దేశాటనమువలన అతనికిఁ గలిగిన లోకానుభవము ఇంతింత అనరానిది. తన అనుభవముల నన్నింటిని అతఁడు స్వకృతులలో వెల్లడించినాడు. 'ఉదరనిమిత్తో బహుకృతవేషః'—అని కపట సన్న్యాసులు ప్రజలనుండి ఆదరసత్కారములు పొందుటకు వేకువనేలేచి స్నానము చేయుదురట. విభూతి పూసి లోకులను వంచించుచు పొట్ట నింపుకొందురట. సంసార పరిత్యాగ మననేమో పూర్తిగాఁ దెలియక భార్యాపుత్త్రులను విడిచి జోగులై, బైరాగులైనంతమాత్రాన వారు ముక్తిపదులుగారని త్యాగరాజుతలంపు. చూడుడు—

తెలియలేరు రామభక్తి మార్గమును
ఇలనంతటఁ దిరుగుచు కలువరించేరు కాని తె॥

వేగ లేచి నీట మునిఁగి బూతి పూసి
వెళ్ళనించి వెలికి శ్లాఘనీయులై తె॥

బాగ పైకమార్జన లోలులైరి కాని
త్యాగరాజ నుత తె॥

గజేంద్రుని అదృష్టము, ద్రౌపది భక్తితత్పరత, విభీషణుని శరణాగతి, ఆంజనేయాది భక్తుల భాగ్యము, లక్ష్మణుని భ్రాతృప్రేమ— ఇట్టివి మాటి మాటికిఁ జేర్కొనుచుండును. పరికింపుఁడు—

వారణరాజును బ్రోవను వేగమె
వచ్చినది విన్నానురా రామ॥

నారీమణికిఁ జీర లిచ్చినది
నాఁడే నే విన్నాను రా

ధీరుఁడౌ రామదాసుని బంధము
తీర్చినది విన్నానురా,

నీరజాక్షికై నీరధిదాటినది
నీకీర్తిని విన్నానురా,

ఇభరాజేంద్రుఁడు ఎక్కువైన
లంచ మిచ్చిన దేమిరా ?

సభలో మానము పో సమయంబున
సతియే మిచ్చెను రా ?

త్యాగరాజు జీవితపరమార్థమును గ్రహించినవాఁడు. సారస్వతములో సంగీతశాఖకుఁ బ్రత్యేకతను గల్పించి కర్ణాటకసంగీతమును తెనుఁగువారిసొమ్ము గావించిన మహోజ్జ్వల సారస్వత స్రష్ట త్యాగరాజు.

# శ్రీ రామకృష్ణపరమహంస విలాసము

మూలమ్ :
శ్రీశ్రీ చిద్ఘనానందగిరిస్వాములవారు

తాత్పర్యకాదంబిని :
శ్రీ శ్రీధరబాబు

(గతసంచిక తరువాయి)

84. న హి భక్ష్యసి చే న్నివేదితమ్
మరణ జ్వాలి వరేణ్య మమ్బ మే।
తవ విప్రియవా నిలాతతే
కిము జీవామి మహేశ్వరప్రియే॥

కాళీ, నీ వీ నివేదనను అంగీకరింపక పోయి నచో మరణమే శరణము. మహేశ్వర ప్రియా, నీప్రియము చూఱకొనని నా జీవితము వ్యర్థము.

85. జగదమ్బ శతాపరాధినం
హ్యపి మాతా న జహాతి చాత్మజమ్।
అయి కాలి న భోక్ష్యసే యది
భువి జీవామి కిమర్థ మీశ్వరి॥

జగదంబా, శతాధికముగ తప్పులు చేసి నను తల్లి బిడ్డను విడచిపెట్టదు. ఈశ్వరీ, నే నర్పించిన దానిని స్వీకరింపని యెడల నా కీ జీవిత మెందులకు ?

86. జగదీశ్వరి శఙ్కరప్రియే
జననీ రాక్షసపాణి మేఖలే।
తవదర్శన లోభదైవతా
విహత మ్మా మ్న కథ మ్ప్రపశ్యసి॥

జగదీశ్వరీ, శంకరప్రియా, రాక్షసహస్తములనే ఒడ్డాణముగా ధరించిన దానవు, నీదర్శనలోభమువల్ల దీనుడనైన నన్నెందుకు రక్షింపవు?

87. తవదర్శన భాగ్య భిక్షయా
కురుషే ధన్యతమ న్న చే దిమమ్।
సకృ దేవ కురుష్వ భోజన
న్దయయా దేవి నివేద్య ముత్తమమ్॥

నీదర్శనభాగ్యభిక్ష మిడి ధన్యుని చేయకున్నను శీఘ్రముగా నివేదనను దయతో స్వీకరింపుము.

88. ఇ త్యేవం రుదిత స్తస్య
వ్యతీత మశ్రుధారయా।
త ద్దిన న్తు త స్తప్తం
లభ్య మన్నై ర్న కై రపి॥

ఇట్లు అశ్రుపూర్ణనేత్రుడై కన్నీరు మున్నీరుగా నేడ్చుచు ఏమియు ముట్టక తపస్సుతో తపించుచు ఆనాడు గడపెను.

89. అన్యే ద్యుః స మహాభక్తః
స్నాత్వా విధివ దమ్బికామ్।
అర్చయిత్వాచ నైవేద్య
మ్భుఙ్క్ష్వ దే వీతి చార్థయత్॥

మఱునాడుకూడ ఆభక్తుడు స్నానమాచరించి, విధిదృష్టవిధానముగ అంబికార్చన సలిపి, నివేదన నారగింపుమని దేవినిఅర్థించెను.

90. పురా క్షుత్క్షామదీర్ణాయ
లోకాయ భువనేశ్వరి।
శాకమ్భరీతి విఖ్యాతా
బభూవ సంవిదాత్మికా॥

పూర్వకాలమున బడుచున్న లోకములో అజ్ఞానస్వరూపిణి 'శాకంభరీ' యను రూపమున అవతరించినది.

91. తా ఙ్జగన్మాతరం రామకృష్ణో
భోజయితుం రతః।
ప్రబభూ వోపవాసై శ్చ
కరుణారోదనేన సః॥

అట్టి జగజ్జనని భుజింపవలె ననెడి కోరిక రామకృష్ణునికి జనించి, అన్నము నీరు ముట్టక, గుండెలు కరిగించు రోదనము చేయుచు గడపెను.

92. అన్యేద్యు రపి సా మాతా
కాలీ లోకత్రయేశ్వరీ।
నైవ భుఙ్క్త నైవేద్యం
రామకృష్ణ సమర్పితమ్॥

మఱొకరోజు గడచినది. కాని లోకత్రయేశ్వరి యగు ఆజగన్మాత రామకృష్ణార్పితమగు నైవేద్యమును స్వీకరింపలేదు.

93. కవాటబన్ధన ఙ్కృత్వా
మన్దిరస్య స మాతరి।
విశ్వాస శృంఖలాబద్ధ
స్తతో గంగాతటం యయా॥

ఆనాడును తల్లిపై గల గాఢవిశ్వాసముతో దేవాలయ కవాటములను మూసి, గంగాతీరమునకు వెళ్ళెను. (సశేషము)

# వార్తలు, విశేషాలు

## శ్రీవివేకానందస్వామిశతతమజయంతిమహోత్సవములు

### తిరునల్వేలి రామనాథపుర జిల్లాలు

తిరునల్వేలి ''వివేకానందసొసైటీ'' వారు శతతమజయంతిమహోత్సవాలను జిల్లాఅంతటా జరిగేటట్లు ఏర్పాటు చేశారు.

### తిరునల్వేలి

వారి ఆహ్వానంమీద మద్రాసుమఠంనుంచి శ్రీశుద్ధసత్త్వానందస్వామియు శ్రీసర్వజ్ఞానంద స్వామియు హరిచైతన్యబ్రహ్మచారియు 6-7-1963 తేదినాడు తిరునెల్వేలికి పోయారు. 7-వ తేదీ ప్రొద్దున ఉత్సవాలు ప్రారంభ మైనాయి. అలంకృతమైన పందిట్లో శ్రీశుద్ధ సత్త్వానందస్వాములు ప్రత్యేకపూజాహోమ ములను నిర్వర్తించారు. సుమారు 250 మంది దరిద్రనారాయణులకు అన్నసంతర్పణ గావింప బడింది. నెల్లైసంగీతసభావరణంలో పౌర మహాసభసమావేశ మైంది. శ్రీ గోపాల కృష్ణయ్యరు అధ్యక్షత వహించారు. శ్రీశుద్ధ సత్త్వానందస్వామి మున్నగువారు ఉపన్యసిం చారు. దాదాపు వెయ్యిమందిప్రజలు సమా వేశ మయ్యారు. సదస్సుకు శ్రీ ఎస్. రత్నం గారు కృతజ్ఞతావందనోపచారంచేశారు. సభా కార్యక్రమం ముగిసింతర్వాత శ్రీసర్వజ్ఞానంద స్వాములు శ్రీరామకృష్ణజీవితచరిత్ర చలన చిత్రమును తమతమిళవివరణంతో ప్రదర్శింప జేశారు. దాదాపు 1,500 మంది ఆ చిత్రం చూచారు. మదరాసు రామకృష్ణమిషను హైస్కూలు ఉపాధ్యాయులైన శ్రీమంత్రం గారు అక్కడ ఒకగుడిలో శ్రీవివేకానంద స్వాముల జీవితచరిత్ర చిత్రములను ప్ర చారు.

### ఆళ్వారు తిరునగరి, శ్రీవైకుంఠము

8-వ తేదీనాడు ఈజట్టువారు శ్రీనమ్మా ళ్వార్ల అవతారస్థలమగు ఆళ్వారు తిరునగరికి పోయినారు. అచ్చటి హిందూహైస్కూలు వారు శ్రీవివేకానందస్వాముల శతతమజయంతి మహోత్సవానికి ఏర్పాటు చేశారు. అధ్యక్షత వహించిన శ్రీశుద్ధసత్త్వానందస్వాములు శ్రీ వివేకానందస్వాముల చిత్రపటమును ఆవిష్క రిస్తూ ఉపన్యసించారు. ఉపన్యాసమును తమిళో పాధ్యాయులలో నొకరు అనువదించి చెప్పారు. హరిచైతన్యబ్రహ్మచారి తమిళంలో ఉపన్య సించారు. మధ్యాహ్నానంతరం శ్రీవైకుం ఠంలో కుమార గురుపరంస్వాముల హైస్కూలు మైదానంలో పౌరమహాసభ ఏర్పాటు చేయ బడింది. ప్రధానన్యాయమూర్తి (మునిసిఫ్) అధ్య క్షత వహించారు. శ్రీశుద్ధసత్త్వానందస్వా మియు, హరిచైతన్యబ్రహ్మచారియు ఉపన్య సించారు. శ్రీమంత్రంగారు స్వామీజీ జీవిత

చరిత్ర 'హరికథా కాలక్షేపం' చేశారు. ఇక్కడకూడ చిత్రపటముల ప్రదర్శనమున్నూ చలనచిత్రప్రదర్శనమున్నూ జరుపబడ్డాయి.

## ఆళ్వారుకుఱిచ్చి, షెనోట్టా

9-వ తేదీనాడు ఆళ్వారుకుఱిచ్చిలో క్రొత్తగ ప్రారంభింపబడ్డ కళాశాలలో శ్రీశుద్ధసత్త్వానందస్వామి శ్రీవివేకానందస్వాముల చిత్రపటాన్ని ఆవిష్కరించి ఉపాధ్యాయులయు విద్యార్థులయు సదస్సులో ఉపన్యసించారు. నాటి సాయంకాలం షెనోట్టాలో బోర్డు హైస్కూలునందు ఒక పెద్ద సమావేశం ఏర్పాటు చేయబడింది. మా. పో. శివజ్ఞానం గారు తమిళంలో మహోజ్జ్వలమైన ఉపన్యాసం గావించారు. శ్రీశుద్ధసత్త్వానందస్వాములు ఆంగ్లంలో ఉపన్యసించారు. మున్సీఫ్‌గారు సభకు అధ్యక్షతవహించారు. సభాకార్యానంతరం శ్రీసర్వజ్ఞానందస్వాములు శ్రీరామకృష్ణజీవితచరిత్రచలనచిత్రం ప్రదర్శింపజేశారు.

## కోయిల్పట్టి

10-వ తేదీనాడు ఇక్కడి శివాలయంలో సమావేశమైన సభలో శ్రీశుద్ధసత్త్వానంద స్వాములు మున్నగువారి ప్రసంగాలును చలనచిత్రప్రదర్శనమున్ను నిర్వర్తింపబడ్డాయి.

## సాత్తూరు

ఇక్కడి సెంటినరీకమిటీవారు గుడి ఆవరణంలో 11-వ తేది నాడు పౌరసభ జరిపి మామూలుప్రకారం ఆచలనచిత్రమునున్నూ ప్రదర్శింపజేశారు.

## శివకాశి

ఇక్కడి సెంటినరీ కమిటీ సెక్రెటరీగారగు శ్రీ ఎమ్. పి. ఎస్. ఎస్. నటరాజనాడారు శ్రీవిశ్వనాథాలయంలో ఉత్సవానికి ఏర్పాటు చేశారు. ముందుదినమే గుడిద్వారంవద్ద చిత్రపటప్రదర్శనం ఏర్పాటయింది. మండపంలో శ్రీవిశ్వనాథ స్వామి కెదుట శ్రీశారదా — శ్రీరామకృష్ణ — వివేకానందస్వాముల చిత్రపటాలు సింగారింపబడి అమర్చబడ్డాయి. శ్రీ శుద్ధసత్త్వానందస్వామి షోడశోపచారపూజను హోమమును జరిపారు. అత్యధికసంఖ్యాకులు, భక్తులు సమావేశమయ్యారు. అక్కడిమూడు స్కూళ్ల ఉపాధ్యాయులయు విద్యార్థులయు సదస్సులో శ్రీశుద్ధసత్త్వానందస్వామి ఉపన్యసించారు. పూజానంతరం ఆయన సంక్షిప్త ఎస్. ఎస్. ఎల్. సి. విధానానికి ప్రారంభంజరిపారు. నాటి సాయంసమావేశానికి వేలుడుమందుల ఇన్స్పెక్టరు రామకృష్ణన్‌గారు అధ్యక్షత వహించారు. శ్రీశుద్ధసత్త్వానందస్వామియు శ్రీసర్వజ్ఞానందస్వామియు ఉపన్యసించారు.

## తూత్తుగుడి

కార్యక్రమంలో కడపటిది 14-వ తేదీనాడు తూత్తుగుడిలో జరుపబడిన ఉత్సవం. అన్నమ్మాళ్ బాలికల హైస్కూలు హాలులో శ్రీ శుద్ధసత్త్వానందస్వామి షోడశోపచార పూజాహోమాలను జరిపారు. సాయంసమావేశానికి అన్నమ్మాళ్ ట్రైనింగుకాలేజి ప్రిన్సిపాలు గారగు శ్రీమతి వజ్రేశ్వరిగారు అధ్యక్షత వహించారు. శ్రీశుద్ధసత్త్వానందస్వాములు ఆంగ్లంలోను కళాశాల తమిళాచార్య తమిళంలోను ఉపన్యసించారు. శ్రీరామకృష్ణ జీవిత చరిత్రచలనచిత్రం శ్రీసర్వజ్ఞానందస్వాముల వ్యాఖ్యానోపన్యాసంతో ప్రదర్శింపబడింది. మఱునాటి ప్రొద్దున ట్రైనింగుకాలేజి ఆచార్యులయు విద్యార్థులయు సభలో శ్రీశుద్ధసత్త్వా

నందస్వాములు ఉపన్యసించారు. వివేకానంద స్వామి సెంటనరీకమిటీకి అధ్యక్షులైన శ్రీ రాజామణినాడారును ఉపాధ్యక్షులైన నటరాజనుగారును సభ్యులైన ఆర్ముగస్వామియు, పద్మనాభఅయ్యరును విశేషశ్రద్ధతో ఉత్సవ కలాపాలను విజయవంతంగా నిర్వర్తించారు. ప్రజలున్ను అత్యంతాసక్తితో పాల్గొన్నారు.

## వంగోలు

24-8-63 తేది సాయంకాలం 5 గంటలకు శ్రీ చిల్లర భవానీశంకరరావు, బి. యస్. సి. యల్. యల్. బి. గారి అధ్యక్షతన వంగోలు పట్టణన్యాయవాదిసంఘ సమావేశముజరిగింది. వంగోలు న్యాయవాదిసంఘం తరఫున శ్రీ భవానీశంకరరావుగారు స్వామివివేకానందుల చిత్రపటాన్ని బహూకరించారు. ఈ చిత్రపట ఆవిష్కరణఔచిత్యాన్ని గురించి శ్రీ శంకరరావుగారు వివరించారు.

అనంతరము, శ్రీ ఎ. డి. వి. రెడ్డిగారు, యం.ఏ.బి.యల్., బార్. అట్. లా, గుంటూరు జిల్లా జడ్జిగారు శ్రీవివేకానందస్వామి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. శ్రీవివేకానందులు అవతారపురుషులని, భారతమాత సుపుత్రుల్లో దివ్యమూర్తు లని స్వామివారికి జోహార్లు అర్పించారు.

శ్రీకావినూతల రామచంద్రరావు యం.ఏ. యల్. యల్. బి., గారి వందనములతో సభ ముగిసింది.



# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## అనంతవిశ్వహృదయం

ప్రాప్తిస్థానం: భగవద్గీతామందిరం, పునాదిపాడు పోస్టు, కృష్ణాజిల్లా. పుటలు 600, వెల: పదిరూపాయలు.

రచయిత: తమ అసలుపేరుచెప్పక "విశ్వగర్భగగనం" అన్నపేరు చెప్పుకొన్నారు. జననం 2-10-1913 తేదీనాడు. సంపన్నులైన పెత్తల్లిఈయనను పెంచుకొన్నది. ఆధ్యాత్మికదృక్పథం ఈయనకు ఆజన్మసిద్ధం. స్కూలులోను కాలేజీలోను విద్యార్థిజీవితం ప్రతిభోజ్జ్వలంగా సాగినా, లౌకికవిద్య ఈయనకు రుచింపలేదు. సర్వదేశ సర్వకాల అవతారమూర్తుల జీవితచరిత్రల సందేశముల మననానుభవానందంలో సదానిమగ్నులై ఉండేవారు. శ్రీరమణమహర్షులు శ్రీఅరవిందులు శ్రీశివానంద సరస్వతీస్వాములు మున్నగు సమకాలికాధ్యాత్మికజ్యోతులతో ఈయన నిరంతరం జాబులు జవాబులు జరుపుతూ వచ్చారు. ఇంచుమించు 600 స్వప్నాలలో

ఆఅవతారమూర్తుల సందర్శనాశీస్సులనుపొంద గలిగారు. ఆఅనుభవాలు సాక్షాత్కారాలు లేఖలు ఈగ్రంథంలో యథాతథంగా పొందు పఱుపబడ్డాయి. ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు రక్తిగొలిపే గ్రంథం. ఆకర్షమైన తయారింపు, న్యాయ్యమైన మూల్యము.

-ప్రభాకర్.

## నీరాజన

### త్రైమాసిక పత్రిక

సంపుటి: 2 సంచిక: 1

ప్రాప్తిస్థానము: నీరాజన కార్యాలయము. శ్రీ అరవిందాశ్రమము, పాండిచేరి-2. లేదా నీరాజనకార్యాలయము శ్రీ అరవింద కేంద్రము, జయపురం, కోరాపుట్టి జిల్లా.

ఈ 'నీరాజన' త్రైమాసికప్రచురణ— సంవత్సరానికి నాలుగుసంచికలు, ఆగస్టు 15, నవంబరు 24, ఫిబ్రవరి 21, ఏప్రిల్ 24 తేదీలయందు - అంటే శ్రీఅరవిందాశ్రమదర్శనములయందు వెలువడుతాయి. ఇవి గ్రంథములుగనే భావించాలి. నాల్గు సంచికలు ఒక్కటిగా బైండుచేసిన సంపుటములు ఖరీదుకు దొరుకుతాయి. శ్రీమాతారవిందులపూర్ణ యోగవాఙ్మయం సేకరించుకొన్న ట్లవుతుంది. ప్రథమసంచిక బైండుచేసి సిద్ధంగాఉంది. 180 పేజీలు గల శ్రీమాతారవిందపూర్ణయోగ ప్రభావాలతోనింపబడి ఉంది. దీని వెల : రు. 2.50 న.పై. మాత్రమే.

ఈ ద్వితీయసంపుట ప్రథమ సంచికలో ప్రార్థనలు, ప్రశ్నలు—సమాధానాలు, భారతావని, భారతీయమేధ, చింతనములు—క్షణిక దర్శనములు, వ్యాసమంజరి మున్నగు వివిధ శీర్షికలున్నూ, ప్రత్యేకప్రశ్నోత్తరానుబంధమున్నూ ఉన్నాయి. అనువదింపబడ్డ విషయాలు మూలానుగుణంగా చక్కనిచిక్కని సులభశైలిలో ఉన్నాయి. ఇది జిజ్ఞాసువులకు అవశ్యపఠనీయం.

## భగవంతు డన నేమి?

హిందీమాతృక : జయదయాళ్గోయందకా. తెలుగుసేత : మల్లంపాటి వెంకటసుబ్బారావు, వెల: 0.75 న.పై. ప్రతులకు : మల్లంపాటి సుబ్బారావు, ఎలవఱ్ఱుపోస్టు, తెనాలితాలూకా, వయా-తురుమెళ్ల (ఆంధ్రప్రదేశ్).

'భగవాన్ క్యాహై' అను శ్రీ జయదయాళ్గోయందకా హిందీరచన కిది స్వేచ్ఛానువాదం — మధురంగాను, సరళంగాను ఉంది. చక్కనిభాష. ఈచిన్నిపుస్తకంలో వివిధధ్యాన మార్గాలు, భగవంతుడు భక్తులకొఱకు సాకారంగా తయారగువిధము, గుణాతీతుడుగను, సదసత్ సమస్తగుణయుక్తుడుగను ఉండడం సాకార నిరాకారముల ఏకత — మున్నగు శీర్షికలున్నాయి. 'మద్భక్తా యత్ర గాయన్తి తత్ర తిష్ఠామి నారద'

-వేదం రామశాస్త్రి.

# శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు, మద్రాసు

## విరాళములకై విన్నపము

1963 జనవరిలో శతతమజయంతిమహోత్సవములకు యథావిధిగా అంకురార్పణము చేయబడినదని యెల్ల రెఱిగిన విషయమే. అప్పటి నుండి ఆమహోత్సవములు భారతదేశమందలి వివిధప్రాంతములలోనే గాక విదేశములందును జరుగుచున్నవి. మద్రాసుకు స్వామిజీతో గల సంబంధము చాలసన్నిహితము. కాబట్టి వారిశతతమజయంతి మహోత్సవములను యథోచిత వైభవముతో 1964 జనవరి 6-వ తేదీనుండి 20-వ తేదీవఱకు జరుపవలెనని తీర్మానింపబడినది.

భారతరాష్ట్రపతి డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి ఆదరమునను డాక్టరు సి. పి. రామస్వామిఅయ్యరుగారి అధ్యక్ష్యమునను సెంటనరీకమిటీవారు వివిధోత్తరమైన కార్యప్రణాళికను నిర్ణయించిరి. ప్రణాళికలోని అన్ని అంశములు పూర్తియగుటకు దాదాపు పదిలక్షలరూపాయలు పట్టును. ప్రణాళికలో చేరిన బాలికలహైస్కూలు పుష్కలమైనగ్రంథాలయము, శిలావిగ్రహప్రతిష్ఠ, పత్రికాపఠనాలయము, శిశుకేంద్రము, (చిల్డ్రెన్‌స్కార్నరు) ఉపన్యాసకూటము, తమిళమందును తెలుగునందును శ్రీవివేకానందస్వాముల సంపూర్ణగ్రంథావళిని ప్రకటించుట— మున్నగు అంశములు ఆచంద్రార్కము నిలుచునవి, పెక్కేండ్లపాటు ప్రజల కుపయోగపడునవి.

కేంద్ర — మద్రాస్ — ఆంధ్రప్రదేశప్రభుత్వములవారును కొందఱు మిత్రమహాశయులును దయతో ఔదార్యముతో విరాళము లిచ్చిరి. కావుననే ప్రణాళికలో అధికభాగమును ఇంచుమించు పూర్తిచేయగలిగితిమి. ప్రణాళికలోని తక్కిన అంశములు నిర్వహించుటకును ఉత్సవములను అర్హరీతి జరుపుటకును ఇంకను రెండులక్షల రూపాయలు కావలసియున్నది.

కాబట్టి శ్రీవివేకానందస్వాముల భక్తుల కందఱికీ దయతో ధారాళముగ విరాళము లిచ్చి శ్రీవివేకానందస్వాములు కలిపిన మానవసేవాలక్ష్యమునకు తోడ్పడ గాంచిన ధన్యతకు పాత్రు లగుదురుగాత మని విజ్ఞాపించుచున్నాము.

విరాళములకు వరుమానపన్ను లేదు. ''రామకృష్ణమిషను, స్వామివివేకానంద సెంటినరీ, C/o శ్రీరామకృష్ణమఠము, మద్రాస్-4 (ఇండియా) అను విలాసమునకు ధన విరాళములను పంప ప్రార్థన.

శుద్ధసత్త్వానందస్వామి,

2-9-1963 సెక్రెటరీ, స్వామివివేకానంద సెంటినరీ కమిటీ.

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ సేలటూరి భక్తవత్సలము,
శ్రీ. కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# వంటచేస్తూనే విశ్రమించండి

ಅಡಿಗೆಯು ನಿಮಗೆ ಭೀಕರ ಶ್ರಮವಾಗಿರಬಲ್ಲುದು, ಈ ಆಶ್ಚರ್ಯಕರ ಕೆರೊಸಿನ್ ಕುಕರ್ ಸೌಕರ್ಯವನ್ನು ನೀವು ತಿಳಿದುಕೊಳ್ಳುವವರೆಗೆ. ಬೇಕಾದ ಕಾಲದಲ್ಲಿ ಅಡಿಗೆ ಮಾಡಿರಿ—ಪರಿಶ್ರಮವಿಲ್ಲ.

ಕಲ್ಲಿದ್ದಲನ್ನು ಮುರಿಯ ಬೇಕಾಗಿಲ್ಲ, ... ಊದ ಬೇಕಾಗಿಲ್ಲ, ಕಣ್ಣಿಗೆ ಹೊಗೆಯಿಲ್ಲ ಮತ್ತು ಒಳ ಮಾಳಿಗೆಯಲ್ಲಿ ಮಸಿಯಾಗದು. ಈ ಹೊಸ ಕುಕರ್ ಸ್ವಚ್ಛ, ನೇರ ಮತ್ತು ಸರಳ-ದುಡಿಮೆ, ಚಿಮಣಿ ಅಥವಾ ಕಂಬನಿಗಳಿಲ್ಲ.

- మురికి, దుమ్ము వుండవు, మసి పట్టదు, మంటలు లేవవు
- ఖర్చు చాలా తక్కువ, పూర్తిగా సురక్షితమైనది
- తేలికగా ఎక్కడికి పడితే అక్కడికి తీసికొని వెళ్లవచ్చు



# ఖాస్ జనతా
## కిరోసిన్ కుక్కర్

వంట బాగా | తేలికగా చేసుకోండి

ఉత్పత్తిదారులు :

**ఓరియంటల్ మెటల్ ఇండస్ట్రీస్ ప్రైవేట్**

**77, బౌబజార్ స్ట్రీట్, కలకత్తా-12**

KALPANA O. M.15,TE

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦    ౧౯౬౩, నవంబరు; శోభకృత్తు - కార్తీకము    సంచిక ౫

## విషయసూచిక




'అఖిలవిధ శరణొందుమ, యా తృణంబ యతనికృప నీవ ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦ } ౧౯౬౩ – నవంబరు :: శోభకృత్తు – కార్తీకము { సంచిక ౪


## శివానన్దలహరి (౪)


మూలము : శ్రీ శంకరభగవత్పాదులు

టీక : నే. భ.


ప్రలోభాద్యై రర్థాహరణపరతన్త్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్త స్సన్ భ్రమతి బహుధా తస్కరపతే
ఇమం చేతశ్చోరం కథ మిహ సహే శఙ్కర విభో
త వాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్ ॥ ౨౨

| | | | |
|---|---|---|---|
| శఙ్కర | ఓశుభంకరుడా | భ్రమతి | చుట్టుచున్నది. |
| విభో | ఓసర్వవ్యాపకుడా | ఇమం | ఈ |
| తస్కరపతే | ఓ దొంగల దొరా, | చేతశ్చోరం | (నా) మనస్సనెడి దొంగను |
| ప్రలోభాద్యైః | పేరాశమున్నగువానిచే | ఇహ | ఇట |
| అర్థ | (ఇతరుల) ధనమును | కథం | ఎట్లు |
| ఆహరణ | అపహరించితెచ్చుప్రవణతకు | సహే | ఓర్చియుందును? |
| పరతన్త్రః | వశమైయున్న [నా మనస్సనెడి దొంగ] | తవ | నీకు |
| | | అధీనం కృత్వా | వశపఱచుకొని |
| ధనిగృహే | ధనవంతుల గృహములలో | నిరపరాధే | నిర్దోషుడనగు |
| ప్ర క్తః సన్ | ప్రవేశింప నుంకించుచు | మయి | నాయందు |
| బహుధా | పలువిధముల | కృపాంకురు | దయసేయుమా, |

తా॥ దొంగలకు దొరయు విశ్వవ్యాపకుడవు నైన ఓశంకరా, నామనస్సును ఒక దొంగయే. ఈదొంగ నాయధీనము తప్పి తనయిచ్ఛవచ్చినట్లు ప్రవర్తించుచున్నాడు. పర ధనాపహరణతృష్ణచే ప్రేరితుడై ఈదొంగ ధనవంతులయిండ్లలోనికి చొరనుద్యమించుచున్నాడు. ఈదొంగను నే నెట్లు సహించి నాయొద్ద నుండనిత్తును? ఇతనిని నీవశమున నుంచుకొని, ఓ దేవా, నిరపరాధి నగు నన్ను కరుణింపుమా.

కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫల మితి
పున శ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహ౯ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథ మిహ సహే శఙ్కర విభో॥ ౨౩

| | | | |
|---|---|---|---|
| శఙ్కర | ఓమంగళప్రదుడా | దిశసిఖలు | ఇత్తువుకదా |
| విభో | ఓవిశ్వవ్యాపకుడా | పునశ్చ | మరల |
| విభో | ఓప్రభూ | దివి | ఆకాశమందును |
| త్వత్ పూజాం | నీపూజను | భువి | భూలోకమందును |
| కరోమి | చేయుదును | త్వాం | నిన్ను |
| సపది | వెంటనే | ద్రష్టుం | దర్శించుటకు |
| మే | నాకు | పక్షిమృగతాం | హంసవరాహరూపములను |
| సుఖదః | బ్రహ్మానందానుభవ ప్రదాతవు | వహ౯ | దాల్చుచు |
| భవ | కమ్ము. | అదృష్ట్వా | చూడకయే |
| తస్యాః | ఆపూజకు | తత్ఖేదం | ఆదుఃఖమును |
| ఫలమ్ ఇతి | ఫలముగా | ఇహ | ఇచట |
| విధిత్వం | బ్రహ్మపదవిని | కథం | ఎట్లు |
| విష్ణుత్వం | విష్ణుపదవిని | సహే | ఓర్చుకొందును ? |

తా॥ శంకరా, విశ్వవ్యాపీ, నిన్ను భజింతును. తత్క్షణమే నాకు బ్రహ్మానందమును ప్రసాదింపుమా. అట్లు కాక నాపూజాఫలముగా బ్రహ్మపదవినో విష్ణుపదవినో ఇత్తువేని, హంస వరాహరూపముల దాల్చి వెదకియు నిను దర్శింపజాలని ఆదుఃఖమును నేనెట్లు సహింతును? శివుడు తేజఃస్తంభరూపమున ప్రత్యక్షము కాగా ఆకంబపు మొదలును తుదను కనుగొనగోరి విష్ణువు వరాహరూపమున క్రిందికిని బ్రహ్మ హంసరూపమున పైకిని పయనించి కడ గానలేక దుఃఖించి రను కథ స్కాందపురాణమున మాహేశ్వరఖండమున విరివిగ తెల్పబడి యున్నది.

కదావా కైలాసే కనకమణిసౌధే సహగణై
ర్వస ఞ్ఛమ్భో రగ్రే స్ఫుటఘటిత మూర్ధాఞ్జలిపుటః
విభో సామ్బ స్వామిన్ పరమశివ పాహీతినిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణ మివ వినేష్యామి సుఖతః ॥ ౨౪

| | | | |
|---|---|---|---|
| కైలాసే | కైలాసమందు | స్వామిన్ | ప్రభూ |
| కనకమణిసౌధే | బంగారురత్నాల మేడలో | పరమ | పరాత్పరా |
| శమ్భోః అగ్రే | పరమశివుని ఎదుట | శివ | మంగళరూపా |
| గణైః సహ | ప్రమథగణములతోగూడ | పాహి ఇతి | రక్షింపుమా అని |
| వసన్ | వసించుచు | నిగదన్ | చెప్పుచు |
| స్ఫుట | చక్కగా | సుఖతః | హాయిగా |
| ఘటిత | కూర్పబడ్డ | విధాతౄణాం | బ్రహ్మల |
| మూర్ధ | తలమీది | కల్పాన్ | కల్పములను |
| అఞ్జలిపుటః | కేలుమోడ్పుగలవాడనై | క్షణమ్ ఇవ | క్షణముగా |
| విభో | విశ్వవ్యాపకా | కదా వా | ఎప్పుడు |
| సామ్బ | పార్వతీసహితా | వినేష్యామి | గడపుదునో |

తా॥ కైలాసమందు రత్నాలబంగారుమేడలో ప్రమథగణములతోగూడిన శివునెదుట నుండి మస్తకముపై ఘటితాంజలినై 'ఓ విభూ' 'సాంబా' 'స్వామీ' 'పరమశివా' అని నామ సంకీర్తనము చేయుచు బ్రహ్మకల్పమును క్షణముగా గడపు కాల మెప్పుడు వచ్చునో కదా.

స్తవై ర్బ్రహ్మాదీనాం, జయజయవచోభి ర్నియమినాం,
గణానాం కేళీభి - ర్మదకల మహోక్షస్య కకుది
స్థితం, నీలగ్రీవం, త్రిణయన, ముమాశ్లిష్టవపుషం,
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖణ్డపరశుమ్ ॥ ౨౫

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మాదీనాం | బ్రహ్మ మున్నగువారి | మదకల | మదముచే అందగించు |
| స్తవైః | స్తుతులతోను, | మహా+ఉక్షస్య | మహావృషభము యొక్క |
| నియమినాం | ఋషుల | కకుది | మూపున |
| జయజయవచోభిః | జయజయధ్వనులతోను, | స్థితం | వేంచేసియున్న వాడవును |
| గణానాం | ప్రమథుల | నీలగ్రీవం | నల్లని మెడగలవాడవును |
| కేళీభిః | క్రీడలతోను — కూడిన వాడవును | త్రిణయనం | మూడు కన్నులు గలవాడవును |

| | | | |
|---|---|---|---|
| ఉమా | పార్వతిచేత | ఖణ్డపరశుమ్ | గండ్రగొడ్డలిని దాల్చిన వాడవును - అగు |
| ఆశ్లిష్ట | కౌగిలించుకొనబడిన | | |
| వపుషం | మేనుగలవాడవును | త్వాం | నిన్ను |
| కరధృతమృగం | చేతమృగమును దాల్చిన వాడవును | కదా | ఎప్పుడు |
| | | పశ్యేయం | దర్శింతునో ! |

తా॥ నల్లనిమెడ, మూడుకన్నులు, పార్వతీసమాలింగనము, చేతజింకయు పరశువును— వీనితో వృషభరాజవాహనారూఢుడవైన నీదర్శనము లభింపగనే ఆనందముతో ప్రమథులు నర్తింతురు, మునులు జేకొట్టుదురు, బ్రహ్మాదులు స్తోత్రములు పాడుదురు. అట్టి మీ సందర్శన భాగ్యము, ఓదేవా, నా కెప్పుడో !

కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాఙ్ఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగన్ధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యైర్ముద మనుభవిష్యామి హృదయే ॥ ౨౬

| | | | |
|---|---|---|---|
| గిరిశ | ఓ కైలాసగిరినివాసా | సమాశ్లిష్య | కౌగిలించుకొని |
| త్వాం | నిన్ను | స్ఫుటజలజ | చక్కగ విచ్చినపద్మముల |
| దృష్ట్వా | చూచి | గన్ధాన్ | వాసనగల |
| తవ | నీ | పరిమళాన్ | (వాని) పరిమళములను |
| భవ్య | మంగళకరమైన | ఆఘ్రాయ | వాసనచూచి |
| అఙ్ఘ్రియుగళం | పాదములజంటను | బ్రహ్మాద్యైః | బ్రహ్మాదులచే |
| హస్తాభ్యాం | చేతులతోను | అలభ్యాం | పొందబడ శక్యముకాని |
| గృహీత్వా | పట్టుకొని | ముదం | శివానందమును |
| శిరసి | తలపైని | కదా | ఎప్పుడు |
| నయనే | కన్నులపైని | మే హృదయే | నాహృదయమున |
| వక్షసి | ఱొమ్ముపైని | అనుభవిష్యామి | అనుభవింతునో |
| వహన్ | వహించుచున్నవాడనై | న జానే | ఎఱుగను. |

తా॥ దేవా, నీచరణయుగళిని చేత పట్టి, నా తలపైని కన్నులపైని ఱొమ్ముపైని అద్దుకొని, వానిని కౌగిలించుకొను టెన్నడో ! పద్మపరిమళమును మించినట్టి వాని పరిమళమును అనుభవించు టెన్నడో ! — బ్రహ్మాదులకు సైత మలభ్యమైనట్టి ఆయానందమును నా డెందమున నే ననుభవించు టెన్నడో !

కరస్థే హేమాద్రౌ, గిరిశ, నికటస్థే ధనపతౌ,
గృహస్థే స్వర్భూజామరసురభిచిన్తామణిగణే,
శిరఃస్థే శీతాంశౌ, చరణయుగళస్థేఽఖిలశుభే—
కమర్థం దాస్యేఽహం? భవతు భవదర్థం మమ మనః ॥ ౨౯

| | | | |
|---|---|---|---|
| గిరిశ | ఓ కైలాసవాసా | అఖిల | సమస్తమైన |
| హేమాద్రౌ | బంగారుకొండ | శుభే | మంగళమును |
| కరస్థే | [ధనువుగ] చేతనుండగా | చరణయుగళస్థే | పాదయుగళిముందేయుండ |
| ధనపతౌ | కుబేరుడు | అహం | నేను |
| నికటస్థే | చెంత నేయుండగా | కం | ఏ |
| స్వర్భూజ | కల్పవృక్షములును | అర్థం | వస్తువును |
| అమరసురభి | కామధేనువులును | దాస్యే | ఇత్తును. |
| చిన్తామణి గణే | చింతామణుల మొత్తమును | మమ | నా |
| గృహస్థే | ఇంట నేయుండగా | మనః | మనస్సు |
| శీతాంశౌ | చలివెలుగు (చంద్రుడు) | భవదర్థం | నీ సొమ్ము |
| శిరస్థే | సిగపైనుండగా | భవతు | అగును గాక. |

తా॥ కైలాసవాసా, బంగారము నీధనువున నున్నది. ధనపతి నీచాపుననే ఉన్నాడు. కల్పవృక్ష కామధేనుచింతామణులు నీయింటనే ఉన్నవి. చలివెలుగు నీతలయందే యున్నాడు. సకలమంగళములకు నీచరణయుగళమే ఆశ్రయము. ఇట్టి నీకు నేనే మిత్తును? ఐనను నామనస్సు నీ కర్పిత మగుత.

# శ్రీవివేకానందమరందబిందువులు (౧౦)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

### గ ము

మహాత్యాగమువలననే మహాకార్యములు సిద్ధించును.

సమదర్శనమున కవసరమగుచో, సమస్తము త్యజింపవలయును,

ఒరులకు ముక్తిని జేకూర్చుటకై యమాలయమునకైనను బొమ్ము. 'నా ముక్తి' యని ప్రాకులాడుట కిలలో దావు లేదు.

ఒరులకై సమస్తము త్యజించువాని కేముక్తి యింక నహర్నిశము 'నాముక్తియో, నాముక్తియో' యని దేవులాడువారు యథార్థమగు

తమ యిహాపరశ్రేయమును నశింపఁ జేసికొని పరిభ్రమించుచుందురు. ఇది నాకెన్నియోసార్లు ప్రత్యక్షగోచరమైన విషయము.

స్వీయమోక్షప్రాప్తిచే నేమి ప్రయోజనము? మధురాహారమును విశేష మనుభవించువాఁ డెవఁడు? అంతయుఁ దానే తినువాఁడా, అన్యులతోఁగూడి భుజించువాఁడా? సమస్త ప్రపంచమును మనతోఁగూడ మోక్షసౌధమునకుఁ గొనిపోవలయును, ఈ మాయాప్రపంచమున మన మాధ్యాత్మికదావాగ్నిని బ్రజ్వలింపఁజేయవలయును. అపుడే సచ్చిదానందసామ్రాజ్యమున సుప్రతిష్ఠితులమై వెలయఁగలము. ఓహో! శాశ్వతాత్మానందమున కెనయగు నానందమెద్ది? 'సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని' — తన్ను సర్వభూతములందును సర్వభూతములను దనయందును గాంచునట్టి యా యనిర్వాచ్యస్థితిలో వివశులై మీరు బ్రహ్మానందసాగరమున నోలలాడెదరు. సమస్త జీవులందును నిరుపమాన ప్రేమసానుభూతులను జూపుట మీకపుడు నైసర్గికమగును. ఇదియే యనుష్ఠాన వేదాంతము.

నాదేశమున నొక కుక్కయైనను బస్తుండి యున్నంతవఱకు దాని కాహారము నిడి రక్షించుటయే నాపరమధర్మము, ఇదియేనామతము; తద్భిన్నమంతయు నధర్మము, కృత్రిమధర్మము.

'ఒక్క ప్రాణికి సాయము చేయఁగల్గినచో, సహస్రపర్యాయములు కుక్కనై పుట్టుటకైన సంసిద్ధుఁడ'నని గురుదేవుఁడు (శ్రీరామకృష్ణుఁడు) వచింపలేదా!......మీలోఁ బ్రతివ్యక్తియు నాధ్యాత్మికసింహమని గుర్తింపుఁడు. మతధర్మముల నుద్ధరించుటే మన ధర్మమని గ్రహింపుఁడు. ప్రతిజీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి, దరిద్రనారాయణుల, నార్తనారాయణుల నర్చించు విధానము లోకమునకు మనము చూపవలసియున్నది. భారతదేశమున నూతన సన్న్యాససంప్రదాయమును స్థాపించుటయే నా జీవితోద్దేశము. జనసామాన్యము నుద్ధరించుటకై జీవితములను ధారపోయుటే యీసన్న్యాసుల యాదర్శము.

మీలోఁ బ్రతివ్యక్తియు లోకశ్రేయమునకై జీవితము నర్పింపవలయును మనము ధారపోయు రక్తధారలనుండి ప్రపంచమును మార్చివేయునట్టి వీరాధివీరులును భాగవతయోధులును వెలువడియెదరని నమ్ముఁడు!

నీ మోక్షమునకై నీవు ప్రాఁకులాడినచో నరకమే గతి నీకు! ఆత్మసామ్రాజ్యము నందఁగోరెదవేని 'నాముక్తియో' యను నుబలాటమును నిర్మూలించుకొనుము. అదియే మహోత్తమసాధన.

మహాపురుషులు మహాత్యాగము చేయుచుండుటయు జనసామాన్యము వాని సత్ఫలముల ననుభవించుచుండుటయు లోకవిదితము. నీ మోక్షమునకుఁగాను నీవు సమస్తము త్యజించుట యొక ఘనకార్యము కాదు. లోకకల్యాణార్థము మోక్షమును సైతము పరిత్యజింపనెంతువా? ఎంచెదవేని సాక్షాత్ భగవానుఁడవు—ఈ విషయము నాలోచింపుము.

ఏమియు గోరకుము; ఏప్రతిఫలమును నాశింపకుము. నీ వీయవలసినదాని నిచ్చి వేయుము; అది తిరిగి నీయొద్దకే వచ్చును—కాని యిపుడు దానినిగూర్చి తలపోయకుము. అది వృద్ధియై—సహస్రగుణాధికమై— తిరిగి వచ్చును— కాని

నీవు దానిని లక్ష్యింపరాదు. ఇచ్చుటకు నీకు శక్తి కలదు. ఇచ్చివేయుము, అంతే.

త్యాగమును మించిన సుగుణములేదు. గ్రహించుచు నెవ్వఁడు తన చేతిని ముడుచు కొనునో వాఁడే యత్యల్పుఁడు; ఇచ్చుచు నెవ్వఁడు తనచేతిని జాచునో వాఁడే యత్యధికుఁడు. సర్వదా యిచ్చుటకే చేయి సృజింపఁబడినది. పస్తుండియున్నను నీయొద్దనున్న పిడికెఁడన్నమును బెట్టివేయుము. ఇతరులకుఁ బెట్టుటవలన నీవు నిరాహారివై మృతినొందవలసి వచ్చుచో, నాక్షణముననే ముక్తుఁడవగుదువు. తత్క్షణమే నీవు పరిపూర్ణుఁడవగుదువు, భగవంతుడుఁడవగుదువు.

పేరుప్రతిష్ఠ లెవరికిఁ గావలయును ? వాని నవ్వల విసరివేయుము ! నిరాహారుల నోటఁ బిడికెఁడన్నమును బెట్టు ప్రయత్నమునఁ బేరును సిరిసంపదలును నన్నియు రూపుమాసి పోయినను—ముమ్మాటికిని నీవు ధన్యుఁడవు. ఔదార్యము, ఔదార్యమే జయించునది — ధీశక్తి కాదు. ప్రేమతోఁ బోల్చి చూచినచోఁ, బుస్తకములును బాండిత్యమును, యోగమును ధ్యానమును నన్నియుఁ గేవల తృణప్రాయములు.

భారతమాత యధమమొక వేయిమంది యువకుల త్యాగమును గోరుచున్నది.—వలయునది పౌరుషము గలయువకుల త్యాగము, పశుప్రాయుల త్యాగము కాదు... మీ తండ్రి తాతల నిరంకుశాధికారముచేఁ బశుతుల్యముగాఁ జేయఁబడిన మీ దరిద్రసోదరకోటి నుద్ధరించుటకై - నూతన పరిస్థితులను గొని వచ్చుటకై—పేదలయెడ సానుభూతిని, క్షుధార్తులగు వారల కడుపుమంట చల్లార్పఁ బట్టెఁడన్నమును, జన సామాన్యమునకు విద్యను, జేకూర్చుటకై — ప్రాణముల నర్పించు త్యాగులను జెన్నగర మిపు డెందఱను సమకూర్పఁ గలదు ?

వలయునది శాంతము, నిరాడంబరము, అచంచలమునైన కృషి—అంతియేకాని వార్తాపత్రికావంచన కాదు, పేరుప్రతిష్ఠలకై యుబలాటము కాదు,—ఈ సంగతి సదా మదినుంచుకొనుఁడు.

పేరుప్రతిష్ఠల నిమిత్తముకాక, లోకమునకత్యావశ్యకమగు సందేశముల నొసఁగు నిమిత్తము మహాత్ములావిర్భవింతురు, కాని వారి యనుచరులు వారిబోధనలను గంగలోఁ గలిపి, వారినామములను నిలువఁబెట్టుటకై ప్రాఁకులాడుచుందురు, అందులకై కలహించుచుందురు—ఇదియే లోకుల ధోరణి.

మతసంప్రదాయము లేనాఁడు ధనికులకు వంగివంగి సలాములుచేయనారంభించునో యానాఁడే వాని యధఃపతన మారంభమైనదని గ్రహింపుఁడు.

త్యాగాగ్నికీలలలో దుమికి జనులకుఁ బారమార్థికచింత గల్గింపుఁడు. శ్రద్ధ యున్నచో సమస్తము లభించును.

# శ్రీ వివేకానందస్తుతి

## శ్రీ నారు నాగార్యజీ

శా॥ సంసారార్ణవ మగ్నచిత్తులకుఁ ద్వత్సారోపదేశమ్ము లా
కంసారాతి పదాంబుజాతగతి భృంగప్రాయ నౌకాసదృ
క్సంసారీతి వెలార్చి ముక్తిపదముల్ సాధింపఁగా నోర్చె హృ
త్స్రింసద్వాంఛలఁ దీర్చి నిర్భయమహాస్థానంబుఁ గూర్చెన్ బళీ!

చ॥ అహమికయన్ తమస్సు జగ మంతయు నిండు సుదృక్ప్రయోగదు
స్సహమయి యేమి సేయఁ గొనసాగక డిల్లవడన్ భవత్ప్రబో
ధహితవిభాకరోదయ ముదగ్రతఁ దోఁచెఁ బ్రభాతవాయువుల్
సహితము వీచె విజ్ఞులు కచాకటి వెల్లుల సంచరింపఁగన్ ॥

క॥ హైందవ మాత్మజ్ఞానానందప్రదవికచనందనవన నవసుమా
ళిం దనిసనువఱకు భవత్సందేశలసత్ప్రసూనసౌరభ మోమున్ ॥

మ॥ భవదాశీర్వచనమ్ము దప్ప మముఁ బ్రోవం జాలు మార్గమ్ము లే
దవురా! మాదృశభక్తిహీనులకు నార్యా, కోటిజన్మాలకున్
సవరింపం గల పెద్ద లుండియును దేశం బిట్లు నాశిల్ల బి
ట్టవలోకించుచు మిన్నకుంట దగు నయ్యా, దేశికోత్తంసమా!॥

సీ॥ ఖండాంతరజ్ఞానభండారముల నింప నెవని ధీశక్తి వైభవధనమ్ము
హరిదంతభిత్తి కోపరిచిత్రలేఖన మెవని మనీషాసమిద్ధమూర్తి
కులమతభేదాద్రి కులిశధారాహతి యెవని దివ్యోపమప్రవచనమ్ము
అనుయాయిమతసమూహారుల కెవ్వని సాయమ్ము మేటివజ్రాయుధమ్ము
అఖిలదేశహితైక నిత్యావబోధసాధురూపవిశేష, దుస్సాధతత్త్వ
పరిగతమనస్వి, మహితతపస్వి, నిన్ను వర్ణన మొనర్ప నా కేమి వచ్చుస్వామి!

మ॥ జగ మెందాఁక వెలుంగు నందనుక నీశశ్వత్ప్రబోధమ్ము మి
న్నగ జానొందు, గురూపదిష్ట మహితానందైకతత్త్వోల్లస
న్నిగమోక్తి ప్రతిమానమై బుధజనానీకప్రశంసార్హమై
సుగమంబై విగతాభిభావమయి సంశుద్ధాంతరంగంబులన్ ॥

# శ్రీ శారదానందస్వామి

## [సంపాదకీయము]

(గతసంచిక తరువాయి)

1902 జూలై 4 వ తేదీనాడు శ్రీవివేకానందస్వామి మహాసమాధినొందెను. అప్పుడీ సంఘమునకు శ్రీశారదానందస్వామినే అధ్యక్షునిగ చేయుదమని కొందఱు ప్రతిపాదించిరి. కాని శ్రీశారదానందస్వామికి శ్రీబ్రహ్మానందస్వామిపట్ల అత్యంతప్రేమాదరములున్నందున ఆ పదవి తనకు వలదనెను. నాటినుండి చిక్కులతోకూడినవియు నిత్యప్రవర్ధమానములునగు పనులన్నియు ఈఆధ్యాత్మికమహాపురుషులిద్దఱును కలిసి నేర్పుతోను విజయవంతముగను నిర్వహించుచుండిరి.

శ్రీతురీయానందస్వాములపనిని తానునిర్వహించుటకై శ్రీ త్రిగుణాతీతానందస్వామి అమెరికాకు పోయినప్పుడు 'ఉద్బోధన్' అను బెంగాలీపత్రిక ఆర్థికాదిసంకటములలో పడియుండెను. ఆపత్రికను సాగించుచుండుటకై శ్రీశారదానందస్వామి అమోఘముగ వ్యవహరించెను. కొన్ని సంవత్సరముల పిదప ఉద్బోధన్ పత్రికకు ఒకభవన ముండవలెనని ఆయనకు తోచెను. మాతృశ్రీ కల్కత్తాకు వచ్చినప్పుడు ఆమెబసచేయుటకును ఒక యిల్లు కావలసియుండెను. కావున శ్రీశారదానందస్వామి, క్రింద ఉద్బోధన్ కార్యాలయమును, మిద్దెమీద గుడియు, మాతృదేవి విడిదియు నుండునట్లుగ ఒకభవనమును నిర్మింప పన్నాగించెను. ముఖ్యముగ రెండవకారణము స్వామిహృదయమునకు అత్యధికప్రియమైనందున, అనేకులు తీవ్రముగ ప్రతిఘటించుచున్నను సొంతబాధ్యతమీద అప్పుతీసి భవననిర్మాణకార్యమును ప్రారంభించెను.

దూరదృష్టితో చూచిన ఈ ఉద్యమము వలన ఎంతో లాభము కలిగినది. ఈ అప్పును తీర్చుటకే శ్రీశారదానందస్వామి బెంగాలీభాషలో శ్రీరామకృష్ణలీలాప్రసంగ మను గ్రంథమును రచింప నారంభించెను. ఆభాషలో అది ప్రమాణపదవి నధిష్ఠించియున్నది. ఈ బృహద్గ్రంథరచనమునకు ప్రశంస తనకు చెందవలసినది కాదనియు తన్నొక ఉపకరణముగా వినియోగించుకొని గురుదేవుడే ఆగ్రంథమును అవతరింప చేసెననియు అయన చెప్పుచుండును. అయిదుసంపుటములుగల ఆగ్రంథము ఇంకను అసంపూర్ణమే. గ్రంథమును పూర్తి చేయుమని నిర్బంధించినపుడు స్వామి ఆయనకు సహజసంక్షిప్తఫణితిలో ''గురుదేవుడు సంకల్పించునేని సాధించియే తీరును'' అని చెప్పెడివాడు. అంతముఖ్యమైనగ్రంథమును ఆయన ఎట్టిపరిస్థితులనడుమ వ్రాయుచుండెనో తెలిసినవారెల్ల ఆయనను వేయంతలెక్కువగ కొనియాడుదురు. ఆయన కాపురముండిన యింటిలో జనసమ్మర్దమెక్కువ. మాతృశ్రీ మిద్దెమీద ఉండెడిది. ఆమెను దర్శించుటకై భక్తులు ఎడతెంపులేక రాత్రింబగళ్లు వచ్చు

చుండెడివారు. ఇది గాక రామకృష్ణమిషను కార్యదర్శిగా నిర్వహింపవలసిన కార్యభారము మిక్కుటముగ నుండెడిది. అట్టి పరిస్థితిలో స్వామి ఈగ్రంథమును రచించుచు అందే నిమగ్నుడై యుండెడివాడు. చుట్టుపట్లను తక్కిన విశ్వమంతటిని విస్మరించి గురుదేవునందును మాతృశ్రీయందును తనకు గల భక్తిని ప్రేమను గ్రంథముగ రూపొందించుచుండును.

ఉద్బోధనపత్రికాకార్యాలయము 1908 సంవత్సరమప్పటికి క్రొత్తభవనమునకు చేర్పబడినది. మాతృదేవియు నచ్చట 1909 మే 23 వ తేదీనుండి నివసింప నారంభించెను. అమ్మ అచటికి వచ్చి ఉండనారంభింపగానే స్వామి అనుభవించిన ఆనందము ఎంతనగలము! మాతృదేవిపట్ల శ్రీశారదానందస్వామి కుండిన భక్తి అద్భుతావహము. ఆమె లోకజనని దాల్చిన మానుషీరూప మని ఆయనదృఢాధ్యవసాయము. అంతే కాదు, మాతృదేవికిని గురుదేవునకును ఆయనఅభిప్రాయమున భేదమే లేదు.

1909 లో నొక సంఘటన కలిగెను. ప్రశాంతుడుగ కననగు నీ స్వామి ఎంతధీరుడో అప్పుడు ప్రకట మయ్యెను. మాణిక్టోలా బాంబు కేసులో ముద్దాయీలలో నిద్దఱు— దేవవ్రతబోసును, శచీంద్రనాథసేనును— తమ రాజకీయములను వదలుకొని రామకృష్ణ సంస్థలో చేరుటకు వచ్చిరి. వారి నంగీకరించుట యనగా ప్రభుత్వమువారి కోపమును పోలీసుల ఆగ్రహమును కోరి తెచ్చుకొనుటే. ఐనను ఆధ్యాత్మికమార్గమున ఆస్థతో అడుగిడ వచ్చినవానిని, వాని మునపటి నడవడి కారణముగా త్రోసిపుచ్చుటయు కేవల భీరూచిత కృత్యము. వీరినే కాక రాజకీయరంగములో శంకాస్పదులగు మఱికొందఱు యువకులను గూడ శ్రీశారదానందస్వామి ఈసంస్థలో సభ్యులుగ చేర్చుకొనెను. కల్కత్తాలో నున్న పోలీసు అధికారిని ఇతరప్రముఖ ప్రభుత్వోద్యోగులను స్వామి స్వయముగ చూచి ఈ యువకులకై తాను హామీ ఇచ్చెను. ఈయువకులు అటుపిమ్మట ఆదర్శజీవితములను గడపి తమయందు స్వామి ఉంచిన విశ్వాసమును సమృద్ధిగ సార్థక మొనర్చిరి.

కొన్ని సంవత్సరముల తర్వాత బెంగాలులో తలయెత్తుచున్న విప్లవకార్యకలాపముల కెల్ల శ్రీవివేకానందస్వాముల రచనలే ప్రేరకములను నొక దోషారోపణము రాష్ట్రపరిపాలకుల నివేదికలో వ్రాసిపెట్టబడినది. 1916 లో అప్పటి బెంగాలు గవర్నరగు కార్మైకేలు ప్రభువు డాకాదర్బారులో రామకృష్ణమిషనునుగూర్చి పల్కిన కొన్ని పల్కులుకూడ ఈ సంస్థవారి కార్యక్రమములకు అపకరించినవి. ఈదుష్ఫలితములను చక్కజేయుటకై శ్రీశారదానందస్వామి గవర్నరును తక్కిన ఉన్నతోద్యోగులను దర్శించి ఈమిషనువారి కార్యకలాపములగూర్చి వారి మనసులలో నుండిన సకలదురభిప్రాయములను పోగొట్టెను.

ఆయన ఎంత అలక్ష్యపెట్ట ప్రయత్నించినను దుర్భరకార్యనిర్వహణక్లేశము ఆయన అనుభవించుచుండెను. తత్ఫలితముగ ఆరోగ్యము చెడెను. ఆయనకు కల్గిన వ్యాధులలో నొకటి సంధివాతము (రూమేటిజము). అందుకు నివాసమును పూరీజగన్నాథమునకు మార్పవలె ననియు సముద్రస్నానము హితకరమనియు వైద్యులు చెప్పిరి. స్వామి పూరీకి 1913 మార్చి నెలలో పోయి జూలై నెలలో

మరలి వచ్చెను. అక్కడ నున్నప్పుడు కూడ ఆయన తననియతకార్యముల మాన లేదు. అక్కడ నున్నంత కాలము ప్రతిదినము ప్రొద్దున జగన్నాథాలయమునకుపోయి సేవించు నియమమును తప్పకుండెను. రథోత్సవమునాడు మహాభక్త్యుత్సాహములతో అంత లావు మనుష్యుడైన స్వామి తేరిమోకును లాగుచుండుట వేల్పులకు దర్శనీయమైన దృశ్యము.

పూరీలో ఒక సంఘటన : అందు స్వామికి సహజములైన ఉదాత్తతయు ఉపకారపరతయు ప్రకటములైనవి. కీర్తిశేషుడైన బలరామ్బోసు అను మహాభక్తునకు అట నొక గృహము కలదు. దానికి శశినికేతన మని పేరు. శ్రీశారదానందస్వామి తనవారితో ఆయింట వసించుచుండెను. మామూలు వాహ్యాళినుండి ఒక సాయంకాలము స్వామి మరలివచ్చునప్పటికి ఆయింటిని బుందిరాజు ఆక్రమించుకొని యుండెను. రాజుకు మార్గబోధకుడుగ నుండిన గుడిపూజారి చేసిన పొరపాటు అందుకు కారణము. రాజు చేత ఆయింటిని ఖాళీచేయించుట స్వామికి మిక్కిలి సులభమే. కాని రాజునకును ఆపూజారికిని ఎట్టి మనోవ్యథయు కల్గకుండుటకై తాత్కాలికముగ తాను మఱొకయింటికి మాఱుటకు అంగీకరించెను. యథార్థస్థితి నెఱుంగని రాజ కార్యదర్శి మొదట కొంత దురుసుగ మాటాడెను. కాని స్వామిపైఖరియు ప్రత్యుత్తరమును అతనిని ఎంతయు వశపఱచుకొన్నవి. తత్షణమే భక్త్యాదరములతో అతడు స్వామి పాదరజమును తలదాల్చెను.

1913 లో బర్ద్వానులో గొప్పవఱదలు వచ్చినవి. రామకృష్ణమిషనువారు సాహాయ్యకార్యక్రమమును ప్రారంభించిరి. వఱదలుగాని కాటకముగాని కలిగినప్పుడెల్ల స్వామి ధనము ప్రోగుచేసి కార్యనిపుణులను అచ్చటి కార్యనిర్వహణకై పంపుచుండెడివాడు. ఈ సాహాయ్యకార్యక్రమము పెక్కు నెలలు చెల్లినది.

తర్వాతిసంవత్సరము స్వామికి మూత్రపిండములకు సంబంధించిన వ్యాధి కలిగెను. నొప్పి దుర్భరముగ నుండెను. కాని, మహాద్భుత ధృతితో ఆయన దాని నోర్చుకొనెను. అప్పుడు మాతృదేవి మేడపై వసించుచుండినది. ఆమెకు మనోవ్యథ కలిగింపకుండుటకై స్వామి తనకొక బాధ ఉన్నట్లుగా చెప్పనే చెప్పడు. అదృష్టవశమున కొన్నిదినములలోపల ఆ నొప్పి మానెను.

1917 లో శ్రీరామకృష్ణుని ప్రియశిష్యుడగు శ్రీప్రేమానందస్వామి వ్యాధిగ్రస్తుడయ్యెను. ఆయన కల్కత్తాలో బలరామ్బోసు నింట నుండెను. వైద్యమునకు చేయబడిన అన్ని యేర్పాట్లను శ్రీశారదానందస్వామియే పర్యవేక్షించుచుండెను. అచిరకాలములో ఆయన పూరీకి పరుగిడవలసివచ్చెను. ఏలయన అచ్చట శ్రీతురీయానందస్వామి తీవ్రవ్యాధిగ్రస్తుడై యుండెను. మఠములో వ్యాధి ఎవరికి వచ్చినప్పటికిని ఆరోగి పాన్పుప్రక్కన శ్రీ శారదానందస్వామి తప్పక యుండును. ఉపచరించుటకు వలసిన వ్యవధి తనకు దుర్లభమైనచో వైద్యమున కన్ని యేర్పాట్లను తానే చేసెడివాడు. ఎట్టి అత్యవసరపరిస్థితి ఏర్పడినను అందు కాదుకొనువాడు స్వామియే. ఒకరోగి సూదిమందు అక్కఱ లేదని నిరాకరించును. శ్రీశారదానందస్వామి అచ్చటికేగును. ఆయన సాన్నిధ్యమాత్రముచేత రోగి తన మనస్సును మార్చుకొనును. తిన్నచో చెఱుపు చేయు

తినుబండము కావలయునని రోగి మొత్తుకొనుచుండెను. స్వామి అత్యంతప్రేమసానుభూతులతో "అది నీకు తప్పక ఇప్పించెదను, కాని కొన్ని దినములకు తర్వాత" అని చెప్పును. శిశువువలె ఆరోగి సమ్మతించును. నిర్విరామమైన కార్యకలాపములను నిర్వహింపవలసియున్న దినములలోనైతము ఇతరులకులోంగని రోగుల పజ్జకూర్చుండి ఆయన గడపినరాత్రులు గలవు. ఆయన సానుభూతి ఈసంస్థకు చెందిన సభ్యులకు మాత్రమే పరిమితముకాదు. ఒకప్పుడొక భక్తుడు మశూచికిగుఱియై దిక్కులేక గంగగట్టున నొక గుడిసెలో పడియుండెను. ఆవార్త చెవిని బడిన తక్షణమే స్వామి అచటికి పోయి రోగికి జాగ్రత్తతో ఉపచరించి కొన్ని దినములలో వ్యాధిని నయము చేసెను.

వృద్ధుడైనప్పుడు ఆయన రోగులకు పరిచర్యను స్వయముగ చేయజాలకుండెను. కాని ప్రేమసానుభూతులు మాత్రము ఎప్పటియట్లే యుండినవి. వృద్ధుడుగ నున్నప్పుడొకనాటి మధ్యాహ్నము ఆయన ఒంటరిగ బయలుదేఱెను. ఎక్కడికో అని దిగులుపడి పరిచారకుడును ఆయనను వెంబడించెను. స్వామి అతనిని చూచి మొదట "నావెంట రాకుము" అనెను. కాని అతడు ఆస్థతో వేడుకొనగా అతనిని రానిచ్చెను. స్వామి ఒకహోటలులో ప్రవేశించి మిద్దెమీది ఒకగదిలో పరుండియున్న ఒకరోగిప్రక్కన కూర్చుండెను. అతడొక క్షయరోగి యని స్వామి పరిచారకుడు సులభముగనే గుర్తించెను. స్వామి అత్యంతసానుభూతితో మాటాడుచు ప్రేమతో ఆరోగిని లాలింప నారంభించెను. అతడు అజాగ్రత్తగ నుండెను. మాటాడినప్పుడు ఎంగిలి నలువైపుల చెదరుచుండెను. అతడు వెంటనే లేచి కొన్ని పండ్లను కోసి స్వామి కర్పించెను. ఇంటికి మరలివచ్చునప్పుడు పరిచారకుడు ధైర్యమవలంబించి అట్టి పరిస్థితులలో అట్టి ప్రదేశములో పండ్ల నారగించినందులకు స్వామిని తప్పుపట్టెను. స్వామి మొదట నూరకుండెను గాని తర్వాత నిట్లు చెప్పెను. "భక్తిప్రేమలతో అర్పింపబడిన ఉపహారమును తిన్నచో అది నాకెట్టి కీడును చేయ దని గురుదేవుడు చెప్పుచుండెడివాడు."

1920 మొదలు స్వామికి పెక్కండ్రు ఆప్తుల వియోగదుఃఖముసంభవించెను. ఆయన పూర్తిగ భగ్నహృదయుడాయెను. 1920లో మాతృదేవి మహాసమాధి నొందెను. రెండేండ్ల కనంతరము శ్రీబ్రహ్మానందస్వామి అమెనను గమించెను. మఱికొందఱుకూడ మరణించిరి. సోదరశిష్యులు మరణించుచుండిరి. లోకమున తాను ఏకాకి నని ఆయనకు తోపసాగినది. ఆయన తనమనస్సును క్రమక్రమముగ పని నుండి ఉపసంహరించుకొని నానాటికి హెచ్చుకాలమును ధ్యానమునకు వినియోగించుచుండెను. ఆయన తనతుది నిష్క్రమణమునకు సిద్ధపడుచున్నా డను విషయము చూపఱులు సులభముగ గుర్తింపగల్గుచుండిరి.

ఈదినములలో ఆయన మిక్కిలి శ్రద్ధతో సాగించుచుండినపని జయరాంబాటిలో మాతృదేవిపవిత్రస్మృతికై యొకగుడిని నిర్మించుట. ధనమును సరఫరాచేయునది ఆయన, పర్యవేక్షకులను పంపునది ఆయన. నిర్మాణకార్యములోని అతిసూక్ష్మవివరములుకూడ ఆయన తెలిసియుంచుకొనుచుండెను. ఆలయనిర్మాణము ముగిసినవెంటనే తాను అన్ని పనుల నుండి విరమించుకొందునని ఆయన బాహాటముగ చెప్పుచుండెను. మాతృదేవిపట్ల శ్రీ

శారదానందస్వామికుండిన భక్తికి మూర్తీ భావమైన ఆచక్కని దేవాలయమునకు 1923 ఏప్రిలు 19-వ తేదీ నాడు సంప్రోక్షణజరిగెను.

చరిత్రలో చిరస్థాయిగ నిల్చునట్లు స్వామి నిర్వహించిన అతిముఖ్యకార్యము మఱొకటి ఏమనగా 1926 లో బేలూరు మఠమున రామ కృష్ణమిషను మహాసమావేశమును జరుపుట. భారతదేశమందేమి విదేశములందేమి శతాధిక ముగ చెదరియున్న రామకృష్ణమఠమిషను కేంద్రాల సన్న్యాసులందఱును పరస్పరాను భవములను సరిచూచుకొనుటకును భవిష్య త్కార్య ప్రణాళికలను ఏర్పఱచుకొనుటకును కూర్పబడిన సమావేశ మది. స్వామి కప్పుడు ఆరోగ్యము బాగుండకున్నను ఆకార్యకలాప ములో ఆయన అత్యంతాసక్తి వహించి దానిని నెగ్గించుటకు చాల కష్టపడెను. ప్రథమ సమా వేశమున తాను పల్కిన స్వాగతవాక్కులో స్వామి రామకృష్ణమఠమిషనుల గతచరిత్ర మును సింహావలోకనముచేసి ప్రస్తుతపరిస్థితిని మోమోడక వర్ణించి భవిష్యత్తునసంభవము లైన ఒడుదొడుకులను గూర్చి సంఘసభ్యులను హెచ్చరించెను. ప్రతినూతనోద్యమమునకును ప్రజల ప్రతిఘటనము ప్రజల అంగీకారము జయము అను మూడు దశలు కలవు. నూత నోద్యమమును ప్రారంభించినప్పుడు అత్యధిక ప్రతిఘటన ముండును. ప్రతిఘటనమునకు చలింపక నిలువగల శక్తి దానికున్నచో ప్రజలు దానిని అంగీకరింతురు. దానిపై ప్రశంసలను స్తోత్రములను వర్షింతురు. ఉద్యమమునకు యథార్థవిపత్తు పిమ్మట వచ్చును. ఏలయన భద్రతకుదిరినంతనే వీర్యోత్సాహములు సడ లును. విరివి పెరుగగనే ఉద్యమప్రవర్తకులలో నుండిన లక్ష్యైక్యమును తీవ్రతయు తగ్గును. ఆయన ఉపన్యాసములో మొదటినుండి తుద వఱకు తేజోవీర్యములు నిండితొణుకుచుండెను. ఎదుట నున్న సేనలకును ఇకరానున్న అపరి చితసైనికులకును నిష్ణాత యైన దళపతి శాసించు శాసనమువలె నుండెను ఆయన వాక్కు.

ఈసమావేశానంతరము స్వామి పనుల నుండి విరమించుకొని అధికకాలమును ధ్యాన మునకు వినియోగింపజొచ్చెను. అంతటి అనా రోగ్యపరిస్థితిలో ఆయన సాగించుచుండిన ధ్యానసాధనలను చూచి వైద్యులు దిగులు చెంది ఆశ్రమనుమాను కొమ్మనిరి. అదియును గాక శ్రీశారదానందస్వామివంటి సిద్ధపురుషు నకు ఇంకను ఆధ్యాత్మికసాధనల ఆవశ్యకత ఏమున్నది? కాని మాను మని ప్రార్థించిన వారికెల్ల స్వామి చెప్పు ప్రత్యుత్తరము అను రాగనిష్యందియైన మందహాసమే.

అది 1927 ఆగస్టునెల 6 వ తేదీ ప్రాతః కాలముననే మామూలు ప్రకారము శ్రీశార దానందస్వామి ధ్యానమునకై కూర్చుండెను. సాధారణముగ ఆయన మధ్యాహ్నానంతరము వఱకును ధ్యానించుచునే యుండెడివాడు. కాని ఈదినము ముందుగా లేచి గుడికి పోయినాడు. అక్కడ సుమారు 25 నిమిషము లుండెను. అక్కడ అంత సేపు ఆయన సాధారణముగ నుండడు. గుడిలోనికి పోయి కొంతసేపటికి ద్వారమునొద్దకు వచ్చెను. మరలలోనికి పోయి మాతృదేవిచిత్రపటమునెదుట కొంతసేపునిలిచి యుండి మరలివచ్చెను. అట్లు పెక్కుసార్లు చేసెను. కడసారి వెలికివచ్చినప్పుడు ఆయన నెమ్మోమున అసాధారణప్రశాంతత వెలు

గొందుచుండెను. నాటి తక్కిన కార్యక్రమములను మామూలుగానే నెఱవేర్చెను. సాయంకాలము గుడిలో నిత్యపూజ జరుగుచున్నప్పుడు ఆయన తనగదిలోనే ధ్యాననిమగ్నుడై యుండెను. తర్వాత నొక పరిచారకుడు కొన్నిదస్త్రావీజులతో వచ్చెను. వానిని పెట్టెలో పెట్టుటకై స్వామి లేచెను. అప్పు డాయనలో ఏదో అసుఖత అంకురించెను. తల సుడియ జొచ్చెను. పరిచారకు నొక మందును సిద్ధపఱుపుమనియు అనావశ్యకమైన దిగులు కలిగించు ఈవార్తను రహస్యముగ పెట్టుమనియు ఆయన పరిచారకుని కోరెను. ఆయన పల్కిన తుదిమాట లివి. తర్వాత పాన్పుపై పవ్వళించెను. ఆవ్యాధి ఒకవిధమైన పక్షవాతము. ఆగస్టు నెల 19-వ తేదీ వేగుజామునకుముందు 2 గంటలప్పుడు స్వామి మహాసమాధి నొందెను.

ఈయుగమున భగవద్గీతలో ప్రతిపాదింపబడిన ఆదర్శమునకు శ్రీశారదానందస్వామి సజీవమూర్తీభావము. భగవద్గీతయందు చెప్పబడిన స్థితప్రజ్ఞదశ మానవున కెట్లు సాధ్యమో ఆయనను దర్శించినచో తెలియును. శీతోష్ణస్థితులందును దూషణభూషణములప్పుడును ఆయన నిర్వికారుడై యుండెడివాడు. ఇట్టివానికెల్ల అందుబాటు కాని ఉచ్చైస్స్థాయిని అధిరోహించిన జీవిత మాయనది. అన్నికార్యక్రమములను నిర్వహించుచున్నను, ఆయన యోగి యనియు సౌఖ్య మాయనలోనే యున్నదనియు విశ్రాంతి ఆయనలోనే ఉన్న దనియు జ్యోతి ఆయనలోనే ఉన్న దనియు ప్రేక్షకులకు ప్రత్యక్షముగ కననగుచుండెను. తన జీవితమున ఆయన జ్ఞాన కర్మ భక్తి యోగములకు చక్కని సామరస్యమును కుదుర్చుకొనెను. ఆయనలో వీనిలో ఏది తక్కువముఖ్యమో కనుగొనుట దుస్సాధ్యము. ఈనాల్గుయోగములలోను ఒక్కొక్కటియు మహోన్నత పరిపూర్తిని ఆయనలోనే చెందిన ట్లనిపించెడిది.

శ్రీశారదానందస్వామి మనకు రెండు వైఖరులలో కననగును. రామకృష్ణమఠమిషనుల సర్వకార్యదర్శిగా ఒకవైఖరి, ఆధ్యాత్మిక మహాపురుషుడుగ నొకవైఖరి. మఠమిషనుల కార్యదర్శిపదవిలో ఆసంస్థలందున్న అందఱి ప్రేమాదరములను ఆయన ఎంతయు చూరగొనెను. ఆయన ఏ చిన్నకోరిక కోరినను వారత్యంతాదరముతో దానిని తీర్చెడివారు. స్వామికి వారియందుండినవిశ్వాసమును ఆయనకుండిన వారిక్షేమాభిలాషయు — ఇవే కారణములు వారి కాయనపట్ల నున్న ప్రేమాదరములకు. ఎవనినిగూర్చిగాని స్వామి మనస్సులో నొక దురభిప్రాయమును పుట్టించుట చాలదుస్సాధ్యము. ఆయన విస్రంభవిశ్వాసములు ఎన్నడును విఘటితములు కాలేదు. అందఱి హక్కులను మిక్కిలి ఆదరించుపద్ధతి ఆయనది. దాపరిక మెఱుగని మనస్సు ఆయనది. కేవల మొకబాలుడు చెప్పుమాటలకైనను సరే ఆయన చాలఓర్పుతో హెచ్చరికతో చెవియొగ్గును. తాను తప్పుచేసినట్లుగా గుర్తించినప్పుడు తక్షణమే దాని నొప్పుకొనుటకు ఆయన వెనుదీయడు. ఒకప్పు డొకయువసాధువు ఏమో తప్పుచేసినా డనుకొని ఆయనను స్వామి చీవాట్లు పెట్టెను. తర్వాత ఆసాధువు నిజముగ తప్పు చేయలే దని ఆయనకు తెలియ వచ్చెను. అతనిని కటువుగ నిందించినందుకు స్వామి చాలనొచ్చుకొని మన్నింప వేడుకొనెను. అంత అధికారము చెలాయించు

చున్నను స్వామికి అధికారతృష్ణ ఇంచుకేని లేదు. ఆయన రూపుదాల్చిన వినయమే. ఎవ డైనను సరే తనకంటె ఎక్కువ తెలిసినవా డనియే ఆయన భావించెడివాడు. ప్రతిప్రా ణియు ముక్తికొఱకే పాటుపడుచున్న దనియు ఆ అభిరతియే నిత్యకృత్యములలో స్వాతంత్ర్య ప్రీతిగా ప్రకటమగుచుండు ననియు స్వామి యభిప్రాయము. కాబట్టి ఆయన ఎవిరిస్వేచ్ఛను గాని బుద్ధిపూర్వకముగ చెడగొట్టడు.

ఐనను ఆయన శక్తి ప్రభావములకు కీలకము ఆధ్యాత్మికపరతయే అనుటను విస్మరింపరాదు. అంత నిస్స్వార్థముగ అందఱిని ప్రేమింప గల్గు టయు అన్ని పరిస్థితులందును సంక్షోభ మొంద కుండుటయు ఎట్టిచిక్కులు వచ్చినను మానవ తతియందలి విశ్వాసమును నిలుపుకొనుటయు —ఆయన కెట్లు శక్యములైన వనగా ఆధ్యా త్మికముగ పరమోన్నతస్థాయిని అధిగమిం చుటచేతనే. శ్రీశారదానందస్వామి సాన్ని ధ్యము మానవులను వశపఱచుకొనెడిది ముఖ్య ముగ అట్టిమహాత్ముని ఆధ్యాత్మికతాగాధ మును వెలుపలినుండి కొలిచి చూచుట అసా ధ్యము, కాని ఇంతమాత్రము మనకు తెలి యును:— దుఃఖసంఘర్షణఖిన్నులును ఐహిక విరక్తులును నూర్లకొలదిగ వచ్చి ఆయనకడ నుండి పారమార్థికనిర్వృతిని కాంక్షించెడి వారు. ఆయనతో సమాగమ మొందినవాడు మఱింత ఉదాత్తుడుగను, మఱింత ఆధ్యాత్మి కతాసంపన్నుడుగను మార్పొందక తప్పిపో లేదు. లోకజనని సాక్షాత్కారమును ఆయన పలుసార్లు పొందినట్లుగా, సొంతమునకు వ్రాసి పెట్టుకొన్న నివేదిక సూచించుచున్నది. అంతే గాక ఆయన తన సంకల్పమును పూర్తిగా భగవత్సంకల్పముతో ఏకీభవింపజేసికొన్నవా డనుట ప్రజలకు ప్రత్యక్షముగ కనబడెడిది. ఇందుచేతనే కాబోలు ఆయన నోటనుండి ఒకటిరెండు మాటలు వెలువడినను ఖిన్నులైన పెక్కండ్ర హృదయభారము తొలగిపోయెడిది. ఆయన పరిచారకులలో నొకనికి ఆయనయొద్ద ఎక్కువ చనవు ఉండెడిది. అత డొకనాడు ధైర్యముతో స్వామిని "ఆధ్యాత్మికముగ మీ రేమి సాధించితిరి" అని అడిగెను. అందులకు స్వామి చెప్పిన జవాబు "దక్షిణేశ్వరమున మేము ఊరక తిని కూర్చుండియుంటిమా" అను ప్రశ్నయే. మఱొకప్పుడు ఉద్దేశింపకయే ఆ పరిచారకునితోనే ఆయన ఇట్లనెను. "శ్రీరామ కృష్ణలీలాప్రసంగములో ఆధ్యాత్మికవిషయము లనుగుఱించి నేను వ్రాసియున్న దెల్ల నాజీవిత మున నే ననుభవించినవే". ఆ గ్రంథములో ఒక్కొక్కచోట ఆయన ఆధ్యాత్మికజీవితమం దలి మహోన్నతానుభవములను వర్ణించి యున్నాడు.

ఆధ్యాత్మికముగ ఎంతటి సిద్ధుడైనప్పటికిని స్వామి, అత్యంతాధునికమైన దృక్పథము కల వాడు. మతములో అభిరుచి గాని విశ్వాసము గాని లేనివారు సైతము ఎంతయు సంస్కార సంపన్నులైనందున ఆయనతో కలిసి కొన్న ప్పుడు మహానందమునొందుచుండెడి వారు. నవ్యోద్యమములు, నవ్యాశయములు ఆయ నకు పరిచితములే. వీనిచే మొదట ఆయన యొద్దకు ఆకృష్టులగు వారు తర్వాత క్రమ ముగా ఆయన ఆధ్యాత్మికసంపదకు వశపడు చుండిరి.

# వేదాంతకేసరి - శ్రీ వివేకానందస్వామి

శ్రీ గురుపాదరేణువు

భారతదేశ జాతీయజీవనపు వెన్నెముక ఆధ్యాత్మికజీవనము. ఈ ఆధ్యాత్మికధర్మము నవలంబించియే భారతదేశపురాజనీతి, నైతికధర్మములు నడుపబడుచున్నవి. ఆధ్యాత్మికోన్నతివలననే భారతదేశము యుగయుగాంతరములనుండి జగత్తుకంతటికిని ధర్మాచార్యపదవి స్వీకరించి యున్నది. హిందూధర్మపు మూలగ్రంథములు వేదములు. ఈ వేదములు కర్మకాండము, జ్ఞానకాండ మని రెండు భాగములు. జ్ఞానకాండమే వేదాంతము లేక ఉపనిషత్తు లని చెప్పబడును. భారతదేశములోని సర్వమతసంస్థలకు పునాది ఈ వేదాంతము. ఈ వేదాంతసిద్ధాంతములను క్లుప్తముగ భక్తచూడామణియగు హనుమాను డీవిధముగ చెప్పియున్నాడు. — "దేహబుద్ధ్యా దాసో ఽస్మి తి జీవబుద్ధ్యా త్వదంశకః, ఆత్మబుద్ధ్యా త్వ మే వాహం ఇతి మే నిశ్చితా మతిః". మానవుడు తన్ను తాను దేహముగ తెలిసిన, ద్వైత మనియు, పరమాత్ముని అంశముగ తెలిసిన, విశిష్టాద్వైతమనియు, పరమాత్మస్వరూపముతో అభిన్నముగ తెలిసిన, అద్వైత మనియు చెప్పబడును. ఇవియే వేదాంతములోని మూడు ముఖ్యమతములు. ఈ వేదాంతగ్రంథముల మూలతత్త్వమును శ్రీమచ్ఛంకరాచార్యులవారీ విధముగ నుడివియున్నారు.— "శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః, బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" ఈ వేదాంతగ్రంథములలో ముఖ్యముగ ఆత్మతత్త్వము, జీవతత్త్వము, సృష్టితత్త్వము, మాయాతత్త్వములును వర్ణింపబడినవి.

కాని కాలవశమున వైజ్ఞానికోన్నతివలనను పాశ్చాత్యుల సంస్పర్శమువల్లను జడవాదము ప్రబలమై భారతదేశమున వేదాంతతత్త్వము లోపింప మొదలిడెను. వేదాంతగ్రంథములు అరణ్యములలోనో, గుహలలోనో, ఏకొద్దిసనాతనబ్రాహ్మణులచేతులలోనో చిక్కుకొనిపోయి సాధారణప్రజలు నిజమైన ధర్మ మేమిటో తెలిసికొన లేకపోయిరి. శుకదేవుడు, వ్యాసుడు, కపిలభగవానుడు మున్నగువారి జన్మములచే ధన్యమై వేదములకుపుట్టినిల్లగు భారతదేశములో, భగవంతుడు, త్యాగవైరాగ్యములు, సన్న్యాసాశ్రమము, పురాణములు, హిందూధర్మము మున్నగువానిపై విశ్వాసము లోపించి, నాస్తికుల సంఖ్య ప్రబల మగుచుండెను. మధ్యయుగపుహిందూసమాజముల నేతలు వైదికఋషుల విశాలమానవీయతత్త్వముల విస్మరించి, ఆధ్యాత్మికజ్యోతిని హరించి, మతభేదముల సృష్టించి, స్వార్థపరత్వమునకు వశులై ధర్మముయొక్క బాహ్యాంగములనే ప్రధానములుగ చూపుచు, ప్రజలను విద్వేషకరమును, కఠోరమునగు నియమములద్వారా శృంఖలాబద్ధుల చేయ మొదలిడిరి. తత్ఫలితముగ దేశమున, అసూయ, హింస, మతకలహములు, ధర్మము పేర అత్యాచారములు, ప్రబల మాయెను. ధర్మము వంటపాత్రలలోను, అస్పృశ్యనియమములలోను ప్రవేశిం

చెను. జితేంద్రియుడును, ఆత్మజ్ఞుడును, నిర్భయుడును, గుణాతీతుడును కాగల భారతీయుడు, ఇంద్రియలోలుడును, బద్ధుడును, పరధర్మావలంబియునై తననాగరికతను కోల్పోయి పాశ్చాత్త్యులచేతిలోని లు బొమ్మ యగుచుండెను.

ఈసమయములో భారతదేశమును పునర్జీవితముగావించుటకు, వేదాంతతత్త్వమును పునర్నిర్మించుటకు ఆవశ్యకత ఏర్పడెను. ఈ ఆవశ్యకతను నెఱవేర్చుట కేవలము ఆచార్యుల శ్రేణికి చెందిన మహాపురుషులకే శక్యము. నిజమైన ఆచార్యు డెవ్వడో శాస్త్రము లీ విధముగ చెప్పుచున్నవి—"ఆచినోతి చ శాస్త్రార్థ మాచారే సాపయత్యపి స్వయ మాచరతే యస్మా దాచార్య సేన ర్తితః — ఆధునికయుగపుధర్మాచార్యుడైన వివేకానందుని జీవితచరిత్రను పరిశీలించిన పై ధర్మము లాయనలో అగపడును. రామకృష్ణుని జీవితకాలములోనే సాధనయొక్క చరమావస్థయగు నిర్వికల్పసమాధిని పొందియుండెను. మరియు, ఆయన భారతపర్యటనమును, చికాగో ధర్మసభలోని ఉపన్యాసములను, అమెరికాలోని జీవితమును పరిశీలించిన, ఉపనిషత్తులలో వర్ణింపబడిన బ్రహ్మజ్ఞపురుషుని లక్షణము లీయనలో ప్రకాశించుట కాననగును. వివేకానందుని నామము జగద్విఖ్యాత మగుటకు మూలకారణము ఆత్మతత్త్వముయొక్క "అభయమ్" ఉపలబ్ధియే. బ్రహ్మతత్త్వోపలబ్ధిచే ప్రాప్తించిన శక్తి సామర్థ్యములవలననే ఆధునికయుగములో వేదాంతాచార్యుడుగ వివేకానందుడు పేరుగాంచినాడు. నేడు జగత్తులోని ప్రధానావశ్యకతను గూర్చి తెల్పుచు ఇట్లు నుడివియున్నాడు — "ఎవడు తనబంధముల త్రెంచి వైచినాడో, ఎవడాత్మానందము ననుభవించినాడో, ఎవనిమనస్సు సచ్చిదానందబ్రహ్మములో లీనమైనదో, ఎవడు ధనమును, యశస్సును, ప్రభుత్వమును లక్ష్యపెట్టడో వాడే నిజమైన పురుషసింహము. అట్టి పురుషసింహములే నేడు ఎంతయు కావలసియున్నారు. ప్రతిదేశమునను అట్టివారు ఆఱుగురుండిన వారు జగత్తునంతటిని కంపింపచేయగలరు" పై పురుషసింహగుణము లన్నియు స్వామివారిలో నగపడును.

సమస్తభారతదేశమును పరిభ్రమించి, భారతదేశపు ఆధ్యాత్మిక, నైతిక, భౌతిక రిస్థితులను పరిశీలించి, భారతదేశపువెన్నెముక ధర్మ మనియు, పొట్టకూటికి కట్టుబట్టకు కఱవగుటచే ఆధర్మము నేడు కొంచెము కప్పవడియున్న దనియు, ఈకఱవును రూపుమాపుటకు తగిన సాహాయ్యము స్వదేశమున దొరక దనియు గ్రహించెను. తనగురువుయొక్క ఆదేశమును పొంది భారతీయోన్నతికి తోడ్పడుటకై ధనధాన్యములతోను, భౌతికవిజ్ఞానములతోను తులతూగుచున్న అమెరికాదేశమునకు బయలువెడలి పోయెను. చికాగోధర్మసభలో సనాతనహిందూధర్మములోని సర్వమానవసోదరత్వమును, క్షమా అనుగ్రహతత్త్వములను, సర్వమతసమన్వయమును, భారతీయసంస్కృతిని, వేదాంతముల విశాలదృష్టిని ఉద్ఘాటించి, పాశ్చాత్త్యుల మనస్సు నాకర్షించెను. ఉపనిషత్తులలో ఆత్మజ్ఞునిలక్షణము లీవిధముగ వర్ణింపబడినవి. "అభయం వై జనకో ఽప్రాప్తోసి'. 'ఆత్మనావిందతేవీర్యం విద్యయా విందతే ఽమృతమ్'. 'ఆనందం బ్రహ్మణో విద్వాన్ నభిభేతి కుతశ్చనేతి." వివేకానందుడు ఈఆత్మయొక్క సాక్షాత్కారముపొంది యుండుటచేతనే, జడవిజ్ఞానవాదులగు పాశ్చా

త్త్యుల దేశపు మట్టిపైన నేసిలచి, వారిధర్మము, వారిజడవాదముల, వారినైతికజీవనముల ఖండించుచు, నిర్భయముగ హిందూధర్మమును స్థాపించెను. చిల్లిగవ్వ లేక సామాన్యపు పట్టభద్రుడుమాత్రమే యగు నొక దిగంబర సన్న్యాసి ఈవిధమైన కార్యము నెఱవేర్పగల సామర్థ్యము కేవలము ఆయన ఆత్మతత్త్వము యొక్క ఉపలబ్ధియే. ఈవిధముగ హిందూ ధర్మమును, ఇంగ్లండు, అమెరికాదేశములలో స్థాపించి తనమాతృభూమిని పునరుజ్జీవితము గావించుటకై భారతదేశమునకు తిరిగివచ్చెను.

భారతదేశపు మట్టిని స్పర్శించినవెంట నేతన హృదయాంతరాళములలో దాగియున్న స్వదేశపుభావతరంగములు భయంకరారావముతో విజృంభించి ఝంఝామారుతముగ పరిణమించి దానితో తనదేశీయుల నూడ్చుకొని పోవుటకై బయల్వెడలెను. భారతదేశమున ఒకకొననుండి మరియొకకొనకు, సింహళము నుండి అల్మోడావఱకు, నిద్రించు భారతసింగమును మేల్కొలుపుటకై వివేకానందుడు సింహగర్జనములతో కూడిన తన యుపన్యాసముల యాత్రను సాగించెను. వేదాంతతత్త్వము యొక్క భాష్యమే వివేకానందుని ఉఱుముల వంటి ఉపన్యాసములు. ఈవేదాంతసింహము యొక్క భయంకరారావములతో భారత దేశము ప్రతిధ్వనించినది. ఆయన ఉఱుముల లోని ప్రతిధ్వనులు కొన్ని ఉల్లేఖింపబడు చున్నవి—

''ఓమానవులారా, మీరు ఈశ్వరునిసంతానము. మీరు పూర్ణులు. పవిత్రులు. శాశ్వతానందమున కధికారులు. మీరు పృథివిలోని దేవతలు. మీరు పాపులు కారు. మానవుని పాపి యని పిలుచుటయే మహాపాపము. రండు. సింహములారా, రండు మాయాజాలములను ఛేదించి బయల్పడుడు. 'నిర్గచ్ఛతి (సి) జగజ్జాలాత్ పంజరా దివ కేసరీ'. మీరు గొఱ్ఱెలు కారు. గొఱ్ఱెలను భావమును దులిపివైచి మీ శాశ్వతాధికారమును గ్రహింపుడు. మీరు అసురులు. సదా ముక్తులు. మీరు దేహములు కారు. జడవస్తువులు కారు. జడజగత్తు మీబానిసయే కాని మీరు దాని బానిసలు కారు. బలముకన్నను బలిష్ఠము, స్త్రీలహృదయము కన్నను కోమలమగు హృదయములు కలవారే నిజమైన మానవులు. నేడు మనకు కావలసినది తురుష్కుల శరీరముతో కూడిన వేదాంతహృదయము. నేడు కావలసిన విద్య, ధర్మము, నీతులు, నిజమైన మానవుని తయారించునవిగ నుండవలయును. నేడు భారతీయులకు కావలసినవి ఇనుపకండలు ఉక్కునరములు, బలవత్తరమగు ఇచ్ఛాశక్తి— విశ్వబ్రహ్మాండము యొక్క రహస్యముల యంత్రముల భేదించుకొనిపోయి, సముద్రపుటడుగున మృత్యువుతో ముఖాముఖి ఎదుర్కొనుటకుకూడ వెనుదీయని ఇచ్ఛాశక్తి. ఈఇచ్ఛాశక్తి అన్నిటికంటెను బలవత్తరమైనది. ఇచ్ఛాశక్తి భగవంతునివద్దనుండి వచ్చును కాన ఈశక్తి ఎదుట అన్నిశక్తులు తల యొగ్గును. ఈశక్తి సర్వశక్తివంతము. ఏకత్వతత్త్వమగు అద్వైతసిద్ధాంతానుభూతివలననే ఈశక్తి లభించును. మనకు కావలసినది కేవలము బలము. ఈబలము ఉపనిషద్గ్రంథములనుండియే పొందగలము. జగత్తును త్తేజింపగల శక్తి ఈఉపనిషత్తులలో దాగియున్నది. వేదాంతగర్జనములతో మనదేశముతిరిగి పునరుజ్జీవితము కాగలదు. ఈఉపనిషత్తుల సహాయముననే జగత్తును పునరుజ్జీవితముగావించి బలిష్ఠము, శక్తి

వంతము గావింపవీలగును. సర్వజాతుల సర్వ మతముల దీనదరిద్రులను, అధఃపతితులను తమ తమపాదములపై నిలుచుండి, భౌతిక, మానసిక ఆధ్యాత్మికస్వతంత్రము నార్జించుట గ్రంథములు పునఃపునః ఘోషించుచున్నవి. ఈస్వాతంత్ర్యమే ఉపనిషత్తుల ముఖ్యోద్దేశము. వాని తత్త్వములు మీఎదుట నున్నవి. వానిని గ్రహించి వాని ననుసరించి మీజీవితముల తయారించుకొనుడు. అట్లైననే మీముక్తి మీ భారతదేశపు ముక్తి, మీచేతులలోనికి రాగలదు. ఆధ్యాత్మికవిషయములతో దేశమును కప్పివేసి వేదాంతధర్మముల జాతీయజీవనము యొక్క భిత్తిగ చేయవలయును. వేదాంత తత్త్వములు కాక కేవలము పొట్టకూటి విద్యనే బోధించిన భారతదేశ మెన్నటికిని బాగుపడదు. ప్రథమమున ఆధ్యాత్మికవిద్య తర్వాత పొట్టకూటివిద్య. దేశము తిరిగి మేల్కొనవలెనన్న ప్రజలను శక్తివంతులుగ చేయవలయును. ఈ కార్యము వేదాంతతత్త్వమువల్లనే నెఱవేఱును. ధర్మముయొక్క వెన్నెముక ద్వారా మీనరములు స్పందించును గాక! భగవంతుని వెదకుటకై ఎచ్చటికి వెళ్ళెదరు ? మీ ఎదుటనున్న దరిద్రులు, దీనులు, అధఃపతితులు, భగవంతుని స్వరూపులు కారా? వారినే భగవద్జ్ఞానమున పూజించి సేవింపరాదా ? భారతదేశపు జాతీయాదర్శములు "త్యాగము—సేవ". ఈ రెండు విషయములలో దేశమును బలిష్ఠము గావింపుడు. తక్కిన వన్నియు తమంత టవియే సమకూరును."

వివేకానందుని ఈసింహనాదములో భారతీయుడు తనపూర్వపుశక్తిని మాహాత్మ్యమును, నాగరికతాపటుత్వమును అనుభవించెను. ఆదిపురుషులగు ఋషులచే నొసంగబడిన ఆధ్యాత్మికవిద్యాబలమును, మహత్తును, దాని నుపయోగించుకొను విధానమును గ్రహింపగల్గెను. ఆయన ఉపదేశములలో తనగభీరతరమగు అధోగతిని గుర్తింపగల్గెను. నేటి తన తమావచ్చిన్నదశ, వీర్యహీనత, దారిద్ర్యము, తన భవిష్యత్తుయొక్క మాహాత్మ్యమును వివేకానందుని ఉపన్యాసములలో గుర్తింపగల్గెను. ఆయన వాక్కులు భారతీయుల హృదయములలో నాటుకొని అపరిమితాశను, బలమును, ఉత్సాహమును, తమశక్తిపై విశ్వాసమును, తమనాగరికతపైనను, భారతీయసంస్కృతి శక్తిపైనను, ప్రగాఢవిశ్వాసమును కల్గించెను. వేదఋషులవాక్కుల ననుసరించి, మతభేదముల విస్మరించి విశాలహృదయులై ప్రవర్తించిన తమ జాతిసమన్వయమార్గము నిష్కంటకము గావింపవచ్చునని శ్రీవివేకానందస్వామి నొక్కి వక్కాణించెను. భారతీయులు తమ వేదాంతాదర్శముల ననుసరించి జీవితము గడపిన మానవునికిని మానవునికిని గల తారతమ్యము రూపుమాసి, భిన్నభిన్న మతసంప్రదాయముల ఐక్యము గావింప గల మహాశక్తి నార్జింపగల రని స్వామి బోధించెను. వివేకానందుని "లెమ్ము! మేల్కొనుము! గంతవ్యము చేరువరకును ఆగకుము"—అను పిలుపు నేటికిని భారతీయులకు కర్ణములలో మాఱుమ్రోగుచు, వారిని, వారి శతాబ్దములనుండి వచ్చు తమోగుణము నుండియు, నేటి విజ్ఞానపు మంత్రముగ్ధతనుండియు, మేల్కొలుపుచు భారతదేశసంజీవనమునకు నాందియై విలసిల్లుచున్నవి.



# తిరస్కృతరాజాశ్రయులు - మహోజ్జ్వల సారస్వత నిర్మాతలు :

## అన్నమయ్య

విద్వాన్ శిరోమణి శ్రీ వాదారి శ్రీనివాసశర్మగారు

త్యాగయకుఁ దరువాత రాజాశ్రయమును దిరస్కరించినవాఁడుగాఁ బేర్కొనఁ దగినవాఁడు శ్రీఅన్నమయ్య. అతఁడు మహోజ్జ్వల సారస్వతమునునిర్మించి ప్రజాదరమును, రాజాదరమును చూరగొన్నాడు. పొత్తపినాటిలోని 'తాళ్ళపాక' యను గ్రామము అతనిజన్మమున సార్థకమైన పుణ్యధామము. లక్కమాంబ, కుమారనారాయణు లన్నమయ్యకు భౌతిక రూపమొసఁగిన తల్లిదండ్రులు. వేయినామములవాఁడు వేంకటేశ్వరుఁడు వారికిఁ గలలోఁ గనఁబడి ముప్పిడి కటార మొసఁగి పుత్రజన్మ మనుగ్రహించినాఁడు. భగవదనుగ్రహముచే జన్మించిన కారణజన్ముఁడు శ్రీ అన్నమయ్య.

బాల్యమునుండియే అన్నమయ్య వేంకటేశ్వరుని భక్తుఁడయ్యెను. తల్లి ఉగ్గు పెట్టఁబోవ పసివాఁడు నోరు దెఱువఁడు. తల్లి 'నాయనా, ఇదిగో తిరుమలప్పని ప్రసాదము' అనగానే కేరింతలతో నోరు దెఱచి ఆయుగ్గును గుటుక్కన మ్రింగివేయును. లక్కమాంబ 'నాయనా! వెంకటేశ్వరునికి దండము పెట్టు' మనును. వెంటనే అన్నమయ్య తన చిన్ని చేతులు జోడించి నమస్కరించును. ఒకప్పుడేదో యోచించుచు, మఱియొకప్పుడు నిమీలితనేత్రుఁడై, వేఱొకప్పుడు చిఱునవ్వు నవ్వుచు అన్నమయ్య విచిత్రముగా నుండును. ఈభావములన్నియు అన్నమయ్య ఏడుకొండలవానితో నాడుకొను నాటలు.

అక్షరాభ్యాసమైన వెంటనే జన్మాంతర వాసనలవలె చదువులన్నియు నాతని యొంటఁబట్టెను. చిన్ననాటినుండియే అన్నమయ్యకుఁ గవితాధారకూడ అలవడెను. అతఁ 'డాడిన మాటయెల్ల అమృతకావ్యముగ - పాడినపాటలెల్లఁ బరమగానము'గ నగుచుండెను. వేంకటేశ్వరునిపై అతఁడెన్నో కీర్తనలల్లుచుండెను. అన్నమయ్య గురువు ఘనవిష్ణువు. అతని కడ విద్యలన్నియు ముగించి అహోబిలక్షేత్రమున శఠగోపయతీంద్రుల కడ అష్టాక్షరీ మహామంత్రోపదేశమునంది, తదనుగ్రహముచేఁ గవితాసృష్టికిఁ గడంగెను. అన్నమయ్య రామాయణమును సంకీర్తనరూపమున రూపొందింపఁదలఁచి తత్ప్రయత్నమున నుండెను. ఆసంకీర్తనలను విన్నవా రందఱు అతనిభావతన్మయతకును, గానమాధుర్యమునకును మెచ్చి యతఁడవతారపురుషుఁడుగ భావించుచుండిరి. ఊరూర, వాడవాడల నతని కీర్తనలు చరచర వ్యాపించిపోవుచుండెను.

విజయనగరరాజుల కాలమున ప్రతి మండలమునను నొక ప్రధాన దండనాథుఁడుండెను. టంగుటూరు మండలమునకు సాళువ నరసింహరాయఁడు విజయనగరరాజులతరఫున ప్రధాన దండనాథుఁడు. అతఁ డన్నమయ్యకీర్తి విని పల్లకి నంపి మర్యాదలతో నతని తనకడకు రప్పించుకొనెను. అన్నమాచార్యుల కీర్తనలు విని అతఁడు పరమానందభరితుఁ డయ్యెను.

నాఁటినుండి సాళువనరసింహరాయనికిని, అన్నమయ్యకును స్నేహము దినదినాభివృద్ధి చెందెను. అన్నమయ్య యన్న సాళువ నరసింహరాయని కెనలేని గౌరవము, భక్తి.

ఆనాఁడువిజయనగరమును విరూపాక్షరాయ లేలుచుండెను. విషయసుఖాసక్తుఁడైన అతని పాలనను తుదముట్టింప కపిలేశ్వర గజపతి విజయనగరముపై ముట్టడి సాగించెను. అతనితోఁ బోరాడలేక విరూపాక్షరాయ లాతనికిఁ గొంత కప్పము చెల్లించి, గజపతిని సాగనంపెను. ఆధనమును మఱలగడించుటకుఁగాను అతఁడు ప్రజలపై పన్నులు విధించెను. విరూపాక్షరాయల పెద్దకొడుకు రాజశేఖరరాయలు. అతఁడు తండ్రిని జంపి సింహాసన మెక్కెను. రాజశేఖరరాయల తమ్ముఁడగు రెండవ విరూపాక్షరాయలు అన్నను జంపించి సింహాసన మాక్రమించెను. మొదటివాఁడు పితృహంత, రెండవవాఁడు భ్రాతృహంత. అతని పాలనము సామాన్యప్రజలకుఁ గంటక ప్రాయముగ నుండెను. ఆసమయమును కనుపెట్టి టంగుటూరు దండనాథుఁడగు సాళువ నరసింహరాయఁడు రెండవ విరూపాక్షుని జంపి తాను విజయనగర సార్వభౌముఁ డయ్యెను.

సాళువ నరసింహరాయఁడు విద్యానగరమును వశపఱచుకొన్న తరువాత అన్నమయ్యను విద్యానగరమునకుఁ రావించి అతనికెంతో మర్యాదలు చేసెను. విజయనగరములోని అర్చావతారమూర్తులపై అన్నమయ్య ఎన్నియో కీర్తన లల్లెను. దేశమంతయు అన్నమయ్యను సంకీర్తనాచార్యుఁడని పొగడెను.

ఒకనాడు రాయలు కొలువు దీరియుండెను. సంకీర్తనాచార్యుఁడగు అన్నమయ్య రాజు ప్రార్థనపై శ్రీవేంకటేశ్వరుని మీద అప్పటి కప్పుడే కృతులల్లి పాడెను. కవులాతని భావ గాంభీర్యమునకుఁ గోమల పదవిన్యాసమునకు నొడలు మఱచిరి. ఆస్థానగాయకులు రాగ సౌభాగ్యమునకు ముక్కులపై వ్రేళులుపెట్టిరి. పుంభావసరస్వతి అన్నమయ్య ఆనాఁ డొక అవతారమూర్తివలె వెలిఁగెను.

అన్నమయ్య వేంకటేశ్వరునిపైఁ బాడిన శృంగారపదములు విన్న వెంటనే ఒడలు పులకరింప సాళువ నరసింహరాయని కొక దురాశ పుట్టి తనపైఁగూడ, అట్టి పద మొకటి యల్లి పాడుమని అన్నమయ్యను ప్రార్థించెను. అన్నమయ్య రెండు చెవులు మూసికొని ఇట్లనెను—

తలగరో లోకులు తడవకురో మమ్ము
కలిగిన దిదె మా కాపురము ॥ పల్లవి॥

నరహరి రన నానిన జిహ్వ
ఒరుల నుతింపగ నోపదు జిహ్వ
మురహరు పదముల మ్రొక్కినశిరము
పరుల వందనకు పరగదు శిరము॥ తల॥

పతినే పూజించిన కరములు
చోపి యాచనకు చొరవు కరములు
యేపున హరికడ కేగిన కాళ్ళు
పాపుల యిండ్లకు పారవు కాళ్ళు తల॥

శ్రీవేంకటపతి చింతించు మనసు
దాపతి నితరము తలచదు మనసు
దేవుఁ డతని యాధీనపు తనువు
కేవల నిరరాధీనము గాదు ॥ తల॥

"సార్వభౌమా, సకలలోకా ధుఁడు వేంకటేశ్వరుఁడు. అట్టివాని కొలువున నాస్థాన గాయకుఁడనగు నేను అన్యపురుషులనుపొగడను. భగవద్గుణ సంకీర్తనపరమగునాలుక అన్యులను పొగడదు. ఇన్నిరోజులు నీతో స్నేహము గావించినందులకు మంచిమాట చెప్పినావు.

నీ విట్టివాఁడవని నేను తలంపలేదు.''

అన్నమయ్య ఈ మాటలు చెప్పి మఱుక్షణముననే అచ్చటనుండి పోబోయెను. నరసింహరాయని ముఖము కోపకషాయితమయ్యెను. 'మాపై పదము పాడువఱకు నీ విచ్చటినుండి కదలుటకు - వీలులే' దని గర్జించెను. రాజులతోఁ జెలిమి త్రాచుపాములతోఁ జెరలాటము వంటిది.

అన్నమయ్య దీనికి జడిసిపోలేదు. 'నాచేత నీమీఁద పదము పాడింప హరిహరాదులకైనఁ దరము కా' దనెను. రాజు కోపావేశముచే నన్నమయ్యను బంధింప భటుల కాజ్ఞయిచ్చెను. రాజభటు లాతని చేతులకు శృంఖలలు తగిలించిరి. ఆసంకటసమయమున అన్నమయ్య వేంకటేశునిపై ఈక్రింది కీర్తన పాడెను.

ముఖారి రాగం

ఆకటి వేళల నలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కు మరిలేదు ॥ పల్లవి॥

కొరమాలియున్న వేళ కులము చెడిన వేళ
చెరవడి యొరులచే జిక్కిన వేళ
ఒరపైన హరినామ మొక్కటే గతిగాక
మరచి తప్పిననైన మఱి లేదు తెరగు ॥ ఆక॥

ఆపద వచ్చినవేళ గారడి పడినవేళ
పాపపు వేళల భయపడిన వేళ,
ఓపినంత హరినామ మొక్కటే గతిగాక
మాపుదాకా పొరలిన మరిలేదు తెరగు ॥ ఆక॥

సంకెల పెట్టినవేళ చంప పిలిచినవేళ
అంకిలిగా నప్పులవా రాగినవేళ
వేంకటేశు నామమే విడిపించ గతిగాక
మంకుబుద్ధి పొరలిన మరిలేదు తెరగు॥ ఆక॥

ఈ కీర్తన పాడెనో లేదో సంకెలలు తమంత తామే ఊడిపోయెను. రాయలు మఱల స్వయముగా వచ్చి సంకెలలుతొడిగెను. అన్నమయ్య మఱల యథాపూర్వముగ నదేపాటను బాడెను. ఈసారి సంకెలలు తమంత తామే విడిపోయి ముక్కలు ముక్కలయ్యెను. రాయలకుఁ దెలివి వచ్చెను. అతఁడు తన్ను మన్నింప అన్నమయ్యను ప్రార్థించెను. రాజులతోడి పొత్తు భక్తులకు క్షేమంకరముగాదని అన్నమయ్య, రాజెంత ప్రార్థించినను వినక విజయనగరము నుండి తిరిగివచ్చెను.

అన్నమాచార్యుఁడు సంసారభారమును కొడుకుల కప్పగించి విరక్తుఁడై తిరుమలప్పనిఁ జేరి శ్రీవేంకటేశ్వరునిపై పదము లల్లుచు జీవితశేషమును గడపెను.

అన్నమయ్య పంద్రెండు శతకములను, సంస్కృతమునఁ గొన్ని యుద్గ్రంథములను రచియించెను. అతఁడు తన జీవితకాలములో ముప్పదిరెండువేల కీర్తనలు రచియించి సంకీర్తనాచార్యుఁ డను పేర వెలింగెను. భక్తవరేణ్యులగు రాజులు వాని నన్నింటిని సేకరించి, తామ్రఫలకములపై వ్రాయించి శ్రీవేంకటేశ్వరుని సన్నిధానమున సంకీర్తన భాండారమను గదిలో భద్రపఱచిరి. తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆకీర్తనలకు ముద్రణభాగ్యము కలిగించి ప్రజలలో వాడుక గలిగింపఁ బ్రయత్నించుచున్నారు. త్యాగరాజునకు శిష్యపరంపర కలదు. కాని అన్నమయ్యకు శిష్యపరంపర లేకపోవుటచే నతని కీర్తనలకుఁ బ్రచారము కొఱవడినది. ఏమైన నేమి, రాజాదరమును లెక్కచేయని మహోజ్జ్వల సారస్వత నిర్మాతలలో అన్నమయ్య యొకఁ డనుటలో సందేహము లేదు.

# నా లంకాద్వీప యాత్ర

## శ్రీ శుద్ధసత్త్వానందస్వామి

ప్రకృతిసౌందర్యమునకు ప్రసిద్ధి కెక్కినది యును, శ్రీరామచంద్రుని పుణ్యస్మృతిని గల్గించునదియును అగు లంకాద్వీపమునకు వెళ్ళుటకుగాను వివరములు పెక్కురు కోరు చుందురు. అందుచే ఈవ్యాసమును వ్రాయు చున్నాను.

భారతదేశమునుండి లంక 22 మైళ్ళు మాత్రమే. పూర్వము లంక భారతదేశముతో ఘనిష్ఠసంబంధము కల్గియుండెను. ప్రస్తుతము అదొకస్వతంత్రరాష్ట్రమగుటచే అచ్చటికి వెళ్ళుటకు ఎన్నో కట్టుదిట్టము లేర్పఱుప బడినవి. వివరముల పూర్తిగా తెలిసికొనకయే బయలుదేఱి పెక్కురు కష్టముల పాలగుదురు.

లంకరాజధానియగు కొలంబోలో ఒక రామకృష్ణాశ్రమము కలదు. అచ్చటి మఠాధ్యక్షుని ఆహ్వానముమీద మహాశివరాత్రి పూజయు, శ్రీ రామకృష్ణజన్మదిన పూజాహోమాదుల నొనర్చుటకుగాను లంకకు వెళ్ళితిమి.

లంకకు వెళ్ళవలెనన్నచో మొట్టమొదట భారతసర్కారునుండి అనుమతిపత్రము పొందవలెను. దానికి రుసుము 5/- రూ. అటుపై (భారతదేశములో ఉండు) సిలోను సర్కారు హైకమీషనరువద్ద వీసాకు దరఖాస్తు పెట్టుకోవలెను. సిలోనుప్రభుత్వపు హైకమీషనరు ఆఫీసులు, భారతదేశములో, మద్రాసు, ఢిల్లీ, బొంబాయి, తిరుచిరాపల్లిలో కలవు. వీనిలో ఏదేని ఒకఆఫీసునుండి వీసా పొందవచ్చును. వీసా రుసుము 2/- రూ. అనుమతి పత్రమునకుగాని, వీసాకుగాని దరఖాస్తుతోపాటు రెండు, మూడు ప్యాసుపోర్టు సైజుఫోటోలు కూడ పంపవలెను. సిలోనుప్రవేశించినది మొదలు 15 దినములవఱకే వీసా ఈయ బడును. ఏదేని విశేషప్రయోజనార్థమై వీసా గడువు పొడిగింపగోరినచో, కొలంబోలో దానికై ప్రయత్నింపవలెను. బయలుదేఱుటకు పూర్వము సుమారు 15 రోజులుముందుగ మునిసిపాలిటీవద్దనుండిగాని హెల్తుడిపార్టుమెంటువద్దనుండిగాని కలరాఇంజక్షను, టీకాలు వేయించుకొన్నట్టి సర్టిఫికేట్లు తీసికోవలెను. కొలంబోవఱకు టిక్కెట్టు కాక ప్రతిమనుష్యుడును 75/- రూ. మాత్రమే తీసికొని పోవుటకు భారతప్రభుత్వము అనుమతించును. విమానములో పోయినచో 'రిటర్నుటిక్కెట్టు' తీసికోవచ్చును. భారతదేశము వీడుటకుముందు ప్రయాణికులు తమ మిగతడబ్బును ధనుష్కోటిలో ప్రభుత్వపురక్షణక్రింద డిపాజిట్టు చేసికోవచ్చును.

కొలంబో వెళ్ళుటకు రెండుమార్గములు కలవు. తిరుచిరాపల్లినుండిగాని, మద్రాసునుండిగాని విమానములో పోవచ్చును. మద్రాసునుండి టిక్కెట్టు 120/- రూ. తిరుచిరాపల్లినుండి 90/- రూ. మద్రాసునుండి ప్రతిదినము మధ్యాహ్నము 'ఇండియన్ ఏర్ లైన్సు' వారి

విమానము బయలుదేఱి 100 నిమిషముల లోగా కొలంబో చేరును. తిరుచిరాపల్లినుండి వారమునకు మూడురోజులు విమానము బయలుదేఱును. 75 నిమిషములలో కొలంబో చేరును. మద్రాసునుండి కొలంబో 340మైళ్ళు, తిరుచీనుండి 280 మైళ్ళు.

రెండవది రైలుమార్గము. మద్రాసు ఎగ్మోరుస్టేషనునుండి ధనుష్కోటి ఎక్ప్రెస్ మెయిలులో సాయంత్రము బయలుదేఱిన మఱునాడు సాయంత్రము ధనుష్కోటి చేరును. ధనుష్కోటి నుండి స్టీమరు 22 మైళ్ళలో ఉన్న తాలమన్నారు చేరును. సుమారు 2½ గంటల ప్రయాణము. అచ్చటినుండి సిలోను గవర్నమెంటు రైలులో బయలుదేరి కొలంబో పోర్టుస్టేషను చేర వచ్చును. మద్రాసునుండి పోర్టుస్టేషను వఱకు ఒకేటిక్కెట్టు కొనవచ్చును. టిక్కెట్టు రెండవక్లాసు అయిన 55 రూ॥లున్నూ, మూడవక్లాసు అయిన 27 రూ॥లు. మండకక్యాంపు వద్దను తాలమన్నారువద్దను కష్టమ్సు ఆఫీసర్లు యాత్రికుల వస్తువుల నన్నింటిని శోధింతురు. ఒకటి రెండు తరగతుల ప్రయాణీకుల సామానులు శోధించిన పిమ్మటనే మూడవ తరగతి ప్రయాణీకుల సామానులు శోధింపబడును. మూడవతరగతి ప్రయాణీకులు అధికముగ నున్నచో తైల్వేరంకైనాస్టేషనులోవారు కాచుకొనియుండవలెను. తైల్వేరంకైనాలో సిలోన్ సర్కారు ఆఫీసుకు యాత్రికులు స్వయముగా వెళ్ళి టీకా, ఇంజక్షను సర్టిఫికేట్లు చూపవలెను. విసాగడువు పొడగింపగోరినచో 'కంట్రోలర్ ఆఫ్ ఇమిగ్రేషను' ఆఫీసుకు వెళ్ళి ప్రయత్నింపవలెను. ఏదినమువఱకు సిలోన్‌లో ఉండుటకు గడువు ఈయబడినదో, అదే తారీఖునకు లంకాద్వీపమును వదలిపోవలెను. లంకాద్వీపములో ప్రయాణము చేయునపు డీ విసా, ప్యాసుపోర్టు, టీకాఇంజక్షను సర్టిఫికేట్లు సర్వదా దగ్గరనే ఉంచుకోవలెను. లేకున్న లేనిపోని ఇబ్బందుల పాలు కావచ్చును.

ఇక సింహళదేశ చరిత్రమునుగూర్చి కొంత ముచ్చటింతము. క్రీ.పూ. 544 సంవత్సరమున రాజావిక్రమసింహుడు 700 పరివారముతోసహా లంకకు వెళ్ళి నివసింపదొడంగెను. సింహుని నుండియే సింహళమైన దని కొందఱిఅభిప్రాయము. క్రీ.పూ. 544 మొదలు క్రీ.శ. 1815 వఱకు సింహళరాజులు ఈ ద్వీపమును ఏలిరి. క్రీ.పూ. 3 వ శతాబ్దమున అశోకుని కుమారుడు మహేంద్రుడును, కుమార్తె సంఘమిత్రయును ఈద్వీపమున మొట్టమొదట బౌద్ధధర్మ ప్రచారము కావించిరి. సింహాళీయులకును భారతీయులకును మధ్య స్నేహభావము చిర స్థాయిగ నిల్చుటకుగాను సంఘమిత్ర పవిత్ర బోధివృక్షశాఖ నొకదానిని అనూరాధపుర రాజునకు కానుకగ ఇచ్చెను. రా జాశాఖను అత్యంతవైభవముతో నాటెను. అదియే నేడు ప్రపంచములోని చెట్లన్నింటికంటె పురాతన మైన దట. బుద్ధగయలోని బోధివృక్షము ఒకపరి ఎండిపోగా, అనూరాధపురవృక్షశాఖను గయకు తెచ్చి తిరిగి నాటి రట. అదియే నేడు గయలో గల బోధివృక్షము.

సంఘమిత్ర, మహేంద్రుల ప్రచారముచే అనూరాధపురరాజు (అప్పుడు అనూరాధపురమే సింహళద్వీపరాజధానిగనుండెను) బౌద్ధధర్మము స్వీకరించెను. అటుపై ప్రజలందఱు బౌద్ధమతమును స్వీకరించిరి.

లంకాద్వీపముయొక్క మనోహరప్రకృతి సౌందర్యమే కాక, అమూల్యరత్నరాసులు

కూడ విదేశీయుల దృష్టిని ఆకర్షించెను. మొదట దక్షిణభారతము నేలిన తమిళరాజులు కొన్నిమార్లు ఆక్రమణ కావించిరి. అటుపై చోళ, పాండ్యరాజులు దాడి సల్పి సింహళ రాజును జయించిరి. సింహళరాజు, అనూరాధ పురము వీడి పొలనారువా చేరి రాజధాని నేర్పఱచుకొనెను. పొలనారువా ఆక్రమింప బడినతర్వాత సింహళరాజుల రాజధాని సైగిరి యాకు మారెను. క్రీ.శ. 1505 సంవత్సరము, పోర్చుగీసువారును క్రీ. శ. 1640 సం॥న హాలెండువారును ఈద్వీపముపై దాడులు సల్పి కొన్ని ప్రదేశముల ఆక్రమించుకొనిరి. అటుపై క్రీ.శ. 1776 న బ్రిటిషువారు డచ్చివారిని పాఱద్రోలి ఆప్రదేశము నాక్రమించిరి. క్రీ.శ. 1815 లో కడపటి బౌద్ధసింహళరాజగు విక్రమ రాజసింహుని ఓడించి దేశమునుండి వెడల గొట్టి ద్వీపమును పూర్తిగా వారి స్వాధీనము చేసికొనిరి. క్రీ.శ. 1946 లో ద్వితీయప్రపంచ మహాయుద్ధము తర్వాత సింహళద్వీపము స్వాతంత్ర్యముపొంది ప్రజారాజ్య మేర్పఱచు కొనెను.

ఈద్వీపము పొడవు 300 మైళ్ళు, వెడల్పు 150 మైళ్ళు, జనసంఖ్య 90 లక్షలు. అందు 65 లక్షలు సింహళీయులును, మిగిలినవారు హిందువులు. ఈద్వీపమందు కొన్ని జిల్లాలలో టీ, కాఫీ, కోకో, రబ్బరుతోటలు మెండు. కొన్నిప్రాంతాలలో టెంకాయతోపులు కలవు. ఈటెంకాయలకు (కింగ్ కోకనెట్) టెంకాయ రాజు అని ప్రసిద్ధి.

ఈద్వీపములో ముఖ్యముగ చూడవలసి నవి—కొలంబో నగరము, గోల్ బందరు, కదిరి కామ యిందలి సుబ్రహ్మణ్యాలయము; శైల విహారము, నీవురోలియా, కాండినగరము, టూత్ టెంపిల్; బొటానికల్ గార్డన్సు; యూని వర్సిటీ; డుంబోలావద్ద బౌద్ధగుహామందిరము; సైగిరియాలోని చిత్రము; పొలనారువాలోని బౌద్ధరాజధానీ శిథిలములు, త్రినోమాలీలో స్వాభావికనౌకాశ్రయము, కోణేశ్వరశివాల యము; అనూరాధపురమందలి బౌద్ధస్తూపము, బోధివృక్షము, కోటలశిథిలములు మున్నగునవి. కొలంబోలో ఉన్న ''టూరిస్టు ఇన్ఫర్మేషను బ్యూరో'' కు వెళ్ళినచో, ముఖ్యముగ చూడ వలసిన చోట్లను, ఎచ్చట ఎచ్చట బసచేయ వీలగునో ఆ వివరములను తెలిసికొనవచ్చును. రైలుఛార్జీలు హిందూదేశములోని రైలుఛార్జీ లకు సమానము. బస్సుఛార్జీలు మూడవ తరగతి రైలుఛార్జీకన్న తక్కువ. కొంచెము జాగ్రత్తగా ఖర్చుపెట్టినచో గవర్నమెంటు వారు సమ్మతించిన 75 రూ॥లతో ముఖ్య ప్రదేశములనెల్ల చూచి రావచ్చును.

కొలంబోనగరము చూచుటకు చాలఅంద మైనది. కాని పాశ్చాత్యనాగరికతతో నిండి యున్నది. ఇచ్చటి జంతుప్రదర్శనశాల చూడ దగినది.

ఈద్వీపమందు శ్రీ రామకృష్ణమిషను సుమారు 30 సం॥లుగ సేవాకార్యము చేయు చున్నది. కొలంబో రామకృష్ణమిషనుతరఫున ఒక గ్రంథాలయము పత్రికాపఠనాలయములు కూడ నడుపబడుచున్నవి. ఈ ద్వీపమందు 26 స్కూళ్లను, నాలుగైదుహాస్టళ్లనుకూడ రామ కృష్ణమిషనువారు నడుపుచుండిరి. కాని ఇటీవల సిలోనుగవర్నమెంటువారు స్కూళ్లనన్నింటిని తమ అధీనము చేసికొనిరి.

(సశేషము)

# శ్రీ రామకృష్ణపరమహంస విలాసము

మూలమ్ : శ్రీ శ్రీ చిద్ఘనానందగిరిస్వాములవారు

తాత్పర్యకాదంబిని : శ్రీ శ్రీధరబాబు

(గతసంచిక తరువాయి)

94. ప్రచండ సూర్యతప్తే యః
సోపానేఽపి శిలామయే।
ఆశేత స మహాభక్తో
విలపన్ బాలవద్ధతాత్ ॥

అతడు ప్రచండసూర్యతాపమునకు వేడెక్కిన శిలామయమగు సోపానములమీద పిల్లవానివలె హఠముతో కూర్చుండి, భగవతితో ఇట్లు విలపింప సాగెను.

95. అకరవన్న హి కస్యచిదప్రియం
హ్యపకృతిన్న కదాప్యవదం శివే।
నిఖిలశక్తియుతాపి జహాసి మా
ఙ్క్ మపరాధహతశ్చుసుతం యథా॥

అమ్మా, నీకు అప్రియములగు కార్యములనెప్పుడును ఒనరింపలేదు. అపకృతిని ఎప్పుడును తలపెట్టలేదు. సర్వశక్తివంతురాలవైనను దుర్మార్గపుత్రోవ త్రొక్కినవానివలె నన్ను వదిలివేయుట న్యాయమా ?

96. సహజపావని తే ప్రభుతాతులా
పతితపావని మామవ బాలకమ్
కరుణయాశన మాచర మాచర
కరణమప్య విహాయ మమాన్యతః ॥

సహజపావనీ, నీప్రభుత అతులమైనది. పతితపావనీ, ఈశిశువును రక్షింపుము. ఈనివేదనను ఆరగింపుము.

97. మృగయతామిహ భక్తిమతాం సతాం
త్వమసి దేవి సదా నికటే శివే।
మధుని చామ్బ యథా మధుమక్షికా
స్త్రికరణేన శివే మృగయామ్యహమ్॥

సజ్జనులై నీకొఱకు వెదకుచున్న భక్తివంతులకు నీవు చేరువగా నుందువు. మధువును వెతకు తేనెటీగవలె నిన్ను నేను అన్వేషించుచున్నాను.

98. సుమునివర్గ చతుష్టయ సప్తభి
ర్హృదయపక్వఫలం హి నివేదితమ్।
జనని చిన్మయి నారదముఖ్యకైః
శుకముఖ్యైశ్చ జగన్మయి సంవిదే

సనకసనందనాదులు, సప్తఋషులు, శుకనారదాదులు పరిపక్వహృదయఫలమునే నీకు నివేదన మొనర్చిరి.

99. హృదయమస్య న పక్వమభూదుమే
తవ ముదే జగదమ్బ నివేదితుమ్।
అత ఇదమ్పరిభుఙ్క్ష్వ పరాత్పరే
రుచికరం రుచిరే వరమోదనమ్॥

అట్లు నాహృదయము పరిపక్వము కానిచో ప్రేమతో నీ కారగింపుజేసిన అత్యంతరుచికరమగు ఈనివేదనను స్వీకరింపుమా పరాత్పరీ!

100. లవణతోయనిధౌ కలహంసకాః
సహజనిస్పృహతా సహితా యథా ।
అమృతసిన్ధుమయి త్వయి భక్తిమాన్
భవ సుఖేషు భవా మ్యతినిస్పృహః ॥

ఉప్పుసముద్రమున కలహంసలు నిరాశ చెందుట సహజము. అమృతసాగరరూపిణి, అట్లే నే నీ సంసారసుఖములందు నిస్పృహ చెందినాను.

101. భజతి జన్తుచయః పరమిన్ద్రియై
ర్భ్రమధియా పరిహాయ సుధార్ణవమ్ ।
జనని పఞ్చవిషాన్ విషయా నుమే
అహహ మా న్న విధత్స్వ తథావిధమ్ ॥

ఉత్కృష్టమగు సుధార్ణవమును విడిచి, జనులు ఇంద్రియభ్రమలను భజింతురు. నాకు పంచేంద్రియములు పంచవిషములతో సమానము. అమ్మా, నన్ను ఇంద్రియభ్రమలో కొట్టుకొనిపోవునట్లు చేయకుము.

102. ఇహ పరత్ర సదా నను సర్వతో
మమ గతి ర్జనని త్వమ సీశ్వరి ।
ప్రియతరౌ పితరౌ చ సహోదరౌ
ద్రవిణ మప్యు యశ స్త్వ ముమే
ఽఖిలమ్ ॥

ఇహపరముల ఎల్లప్పుడు నీవే గతి. జననీ, ఈశ్వరీ, ప్రియతరులగు తల్లిదండ్రులు, అన్నదమ్ములు, ధనము, యశస్సు ఒకటి యననేల నా కన్నియు నీవే.

103. యది న భోక్ష్యసి భక్షణ మీప్సద
ప్యఖిలధాత్రి మయార్పితమాదనమ్ ।
నను మ్రియేత హి చరణకిఙ్కరో
వదతి నిష్కరుణా జ్జనతాహి తే ॥

ఈ నీ చరణకింకరుడు అర్పించిన అన్నమును ఆరగింపకపోయినచో జనులు నిన్ను గురించి దయారహిత వని చెప్పుకొందురు.

104. నవ దినా న్యనయ న్నవభావనా
నవనవైః స హి భక్తశిరోమణిః ।
విలపనైః శిశు నేవ చ మూర్ఛయా
భగవతీ జననీ దయయా బభౌ ॥

ఆ భక్తశిరోమణి నిత్యనూతనభావములతో కూడిన విలాపములతో శిశువువలె మూర్ఛిల్లగా భగవతియైన జనని కరుణార్ద్రయై ప్రత్యక్షమైనది.

105. నాన్య త్తపో ఽ స్తి లోకే ఽస్మి
న్తపసో ఽనశనాత్పరమ్ ।
త త్తపోఽపి విశిష్టో న
భక్తి రేవ మహా త్తపః ।

ఆహారవిసర్జనము చేసి చేయు తపస్సుకన్న మిన్నయైనది లోకమునందు లేదు. ఆతపస్సు కూడ విశిష్టమైనది కాదు.

---

"నేను సత్యనిష్ఠుడను. సత్యము అసత్యముతో నెన్నడును పొత్తుసేయదు. లోకమంతయు నాకు మాఱొడ్డి నిలిచినను, చివరకు సత్యమే జయించును."—శ్రీవివేకానందస్వామి.

# వార్తలు, విశేషాలు

## వివేకానంద సెంటనరీకమిటీ, బెంగుళూరు
## ఉత్తరకర్ణాటక పర్యటనము

శతతమజయంతి మహోత్సవకార్యక్రమములో ఒక అంగముగాను స్వామీజీసందేశ ప్రచారముకొఱకును ఉత్తరకర్ణాటకమున ఉపన్యాసములు కావించుచు ర్యటనము చేయు పనికి పూనుకొన్నారు ఈకమిటీవారు. దానికి ముఖ్యముగా దారిచూపినవారు తోడ్పడ్డవారు ధార్వాడ (శ్రీ) ఆర్. ఎస్. హుకేరికరు. జూన్ 30-వ తేదీనుండి జూలై 8-వ తేదీ వఱకు మొత్తము తొమ్మిది దినములు పర్యటనము సాగినది. సుమారు వెయ్యిమైళ్లు పర్యటించారు. చిత్రదుర్గము, దేవనగరము, రాణీబెన్నూరు. హనుమాన్మట్టి, హావేరీ, హుబ్లీ హుబ్లోట్, గడగ్బెడ్గేరి, ధార్వాడ, బెల్గాము, చిక్కోడీ అను స్థలములను చూచారు. శ్రీఆది దేవానందస్వామియు, శ్రీశాస్త్రానందస్వామియు 23 సభలలో అవసరము ననుసరించి, కన్నడములోనో ఆంగ్లములోనో ఉపన్యాసములు చేశారు. ఆయాచోట్లలో రోటరీక్లబ్బులును కాలేజీలును, స్కూళ్లును మతసాంస్కృతిక సంస్థలును ఈసమావేశములను జరిపాయి. మగవారు మహిళలు బాలబాలికలు అన్ని వృత్తులవారును సభలకు వచ్చారు. స్వామీజీ సందేశమందును జీవితచరిత్రమందును మిక్కిలి మక్కువతోను ఉత్సాహముతోను వారీ సభలలో పాల్గొన్నారు. రామకృష్ణవివేకానంద గ్రంథములు అక్కడక్కడ ప్రదర్శింపబడ్డవి. అనేకములు అమ్ముడుపోయినవి. కొన్ని సమావేశములలో భజనకూడ జరిగినది. ఉత్తర కర్ణాటకమండలి వివిధప్రాంతీయులకు రామకృష్ణ వివేకానందోద్యమమున ఇంతటి ప్రీతి యుండుట చూచినప్పుడు చాల ఆనందము కల్గినది. అచ్చటచ్చట ఆదరించిసత్కరించిన సంస్థలకును మహాజనులకును ఈకమిటీవారు కృతజ్ఞులై యున్నారు.

## రామకృష్ణమిషను సేవాప్రతిష్ఠానము, కలకత్తా

రామకృష్ణమిషను సేవాప్రతిష్ఠానమువారి ఆస్పత్రిభవనమును భారతదేశముఖ్యమంత్రి శ్రీజవహర్లాల్నెహ్రూగారు జూలై మొదటి తేదీ ఆవిష్కరించినారు. మహారాష్ట్రి, పశ్చిమ బంగాళగవర్నరులును, పశ్చిమబంగాళ ముఖ్యమంత్రియగు పి. సి. సేనుగారును నెహ్రూతో విచ్చేసిరి. శ్రీనెహ్రూగారు ఈసంస్థ ప్రారంభదశలో నుండగా ఇరవైయైదేళ్లకు మునుపు తాను వచ్చియుంటి నని చెప్పి ప్రవృద్ధదశలో ఇప్పుడు మరల దానిని చూడగలిగినందుకు సంతోషించారు. ఇది ఇంకను పెంపొందును గాక అని ఆశాసించారు. శ్రీ పి. సి. సేనుగారి ప్రార్థనమేరకు శ్రీనెహ్రూగారు ప్రతిష్ఠాన భవనావరణమున ఒక అపూర్వపుష్పలతను నాటి వనమహోత్సవమును గూడ ప్రారంభిం

చారు. చక్కగ అలంకృతమైన ఒకపందిరిలో ఈకార్యక్రమం జరిగింది. కేంద్రరాష్ట్రమంత్రులు కొందఱును పౌరప్రముఖులును సమావేశమునకు హాజరైరి. ఆలిండియారేడియోవారు ఈకార్యక్రమమును రికార్డుచేసి నాటి రాత్రి దాని ప్రసారం చేశారు.

## శ్రీ రామకృష్ణమఠమిషనుల సర్వాధ్యక్షులగు శ్రీమన్మాధవానందస్వాముల

## బర్మాదేశ పర్యటనము

ఆగస్టు 27–వ తేదీనాడు శ్రీదయానంద స్వాములతో కూడి మనసర్వమఠాధ్యక్షులైన శ్రీమన్మాధవానందస్వాములు విమానమున రంగూనుకు విచ్చేసిరి. రంగూనులో శ్రీరామకృష్ణసంప్రదాయమునకు చెందిన సన్న్యాసులందఱును ఇతరభక్తులును అనుమోదకులును 250 మంది స్వామికి విమానాశ్రయమునొద్ద స్వాగతోపచారము చేశారు. స్వామి సెప్టెంబరు నాలుగవతేదీవఱకును అచటి రామకృష్ణ సేవాశ్రమమందే ఉండినారు. ఆరోగ్యము బాగులేకున్నను — ఆగస్టు 30–వ తేదీనాడు ష్వేడగన్ పగోడాకు యాత్రపోయిరి. శ్రీదయానందస్వాములుగూడ అచ్చటికేగిరి. 29–వ తేదీనాడు పెగూయొద్ద శయనించియున్న సుప్రసిద్ధబుద్ధమూర్తిని దర్శించిరి. సెప్టెంబరు 1–వ తేదీనాడు రెండులక్షల రూపాయములతో నిర్మింపబడిన వివేకానందస్వామి సెంటినరీ మెమోరియలు భవనప్రాచ్యభాగమునకు సర్వమఠాధ్యక్షులు ప్రారంభోత్సవము చేసినారు. 22 మంది మగరోగులకును 20 మంది శిశురోగులకును పాన్పువసతులు అందుకలవు. ఆభవనమునకే పడమటిభాగము ఆఱున్నరలక్షలరూపాయలతో నిర్మింపబడబోవుచున్నది. అందుకు స్వామి పునాదిశిలను నాటినారు. ఆసందర్భమున అయిదువందల మంది స్థానికప్రముఖులు ఆఆసుపత్రికి వచ్చిరి. వారికి చిఱుతిండివిందు కావింపబడినది. ప్రతిదినము సాయంకాలము భక్తులును మిత్రులును ఎందఱెందఱో వచ్చి స్వామిని దర్శించుచుండిరి. కొందఱుభక్తులు మంత్రోపదేశముకూడ పొందిరి. శారదాసంఘసభ్యులు స్వామిని ప్రత్యేకముగదర్శించిరి. సెప్టెంబరు 3–వ తేదీప్రొద్దున రంగూనునుండి తరలుటకు ముందు అధ్యక్షస్వామి శతతమజయంతిమహోత్సవాంగముగా 102 మంది బౌద్ధసన్న్యాసులకు భిక్షను కాషాయములను సమర్పించిరి. సేవాశ్రమనిర్వాహకపరిషత్తువారి తరఫునను ఇతరభక్తులతరఫునను సర్ – మ్యాబూగారు భక్తికానుకగా ష్వేడగన్ పగోడారజతపత్రమును స్వామికి సమర్పించెను.



"లెండు, కార్యాచరణమునకు గడంగుడు. ఎన్నాళ్లిట్లు పడియుండుట? ఈ లోకమున జన్మించినందుకు గుర్తుగా ఏదో యొకటి (మహాకార్యమును) చేసిపొండు. లేనిచో, మీకును ఈవృక్షములకును ఈశిలలకును, భేద మేమి కలదు? అవికూడ ఉనికి నంది, క్షీణించి, లయించును గదా !"

—శ్రీవివేకానందస్వామి.

# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## గాంధి సూత్రములు

రచన: పండిత దిట్టకవి సుబ్రహ్మణ్యశర్మ గారు. అనువాదము: కామరాజు హనుమంత రావుగారు. ప్రకాశకులు: ప్రాక్ ప్రతీచీగ్రంథ మాల, రాజమండ్రి, ధర : 75 నయాపైసలు.

పురుషోత్తముఁడైన గాంధీమహాత్ముఁడు, వేర్వేరుకాలములందు, వివిధసందర్భములందు, విభిన్నప్రకృతులగు మానవులకు కావించిన బోధలకు సారమీ చిన్నగ్రంథము.

ఇట్టిగ్రంథ మొకటి వెలువడఁగలదని మహాత్ముఁడు భావించియుండఁడు. అట్టులయినచో, తదనుగుణముగా రచించెడివాఁడు. గాంధీజీ తన ధోరణిలో కావించిన ఉపనిషత్సూక్తులవంటి వాక్యములను ఏఱికొని, వానిని క్రమబద్ధముగఁ జేర్చి, సంస్కృతీకరించి కావించిన రచనయిది.

శ్రీకామరాజు హనుమంతరావు గారు, గాంధిసూత్రములను, తెనిఁగించి, సంస్కృతాంగ్లాంధ్రముల వరుసతో ప్రకటించిన దీ చిన్న గ్రంథము.

ఈగ్రంథమునకు, పీఠిక, ఉపోద్ఘాతములు కరదీపికలు. ఈదీపికల సాయమున చదువరి గాంధీసూత్రములు తనకు కలిగించిన భావభేదములను తొలఁగించుకొనగలఁడు. ఇంతేకాదు; శ్రీహనుమంతరావుగారు, 'జిజ్ఞాస' ను గూడ చేర్చినారు. ఈజిజ్ఞాస గ్రంథమునకొక వెలుఁగు.

గాంధీమహాత్ముఁడు సూత్రకర్త కాఁడు. సూత్రకారులకు సహజమైన విషయసంక్షేప రచనాదీక్ష ఇందులేదు. ప్రణాళిక లేదు. ఇంతకు నిది శాస్త్రగ్రంథముకాదు. చదువరికి తోడ్పడు మిత్రమూర్తిగాని, శాసించునది కాదు. గాంధీ మహాత్ముఁడు సత్యము నెఱిఁగినవాఁడు. సత్యాన్వేషణము తనజీవికకు పరమార్థముగా చేసికొన్నవాఁడు. తాను త్రికరణశుద్ధిగా నమ్మి, ఆచరించి, ఆచరణలోని కాకలనువిఱిఁగిఎఱిఁగి, చెప్పినవాఁడు. కొన్నిగ్రంథములను అభిమానించి, ఆగ్రంథాలలోని మాటలకు చిలుకవలెనైన వాఁడు కాఁడు. అందుచేతనే గాంధిమాటలకు సత్యబల మేర్పడినది. అవి ప్రజలహృదయ వీణలపై సప్తస్వరసంచారముచేసినవి. కొందఱినైనను మార్చినవి. చిత్తశుద్ధిగలవారి నేనాఁడైనను మార్చగలవి.

గాంధిసూత్రములు, ఈగ్రంథమున గ్రథన మొనర్పఁబడినవి నూటయెనిమిది మాత్రమే.

సర్వతోముఖమైన ప్రతిభగలవారు సత్యమును సర్వతోముఖముగఁ జూచినవారు, యుగపురుషులు అగు శ్రీమహాత్ములు — చెప్పిన సూత్రములను — ఎన్ని వేలుగా ఏఱినను, ఎన్ని వేలుగా సమకూర్చినను వానిని తెలిసికొని, నెమరువేసికొనువారు— మనభారతావనిలో పుష్కలముగ గలరు. ఏఱినసూత్రములు, ముఖ్యమైనవే కావచ్చును. వీనిద్వారమున గాంధి చేసిన ముఖ్యబోధలను తెలియవీలుండియుండవచ్చును. కాని, చదువరికి రుచికలిగిన తరువాత, మనసు నిండిన తృప్తి రాదు. కాని ఆచదువరి, గాంధీరచనలను తానై చదివి,

మార్గమును తాను దృఢపఱచుకోగలఁడు. అందుకే గ్రంథ ముపయోగపడుచున్నది.

భారతవర్షమున పూర్వమహర్షులు మృత్యువువంటి ప్రమాదమును త్యజించి, ధ్యానయోగమున 'సత్య' మును దర్శించినారు. తాము చూచిన సత్యమును, క్లుప్తముగ, పరిపూర్ణముగఁ జెప్పినారు కాని, వారుచెప్పినది, ప్రపంచపరివ్యాపకము కాఁగలది. ఎందఱు చెప్పిన, ఎంతమహత్తరమైన దానినైనను తనలో నిముడ్చుకొనగలది. గాంధీగారికి, ఉపనిషత్సారమైన గీత, ప్రమాణము. అట్టితేరి, గాంధిసూత్రములు, భారతవర్షమునవధారకు దూరములు కాక, బహుసన్నిహితములైనవై, మనపండితులకును, మనసామాన్యులకును, మనపామరులకును చిత్తరంజన మొనర్పగలవే కాక, చిత్తశోధనమునకును, చిత్తసంస్కారమునకును సాయపడగలవి.

జిజ్ఞాసాభాగమున 'బ్రహ్మచర్య' ఖండమునందు—'సనత్సుజాతీయ'ములోని బ్రహ్మచర్యవివరణము — చదువరికి మేలుకలిగింపగలదు. అట్టివానిని—జిజ్ఞాసలో చేర్చికొనిన గ్రంథము మఱింత మెఱుఁగెక్కియుండెడిది.

## భగవన్నామ ప్రభావము

కర్త: శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య. (శ్రీరామశరణ్). ప్రకాశకులు : శ్రీ రామశరణమందిరము. బుద్ధాం, యాజలిపోస్టు. గుంటూరుజిల్లా. ధర: 40 నయాపైసలు.

ఈ చిన్నపుస్తకములో, నామము, నామాధిక్యము, ఉపనిషత్ ప్రతిపాదనము, పురాణప్రతిపాదనము, భగవన్నామము పాపము లణఁచును, పుష్కరకథ, కలౌసంకీర్త్య కేశవమ్, భక్తులయనుభవము, తుకారాం, నానక్, చైతన్యుఁడు, కులశేఖరులు, కబీరుదాసు, రామదాసస్వామి, నారాయణతీర్థులు, త్యాగరాజస్వామి, శ్రీరామకృష్ణపరమహంస, శ్రీ హరనాథబాబా, శ్రీవాసుదాసస్వామి, శ్రీ రమణమహర్షి, సంకీర్తనవిశేషము, ఉపసంహారము అను శీర్షికల క్రింద ఈగ్రంథము విస్తరింపబడినది.

చిన్నపుస్తకము, సామాన్యులకు ఉద్దేశింపబడిన ట్లున్నది. గ్రంథం మొత్తంమీద, గాఢమైన భావప్రరోచనకాని, స్వానుభవపు పునాదిమీద నిలిచిన సందేశసందోహంగాని లేదు. ఉపనిషత్ప్రతిపాదనములో — ప్రముఖోపనిషత్తులలోని దగు — శ్వేతాశ్వతరోపనిషత్తునుండి—

"న తస్య ప్రతిమాఽస్తి యస్య నామ మహద్యశః" ఉదాహరించిన అర్థానిని వివరించిన మేలుగా నుండెడిది.

విశ్వాసహీనులకు అబోధ్యము, అయిన నామానుభావమునుగూర్చి ఎంత ప్రరోచన చేసిన అంత మేలు.

'నామ' పారాయణము, పరాయణము సాధకుని ఏదశకు తీసికొనిపోగలవో, ఆదశ ఉత్తరోత్తరదశలకు ఎట్లుసాహాయ్యమును కలిగించునో, చివరకు; ఆత్మోపలబ్ధి చరమగమ్యమో - వివేచించి, చెప్పినచో నీగ్రంథము నిక్కమైన తన ఉనికిని పూర్ణముగా సార్థకము చేసికొని యుండెడిది. కాని, ఈ భగవన్నామ ప్రభావము, అనులఘుకృతి, సామాన్యులకు ప్రరోచనచేయుటకు ఉపయోగించగలది.

—శ్రీ నిత్యానంద

# శ్రీ వివేకానందస్వామిశతతమజయంతిమహోత్సవములు, మద్రాసు

## విరాళములకై విన్నపము

1963 జనవరిలో శతతమజయంతిమహోత్సవములకు యథావిధిగా అంకురార్పణము చేయబడినదని యెల్లరెఱిగిన విషయమే. అప్పటి నుండి ఆమహోత్సవములు భారతదేశమందలి వివిధప్రాంతములలోనే గాక విదేశములందును జరుగుచున్నవి. మద్రాసుకు స్వామిజీతో గల సంబంధము చాలసన్నిహితము. కాబట్టి వారిశతతమజయంతి మహోత్సవములను యథోచిత వైభవముతో 1964 జనవరి 6-వ తేదీనుండి 20-వ తేదీవఱకు జరుపవలెనని తీర్మానింపబడినది.

భారతరాష్ట్రపతి డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి ఆదరమునను డాక్టరు సి. పి. రామస్వామిఅయ్యరుగారి అధ్యక్ష్యమునను సెంటనరీకమిటీవారు విభవోత్తరమైన కార్యప్రణాళికను నిర్ణయించిరి. ప్రణాళికలోని అన్నిఅంశములు పూర్తియగుటకు దాదాపు పదిలక్షలరూపాయలు పట్టును. ప్రణాళికలో చేరిన బాలికలహైస్కూలు పుష్కలమైనగ్రంథాలయము, శిలావిగ్రహ ప్రతిష్ఠ, పత్రికాపఠనాలయము, శిశుకేంద్రము, (చిల్డ్రెన్స్ కార్నరు) ఉపన్యాసకూటము, తమిళమందును తెలుగునందును శ్రీవివేకానందస్వాముల సంపూర్ణగ్రంథావళిని ప్రకటించుట — మున్నగు అంశములు ఆచంద్రార్కము నిలుచునవి, పెక్కేండ్లపాటు ప్రజల కుపయోగపడునవి.

కేంద్ర — మద్రాస్ — ఆంధ్రప్రదేశప్రభుత్వములవారును కొందఱు మిత్రమహాశయులును దయతో ఔదార్యముతో విరాళము లిచ్చిరి. కావుననే ప్రణాళికలో అధికభాగమును ఇంచుమించు పూర్తిచేయగలిగితిమి. ప్రణాళికలోని తక్కిన అంశములు నిర్వహించుటకును ఉత్సవములను అర్హరీతి జరుపుటకును ఇంకను రెండులక్షల రూపాయలు కావలసియున్నది.

కాబట్టి శ్రీవివేకానందస్వాముల భక్తుల కందఱికీ దయతో ధారాళముగ విరాళము లిచ్చి శ్రీవివేకానందస్వాములు కలిపిన మానవసేవాలక్ష్యమునకు తోడ్పడ గాంచిన ధన్యతకు పాత్రు లగుదురుగాత మని విజ్ఞాపించుచున్నాము.

విరాళములకు వరుమానపన్ను లేదు. "రామకృష్ణమిషను, స్వామివివేకానంద సెంటినరీ, C/o శ్రీరామకృష్ణమఠము, మద్రాస్-4 (ఇండియా) అను విలాసమునకు ధన విరాళములను పంప ప్రార్థన.

శుద్ధసత్త్వానందస్వామి,<br>
సెక్రిటరీ, స్వామివివేకానంద సెంటినరీ కమిటీ,

2-9-1963

శ్రీ రామకృష్ణ ప్రభ

# వివేకానందస్వామి శతతమ జయంతి ప్రచురణములు

ఆంధ్రపాఠకులకు అమూల్యతరుణము

# శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి

ప్రతిభోజ్జ్వలులైన ఆంధ్రపండితులచే ఆంధ్రీకరింపబడి 10 సంపుటాలుగా ప్రకటింపబడుచున్నది. ప్రతిసంపుటంలోనుదాదాపు 500 పుట లుంటాయి. ఖరీదు:- అట్టబైండుసెట్టు రు. 50 లు. కాలికోబైండుసెట్టు రు. 65 లు. పోస్టేజి ప్రత్యేకం.

స్వామిజిసందేశం మాతృదేశభక్తిభరితం, ప్రాణప్రదం, ఆత్మోత్తేజకరం, విశ్వజనీనం. అది సమగ్రంగా ఆంధ్రమహాజనులకు అందడం ఇదేమొదటిసారి. స్వామిజీది దివ్యదృష్టి. ఆయన అమోఘ పరిష్కారవిధానం సూచింపని ముఖ్యసమస్య అంటూలేదు. ఆయన గ్రంథావళిని చదివినవారికి ఉత్సాహమును ఉదాత్తతయున్నూ కలుగక తప్పదు.

వివరములు :

| | | | | |
|---|---|---|---|---|
| మొదటి సంపుటము | 575 పుటలు | అట్టబైండు రూ. 5/- | క్యాలికో | రూ. 6-50 |
| రెండవ సంపుటము | 553 | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| మూడవ సంపుటము | 586 | రూ. 5/- | ,, | రూ. 6-50 |
| నాల్గవ సంపుటము | 592 | రూ. 5/- | | రూ. 6-50 |
| అయిదవ సంపుటము | 544 | రూ. 5/- | | రూ. 6-50 |
| ఆఱవ సంపుటము | 585 | రూ. 5/- | | రూ. 6-50 |
| ఏడవ సంపుటము | 570 | రూ. 5/- | | రూ. 6-50 |

విలాసము :

మేనేజరు,
శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు : : మద్రాసు - 4

# స్వామి - శిష్య సంవాదములు

(శ్రీమద్వివేకానందస్వామితోడి సంభాషణలు)

అనువాదకులు : కీ. శే. కందుకూరు మల్లికార్జునంగారు

సాంసారిక సమస్యలు పరిష్కరించుకొనదలచినను సమాధిస్థితి సాధింపదలచినను; రాజకీయవిశేషము లాకళింపదలచినను, లలితకళారహస్యము లవగతము చేసికొనదలచినను — ఇంతేల, లౌకిక కాలౌకిక విషయములలో వేనినిగుఱించిగాని మీ పరిజ్ఞానము వృద్ధి గావించుకొన దలచినను ఈ గ్రంథమును తప్పక చదువుడు. నవభారతభాగ్యవిధాత శ్రీమద్వివేకానందస్వామిచంద్రులు శిష్యులతో కావించిన యీ ప్రసంగములలో వారి అనుభవసర్వస్వము రాశీభూతమై యున్నది. సులభశైలి, హృదయమును పట్టి యిచ్చు సంభాషణలు, ముచ్చటైన అచ్చుకూర్పు.

పుటలు : 552+12 (అకారాది అనుక్రమణికతో) వెల : రూ. 5/-

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక — ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

పుటలు : 480 (అందమయిన ఆఱవ కూర్పు) వెల : రూ. 4

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

---

సంపాదకులు : శ్రీ శుద్ధసత్త్వానందస్వామి, శ్రీ నేలటూరి భక్తవత్సలము,
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటర్ ప్రెస్స్ ప్రైవేట్ లిమిటెడ్ (మద్రాసు - 18) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦ ౧౯౬౩, డిసెంబరు; శోభకృత్తు - మార్గశిరము సంచిక ౯

## విషయసూచిక

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణములు

740 పుటలు శ్రీరామకృష్ణ సూక్తి సుధ (తొలికూర్పు) రూ. 7/50

496 పుటలు శ్రీ రామకృష్ణ లీలామృతము (ద్వితీయ ముద్రణము) రూ. 5/-

144 పుటలు శ్రీ శారదాదేవి రూ. 1-25

312 పుటలు శ్రీ శారదా ప్రసంగములు రూ. 3-00

540 పుటలు శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము) రూ. 3-50

432 పుటలు (సాదా) రూ. 3-50 శ్రీవివేకానంద జీవితచరిత్ర (అట్టబైండు) రూ. 4/-

564 పుటలు స్వామి - శిష్య సంవాదములు (ప్రథమ ముద్రణము) రూ. 5/-

330; 324 పుటలు సందేశతరంగిణి - 2 భాగములు (ఒక్కొక్క భాగము) రూ. 3/-

402 పుటలు పారమార్థిక సంభాషణలు రూ. 3/-

| | |
|---|---|
| శ్రీమద్భగవద్గీత ... | 4 00 |
| బ్రహ్మానంద బోధనలు ... | 3 50 |
| జ్ఞానయోగము 4 00 రాజయోగము | 2 50 |
| కర్మయోగము 1 50 భక్తియోగము | 1 50 |
| నారద భక్తి సూత్రములు ... | 3/- |
| పరతత్త్వప్రసంగము ... | 2/- |
| శ్రీ నాగమహాశయుని జీవితచరిత్ర ... | 1 25 |
| ప్రబోధరత్నాకరము ... | 2 25 |
| శ్రీ శారదాదేవి చరిత్ర ... | 2/- |
| దేవీమాహాత్మ్యము ... | 2/- |
| వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 1 50 |
| వివేకానందలేఖావళి (రెండవభాగము) | 1 75 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 1 25 |
| హిందూ మతము ... | 1 25 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 25 |
| వివేక సూర్యోదయము ... | 1 25 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 1/- |
| భారతీయ మహిళ ... | 1/- |
| కఠోపనిషత్తు ... | 0 80 |
| శ్రీ పరమహంస నీతికథారత్నములు | 0 75 |
| గిరీశచంద్ర 0 75 భక్తిమార్గము | 0 50 |
| షికాగో సగరోపన్యాసములు ... | 0 50 |
| గురూపదేశములు ... | 0 50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 40 |
| శ్రీకృష్ణవాణి 0 40 క్రైస్తు సూక్తిమాల | 0 40 |
| మహమ్మదు సూక్తి మంజరి ... | 0 40 |
| శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 40 |
| నా గురుదేవుడు 0 40 బుద్ధ ఉవాచ | 0 37 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 37 |
| నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 37 |
| శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి | 0 25 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము ... | 0 25 |
| పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 25 |
| నవీన భారతదేశము ... | 0 25 |
| తాపత్రయ చికిత్స ... | 0 25 |
| పవహారిబాబా 0 25 ముక్తిమార్గము | 0 19 |
| సర్వం విష్ణుమయం జగత్ ... | 0 19 |
| శ్రీ రామకృష్ణ ఆరాత్రికము ... | 0 12 |
| శ్రీరామనామసంకీర్తనము 0 6 యతిగీతము | 0 6 |
| నామతము 0 6 వి. సింహగర్జనము | 0 6 |

శ్రీ దొడ్డ భాగవతము - మొదటి సంపుటము రూ. 6-50; రెండవ సంపుటము రూ. 5-50;
మూడవ సంపుటము రూ. 7-50 (మూడును ఒకేపరి కొన్నచో: రూ. 18-50)

ఇవియేకాక సంస్కృత, ఆంగ్ల, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములు,

వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

అడ్రెసు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



శ్రీ రామకృష్ణ ప్రభ ఆఫీసు,
శ్రీ రామకృష్ణ మఠము,
మైలాపూరు : మద్రాసు-4.

Phone : 71231

# ప్రకటన

మీ చందా యీ............నెలాఖరుతో ముగియును. రాబోవు సంవత్సరమునకు మీ చందా (రూ. 4) మనియార్డరు ద్వారా, మా కార్యాలయమునకు రాబోవు నెల 10-వ తేదీలోగా అందునటు పంపగోరెదము. అట్లు మనియార్డరు పంపనియెడల, రాబోవు సంచికను వి. పి. పి. ద్వారా పంపెదము. ఆ యెడ మీ యాదరాభిమానములను యథాప్రకారముగా జూ[illegible] నమ్ముచున్నాము. మనియార్డరుద్వారా మీ చందా పంపినయెడల, తపాలా వీ. పీ. రిజిస్ట్రేషను చార్జీలు 56 న. పై. లు మీకు మిగులు నని గుర్తింతురుగాక. అనివార్యమయిన యే కారణములచేనైనను మీ రిక చందాదారుగా నుండగోరనియెడల రాబోవునెల 5-వ తేదీ లోపుగా ఆ సంగతి మాకు దయచేసి తప్పక తెలుపగోరెదము. అట్లు మీ యొద్దనుండి ఉత్తరము రాకపోవుటచే మీరు తప్పక వీ. పీ. విడిపించుకొందురను నమ్మకముచే మేము వీ. పీ. పంపి, మీరు విడిపించుకొనకపోయినయెడల వృథాగా ఈ ధర్మసంస్థకు వీ. పీ. చార్జీలు నష్టముగలిగించినవారగుదురు. దయచేసి ఈ విషయము గుర్తింతురు గాక.

ఉత్తర ప్రత్యుత్తరము లన్నిటిలోను మీ చందాదారు సంఖ్యను ఉదాహరించుచు, మీ పూర్తి పేరును, విలాసమును స్పష్టముగా వ్రాయగోరెదము.

మేనేజరు, శ్రీ రామకృష్ణ ప్రభ



'అఖిలవిభు శరణొందుము. యా క్షణంబ యతనికృప  ననుభావ్య మగును వత్స.'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨౦  ౧౯౬౩ – డిసెంబరు :: శోభకృత్తు – మార్గశిరము  సంచిక ౬


శ్రీః

## శివానన్దలహరి (౬)

మూలము: శ్రీ శంకరభగవత్పాదులు  టీక: నే. భ.

సారూప్యం తవ పూజనే, శివ మహాదే వేతి సఙ్కీర్తనే
సామీప్యం, శివభక్తిధుర్యజనతాసాఙ్గత్యసమ్భాషణే
సాలోక్యం చ, చరాచరాత్మకతనుధ్యానే, భవానీపతే,
సాయుజ్యం మమ సిద్ధ మత్ర భవతి స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్॥ ౨౮

| | |
|---|---|
| భవానీపతే | ఓ పార్వతీ పతీ |
| స్వామిన్ | ఓ పరమేశ్వరా |
| తవ | నీ |
| పూజనే | పూజలో |
| సారూప్యం | నీరూపమువంటిరూపము దాల్చుట అను మోక్షము |
| శివ | ఓ శివా |
| మహాదేవ ఇతి | ఓ మహాదేవా అని |
| సఙ్కీర్తనే | సంకీర్తనము చేయునప్పుడు |
| సామీప్యం | నీ సన్నిధినుండుట అనెడి మోక్షము |
| శివభక్తి ధుర్య | శివభక్తిపూర్ణులగు |
| జనతా | జనులతో |
| సాఙ్గత్య | కలసికొనుటయు |
| సమ్భాషణే | ముచ్చటించుటయు సంభవించినప్పుడు |
| సాలోక్యమ్ | నీలోకముననే ఉండుట అనెడి మోక్షము |
| చర+అచర | జంగమస్థావరములకు |
| ఆత్మకతను | ఆత్మయైన నీస్వరూపమును |
| ధ్యానే | ధ్యానించునప్పుడు |
| సాయుజ్యం | నీలో కలిసిపోవుట అనెడి మోక్షము |
| మమ | నాకు |
| అత్ర | ఈలోకముననే, ఈజన్మలోనే |
| సిద్ధం భవతి | సిద్ధించినదగును |
| అహం | నేను |
| కృతార్థః అస్మి | ధన్యుడను. |

తా॥ దేవా, ఈజన్మలోనే నేను కృతార్థుడనైతిని. ఎట్లనగా ఇట్లు — నిను పూజించు నప్పుడు నాకు నీరూపు (సారూప్యము) గల్గుచున్నది. నీ నామసంకీర్తన సేయునప్పుడు నాకు నీదాపు (సామీప్యము) గల్గుచున్నది. నీ భక్తగోష్ఠిలో నుండుట నాకు నీలోకవాసము (సాలోక్యమే) అగుచున్నది. సకల చరాచరముల కాత్మగా నిన్ను ధ్యానించునప్పుడు నాకు నీతో అభిన్నత (సాయుజ్యము) ఏర్పడుచున్నది.

త్వత్పాదామ్బుజ మర్చయామి పరమం, త్వాం చిన్తయా మ్యన్వహం,
త్వా మీశం శరణంవ్రజామి, వచసా త్వామేవ యాచే, విభో,
వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యై శ్చిరం ప్రార్థితాం
శమ్భో, లోకగురో, మదీయమనస స్సౌఖ్యోపదేశం కురు ॥ ౨౯

| | | | |
|---|---|---|---|
| | ఓ విశ్వవ్యాపీ | త్వాం ఏవ | నిన్నే |
| శమ్భో | ఓ సుఖకారకుడా | యాచే | యాచింతును |
| లోకగురో | ఓ సర్వలోకపరమాచార్యా | దివ్యైః | వేల్పులచే |
| పరమం | అత్యుత్కృష్టమగు | చిరం | చిరకాలముగ |
| త్వత్ | నీ | ప్రార్థితాం | ప్రార్థింపబడుచున్నదియు |
| పాద+అమ్బుజం | అడుగుదామర(ల)ను | సకరుణాం | కరుణతో కూడుకొన్నదియు |
| అర్చయామి | పూజింతును | | అగు (నీ) |
| అన్వహం | సదా | చాక్షుషీం వీక్షాం | (కడ) కంటిచూపును |
| త్వామ్ | నిన్ను | మే | నాకు |
| చిన్తయామి | ధ్యానింతును | దిశ | ప్రసాదింపుమా |
| ఈశం | సర్వస్వామివగు | మదీయ మనసః | నామనస్సునకు |
| త్వాం | నిన్ను | సౌఖ్య+ఉపదేశం | సౌఖ్యావహమగు అభేద జ్ఞానోపదేశమును |
| శరణం వ్రజామి; | శరణుచొచ్చుచున్నాను | | |
| వచసా | వాక్కు చేతను | కురు | చేయుమా. |

తా॥ ఓ విభూ, శంభూ, లోకగురూ, పరమమైన నీపాదపద్మము నర్చింతును, సదా నిన్నే చింతింతును, శరణుచొత్తును, ప్రార్థింతును. వేల్పులు సదా నీకృపాకటాక్షమునే కదా కోరుచుందురు. అట్టి కటాక్షమును నాపై పఱపి, నాచిత్తమునకు నిర్వృతి నొసగు ఉపదేశమును జేయుమా.

వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా, పుష్పార్చనే విష్ణుతా,
గన్ధేగన్ధవహాత్మ, తాన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా,
పాత్రే కాఞ్చనగర్భ తాస్తి మయిచే, ద్బాలేన్దుచూడామణే,
శుశ్రూషాం కరవాణి తే పశుపతే స్వామిం స్త్రిలోకీగురో ॥ ౩౦

| | | | |
|---|---|---|---|
| బాల+ఇన్దు | చంద్రరేఖ అనెడి | గన్ధే | పరిమళద్రవ్యముల నర్పించు సేవలో |
| చూడామణే | తలమానికముగలవాడా | | |
| పశుపతే | సర్వాత్మనాథా | గన్ధవహాత్మతా | (ఎచ్చటెచ్చటి గంధమును తేగల) వాయుదేవుని సామర్థ్యమును |
| స్వామిన్ | ప్రభూ | | |
| త్రిలోకీ | ముల్లోకాలకును | | |
| గురో | ఆచార్యా | అన్నపచనే | వండిన అన్నమును సమర్పించు సేవలో |
| వస్త్ర+ఉద్ధూతవిధౌ | వస్త్రములధరింపజేసి ఉపచారము చేయుటయందు | | |
| | | బర్హిర్ముఖాధ్యక్షతా | దేవేంద్రుని వేయికన్నుల జాగరూకతయు |
| సహస్రకరతా | వేయిచేతులకలిమియు (సూర్యత్వమును) | పాత్రే | పాత్రార్పణమందు |
| పుష్పే | పూలతో | కాఞ్చనగర్భతా | సార్థకనాముడగు హిరణ్యగర్భుని స్వరూపమును |
| అర్చనే | పూజించుటయందు | | |
| విష్ణుతా | (లోకములోని పూలుచాలక పోగా నేత్రకమలము నర్పించు) విష్ణుదేవు సధ్యవసాయమును | మయి అస్తిచేత్ | నాయందున్నచో |
| | | తే శుశ్రూషాం | నీసేవను |
| | | కరవాణి | నిర్వర్తింతును. |

తా॥ చంద్రశేఖరా, పశుపతీ, స్వామీ, సర్వలోకగురూ, నీకు వస్త్రముల ధరింపజేయవలె నన్న వేయిచేతులు కావలెను, గంధార్పణము చేయవలె నన్న సదాగతిత్వము కావలెను, పూలతో పూజింపవలె నన్న విష్ణుదేవునధ్యవసాయము కావలెను, అన్ననివేదనము కావింపవలెనన్న వేయికన్నుల మెలకువ కావలయును, పాత్రముల నర్పింపవలె నన్న హిరణ్యగర్భత్వము కావలెను. నాకు ఇవి ఉన్నచో నేను నీ సమారాధనను నిర్వర్తింతును.

నాలం వా పరమోపకారక మిదం త్వేకం పశూనాంపతే
పశ్యన్ కుక్షిగతాం శ్చరాచరగణా న్బాహ్యస్థితాన్ రక్షితుమ్
సర్వామర్త్యపలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళే న గళితం నోద్గీర్ణ మేవ త్వయా ॥ ౩౧

| | | | |
|---|---|---|---|
| పశూనాంపతే | ఓ సర్వాత్మనాథా | పలాయన | తఱుమగొట్టునట్టి |
| కుక్షిగతాన్ | (నీ) బొజ్జలోనున్నవియు | ఔషధం | మందును |
| బాహ్యస్థితాన్ | వెలుపలనున్నవియు అగు | అతి | పెల్లుగా |
| చర+అచర | జంగమస్థావరముల | జ్వాలాకరం | జ్వాలలుగలదియు |
| గణాన్ | సమూహములను | భీకరం | భయంకరమైనదియు అగు |
| పశ్యన్ | చూచుచు | గరళం | హాలాహల విషము |
| రక్షితుం | వానిని కాపాడుటకే | గళే | కంఠమున |
| త్వయా | నీచేత | నిక్షిప్తం | ఉంచుకొనబడినది |
| సర్వ+అమర్త్య | వేల్పులెల్లరి | నగళితం | మ్రింగబడను లేదు |

| | | | |
|---|---|---|---|
| న ఉద్గీర్ణమ్ ఏవ। | వెలిగ్రక్కబడను లేదు | ఏకం | ఒక్కటే |
| ఇదం | ఈ | న అలం వా | చాలదా? |
| పరమ+ఉపకారకం | మహోపకారకృత్యము | | |

తా॥ ఓ పశుపతీ, నీ ఉదరమునందును వెలుపలను గూడ నున్న చరాచరములను జూచి, వానిని కాపాడుటకే, నీవు భయంకరమును జ్వాలాభీలమును వేల్పులను గడగడలాడించి పరు గెత్తించునదియు అగు హాలాహలమును అటు లోపలికిని మ్రింగక ఇటు వెలుపలికిని క్రక్కక కంఠముననే నిలిపియున్నావు. ఈ నీ మహోపకార మొక్కటి చాలదా ?

జ్వాలోగ్ర స్సకలామరాతిభయదః క్ష్వేళః కథం వా త్వయా
దృష్టః? కిఞ్చ, కరే ధృతః, కరతలే, కిం పక్వజమ్బూఫలమ్ ?
జిహ్వాయాం నిహిత శ్చ సిద్ధఘుటికా వా? కణ్ఠదేశే భృతః
కిం తే నీలమణి ర్విభూషణ మయం? శమ్భో మహాత్మన్ వద ॥ 32

| | | | |
|---|---|---|---|
| | | కరతలే | అరచేత |
| శంభూ | ఓ శంకరా | నిహితశ్చ | ఉంచుకొనబడినది? |
| మహాత్మన్ | ఓ మహాత్మా | పక్వ జమ్బూఫలమ్ | పండిన నేరేడుపండా ఏమి? |
| జ్వాల+ఉగ్రః | మంటలచే భీకరమును | జిహ్వాయాం | నాల్కమీద (ఉంచుకోబడినదే) |
| సకల అమర | అందఱు వేల్పులకును | | |
| అతిభయదః | మిక్కిలి భయంకరమును అగు | | |
| | హాలాహల విషము | సిద్ధ ఘుటికా వా | మందుగుళికయా ? |
| | | కణ్ఠదేశే | కంఠమున |
| త్వయా | నీచేత | భృతః | ధరింపబడినదే |
| కథం వా | ఏలాగు | అయం తే | ఈ విషము నీకు |
| దృష్టః | చూడబడినది | భూషణం | అలంకారమైన |
| కిఞ్చ | పైగా | నీలమణిః కిం | నీలరత్నమా ఏమి |
| కరే | చేతిలో | వద | చెప్పుమా. |
| ధృతః | (ఎట్లు) తాల్పబడినది ? | | |

తా॥ మహాత్మా, శంభూ, మంటలు గ్రక్కుచు సకలదేవతలను గడగడలాడించిన హాలాహలవిషమును నీ వెట్లు చూచితివి ? చేతిలో, అరచేతిలో, ఉంచుకొంటివే, అదేమి నేరేడుపండా? నాల్కమీద ఉంచుకొంటివే, అదేమి మందుగుళికయా ? కంఠమున నిల్పుకొంటివే, అదేమి నీకు నీలరత్నాలంకారమా? చెప్పవయ్యా.

నాలం వా సకృదేవ దేవ భవత స్సేవా నతిర్వా నుతిః
పూజా వా స్మరణం కథాశ్రవణ మ ప్యాలోకనం మాదృశామ్
స్వామిన్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కా వా ముక్తి రితః కుతో భవతి చేత్ కిం ప్రార్థనీయం తదా ॥ 33

| | | | |
|---|---|---|---|
| దేవ | ఓ జ్యోతిస్స్వరూపా | నాలం వా | (ముక్తిగాంచుటకు) చాలదా |
| స్వామిన్ | ఓ ఈశ్వరా | | (చాలును అనుట) |
| సకృత్ | ఒక్కసారిచేయబడ్డ | | ఇంతకంటె వేఱైనమార్గమున |
| భవతః | నిన్నుగూర్చిన | ముక్తిః | మోక్షము |
| నతిః వా | నమస్కారమో | కా వా | ఎట్లుకల్గును (కల్గదు) |
| నుతిః | స్తుతియో | కుతః | ఏలయన |
| పూజా వా | పూజయో | భవతి చేత్ | కలుగునేని |
| స్మరణం | ధ్యానమో | తదా | అప్పుడు |
| కథాశ్రవణం అపి | కథవినుటయో | అస్థిర దేవతా | నిలుకడలేని వేల్పుల |
| ఆలోకనం | దర్శించుటో | అనుసరణ+ఆయాసేన | అనుసరించు శ్రమచే |
| సేవా | సేవయో | కిం ల | ఏమి (ఫలము) పొందనగును? |
| మాదృశామ్ | మావంటివారికి | ప్రార్థనీయం కిమ్ | కోరదగిన దేమున్నది (ఏమియు లేదు). |

తా॥ దేవా, పరమేశ్వరా, నీకు నమస్కరించుటో, నీకథవినుటో, నిన్ను స్తుతించుటో, పూజించుటో, ధ్యానించుటో, దర్శించుటో, సేవించుటో — ఈపనులలో దేనినైన ఒక్కసారి చేసిన చాలదా మావంటివారికి మోక్షము లభించుటకు? అదే చాలియున్నప్పుడు, అస్థిరులైన వేల్పుల ననుసరించు శ్రమ ఎందుకు ? వారివలన కోరదగిన దేమున్నది.

# శ్రీ వివేకానందమరందబిందువులు (౧౧)

## శ్రీ చిరంతనానందస్వాముల అనూక్తి

వలయునది త్యాగము— అది లేనిదే పరహితార్థమై యెవ్వరును మనఃపూర్వకముగాఁ బాటుపడఁజాలరు. త్యాగి యెల్లరను సమదృష్టితోఁ జూచును— అట్టిచో నితరులకంటె విశేషముగ భార్యయు బిడ్డలును నీ వారని యేల ప్రాఁకులాడెదవు? నీద్వారముకడ సాక్షాన్నారాయణుఁడు పేదభిక్షుకరూపమున నిరాహారియై చనిపోవుచున్నాఁడు! వానికే మైన నిచ్చుటకు బదులు రుచ్యాహారములతోఁ— పిండివంటలతో — నీ భార్యను బిడ్డలను మాత్రమే తృప్తిపఱుప నెంతువా ? ఏల, అది రాక్షసకృత్యము!

స్వార్థరహితమైన దేదియో యదియే నీతి, ధర్మము ; స్వార్థపరమైన దేదియో యదియే యవినీతి, అధర్మము.

లోకము మన కేమియు ఋణపడియుండ లేదనియు మనమే లోకమునకు ఋణపడియున్నామనియు గుర్తింపవలసియున్నది. లోకమున కేమైనను హిత మొనర్చుట కంగీకరింపఁబడుట మన మహాభాగ్యము, గర్వింపఁదగిన

సదవకాశము. పరోపకారమున నిజముగా మనకే మన ముపకారమొనర్చుకొను చున్నాము.

నాలుగు దమ్మిడీలను జేతఁ బట్టుకొని, "ఇదిగో నోయి, యాచకుఁడా!" యని స్వాతిశయముతో, అహంభావముతో వర్తింపక, వానికి దానము చేయుటచే నాత్మహిత మొనర్చుకొనుటకై నీకొఱ కావీదవాఁడచట నున్నాఁడని వానియెడలఁ గృతజ్ఞుఁడవై యుండుము. ధన్యుఁడగువాఁడు దాతకాని ప్రతిగ్రహీతకాఁడు.

స్వార్థరాహిత్యమే విశేషలాభకరము, కేవలము జనులకు దాని నవలంబించునంతటి యోరిమి లేకున్నది.

మహనీయుఁడవై యుండుము. త్యాగము లేనిదే యే మహాకార్యమును సిద్ధింపజాలదు. విశ్వమును సృజించుటకై పురుషుఁడు తన్ను దాను ద్యాగ మొనర్చుకొనెను. మీసుఖములను మీ భోగములను మీ పేరుప్రతిష్ఠలను, వేయేల, మీ జీవితసర్వస్వమును సమర్పించి తన్మూలమునఁ గోట్లకొలఁది మానవు లీసంసార సాగరమును దరించునట్టి సేతువును నిర్మింపుఁడు. శ్రేయస్కరశక్తుల నన్నిటిని గేంద్రీకరింపుఁడు. మీ రేమతపతాకనుదాల్చి పురోగమించుచున్నను సరియే: పచ్చన గానిండు, నీలిమ గానిండు, ఎఱుపుగానిండు,—మీ దేరంగైననుసరియే,—యన్నిటిని గలిపివైచి స్వచ్ఛధవళవర్ణమును—ప్రేమవర్ణమును — వెలువరింపుఁడు. కృషిచేయుటయే మనవంతు. ఫలములు వానియంతట నవియే కలుగును. ఆచింత మనకేల?

లోకమున సదా దాతవై వర్తింపుము. అన్నిటినిచ్చివేయుము, ప్రతిఫలము నాశింపకుము. ప్రేమను, సాయమును, సేవను, నీచేతనైన యే యల్పవస్తువునైనను నొసఁగుము. కాని కోమటిబేరపు దృష్టితోమాత్రమువలదు. ఏ 'షరతులను' విధింపకుము, అపు డెవ్వరును వంచితులుగారు. భగవానుఁడు మన కొసఁగు నటులనే యౌదార్యముతో నిచ్చివేయుదము గాక!

## సేవ

ప్రతిపురుషుని, స్త్రీని, ప్రతివ్యక్తిని సాక్షాద్భగవత్స్వరూపముగాఁ గనుము. నీ వెవ్వరికి నుపకారము చేయఁజాలవు, తోడ్పడఁజాలవు, కేవలము సేవింపఁగలవు—అంతియే. నీ కధికార మున్నచోఁ బరమేశ్వరసంతానమును సేవింపుము, పరమేశ్వరునే సేవింపుము. తన బిడ్డలలో నెవ్వనికైనను దోడ్పడఁ బరమేశ్వరుఁడు నిన్ననుగ్రహించినచో, నీవు ధన్యుఁడవు. 'నే నింతవాఁడ నంతవాడ' నని యాత్మసంభావన చేసికొనకుము. ఇతరులకు లభింపని విశేషావకాశము—అధికారము — నీకు లభించుటచే నీవు ధన్యుఁడవు. దానిని సేవగా — ఆరాధనగా—నొనర్పుము. రోగిరూపమున, నున్మత్తుని రూపమునఁ, గుష్ఠవ్యాధిపీడితుని రూపమునఁ, బాపిరూపమున వచ్చిన పరమేశ్వరుని మనము సేవింపఁగలుగుటకై — పాపులును దుఃఖితులును మనమోక్షమునకై — జన్మించి యున్నారు.

మానవశరీరమున మానవాత్మయే మన కర్చనీయుడగు భగవంతుఁడు. జంతువులును భగవంతున కాలయములనుట నిజమే. కాని మానవుఁడే మహోత్తముఁడు; ఆలయములలో మానవశరీరాలయము 'తాజమహలు.' అందు

నే నారాధింపఁజాలనిచో, మఱి యేయితరాల యములవలనను నాకు లాభము కలుగదు.

భావి సంస్కర్తలారా, భావి దేశాభిమానులారా, పరితపింపుఁడు! మీకుఁ బరితాపము కలదా? దేవతాసంతతియు ఋషిసంతతియు నగు కోట్లకొలఁది జనులు పశుప్రాయులై యున్నారని మీరు పరితపించుచున్నారా? కోట్లకొలఁదిమంది నేఁడు తినఁదిండిలేక మాడుచున్నారని, కోట్లకొలఁదిజను లనేకయుగముల నుండియుఁ బస్తుండవలసివచ్చుచున్నదని మీరు పరితపించుచున్నారా? అజ్ఞానము కారుమబ్బువలె దేశమునంతటను నావరించుకొనియున్నదని మీరు పరితపించుచున్నారా? అది మీ కేమియుఁ దోఁపనీయకున్నదా? నిద్రపట్టనీయకున్నదా? అది మీ రక్తమునందుఁ జొచ్చి, మీ రక్తనాళములందుఁ బ్రవహించుచు, హృదయస్పందనములతోఁబాటు కొట్టుకొనుచున్నదా? అది మి మ్మించుమించు పిచ్చివాండ్రను జేసివైచినదా? ఇట్టి వినాశము గలిగిన దేయను తదేకచింత మి మ్మావహించినదా? మీ పేరు ప్రతిష్ఠలనుగూర్చి, మీ భార్యాపుత్రులనుగూర్చి, మీసిరిసంపదలనుగూర్చి, తుదకు మీశరీరమునుగూర్చి పూర్తిగా మీరు మఱచితిరా? ఈ పని మీరు చేసితిరా? దేశాభిమాని యగుట కిది మొదటిమెట్టు, మొట్టమొదటి మెట్టు.

## న మ స్సు మా ం జ లి

### శా ర దా శ ర ణ్

స్వామిజీ, ఓస్వామిజీ
కామజీవన బాల్యహేలలు
లోభభావన లుజ్జగించితి
రామకృష్ణుని ముద్దుపాపవు
ఆడుదువు వేదాంత వీధుల
త్యాగనిరతికి నివాళులయ్యా
త్యాగధనదుడ స్వామిజీ ॥ స్వామిజీ॥

కొదమ సింగము పరుగు వేగము
సవాలు చేసెడి మాట పొందిక
విశ్వహృదయము గైసేసికొన్నది భావగరిమ
వేధచతురిమ క్రిందుజేసెడి మేధనీది

కటిక చీకటి మూల్గుచుండిన అద్వైతరత్నము
ఏరితెచ్చి ఖరీదుచెప్పిన షరాబు వీవే ॥ స్వామిజీ॥

మూగవానికి చెవుడులా అజ్ఞానికసహనం
దాపురించును స్వయంసిద్ధం
నీ దేవుడు నాదేవుడు వాడిదేవుడు ఎక్కడెక్కడ ?
దైవమొకడే, మతము ఒకటే.
మానవతయె మనిషిమతమని
విస్తరిల్లిన విశ్వశాంతికి స్రష్టవీవే ॥ స్వామిజీ॥

బలం, బలం ఆత్మకాలంబనం దేనికి ?
భయం బద్ధకం ప్రగతికామికి బద్ధవైరులు
శ్రద్ధలేనిది కర్మలేనిది బ్రతుకు లేదు
ఉత్తిష్ఠత, జాగ్రత ప్రాప్యవరాన్ని బోధత
మేలుకొనుడు విశ్వజీవన మేలుకొనుడు
లెండు రండని చాటిచెప్పిన వైతాళికుడవు ॥ స్వామిజీ॥

తల్లిదండ్రి గురువు ముగ్వురు దైవమనిరి ఋషులుమున్ను
రోగి దీనుడు పాపి హీనుడు దైవమంటివి ధీరబుద్ధి
అఖిలభారత మమ్మనాకు, జీవులెల్లరు అన్నదమ్ములు
వసుధయె స్వగృహమ్మంటివి, తూర్పువొడమిన భాను తేజము
దిక్కులెల్లను నిండినట్లుగ భారతావని గలిగి యతివై
జగతి శ్రేయము చక్కబెట్టిన విశ్వమిత్రుడ ॥ స్వామిజీ॥

వేదాలకు వేధలాగ ప్రవచనాలకు పెద్ద వీవు
ఇనుపకండర ముక్కునరములు చెక్కుచెదరని
మేరుధైర్యము 'ఆత్మజీవి'కి ఆదర్శములుగా
నొక్కిచాటిన దార్ఢ్య భారతి నీదు నోటను
సరిక్రొత్త నగారాలా, నిరంతర నయాగారాలా
మేలుకొల్పిన నీదు జాతికి మేలు తెల్పుము, చిరంజీవీ ॥ స్వామిజీ॥

# మాతృశ్రీ శారదాదేవి

[సంపాదకీయము]

భారతదేశచరిత్రలో మహాపురుషులు మహాసాధ్వులు యుగయుగమునను అవతరించి మానవతతికి పారమార్థికమార్గమును చూపియున్నారు. అట్టి అవతారమూర్తుల సంఖ్య ఇటీవల హెచ్చు అని కూడ చెప్పవచ్చు. ఈ కాలస్వభావమునుబట్టి అట్టి అవతారమూర్తుల అక్కఱ మునుపటికంటె ఎక్కువ కాబోలు. బాహ్యప్రకృతిని మానవు డిప్పుడు వశపఱచుకొన్నంతగా ఇతఃపూర్వ మెప్పుడును వశపఱచుకొని యుండలేదు. బాహ్యప్రకృతి మర్మములందే నిమగ్నదృష్టియైన మానవుడు స్వాత్మస్వరూపమును విస్మరించుటయు సహజమే. ఆమత్తునుండి మేల్కొలిపి మానవునకు ఆత్మస్వరూపమును జ్ఞప్తిపఱుపవలసిన అక్కఱ కలిగినది. అందుకై అవతరించిన నవీనయుగావతారమూర్తులలో సర్వాధికుడు శ్రీరామకృష్ణుడు. ఆయన దివ్యమహిషియగు శ్రీశారదాదేవిని పేర్కొనక ఆయనను మాత్రమే పేర్కొనుట అసమగ్రోక్తి.

శ్రీశారదాదేవి 1853 లో పశ్చిమబంగాళమున జయరామవాటి గ్రామములో సనాతనాచారనిష్ఠమైన యొక పేదబ్రాహ్మణకుటుంబమున జన్మించినది. భవిష్యజ్జీవితమునకు అర్హత గూర్చు శిక్షణము ఆమె కత్యంతబాల్యమందే సమకూడెను. పెద్దకుటుంబమున జ్యేష్ఠపుత్రియైనందున తమ్ములను చెల్లెండ్రను విచారించుకొనుటయు అమ్మకు గృహకృత్యములలో తోడ్పడుచుండుటయు ఆమెకు సహజకర్తవ్యములాయెను. ఈపరిస్థితు లామెను గృహకృత్యముల నిర్వహణమునందు నిష్ణాతిగా రూపొందించినవి.

బాలికలకు చాలచిన్నవయసుననే పెండ్లి చేయుట ఆనాటి ఆచారము. అది దురాచారముగా, అనంతరఫలితములనుబట్టి, సంఘసంస్కర్తలు నిరూపించినను ఒకగొప్పలక్ష్యసిద్ధికే ఆయాచార మేర్పడిన దనుట నిజము. మగువకు మగవాని సాహచర్యము అంతచిన్నవయసునుండి ఏర్పడిననే వారికి సమగ్రసాధర్మ్యము కుదురును. శారదా శ్రీరామకృష్ణుల వివాహమప్పుడు ఆమెకు వయస్సు ఐదేండ్లు. ఆయనకు ఇరువదిమూడేండ్లు. పదునెనిమిదవయేట ఆమె పతితో స్థిరముగ వసించుటకు వచ్చినది. యోగిసార్వభౌముడైన తనవల్లభుని పరమాద్భుతప్రభావమునకు లోనైనది. ఆయన ఆమెకు లౌకికప్రవర్తనవిధానములు మొదలుకొని ఆధ్యాత్మికపరమరహస్యములవఱకు బోధించి తనకు ప్రథమశిష్యురాలినిగా చేసికొనెను.

శారదా శ్రీరామకృష్ణుల దాంపత్య జీవితము లోకోత్తరమైనది. మొదటి విశేష మేమనగా నిస్స్వార్థమైన పరస్పరప్రేమచే వారి అభిరుచులకును ఆదర్శములకును కుదిరిన ఐక్యము. రెండవ విశేషము: వారికలయిక శారీరకమైనది కాదు, అది చిత్తముల ఆత్మల ఐక్యము.

''యద్ధర్మైరిహ ధర్మిణీ విహరతే నానా కృతి ర్నాయికా'' అన్నట్లు, ఆధ్యాత్మికసిద్ధికి సాధనచేయువానికి అందును సహధర్మిణి యుండుట బాధకము కాకపోవుటే కాక సాధకమును అగును అను నొక అపూర్వవిశేషమును వీరి చరిత్రము తెల్పుచున్నది.

సతికి పతియే దైవ మని విధించు శాస్త్రములును నిరూపించు చరిత్రములును లెక్కకు మిక్కిలిగ నున్నవి. అది సత్యములో సగమే. సతికి పతి యెట్లో అట్లే పతికి సతియు దైవము అనుట సమగ్రసత్యము. సకలకాలములకు సకలదేశములకు ఆ సమగ్రసత్యమునకు మహోజ్జ్వలమైన లక్ష్యము శ్రీశారదారామకృష్ణుల దాంపత్యము.

దివిటీ తన్ను పట్టుకొనియున్న వానిని చీకటిలో నుంచి లోకమునకు వెలుతురిచ్చునటులు మాతృశ్రీ శారదాదేవి తనబంధువులను తన మహిమనుగూర్చిన అజ్ఞానమున నుంచి, ఆ మహిమను బాహ్యలోకముపై ప్రసరింప చేసెను. దప్పిగొన్నవారు జలాశయమునకు వచ్చునట్లు ఎందఱు ఆమెయొద్దకు వచ్చువారు! అట్లగు నని తెలిసియే గురు వామెకు అందులకు తగిన శిక్షణ మిచ్చెను. ఆశ్రయ మిచ్చునప్పుడు అర్హతను పరిశీలించువాడు గురువు, ఆపరిశీలనచేయకే మాత ఆశ్రయ మిచ్చెడిది. అసాధువులను సాధూకరించెడి ఆమె శక్తి అద్భుతము. అనుగ్రహ మొసగి, పాపములను గొని, వ్యాధుల పీడకు లోనగు ఆయౌదార్యము నేమన గలము! ఆమె పల్కిన యేకైకవాక్యము ఎందఱికో అనంతబల మొసగినది; ఎందఱినో ఆధ్యాత్మికపతనము నుండి నైతికవిచ్ఛేదము నుండి కాపాడినది. ఆమె రూపుదాల్చిన వినయము. ఐనను భక్తుల చిత్తచాంచల్యమును మాన్పుటకై తనపరదేవతాత్వమును ప్రకటించెడిది. ఆభరణపు విలువ ఒక్కొక్కరికొక్కొక్కరీతి నుండును. ఆధ్యాత్మికరంగమున ఆమెస్థాన మెట్టిదో తదితరరంగముల వారికి తెలియుట కష్టము. కాని కొన్ని ప్రమాణములనుబట్టి దానిని కొంత తెలిసికొన వీలగును. ఆధ్యాత్మికసిద్ధపురుషులు ఆమెయందుంచిన భక్తి అట్టి ప్రమాణములలో అగ్రగణ్యము. ఆమె ఆశీస్సే తనకు విశ్వవిజయ మిచ్చె నని శ్రీవివేకానందస్వామి నమ్మకము. శ్రీబ్రహ్మానందస్వాముల మాతృభక్తియు వాగగోచరము. ఆమెశక్తిస్వరూపిణి యని శ్రీశారదానందస్వామి ఉద్ఘోషించెను. బంధువులు బంధుమాత్రగా తన్ను భావించినప్పుడును భక్తులు పరాశక్తిస్వరూపిణిగా ఆరాధించినప్పుడును ఆమెలో నున్న ఏకరూపత కంటె ఆమె దివ్యత్వమున కధికసాక్ష్య ముండ బోదు.

గ్రాంథికపాండిత్య మామె కెక్కువ లేదు. కాని ఆధ్యాత్మికసమస్యలను ఆమె తన ప్రత్యుత్తరములచే పరిష్కరించుతీరు ఆశ్చర్యకరము. కొన్ని ఉదాహరణములు:—

ప్రశ్న :—దుఃఖానుభవము దైవసృష్టిలో నుండ నేల?

జ.— సుఖదుఃఖమేళనమే సృష్టి; దుఃఖానుభవమునకు దేవుని హితపరతయే (కరుణయే) కారణము. అంతయు కర్మఫలము, కష్టములు కలకాల ముండవు.

ప్రశ్న:— అబుద్ధిపూర్వక భగవన్నామ సంకీర్తనము వ్యర్థము కాదా?

జ:— తెలిసిపడినను తెలియకపడినను నీరు తడుపును.

ప్రశ్న:— నామజపము చేయుచున్నను కొందఱకు భగవన్నిమగ్నత కుదురుట లేదేమి?

జ:— క్రమము తప్పుటే ఫల విలంబ హేతువు. జపము నాపకుము, నిలుకడమీద నిశ్చలత కుదురుకొనును. దేవుని కృప కలుగును.

ప్రశ్న:— సూర్యుని వెలుతురువలె దేవుని కృప విశ్వవ్యాపి; అందుకై సాధనలెందుకు?

జ:—పదార్థము లున్నను ఎంత ముందు వండుకొన్న అంతముందు ఆకలి తీర్చుకొన వచ్చును. వండుకొనకయే యున్న ఆకలి తీరనే తీరదు.

గిరీశచంద్రఘోషునంతటివాని సన్న్యాసన సంకల్పమును మార్చి నన్నచో ఆమెశక్తి యెంతటిదో! ఎవని కెట్టి సాధన ఫలించునో నిర్ణయించు నామె శక్తి అద్భుతము. సుదీర్ఘకాల మొకమూర్తి నారాధించి సిద్ధి నొంద జాలని యొకడు అమ్మ ప్రసాదించిన వేఱుమూర్తి నారాధించి అల్పకాలమున అనల్పసిద్ధి నొందెను. ఆయన కే ధ్యానక్రమము తప్పి మతి చెడగా దాని నెవ్వరును కనుగొనలేక పోగా అమ్మయే గ్రహించి—సిద్ధి—మేలొనరించెను. ఇందు కే శ్రీరామకృష్ణమఠీయులకును సంఘ వారికిని ఆమె యుపదేశములు పరమ ప్రమాణములైనవి.



# విద్య - శ్రీ వివేకానందస్వాముల అభిప్రాయము

## శ్రీ సుధాంశు బ్రహ్మచారి

విద్యనుగూర్చి శ్రీస్వామిజి పల్కిన సూక్తులలో ముఖ్యతమమైనది — 'మానవునిలో అంతర్గతమై యున్న పరిపూర్ణతను బహిర్గతమొనర్చుటే విద్యగఁబడుట'. ఈసూక్తిని సునిశితముగ పరిశీలించినచో అందలి గంభీరార్థ మవగతమగును. మొదట శబ్దార్థమును పరికింపవలెను. తర్వాత మనస్తత్త్వశాస్త్రానుగుణమగుదాని విధానమునుగుర్తింపవలెను. తర్వాత దాని పారమార్థికప్రాముఖ్యమును శోధింపవలెను.

'విద్య' అను శబ్దమునకు ఈకాలమున ముఖ్యముగను గౌణముగను పెక్కు అర్థములు చెప్పబడుచున్నవి. 'లక్ష్యరహితమైన బడిచదువు' అని కొందఱి అర్థము. 'బ్రతుకు తెరువున శిక్షణము' అని కొందఱి అర్థము. 'అది కొంత ఇదికొంత' అని కొందఱి అర్థము. 'ఏదేనొక సిద్ధాంతమునో ఆదర్శమునో విశ్వాసమునో అనుసరించుట' అని కొందఱి అర్థము. 'వ్యక్త్యభివృద్ధి, ప్రపంచజ్ఞానము, సంఘజీవిత సంరక్షణాభివర్ధననైపుణి, ఒక్కొక్కడును తనకువిలువగలవాని యాన్వేషణమున సంతుష్టి సాధించుట—ఇదంతయు విద్య అని కొందఱి అర్థము. ఇట్లు దానిఅర్థము అన్నివైపులఁ పెంపొంది సమస్తమును తనలో ఇముడ్చుకొన

జూచుచున్నది. శ్రీ వివేకానందస్వాముల ఊహాలో విద్య యనగా మానసిక శారీరక నైపుణ్యమును బడయుట కాదు, మేలుములను బడయుటయు, పరిసరములను వశమునందుంచు కొనుటయు, నాణ్యమైన పౌరజీవితమును గడపుటయు, విద్యాప్రయోజనములు కావు. విద్య యనగా లోనున్న దానిని వెలికి తెచ్చుటయు, నిద్రాణమైయున్న దానిని ప్రబోధించుటయునే కాని ''లేనిదానిని పుట్టించుట'' కాదు. కావుననే ఆయన విద్యకు తాను చెప్పిన నిర్వచనములో ''బహిర్గతమొనర్చుట'' అను పదమునే వాడెను. మొలక తనంతట ఎదుగవలెను. నీవు చేయగలిగిన దెల్ల ప్రతిబంధములను తొలగించుటయు, కంచెవేసి కాపాడుటయు. విద్యావిషయమును అట్లే. ప్రతియొక్కనిలో నున్న విద్య తనంతటనే వెలికి రావలెను. గురువులు చేయగల్గినదెల్ల ప్రతిబంధములను తొలగించి దారి యేర్పఱచుటే. భయపెట్టి, ఆసచూపి, నిర్బంధించెడి శిక్షణము విద్య అని భ్రమింపరాదు. ప్రకృతి కనుగుణముగ మానవునకు అంతర్గతముగ గల్గు వికాసమే విద్య. రూసోపండితుడును 'స్వేచ్ఛయున్ననే వికాస ముండు' ననెను. అంతవఱకు అతనితో స్వామిజికి ఏకీభావ మున్నట్లే. కాని స్వామి మానవత్వమును రూపొందించు లక్షణమునే ప్రధానీకరించెను. ఆయన భావించిన విధానము ప్రాచీనగురుకులవిధానముతో సరిపోవును. ఆవిధానమున గురుశిష్యులపరస్పర 'పరిచితియు' 'ప్రేమయు' తక్కిన యన్నిటికన్న సర్వప్రధానములు. అంతర్గతమై యున్న వెలుగును సూచించుటకే గ్రంథములు. ఆజ్యోతిని సాక్షాత్కరించుకొన్నతక్షణమే నీ వికగ్రంథములను పాఱవైచి అంతర్ముఖుడవు కావచ్చు. స్వామిజి సూక్తి — మానవుడే సజీవకావ్యము. ఆ కావ్యమును జదువుడు. వేదములకేమి క్రైస్తుబుద్ధాదులగు అవతారమూర్తులకేమి వెలుగునిచ్చిన దీపములము మనమే. సంగతుల ఏకరువు పెట్టుటే విద్య గఱపుట యగునేని గ్రంథములును గ్రంథాలయములునే మహర్షులు కావలయును. శ్రద్ధాళువులు లోకమున గల ధనము నంతటిని వెచ్చించినను మానవతతి మేలొందబోదు. మేలొందించునది పవిత్రాత్ములయు మహాత్ములయు ఆదర్శమే.

నిద్రాణమైయున్న మానవుల అనంతశక్తిని, దానిని ఆవరించియున్న మాయను గుర్తించిన స్వామిజికి 'విద్యను అందఱికి, అత్యంతనిమ్నులకునైతము అందజేయవలె. వారిని ఆత్మప్రాప్తి మార్గమునపయనింపజేయవలె' నను ఉత్సాహోద్రేకము గల్గినది. కావున 'బహిర్గతమొనర్చుట' అను మాటకు 'మేలుకొనుట' 'లేచుట' అనునదే తాత్పర్యార్థ మగుచున్నది. కావుననే 'ఉత్తిష్ఠత జాగ్రత' అను ఉపనిషద్వాక్యములను స్వామి పరిశ్కృతపర్యాయము లుద్ఘోషించెను. 'ఏ మున్నది మానవునిలో ప్రబోధింపబడుటకు' అను ప్రశ్నకు సమాధానమే స్వామిజి బోధనలలోను తత్త్వశాస్త్రమందును మూలభూతమైన విషయము. 'ప్రతియొక్కనికిని, అత డున్న స్థాయినుండి పురోగతి కూర్పవలెను. శిష్యుని ప్రవణతను గుర్తించి అందు తన యావచ్ఛక్తిని జొనుపగలవాడే నిజమైన గురువు......ప్రతిమానవుడును సహజముగ పరిపూర్ణుడే. ఈపరిపూర్ణతను ప్రవక్తలు ఆవిష్కరించిరి. మనలో అది సాధ్యదశలో నున్నది''—అన్నారు స్వామిజి. ఆయన యభిప్రాయమున 'మానవుడు' అనగా కేవల

మృగముకాదు, సర్వగతుడగు శివుని స్థూల రూపమే జీవుడు. పాపి - హంతకుడు - వ్యభి చారి - ఇట్లనేకముగ భాసించునది ఆ ఏకమే. జ్ఞాతయు జ్ఞేయమును (జ్ఞానమును) అదే.

దేహపరిస్థితిని దానిపరిసరములను దాని వృద్ధిని తనలో ఇముడ్చుకొన్నట్టి మనఃపరిణామ సిద్ధుడే మానవు డని పైకి కననగును. కాని ఒకపుట్టుకలోని మనఃపరిణామావధులను దాటి భారతీయుల వేదాంతము అనేకజన్మముల గల్గు చున్న పరిణతిని గుర్తించుచున్నది. దానికే సంస్కారమని పేరు. స్వామి తన విద్యావిధాన సిద్ధాంతము నీ 'సంస్కారము' పై నాధార పఱచెను. కాగా పాశ్చాత్యుల విద్యావిధాన లక్ష్యము భావాభివృద్ధియు విజ్ఞానాభివృద్ధియునై యుండ మన విద్యావిధానమునకు 'అను భూతి'యే లక్ష్య మగుచున్నది. కావుననే ఈ విద్య ఆత్మవిద్యయనియు బ్రహ్మవిద్యయనియు పేర్కొనబడుచున్నది.

విద్యనుగూర్చిన యీ ప్రాచీన వేదాంత ప్రతిపాదనమునకు ఆధునిక కాలోపయుక్తము లగు కొన్ని చేర్పులను స్వామిజి కావించినాడు. ఆయనవాక్కులు : మానవుడు 'నేర్చుకొనుట' యనగా నిజమునకు అతడు అఖండజ్ఞాననిలయ మగు తనయాత్మను కప్పియున్న అజ్ఞానావరణ మును తొలగించుకొని 'కనుగొనుటే'...... జ్ఞానమంతయు వ్యావహారికముగాని పారమార్థి కము గాని మానవుని మనస్సులోనే గలదు. పెక్కెడల నిది మఱుగువడి కనుగొనబడ కుండును. ఈమఱుగు క్రమముగా తొలగింప బడునప్పుడు మనము 'నేర్చుకొనుచున్నాము' అని చెప్పుదుము.......మానసమున జ్ఞానము కాష్ఠమం దగ్నివలె నున్నది; దానిని స్ఫురింప జేయుటే వెలువడజేయు నొఱపిడి.

'అంతర్గతమైయున్న పరిపూర్ణతను బహిర్గత మొనర్చుట' అను ఈవిధానము పాశ్చాత్యుల కైనను బొత్తిగా తెలియనిదికాదు. సాక్రటీసు ప్లేటో ఇమ్మాన్యువల్కాంటు మున్నగు వారి రచనలలో ఈ విధానము వ్యంజితమైయే యున్నది.

వ్యావహారిక పారమార్థికములకు పరాపర విద్యలకు చక్కని సామరస్యము శ్రీవివేకా నందస్వామి కభిమతము. తమస్సునుండి దేశ మును ప్రబోధించు స్వామి ప్రణాళికలో రాజ సిక సాత్త్వికములకు కూడ చక్కని పొందిక కుదుర్చబడియున్నది.

'క్రమముక్తి' అను వేదాంతాశయాను గుణముగ విద్యాసంపాదనమునను స్వామిజి ప్రతిపాదించిన క్రమాభివృద్ధిసూత్రము మిక్కిలి గమనార్హము. ప్రతిమెట్టును పైమెట్టుకందించు చుండును. అన్నిమెట్లలోను సాధకుని సమగ్ర సిద్ధికి చేర్చు ప్రభావ మున్నది. విద్యా - సాం ఘిక - మత - రంగములలో సమస్తమునకును అమోఘసాధనము చిత్తైకాగ్రత. స్వామిజి వాక్కులు. 'జ్ఞానము పొందుటకు ఏకాగ్రత' అనుదానికంటె వేఱుసాధనము లేదు. రసా యనశాస్త్రజ్ఞుడు తనమానసికశక్తుల నన్నిటిని ఏకాగ్రస్థితికి దెచ్చి వానిని తాను పరిశోధించు చున్న పదార్థములపై బఱపి వాని రహస్యము లను దెలిసికొనుచున్నాడు. జ్యోతిశ్శాస్త్రవేత్త తనమానసికశక్తుల నన్నిటిని కేంద్రీకరించి దూరదర్శనయంత్రము మూలమున ఆకసముపై పఱపగా సూర్యచంద్రనక్షత్రములు తమతమ

రహస్యముల నాతనికి వెల్లడి చేయుచున్నవి... ...వంటవాని కేకాగ్రత యున్నచో వంటకము దివ్యముగా కుదురును. ధనసంపాదనమునగాని, భగవదుపాసనమున గాని ఏపనియందు గాని కేంద్రీకరణశక్తి ఎంతయున్న సిద్ధి అంత అమోఘము.

ఇందు లోకవైఖరి కావలయును. సామాన్య మానవునికి తత్రత్య తాత్కాలికవస్తులాభము లక్ష్యము. ఐహికవిషయాల మీదికి పఱచు మనస్సును అణచిపెట్టు బ్రహ్మచర్యమున్న నే మనశ్శక్తి పెంపొందునని స్వామిజి ఆశయము. ఈచిత్తనిగ్రహవిధానమును స్వామిజి రాజయోగగ్రంథమున చక్కగ ప్రతిపాదించియున్నాడు. విద్యావిధానమున ఎంతసేపటికిని శిష్యుని సముత్సాహమును పెంపొందింప ప్రయత్నింపవలెనే కాని, బలాత్కారము చేయరా దనుట స్వాముల చిత్తము. 'పాండితి' 'బహుమతి' ఇత్యాదులు బాహ్యలాభములు. యథార్థమానవత్వపరిపూర్తికి లక్ష్యము లవి కావు. విద్య మానవత్వాపాదకముగనుండవలెనే కాని ఉదరపోషణమాత్రసాధకముగ నున్న చాలదు. విద్య మానవునకు శీలమును బలమును వినయమును శ్రద్ధను దీక్షను త్యాగమును అలవఱుపవలెనే కాని, లోభమును ఆడంబరము నలవఱుపరాదు. ఇంద్రియతృష్ణనుద్రేకపఱచుపాట కాని పద్యము కాని 'ప్లేటో' కు అభిమతము కాదు. శ్రీవివేకానందస్వామికి ధ్రుపదగీతాలు గోష్ఠిగానమును అభిమతములు.

స్వామిజి ఆశయమున 'బలము' అనగా ఉపనిషదుద్ఘుష్టమైన నైతికాధ్యాత్మికబలమే కావున గ్రీకులలక్ష్యమున కంటె భిన్నము. ఆయన వాక్యములు :— "భారతదేశవాతావరణము ప్రశాంతతకు మిక్కిలి యనుకూలమైనది; యవనుని స్వభావ మేమనగా, నిరంతరతేజఃప్రకటనము భారతీయునికి గాఢధ్యానము స్వభావము, యవనునికి చతురముగా కార్యముల నిర్వహించుట యందు దుర్నివారమైన ఉత్సాహము స్వభావము. భారతీయుడు త్యాగి, యవనుడు భోగి. భారతీయుని తేజఃప్రసారము పూర్తిగా లోపలివైపునకు, యవనుని తేజఃప్రసారము వెలికి". ఈలోపలివెలుపలి సముత్సాహములు తగుపాళ్లలో శ్రీస్వామిజిలో మిళితము లైనవి. అంతస్సమగ్రత ఒకసారి చేకూరిన ఇక దానికి విచ్ఛేద ముండదు. వర్ధమానవేగముతో అది ముందుకు సాగిపోవుచుండును. నిరవధికముగ వర్ధిల్లి జ్ఞానముతో బ్రహ్మముతో ఐక్యమొందు పరిపూర్ణతనే స్వామి భావించినది. ఆయన సాగించిన జ్ఞానాన్వేషణము— అనగా ఎప్పుడును గుణములఅన్వేషణమే, విశ్వవ్యాప్తమైన దాని అన్వేషణమే. ఆయన భావించిన పరిపూర్ణత ముక్తితో సమానార్థకము. ఇట్లు విద్యనుగూర్చిన స్వామీజీ ఆశయములో "జీవితము"ను "ఆత్మ"యు "ఇహము"ను "పరము"ను "సాధన"యు "సూత్రము"ను అవినాభావసంబంధముతో కూడియున్నవి.

# నా లంకాద్వీప యాత్ర

శ్రీ శుద్ధ సత్త్వానందస్వామి

(గతసంచిక తరువాయి)

ప్రఖ్యాతతీర్థస్థానమగు కదరికామ యందు యాత్రికులకై ఒకధర్మసత్రము రామకృష్ణ మిషను నడపుచున్నది. ఈ సత్రములో ఒక వేయిమంది నివసింప వీలగును. ప్రతిదినము కనీసము 100 మంది యాత్రికులు వచ్చి ఈ సత్రములో దిగుచుందురు. యాత్రికులకు రెండు పూట్ల ఉచితముగ భోజనము పెట్టబడును. ఉత్సవములందు అయిదారువేలకు పైగా యాత్రికులకు భోజనాది సౌకర్యముల నేర్పఱతురు. ప్రతిసంవత్సరము ఆగస్టుమాసమున సుబ్రహ్మణ్యాలయమందు పెద్ద ఉత్సవము జరుగును. అప్పుడు లక్షలకొలది యాత్రికులు సుబ్రహ్మణ్యక్షేత్రదర్శనమునకై వత్తురు. వారి కెల్లరకును సౌకర్యముల నెల్ల రామకృష్ణమిషనువారు చూతురు. సుబ్రహ్మణ్యాలయముప్రక్కననే రామకృష్ణమిషను కలదు. ఒకసన్న్యాసి యాత్రికుల సౌకర్యముల నెల్ల చూచుచు అచ్చటనే ఉండును.

కొలంబోలో మేము శివరాత్రిపూజ జరిపించితిమి. రాత్రి 9 గంటలకు పూజఆరంభమై, ఉదయము 6 గంటలకు, నాల్గుజాముల పూజ హోమముతో ముగిసెను. రాత్రంతయు భజన సంకీర్తన జరిగెను. సుమారు 250 మంది భక్తులు జాగారణ, ఉపవాసములు చేసి, పూజలో పాల్గొనిరి. అటుపై మూడురోజుల తర్వాత శ్రీరామకృష్ణుని జన్మదినోత్సవసందర్భమున పూజాహోమములు జరిపించితిమి. సాయంత్రము శ్రీరామకృష్ణుని జీవితోపదేశములగూర్చి చర్చించుచు గొప్పబహిరంగసభ జరిగెను. పెక్కురు పౌరులు ఈసభలో పాల్గొనిరి. ఈవిదేశమందుకూడ పెక్కురు రామకృష్ణభక్తుల చూచి ఆశ్చర్యపడితిని. ఇచ్చట ఇందఱు భక్తు లుండుటకు కారణము కలదు. శ్రీవివేకానందస్వామి పాశ్చాత్యదేశములందు వేదాంతమతదుందుభిని మ్రోగించి తిరిగి వచ్చు సమయమున, స్టీమరునుండి మొట్టమొదట జాఫ్నాలో దిగెను. కొలంబోలో బహిరంగోపన్యాసముకావించెను. అటుపై క్యాండి, అనురాధపురము దర్శించి గుఱ్ఱపుబండిలో జాఫ్నాకు వెళ్ళెను. అనురాధపురము నుండి జాఫ్నా 180 మైళ్ళు. దారిలో బండివిరుగుటచే స్వామిజీకి చాల ఇబ్బంది కల్గెను. జాఫ్నాలో స్వామిజీ బహు అమూల్యవిషయములగూర్చి ఉపన్యసించెను. స్వామిజీ ఇండియాకు తిరిగి వచ్చినపిదప, తమ గురుభ్రాత అగు శివానంద స్వామిని ధర్మప్రచారార్థము లంకకు పంపెను. శివానందస్వామి కొలంబోలో 7, 8 మాసములపాటుండి ధర్మప్రచారము కావించెను.

శ్రీరామకృష్ణజన్మోత్సవము ముగిసినమరునాడు ఉదయము మేము కారులో బయలుదేఱి 180 మైళ్ళలో గల కదిరికామ సాయంత్రము $7\frac{1}{2}$ గంటలకు చేరితిమి. ఈ దారిపొడుగుననూ

ఒకవైపు టెంకాయచెట్ల వరుసయు, రెండవ వైపున హిందూమహాసముద్రమును చూచుటకు చాలమనోహరముగ నుండును. కదరికామకు పోవుదారిలో (కొలంబో నుండి 72 మైళ్ళదూరములో) గాలి స్వాభావిక ఓడరేవును చూచితిమి. అటుపై 30 మైళ్ళ దూరములో మాతారా పట్టణముకూడ చూచితిమి.

కదిరికామలో సుబ్రహ్మణ్యాలయమునకు ఒకవైపున విఘ్నేశ్వరాలయమును, మఱొకవైపున వల్లీ, దేవసేనల ఆలయములు వేర్వేఱుగ కలవు. ఆలయసమీపమున నున్న మాణిక్యగంగలో స్నానముచేసి మేము ఆలయమున ప్రవేశించితిమి. ఆలయము చాల చిన్నదైనను దాని మాహాత్మ్యము ప్రఖ్యాతము. ఇచ్చట ఆశ్చర్యవిషయమేమన గర్భగుడిలోని మూలవిరాట్టుదర్శనము, పూజారికి తప్ప మరెవ్వరికిని కలుగదు. గర్భగుడి ద్వారమునకు అడ్డముగ 4, 5 పరదాలు ఒకదాని వెనుకనొకటి కట్టబడియుండును. ఈపరదాలపై మయూరవాహనుడగు శ్రీసుబ్రహ్మణ్యస్వామి చిత్రము చిత్రింపబడియుండును. మూలవిరాట్ దర్శనము కాకున్నను, నాట్యమందిరము నుండియే ప్రణమిల్లి, పూజాదికములు చేయించి అసంఖ్యాకభక్తులు శాంతిని బడయుచున్నారు. మేమచ్చట రెండుదినములు ఆనందముతో గడపితిమి. సుబ్రహ్మణ్యాలయమునకు రెండు ఫర్లాంగులలో ఒక పెద్ద బౌద్ధస్తూపమును చూచితిమి.

కదరికామనుండి 115 మైళ్ళదూరములో గల నివురోలియాకు పయనించితిమి. 7000′ ఎత్తున ఈ పట్టణముచూచుటకు చాల అందమైనది. నివురోలియాకు పోవుమార్గముననే హాక్‌గాలీ అను కొండశిఖరముపై బొటానికల్ గార్డన్సు చూచితిమి. ఇచ్చటనే ఒక ప్రదేశమున పెక్కుపురాతన వృక్షముల గుమియున్నది. దీనినే అశోకవనమందురు. ఇచ్చటినుండి అనతిదూరములోనే సీతాదేవిమందిరమొకటికలదు. ఇచ్చటనే రావణుడు సీతాదేవిని ఉంచె నందురు. నివురోలియానుండి మధ్యాహ్నము బయలుదేఱి సాయంత్రము క్యాండి చేరితిమి. ఆకొండలలో దారిపొడుగునా, టీ, కాఫీ, కోకో, రబ్బరు, లవంగపు తోటలతో నిండి చూచుటకు అతిమనోహరముగ నుండెను. క్యాండి పట్టణము 2000′ ఎత్తు. ఇచ్చటినుండి 3 మైళ్ళదూరములో పెరిడానియా అనుచోట ఆసియాఖండములోని కెల్ల పెద్ద బొటానికల్ గార్డన్సుకలవు. ఇచ్చట రుద్రాక్షచెట్లు, కమండలములు చేయు టెంకాయచెట్లు కలవు.

లంకాద్వీపములో ఒకటి యూనివ మేము యూనివర్సిటీ భవనములన్నిటిని చూచితిమి. అటుపై టూత్ టెంపిల్ (దంతాలయము) చూచితిమి. ఈ ఆలయమున బుద్ధుని పల్లు ఒకటి కలదు. బౌద్ధసన్న్యాసులు ఇచ్చట పూజచేయుదురు. ఇది బౌద్ధులకు ముఖ్య తీర్థస్థానము. బుద్ధుని పల్లు మనము కోరినప్పుడెల్ల చూడజాలము. జూలైమాసములో బౌద్ధుల ఉత్సవము జరుగును. అప్పుడు బంగారుకమ్మీ చుట్టి ఒకకడ్డీకి తగిలించి, దానిని అంబారీ ఏనుగుపై పెట్టి ఊరేగింతురు.

క్యాండినుండి బయలుదేఱి డాంబోలయందలి గుహామందిరము (కేవ్టెంపిల్సు) చూచితిమి. ఈగుహ సుమారు 150″ పొడవు 75 వెడల్పు, గుహలో సుమారు 42″ పొడవుగల బుద్ధునిమూర్తి శయనించియుండును. సుమార

300 మెట్లు దిగవలెను. అచ్చటినుండి సైగీరియాలో చిత్రముల చూడబోయితిమి. ఇచ్చట 5, 6 అతి పురాతనశిల్పములు కలవు. ఇవి అజంతాశిల్పాలను పోలియున్నవి. అట నుండి 150 మైళ్ళు తూర్పున ఉన్న బాటికాలా పట్టణము వెళ్ళితిమి. బాటికాలాలో శ్రీరామకృష్ణమిషనువారు పెక్కు బడులను అనాథాశ్రమమునుకూడ నడపుచున్నారు. బాటికాలా నుండి 150 మైళ్ళదూరము త్రిన్కోవాలి ప్రసిద్ధ ఓడరేవు కలదు. త్రిన్కోవాన్కోవాలీలోనే శ్రీరామకృష్ణమిషను హిందూకాలేజి కలదు. ఈపట్టణముననే సుప్రసిద్ధమగు కోణేశ్వరాలయము కలదు. కోణేశ్వరాలయమును దర్శించుకొనిన పిదప, అచ్చటినుండి మూడుమైళ్ళలో కల సప్త ఉష్ణకుండముల చూడ బోయితిమి. ఈస పకుండములలో స్నానముచేయుటకై ప్రతిదినము అసంఖ్యప్రజలు వత్తురు. ఇచ్చటి నుండి జాఫ్నా పట్టణము 150 మైళ్ళలో, ద్వీపపు ఉత్తర సరిహద్దున కలదు. జాఫ్నా జనసంఖ్య సుమారు ఒకలక్ష. ఇచ్చట హిందువులు అధికము. ప్రజలు 95% అరవము మాట్లాడుదురు. జాఫ్నాలోకూడ రామకృష్ణమిషన్ వైద్యేశ్వరన్ కాలేజీ కలదు. జాఫ్నాలోకూడ ఒక సుబ్రహ్మణ్యాలయము కలదు. ఈ ఆలయములో కార్తికేయుని బంగారు బాణమును పూజింతురు.

జాఫ్నాలో రామకృష్ణమఠము స్థాపింపవలెనని పెక్కుభక్తుల కోర్కె కలదు. జాఫ్నాలో వివేకానందస్వామి నివసించిన గృహమును, హిందూకాలేజీలో వా రుపన్యసించిన హాలును చూచితిమి.

జాఫ్నాకు ఉత్తరమునను, తూర్పునను నాలుగైదు చిన్నచిన్నదీవులు కలవు. అవి సిలోన్ ప్రభుత్వమునకు చేరినవే.

జాఫ్నానుండి బయలుదేరి 180 మైళ్ళ దూరములో ఉన్న బౌద్ధక్షేత్రమగు అనూరాధపురము చేరి, బోధివృక్షము, గగనచుంబియగు బౌద్ధస్తూపము, బౌద్ధరాజులకోటశిథిలములు మున్నగునవన్నియు చూచుకొని 72 మైళ్ళలో కల కొలంబో చేరితిమి. కొలంబో రామకృష్ణాశ్రమమున ఒకదినము విశ్రాంతితీసికొనిన పిదప బయలుదేరి రామేశ్వరముమీదుగా మద్రాసువచ్చి చేరితిమి.

అత్యంత మనోహరమగు సింహళద్వీపశోభ నా స్మృతిఫలకమున చిరస్థాయిగ ముద్రితమై నిల్చియున్నది.



# సోదరి నివేదిత

ప్రబహ్మచారిణి లలిత

స్త్రీలసముద్ధరణ చేయనిదే దేశము బాగుపడదని వివేకానందస్వామిజి దృఢనిశ్చయము. ఆయన పలుమార్లు ఇట్లు పల్కెను: "స్త్రీల స్థితిగతులు చక్కచేయనిచో లోకశ్రేయము నకు అవకాశము కలుగనేరదు". భారతదేశ పునరుద్ధరణము భారతీయనారీగణముపైనే ఆధారపడియున్నది. అందుచే స్వామిజీ స్త్రీజాతిశ్రేయమునకై ఎక్కువ ఆతురపడుచుండెను. ఆదినములలో స్వామిజీ ఉద్యమనిర్వహణకై యోగ్యురాలగు స్త్రీ హిందూదేశ

మున కానరాదాయె. అట్టి తరుణముననే స్వామి దృష్టి సోదరి నివేదితపై పడెను. ఆమె కేవలము ధర్మపరాయణయే కాదు, అసమాన విద్యాపాండిత్యము, ధైర్యోత్సాహములు, కార్యకుశలతయు, దృఢమగు పట్టుదలయు, అన్నిటికన్న భారతదేశముపై ప్రీతియు ఆమె కుండెను. అందుచేతనే స్వామిజీ నివేదితకు ఇట్లు వ్రాసెను: "నా హిందూదేశ కార్యప్రణాళికలో నీవు ఘనతర కార్యము తప్పక చేయ కల్గుదువని నే నాశించుచున్నాను. హిందూదేశస్త్రీలకై ప్రస్తుతము కావలసినది సింహబలాన్వితయగు స్త్రీ కాని పురుషుడు కాడు". సోదరినివేదిత తనగురువుగారి ఈ పిలుపును ఆలకించి — ఆయన ఆశయమును తు.చ. తప్పక కార్యాచరణలో పెట్టి లోకమునకు చూపెను.

సోదరినివేదిత పూర్వనామము మార్గరెట్ ఎలిజబెత్ నోబుల్. క్రీ.శ. 1867 సం॥ అక్టోబరు 28 తేదీన ఉత్తర ఐర్లెండులో డంగనూన్ (Dungannon) పట్టణమున జన్మించెను. ఈ నోబుల్ కుటుంబమువారు అసలు స్కాట్ లెండుకు చెందినవారు. కాని ఐదుశతాబ్దములుగ వారు ఐర్లెండున వాస మేర్పఱచుకొనిరి. మార్గరెట్టుకు తాతవద్దనుండి దేశభక్తియు, తండ్రి వద్దనుండి ధార్మికబుద్ధియు సంక్రమించెను. ఈ రెంటి అద్భుతసమ్మిశ్రణము ఆమెజీవితమున కాన నగును.

శీలవతియు, ధర్మపరాయణయు అగు మేరీ హామిల్టటుకు మార్గరెట్టు ప్రథమ సంతానము. నిరపాయముగ శిశువు జన్మించినచో, ఆశిశువును దేవునికార్యమునకే సమర్పించుకొందునని మేరీ హామిల్టటు మ్రొక్కుకొనెను. జన్మించుటతోడనే, "ఈబిడ్డ లోకమునకు ఒకక్రొత్త వెలుగు తీసికొనివచ్చును" అని పెక్కురు పల్కిరి.

మార్గరెట్టుతండ్రి స్నేహితుడొకడు హిందూదేశమున క్రైస్తవమతప్రచారకుడుగ నుండి తిరిగివచ్చెను. అతడు బాలికయగు మార్గరెట్టును చూచినతోడనే ఇట్లు పల్కెను. "భారతదేశము ఈబిడ్డను ఒకదినము పిలిపించుకొనును."

మార్గరెట్టు కారణజన్మురాలు కావుననే, సర్వదా తాను జీవితములో ఒకమహత్తర కార్యము చేయవలసియున్న దని తలంచెడిది. క్రీ.శ. 1877 సం॥న మార్గరెట్టు పిత సామ్యుయల్నోబులు మరణించుటకుపూర్వము భార్యను పిలిచి ఇట్లు పల్కెను. "మార్గరెట్టు జీవితములో మహత్తరకార్యమునకై ఒక ఆహ్వానము రాగలదు — నీవు ఆమెకు అడ్డు తగులకుండుటయే కాక, సర్వవిధముల నీవు చేయూత నొసంగవలెను" అని ఆదేశించి కన్నులు మూసికొనెను. సామ్యుయల్నోబులు వచనములు అట్లే యథార్థములైనవి. వివేకానందస్వామి క్రీ.శ. 1896 జూను 7-వ తేదీన మార్గరెట్టుకు వ్రాసిన ఉత్తరమే ఆ ఆహ్వానము :— "................* సంగ్రహముగా చెప్పినచో — మానవులకు వారి దైవత్వమునుగూర్చి చాటుచు, జీవితమున అనుక్షణమును దానిని వ్యక్తీకరించు విధానమును బోధించుటయే నాఆదర్శము. లోకము మూఢవిశ్వాసబద్ధమైయున్నది. హింసితులను - అంతకంటె విశేషముగ - హింసకులను చూచి నేను జాలిపడుదును. అజ్ఞానమే దుఃఖహేతు వని నాకు విస్పష్టముగా గాన్పించుచున్నది........

* శ్రీ వివేకానంద లేఖావళి 2-వ భాగము.

మహాధీరులు, మహావీరులు, ఉత్తమోత్తములు నగువారు బహుజనహితార్థము, బహుజన సుఖార్థము, స్వార్థత్యాగము చేయవలసియుందురు. చిరంతనప్రేమ సానుభూతులతోఁగూడిన వందలకొలది బుద్ధులు ఆవశ్యకమై యున్నారు.

లోకమందలి మతధర్మములు ప్రాణవిరహితములై పరిహాసాస్పదములై యున్నవి. లోకమునకు కావలసినది శీలము. స్వార్థరహితులై యుజ్వలప్రేమపూరితులగు వ్యక్తులు లోకమునకు కావలసియున్నారు. ఇట్టిప్రేమతో కూడిన ప్రతిపదమును వజ్రాయుధము.

నమ్ముము, నామాట. -లోకము సంజ్జీవిత లూగించుశక్తి నీయందు అణగియున్నది.— ఇది మూఢవిశ్వాసము కాదు. నీవంటివారు ఇతరులును వెలువడుదు రని నానమ్మకము, నిశ్చయము. మనకు కావలసినవి సాహసవాక్కులు, సాహసోజ్జ్వలకార్యములు. ఓ మహాత్ములారా, లెండు, లెండు! లోకము దుఃఖానలసంతప్తమగుచున్నది. మీరింకను నిద్రపోగలరా?...''

నివేదిత క్రీ.శ. 1895 నవంబరు నెలలో ఒక ఆదివారము అపరాహ్ణమున, అసమాన సాహసవంతుడును, మహాపురుషుడును అగు శ్రీవివేకానందస్వామిని మొట్టమొదటిసారి, ఇంగ్లండులో దర్శించినది. ఆనాటినుండియే ఆమె ఈఅజ్ఞాతాహ్వానమునకై వేచియుండినది. కాలాంతరమున ఆమెయే ఇట్లు వ్రాసినది: ''.........ఆసమయమున స్వామిజీ లండను రాకున్న యెడల నాజీవితము నిరర్థకమైయుండియుండెడిది. ఎందుచేత ననగా నేను సర్వదా ఏదో ఒక పిలుపుకై ఆతురపడుచుంటిని. నాకు ఒకపిలుపు వచ్చు నని పలుమార్లు చెప్పబడియుండినది. అట్లే సత్యమైనది.''

ధర్మముపేరటను, మానవునిలో అంతర్నిహితమైన దేవత్వప్రకటనకును, పృథ్వియందలి నరనారీహితార్థమై స్వామిజీ పిలుపుకు, మార్గరెట్టు హృదయపూర్వకముగ అనుమోదించెను. ఆమె వ్యక్తిగతకష్టములను, విఘ్నబాధల నెల్లఒకవైపునకు త్రోసిపుచ్చి, త్యాగ, కరుణా, ప్రేమమూర్తియగు స్వామిజీవద్ద ఆత్మబలిదానము చేసికొన్నది. ఆమె ఏదినమున స్వామిజీకార్యమునకై జీవితమును ధారవోయ నిశ్చయించుకొనెనో, ఆదినము నుండియే ఆమె భారతదేశప్రయాణమునకై ఆతురపడజొచ్చెను. క్రీ.శ. 1897, జూలై 29-వ తేదీని స్వామిజీ వ్రాసిన ఉత్తరము చూచుకొని ఆమె హిందూదేశయాత్రసాగించెను. క్రీ.శ. 1897 జూలై 29-వ తేదీ లేఖ ''...... ''భారతదేశమునకు వచ్చి స్వయముగా విషయములను పరిశీలించుటకై నీవు నిశ్చయించుకొన్నట్లు... వద్దనుండి నిన్న నాకొక లేఖ వచ్చినది...

మనఃపూర్వకముగా చెప్పుచున్నాను — భారతదేశాభ్యుదయార్థము నీవు చేయవలయు కృషి కెంతయో సదవకాశము కల దని నా నమ్మకము. కావలసిన వ్యక్తి పురుషుడు కాదు, స్త్రీ; సింహబలసాహసాన్వితురాలగు స్త్రీ; ముఖ్యముగా, స్త్రీలే హిందూదేశాభ్యుదయార్థము కృషిచేయవలసియున్నది. హిందూదేశ మింకను మహాస్త్రీలను వెలువడచేయజాలదు, భారతమాత వారిని విదేశములనుండి కైకొని 'దత్తతచేసికొనవలసి యున్నది.' నీ విద్యాబుద్ధులు భావసంశుద్ధి, అఖండప్రేమానురాగములు, అన్నిటికంటెను నీమనస్తత్త్వము- ఇవన్నియు నిన్నిపుడు సరిగా మాకు కావలసినవ్యక్తి నొనరించుచున్నవి.

ఐనను చిక్కులు అనేకములు కలవు. ఇచ్చటి జనుల దుఃస్థితి, మూఢవిశ్వాసములు, దాస్యమును, ఇట్టి వని ఊహింపజాలవు. ఇక జాతివిషయకమగు విచిత్రభేదభావముతో కానిమ్ము, భయముచే కానిమ్ము, ద్వేషముచే కానిమ్ము, తెల్లవా రనిన ఏవగించుకొనుచు ఇచ్చట మసలు అనాగరిక స్త్రీపురుషుల నడుమ నీవు మనవలసియుందువు. దీనికి తోడు తెల్లవారు నిన్ను కేవల విపరీతవ్యక్తిగా తలపోయుచుందురు; నీ ప్రతిచలనమును అనుమానముతో పరిశీలించుచుందురు.

తరువాత ఇచ్చటి శీతోష్ణస్థితి ప్రచండము. పలుతావులలో మాశీతకాలము మీ వేసవిని పోలియుండును.

ఐరోపా దేశీయసౌఖ్యముగాని, సదుపాయముకాని, ఇచటి పట్టణములను దాటినచో మచ్చునకైనను గాన రాదు. వీనిని గణింపక కార్యాంగణమున ప్రవేశింప సాహసించితివా నీకు మా స్వాగతము, మనఃపూర్వక స్వాగతము, నేనో యనిన ఇచ్చట కాని మఱెచ్చట నైన కానిమ్ము అనామధేయుడను; కాని నా కేమాత్రము పరపతి అనునదియున్నను దానిని నీసేవకై వినియోగింతును.

ఈయుద్యమమున దిగుటకు ముందు నీవు బాగుగా ఆలోచింపవలయును............. మఱొక హెచ్చరిక – నీవు స్వశక్తిపైనే నిర్భర పడవలయును.— అనేకులతో తగుమాత్రము దూరముననే మైత్రికలిగియుండుట మేలు, స్వశక్తిపై నిర్భరపడువారి కంతయు సక్రమముగనే నడచును .....''

(సశేషము)

# తిరస్కృతరాజాశ్రయులు - మహోజ్జ్వల సారస్వత నిర్మాతలు :

# శ్రీమద్వేదాంత దేశికులు

విద్వాన్ శిరోమణి శ్రీ వాదారి శ్రీనివాసశర్మగారు

అన్నమయ్యకుఁ దర్వాత రాజాశ్రయమును నిరాకరించిన వాఙ్మయోపాసకులు శ్రీమద్వేదాంతదేశికులు. వైష్ణవసంప్రదాయమున నూతనమగు 'వడగల' సంప్రదాయమును నెలకొల్పిన మనీషి యితఁడు. శ్రీ వేదాంతదేశికులు రామానుజులకుఁ దరువాత రామానుజు లంతటివారు.

వేదాంతదేశికుల వాస్తవనామధేయము వేంకటనాథుఁడు. వారితండ్రి అనంతసూరి; తల్లి తోతారమ్మ. అనంతసూరి కాంచీనగరమున వేలాది శిష్యులకు విద్యాదానము చేసిన మహనీయుఁడు. కాంచీనగర సమీపమునఁ గల 'తూప్పుల్' అను గ్రామము వారి జన్మస్థానము.

కాంచీనగర మానాడు సరస్వతీవిహార భూమి. సమస్తశాస్త్ర వ్యాసంగముల కాధార భూమి. ఆయూర నెన్నియో పాఠశాలలు నెల కొని దేశదేశములనుండి యేతెంచు జిజ్ఞాసువు లకు విద్యాదానము చేయుచుండెను. వేంకట నాథుఁడు కాంచీనగరమందు తన మేనమామ యగు ఆత్రేయనారాయణులకడ విద్యాభ్యా సము సాగించెను. మాధవ విద్యారణ్యులు వారి సహాధ్యాయులు.

వేదాంతదేశికుడు చిన్నతనమునుండియే మహాప్రతిభాశాలియని పేరు గాంచెను. శాస్త్ర రహస్యము లెల్లవేళల నాతని కొననాలుకపై తాండవమాడుచుండును. సరస్వతి యాతఁడు పిలిచినపు డెల్ల 'ఓ' యని వచ్చును. ఇరువ దేండ్ల ప్రాయమునకే దేశికుల కీర్తి విద్వాం సులకెల్ల శిరోధార్య మయ్యెను.

వేదాంతదేశికుడు వేదవేదాంగపారంగ తుఁడు. సాహిత్యవిశారదుఁడు. కవితాకళా నిధి. ఈతని కవిత్వపటుత్వమహత్త్వములఁ గూర్చి విని ఎందఱో విద్వత్తల్లజు లితనితో వాదింపవచ్చి యోడిపోయెడివారు. వారి యెదుట నిలబడి వాదముసేయు గుండెధైర్య ముగల పండితుఁ డాకాలమున భారతదేశ మున లేకపోయెను. కలమెత్తి కవిత సాగిం చుటయందును, వాక్యార్థములు చేసి తర్క పటిమతోఁ బ్రతివాదుల నోడించుటయందును దేశికులకు దేశికులే సాటి. దేశికు లంతటి యుద్దండ పండిత సార్వభౌములు కావుననే విద్వాంసు లీయన కేకగ్రీవముగా 'కవితార్కిక సింహు' లని బిరుద మిచ్చిరి.

వేదాంతదేశికులు వరదరాజ భక్తులు. వా రెంతటి భక్తులో అంతటి విరక్తులుగూడ. శ్రీ రంగములోను, కాంచీనగరమందలి హస్తి శైలాగ్రమందును వెలసిన రంగనాథుఁడే— వరదరాజస్వామియే — వారికి రాజాధిరాజు. తత్పాదోపజీవియై జీవితమును గడపుటయే ఆ యన జీవితపరమోద్దేశ్యము. ధర్మాగ్రగణ్యులకు సాధారణముగా నుండెడు దారిద్ర్యము వారిని గూడ వదలిపెట్టలేదు. వారు దారిద్ర్యమున కేనాడును వగచి యెఱుఁగరు. జీవితపరమార్థ మును గ్రహించిన భక్తశిరోమణులగు శ్రీదేశి కులు భగవదాశ్రయమును వదలి మఱియొకరిని ఆశ్రయింపఁ దలపలేదు.

విజయనగర సామ్రాజ్య నిర్మాతలగు శ్రీ మాధవ విద్యారణ్యులు వేదాంతదేశికులకు సహాధ్యాయి. మహాతపస్వులుకూడ. వారు సన్న్యాసమును గ్రహించి తమతపశ్శక్తిచేతను, పాండిత్యబలముచేతను విజయనగరరాజులకుఁ గులగురువులైరి. వారు వేదాంత దేశికుల వాద నైపుణ్యమును, కవితాసంపదను చక్కఁగ నెఱిఁగియుండిరి. కావున వేదాంతదేశికులకు విజయనగరరాజుల దర్శనము చేయించి, వారి కడ ఆస్థానపండితపదవి నిప్పించి వారి దారి ద్ర్యమును రూపుమాపఁ దలచినారు. విద్యా నగరమునకు రావలసినదిగా శిష్యుల మూల మున వేదాంతదేశికులకు వర్తమాన మంపిరి. విద్యారణ్యుల సందేశము గల తాళపత్రమును జూచి వేదాంతదేశికులు నవ్వుకొన్నారు కాని విద్యారణ్యులయందు వారికి గౌరవముమెండు. అందుచే నొకకమ్మను శ్లోకబద్ధముగ వ్రాసి శిష్యులచేతి కిచ్చిరి. ఆ కమ్మయం దైదు శ్లోకము లుండెను. వాటికి 'వైరాగ్యపంచక' మని పేరు. వైష్ణవులలో వైరాగ్యపంచకము నకు మంచి ప్రచారము కలదు. అందలి భావ ములు మిగుల గంభీరములైనవి. వాని భావ మిది—

''ఈ విశాలవిశ్వము అనంతమైనది. అందులో ఎన్నో గోళములుగలవు. వానిలో భూగోళ మేపాటిది? దానిలో నొకమూలమాత్రమే రాజులు పాలింతురు. ఆ కొద్దిపాటియధికారమునకే క్రిందుమీదులుగానక వ్యవహరించుచు రాజులు పొగరుబోతులై యుందురు. ఆ రాజులొకవేళ దానమిచ్చినను ఎంతమాత్ర మిత్తురు? నేను నమ్మిన హస్తిశైలాధిపతి సకలచరాచర ప్రపంచసార్వభౌముఁడు. అతనికిఁ బూర్వము కుచేలుఁడు పిడికెడటుకుల నీయఁగా నంతమాత్రమునకే తృప్తిపడి నాడైవమతని కష్టైశ్వర్యముల నొసఁగి కుబేరుని గావించెను. నేను నమ్మిన దైవము వరదరాజస్వామి యౌదార్యమట్టిది. నాకుఁ బిత్రార్జితమేమియు లేదు. నేనేమియు సంపాదింపలేదు. కాని నాకేమికొదువ? మా తాత ముత్తాతలనాటి యాస్తి వరదరాజస్వామి హస్తిశైలమం దధిష్ఠించి యున్నాడు. అదియే నాకుఁ జాలును. నాకు రాజాశ్రయమక్కఱలే'' దనెను.

శిష్యు లీజాబును విద్యారణ్యులకు జూపిరి. గుణగ్రాహులగు విద్యారణ్యు లీజవాబు విని ఎంతయో హర్షించినారు. ఇట్లు శ్రీమద్వేదాంతదేశికులు కలసివచ్చిన రాజాశ్రయమును చేతులార వదలుకొన్నారు.

కవితాసంపత్తిలో శ్రీమద్వేదాంతదేశికులు కవికులగురువగు కాళిదాసునకుఁ దర్వాత అంతవారుగాఁ బేర్కొనఁదగిన కవిపుంగవులు. కాళిదాసు రఘువంశమహాకావ్యమునకు దీటుగా యాదవాభ్యుదయకావ్యమును, మేఘసందేశమునకుసమముగా హంససందేశమును, శ్రీకృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకుఁ బ్రతిద్వంద్విగా సంకల్పసూర్యోదయమును రచియించుటయేగాక పాదుకాసహస్రము, తత్త్వముక్తాకలాపము, న్యాయసిద్ధాంజనము, రహస్యత్రయసారము మొదలగు శాస్త్రగ్రంథములనుగూడ రచించెను. విశిష్టాద్వైతమతవ్యాప్తికిగాను వీరు పెక్కు గ్రంథములనురచియించుటచే వేదాంతదేశికులనియు, వేదాంతాచార్యులనియుఁ బేరు పొందిరి.

సర్వజ్ఞసింహభూపాలుని ప్రోత్సాహముచే నితఁడు 'సుభాషితనీవి' యను నీతిశాస్త్రగ్రంథమునుగూడ రచియించెను. అందులో నీతని లౌకికప్రతిభ యుట్టిపడుచుండును.

శాస్త్రములలో నుద్దండుఁడై, కవితలో నప్రతిమానుఁడైన నితనితో వాదింప డిండిమకవిసార్వభౌముఁడు రాగా నతనిని వినయమున నెదిరించినాడు. ఎంతటివానినైనను యుక్తిప్రయుక్తులతో నిలువునఁ గూల్చివేయఁగలశక్తి వేదాంతదేశికుల కప్రయత్నముగవచ్చినది.

డిండిముఁడు గొప్ప కవీశ్వరుఁడు. శాస్త్రవ్యాసంగపారీణుఁడు. పెక్కు రాజాస్థానములలో నాతని నోడింపఁగలవా రెవ్వరును లేకపోయిరి. సాటిలేని విజయగర్వమునఁ బొంగుచు వచ్చి శ్రీరంగముననున్న వేదాంతదేశికులతో వాదమునకుఁ దలపడెను. డిండిమకవి వేదాంతదేశికులను లెక్కింపక—

సర్వాణ్యరణ్యా న్యతివిషమలతా
గుల్మదుర్గాణి సద్యః
ప్రాప్తం మాం ఫక్కణాన్తం బత భషకతతి
ర్బుక్కనైర్ధిక్కరోతి
లజ్జన్తే హన్త మేనాం మదకరటిఘటా
కుంభపీఠీనిపాట

క్రీడాధౌరేయధారా మమ ఖలు నఖరాః
కిం కరోమి? క్వ యామి? ॥
ప్రాజ్ఞానామేవ రాజ్ఞాం సదసి న సహతే
జల్ప మల్పేతరేషాం
క్షుద్రేష్వాక్షేపముద్రాం న ఖలు గణయతే
డిండిమ స్సార్వభౌమః
భాకుర్వ ద్భేకకుక్షింభరిషు భయభర
భ్రాన్త భోగీన్ద్ర సుభ్రూ
భ్రూణభ్రంశీ కిమంభః ఫణిషు పతగరాట్
సంభ్రమీ బంభ్రమీతి ॥

అని ఆక్షేపించినారు. కాని వేదాంతదేశికులు దాని కిట్లు సమాధానము చెప్పినారు—

స్పర్ధన్తాం సహజం ను కుఞ్జరతయా
దిక్కుఞ్జరైః కుఞ్జరా
గ్రామ్యా వా వనవాసినో మదజల
ప్రస్విన్న గండస్థలాః
ఆః కాలస్య విపర్యయం శ్రుణు సఖే
ప్రాచీన పల్లీమలా
స్వాదస్నిగ్ధ కపోలభిత్తి రధమః
కాలోఽపి సంస్పర్ధతే ॥

ఇరువురకు **వాదోపవాదములు** సాగినవి. డిండిముఁడిచ్చిన వేయి జటిలసమస్యలకు దేశికులవలీలగా సమాధాన మొసఁగినారు. కొంచెమైనను తొణకలేదు. కవిత్వమం దిరువురును పోటీపడిరి. శ్రీరంగనాథుల పాదుకలపై ఒక రాత్రిలోపల వేయిపద్యములు వ్రాయవలె నని విషయము నిర్ణయ మయ్యెను. భగవంతుని చెప్పులపై వేయి భావములు చెప్పుట యన్న సామాన్యవిషయముగాదు. అందును ఒక రాత్రిలోపల నది యెట్లు వీలగును? దేశికు లందులకును సిద్ధమైనారు. దీనితో దేశికుల ఆటఁ గట్టవచ్చునని నిశ్చయించి డిండిముఁడు రాత్రియంతయుఁ గూర్చుండి యాఱువందల శ్లోకములను మాత్రమే తయారుచేయఁ గలిగినాడు. వేదాంతదేశికులు రాత్రియంతయు నేమియు నెఱుఁగనివానివలె నిదురించిరి. వారి శిష్యుల యాందోళన అంతకంత కెక్కువ కాఁజొచ్చెను. తెల్లవారుసరి కందఱును శ్రీరంగనాథుల దేవళమునఁ గొలువు చేరిరి. దేశికులు వేకువన లేచి కాల్యకృత్యములు యథావిధిగ నిర్వర్తించి హయగ్రీవమంత్రమును జపించి సభకు వచ్చి కూర్చుండినారు. నిమీలిత నేత్రుఁడై శిష్యులనుగాంచి 'వ్రాసికొం' డని నాడు. నోటినుండి యప్రయత్నముగా ననర్గళ ధారతో శ్లోకము లొకటివెంబడి ఒకటిగాఁ బదులు వందలు నిర్గమించుచున్నవి. సాయంకాల మగుసరికి వేయి శ్లోకములు పూర్తి యయ్యెను. డిండిమ కవీంద్రుఁడు ఆఱువంద లకుఁ బైన చెప్పలేకపోయెను. ఆఱువందలు మాత్రమే చెప్పఁగలిగెను. అటుపై నతని కేమియు గోచరింపలేదు.

కవితాస్పర్ధయందు డిండిమకవి యోడిపోయి నట్లును, శ్రీమద్వేదాంతదేశికులు జయించి నట్లును ప్రకటింపఁబడెను. డిండిముఁ డవమాన భారముచే నవనతముఖుఁడై కన్నీరు పెట్టుటను జూచి వేదాంతదేశికులు ఆఱువందలశ్లోకముల లోని భావగరిమను మెచ్చుకొని, తన సహస్ర శ్లోకముల కన్నను డిండిముని శ్లోకములు రసవంతము లనియు, సర్వశ్రేష్ఠము లనియుఁబలికి అతని నూరడించినారు. వేదాంతదేశికుల వినయౌదార్యము లట్టివి. డిండిముఁడు శ్రీమద్వేదాంతదేశికులను బొగడుచు—

ఘోటీ ఘాటీ కఠోర స్ఫుట వికటకథా
టోప వాచాట కోటీ
కోటీ రాఘాట పేటీ పుటఘటిత మణీ
సంఘ సంఘట్టితాఙ్ఘ్రిః
కుర్వన్ స గర్వం జయతి కవిత తేః
సర్వతంత్ర స్వతంత్రః

వేదాంతాచార్యవర్యో విఘటిత జడధీ
సఙ్కటో వేఙ్కటేశః ॥

అన్నాడు వేదాంతదేశికుల కవిత్వము చాల ప్రౌఢ మయినది వారు తమ జీవితమున నూట యెన్మిది గ్రంథములు రచియించి గొప్ప సారస్వతమును మనకుఁ బ్రసాదించిరి.

# శ్రీరామకృష్ణపరమహంస విలాసము

మూలమ్ :
శ్రీశ్రీ చిద్ఘనానందగిరిస్వాములవారు

తాత్పర్యకాదంబిని :
శ్రీ శ్రీధరబాబు

(గతసంచిక తరువాయి)

106. ఆసీచ్ఛ్రీరామకృష్ణ స్స
భక్తిసాధన సిద్ధిమాన్ ।
శ్రీగురుః శఙ్కరాచార్యో
జన్మ నోభయసిద్ధిమాన్ ॥

శ్రీరామకృష్ణునకు భక్తిసాధనలో సిద్ధి అందినది. జగద్గురువులైన శంకరాచార్యుల వారు పుట్టుకతోనే భక్తిజ్ఞానములలో సిద్ధులైనారు.

107. మహాభక్త్యా తయా తుష్టా
దేవీ ప్రత్యక్ష మాగతా ।
రామకృష్ణే చ తత్ప్రాహ
నిష్కామ భక్తి సాగరమ్ ॥

అట్టి మహత్తరభక్తికి సంతుష్టురాలై దేవి ప్రత్యక్షమైనది. ఆ నిష్కామభక్తిసాగరునితో ఆమె ఇట్లనినది.

108. అర్ధ మన్న మ్మయా భుక్తం
రామకృష్ణ తదర్ధకమ్ ।
త్వయా నివేదిత మ్భుఙ్క్ష్వ
మోక్షలాభాయ మాశుచః ॥

'నివేదనలో సగ మన్నమును నేను స్వీకరించితిని : దుఃఖపడకుము. మోక్షప్రాప్తికై మిగిలినది నీ కుంచితిని'.

109. ప్రాప్తే కాలే తు వాసన్తే
నిష్పత్రో ఽశ్వత్థభూరుహః
యథా పల్లవితస్త్రైః స
ననన్ద పరముత్సుక

వసంతకాలము రాగానే ఆకులులేని అశ్వత్థ వృక్షము ఎట్లు చిగురుటాకులు తొడుగునో, అట్లే భగవతీదర్శనభాగ్యమునకు ఉత్సాహ సంభరితుడై రామకృష్ణుడు సంబరపడెను.

110. మహాశివా మహాదేవ్యాః
సుఖే గ త్వామ్బికాలయమ్ ।
అపసృత్య కవాటం స
దదర్శార్ధ న్నివేదితమ్ ॥

అతడు మహాదేవీ మందిరకవాటములు ఆనందముతో తెరవగనే, నివేదితములో సగము ఆరగింపబడి యుండుట కనిపించినది.

111. ఆనన్దతున్దిలో లాస్య
ఇుచ్ఛకార పులకోద్గమః ।
స భక్త్యా భక్షయామాస
దేవ్యుచ్ఛిష్టం సుధాత్మకమ్ ॥

పులకితగాత్రుడై ఆనందనృత్యము చేసి, భక్తితో అమృతమయమగు దేవీఉచ్ఛిష్టమును స్వీకరించినాడు.

112. ధన్యో భవామి మాత త్వ
దుచ్ఛిష్టభోజనా దహమ్ ।
మాతః స్త్వత్తః పర న్నైవ
న్న జానే పరమేశ్వరి ॥

'అమ్మా, నీవు భుజింపగా మిగిలిన ఈ నివేదనను స్వీకరించి ధన్యుడనైనాను. తల్లీ, పరమేశ్వరీ, నీకన్న పరమైన దైవమును నేనెఱుగను.

113. శాస్త్రాణి తారయేయు ర్యా
నుత్తమా నధికారిణః ।
శాస్త్ర ముచ్ఛిష్ట మే వాత్ర
మహర్షీణా మ్మహాత్మనామ్ ॥

శాస్త్రములు ఉత్తమాధికారులను తరింపజేయును. ఆశాస్త్రములుకూడ మహర్షుల, మహాత్ముల ఉచ్ఛిష్టములే కదా.

114. అభుఙ్జ మహాముచ్ఛిష్ట
మద్య చిన్మాతు రేవ తే ।
భవామి చిత్సుఖీ మాతః
కాలాతీతః సనాతనః ॥

కాలాతీత అనాదితత్త్వమగు, జ్ఞానస్వరూపిణివగు నీవు ఎంగిలిచేసి మిగిల్చిన ఆహారమునే నేను స్వీకరించి చిదానందుడ నైతిని.

115. జ్ఞాన మన్న మ్మ రోచ్ఛిష్ట
న్నాహ మ్భుఙ్జామి కాలికే ।
తావక మ్భక్తివై రాగ్య
పక్వ మ్భుఙ్జే దయామయీ ॥

కాళికా, పరానుభవరూపమగు శాస్త్రజ్ఞానమనెడు ఉచ్ఛిష్టమును నేను భుజింపను. దయామయీ, నేనుభుజించునది భక్తివైరాగ్య పక్వమైన అన్నము.

116. దేహాభిమాన విధ్వంస
ఙ్కృత్వా వృత్తివినాశనమ్ ।
యే సన్తో మోక్ష మిచ్ఛన్తో
యాన్తి భక్తిపథా సుఖమ్ ॥

దేహాభిమాన విధ్వంసము చేసి, చిత్తవృత్తులను నిరోధించి, మోక్షమిచ్ఛించు సజ్జనులు సుఖమయమగు భక్తిమార్గమును అవలంబింతురు.

117. నిర్మానమోహా స్తన్మార్గ
మ్మానమోహా న యాన్తి యే ।
జ్ఞానం హి కేవలం సాధ్య
మ్భక్తి ర్ద్వాభ్యా సమఞ్చిత ॥

భక్తిపథము మానమోహావిరహితము. అభిమానమోహాసంయుతులు దానిపై నడువ

జాలరు. జ్ఞానము కేవలము సాధ్యభక్తి. భక్తి సాధనసాధ్యముల రెంటియందును ఇమిడి యుండును.

118. భర్తార న్ధ్యాయమానా యా
యథా సాధ్వీ నిరన్తరమ్।
సిద్ధా భవతు తద్రూపే
రామకృష్ణో ఽప్యభూ త్తథా॥

సాధ్వి సర్వకాలసర్వావస్థలలోను తనవిభుని ధ్యానములో ఎట్లు నిమగ్నురాలై యుండునో, అట్లే రామకృష్ణుడుకూడ జగన్మాతృభక్తిలో సిద్ధుడైనాడు.

119. తథాపి సగుణబ్రహ్మ
బ్రహ్మానన్ద నిమగ్నకః।
నిర్వికల్ప సుఖాయైవ
ప్రీణాతి స్మ మహేశ్వరీమ్॥

అట్లు సగుణబ్రహ్మానందములో నతడు మునిగినప్పటికిని, నిర్వికల్పసుఖమునే అతడాస్వాదింపగోరెను.

120. పాతఞ్జలే నిరుక్తం య
త్సమ్ప్రజ్ఞాత సమాధిజమ్।
బ్రహ్మానన్ద మ్పరమ్ప్రాప
రామకృష్ణో ఽతిపావనః॥

పతంజలి యోగశాస్త్రమున చెప్పబడిన సంప్రజ్ఞాత సమాధిగత బ్రహ్మానందమును పావనచరితుడగు రామకృష్ణుడు పొందినాడు.

121. దక్షిణా కాళికామ్బయా
ధ్యానశ్లోకే యదీరితమ్।
తద్రూప న్తస్య భక్తస్య
భ్రూమధ్యే పశ్యతి స్మ సః॥

ఆభక్తుడు దక్షిణేశ్వరీ స్తవములలో అభివర్ణించిన రూపమునే భ్రూమధ్యమునవిలిపినాడు.

122. నిద్రాలు రివ సస్వామీ
సర్వదా నిర్వికల్పకమ్।
భుఞ్జతి స్మ సుఖం రామే
యథా సీతా పతివ్రతా॥

నిద్రాగతుడై నిద్రాసుఖము ననుభవించువానివలె, ఎల్లప్పుడు సీతాపతివ్రత అనుభవించిన రామమూర్తిభావనానందమువలె సంకల్పవికల్పరహితమగు సుఖము నత డనుభవించెను.

123. ద్వైతానన్దే విరక్తో ఽభూ
దద్వైత సుఖవాఞ్ఛయా
తదా కశ్చి న్మహాయోగీ
తత్రాగత్య దదర్శ తమ్॥

అద్వైతస్థితి దృష్టిలో నుండుటవల ద్వైతానందముపై నతనికి విరక్తి జనించినది.

124. యో యయా హఠయోగేన
నిర్వికల్పం సుఖమ్ చిరమ్।
స యోగీ రామకృష్ణాయ
చోపదేష్టా భవ త్తతః॥

షట్కర్మలతోకూడిన హఠయోగ సాధనల సిద్ధి గాంచి, చిరకాలము నిర్వికల్పానుభూతిపొందిన ఒకానొకయోగి రామకృష్ణునకు ఈవిషయమున ఉపదేశకు డయ్యెను.

# వార్తలు, విశేషాలు

## శ్రీవివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు

### రామేశ్వరాలయము

సుప్రసిద్ధమైన ఈదేవాలయమును శ్రీవివేకానందస్వామి రెండుపర్యాయములు దర్శించినారు. అజ్ఞాత పరివ్రాజకసన్న్యాసిగా తిరిగి తిరిగి అలిగిపోయిన కాళ్లతో బడలికతో 1892 లో ఒకసారిదర్శించారు. రెండవసారి దర్శించినది 1897 జనవరి 27-వ తేదీ. రెండవసారి స్వామిజీ రామనాథపురమహారాజుగారగు కీర్తిశేషులు భాస్కరసేతుపతిగారికి అతిథిగా వచ్చినారు. రామమందిరమను పేరుగల తీర్థసంవాసుల విడిదిలో బసచేసినారు. ఆలయమున సమావేశమైన సభలో స్వామిజీ ఉపన్యసించినారు. ఆస్మృతిని కొనియాడుటకై ఆదేవస్థానాధికారులు 1963 సెప్టెంబరు 28-వ తేదీనాడు స్వామిజీ శతతమజయంతిమహోత్సవము జరిపినారు. కార్యక్రమములోని ప్రత్యేకాంశములు. (1) రామనాథస్వామి గుడిలో ప్రత్యేకపూజ (2) ప్రత్యేకమైన పందిరిలో శ్రీరామకృష్ణసంస్థీయులైన స్వాములు శ్రీరామకృష్ణునకు కావించిన ఆరాధనము. (3) గుడిలో శ్రీవివేకానందస్వామి కావించిన ఉపన్యాసమును ఆంగ్లమునను తమిళమునను స్వామిజీ స్వదస్తూరిని శిలలపై చెక్కించి వానిని భారతరాష్ట్రపతి డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారు ఆవిష్కరించుట (స్వామిజీ ఉపన్యసించినచోటనే ఈశాసనములు అమర్పబడియున్నవి). (4) డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి అధ్యక్షమున పౌరమహాసభ. (5) స్వామి వివేకానందశతవార్షికోత్సవ సంచికను మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ ఎమ్. భక్తవత్సలంగారు ఆవిష్కరించుట. (6)దరిద్రనారాయణసంతర్పణము. (7) మదరాసుశ్రీరామకృష్ణమిషను హైస్కూలు ఉపాధ్యాయులైన శ్రీమంత్రంగారు ఏర్పఱచిన స్వామిజీ చిత్రపటముల ఉపదేశోదాహరణముల ప్రదర్శనము. (8) శ్రీరామకృష్ణజీవితచరిత్రచలనచిత్రప్రదర్శనము. శ్రీభాస్కరసేతుపతి వంశీయులును గుడిధర్మకర్తల పరిషత్తుకు అధ్యక్షులును అగు శ్రీషణ్ముఖరాజేశ్వరసేతుపతిగారు ఈఉత్సవములందు అత్యంత శ్రద్ధోత్సాహములతో పాల్గొనిరి. ముఖ్యమంత్రి పూజ్యశ్రీ ఎమ్. భక్తవత్సలంగారును శ్రీ సర్వజ్ఞానందస్వాములును ఉపన్యాసములు కావించిరి. ఆసదస్సునకు విచ్చేసిన ప్రముఖులలో మద్రాసు గవర్నరు శ్రీ విష్ణురామ్ మేధిగారొకరు.



# గ్రంథపరిచయం

[సమీక్షకు గ్రంథాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపవలె అని మనవి]

## నవవిధ భక్తులు

కర్త : శ్రీకుందుర్తి వేంకటనరసయ్య. ప్రకాశకులు : శ్రీరామశరణ మందిరము, బుద్ధాం, నామప్రయాగ. (వయా) చందోలు, గుంటూరు జిల్లా. ఖరీదు : 2-50 న. పై.

సామాన్యంగా బజారులోపడిన గొప్ప మాటలలో – 'భక్తి, భక్తుఁడు' అనునవి వొద్దవి. పుణ్యభూమియైన భారతవర్షంలో, మన పూర్వులు కష్టపడి, తదేకతానులై సాధించినదీ, మనకు ఆస్తిగానిచ్చినదీ అనల్పము. మనము వాటిని బజారుమాటలగుంపులో చేర్చి, ఉప్పు పత్రికిఁగూడ వాటిని వాడి, తేలికపరచుకొనుచున్నాము.

అహంకారమమకారములను వీడి, ధ్యాననిష్ఠులైన, వారుమునులు తత్త్వమునుచూచారు. ''తే ధ్యానయోగానుగతా అపశ్యన్'' అట్టి మహనీయులు, జీవితపరిణతిని, జీవితపరమార్థమును - వివరముగా చెప్పారు. జీవితపరమార్థమైన అమృతత్వము (దేహంతో సంబంధం తొలఁగడంకాదు, చివరిచావు, అనఁగా, తిరిగి శేషుతై లంపవలె మహాజ్యోతిలో కలిసిపోవడం) ను పొందుటకు—చెప్పిన సాధనజ్ఞానం. జ్ఞానాదేవతుకై వల్యం.

ఆ జ్ఞానం అంత తేలికగా వచ్చేదికాదు. 'న కర్మణా న ప్రజయాధనేన, త్యాగేనైకే అమృతత్వం' అని శ్రుతులు. జ్ఞానసాధనకైన మార్గాలలో భక్తిగొప్పది. భక్తిర్జ్ఞానాయకల్పతే. ఆభక్తి అన్నదికూడా సర్వాన్నీ 'నేతినేతి'గా త్రోసిపుచ్చి, దైవాన్ని ప్రేమించడం 'సా పరానురక్తి రీశ్వరే'.

ఇట్టి మహత్తుగల విషయాన్ని తెలిసీ తెలియక, బజారున పడవేసుకోడం అంత గొప్పది కాదు.

శ్రద్ధాసక్తులతో గౌరవప్రపత్తులతో ఉచ్చరింపతగిన మాటలలోనిది భక్తి.

అట్టి భక్తిని, శాస్త్రీయంగా తఱచిచూచిన పెద్దలు, భక్తి [illegible] చ్చి చెప్పారు.

శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనములను పేర్లుగల తొమ్మిది విభాగాలు. వీటిని—సొంతముగా తెలిసి, సొంతముచేసికొనినవారి ఉపదేశాలు ఈ నవవిధభక్తులు అను గ్రంథం.

శ్రీమద్రామాయణ, భారత, భాగవతాలు, విష్ణు, స్కాందాది పురాణాలు, రమేశచంద్రదత్తు, శ్రీవివేకానందస్వామి, మున్నగు మహనీయుల ప్రవచనాలు, ఇల్లా ఎన్నో సేకరించి శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్యగారు ఈగ్రంథాన్ని రచించారు. ఈగ్రంథంలో విషయఔదార్యంతోపాటు, వివరణ ఔదార్యంకూడా సమృద్ధిగా ఉన్నది. తేట

తెల్లంగా ఉన్న ఎన్నో విషయాలు ఉపనిషత్తుల వంటివి తెలిసి మైమఱచి, తెలిసి వర్జించి, తెలిసి ప్రేమించి, తెలిసి తరించదలంచుకొన్న వారికి, త్రోవ ఎటూ అని తటపటలాడు వారికి ఈగ్రంథం—ఎంతైనా ఉపయోగించ గలది.

## శ్రీమద్భగవద్గీత

వ్యాఖ్యాత : శ్రీ ఈశ్వరసత్యనారాయణ శర్మ. మూల్యం : రెండు రూపాయలు. ప్రకాశకులు : సాధనగ్రంథమండలి, తెనాలి.

శ్రీమహాభారతమునుండి ఏనాడు శ్రీమద్భగవద్గీత వేఱుపడినదో యెఱుఁగ లేముకాని, గీత మహత్త్వ నానాటికి వివృతమగుచునే యున్నది. చీకిలి మాకిలిగానున్న మనస్సులకు సిద్ధౌషధమువలె పని చేయుచునేయున్నది.

సాధకులు, సాధనలో పై పై అంతస్థులకు హృదయంచేరినవారు—గీతను వ్యాఖ్యానించుచునేయున్నారు. ఇంకను వ్యాఖ్యానిస్తారు. సుందరతమమైన విశ్వమువలె గీతయును సుందరతమము, దివ్యము. భగవద్గీత బోధించినదేమిటి? అర్జునునకు తఱువాత యెందఱు దీనివల్ల లబ్ధిం గాంచినారు అనునవి వెఱ్ఱిప్రశ్నలు. త్రికరణశుద్ధిగా మననముచేయువారలు గీతలవలన లబ్ధినందినటుల తెలియఁజెప్పవలసినంతస్థితిలో మన దేశము లేదు. అట్టి దౌర్భాగ్యస్థితి మన భారతవర్షమునకు రాదు. రాఁగూడదు కూడ.

శ్రీ ఈశ్వరసత్యనారాయణశర్మగారు, శ్రీ కాకుళవాసి, శ్రీమాతకు ప్రియపుత్రులు. శ్రీ విద్యాపూర్ణ దీక్షితులే కాక, విద్వాంసులు, విచక్షణులు, అనేకులకు మంత్రదీక్ష నిచ్చిన మహనీయులు. 'తాపత్రయాగ్నిసంతప్తసమాహ్లాదనచంద్రిక, బిసతంతు తనీయసి, భవార్ణవ్యకుతారిక' శ్రీచరణములను నమ్మికొల్చినవారు. తెలిసికొనవలసినది తెలిసి, ''యేన విజ్ఞాతేన సర్వం విజ్ఞాతం భవతి'' అన్న దానికి ఉదాహరణప్రాయులు అవుతూంటారు. శ్రీ శర్మగారు, శ్రీమద్భగవద్గీత నవమాధ్యాయము—గీతాసారము, అట్టిదానిని వ్యాఖ్యానించారు. ఈవ్యాఖ్యానంలో ఉపనిషదర్థాలు, యోగరహస్యాలు, లోకరీతులలోని సంగతులు అనుభవాలు గ్రథనంచేశారు. గొప్పసని.

'కోఽహం' విచారణ ప్రారంభం అందఱికీ కాదు. అయినా ఓపళాన మనస్సు నిలవదు. నిలిచినా విఘ్నాలు అనంతం. 'క్షురస్యధారా నిశితా దురత్యయా, దుర్గంపథః' కాని, ఇన్నిటికి నోర్చి సాధనకు పూనుకొని, ఎంత, ఏకాస్త సాధించినా, 'సోహం'గా తయారుకావడానికి, అంటే చిలిపిసుఖాలుకాని ఆనందాన్ని పొందడానికి, చిట్టచివరకు ఆఆనందమే తాను కావడానికి ఉన్న వీలును ఈగ్రంథం సుబోధం చేస్తుంది. తమశిష్యులకు చెప్పే శర్మగారు, శిష్యులుకానివారలకుగూడా, లొల్ల లక్ష్మీధరుడు సౌందర్యలహరీ వ్యాఖ్యానంలో చెప్పిన తీరున—ఎన్నెన్నో పరమరహస్యాలను విప్పి చెప్పారు. విలువఅయిన గ్రంథమిది.

-శ్రీ నిత్యానంద

# శ్రీ వివేకానందస్వామి శతతమజయంతిమహోత్సవములు, మద్రాసు

## విరాళములకై విన్నపము

1963 జనవరిలో శతతమజయంతిమహోత్సవములకు యథావిధిగా అంకురార్పణము చేయబడినదని యెల్ల రెఱిగిన విషయమే. అప్పటి నుండి ఆమహోత్సవములు భారత దేశమందలి వివిధప్రాంతములలోనే గాక విదేశములందును జరుగుచున్నవి. మద్రాసుకు స్వామిజీతో గల సంబంధము చాలసన్నిహితము. కాబట్టి వారిశతతమజయంతి మహోత్సవములను యథోచిత వైభవముతో 1964 జనవరి 16-వ తేదీనుండి 20-వ తేదీవఱకు జరుపవలెనని తీర్మానింపబడినది.

భారతరాష్ట్రపతి డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి ఆదరమునను డాక్టరు సి. పి. రామస్వామిఅయ్యరుగారి అధ్యక్ష్యమునను సెంటనరీకమిటీవారు విభవోత్తరమైన కార్యప్రణాళికను నిర్ణయించిరి. ప్రణాళికలోని అన్నిఅంశములు పూర్తియగుటకు దాదాపు పదిలక్షలరూపాయలు పట్టును. ప్రణాళికలో చేరిన బాలికలహైస్కూలు పుష్కలమైనగ్రంథాలయము, శిలావిగ్రహప్రతిష్ఠ, పత్రికాపఠనాలయము, శిశుకేంద్రము, (చిల్డ్రెన్‌స్కార్నరు) ఉపన్యాసకూటము, తమిళమందును తెలుగునందును శ్రీవివేకానందస్వాముల సంపూర్ణగ్రంథావళిని ప్రకటించుట—మున్నగు అంశములు ఆచంద్రార్కము నిలుచునవి, పెక్కేండ్లపాటు ప్రజల కుపయోగపడునవి.

కేంద్ర — మద్రాస్ — ఆంధ్రప్రదేశప్రభుత్వములవారును కొందఱు మిత్రమహాశయులును దయతో ఔదార్యముతో విరాళము లిచ్చిరి. కావుననే ప్రణాళికలో అధికభాగమును ఇంచుమించు పూర్తిచేయగలిగితిమి. ప్రణాళికలోని తక్కిన అంశములు నిర్వహించుటకును ఉత్సవములను అర్హరీతి జరుపుటకును ఇంకను రెండులక్షల రూపాయలు కావలసియున్నది.

కాబట్టి దయతో ధారాళముగ విరాళములిచ్చి శ్రీవివేకానందస్వాములు కలిపిన మానవసేవాలక్ష్యమునకు తోడ్పడ గాంచిన ధన్యతకు పాత్రు లగుదురుగాత మని శ్రీవివేకానందస్వాముల భక్తుల కందఱికీ విజ్ఞాపించుచున్నాము.

విరాళములకు వరుమానపన్ను లేదు. ''రామకృష్ణమిషను, స్వామివివేకానంద సెంటినరీ, C/o శ్రీరామకృష్ణమఠము, మద్రాస్-4 (ఇండియా) అను విలాసమునకు ధన విరాళములను పంప ప్రార్థన.

శుద్ధసత్త్వానందస్వామి,

2-9-1963 సెక్రటరీ, స్వామివివేకానంద సెంటినరీ కమిటీ,

# SWAMI VIVEKANANDA CENTENARY CELEBRATIONS, MADRAS

## PROGRAMME from 10th to 26th January, 1964

| | | |
|---|---|---|
| **10th FRIDAY** | 8 to 10 a.m. | Special Puja and Bhajan |
| | 6 p.m. | Opening the Exhibition by His Excellency the Governor of Madras. *President*: Dr. A. L. Mudaliar. |
| **11th SATURDAY** | 5-30 p.m. | Declaring open the Vivekananda Centenary Building and Inauguration of the Inter-Religious Conference by Srimat Swami Madhavanandaji, President, R.K. Math & Mission. *President*: Dr. C. P. Ramaswami Aiyar. |
| | 7 to 9 p.m. | Harikatha by Sri Balakrishna Sastrigal "Vivekananda Vijayam" |
| **12th SUNDAY** | 9 to 10 a.m. | Parayana of the Life and Complete Works of Swami Vivekananda. |
| | 3 to 5 p.m. | Children's Day: Talks, Drama, Recitation, Physical Feats, etc. |
| | 5-30 to 8 p.m. | Release of Complete Works of Swami Vivekananda in Tamil and Telugu by Dr. C. P. Ramaswami Aiyar. Inter-Religious Conference. *President*: Dr. C. P. Ramaswami Aiyar. *Speakers*: 1. On Zoroastrianism—Sri Dastoor N. D. Minochecba Homiji, M.A., Bombay. 2. On Jainism—Prof. S. A. Jain, M.A., L.T., Author of 'Reality', Madurai. 3. On Christianity—Rev. Dr. Anthony Elenjimittam, Editor, *Basic Education*, Bombay. |
| | 8 to 9 p.m. | Scenes from Chicago Parliament. By Boys of R K. Mission School. |
| **13th MONDAY** | 8 a.m. to Noon | Rudra Yagam. |
| | 5-30 to 8 p.m. | Release of "Swami Vivekananda's Life" in Tamil by Sri C. Rajagopalachari. Inter-Religious Conference. *President*: Sri C. Rajagopalachari. *Speakers*: 1. On Buddhism—Rev. Ananda Kausalyan, Ceylon University. 2. On Islam—Dr. Bukhari, Principal, New College, Madras. 3. On Sikhism—Dr. Gopal Singh, M.P., New Delhi |
| **14th TUESDAY** | 9 to 11 a.m. | Giving fruits and sweets to T.B. and Leprosy patients in Hospitals. |
| | 5-30 to 8 p.m. | Inter-Religious Conference. *President*: Swami Prabhavanandaji (Head of the Ramakrishna-Vivekananda Centre, Hollywood). *Speakers*: 1. On Advaita—Dr. T. M. P. Mahadevan, M.A., Ph.D. 2. On Visishtadvaita—Sri Ramanuja Thathachariar of Kumbakonam. 3. On Dwaita Philosophy—Dr. P. Nagaraja Rao, M.A., D.LITT., Reader in Philosophy, Sri Venkateswara University. |
| **15th WEDNESDAY** | 5-30 to 8 p.m. | Inter--Religious Conference. *President*: Hon'ble Sri M. Bhaktavatsalam, Chief Minister, Madras. *Speakers*: 1. On Swami Vivekananda (in Sanskrit)—Sri T. L. Venkata rama Aiyar. 2. On Swami Vivekananda's Karma Yoga and Bhakti Yoga— 3. On Swami Vivekananda (with special reference to his Jnana and Raja Yogas)—Swami Ranganathanandaji. |
| | 8 to 8-30 p.m. | Fire Works in the P. S. High School Compound, Mylapore. |
| **16th THURSDAY** | 5 p.m. | Celebrations at the Madras University. *Speaker*: Swami Ranganathanandaji. |
| | 6-15 to 7-15 p.m. | Ramanam Bhajan. |
| | 7-15 to 8-30 p.m. | Talks on Swami Brahmanandaji Maharaj by Swami Prabhavanandaji of Ramakrishna-Vivekananda Centre, Hollywood, U.S.A. |
| **17th FRIDAY** | 6 to 8 p.m. | Women's Conference. *President*: *Speakers*: 1. On Swami Vivekananda—Swami Prabhavanandaji Maharaj. 2. On Andal—Sister R. S. Subbalakshmi (in Tamil). 3. On Sister Nivedita— 4. On Sri Rabaya—Mamooda Haja Shereef. |

| | | |
|---|---|---|
| **18th SATURDAY** | 11 to 11-30 a.m. | Essay and Oratorical Competition for College Students. |
| | 5-30 to 8 p.m. | Women's Conference.<br>*President* :<br>*Speakers* :<br>1. On Swami Vivekananda—Swami Ranganathanandaji.<br>2. On Sita—Smt. Vajreswari (in Tamil).<br>3. On Sri Sarada Devi—Pravrajika Sraddhaprana of Sri Sarada Math.<br>4. On St. Teresa—Miss G. Samuel, Principal, St. Christopher Training College for Women. |
| | to 9 p.m. | Kali Kirtan by Swamis of the Ramakrishna Order. |
| **19th SUNDAY** | 2 to 5 p.m. | Procession from Egmore Rly. Station to Vivekananda House (Ice House). Prime Minister will join the procession for some time. |
| | 5-30 to 7-30 p.m. | Unveiling of the statue of Swami Vivekananda at Marina by Shri Jawaharlal Nehru.<br>Release of Swami Vivekananda Centenary Souvenir by the Prime Minister.<br>Welcome by Hon'ble Sri M. Bhaktavatsalam, Chief Minister, Madras.<br>*Speeches* : Shri Nehru. Shri K. Kamraj. Swami Ranganathanandaji. |
| | 8 p.m. | Bhajana. |
| **20th MONDAY** | 5-30 to 8 p m | Students' Day — Swami Vivekananda's Idea on Education.<br>*President* :<br>*Speakers* :<br>1. Swami Ranganathanandaji. 2. Swami Lokeswaranandaji.<br>3 Students' Representatives : (1) Kumari Mridula Rao, Final B.Sc., Queen Mary's College, Madras. (2) Sri P. S. Sundaram, Final B.A., Vivekananda College, Mylapore. |
| **21st TUESDAY** | 7 to 9 p.m. | Music Performance : Sri Ariyakudi Ramanuja Iyengar & Party. |
| **22nd WEDNESDAY** | -do- | -do- Sri Madurai Mani Iyer & Party. |
| **23rd THURSDAY** | -do- | -do- Sri Ramarao Parsatwar of Bombay—Jaltarang. Sri Muraliswami of Bombay—Tabla. Sri Pavitra Kumar Acharya of Delhi—Bhajana. |
| **24th FRIDAY** | 8 to 10 a m. | Gita Homa—by Sri Anna & Party. |
| | 7 to 9 p.m. | Drama on Swami Vivekananda (in 5 languages) by Staff and Students of Vivekananda College. |
| **25th SATURDAY** | 3 to 5-30 p.m. | Sports Final. |
| | 6-30 to 8-30 p.m | Physical Feats by the famous athelet Prof. Bishnu Charan Ghosh & Party of Calcutta. |
| **26th SUNDAY** | 8 to 11 a.m. | Saptasati Homa (Chandi)—by Swamis of the Order. |
| | 12 Noon to 2 p.m. | Daridra Narayana Seva. |
| | 4-30 to 6-30 p.m. | Public Meeting on "Swami Vivekananda".<br>President : Dewan Bahadur Sri K. S. Ramaswami Sastriar.<br>*Speakers* :<br>1. On Swami Vivekananda's Influence on Modern Thought—Sri K. V. Jagannathan (in Tamil).<br>2. On Swami Vivekananda's Ideal of Service—Swami Hirenmoyanandaji.<br>3. On Swami Vivekananda's Contribution to Modern Resurgence of India—Sri K. Panchapagesa Iyer, M.A. |
| | 6-30 to 8-30 p.m. | Physical Feats by Prof. Bishnu Charan Ghosh & Party of Calcutta. |
| | 8-30 to 9-30 p.m. | Procession. |

It will require a huge amount to work out the above programme. Our friends and sympathisers are requested to contribute liberally to enable us to celebrate the Centenary of the great philosopher and patriot saint of India in a fitting manner. Contributions will be thankfully received and acknowledge by

THE SECRETARY,
SWAMI VIVEKANANDA CENTENARY COMMITTEE,
11, Ramakrishna Math Road, Madras-4.

20-12-63.

*N.B.*—The Railway Board have been pleased to grant concession — single fare for return journey tickets to all those who will attend the Inter-Religious and Women's Conferences.

*(The programme may undergo some changes.)*

